# రామతీర్థ సందేశ ప్రసారం—
## రామరాజ్యస్థాపనకు రాజమార్గం :

"శ్రీ రామతీర్థస్వామివారి ప్రబోధాలను తప్పకపరివ్యాపింప జెయ్యాలె. భారతదేశ మహాత్ములందేగాక, యావత్ప్రపంచమహాత్ములందు పరమోత్తమ శ్రేణికి జెందిన మహాత్ముడు శ్రీ రామతీర్థస్వామివారు. నేను వారి ఆశయాలను ఆరాధిస్తాను."

**—మహాత్మాగాంధీ.**

"శ్రీ రామతీర్థస్వామివారి పవిత్రనామం నాహృదయమును తన్మయత్వంతో పులకరింపజేస్తుంది. శ్రీ రామతీర్థస్వామి వారిని మించిన ఆత్మదర్శన శ్రీ సంపన్నుడైన మహాత్ముని నే నెన్నడూ దర్శించలేదు. ఆత్మసంస్కరణమునుగూర్చి, ఆత్మదర్శనమునుగూర్చి, వా రిచ్చినసందేశం, భవిష్యద్భారతసంతతికి ఒక గొప్పవరం కాగలదు."

**—మహాశయ మదనమోహనమాలవ్యా.**

"కష్టకల్లోలముల నిర్లక్ష్యించి, మందహాసముతో నిలుచు శ్రీ రామతీర్థస్వామివారి ఆత్మానందసందేశమే-నవనాగరిక జీవననైరాశ్యాంధకారనిమగ్నమైన నేటి విషాదభారతాని కత్యావశ్యకమైయున్నది....

శ్రీ రామతీర్థజీవితసందేశములను లోకంలో ప్రకాశింపజేయ డంలో నాశక్తిసామర్థ్యాలన్నిటిని ధారపోయడానికి నేను సర్వసంసిద్ధుణ్ణి. స్వామిరచనలు, ఉపన్యాసాలు, ఇదివరకు వారిని ఎఱిగియుండి ప్రేమించేవాండ్లకేకాక, వారునిర్యాణ

మొందిన పిదప బయలుదేరే యువక విద్యార్థి బృందాలకు, ముఖ్యంగా తీవ్రావేశజనకములు కాగలవు.''

దీనబంధు-రెవరెండు సి. యఫ్. ఆండ్రూస్

"శ్రీ రామతీర్థస్వామి పరిశుద్ధజీవనానికి, మహోన్నతదృష్టికి ఆదర్శమూర్తి.... తనసర్వస్వాన్ని తనదేశానికి బలిదాన మొనర్చిన త్యాగశిరోమణి''

—శ్రీ శ్రద్ధానంద సన్యాసి

"శ్రీ రామతీర్థస్వామివారు ఆధ్యాత్మికతేజమును లోకమంతటా విరజిమ్ముతున్నపరంజ్యోతి. వైదాంతికదివ్యతేజమును శంకరాచార్యులతరువాత, మళ్ళీ అతిజాజ్వల్యమానంగా పునరుజ్జీవింపచేసినది శ్రీ రామతీర్థస్వామివారే. ఆ అపార ప్రబోధాలకు లోకం రామునకు ఋణపడింది. స్వామి వేదాంతోపదేశాలను ఆచరణలో పెట్టుకోవడమే ఆఋణము నుండి విముక్తిపొందడం. మనలను బ్రహ్మజ్ఞానోన్ముఖులను చేయడానికి శ్రీ రామతీర్థనామం, మనహృదయాంతరాలలో సుప్రతిష్ఠితమవుగాక.''

—శ్రీ శివానంద సరస్వతీస్వామివారు

"స్వామిరామతీర్థునిజీవితం, వారుసాధించినమహాకార్యం భవిష్యత్తులోకూడా మనకు సముత్తేజాన్ని కలిగిస్తుండగలవు.''

—రాష్ట్రపతి, డాక్టర్. యస్. రాధాకృష్ణన్.

"...అతి అసాధారణమైన భగవల్లక్షణాలుగల మహాత్ములలో అగ్రగణ్యుడు శ్రీ రామతీర్థస్వామి. ఆయన మధురతన్మయత్వం ఆయన సొమ్మే. అట్టి బ్రహ్మసందోన్మత్తులైన మహాపురుషుల క్షణకాల సాంగత్యం చాలు. ఒక్క ఊపు ఊపి నిత్యశాంతిశిఖరాలకు ఎగిరిపోయేలాగు చేస్తుంది: ఎప్పుడో ఆకస్మికంగా ఆకాశంనుంచి రాలే మహాతారల్లాగా ఇట్టి మహాత్ములు జగద్రంగంమీదికి పంపబడతారు: పని అవుతుంది. అదృశ్యులౌతారు. రాముని ఉద్యమం నెరవేరడం లేదని ఎవరు చెప్పగలరు? .."

—స్వామీ రామానందతీర్థజీ.

"నేను యువకుణ్ణిగా ఉన్నప్పుడు రామతీర్థస్వామివారిని గురించి ఒకసారి విన్నాను. 40 సంవత్సరాల క్రితం దేశంలో కలిగిన ఆధ్యాత్మికాభివృద్ధికి ఆయనసేవ ప్రధాన కారణాల్లో ఒకటని, ఆయన ప్రభావం ఈనాటికీ ఉన్నదని నేను నిస్సంశయంగా నమ్ముతాను."

—సర్ తేజ్ బహదూర్ సప్రూ.

"స్వామి రామతీర్థుని జీవితము, ప్రవచనాలు ఆయన దేశస్థులకు అనుక్షణం ఒక నూతనమైన, నిత్యమైన సందేశం ఇస్తూ అధిగమింప చేస్తుంటాయి. శ్రీ రామతీర్థస్వామి భగవత్తన్మయుడు. ప్రతిచోటా సమస్త మానవజాతిలో బ్రహ్మసాక్షాత్కారం పొందిన మహాత్ముడు. ఆయన ఉజ్జ్వలమైన మందహాసము, పవిత్రసుందరమైన వదనమండలమూ ఆయన వెళ్ళిన ప్రతిస్థలంలో అమరమాధుర్యాన్ని వర్షించాయి. మనంప్రతినిత్యం జీవిత చర్యలో పవిత్రమైన, స్వార్థరహితమైన జీవితాన్ని గడుపుతామని, సహస్రప్రేమలను కలిగి ఉంటామని, సుస్థిర నిశ్చయాన్ని పొందడమే రామతీర్థస్వామివారి స్మృతిచిహ్నంగా మనం సమర్పించగల ఉత్తమమైన కానుక."

—ఆచార్య జే. బి. కృపలాని.

"ఈ శతాబ్ది ప్రారంభంలో భారతదేశంలో ప్రకాశించిన మహో జ్జ్వల వ్యక్తులలో రామతీర్థస్వామి ఒకరు. ఆయన ఉపన్యాసముల ద్వారా, రచనలద్వారా అన్నిటికన్న ఎక్కువగా ఆయన ముగ్ధ మూర్తిద్వారా ఆయన సమకాలికులలో ఒకచెరిగిపోని ముద్రను అంకితం చేశాడు.

భారతదేశం విడుదల పొందింది. కాని కష్టాలనుండి విడుదల కాలేదు. మనముందు అనేక భౌతిక అధ్యాత్మిక సమస్యలు పరిష్కారం కావలసి ఉన్నవి. ఇటువంటి సందిగ్ధసమయంలో స్వామి రామతీర్థుని ప్రవచనాలు మనకు ఆశను, ధైర్యాన్ని, విశ్వాసాన్ని, సౌఖ్యాన్ని అందజేస్తాయి.

మన జీవితాలను భారతసేవకు అంకితం చేద్దాము. భారతసంస్కారాదర్శాలను అనుష్టిద్దాముగాక! ఈ క్రిందిమాటలలో రామతీర్థ స్వామి అందించిన సందేశానికన్న ఉదాత్తమైన సందేశం ఉండబోదు.

'ప్రాచీనతను అధునికతతో అనువర్తింపచెయ్యండి. పవిత్రమైన, శక్తివంతమైన అధునికతను భవిష్యత్తులో సుస్థిరం చెయ్యండి.'

—డాక్టర్ అమరనాథ ఝా

"నాయకుల దశలో మాతృదేశ సేవార్థమై నాలో ప్రేరణ కలిగించిన వారిలో రామతీర్థస్వామి ఒకరు. ఈ భారతీయ మహావేదాన్త తత్వబోధను అనుసరించి తమ జీవిత సౌధాలను నిర్మించుకొన్న యువకులు వేలమంది ఉన్నారు."

—శ్రీ యస్. కె. పాటిల్.

(బొంబాయిరాష్ట్ర కాంగ్రెస్ సంఘ అధ్యక్షుడు)

"మానవుల మనస్సులను స్పర్థాద్వేషాలు ప్రబలంగా కల్లోలపరుస్తున్న ఈసమయంలో శ్రీ రామతీర్థుని సందేశం అత్యావశ్యకమైనది. నిత్యమైన భ్రాతృప్రేమబంధాలతో మానవజాతి పురోగమించ వలసి ఉంది. ఎవడు ఏ శాఖకుచెందినప్పటికీ, మానవులందరికీ జీవిత

చరమాదర్శం ఒకటే. స్పర్థాకలుషితమైన పరస్పర సంఘర్షణము నుండి విముక్తిపథాన్ని భగవదన్వేషణకు మార్గాన్ని, రామతీర్థుల వంటి మహర్షులు మనకు చూపించారు.”

—షేక్‌మహమ్మద్ అబ్దుల్లా (కాశ్మీర్)

“పూజనీయుడైన స్వామీజీతో వ్యక్తిగతంగా పరిచయంపొందే భాగ్యం నాకు కలుగలేదు. కాని, నాకు, ఆయనకూ మధ్య ఒక బంధంమాత్రం ఉన్నది. మేము ఇరువురమూ లాహోర్‌లో ఫార్మన్ క్రైస్తవ కళాశాల విద్యార్థులము. నేను 1901 లో కళాశాలలో ప్రవేశించినపుడు స్వామీజీ నామం ప్రతివాని నాలుకపై ఉన్నది. వారు కొద్దిరోజుల క్రితంగణితశాస్త్రోపన్యాసకులుగా ఉండి, తరువాత ప్రపంచపరిత్యాగంచేసి లాహోర్‌ను విడిచివెళ్ళారు. కాని కళాశాల ప్రధానాచార్యుడు, విద్యార్థులు, ఉపన్యాసకులు క్రొత్త వారికి స్వామి గొప్పతనాన్ని గురించి ఉజ్జ్వలమైన భాషలో చెప్పేవారు. జాతి బ్రహ్మాండమైన కష్ట పరం పరలకు లోనవుతున్న ఈ దశలో స్వామి అందజేసిన మానవత్వ ప్రేమసందేశం అమూల్యమైనది. ఆయన శక్తి అత్యున్నతస్థితిని అందుకున్న సమయంలో ఆయన ద్వారా అన్ని కులవర్గ శాఖలకూ చెందిన ప్రజలు అనేక సంఖ్యాకులు ఆకర్షితులవుతున్న సమయంలో ఆయన మనలో లేకుండాపోవడం జాతికికలిగిన దుర్భరవిషాదం. కాని, కాలంలో మహాత్ములందరూ వారి ఉపదేశాల ద్వారా వారి సమకాలికులను ధన్యులను చేస్తారు. మన నిత్యజీవితంలో వారి ఉపదేశాలు ధ్రువతారలవలె మనలను నడుపుతూ ఉంటాయి. దుఃఖపరితప్తమైన ప్రతిహృదయాన్ని రామతీర్థ సందేశానికి అభిముఖమై ఓదార్పు పొందవలసిందన నేను కోరుతున్నాను. స్వామీజీ మనలను ఆహ్వానించిన విశ్వప్రేమ సదస్సులో శాన్తిపొందెదరుగాక.

వివేకానన్దరామతీర్థస్వాములు 40 సంవత్సరాల క్రితం మనదేశాన్ని తేజోవంతంచేసిన కవలపిల్లలు. వారు ఈ జగత్తునుంచి నిర్గమించి చాలాదినాలైనా, వారుమానవజాతిని ఉజ్జీవింపచెయ్యడానికి అందిం

చిన ఆధ్యాత్మిక సందేశం శాశ్వతంగా మానవజాతికి ఉత్సాహాన్ని కలిగిస్తుంది. రామతీర్థునివంటి మహాత్ముని ప్రభావం కాలాన్ని అధిగమించినది.''

—డాక్టర్ కైలాస్‌నాథ్‌కట్జూ

''మహోజ్జ్వలమైన రామతీర్థ జీవితంద్వారా నేర్చుకోవలసిన పాఠాలుఅనేకంవున్నవి. హిందువుల మతతత్త్వంలో త్యాగం ప్రధాన స్థానాన్నిఆక్రమిస్తుంది. శ్రీకృష్ణుడు నిర్వచించినట్లు త్యాగంసాత్విక మైనదిగా వుండాలి. తీవ్రమైన సత్యాన్వేషకుడు రామతీర్థుని అను భవాలద్వారా అనేక లాభాలను పొందగలడు. స్వతంత్రభారతదేశ పౌరులు మహనీయమైన భారతీయ సంస్కార వారసత్వాన్ని విడిచి ప్రతి మానవునికి విధింపబడిన ఆధ్యాత్మిక తీర్థయాత్రాభివృద్ధిని నిరోధించే దుష్టచక్రాలకు పాల్పడరని ఆశిస్తున్నాను.''

—శ్రీ బి. జి. ఖేర్

''మన మాతృదేశాన్ని పునీతంచేసిన మహాత్ములలో రామతీర్థ ఒకరు. ఈ అశాశ్వత ప్రపంచాన్నుంచి రామతీర్థస్వామి వినిర్గ మించి చాలాకాలమైంది. కాని ఆయన ఆధ్యాత్మిక ప్రభావం అమ రమైనది. ఇటువంటి పవిత్ర సమయములో ముఖ్యంగా ఆయన శక్తి మనహృదయాలకు హత్తుకుంటూఉంది. ఇలాంటివారు భారత దేశాన్ని స్వయంప్రభావంతంగా చేశారు.''

—శ్రీ తుషార్‌కాన్తి ఘోష్
(అమృతబజార్ పత్రిక)

''నిత్యానంద ప్రపూర్ణములైన రామతీర్థస్వామివారి ఉదాత్త ఉప దేశాలు అనేక అశాన్త అంధకారపూరిత హృదయాలలో ఆనంద దీపాన్ని వెలిగించాయి. ప్రపంచంలో జీవితమార్గంలో ప్రయాణం చేస్తున్న అనేకమంది తోటి యాత్రికులకు మార్గదర్శకములైనవి.

స్వామీజీ ఉపన్యాసములు రచనలు కేవలం సచ్చిదానంద స్వరూపాలు. ఆయన ఆశీర్వాదాన్ని మనందరము పొందుతాముగాక.''

—శ్రీ ఆనంద్. టి. హింగొరని
(గాంధీసిరీస్ సంపాదకులు)

''మహనీయుడైన రామతీర్థస్వామి అనేకులకు దైవప్రేరణనిచ్చాడు. ఆయన ప్రభావం మానవులలో భ్రాతృభావాన్ని, ఐక్యభావాన్ని కలుగజేసి ఆనందాన్ని ప్రసాదించుగాక అని నేను ప్రార్థిస్తున్నాను.''

—శ్రీ శ్రీప్రకాశ

''భారతదేశ మహాపుత్రులలో రామతీర్థస్వామి ఒకడు. బాధాపూరితమైన మానవ జాతికి ఆయన సందేశం దైవప్రేరణనిచ్చి సేవ చేస్తుందిగాక!''

—శ్రీ యస్. ఎ. బ్రెల్వి
(బొంబాయి క్రానికల్)

''స్వామి రామతీర్థుని మహనీయ సందేశాలను వ్యాప్తంచెయ్యడం మహాకార్యం. ఆయన మూర్తీభవించిన సచ్చిదానందం.''

—ప్రొఫెసర్ టాన్‌యూన్-సాన్
(శాంతినికేతనం)

''రామతీర్థస్వామివారి ఉపదేశాలను తీవ్రంగాప్రచారంచెయ్యాలి.''

—డాక్టర్. శ్యామప్రసాద్ ముఖర్జీ

''నేను తీర్థ రామగోస్వామిని, అనగా స్వామి రామతీర్థను గాఢంగా ప్రేమించి గౌరవిస్తాను.''

—సెయింట్ నిహాల్‌సింగ్

''ప్రస్తుత భారతీయ పరిస్థితులదృష్టిలో రామతీర్థసందేశాన్ని మనం వ్యాఖ్యానించుకొని బలహీనులలో పేదవారిలో ఆత్మబలంకలిగించే తీవ్ర స్వార్థరహిత సేవాయత్నంలో భగవంతుణ్ని, సత్యాన్ని దర్శించాలి.''

—శ్రీ జయరామ్‌దాస్ దౌలత్‌రామ్

OM.

# INTRODUCTION

By

SRI SANTI PRAKASH JI

President : *Sri Rama Tirtha Publication League (The Rama Tirtha Pratisthan), Lucknow.*



Blessed are they, who study the Works of Swami Rama, and doubly blessed are they, who realize his teachings and bring them into action. Thrice blessed are they, who try to make others study and realize these soul-inspiring teachings, that make home in every sincere heart, that is free from prejudices of all sorts. Why do these teachings attract people from almost all the quarters of the world ? It is because they come from him, who was the same in all his thoughts, words and actions, and has "emancipated human mind from centuries of mental slavery"; nay because he has seen divinity in each and all. "Though he was born in India, yet he was an American as well as a Japani and a Persian to the people of those countries; nay, he was something more than this. The Americans saw the living Christ in him and the Japanese waved the light before him in their temple of Lord Budha. The Muhammadans listened to him from the pulpit in the mosque of Cairo at Egypt, in Africa.

Men of different shades and thoughts find food for them in his teachings, digesting which, they go on proceeding onward till they reach the goal of humanity. The secret of his success is that he never tried to teach what he himself did not master full well. Hence he asks us not to be a slave of an authority, which serves us as an aid. What-so-ever he spoke, came from his heart and found place in those of others, as the thing s

that come from the heart go to the heart. Even those who did not agree with his philosophy could not refrain from loving him on account of sincerity and purity of his heart.

He would tell us to "Feel, feel all the time that the power Supreme that manifests itself in the sun and the star the same the same I am, the same, the same is yourself. Take up the real Self, this glory of thine ....... Meditate on this your real beauty. .. ... Keep yourself thoroughly collected above the body or little self."

To him, Vedanta was not an intellectual philosophy, but it was the Practical religion that is universal. He called it the Practical Vedanta or Common Path, that is constituted of.

Pushing Marching Labour and no stagnant indolence.
Enjoyment of work as against tedious drudger;
Peace of mind and no canker of suspicion.
*Organization* and no disaggregation.
Appropriate reform and no conservative customs.
Solid real *feeling* and no flowery talk.
Poetry of the fact, as against speculative fiction.

The Logic of *events* as against the authority of the departed authors and

The living realization and no mere dead quotations.

The writer is glad to note that every part of our mother country is doing its best to popularise our national hero. Dear Rama in the form of Sri Swami Kesava Thirtha of Rama Tirtha Sewasram has volunteered himself to render his service to the Telugu-speaking

people by translating into their language, the soul-inspiring teachings of Swami Rama. May his efforts be crowned with success, and may other sincere souls of other parts of the country follow him in the respect, is the earnest prayer of the writer. Almost all his teachings have been translated into Hindi; that is the *Lingua Franka* of India. Some of them have been translated into Urdu and Gujrati as well. In order to translate the ideas of Rama, we should first embibe them, saturate ourselves with them, and then let the spiritual currents flow from us all around to purify and save all. We shall then become Saviours or *Tirthas.*

Yea! at this critical moment, when the whole world is being ruined, nothing but these *Tirthas* can save humanity. Those who are thus saved echo with our hero Rama Tirtha that "All the kings of the world or the chess-men of my chess board, hence all the modes of peace and war are the ways of my enjoyments."

"Badshah dunya ke haim mohri mere shatranj ke,
Dillagi ke chal hain sab rang sulho jang ke"

Om!

—*Santiprakash*
25—5—1942

# ప రి చ య ము

శ్రీ శాంతి ప్రకాశ్ మహాశయులు

**అధ్యక్షులు :**

శ్రీ రామతీర్థ పబ్లికేషన్ లీగ్ (శ్రీ రామతీర్థ ప్రతిష్ఠానము) లక్నో

శ్రీ రామతీర్థ సంపూర్ణసారస్వతమును పఠించేవారు ధన్యులు. ఆ సారస్వతమునుఅనుభూతంచేసికొనిఆచరణలో పెట్టుకొనేవారు ధన్యధన్యులు. అంతతో ఆగక ఆసారస్వతమును ఇతరులచేగూడ పఠింపజేసి, అనుభూత మయ్యేలాగు చేయువారు పరమధన్యులు. ఆత్మోత్తేజకరములైన శ్రీ రామ తీర్థ ప్రబోధాలు- సర్వవిధ విద్వేషవిముక్తమైన - వినిర్మలమైన-శ్రద్ధాన్విత మైన- ప్రతిహృదయంలో, నాటుకొనితీరుతాయి. ప్రపంచమందలి నలు మూలల ప్రజలను, ఈ ప్రబోధాలు ఆకర్షించడానికి కారణ మేమిటి? మనోవాక్కాయ కర్మల పరిశుద్ధుడైన, యుగయుగాగత మానసికదాస్యము నుండి మానవులకు విముక్తికలిగించిన, సర్వవిశ్వములో దివ్యత్వమును సందర్శించిన, మహాపురుషుని ముఖతః అవివెలువడడమేకారణం. ఆయన అవతరించింది భారతదేశమందే ఐనా, అమెరికనుల కాయన అమెరికా దేశీ యుడుగా, జపానీయుల కాయన జపానుదేశీయుడుగా, పరిషియనుల కాయన పరిషియా దేశీయుడుగా, ఏ దేశీయుల కాయన ఆదేశస్థుడుగా తోచాడు. అంతేకాక ఆయన సర్వదేశకాలాదుల కతీతమైన మహాతత్త్వంగా ప్రకాశించాడు. అమెరికనులు ఆయనలో సజీవుడైనక్రీస్తును సందర్శించారు. జపానీయులు తమ బుద్ధాలయాలలో ఆయనమ్రోల హారతులు వెలి గించారు. మహమ్మదీయులు, కైరోలో, ఈజిప్టులో, ఆఫ్రికాలో, తమ మసీదులలోని బోధనావేదికలనుండి ఆయన వాణిని ఆలకించారు.

అన్నిరకాల అభిప్రాయాలవారికి, అఖిలమతస్థులకూ, ఆయన ప్రబోధాలలో తమకుకావలసిన అమృతం లభిస్తుంది. ఆయన బోధలను జీర్ణం చేసుకుంటే- మానవజీవితపరమావధిని చేరవచ్చు. ఆయనమహావిజ

యంలోని రహస్యం- తాను అనుభవించి, ఆచరణలోపెట్టి చూడని దాన్ని ఆయన ఎవరికీ బోధించేవాడు కాదు. అందుకనే, ఆయన ఒక ప్రమాణానికి అంధంగా దాసులుకావ ద్దనేవాడు. దాన్ని ఉపకరణంగా గ్రహించి, సత్యమును స్వానుభవపూర్వకంగా గ్రహింప మని చెప్పేవాడు. ఆయన ఏదిపలికినా ఆయన హృదయాంతరాల్లోనుంచి రావడంవల్ల, అది శ్రోతలహృదయాంతరాల్లోకి చొచ్చుకొని పోయేది. హృదయంలో నుంచివచ్చింది హృదయంలోకే పోతుందనే సూక్తికి ఆయన నిదర్శనం. ఆయన సిద్ధాంతంతో ఏకీభవించని వాండ్లుకూడా, ఆయనవినిర్మలహృదయంవల్ల, సత్యవర్తనంవల్ల, ఆయనను ప్రేమించకుండా ఉండలేకపోయేవాండ్లు.

"సూర్యమండలంలో తారకాకోటులలో వెలుగొందుతున్న ఆ అఖండ శక్తిని నేనే! నేనే!... అది నేనే!- అని నిరంతరం సంభావించు! సంభావించు! నీ సత్యాత్మను గ్రహించు. నీ ప్రతిభను ఆనందించు... నీ సత్య సౌందర్యముపై మనస్సును ఏకాగ్రపరచు. స్వస్వరూపధ్యాన నిష్ఠుడవుగా! ...దేహానికి, క్షుద్రమైన అహంకృతికి అతీతుడవై సర్వదా నిలువు—" అని స్వామి మనకు ఉద్బోధించాడు.

ఆయన వేదాంతం ఊహాగానంకాదు; విశ్వాత్మకమైన అనుష్ఠానాత్మక మైన ధర్మం. ఆయన దానిని అనుష్ఠాన వేదాంత మని- సర్వసామాన్య మహాపథ మనీ పిలిచాడు.

"అనుభవవేదాంత మన నేమొ తెలుస ?
ప్రగతిపూర్వక మహాకృషి నిష్ఠగాని-
స్తంభించి కుళ్లు జడత్వంబుకాదు.
నిరత కర్మానంద నిరతియేగాని
విధిలేక చేసెడు చాకిరి కాదు.
నిశ్చలం బగు మానసిక శాంతిగాని-
సంశయ వ్యాకుల వ్రణబాధ కాదు.
నిర్మాణమే గాని - భేదన గాదు.
సముచితమైన సంస్కరణయే గాని-
సాంప్రదాయాచార బంధన కాదు.
దృఢతమ సత్యాను భూతియేగాని-

చిలుకలు నేర్చిన పలుకులు కాదు.
వాస్తవికత చెప్పు కవితయేగాని-
సమ్మరానట్టి పుక్కిటి కథ కాదు.
ప్రామాణికంబగు తర్కంబు కాని-
గత గ్రంథకర్తృ ప్రమాణాళి కాదు.
సతత సజీవ సాక్షాత్కృతి గాని -
నిర్జీవ శుష్కతార్కాణముల్ కాదు.
లె మ్మనుష్ఠాన వేదాంతివి గమ్ము!"

ఈ జాతీయవీరుని ప్రబోధాలను ప్రజాసామాన్యమున పరివ్యాప్తం చేయడానికి మన మాతృదేశమున నాలుగుమూలల ప్రయత్నాలు జరుగుతున్నందుకు నేను సంతోష పడుతున్నాను. శ్రీ రామతీర్థ భగవానుడు, శ్రీ కేశవతీర్థస్వామిజీ రూపమున తన దివ్య ప్రబోధాలను ఆంధ్ర ప్రజాకోటికి ఆంధ్రభాషలో అందింప నుద్యమించాడు. శ్రీ కేశవతీర్థస్వామిజీఉద్యమం విజయవంత మవుతుందిగాక! ఇతరరాష్ట్రాలలోకూడ యోగ్యు లగువారు దీన్ని అనుసరిస్తారుగాక! ఇవే నా హృత్పూర్వక ప్రార్థన. శ్రీ రామతీర్థ ప్రబోధాలు హిందీలోకి అనువదింపబడినవి. కొన్ని ఉరుదులోకి, గుజరాతీలోకి అనువదింపబడినవి. శ్రీ రామతీర్థస్వామివారి మహోన్నత పవిత్రభావాలను అనువాదం చెయ్యాలంటే - వాటిని ముందు మనం సంపూర్ణంగా జీర్ణం చేసికోవాలె. వానిలో మనం సంపూర్ణంగా నిమగ్నులంకావాలె. అప్పుడు మనలోనుంచి లోకసంగ్రహ గంగ వెల్లుబికి ప్రవహిస్తుంది. అప్పుడు మనం తీర్థులం (లోకోద్ధారకులం) కాగలం.

ప్రపంచమంతా వినాశనోన్ముఖము కాబోతున్న ఈ క్లిష్టసమయంలో, ఈ తీర్థమూర్తులే మానవకోటిని ఉద్ధరించగలుగుతారు. ఆ ఉద్ధర్తలు, శ్రీ రామతీర్థస్వామివారితో శ్రుతిగలిపి, "ప్రపంచమందలి రాజులందరూ నా చదరంగమందలి పాచికలు. ప్రపంచమందలి శాంతి సంగ్రామములు నా వినోదక్రీడలు'' — అని గానం చేస్తారు.

—శాంతిప్రకాశ్.

ఓం! ఓం!! ఓం!!! 25—5—1942

ఓ మ్

# వర్తమాన యుగము — రామతీర్థులు

## డాక్టర్ శ్రీ కె. సచ్చిదానందమూర్తిగారు

దర్శనవిభాగాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాపరిషత్

ప్రత్యక్ష ప్రమాణముచే అలబ్ధములగు విషయములను ఎటుల, ఏల నమ్మనగును?— అనునది నేడు మతము నెదుర్కొనిన పెద్దప్రశ్న. ఆత్మయొకటి లేకుండనే మానవుని భౌతిక మానసిక ప్రక్రియ లన్నియు అర్థంచేసుకోవచ్చునని మనస్తత్వ శాస్త్రమనుచున్నది. ఈశ్వరుడు ఉన్నాడనుకొనకుండనే విశ్వమును తద్రహస్యమును అవగతము చేసుకోవచ్చునని ప్రకృతిరసాయన శాస్త్రముల అభిప్రాయము. అయినప్పుడుఈశ్వరుడు, ఆత్మ అను పదార్థములు ఉన్నవని ఏల తలచవలెను?

అనుమాన ప్రమాణముచే ఈశ్వరోపలబ్ధి యగుచున్నదని నైయాయిక మతము. అయితే, అందులోను నైయ్యాయికులందరికి ఐకమత్యము లేదు. ఇకవేదాంత మనినచో అనగా శంకర- రామానుజ-మధ్వాచార్యులు- హేతువాదము వలన ఈశ్వరుడున్నాడని స్థాపించలేము. శబ్దప్రమాణమే మనకీ విషయమందు కేవలాధారమని ఏకగ్రీవముగ వచించిరి.

వేదము భగవద్వచనము లేదా అపౌరుషేయము గాన దానిని ప్రమాణముగ తీసుకోవలెనని అనినచో, వేదము అపౌరుషేయమని ఎవరు చెప్పిరి ? అను ప్రశ్నవచ్చును. వేదమే చెప్పినదని అనవలసి వచ్చును. ఇట్లన్యోన్యాశ్రయ దోషము వచ్చిపడినది.

ఇట్టిపరిస్థితిలో ధర్మము (Religion) నకు ఎచ్చట ఏవిధముగ ప్రసక్తియున్నది? శ్రీ రామతీర్థుల ఉపన్యాసములందు మనకు ఈ ప్రశ్నకు ఉచితమైన ముఖ్యముగా నేటి బౌద్ధిక యుగమునకు (Rationalistic age) తగినట్టి సమాధానము ఈయబడినది. అందులోను విశేషమేమన శ్రీ రామతీర్థులు గణితశాస్త్ర నిష్ణాతులు. అందుచేత ఆయన ఉపన్యాసములు తార్కికముగాను, విశ్లేషణాపూర్వకముగాను ఉండును. కేవలము పూర్వ

గ్రంథములు చదివిన పండితులకు ఈ విమర్శనా పూర్వకమగు విశ్లేష ణము (critical analysis) అందుబాటులోలేదు. కేవలము నవీనరీతిన మెలగినవారికి, తమ పరిధినుండి బయల్వెడలి ధర్మస్థ సత్యమునుగాంచుట అసంభవము. అదృష్టవశమున రామతీర్థులవారు పురాతత్త్వమందు, ఆధునిక వైజ్ఞానమందుకూడా అందెవేసినచేయి. పైపెచ్చు ఏది అనుభవము వలన తప్ప మరియొక విధముగా అప్రాప్యమో - ఆ బ్రహ్మము, వారిచే సంప్రాప్తము. అట్టి మహానుభావుని అమూల్యవాక్యముల నన్నింటినిఆంధ్రీక రించి శ్రీ కేశవతీర్థస్వామి వారు ఆంధ్రలోకమునకు మహోపకృతి చేసి నారు. ఈ నప తపస్వి ఆశయములు ఫలించునట్లు సహకరించుటలో మనవిధి, కళ్యాణము కలవు. *



# మహాజనవాణి

పూజ్యశ్రీ ఓంకారస్వామివారు,

శ్రీ శాంతిఆశ్రమము, తోటపల్లికొండలు.

"...శ్రీ కేశవతీర్థులు ఆ శ్రీ రామతీర్థుల అవతారమే- ..."

"రాముడు ఇదివరలోకంటే ఈనాడే ఎక్కువ సజీవుడైయున్నాడు. ఆయన రామదర్శన రూపకంగా దర్శనమిస్తున్నాడు. శ్రీ రామతీర్థుని బ్రహ్మ జ్ఞాన సందేశమును, ప్రతి ఆంధ్రుని గృహద్వారము కడకు తీసుకొని రావ డానికి శ్రీ కేశవతీర్థస్వామి భగవన్నిర్దేశితుడైనాడు..."

"...రామ దర్శన సంపాదకులైన శ్రీ కేశవతీర్థులు, సదా రాముని సేవచేయుచు, రాముని గ్రంథములను అచ్చు వేయించుచూ, అహర్ని శలు రామునియందే జీవించుచు, రామునే ధ్యానించు చుండుటచే ఆయన నాకు రామతీర్థునివలె ఆకారములోగూడ గానవచ్చుచు, ఆనందమును గల్గించు చుందురు..."

"...శ్రీ కేశవతీర్థస్వామిజీ పరమపావనమైన శ్రీ రామతీర్థుల పేరున శ్రీరామతీర్థ సేవాశ్రమమును స్థాపించి, వారి మహోత్కృష్ట గ్రంథరాజము లన్నిటిని ఆంధ్రీకరించి అనేక విధముల ఆంధ్రదేశమునకు చేయుచున్న సేవ ప్రశస్తమైనది..."

"దైవ విధులు మానవమాత్రులకు అగ్రాహ్యములు. ఏ యే మహాను భావులచే, ఏ యే పనులెప్పు డెప్పుడు, దేశవృద్ధికై, లోక కళ్యాణార్థమై జరుగ నున్నవో అవి అన్నియు దైవ కృపచే, దైవనిర్ణయానుసారంగా జరిగి తీరుచుండును.

చాల సంవత్సరములక్రితము శ్రీ రామతీర్థస్వాములవారు లోకశాంతిని కోరుచు, విశ్వ ప్రేమతో జల్లిన విత్తనములు ఇప్పటికి మొలచుచుండు సూచనలు గానవచ్చుట ఆహ్లాదకరము. శ్రీ రామతీర్థులవారి అడుగు జాడ లలో నడచుచు, పూజ్య శ్రీ కేశవతీర్థస్వాములవారు హృదయపూర్వక నిష్కామ సేవగా, శ్రీ రామతీర్థుల విశ్వశాంతి, విశ్వప్రేమసందేశములను నలు మూలల వ్యాపింపజేయుటకు నిరంతర కృషిచేయుచున్నారు... "

"శ్రీ కేశవతీర్థుల రూపముగా మానవసేవ చేయుచున్న శ్రీ రామతీర్థు లకు ధన్యవాదములు."

పూజ్య శ్రీ రామకృష్ణానంద స్వామివారు.

"గీతావాణి" సంపాదకులు, శ్రీభూమానందాశ్రమం

"రామునితో బక్కరాయి (అహల్య) తరించింది. రామనామంతో ఎన్నోరాళ్ళు (సేతుబంధంలో) తరించాయని తులసీదాసు చెప్పాడు. రామ తీర్థులవారు ఏ కొద్దిమందినో తరింప జేశారు. రామతీర్థుని దివ్యవాఙ్మయం అశేషపిపాసువులకు శాంతిరసాయనాన్ని త్రావి, అమరజీవులచేస్తూవుంది. ఆ జ్ఞానభాగీరథిని విశాలాంధ్రావనిపై అవతరింపజేసిన అపరరామతీర్థులు- శ్రీ కేశవతీర్థులవారు - తెలుగువారికి చిరస్మరణీయులంటే అతిశయోక్తి ఏమీ కాదు..."

..."శ్రీ రామతీర్థ వాఙ్మయాన్ని సమగ్రంగా ప్రచురిస్తూ రామ దర్శన పత్రికను నడుపుతూ, శ్రీ రామతీర్థ బోధలను బహుముఖాల ఆంధ్రా వనిపై ప్రచారంచేస్తూన్న ఆదర్శసంస్థ శ్రీ రామతీర్థసేవాశ్రమంవారి అద్భుత కృషి ఎంతైనా అభినందనీయం..."

"...శ్రీ రామతీర్థుని అక్షరస్వరూపానికి ప్రతిరూపమా అన్నట్లుఆంధ్ర ప్రజకు శ్రీ కేశవతీర్థస్వామివారు లభించారు. ఆ అమృత సందేశాలకు ప్రతి కృతులు లభించాయి..."

"..శ్రీ కేశవతీర్థ స్వామివారు ఆంధ్రభూమిపై ఒక చలివేంద్ర (చలి పందిరి) పెట్టారు. శ్రీ రామతీర్థ బోధామృతం అచ్చోట పోయబడుతుంది వెళ్ళండి జిజ్ఞాసువులారా! వెళ్ళి కుత్తుకబంటి పానం చేయండి. పానంచేసి ధన్యులు కండి..."

"..రాముడు రాముడై మాట్లాడాడు. అది రాముని వాణి; రాముని బాణి. దాని కదే సాటి. ఒక్కొక్క సూక్తిచాలు - జడుని మృదుని చేసేందుకు! నాయనలారా! రామతీర్థుని పరావాణిని, కేశవతీర్థుని వైఖరీవాణిలో వినండి. 'రామదర్శన' భాగ్యాన్ని అనుభవించండి'

పూజ్యశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామివారు.

శ్రీ శుకబ్రహ్మాశ్రమము కాళహస్తి.

..."అధునిక ఋషిసత్తముడగు శ్రీ రామతీర్థుని బోధామృతమును జనసామాన్యమునకు అందజేయుచున్న శ్రీ రామతీర్థ సేవాశ్రమాధిపతుల కృషి అత్యంత ప్రశంసనీయమైనది..."

"...చరిత్రను సృష్టించిన అట్టి బ్రహ్మర్షి (శ్రీ రామతీర్థస్వామివారి) యొక్క జీవితాశయములను, దివ్య ప్రబోధములను, లోకములో వెద జల్లుచు ప్రజలకు మహోపకార మొనర్చుచున్న శ్రీ కేశవతీర్థస్వాముల వారెంతయో ధన్యులు...!!!"

పూజ్యశ్రీ విద్యానందగిరి స్వామివారు

శ్రీ శివగిరి ఆశ్రమము, అరగొండ.

"...శ్రీస్వామి రామతీర్థ మూర్తీభవించిన పరబ్రహ్మము - అనుటలో సందేహమేమున్నది ? ఈ పరమ రహస్యమును గ్రహించియే కాబోలు పూజ్యపాదులగు శ్రీశ్రీశ్రీ కేశవ తీర్థస్వాములవారు, తాము, తమ యాశ్రమము, తమ పత్రిక, తమ గ్రంథములు- ఇది అది అననేల, తమ సర్వస్వమును శ్రీ రామతీర్థమయ మొనరించినారు. మఱియు లోకోపకారకరములగు ననేక కార్యముల జేయుచున్నారు. శ్రీ రామదర్శన పాఠకుల కంతయు విదితమేకదా ! కనుక శ్రీ వారు మిగుల ప్రశంసనీయులు."

## పూజ్యశ్రీ విమలానంద స్వామివారు

శ్రీ వ్యాసాశ్రమ పీఠాధిపతులు, ఏర్పేడు.

"...పూజ్యశ్రీ కేశవతీర్థ స్వాములవారు బహుకాలమునుండి శ్రీ రామతీర్థ సంపూర్ణ వాఙ్మయమును మృదుమధురమైన ఆంధ్రభాషలోనికి అనువదించి ప్రకటించి, ఆంధ్రలోకమునకు వెలలేని మహోపకార మొనర్చుట లోకవిదితము. రామతీర్థుల భాషకు, భావమునకు తీసిపోనిది శ్రీ కేశవ తీర్థుల భాష, భావము. వారిరచనల చదువుచున్నప్పుడు ఆ రాముడే యీ కేశవుడై యిటుల పలుకుచున్నాడా అని భ్రాంతి కలుగుచుండును ... శ్రీ రామతీర్థుని సంపూర్ణ వాఙ్మయమును ఆంధ్రలోకమునకు ప్రసాదించిన శ్రీ కేశవ తీర్థులు సంస్తుత్యులు. వారి లోకసేవ, రామసేవ, సాహిత్యసేవ, దైవసేవ చిరకాలము వర్థిల్లుగాక! శ్రీ రామతీర్థుని దివ్యోపదేశములు నలు దెసల వ్యాప్తి నొందుగాక!.."

## పూజ్యశ్రీ శుద్ధచైతన్య స్వాములవారు

శబ్దార్థకల్పతర్వాది గ్రంథపరిష్కర్తలు, బహుగ్రంథకర్తలు.

"శ్రీ కేశవతీర్థస్వామివారు ఆర్షసంప్రదాయమునకు చెందిన ఉత్తమ వ్యక్తి. ప్రాచీన మహర్షుల ఉపదేశములను, ఆధునిక ఋషి పుంగవులైన శ్రీ రామకృష్ణ పరమహంస, శ్రీ రామతీర్థస్వామి, శ్రీ వివేకానంద స్వామి ప్రభృతుల దివ్యభావములను హృద్గతము గావించుకొని మనోవాక్కాయములచే- వివిధ రీతుల - ఆధ్యాత్మిక ప్రచారము గావించుచున్న విశిష్టవ్యక్తి."

## పూజ్యశ్రీ శంకరానందగిరి గురుస్వాములవారు

శ్రీ ఉమామహేశ్వర పీఠాధిపతులు, గంజిగుంట.

"... ఇట్టి సత్య సనాతన శ్రీ రామతీర్థ గురుదేవుని వేదాంత సారస్వతమును యావ దాంధ్రావని సర్వుల కందజేయుచు, లోకకల్యాణార్థమై కంకణముగట్టి, అవిశ్రాంతముగ శ్రమించు - అపర రామతీర్థులే యగుపూజ్యపాద శ్రీశ్రీశ్రీ కేశవతీర్థ స్వాములవారెంతయు ప్రశంసనీయులు!"

"... ఈ త్రిపుటిలేని కేవల బ్రహ్మనిష్ఠచే నొప్పుచు, నిత్య శుద్ధబుద్ధ ప్రణవ పరబ్రహ్మాత్మ స్వరూపులై వెలసిన శ్రీ రామతీర్థ గురుని మహోప దేశములు నిరంతర సంస్మరణీయములు. శ్రీ రామతీర్థులేయగు మన శ్రీ కేశవతీర్థ స్వామిపాదులంతయు సంస్తుత్యులు. వీరి మహాకార్యములు, దైవీ సంపద్భులో పేతములు. లోక శివంకరములు.

## పూజ్యశ్రీ సత్యానందస్వాములవారు

శ్రీ సత్యానందాశ్రమము, "విశ్వమీమాంస" సంపాదకులు, అనమదుగు.

"శ్రీ రామతీర్థుని సంపూర్ణవేదాంతసారస్వతమును శ్రీ కేశవతీర్థస్వాములవా రాంధ్రభాషలో ననువదించి యాంధ్రలోకమునకు మహోపకార మొనర్చియున్నారు. అంతియగాక శ్రీ వారి యుపదేశామృతమును నల్గడల వ్యాపింపజేయుట కఖండకృషి సల్పుచున్నారు. ప్రతివారును శ్రీ వారి సంపూర్ణ సారస్వతమును పఠించి, గ్రహించి, యనుష్ఠించి, కృతకృత్యులయ్యెదరుగాక !"

"శ్రీ రామతీర్థుని పరమ పవిత్రనామమున శ్రీ రామతీర్థ సేవాశ్రమమును స్థాపించి, వారి సమగ్రవేదాంతసాహిత్యమును ఆంధ్రలోకమున కందించుచున్న శ్రీ కేశవతీర్థస్వామి బ్రహ్మణ్యులు. ఆ సాహిత్యమును ఆంధ్రులెల్లరు శ్రద్ధతో పఠించి ఆత్మానుభూతినిపొంది కృతకృత్యతను పొందుదురు గాక !"

"శ్రీ రామతీర్థ భగవానుని దివ్యబోధలను ప్రచారమొనర్చుటకై శ్రీ రామతీర్థ సేవాశ్రమమొనర్చు అఖండసేవ ప్రశంసనీయము."

"శ్రీ రామతీర్థ భగవానుడు అనుష్ఠానవేదాంతమును విశ్వమునకు బోధించినందున ఆబోధనలు నిత్యనవీనములై యుగముల పర్యంతము జిజ్ఞాసువులకు అజ్ఞాననిద్రనుండి ప్రబోధమొనర్ప సమర్థములైయున్నవి. పరోక్షజ్ఞానసంపన్నులగు సామాన్యవిద్వాంసుల శుష్కప్రసంగములైన, తాత్కాలిక చైతన్యమును కలిగించునేగాని శాశ్వతప్రయోజనమునొందింప జాలవు. ఆ మహాయోగి ప్రబోధనలు సజీవజ్ఞానానందరసభరితముగాన నిత్య పారాయణ యోగ్యములేగాక, నిత్యానుష్ఠానమున కుపకరించుమహోజ్జ్వల

మహోన్నతజ్యోతిర్మయస్తూపములై వెలయుచున్నవి. ఆంధ్రభాషయందు శ్రీ రామతీర్థసాహిత్యము వెలువడినను, అర్థవంతములును సూత్రప్రాయములును నగు శ్రీ రామతీర్థుని మహోపదేశములు ప్రజలలో శీఘ్రగతి వ్యాప్తినొందుటకు విపులవ్యాఖ్యానములు అతిముఖ్యములు. ఆ పరమహంస దివ్యబోధలకు విపులముగ సులభముగ వ్యాఖ్యానమొనర్పగల సమర్థులు శ్రీ కేశవతీర్థస్వాములవారు. శ్రీవారికి ప్రజలు ఆర్థికపుతోడ్పాటు నొసంగిన ఆ మహోపదేశములకు విశాలవ్యాఖ్యలు వెలువడి, ఆంధ్రలోకమునకు అధ్యాత్మికమహోపకారమొనర్చి బ్రహ్మగిరి శిఖరమునకు గొంపోగలవు.''

''శ్రీ రామతీర్థుని సంపూర్ణసాహిత్యమును ఆంధ్రభాషలోని కనువదించి ప్రకటించి ఏ త ద్దివ్యప్రబోధములచే ఆంధ్రలోకమునకు మహోపకారమొనర్చుచున్న శ్రీ కేశవతీర్థస్వామి వారికి ముముక్షులోకము ఋణపడియున్నదనుటలో అతిశయోక్తిలేదు. అందును అశాంతి ప్రబలిన ప్రస్తుత కాలమున శాంతినొసగ సమర్థమైనది శ్రీ రామతీర్థుని మహాసాహిత్యము. ఆ సాహిత్యమును ఆస్తికులెల్లరు పఠించి, గ్రహించి, అనుభవించి కృతకృత్యులవుదురు గాక!''

''శ్రీ కేశవతీర్థస్వామివారి అధ్యాత్మికమహోద్యమము విశ్వవ్యాప్తమగుచున్నందులకు బ్రహ్మానందము.''

## పూజ్యశ్రీ నిత్యానందస్వాములవారు

అఖిలాంధ్ర సాధుపరిషదుపాధ్యక్షులు, శ్రీ కైలాసాశ్రమము శ్రీకాళహస్తి

''ఆర్యవిజ్ఞాన విషయ విపులీకరణ దక్షతకు, వేదాంతరహస్య ప్రబోధమునకు ఉజ్వలచిహ్నమైన శ్రీ రామతీర్థప్రబోధావళిని శ్రీ కేశవతీర్థస్వామివారు చక్కగ ఆంగ్లమునుండి ఆంధ్రానువాదముజేసి ప్రకటించి, ప్రచారముచేయుచున్నారు. ఆంధ్రప్రజలకు ఆత్మజ్ఞాన భిక్షను ప్రసాదించుచున్న శ్రీ కేశవతీర్థుల ఋణమును ఆంధ్రులు తీర్చుకోలేరు.''

''శ్రీ రామతీర్థస్వాములవారి గ్రంథములను భక్తిశ్రద్ధలతో చదివిన చాలును. తప్పక ఆత్మప్రబోధము కలుగును. నిర్మల హృదయులును,

ఆత్మీయులు, శ్రీ రామతీర్థభగవానుని ఉపాసకులును, శ్రీ రామ దర్శన సంపాదకులును అగు శ్రీ కేశవతీర్థస్వాములవారు ఆంధ్రసోదరీ సోదరులకు విజ్ఞాన భిక్షవెట్టుచున్నందుకు మిక్కిలి సంతోషము. శ్రీ స్వాములవారి మహోద్యమము విజయవంతమగు గాక !''

''శ్రీ వివేకానందస్వామివలె శ్రీ గురుసేవాధురీణుడు శ్రీ కేశవతీర్థ స్వామి..... శ్రీ రామతీర్థ సద్గురుదేవుని దివ్యసందేశమును వాడవాడల, పల్లెపల్లెల ప్రచార మొనర్చుచున్న ప్రతిభాశాలి.''

## పూజ్యశ్రీ నారాయణానందస్వాములవారు

ప్రొద్దుటూరు.

''శ్రీ రామతీర్థ స్వాములవారి ఆధ్యాత్మిక వాగమృత రసాయనమును ఆంధ్రలోకమున కందించి పునీత మొనర్చిన శ్రీశ్రీశ్రీ అపర రామతీర్థులు పూజ్యపాద శ్రీ కేశవతీర్థ స్వాములవారు...''

## పూజ్యశ్రీ విద్యాశంకర భారతీస్వామివారు

గాయత్రీ పీఠాధిపతులు, బందరు.

''ఆంధ్రులకు కూడ శ్రీ రామతీర్థస్వామివారి జ్ఞానామృతము నందించుటకై శ్రీ కేశవతీర్థ స్వామివారు శ్రీ రామతీర్థ స్వామివారి జీవిత ప్రబోధాదులను ఆంధ్రములోని కనువాద మొనర్చి మహోపకార మొనర్చుట ద్వారా జీవితమును ధన్యముచేసికొనిరి. వీరు చేసినది అనువాదమే అయినను వీరి రచన అనువాదమువలె కనుపడక స్వతంత్ర రచనవలె ఉత్సాహముతో పరుగెత్తు చుండును. శ్రీ రామకృష్ణ పరమహంసకు స్వామి వివేకానందుడువలె, శ్రీ రామతీర్థ స్వామివారికి మన కేశవతీర్థ స్వామివారున్నార నిన అతిశయోక్తికాదు. కృష్ణస్మరణచే గోపికలకు హృదయము పొంగి తన్మయత కలిగినట్లు, శ్రీ రామతీర్థ స్వామివారి స్మరణ మాత్రమున, మన కేశవతీర్థ స్వామివారికి హృదయము పొంగిపోవును. వారియందు వీరికి గల భక్తి అసదృశము. వీరి అనువాదములలో రచనలలో అట్టి హృదయపు పొంగుతో ''కూడిన గురుభక్తి తాండవించుచుండును.''

## పూజ్యశ్రీ తపస్యానంద స్వామివారు

గుంటూరు.

"...శ్రీ కేశవతీర్థ స్వాములవారు శ్రీ రామతీర్థుల వారి అనుభవ వేదాంత సందేశమును కడు నైపుణ్యముతో, ఓజస్వంతమగు భాషలో ప్రచారము గావించుచున్నారు. శ్రీవారు ముక్కోటి ఆంధ్రుల తపఃఫలము"

## పూజ్యశ్రీ సద్గురు మళయాళస్వాములవారు,

శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు.

"...శ్రీ రామతీర్థుల అఖండానంద అద్వైతామృత రసామృతమును ఇంగ్లీషు తెలియని ఆంధ్రులు ఇప్పుడు పానముచేసి అమృతత్త్వమును పొందే లాగున భాగ్యముకలిగెను. రామతీర్థ ప్రవచనములన్నియు ... శ్రీ కేశవతీర్థులు తెనుగున అనువదించి ఆంధ్రసోదరీ సోదరులకు అనుగ్రహించినారు...... ఆంధ్రులందరున్నూ వారికి యావత్కాలము కృతజ్ఞులై యుండగలరు.

## పూజ్యశ్రీ ప్రణవానంద స్వాములవారు

శ్రీ ప్రణవాశ్రమము, గుడివాడ.

"వైరాగ్యము, బోధ, ఉపరతి—ఇవి మూడును మోక్షసాధనములు. ఈ మూడును సంపూర్ణముగ వెలుగొందు స్వరూపమే శ్రీ రామతీర్థ పరమహంస. అట్టి మహాపురుషుల వాక్యములన్నియు కేవలము అనుభవ వేద్యములు. మానవ సంఘమునకు — విశేషముగా ముముక్షువులకు — మనశ్శాంతియు దుఃఖనివృత్తియు అవసరము. అట్టి ప్రయోజనము పైజెప్పిన మహాపురుషుల యొక్క అనుభవసిద్ధములగు ఉపదేశ వాక్యముల శరణు బొందుటచే లభించును. "రామదర్శనము" అను మాసపత్రికద్వారా, శ్రీ రామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వతాది ప్రచురణములద్వారా, ఏతన్మహోపదేశ ప్రచారమునకు శ్రీ కేశవతీర్థ స్వాములవారు, తమ సర్వ జీవితమును వినియోగించుట మానవ ప్రపంచమునకు — విశేషముగా ఆంధ్ర ప్రదేశమునకు — కల్యాణదాయకము అను విషయములో సందేహము లేదు."

## పూజ్యశ్రీ శంకరానంద స్వామివారు

శ్రీ శంకరానందాశ్రమము, ఆళ్లగడ్డ.

"బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి తాకివాణి వేద"— ఈ సూక్తి ననుసరించి శ్రీ రామతీర్థ స్వామివారు ప్రత్యక్ష బ్రహ్మస్వరూపులు. వారి వాక్కు వేదము. ఇందువలన వారి వాణి ప్రపంచమును ఆకర్షింపజేసినది. వారి వాణిలో వేదశక్తి యుండుటవలననే నేడీ ప్రపంచములో వారి గుణగానములు ప్రతిధ్వనించుచున్నవి. వారు తమ వాక్కుతో వేదాంతమును వ్యవహార శ్రేణికి దెచ్చి, వ్యవహార వేదాంతముల మధ్య సమన్వయమును సాధించిరి. ఆ వాణిలోని పీయూషమును పూజ్యపాద కేశవతీర్థ స్వామిజీ సువర్ణపాత్ర రూపమైన రామపర్శన పత్రికద్వారా, సంపూర్ణ సారస్వత ప్రచురణములద్వారా, తనివిదీర త్రాగించి ధన్యులైనారు. ప్రజలు దానిని పొంది కృతార్థులైనారు..."

## పూజ్యశ్రీ నిశ్వికల్పానంద స్వామివారు

శ్రీరామకృష్ణ మఠాధ్యక్షులు, రాజమండ్రి.

"...ఈ అంధకారాన్ని తొలగించటానికే, శ్రీ కేశవతీర్థ స్వామివారు పరిశ్రమిస్తున్నారు...వారు 'శ్రీ రామతీర్థోపన్యాసాలను' ఎంతో పరిశ్రమతో తెలుగులోకి తీసుక వచ్చారు..."

## పూజ్యశ్రీ సీతారామ యతీంద్రులవారు

శ్రీ ముముక్షుజన మహాపీఠాధిపతులు

"శ్రీ రామతీర్థ సేవాశ్రమమును స్థాపించి, రామదర్శనము అను మాసపత్రిక నునడుపుచు, శ్రీ రామతీర్థుని ఉపదేశములను ప్రచారముచేయు శ్రీ కేశవతీర్థస్వామి నిజముగ ధన్యజీవి. శ్రీ నరసింహోపాసకులైన శ్రీ కేశవతీర్థ నిజముగా నరసింహమే. వీరి ప్రచారమువిని నాహృదయ మెంతో ఆనందించుచుండును...."

## పూజ్యశ్రీ దేవానందస్వామివారు

శ్రీ శివానందాశ్రమము, హృషీకేశము

"శ్రీ రామతీర్థులవారి అనుష్ఠాన వేదాంతమును ప్రసారము జేయుటకై మన ఆంధ్రదేశములో పూజ్యశ్రీ కేశవతీర్థస్వాములవారు, అపర రామతీర్థులుగా నిలిచియున్నారు. రాత్రింబగళ్లు జనతా జనార్దనసేవకై వారి అమూల్య సమయమంతా వినియోగించి, ఇంగ్లీషు, హిందీ గ్రంథములను తెలుగు భాషలో అనువదించి ఆంధ్ర ప్రజకు శ్రీ స్వామిజీ చేయుచున్న సేవ శ్లాఘనీయమైనది .."

## పూజ్యశ్రీ రామతీర్థస్వామివారు,

శ్రీ యాజ్ఞవల్క్యాశ్రమం, శ్రీ కేశవదాసుపాలెం.

"మన వేదాంత భువన దీపిక శ్రీ రామతీర్థ గురువరేణ్యులు ప్రాచ్య పాశ్చాత్య ఖండములందు ఉపన్యసించిన సారస్వతము నంతటిని, శ్రీ స్వామివారి ఇతర రచనలన్నింటిని, పుక్కిటపట్టి జీర్ణింపచేసికొన్న విజ్ఞాన మహారథులు, పూజ్యపాద శ్రీ కేశవతీర్థస్వామివారు..."

## 'సాహిత్యభూషణ' శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు,

ఎం. ఏ., బి. యల్.

"శ్రీ వ్యాసవసిష్ఠులకు దీసిపోని సంయమీంద్రుడు శ్రీ రామతీర్థస్వామి. ఆ మహాత్ముని నాడు శ్రీ నారాయణస్వామి పురాణ సింగులు సేవించినట్లు, నేడు శ్రీ కేశవతీర్థస్వామి సేవించుచున్నారు. రాము డమరుడు. ఈ దృశ అమరులను సేవించు మహాత్ములును అమరులేకదా ! ఆంధ్రవసుంధరలో జరుగు ఈ యమరసేవ అనేకుల కమరత్వమును ప్రసాదించు గాక!"

"ప్రస్తుత ప్రపంచ పరిస్థితులందు పీయూషధారయై మనుష్య జీవనమును మహిమోపేత మొనరింపజాలినది శ్రీ రామతీర్థస్వామి పూతజీవితోపదేశ సంస్మరణమే. ఈ సంస్మరణకు మార్గ దర్శకులైన శ్రీ కేశవతీర్థస్వామి పూజ్యులనుట అతిశయోక్తి కాజాలదు."

"ఆర్ష విద్యాభూషణ" శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ

కా కి నా డ

"ఇట్టిస్థితిలో జాతిని కాపాడుటకు తోడ్పడు నొక యుద్యమమునకు శ్రీ కేశవతీర్థస్వామివారు పూనుకొన్నారు. సకలాంధ్ర ప్రజానీకములోను, సర్వసులభమైన భాషలో, నవయుగ ప్రవక్తృప్రముఖులైన శ్రీ రామతీర్థుల యుపదేశామృతము నందించుచు, వీరు గావించుచున్న ప్రబోధము రామతీర్థులతో మనకు అనపాయి సన్నిహితత్వమును కూర్చుచున్నది. ఈయుద్యమము మనలో క్రమముగ సన్నగిల్లుచున్న భారతీయతను తిరిగి పరిపుష్టము గావించుటకై తోడ్పడుచు నభినందనీయమై యలరారుచున్నది.

"Nobody can worship a hero unless he himself is a hero"- అని కార్లైలు చెప్పిన తెఱగున - రామతీర్థుల యంశముతో జన్మించినవారు కావుననే కేశవతీర్థులిట్టి కార్యమును చేయగల్గుచున్నారు."

దర్శనాచార్య - శ్రీ జమ్మలమడక మాధవరామశర్మగారు

గు ం టూ రు

"శ్రీ రామతీర్థదర్శనము ప్రేయ శ్రేయస్సుల కేకత్వనిదర్శనమైనది. ఈనాడు స్వామి రామతీర్థాత్మ సర్వతీర్థములందు సంక్రమించినది. ఈ సంక్రాంతి కేశవతీర్థమగుట లోకమున కదియొక శివతీర్థము."

డాక్టర్ శ్రీ దివాకర్ల వేంకటావధానిగారు,

ఎం. ఏ., (ఆనర్సు) పి. హెచ్.డి.

హైదరాబాద్

"...ప్రగతి పూర్వకమైన కృషిని, ఆనందమయమైన కర్మాచరణమును, సక్రమమైన సంస్కరణమును, శాంతి సత్యానుభవ సంపాదనమార్గములను, అనుష్ఠాన వేదాంతమును బోధించు శ్రీ రామతీర్థ సేవాశ్రమము వంటి ఉత్తమ సంస్థలే వర్తమాన లోకమునకు శరణ్యములు."

## శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారు,

సంపాదకులు : ఆధ్యాత్మిక గ్రంథమండలి, విజయవాడ.

..."శ్రీ రామతీర్థుల సంపూర్ణ సారస్వతమును తెలుగులో అనువదించి ప్రకటించుట ద్వారాను, రామదర్శన పత్రికను ప్రకటించుట ద్వారాను, శ్రీ కేశవతీర్థస్వామివారు ఆంధ్రులకు. ఆధ్యాత్మిక రంగమునకు చేయుచున్న మేలు అపారము. నేను శ్రీ స్వామివారిలో శ్రీ రామతీర్థుల తీవ్రవైరాగ్యము, ఆత్మనిష్ఠ, సేవాపరాయణత, జ్ఞానగరిమ, భావగాంభీర్యములగాంచి, శ్రీ రామతీర్థులే వారి రూపమున ఆంధ్రుల నుద్ధరించుటకై జన్మించిరని తలంచు చుందును..."

## శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయడుగారు, ఎం. ఏ.,

'ధర్మజ్యోతి' సంపాదకులు:

"...శ్రీ రామతీర్థస్వామివారి చరిత్రను, వారి ప్రవచనాలను కరతలామలకంగా తెలుగు నాడుకు అందజేస్తూన్న శ్రీకేశవతీర్థస్వామివారి అవిరామ కృషి ప్రశంసనీయం; వందనీయం."

## శ్రీ "రామశరణ్" కుందుర్తి వేంకటనరసయ్యపాకయాజిగారు,

"మోక్షసాధని" సంపాదకులు, బుద్దాం.

"...శ్రీ రామచంద్రుని శీలము, సౌశీల్యము, సౌందర్యము, మన శ్రీ రామతీర్థునిలో బూర్ణముగ ప్రతిబింబించినవి. ఆ శ్రీ రామతీర్థుల ప్రతిబింబమే మన శ్రీ కేశవతీర్థులు."

## శ్రీ "సమర్థ" రాగం ఆంజనేయులుగారు.

శ్రీ రామనామక్షేత్ర కార్యదర్శి – గుంటూరు.

'మహామహుడగు శ్రీ రామతీర్థస్వామివారిని ఆదర్శముగా స్వీకరించి, వారి అడుగుజాడలలో వర్తించుచు, పూజ్యశ్రీ కేశవతీర్థస్వామివారుధ్యేయమునందు తాదాత్మ్యము నొందిరి. శ్రీ వారి జీవిత వృక్షము పుష్పఫలభరితమైనది. ఆంధ్రులు తమ భాగ్యము పండినట్లు అమృతఫలముల నాస్వా

దించి ఆత్మోన్ముఖులగుచున్నారు. శ్రీ వారి హృదయము విప్పారినకొలది మానవోద్ధరణమునకై అనేక కార్యములనొనరింప ప్రారంభించిరి. మట్టపల్లి జీర్ణదేవాలయోద్ధరణము అనేక విధముల ఆశ్రమ శాఖోపశాఖాస్థాపనము, ముఖ్యముగా శ్రీ రామతీర్థస్వామి సంపూర్ణవాఙ్మయ సంపుటీముద్రణము, శ్రీ తులసీ రామాయణాది గ్రంథరచనము—ఇత్యాదులు శ్రీ వారి అసాధారణశక్తి సామర్థ్యములను, మానవాళిపైగల వాత్సల్యమును వేయినోళ్ళ చాటుచున్నవి. అపర శ్రీ రామతీర్థస్వాములగు పూజ్యశ్రీ కేశవతీర్థస్వామి వారి పవిత్ర సందేశముల నందుకొని మనము ధన్యుల మగుదుముగాక!"

"ఆర్ష విద్యాలంకార" శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు,

గుంటూరు

ముక్తిప్రదమైన శ్రీ రామతీర్థవాఙ్మయమును పిడుగురాల శ్రీ రామతీర్థ సేవాశ్రమమూలమున నలుమూలలకును వ్యాపింప జేయనెంచిన శ్రీ కేశవతీర్థులు - మిక్కిలి ప్రశంసాపాత్రుల

శ్రీ కేశవతీర్థస్వామివారి మహోద్యమము — అమృతఫలముల నందించి, రామదర్శన భాగ్యమును ప్రసాదించగలదని అస్మదాదుల ప్రగాఢవిశ్వాసము.

శ్రీ పుల్లాభొట్ల వెంకటేశ్వర్లుగారు, ఎం. ఏ., బి. ఇడి.,

ఖమ్మంమెట్టు

"ఇట్టి సర్వోత్కృష్టప్రవక్త, మానవతా వాదియైన శ్రీ రామతీర్థ స్వామివారి పవిత్రాశయములను, సిద్ధాంతములను. తెలుగుదేశముయొక్క నాలుగు చెఱగుల అందించాలనే మహత్తరమైన తలంపుతో శ్రీమత్పరమ హంస పరివ్రాజకాచార్య శ్రీ శ్రీ శ్రీ పూజ్యపాద కేశవతీర్థస్వామివారు "శ్రీ రామతీర్థ సేవాశ్రమమును సంస్థాపించి, శ్రీరామదర్శన" పత్రికను నెల కొలిపి, శ్రీ రామతీర్థులవారి అమూల్యమైన రచనలను ఆంధ్రభాషలోనికి అనువదించి, ప్రసార మొనర్చుచు, ఆంధ్ర ప్రజలకు మహోపకారము చేయుచున్నారు. శ్రీ స్వామివారికి ముక్కోటి ఆంధ్రులు మిక్కిలి ఋణ పడియున్నారు..."

## శ్రీ రామతీర్థుని అభయప్రదానం :

"ఈ ప్రపంచంలో ఎవరైనాసరే రాముని ప్రసంగాలన్నిటినీ శ్రవణంచేసినవారు, విచ్ఛిన్నసంశయులై, తమ స్వస్వరూపమైన బ్రహ్మతత్త్వమునందు సునిశ్చితాత్ములు కాగలరని రాముడు అభయమిస్తున్నాడు."

# పీఠిక

"సాహిత్యరత్న"

## శ్రీ పి. వి. నరసింహారావుగారు,

బి. యస్. సి., యల్. యల్. బి.

**ఆంధ్రప్రదేశ్ న్యాయ, దేవాదాయ శాఖామాత్యులు**

"శ్రీ రామతీర్థవేదాంతభాష్యము తెలుగులో అవతరిస్తున్న ఈ శుభసమయం ఆంధ్రులైన ఆధ్యాత్మపిపాసువుల కొకపండుగ. ఆంధ్రభాషలో అధ్యాత్మిక సాహిత్యనిర్మాణంలో ఒక ప్రముఖఘట్టం. ఈ మహత్తరకార్యాన్ని పూర్తి చేసిన శ్రీ శేశవతీర్థస్వామివారు ఆంధ్రమహాజనులందరికీ ప్రాతర్స్మ నీయులు. వారు చేసిన మహోపకారం అవిస్మరణీయమైంది. అజరామరమైంది.

తత్వబోధకుల్లో స్వామీరామతీర్థ కొక ప్రత్యేక స్థానం ఉంది. ఆయన జీవితమే ఒక తత్వదర్శనం. అది పావన గంగాఝురి వలె ప్రవహించి స్పృశించిన వారినందరినీ పునీతం చేసింది. రామతీర్థ రచన దానికదేసాటి. చదువుతుంటే అది రచన అనిపించదు. మనయింట్లో విశ్రాంతంగా కూర్చొని ఆత్మీయులతో ఇష్టాగోష్టి జరుపుకున్నట్లుంటుంది. ఆయన ఇచ్చే ఉదాహరణలు, దృష్టాంతాలు పండితపామరులకు ఉభయులకూ హృదయంగమంగా ఉంటాయి ఇలాంటి అప్యాయతతో కూడిన (homely) శైలిని అధ్యాత్మికతత్వమువంటి జటిలమైన, అమూర్తమైన, గహనమైన ఉపజ్ఞాప్రధానమైన వస్తువును బోధించే నిమిత్తం ప్రయోగించి విజయంసాధించడమే రామతీర్థస్వామి వారి రచనా కౌశలంలోని పరాకాష్ఠ

తొమ్మిది సంపుటములు గల మూడు సంహితలలో ఇమిడ్చబడిన ఈ వేదాంతభాష్యం సర్వవిధాలా స్వయం సంపూర్ణమైయున్నది. భారతీయతత్వబోధనలో పాశ్చాత్య సాహిత్యసంస్కృతీ సంబంధమైన అనేక దృష్టాంతాలు పొందుపఱచబడ్డాయి. అధునిక పాఠకలోకానికిది మిక్కిలి ఉపకరిస్తుంది. అక్కడక్కడ అనువాదకులు రచించిన ముక్తకద్విపదలు బోధ్యవిషయాన్ని మరింత హృదయం గమం చేస్తున్నాయనుటలో సందేహంలేదు.

శ్రీ కేశవతీర్థస్వామివారి రచనాపాటవం వారి అనేక రచనలద్వారా ఆంధ్రపాఠకలోకానికితెలిసిందే. వారి అనువాదచాతుర్యాన్ని తులసీరామాయణానువాదంలో చూచి నేను ముగ్ధుణ్ణయ్యాను. అదే చాతుర్యం ప్రస్తుత భాష్యాను వాదంలో గద్యరూపేణా కానవస్తుంది.

ఈ గ్రంథంలోని వివిధ శీర్షికలను గురించి వేరువేరుగా విపులంగా సమీక్షించడం ఇక్కడఅప్రస్తుతమనుకుంటాను. ఒక్కమాటలో చెప్పాలంటే చదివినకొద్దీ చదవాలనిపించే ఆకర్షకశైలిలో, ప్రసాదగుణానికి పెట్టిందిపేరుగా రచించిన ఈ "రామతీర్థవేదాంతభాష్యము" ఆంధ్రావనిలో వెలువడిన ఆధ్యాత్మికసాహిత్యంలో తలమానికమై విరాజిల్లుతుందని నేను ప్రగాఢంగా ఆశిస్తున్నాను. అనువాదకులకు నా అభినందనలు.

జై హింద్

హైదాబాదు,
29-10-1966

ఇట్లు,
(Sd) పి. వి. నరసింహారావు.

## శ్రీ మట్టపల్లి లక్ష్మీనృసింహస్వామి వారు



### అంకితము :

ఓంకారాత్మక ! విశ్వదీపక ! మహాయోగీంద్రహృన్మందిరా !
శ్రీంకారాయత ! భక్తరక్షణకళాశ్రీనిత్యసంశోభితా !
హ్రీంకారోద్ధృతగర్జనాకులితదైత్యేంద్రా ! ఉపేంద్రా ! హరీ !
ఐంకారప్రియ ! సంసృతీహరణ ! విద్యారణ్యపంచాననా !
క్లీంకారాశ్రయ ! సర్వమోహనజగల్లీలావినోదప్రియా !
క్ష్రౌంకారస్థిత ! మట్టపల్లివనవాసా ! నారసింహప్రభూ !
శంకన్మానియు నీకృతిన్గొని కటాక్షశ్రీలవర్షించి, నీ
కైంకర్యంబును నిత్యమున్ సలుపుభాగ్యం బిచ్చి మమ్మేలరా !

—శ్రీ కేశవతీర్థస్వామి



పరమహంస పరివ్రాజకాచార్య
శ్రీ కేశవతీర్థ స్వామివారు

జయ జయ శ్రీవాపసింహ

# ప్రభాతభేరి:

## రచన: శ్రీ కేశవతీర్థస్వామివారు

శ్రీరంగనాథుని లీలావిలాస నాటకంలో ఒక విషాదాంశం వచ్చింది. జగద్గోళం అజ్ఞానతమోవృతమైంది. అధార్మిక భావఝంఝూనిలం విజృంభించింది. విశ్వాలయగర్భమైన పుణ్యభారతమందు సనాతన ఋషులు వెలిగించిన అఖండదీపం రెపరెపలాడి, కొరడుగట్టి ఆరిపో సంసిద్ధమైంది. కామవాంఛాగ్రహములు, కాంచనకాంతా పిశాచములు, దంభదౌర్జన్యరాక్షస శక్తులు, ద్వేషాసూయాభూతములు, నైరాశ్య ప్రేతములు రక్తకపాలపాత్రలతో వికటతాండవం సాగించాయి. కుమత సృగాలరావాలు, నాస్తికతర్క ఢంకారావాలు, భౌతికవాదోలూకకోలాహలధ్వనులు, సర్వత్ర ప్రతిధ్వనింపసాగాయి. కొందరు దుస్స్వప్నపీడితులు, కొందరు గాఢనిద్రాముద్రితులు, కొందరు మూర్ఛాక్రాంతులు, కొందరు విభ్రాంతులు, కొందరు నిర్జీవులు, కొందరు ప్రాణావశిష్టులు - మానవకోటి ఇట్లు ఆపన్నమైంది. ఆ అమంగళ కాళరాత్రికి అంతము లేనట్లు కనబడింది. విశ్వశివాలయము శవాలయముగా మారింది. అప్పుడు జాగ్రన్నిష్ఠమైన భాగవతజన తాపహృదయములనుండి, "అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతి ర్గమయ, మృత్యోర్మా అమృతం గమయ" - అన్న ఒక ప్రార్థన ఆ నిశీథినీగర్భాలను చీల్చుకొని సన్న సన్నగా సాగింది. ఆ వేద వేదనారవళి విశ్వనాథునివీనులకు సోకింది. "యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! అభ్యుత్థాన మధర్మస్య త దాఽఽత్మానం సృజా మ్యహం" - అన్న అభయవాణి ఘూర్ణిల్లింది.

వేగుచుక్కలు ప్రాచీదిశను అలంకరించాయి. ఆశాజ్యోత్స్న సాక్షాత్కరించింది. లోకబాంధవుడైన శ్రీ రామతీర్థ సూర్యభగవానుడు

భారతోదయాద్రిపై ఉదయించాడు. త్యాగదివ్యారుణకాంతులు పృథ్వీమండలముపై బంగారుపూతలు పూయసాగాయి. మహోన్నత హిమాలయశిఖర దుర్గాగ్రమునుండి ప్రభాతభేరి నినదించింది. "'ఆత్మానం విద్ధి!' నిన్ను నీవు తెలిసికో! 'తత్త్వమసి!' నీవు పరబ్రహ్మస్వరూపుడవు!...'ఉత్తిష్ఠ!' లే నిద్రలే!" - అన్న ప్రభాత భేరీరవం-అహో! నిద్రాప్రపంచమును ప్రకంపితంచేస్తున్నది. సుప్రభాత మే తెంచింది! శ్రీ రామతీర్థమహోదయం శోకాకుల ప్రపంచానికి శుభోదయం!

శ్రీ రామతీర్థ జీవనస్వరూప సౌందర్యసందర్శనం మానవకోటిలోని విషయవికారములను సంస్కరించి బ్రహ్మజ్ఞాన సౌందర్యమును ప్రసాదిస్తుంది. శ్రీ రామతీర్థ జ్ఞానభాస్కరమహోపదేశ కిరణస్పర్శ మానవకోటిలోని నిద్రాణచైతన్యమును జాగృతం చేస్తుంది.

మెలపుల్లో మెరుస్తున్న, మేఘాల్లో తేలిపోతున్న, ఉరుముల్లో గర్జిస్తున్న, నదీనదాలలో ప్రవహిస్తున్న, సముద్రాల్లో పొంగిపోతున్న, పర్వతాలలో నిశ్చలమైయున్న, జంతుకోటిలో సంచలిస్తున్న, సూర్యచంద్రతారకలలో వెలుగుతున్న, వనవిహంగకోటిలో గానంచేస్తున్న, ప్రతిహృదయంలో స్పందిస్తున్న, ప్రతిరక్తనాళంలో నర్తిస్తున్న, సమస్త విశ్వంలో ప్రదీపిస్తున్న, తనదివ్యరూపమే మనందరి స్వరూపంగా-విశ్వరూపసందర్శనభాగ్యమును శ్రీ రామతీర్థభగవానుడు మనకు ప్రసాదించాడు. నరునకూ నారాయణునకూ గల సనాతనసన్నిహితత్వమును ప్రకటించాడు. జీవునకుగల బ్రహ్మపదవారసత్వమును ప్రకటించి, శివసామ్రాజ్యమునకు జీవుని పట్టాభిషిక్తుని చేశాడు. దేహభావరూపమైన బానిసతనమును వదలి, దైవభావ మనే యువరాజఠీవితో నడచి, తన సత్యస్వాతంత్ర్యమును ఆనందించవలసినదిగా ఉద్బోధించి నరుని గుండెకండరముల కతడు నవోత్తేజమును కలిగించాడు. ఇంద్రియాశ్వముల కళ్లెములను స్వస్వరూపమైన వాసుదేవున కర్పించి, ఆతని ప్రియసఖుడవై, జీవితసంగ్రామకేళి చేసి, విజయుడవు గమ్మని రామభగవానుడు,

నరునకు గీతోపదేశం చేశాడు. మస్తిష్కమును స్వాత్మజ్ఞానముతో, హృదయమును పరమాత్మప్రణయముతో, శరీరమును పరమేశ్వరసేవా కర్మతో - జీవితమును దివ్యీకరించుకొనగల - భక్తి జ్ఞానకర్మయోగ సమన్వయాత్మకమైన అనుష్ఠాన వేదాంతయోగపథమును శ్రీ రామతీర్థ జగదాచార్యస్వామి వివృతంచేశాడు. ఈ అనుష్ఠాన వేదాంతపథం సర్వతారకమైంది. ఈ రామదర్శనం-ఈ రామగీత - ఈరామప్రబోధం- నవజనతోద్ధారకమైంది. మతా లెవరూ మార్చుకో పనిలేదు. మతులే మార్చుకోవలసియున్నది. దేహాహం భావమును దైవోऽహంభావ ముగా మార్చుకోవడమే చేయవలసియున్నది. తమ వేషభాష లెవ రును మార్చుకొన అగత్యం లేదు. తమ వేషభాషలను, ఆత్మసౌంద ర్యమునకు అనుకూలంగా చేయ్యడమే చేసికొనవలసిన పని. తమ తమ గృహా లెవరూ పరిత్యజించ పనిలేదు. తమతమ గృహాలను దైవజ్ఞాన కేంద్రాలుగా చేసికోవడమే చేయవలసిన పని. తమ ఉద్యోగాలు వద లుకొనవలసిన ఆవశ్యకత ఎవరికీ లేదు. వాటిని ఈశ్వరప్రీత్యర్థంగా చేయడమే చేయవలసినపని. తమ బంధుమిత్రకోటిని ఎవరూ వీడవలసిన పని లేదు. వారియందుగల వ్యామోహబుద్ధిని వదలి, సత్యప్రేమతో మెలగడమే చేయవలసినపని. రామగీత - అహంభావనిగ్రహమును ఆత్మజ్ఞానప్రతిష్ఠాపనమును ఉద్బోధిస్తున్నది. దేహదృష్టి త్యజించి దైవదృష్టి పొందడం జగద్దృష్టి వదలి జనార్దనదృష్టిపొందడం- ఇదే రామదర్శనం. ఈరామదర్శనం - ఈసత్యజ్ఞానం, హిందువులను నిజమైన హిందువులనుగా చేస్తుంది. మహమ్మదీయులను సత్యమహమ్మదీయుల నుగా చేస్తుంది. క్రైస్తవులను యథార్థక్రైస్తవులనుగా చేస్తుంది. ఆ యా మతస్థులను, ఆ యా సక్రమ మతస్థులనుగా చేస్తుంది. ఈ రామ దర్శనం - ఈ సత్యజ్ఞానం - నిజమైన విముక్తిని, నిజమైన మోక్షమును ప్రసాదిస్తుంది.

అందుకనే - స్వామి తన వేదాంతి పాంచజన్యమును ఇట్లు మోగిస్తున్నాడు :

"అనుష్ఠానవేదాంతమును ప్రతిష్ఠించుకో! 'అహం బ్రహ్మాస్మి' అన్న మహావాక్యధ్యానం - వ్యక్తిత్వాలమీది సంఘాలమీది, బాహ్య దృశ్యాలమీది విభ్రాంతిరాహిత్యం - దానికదే శక్తిగా, స్వాతంత్ర్యంగా, ప్రేమగా మారుతుంది. మీ రోమరోమంలో స్పందిస్తున్న ఈ అఖండ బ్రహ్మతేజమే, ఈ వీర్యవంతమైన అద్వైతమే, ఈ శక్తిమంతమైన భక్తియే, ఈ ప్రజ్వలజ్జ్యోతే, శాస్త్రాలచేత అమోఘమైన బ్రహ్మాకార వృత్తిగా పేర్కొనబడింది...

ఓ సంశయతరళా స్తిమితమానసులారా! ఇక చాలు మీదుర్బలమైన పూర్వాచారపరాయణత్వం. ఇక చాలు మీ శుష్కసంస్కార సంరంభం. మీ సర్వసంశయాలను, మీ దౌర్బల్యాలను, భస్మము చెయ్యండి. ఈ సిద్ధాంతాలన్నీ మిథ్యాసృష్టే. సూర్యుడు ఒకపాదరసపాత్రగా చూడబడవచ్చు. భూమి ఒకగోళాకారఘటంగా రుజువుకావచ్చు. వేదాలు అపౌరుషేయాలు కావని నిర్ధారణచేయబడవచ్చు. కానీ నీవు పరబ్రహ్మవే; తదితరము కానే కావు. నీబ్రహ్మత్వమునుండి నిర్గతమైన ప్రతి ఒక్క విషయమైనాసరే-గడ్డిపోచలు, ఇసుకరేణువులు, ధూళికణాలు, ప్రసారవాయువులు, వర్షబిందువులు, పశుపక్ష్యాదులు, దేవమానవులు, స్వీకరింపక తప్పదు. ఆ నీ సందేశాలు గుహాంతరాళాలు గర్జిస్తాయి. అరణ్యగర్భాలు ఘోషిస్తాయి. పల్లెపల్లెల్లో అది వ్యాప్తమవుతుంది. నగరనగరాల్లో, వీథివీథుల్లో అది ప్రతిధ్వనించి తీరుతుంది. సమస్తప్రపంచగహ్వరంలో నిండి, నిబిడీకృతమై, సమస్తమానవలోకాన్ని అది పులకితంచేస్తుంది. ఓహో! విముక్తి! స్వాతంత్ర్యం!

నదీజన్మస్థానము, అగణ్యహిమఖండసంపదతో ప్రపూర్ణమైనట్లయితే, ఆ నదీశాఖలు, దాని కాలువలు, దాని ప్రవాహాలన్నీ జల

ముతో నిండి పొంగి పారి, సస్యక్షేత్రాలను పోషించితీరుతాయి. జీవశక్తిమూలం- ప్రేమమూలం- జ్ఞానస్రవంతి- తేజోవిధానము-ఆ అనంత శక్తి, ఆ పవిత్రత, ఆ దివ్యత్వం, అహంకృతిని పారద్రోలి, ఏతత్ స్థానాన్ని ఆక్రమించనీ, బ్రహ్మైక్యభావుడవు కా! దివ్యత్వంతో మనస్సును నింపు. తప్పక నీ చేతులు, కండ్లూ, కాళ్లూ - నీ నరనరం - నీ పరిసరాలున్నైతం, ఒక సామరస్య మహితస్వర్గకర్మను ఆచరించి తీరుతాయి. ఒక మహాశక్తిప్రవాహాన్ని వరదలుగా పొంగిస్తాయి.

సింహాసనాలంకృతుడైన రాజుగారి సన్నిధిమాత్రంచేతనే, దర్బారంతా నియమబద్ధమై నిలుస్తుంది. అదేప్రకారం మానవుడు తన స్వస్వరూపబ్రహ్మమునందు నిష్ఠుడైతే, సమస్తమానవులలో ధర్మనియతిని, జీవశక్తిని తేగలుగుతాడు.

ఓ అవిశ్వాసీ! మేలుకో! నీ పవిత్రబ్రహ్మపదవీవైభవస్థితికి ప్రబుద్ధుడవుకా! ఒక్క-నీ‌నిర్వికల ఉదాసీనదృష్టి (నిస్సంగదృష్టి) మాత్రంచేత, నీబ్రహ్మానందపారవశ్యోన్మత్త నిర్లక్ష్యస్థితినుండి వచ్చిన ఒక్క- చిరుగాలి తాకిడిచేత, ఘోరనరక గహ్వరాలు స్వర్గమందిరాలుగా మారుతాయి!

'సరగ, రా రమ్ము! నీ స్వగృహంబు జేర
"ఓ పాంథ! నీ గృహం బోంకార మోయి!"
ఓం! ఓం!! ఓం!!!

# శ్రీ రామతీర్థసేవాశ్రమ మహోద్యమం:

నరునిలోని సర్వానర్థకరమైన అహంభావమును ఉన్మోచనము జేసి, సర్వమంగళకర మైనశివోహంభావమును సుప్రతిష్ఠితమొనర్చి - నరుని నారాయణునిగా - విశ్వమును విష్ణుమందిరంగా - ప్రకాశింప జేయడానికే శ్రీ రామతీర్థసేవాశ్రమ వేదికపై, జనతాజనార్దనప్రీతికర మైన ఒక బృహత్ జ్ఞానయజ్ఞం వివిధకర్మాంగములతో దీర్ఘకాలము (1941 సం॥) నుండి నిర్వహింపబడుతున్నది.

హృదయమును భక్తిమయంగా, బుద్ధిని జ్ఞానదీప్తంగా, శరీరమును సత్కర్మానుష్ఠానయుతంగా జేసి - జీవితమును దివ్యీకరించి - మానవుని బ్రహ్మనిర్వాణశాంతిసామ్రాజ్యానికి అభిషిక్తుని జేసే - సార్వజనికధర్మావతారమూర్తి, నవయుగజగదాచార్యభగవాను లైన శ్రీ రామతీర్థస్వామివారిఅనుష్ఠానవేదాంతసందేశప్రసారం-శ్రీ రామతీర్థ సేవాశ్రమజ్ఞానయజ్ఞమునందు, ప్రప్రధానవిషయం.

శ్రీ రామతీర్థ పబ్లికేషన్ లీగ్, (శ్రీ రామతీర్థప్రతిష్ఠానము) లక్నో వారిఅనుమతితీసుకొని, శ్రీ రామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వతమును (The Complete Works of Swami Rama Tirtha — In woods of God-Realization) తెలుగులోనికి అనువదించి, రెండు బృహత్సంపుటములుగా 1949 సం॥లో ప్రకటించాము. ఆ ప్రతులన్నీ ప్రచారమై చాలాసంవత్సరాలైంది. ఎంతోమంది జిజ్ఞాసువు లా గ్రంథాలకొరకు ఆవేగపడుతున్నారు. అదిగాక- శ్రీ రామతీర్థబోధామృతం ప్రజాకోటికి ఇప్పు డత్యవసరమైయున్నది. కానీ గ్రంథపునర్ముద్రణకు ధనంలేదు. ఆ సమస్య ఎట్లున్నా, గ్రంథసంస్కరణానికి ఏమాత్రం తీరిక లేదు. కలిపురుషునిదౌర్జన్యదండయాత్రలు నలువైపులసాగుతున్నవి.

కానీ శ్రీస్వామిసంపూర్ణసారస్వతాన్ని సంస్కరించి, పునర్ముద్రణ చేయించాలని ప్రగాఢకుతూహలం బయలు దేరింది. "జై శ్రీ రామతీర్థ గురు దేవుకు జై" అంటూ కేశవుడు కార్యార్ణవోత్తరణానికి ఉద్యమించాడు. ఎన్ని కష్టాలు పడితేనేమి రామకృపచే కార్యసిద్ధి అయింది. ఇదిగో అమృత కలశం! శ్రీ రామతీర్థ వేదాంత భాష్యం! స్వీకరించండి!

ఈమహాజ్ఞానయజ్ఞనిర్వహణంలో - ఈ రామకార్యసాధనలో - అనేకవిధానములలో మాకుతోడ్పడిన ఆత్మీయులందరూ రామకటాక్షశ్రీకి పాత్రులౌతారుగాక!

పాఠకజన సౌకర్యానికి యీద్వితీయసంస్కరణంలో 9 సంపుటాలను 3 సంహితలుగా బైండుచేయించాము. వీలున్నంతవరకు గ్రంథము ను చక్కగా వెలువరచడానికియత్నించాము. ఇప్పటి కీ రూపంలో గ్రంథం వెలువడింది. ఆ యీలోటుపాట్లన్నీ తృతీయముద్రణంలో సవరింపబడతాయి.

శ్రీ రామతీర్థ వేదాంత భాష్యాధ్యయనశ్రవణమననాదులు సోదర మానవకోటికి నిరతిశయశాంతిశ్రీని ప్రసాదించుగాక! ఓంతత్సత్.

శ్రీ రామతీర్థ సేవాశ్రమం,
పిడుగురాల, 3-10-'66.

—శ్రీ కేశవతీర్థస్వామి.

# శ్రీ రామతీర్థ సంపూర్ణసారస్వతయజ్ఞ

## ముఖ్య సహాయకులు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | శ్రీ రుద్రరాజు వెంకట నరసింహరాజుగారి సతీమణి శ్రీమతి సూర్యకాంతమ్మగారు, | భీమవరం | రు. | 1000-00 |
| 2. | శ్రీ రుద్రరాజు వెంకట నరసింహరాజుగారు, | భీమవరం | ,, | 1000-00 |
| 3. | శ్రీ సాధ్వి మీరాబాయిగారు | | ,, | 275-00 |
| 4. | శ్రీ చేనేతోద్యమ పితామహ- గుంటక నరసయ్య పంతులుగారు వారి సతీమణి శ్రీమతి వసంతాదేవిగారు | | ,, | 251-00 |
| 5. | శ్రీ దుర్గం నరసింహులుగారు | హైదరాబాద్ | ,, | 151-00 |
| 6. | శ్రీ మారిశెట్టి నారాయణగారు | ,, | ,, | 116-00 |
| 7. | శ్రీ గుంటక రాజలింగముగారు | ,, | ,, | ,, |
| 8. | శ్రీ జెట్టి లింబగిరిగారు | ,, | ,, | ,, |
| 9. | పూజ్య శ్రీ రామకృష్ణానంద స్వామివారు | గండిక్షేత్రము | ,, | ,, |
| 10. | శ్రీ నల్లపాటి సుబ్బారావుగారు | గుంటూరు | ,, | ,, |
| 11. | శ్రీ కొన్నూరు నరసింహారావుగారు | పెదవీడు | ,, | ,, |
| 12 | శ్రీ బోయినేపల్లి విశ్వనాథంగారు | సూర్యాపేట | ,, | ,, |
| 13. | శ్రీ ఘంటా సత్యనారాయణగారు | ధర్మవరం | ,, | ,, |
| 14. | శ్రీమతి ఘంటా పార్వతమ్మగారు | శృంగవృక్షం | ,, | ,, |
| 15. | ,, లక్ష్మీ సుభద్రాదేవిగారు | బొబ్బిలిరాజ్ఞీమణి | ,, | ,, |
| 16. | ,, సరస్వతీదేవిగారు | చిక్కవరం జమీందారిణి | ,, | 58-00 |
| 17. | శ్రీ శ్రీ యోగిమాతగారు | గుడారిరాజమణిపురం | ,, | ,, |
| 18. | శ్రీ బైరి రామచంద్రముగారు | హైదరాబాద్ | ,, | ,, |
| 19 | శ్రీ దుర్గం పురుషోత్తంగారు | ,, | ,, | ,, |
| 20. | పూజ్య శ్రీ రామతీర్థస్వామివారు | శ్రీకేశవదాసుపాలెం | ,, | ,, |
| 21. | శ్రీ యం. రామచంద్ర అప్పారావుగారు | మద్రాసు | ,, | ,, |
| 22 | శ్రీ తేతల పద్దారెడ్డిగారు | కుకునూరు | ,, | ,, |



శ్రీ రుద్రరాజు వెంకట నరసింహరాజుగారు

భీమవరం

శ్రీ రామతీర్థ సంపూర్ణ వేదాంత సారస్వత

యజ్ఞమునకు తోడ్పడిన వదాన్యులు



శ్రీ రుద్రరాజు వెంకట నరసింహరాజుగారి

ధర్మపత్ని శ్రీమతి సూర్యకాంతమ్మ గారు

భీమవరం

శ్రీ రామతీర్థ వేదాంతసరస్వతిని ఖాదీకాషాయ వస్త్రాలంకృతను

జేసి ధన్యతగన్న పుణ్యాత్మురాలు

# విషయానుక్రమణిక

## ప్రథమ సంహిత

## ప్రథమ సంపుటం — "ఆత్మజ్యోతి"



## ద్వితీయ సంపుటం — "శక్తిస్రవంతి"

# తృతీయ సంపుటం — "ఆత్మానుభవము"

# శ్రీ రామతీర్థ వేదాంతభాష్యము

## శ్రీ రామతీర్థ సంపూర్ణ సారస్వతము



ప్రథమ సంపుటము



శ్రీ రామతీర్థ సేవాశ్రమము

పిడుగురాల (పోష్టు) గుంటూరు జిల్లా - ఆంధ్ర

# శ్రీ రామతీర్థస్వామి



"మీ హృదయసింహాసనాధిపతినైన రామమహారాజును నేను. నేను వేదాంతద్వారా ఆదేశించినప్పుడు, మహోత్సాహంతో ఉపదేశించినప్పుడు, హిమనగములో, మక్కాలలో ప్రబోధించినప్పుడు, నన్నూ, నా ప్రబోధాలనూ మీరు సరిగా అర్థంచేసికోలేదు. [illegible] నావాడే మీ అందరియొక్క అంతర్యామినే. తత్త్వమసి! తత్త్వమసి! తత్త్వమసి!"

SRI RAMA TIRTHA SEVASHRAM, PIDUGURALLA (P. O.) GUNTUR Dt., A. P.

# ఆగమించె! ఆగమించె!

రచన : శ్రీ కేశవతీర్థస్వామి

1

ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

2

కష్టార్తజగంబు గాంచి
కరుణను రక్షింప నెంచి
త్వష్టాతలి నెదలోన వలచి
కైలాసాగ్రంబు విడిచి -
ఆగమించె! ఆగమించె -
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

3

"తత్త్వమసి" యటంచు సనా
తనసందేశంబు వెలయ -
నరుని నారాయణుని జేయ -
నరకము నాకంబు జేయ -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

4

సర్వేశ్వరుసామ్యతత్త్వ
సౌభాగ్యము నెల్ల మఱచి,
విషయవీథి నఱచి యఱచి
బిచ్చమెత్తుజనుల జూచి -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

5

కులమతజాతిద్వేషా
గ్నుల బడి హాతి మొందుజనత -
నద్వైతామృతముచేత
ఆయు వొసగి రక్షింపగ -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థ జగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

6

వేదాంతము వెలయఁజేయ,
విమలఖురాన్ విశదపరుప,
బైబిలుహృదయంబు దెలుప,
బ్రహ్మతత్త్వ మెఱుకపరుప -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

7

వివిధవితతభూతవితతి
వెలయునేకత్వమును జూప -
అస్థిరలోకంబులోన
సుస్థిరసత్యంబు జూప -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థ జగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

8

తనయందున విశ్వమందు
తనరెడిపరమాత్మ గాంచు
సమతాయోగంబు జూప
సర్వుల కిల శాంతి గూర్ప -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు! -
ప్రేమరసామృతాకరుడు!-

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

9

జీవితసంగ్రామమందు
చెదరి ఆత్మవిశ్వాసము
దీను డైననరునిలోన
దివ్యశక్తి నింపి నిలుప -
ఆగమించె! ఆగమించె!
అవనీతలి కాగమించె -
రామతీర్థజగద్గురుడు!
ప్రేమరసామృతాకరుడు!

అర్ఘ్యపాద్యములను దెండు!
అర్చింతము రండు! రండు!

ఓం! ఓం!! ఓం!!!

ఓమ్

# శ్రీ రామతీర్థ భగవత్పాదులు

## శ్రీ పురాణసింగు

ఒకప్పుడు విశ్వకల్యాణానికి, సుస్థిర శాంతికి భారతీయులు పవిత్రహృదయాలు విప్పి ప్రార్థనలు చేశారు. అమృతగీతాలు ఆలాపించారు. యుద్ధాలలో జయాపజయాలతో యోధులు స్వగృహాలకు తిరిగివచ్చినప్పుడు తమ ఆత్మలనూ సర్వశక్తులనూ బలిపెట్టింది, బుద్బుద ప్రాయమైన ఐహికసుఖానికన్న విషయం అవగతమైంది. తాము జయించిన ప్రతియుద్ధం తమ "ఓటమికే" చిహ్నప్రాయంగా ఉందన్న అంతర్గర్భితసత్యాన్ని ఆర్యహృదయాలు గుర్తించినవి. అఖండమైన పరిత్యాగదీప్తి, వారిలోని విజయతృష్ణను అదృశ్యం చేసింది. శాంతి ప్రేమలు దశదిశాక్రాంతములై, దేశదేశాలకు పుణ్యక్షేత్రమైంది భారతవర్షం. ఆనాటినుంచి, త్యాగమయంగాని ఘట్టాలకు హిందూదేశ చరిత్రలో స్థానం లేకుండాపోయింది. భారతదేశంలో ఒకని ఆదర్శోన్నతి వాని భౌతిక సామ్రాజ్యవిజయాలు చూచిగాని, పాండిత్య ప్రకర్షలు చూచిగాని, కులాధిక్యాది విశేషాలుచూచిగాని పరిగణించరు. అతని బ్రహ్మజ్ఞాన ప్రతిభనుచూచి, బ్రహ్మవిద్యనుచూచి మాత్రమే పరిగణిస్తారు. మానవునిలో మనం చూడవలసింది అతని బాహ్యపరిస్థితులు గాదు– అంతరానుభూతులను. ఆ అంతర్మానవునే మనం అర్చించవలసివుంది. మౌన గంభీరమైన మహర్షుల అంతర్జీవనం బాహ్యానికి దురవగాహనమైంది. కానీ– ఆ మహాత్ముల మందహాస రోచిస్సులలోనుంచి, దయార్ద్ర వీక్షణాల్లోనుంచి, ఉదారహృదయంలోనుంచి, ప్రసన్న చిత్తములోనుంచి, వారి బ్రహ్మమయ జీవితాలను అర్థంచేసుకోవాలె. అలాంటి జీవితాలను అర్థం చేసుకోవాలంటే వారి వాక్యాలను సందేశాలను, ప్రసన్నవదన సౌందర్యాన్ని, అవలోకించాలె. శ్రీరామతీర్థ స్వామి జీవితం, ఆయన అంతస్సౌందర్యాన్నీ, అభ్యున్నతినీ, చిత్రిస్తున్నది. ఆ మహర్షి జీవితం స్థూలజగత్తు నతిక్రమించి ప్రశాంత బ్రహ్మ

జ్ఞానపథముబట్టి ఆత్మ సామ్రాజ్యానికి అధిగమించిన ఒక మానవుని పరిణామమే.

రామతీర్థస్వామి జీవితం, అరణ్యకేదారాల్లో శ్రుతిగల్పి విశ్వ శాంతి ప్రేమల వర్షిస్తూ సాగిన ఒక జానపదగీతం. ఒకప్పుడు దివ్యోపనిషన్ముఖమునుండి ఉద్గతమైన గానమేయిది. ఇది క్రొత్తదిగాదు. సనాతనమైందే. కానీ రామతీర్థ పరమహంస తిరిగి ఒకసారి తన హృదయ మూలంలోనుంచి వెలికిదీసి ఆ గానమధువును వర్షించాడు. ఆ బ్రహ్మర్షి శ్రేష్ఠుని గాంధర్వగానం వైవిధ్యంలోనుంచి ఏకత్వానికి, విభిన్నతలోనుంచి ఏకశ్రుతికి, ఆత్మలోనుంచి పరమాత్మకు మానవ లోకాన్ని తీసుకుపోతున్నది. అసూయలోనుంచి ప్రేమపథానికి యుద్ధమునుంచి శాంతికి రమ్మని మానవులను ఆహ్వానిస్తున్నది. ఆ దివ్యధ్వనిలోనుంచి పరమప్రేమ శాంతిపరవశత్వాలు వాహినులై ప్రవహిస్తున్నవి. ఆ మహర్షికి మానవులందరూ పవిత్రులే. సర్వసృష్టి పవిత్రమైందే. ఆయన అంతర్ముఖుడైన మహాకవి. "తత్త్వమసి" "ఏకమేవాద్వితీయం బ్రహ్మ"— అన్న రెండుమంత్రాలనే బంగారు రెక్కలతో, ఈ పరమహంస ఎగిరి ఎగిరి నిత్య నీలాకాశంలో కలిసిపోయింది.

పంజాబు దేశంలో గుజర్వాలా జిల్లాలోని మురళీవాలా గ్రామంలో 1873 లో ఒక నిరుపేద బ్రాహ్మణ కుటుంబంలో శ్రీరామ తీర్థస్వామివారు జన్మించారు. ప్రసిద్ధమైన రామాయణ కావ్యాన్ని హిందీలో రచించిన గోస్వామి తులసీదాసు వీరివంశ వృద్ధుడే. వీరి తండ్రి గోస్వామి హీరానందుడు. సరిహద్దురాష్ట్రంలో పెషావరు, స్వాట్ మొదలైన ప్రదేశాలకు యాత్రార్థం వెళ్ళి శిష్యులనుచూచి వస్తూండేవాడు. శిష్యులిచ్చే తృణమో పణమో ఆయన సంపాదన. రాముడు జన్మించిన కొద్దిరోజులకే తల్లి పరమపదించింది. ఆవుపాలతో బాలరాముని పెంచారు. రాముడెప్పుడూ పాలూ అన్నం తీసుకొనేవాడు. పాలంటే ఆయనకు పరమప్రేమ. ఒక్కొక్కసారి అయిదుసేర్ల పాలు త్రాగేవారు.

అయిదోయేట విద్యాభ్యాసం. ఆయన బాల్యమంతా నిరంతర విద్యాకృషిలో గడిచిపోయింది. పెద్దపెద్ద తరగతులు చదువవచ్చేసేవరకల్ల, తగినంతడబ్బులేక తండ్రిసహాయం చెయ్యలేకపోయినాడు. అందుచేత రాముని విద్యార్థిజీవితం కటిక దారిద్ర్యంతో గడిచింది. ఒక చొక్కా, రెండులాగులూ, ఒక చిన్నతలపాగా- ఇవ్వి ఆయన దుస్తులు. అన్నీ కలిపినా మూడురూపాయలు కావు. కళాశాలలో చదువుకొనే రోజులలో, లాంతరు నూనెకని ఒక్కొక్కసారి అన్నం మానేవాడు. ఎన్నోవారాలకు వారాలే పస్తులుండవలసి వచ్చేది. ఆయన ఎంత పస్తులున్నప్పటికీ, ఆయనముఖంలో బాధావిచారాలు లేశమాత్రంకూడా కనిపించేవికావని తోటి విద్యార్థులు చెప్పేవారు. అంత క్లిష్టపరిస్థితులలోకూడా, ప్రశాంతితో ఓర్పుతో గంటలూగంటలు చదువుతో, కళాశాలలో కాలంగడిపేవాడు.

తేజోవంతమైన ఆర్యసౌందర్యముతో ప్రకాశిస్తున్న ప్రసన్న వదనంతో దీపించేవాడు రామతీర్థుడు. నల్లగా విల్లులవలె వంపులుతిరిగి ఆయన కనుబొమలు, మిలమిల మెఱిసే ఆయన తేజోనేత్రాలు, ఆయన గాఢహృదయమును, అపారమైన ఆయనప్రేమను స్ఫురింపచేస్తుంటవి. ఆ విశాలఫాలభాగం, గణనీయమైన ఆయన ధీశక్తికి చిహ్నంగా ఉండేది. ఆయన అధరాలు నవకోమలకన్యాధరాలవలె ఉండేవి. తీవ్రంగా ఉన్నప్పుడు బిగించినట్లున్న ఆ పెదవులు, ఆయన అప్రతిహత మనోబలమును జ్ఞాపకానికి తెస్తుండేవి. కళాశాలా దినములలో ఆయన ఇంతటి మహాత్ముడని స్ఫురింపకపోయినా, ఆయన నెఱిగినవారు ఆయన నిరాడంబర పవిత్రశీలాన్ని గుర్తించినవాండ్లు, ఇలాంటివ్యక్తి మరొకడు లేడని యెంతో ఆశ్చర్యపడేవారు. ఆయన అమాయక కన్యమాదిరి గుప్తంగా ఉండేవాడు. ప్రేమదీప్తులలో నిరంతరం జీవిస్తున్న ఆమహనీయుడు, సన్నగా అంతపొట్టిగాకుండా, పొడగరి కాకుండా, తేజోదేహంతో సౌందర్యమును విరజిమ్ముతుండేవాడు. అజ్ఞాత జీవితం గడుపుతున్న బాలరామునిలో, ఉన్నతాశయాలతో మహత్తర లక్ష్యంతో నిరంతరకృషిచేస్తున్న ఇంకొక రాముడున్నాడు. ఆ బ్రాహ్మణబాలుడు తనలోని పవిత్రాశయాలను ఎప్పుడూ వ్యక్తీక

రించేవాడుకాడు. కండల్లో తొణికిసలాడే ఆనంద బాష్పాలతో, భక్తి నిలో ప్రదీపించే వినమ్రతతో, కన్యకఉండే ముగ్ధత్వంతో, వీరునికుండే విజయ సంకల్పంతో, ఈ దివ్యవిద్యార్థి అహోరాత్రాలు విద్యాలయంలో కృషిచేస్తుండేవాడు. తోటివిద్యార్థులందరిలో ఆయనే అగ్రగామి. ఆయన విద్యాకృషి అనంతమైంది. రామతీర్థులకున్న వివిధవిషయ సర్వజ్ఞత్వం సాహిత్యతార్కిక వైదాంతిక విషయ పాండిత్యం, అనన్యసామాన్యమైంది. భావప్రపంచ మంతటకీ ఆయనదే నేతృత్వం.

ఇరవయ్యోయేడు వచ్చేసరికి గణితశాస్త్రంలో యం. ఏ. పట్టం పొందాడు. తరువాత కళాశాలలో నాలుగు సంవత్సరాల్లో అధ్యాపకుడుగా, గణితశాస్త్ర ప్రధానాధ్యాపకుడుగా, పనిచేశాడు. 1899 సంవత్సరాంతంలో, లాహోరు విడిచిపెట్టి వెళ్ళిన ఒక సంవత్సరానికి, అరణ్యావాసంచేస్తూ రామతీర్థులవారు సన్న్యసించారు.

ఇరవై ఆరు సంవత్సరాల స్వల్పకాలంలో మహత్తర విజ్ఞాన సముద్రాన్ని రాముడు ఆపోశించాడు. ప్రతినిముషమూ రామునకు ఏదో ఒక కానుక చెల్లింపవలసిందే.

విశ్వవిద్యాలయంలో ఉన్నత పరీక్షల్లో ఉత్తీర్ణుడు కావడమే కాకుండా, హాఫీజు మౌలానా, రుమీామహార్బీ, ఉమర్ ఖయాం మొదలైన ప్రసిద్ధ పారశీక తాత్వికకవుల రచనలన్నీ ఆయన జీర్ణించుకున్నాడు. ప్రాచ్య, పాశ్చాత్య వైదాంతిక సాహిత్యమంతా ఆయన ఉత్తరించాడు. హిందీ, ఉరుదూ, పంజాబీ కావ్యాలలోని సౌందర్యాన్ని సంపూర్ణంగా దర్శించాడు.

తీవ్రపరిస్థితులవల్ల, నిరంతర శ్రమవల్ల తీర్థారాముని ఆరోగ్యం చెడిపోయింది. ఆయన యం. ఏ. ప్యాసై వచ్చేవరకల్లా ఎముకల ప్రోవైన ఆయన్నిచూచి ప్రజలు, ఈ అస్థిపంజరంలో ప్రాణం ఎలా కొట్టుకులాడుతున్నదా అని ఆశ్చర్యపోయేవారు. ఎముకమీద కాస్త కండైనా లేదు. మెడ కొంగమెడలాగా సాగింది. కంఠం రుద్ధమైంది. సుఖంగా మాట్లాడలేకపోయేవాడు. అంత బలహీనుడై పోయినాడు. అయితే ఆయన ధృడంగా ఉండాలని ఆరోగ్యాన్ని అభివృద్ధిచేసుకోవా

లని నిశ్చయించుకున్నాడు. నిత్యం సక్రమ వ్యాయామంతో, క్రమాహారంతో ఆరోగ్యంపొందాడు. నూతన వ్యాయామ రీతులను కూడా కనిపెట్టగలిగాడు. నాటినుంచి ఎన్నడూ వ్యాయామం మానలేదు. ఇంకొక నిముషానికి శరీర పరిత్యాగం చేస్తాడనగా వ్యాయామం చేశాడుకూడా. ఆ బక్కపలచని మనిషే ఇంతటి మహాత్కార్యాలు, నిరంతరకృషి చేయగలిగాడు. ఆయన అతి తొందరగా నడిచేవాడు. హిమవత్పర్వతాలమీద సన్యాసిగా నున్నప్పుడు రోజుకు నలభై మైళ్ళకుపైగా నడిచేవాడు. ఒకసారి అమెరికాలో వినోదార్థం నలభై మైళ్ళ పందెములో పరిగెత్తి పోటీచేసిన సైనికులకంటె రెండుగంటల ముందే గమ్యస్థానం చేరి గెలిచాడు. ఒకసారి స్వామి శాన్ ఫ్రాన్సిస్కో వీధిలో చరచర నడిచి పోతున్నప్పుడు ఒక అమెరికన్, "ఈ భూమి తనదే నన్నట్లు నడిచిపోతున్నాడే" అని అన్నాడు. "అవును" అని రామతీర్థులవారు నవ్వుతూ నడచివెళ్ళారు. కౌపీన మాత్రపరిధానుడై, ఒక గొంగడిమాత్రం కప్పుకొని స్వామి, "గంగోత్రి" "యమునోత్రి" "బదరీనాథ" శిఖరాల నధిరోహించాడు. యమునోత్రినుంచి గంగోత్రికి హిమవాహినులలో నడచిపోయినాడు. వ్రేళ్ళు కొంకర్లుపోయే మంచు గడ్డల్లో నివసించాడు. చీకటి కొండగుహల్లో నిద్రించాడు. అరణ్యగర్భాల్లో నివసించాడు. ఈ రచయిత ఒకసారి పర్వతవాసులను కలుసు కున్నప్పుడు, వారిలా అన్నారు: "రామతీర్థులవారు నిజంగా దేవుడే. కాకపోతే వర్షాకాలంలో తీవ్రవేగంతో సుళ్ళుతిరుగుతూ ప్రవహించే నదిలోనుంచి మాగొఱ్ఱెలను ఎలా దాటించుకొని వచ్చేవారో!"

అర్థరాత్రులందు స్వామి ఆసనం మీదనుంచిలేచి కాటుకలాంటి చీకటిలో, చొరరాని కీకారణ్యాలలో నిర్భయంగా మృత్యువుతో పోరాడడానికా అన్నట్లు నిర్గమించేవారు.

చదువుకొనే దినాల్లో ఉపవాసాలవల్ల కృశించి పాలిపోయిన ఆయన యౌవన వదనంలో, భయంకర దుర్గమారణ్యాలనుసైతం అతిక్రమించగలిగిన శౌర్యధైర్య సాహసాలను లాహోరు ప్రజలు గుర్తించలేకపోయినారు. ఎంతో మేరుధీరుడు స్వామి. ఇప్పటి ఆయన వదనం ఎంతో వికసించింది. సుందరమైంది- దివ్య పారవశ్యమధువుల

నాస్వాదించిన ఆ నుహర్షి నేత్రా లిప్పుడు అర్ధనిమీలితాలు. ఈ ధైర్యంతో ఈ బాహ్యాంతర మహత్తర శక్తితో, స్వామి తన జీవితో ద్గ్రంథాన్ని అంటే తనవ్యక్తిత్వాన్ని లోకానికి ప్రసాదించాడు.

రాముని వ్యక్తిత్వం ఒక ప్రచండమైన అగ్నిపర్వతం లాంటిది. కొన్ని నెలల పర్యంతం ఇంకేమీ చెప్పటానికి లేనట్లు మహా మౌనంలో మునిగివుండేవాడు. నిరంతర బ్రహ్మానంద మగ్నుడై వుండేవాడు. హఠాత్తుగా ఒక్కసారి అగ్నిపర్వతం బ్రద్దలైనట్లు, తన దివ్య భావాలను మహా పారవశ్యంతో వ్యక్తంచేసేవాడు. స్వామి ఏది వ్రాసినా, ఏది మాట్లాడినా అది నిత్యనూతనంగా వుంటుంది. ఒక్కొక్క పలుకు అనాఘ్రాత పుష్పంలాంటిది. ఆయన నిరంతర ఏకాంతాభిలాషి. బహిర్జన సంకులతనుంచి విడివడటానికి కాబోలు స్వామి, పర్వతాగ్ర విజనభూములకు గమించేవాడు. జలజలమని నృత్యంచేసే ఆ కొండవాగులనూ అనంతనీలాకాశమునూ చూస్తూ కొండరాళ్ళమీద సంధ్యారాగంలో పండుకొని నిమీలిత నేత్రుడై శాంతినిమగ్నుడై ఉండేవాడు.

ఆ మహావ్యక్తిలోని ఒక విశిష్టత, అర్ణవమై పొంగే పారవశ్యం, గాఢమైన అప్రమత్తత ఆయన నేత్ర పద్మాలలోనుంచి, అపారంగా వర్షించేది. స్వామివారి మాధుర్యం అనివార్యమైంది. హిందూవులూ, మహమ్మదీయులూ ఆ మహనీయుని సమానంగా ప్రేమించారు. ఏ మతస్థులైనా, ఏ కులస్థులైనా, ఏజాతివారైనా రామతీర్థమహర్షిని ఆత్మబాంధవునిగా చూచుకొనేవారు. అమెరికా వాండ్లాయనను అమెరికా దేశీయుడన్నారు. జపానువారు జపానీయుడన్నారు. పారశీకులు మావాడే నన్నారు.

రాముని దర్శించడమంటే నూత్నాదర్శాలతో, నూత్నదర్శనాలతో, నూత్నశక్తులతో నవ నవోద్వేగాలతో చెలరేగిన పరవశానందానుభూతి పొందడమే.

ఆయన మనోజ్ఞసందర్శనంలో ఉన్న ఇంకొక గొప్పవిషయం గంభీరమైన భావనాస్వాతంత్ర్యం. ఆయన మహోన్నతమైన ధీశక్తి. స్వామి ఏదిచెప్పినా ఊహించి చెప్పడు. ప్రతివాక్యం ఆయన జీవితాను

భవంలోనుంచి వస్తుంది. అనుష్ఠాన మతాన్ని తాను విశ్వసించావని ఆయన తరచుగా ప్రవచించాడు. స్వామి దృక్పథంలో, జీవనకళ ఉజ్వల విశ్వాసానికి ఉన్నది. బాహ్యామతానికి, అప్రమత్తుడైన మానవుని ఆంత రంగిక మతానికి సంబంధం లేదు. నీవు సజీవమానవుడవైతే నీ జీవితాన్ని సత్యానికి అంకితంచేసి పరిశోధించు! ప్రతివ్యక్తి తన జయాపజయాల ద్వారా, తన జీవితానుభూతులద్వారా, మాత్రమే దైవ సాన్నిధ్యం పొందవలసిఉన్నది. జీవితమే సర్వోత్కృష్టమైన నిరూపణం.

రెండు సంవత్సరాలు హిమవత్పర్వతాల్లోగడిపి, స్వామి తనలో తాను కనుగొన్న బ్రహ్మానందాన్ని ప్రపంచానికి పంచిపెట్టాలనే దివ్యాశయంతో, ప్రజ్వల ఆచార్య సామర్థ్యంతో ప్రజల మధ్యకు వచ్చాడు. 1903 లో కలకత్తానుంచి జపానుకు ఓడలో ప్రయాణంచేశాడు. అక్కడ స్వామి ఒక పక్షంమాత్రం ఉన్నాడు. రెండుసార్లు అక్కడ ఉపన్యాసం ఇమ్మని ప్రార్థించారు. టోకియోలోని ఒక క్రైస్తవపత్రిక రామతీర్థస్వామివారిని ప్రశంసిస్తూ, "పరవశ వేదాంత ప్రవక్త" అని పేర్కొన్నది. ఈ రచయితను, జపాను విశ్వవిద్యాలయంలోని ప్రాచ్య వేదాంత సంస్కృతాధ్యాపకుడైన "తాకకుత్సు" మహాశయుడు కలుసుకున్నాడు. ఆయన, తాను అనేక భారతీయ సాధుపుంగవులను, పండితులను ఇంగ్లండులో మాక్సుముల్లర్ వద్ద - జర్మనీలో చూచినప్పటికీ, రామతీర్థ స్వామివంటి మరొక వ్యక్తిని చూడలేదన్నాడు. ఆయన మూర్తీభవించిన వేదాన్తమే. టోకియోలో ఆచార్యుడు, బౌద్ధ వాఙ్మయ నిష్ణాత కంజహిరే ఒకసారి ఇలాచెప్పాడు :

"భారతదేశ చరిత్రలో బౌద్ధ వాఙ్మయాన్ని గురించి, సింహళ, జపాను గ్రంథాలలో నేను చదివిన వర్ణనలన్నీ శ్రీరామతీర్థులను సందర్శించినప్పుడు కండ్లకు కట్టినట్లున్నవి."

రామతీర్థులవారు జపాను విడిచి, అమెరికా వెళ్ళినప్పటికీ ఆనంద పరవశోద్విగ్నమైన రామతీర్థ స్వరూపం హిరే మహాశయుని దృష్టిలో నుంచి పోలేదు. 1903 నవంబరులో రామతీర్థులు జపానువిడిచి శాన్ ఫ్రాన్సిస్కోకు వెళ్లారు. అమెరికాలో రెండుసంవత్సరాలున్నారు. ఆ

రెండుసంవత్సరాల్లోనూ, చాలాకాలం ఏకాంతలో ఉన్నారు. ఎంతో నిరాడంబరంగా జీవించేవారు. అమెరికాలో అడవినుంచి స్వయంగా కట్టెలు కొట్టుకొని నెత్తినబెట్టుకొని తెచ్చుకునేవారు. అక్కడ అమెరికను పత్రికలలో స్వామి దివ్యోపన్యాసాలను అభినందిస్తూ వ్రాసిన రచనలుచూచి, వాటిని నిర్లక్ష్యంచేవారు. ఒకసారి ఆ అభినందన పత్రికలన్నీ కట్టగట్టి శాక్రమెంటోనదిలో విసరి పారవేశాడుస్వామి. ఆ మహాత్ముని అమెరికాజనులు ఏనాటికీ మరచిపోరు. స్థలాభావంవల్ల శ్రీస్వామివారి అమెరికాజీవితాన్ని పూర్ణంగా వర్ణించడంలేదు.

భారతదేశానికి తిరిగివస్తూ ఈజిప్టులో ఒక పెద్ద మశీదువద్ద పర్షియనుభాషలో మహమ్మదీయులకు ప్రత్యేకముగా స్వామి ఉపన్యసించారు.

మాతృదేశానికి తిరిగిరాగానే 1905 లో ఆ మహర్షి రెండు లక్ష్యాలు పెట్టుకొని వచ్చాడు. ఒకటి జీవితవిధానాలన్నిటిలో నిర్మాణాత్మకంగా కృషిచేయడం; రెండు ఐక్యకార్యాచరణ. వారి సంయుక్త రాష్ట్ర ఉపన్యాసాలన్నిటిలో ఈ ఆదర్శాన్నే ఉద్ఘాటించారు.

1906 అక్టోబరు దీపావళీ పుణ్యదినంనాడు స్నానంచేస్తూ, పొంగులుపారుతూవున్న గంగానదిలో శ్రీరామతీర్థ స్వామివారు మునిగిపోయినారు. వారు వ్రాసిన చరమగీతం ఉరుదుభాషలోఉంది, అది ఇలాఉంది :

"ఓమృత్యుదేవతా! కావలెనేని
తీసుకపొమ్ము యీ దేహంబునీవు;
ఎన్నియో దేహముల్ కలవు నే దాల్ప
చంద్రుడు నేసిన వెన్నెల వలువ
లానందముగ దాల్చి విహరింతునేను
సూర్యుడొసంగు కాషాయ వస్త్రముల
కట్టి మహాహ్లాదమయుతతోనుందు
జలజలబారెడి సెలయేటి రొదల
నే గాన మొనరింతు గళముపై కెత్తి

వీచికా హస్తముల్ పైకెత్తిఆడు
వనధిలో నే నహా తాండవించెదను
స్వేచ్ఛగా మారుతంబుల విహరింతు
ఇవియెల్ల నేను ధరించు రూపములె
ఉన్నత శిఖరాగ్ర భాగాలనుంచి
క్రిందికి ప్రేమతో దిగివచ్చినాడ;
మీ కవాటద్వారముల దట్టినాడ;
గాఢ సుషుప్తిలోనుంచి మిమ్ములను
మేలుకొల్పితి నిద్ర కంపించిపోవ.
ఒకరినోదార్చితి, ఒకరి కన్నీళ్లు
చల్లని చేతులతో నొత్తినాడ.
చలిలోన గడగడలాడు వారలకు
హాయిగా ధరియింప వస్త్రమ్ములిత్తు
కొందరి ముసుగుల తీసివేసెదను
సర్వంబు ధరియింతు భరియింతు నేను
సెలవిదే! సెలవిదే! నాకేమివలదు
నేనేది దాచుకో నిసుమంతయైన
నే నెవ్వరికి గోచరింప, నన్నెవరు
తెలుసుకోరిక సెలవింక సెలవు!''

స్వామి తన నిర్గమనాన్ని ఈవిధంగా ముందుగానే ఊహించారు. ముప్పైమూడేండ్లయినా నిండని ఆ మహా ప్రతిభాసంపన్నుని గంగానది తన గర్భంలో దాచుకున్నది. శ్రీవారు రచింపదలచుకున్న 'వేద సారస్వత సౌందర్యం' ''మనశక్తులు'' అనే ఉద్గ్రంథాలు రెండూ వారి హృదయపేటికలో గుప్తపడిన రత్నాలు.

ఓమ్

# శ్రీ రామతీర్థ వేదాంత భాష్యము

## శ్రీ రామతీర్థ సంపూర్ణ సారస్వతము

# ఆత్మానందం

[1902 డిసెంబరు 17 వ తేదీన శాన్‌ఫ్రాన్సిస్కో ఎకాడమీ - ఆఫ్ - సైన్సెస్‌లో ఇచ్చిన ఉపన్యాసం.]

ఆత్మస్వరూపులైన మహాజనులారా!

ఇతరజాతులను జయించడానికి చేస్తున్న సంగ్రామసంరంభాలకు, ఐరోపీయులను లేక క్రైస్తవజాతులను రాముడు నిందించడం లేదు. జాతియొక్క ఆధ్యాత్మికాభివృద్ధిలో యుద్ధంకూడా ఒకానొకసమయంలో ఆవశ్యకమైన ఒక అవస్థ. భారతదేశం ఆ యుద్ధక్రీడావస్థను దాటిపోయింది. భారతజాతి సనాతనజాతి కావడంచేత ప్రపంచంలోఉండే భాగ్యాన్నంతటినీ తూచి, భౌతికసంపదలోని క్షుద్రత్వాన్ని తెలిసికొన్నది. ఈరోజు ప్రపంచభాగ్యమునంతా వశంచేసికొన ప్రయత్నించే జాతులుకూడా ఒకరోజుకు భారతదేశం తెలిసికొన్న సత్యమునే తెలిసికొంటాయి. అనేకజాతులు చేస్తున్న యుద్ధాలకు కారణమేమిటి? దేనికోసం ఈ జాతులన్నీ ఈ దండయాత్రలు సాగిస్తున్నాయి? కారణం ఒకటే- ఆనందం, సంతోషం, సుఖం! కొందరు ఈ సంఘర్షణలు ఆనందంకోసం కాదు- జ్ఞానార్జనాని కంటారు. మఱికొందరు సుఖంకోసం కాదు- కర్మాసక్తిచేత అంటారు- మంచిది. సర్వసాధారణ మానవకోటియొక్క హృదయాలను, మనస్సులను పరీక్షించి చూడండి. మీ కొకనిజమైనసంగతి తెలుస్తుంది. ప్రతిమానవుడుకూడా ఆనందమును అన్వేషిస్తుంటాడు. ఏదోఒకవిధంగా వ్యక్తంగానో అవ్యక్తంగానో సుఖసాధనకు పాటుపడుతుంటాడు. ఇది నిజం.

ఈరోజు సాయంకాలం ఆనందం ఎక్కడ ఉన్నదో విచారిద్దాం. ఆనందం మేడల్లో ఉంటుందో, మిద్దెల్లో ఉంటుందో, ఆడవాళ్ళ అంద

చందాల్లో ఉంటుందో, భోగభాగ్యాల్లో ఉంటుందో చూద్దాం. ఆనందముయొక్క స్వగృహం ఎక్కడ ? ఆనందానికికూడా ఒక చరిత్ర ఉన్నది. ఇవి నిరంతర యాత్రాదినాలు. ఆవిరీ, విద్యుచ్ఛక్తీ, దేశకాలాలను రూపుమాపాయి. ఇది నిరంతరయాత్రాసంరంభకాలం ! ప్రతివ్యక్తి తన యాత్రలనుగురించి ఒక చరిత్ర రచిస్తుంటాడు. ఆనందంకూడా యాత్ర చేస్తుంటుంది. ఆనందయాత్రనుగూర్చి మనం కొంత తెలిసికొందాం.

బాలానందం దగ్గరనుంచి మొదలుపెడదాం. పసిపాపకు ఆనందమెక్కడ ఉంటుంది ? ప్రపంచంలో ఉండే ఆనందమునంతా పసిపాపవాళ్ళఅమ్మలోనే చూస్తాడు. తల్లి యొక్కటే శిశువుకు స్వర్గం. తల్లి వక్షఃస్థలమే శిశువునకు కైలాసం. తన మహాయాత్రలో ఆనందానికిదే బయలుదేరే మొదటిచోటనుకోండి. శిశువునకు తల్లికంటే వేరే ఆనందం లేదు. అమ్మ పమిటచెంగును అడ్డంచేసుకొని, 'అమ్మా! నన్ను కనుక్కో. నే నెక్కడున్నానో చెప్పు' - అని పకపకా నవ్వుతాడు. హృత్పూర్వకంగా నవ్వుతాడు. వానికప్పుడు పుస్తకా లక్కర లేదు. ధనంతో పనే లేదు. పండ్లూ మిఠాయీలు రుచించవు. ఒక్క అమ్మ కావాలె ! అంతే ! అమ్మే అఖిలానంద నిధానం !

ఒక్క సంవత్సరం గడుస్తుంది. శిశువుయొక్క ఆనందం అమ్మదగ్గరనుంచి ఇంకొకచోటికి యాత్రచేస్తుంది. బొమ్మలతో ఆడుకోవడమే ఇప్పుడా పిల్లవానికి ఆనందం. ఈ రెండవ అవస్థలో, పిల్లవాడు బొమ్మలను ప్రేమించినంత అమ్మను ప్రేమించడు. ఒకొక్కసారి బొమ్మలకోసం అమ్మమీద అలిగి మారాంచేస్తాడు.

కొన్ని నెలలు గడిచాయి. బొమ్మల్లో ఆనందం పోతుంది. ఆనందస్థానం మారింది. ఈ మూడవదశలో పసిపాప పెరిగి కుఱ్ఱవాడైనాడు. ఇప్పుడు వానికి ఆనందం కథలపుస్తకాలు మొదలైనవాటిల్లో ఉంటుంది. కొందరు కుఱ్ఱవాండ్లకు ఉండకపోవచ్చు. లోకసామాన్యంగా తెలివిగలపిల్లవానిని మనం ఉదాహరణగా తీసికొంటున్నాము. ఆ పిల్లవానికిప్పుడు కథలపుస్తకాలే ఆనందానికి ఆటపట్లు. ఆటవస్తువుల్లో

ఇప్పు డానందం కనపడదు. కథలపుస్తకాలే కన్నులకు విందుగూరుస్తాయి. అయితే ఆనందం కథలపుస్తకాల్లో కాపుర ముండక మళ్ళీ యాత్ర సాగిస్తున్నది.

బడిపిల్లవాడు కాలేజీలో చేరుతాడు. ఇక్క డాతనికి ఆనందం ఇంకొకదాంట్లో కనబడుతుంది. సైన్సుపుస్తకాల్లో, తత్త్వగ్రంథాల్లో కనబడుతుంది. అవి కొంతకాలం చదువుతాడు. అక్కడా ఆనందం నిలువదు. విశ్వవిద్యాలయంవాళ్ళిచ్చేగౌరవాలమీదికి పోతుంది. డిగ్రీల మీదికి పోతుంది. ఆనందస్థానం, ఆనందనిధానం, 'డిగ్రీ' అనుకొంటాడు. చదువైపోయి, ఆ విద్యార్థి గొప్పడిగ్రీతో విశ్వవిద్యాలయంనుంచి కులాసాగా బైటికి వస్తాడు. ఒక చిన్నఉద్యోగం దొరుకుతుంది. ఇప్పు డాయువకుని జీవితాశయం ధనార్జనం. డబ్బు సంపాదించడం. ఇప్పుడు వానికల ఒక్కటే – ధనవంతుడు కావడం! ద్రవ్యమే ఆనందనిధానమై ఆతనికి తోస్తుంది. రాత్రింబగళ్ళు కష్టించి డబ్బుకూడబెట్టి అఖండ భాగ్యభోగాల్లో తులతూగా లనుకొంటాడు. కొన్నాళ్ళు ఉద్యోగం చేసి ఆతడు కొంతడబ్బు కూడబెడతాడు. డబ్బు కూడినతర్వాత అతని ఆనందం అక్కడ నిలవక ఇంకొకదానిమీదికి పోతుంది. ఏమి టది? చెప్పాల్నా? స్త్రీ. ఇప్పు డా యువకునకు ఒక పెండ్లాం కావాలె. ఆ పెండ్లాంకోసం అతడు తనకున్న ధనమంతా వెచ్చించడానికి సిద్ధంగా ఉన్నాడు. అమ్మపమిటలో ఆనందం పోయింది; ఆటవస్తువుల్లో ఆనందం అదృశ్యమైంది; కథలపుస్తకాల్లో ఆనందం కనబడదు; తత్త్వశాస్త్ర గ్రంథాలు తలకెక్కడం లేదు; ఇప్పుడు వాని ఆనందస్థానం ఒక్క స్త్రీయే! ప్రేయసి, ప్రణయగాథలు– వాని కింపుగూరుస్తాయి. తన స్వప్నసుందరికై ఆయువకు డిప్పుడు తాను చెమటోడ్చి సంపాదించిన సంపదనంతా తృణప్రాయంగా ఆహుతిచేయడానికి సంసిద్ధుడైనాడు. సరే– పెండ్లి చేసికొంటాడు. కొన్నాళ్ళు భార్యతో కాపురంచేస్తాడు. కానీ– చిత్రం! ఆనందం భార్యలోకూడా నిలువకుండా జరిగిపోతున్నది. మొదట ప్రియురాలిలో కనపడ్డ ఆనందం ఇప్పుడు కనబడడం లేదు. పిల్లవాడు లేకపోయెనే అని దిగులు. దేవతలాంటి ఒకకొడుకు పుట్టాలని తపిస్తాడు. ఇప్పు డాతనిజీవితస్వప్నం– పుత్రసంతానప్రాప్తి. రామునకు

ఈ దేశంలో విషయాలు అంతగా తెలియవు. కానీ భారతదేశంలో మాత్రం వివాహానంతరం ప్రజలు సంతానంకొఱకు భగవంతుని ప్రార్థిస్తారు. సంతానం లేకపోతే సంసారం నిస్సారం! సంతపిస్తారు; సతమతమవుతారు; సకలవైద్యాలుచేస్తారు; సాధువుల నాశ్రయిస్తారు; సంతానం కోసం అష్టకష్టాలు పడతారు.

యువకునకు ఆనందమంతా సంతానప్రాప్తిలో ఉన్నట్లు కనబడుతుంది. ఆయువకునకు పిల్లవాడు పుట్టాడు. అతనిసంతోషానికి అంతులేదు. గాలిలో తేలిపోతాడు. క్రింద నడవడు. ముద్దులబిడ్డడు పుట్టినందు కతడు ముక్తిపొందినట్లు మురిసిపోతాడు. ఈ ఆరవ అవస్థలో– ఈ శిశుముఖ చంద్రదర్శనములో మానవుని ఆనందం అత్యున్నతస్థాన మలంకరించినట్లు కనబడుతుంది. పుత్రోదయానంతరం, యువకుని ఆనందం దిగజారసాగుతుంది. శిశువు పెరిగి పెద్దవాడవుతాడు. శైశవశోభ కాస్త సన్నగిల్లుతుంది. సంతానంలోనే ఆనంద మున్నది అనుకున్న ఆ మానవునకు, ఇప్పుడు సంతానమే ఆనందకేంద్రంగా కనబడదు. అతని మనస్సు పరిపరివిధాల పోతుంటుంది. అయినా మొత్తంమీద కొడుకుమీదే మమత ఎక్కువగా ఉంటుందనుకోండి.

ఇప్పుడు విచారిద్దాం. ఆనందం ఎక్కడ ఉన్నది? తల్లిలోనా? బొమ్మల్లోనా? కథలపుస్తకాల్లోనా? భాగ్యంలోనా? స్త్రీలోనా? సంతానంలోనా? లేక ఇతర ప్రపంచవస్తువుల్లో ఇంకెక్కడైనా ఉన్నదా? ఆనందయాత్రను సూర్యతేజోయాత్రతో పోల్చుకొందాం. సూర్యకాంతికూడా ఒకచోటినుండి మరొకచోటికి ప్రయాణం చేస్తుంటుంది. ఒకకాలంలో అది భారతదేశంమీద ప్రసరిస్తుంది. మరొక కాలంలో అది యూరపుఖండంమీద ప్రసరిస్తుంది. ఆవిధంగా అది ఒకతావునుండి మరొకతావుకు సాగిపోతుంటుంది. సాయంకాలం కాగానే సూర్యకాంతిని చూడండి– ఎంతత్వరితంగా, ఎంతచంచలంగా, ఒకప్రదేశం నుండి మరొకప్రదేశానికి సాగిపోతుంటుందో! తూర్పుఅమెరికాపై ప్రసరించి, అది పశ్చిమానికి పయనిస్తుంది. ఒకదేశంనుంచి ఒకదేశానికి మారిపోతుంది. జపానుకు పయనిస్తుంది. అయితే సూర్యకాంతి పడే చోట్లన్నీ సూర్యకాంతినైజస్థానాలు కావు. సూర్యకాంతి స్వగృహం

సూర్యుడే. అదేమాదిరి ఒక వస్తువునుంచి మరొకవస్తువుమీాదికి పయ నిస్తున్న ఆనందముయొక్క స్వగృహాన్ని గూర్చి విచారిద్దాం. ఆనందం ఎక్కడనుంచి బయలుదేరుతున్నది? ఆనందముయొక్క మూలస్థాన మేది? ఆనందసూర్యుణ్ణి మనం సందర్శిద్దాము.

ఆ యువకునివిషయం మనం తీసుకొంటాము. అతని కొక పిల్లవాడు పుట్టినవిషయం మనకు తెలుసుకదా. ఆయువకుడు ఆఫీసులో కూర్చొని పనులు చూచుకొంటున్నాడు. ఆకస్మికంగా అతని కొకగంట వినబడింది – టెలిఫోనుగంట! వెంటనే లేచి టెలిఫోనుదగ్గరకు వెళ్లాడు. ఏవార్త వస్తుందో అని అతనిగుండెలు దడదడా కొట్టుకుంటున్నాయి. రాబోయ్యేవిషాదాన్ని సూచిస్తున్నాయి. అతనిగుండెలో దడ బుట్టింది. ఈ గుండెదడ ఇదివర కెన్నడూ ఆతనికి పుట్టలేదు. టెలిఫోను దగ్గరకువెళ్ళి వార్త విన్నాడు దుర్వార్త. వెక్కి వెక్కి ఏడువసాగాడు. మనస్సు మనస్సులో లేదు. ముఖమంతా పాలిపోయింది. అతిత్వరగా ఆఫీసునుంచి వెళ్లాడు. పైఅధికారి అనుజ్ఞకూడా తీసికోలేదు. జవాను లకు కూడా చెప్పలేదు. బల్లమీాది కాగితాలు లోపల పెట్టలేదు. వికలచిత్తంతో అతడు వెళ్లాడు. ఆఫీసర్లు ఆశ్చర్యపడ్డారు. అతడు బజారు లోనికి వెళ్లాడు. పోస్టుమాన్ అతని కొకఉత్తరం ఇచ్చాడు. అది విప్పి చూచాడు. ఒకమంచివార్త. లాటరీలో చాలాడబ్బు వచ్చింది. ఆవార్త కూడా అతణ్ణి సంతోషపెట్టలేదు. టెలిఫోనులో విన్నవార్త అతి దుర్భరమైంది. కారులో ఒక ఉన్నతోద్యోగిని చూచాడు. అతనితో ఇదివరకు మాట్లాడా లనుకొన్నాడు. ఇప్పు డేమీా మాట్లాడలేదు. తన స్నేహితురాలుకూడా ఆకారులో కనపడింది. ఆమెతోకూడా మాట్లాడ లేదు.

ఆతడు ఇంటికి చేరుకున్నాడు. ఇంటిముందు పెద్దగోలగా ఉన్నది. జనం గుంపులుగుంపులు కూడియున్నారు. ఇల్లు తగులబడుతున్నది. మంటలు మండుతున్నవి. అతనిభార్య, ముసలమ్మా పెద్దగా ఏడుస్తు న్నారు. అక్కడతనిస్నేహితు లందరూఉన్నారు. అంతా ఉన్నారు. కానీ ఒక్కడుమాత్రం లేడు. తనకొడుకు! – తాను ఎంతో ప్రేమించిన ముద్దుల బిడ్డడు – అక్కడ కనబడలేదు. పిల్లవానిసంగతి అతడు వారిని

అడిగాడు. భార్యా సమాధానం చెప్పలేకపోయింది. పెద్దగా ఏడుస్తూ చెప్పలేక చెప్పలేక చెప్పింది. అతడు అసలువిషయం తెలిసికొన్నాడు. పిల్లవాడు ఇంట్లో వదలిపెట్టబడ్డాడని తెలిసికొన్నాడు. ఇంటికి నిప్పంటుకొన్నప్పుడు పిల్లవాణ్ణి ఊయలలో పడుకోబెట్టి, దాది ఎక్కడికో పోయింది. ఇల్లు అంటుకోగానే ఎవరో ఒకరు తీసుకవస్తారుగదా అని ఎవరిపాటికి వాండ్లు బైటికివచ్చారు. బైటికివచ్చి చూస్తే పిల్లవాడు లేడు. పిల్లవాడున్న గదికి నిప్పంటుకొన్నది. ఏడుస్తున్నారు. గుండెలు కొట్టుకొంటున్నారు. సహాయంలేదు. అందరూ అరుస్తున్నారు. తండ్రి, తల్లి, ముసలమ్మ ఏడుస్తూ కేకలువేస్తున్నారు. "పిల్లవాణ్ణి రక్షించండయ్యా! రక్షించండి! ఏవిధంగానైనా మా ముద్దులపాపను కాపాడండి! ఎంతడబ్బు కావాలంటే అంత మీా కిస్తాము. పిల్లణ్ణి రక్షించండి!" ఈ విధంగా వాండ్లు పిల్లవాని కోసం సమస్తాన్ని త్యాగంచేయడానికి ఇష్టపడుతున్నారు. నిజంగా శిశువంటే అందరికీ అల్లారుముద్దేకదా! అలాంటిశిశువుకోసం ధనం కానియ్యండి, మరేదైనా కానియ్యండి, మనం త్యాగం చెయ్యడం సముచితమే. కానీ రాము డొకటి అడుగుతున్నాడు; "అయితే శిశువే ఆనందమూలస్థానమా? ప్రపంచంలోకల్లా శిశువే ప్రియతమవస్తువా? లేక ఆనందమూలమైనవస్తువు మరొకటున్నదా?" ఇక్కడ గమనించండి. ప్రతిదీ పిల్లవానికోసం త్యాగంచేయబడుతున్నది. కానీ, అలాంటి పిల్లవాడుకూడా మరోదానికోసం, మరొకఉన్నతవస్తువుకోసం, త్యాగం చేయబడడం లేదా? శిశువుకోసం సంపదంతా భాగ్యమంతా త్యాగం చేయబడుతున్నది. మఱి ఆ శిశువే మరొకదానికోసం త్యాగంచేయబడుతున్నాడు. శిశువుకోసం ఇతరులను మంటల్లో దూకమని శిశువు తల్లిదండ్రులు కోరుతున్నారు. అంటే శిశువుకోసం, ఆ మంటల్లో దుమికినవాండ్లు చావవచ్చు. ధనంకన్నా, ఇతర్లకన్నా శిశువంతగా వాండ్లకు ప్రియం. అయినా అలాంటిప్రియశిశువుకూడా మరొకదానికోసం, ఇంకొక ఉన్నతవస్తువుకోసం, త్యాగంచేయబడుతున్నది. ఆ వస్తువు, శిశువుకంటే ఎక్కువ ప్రియమైనది, ఎక్కువ మధురమైనది, నిజమైన ఆనందస్థానం, సత్యమైన ఆనందకేంద్రం, అయిఉండాలె. ఏమిటావస్తువు? ఆ వస్తువేఆత్మ. చూడండి. ఇతరులను అగ్నిలో దూకమంటారుగాని

తాముమాత్రం దూకరు. వాండ్లుగనుక అగ్నిలో దుమికినట్లయితే తమ్మునుతాము త్యాగంచేసికొన్నట్లే. కానీ తమ్ము తాము వదలుకో డానికి తల్లిదండ్రులకు ఇష్టంలేదు. శిశువుకోసం సమస్త త్యాగం చేయ బడుతున్నది. ఆ శిశువుకూడా తనకోసం- అంటే; ఆత్మకోసం- త్యాగం చేయబడుతున్నది.

పరమానందనిధాన మనుకొన్న శిశువుకూడా ఇప్పుడు ఆనంద నిధానం కాదని మనం తెలిసికొన్నాము. పిల్లవాడు అందంగా ఉన్నాడు. ముద్దులొలుకుతున్నాడు. ఆనందనిధానంగా కనపడుతున్నాడు. కారణం? తనలోనుంచి- ఆత్మలోనుంచి- వెలువడిన ఆ సూర్య తేజం, ఆ పిల్లవానిమీద ప్రసరింపబడింది - ఇదే కారణం. అయితే ఆ ఆత్మ సూర్యకాంతి ఆపిల్లవానిలోనే స్థిరంగా నిలిచిఉండలేదు. ఆ ఆనంద సూర్యకాంతి శిశువులోనే స్థిరంగా ఉన్నట్లయితే, ఆ శిశువు శాశ్వతంగా ప్రియంగొల్పాలెకదా. గమనించండి; శిశువుయొక్క ముఖాన్ని శోభా వంతం చేసిన సూర్యకాంతి తనలోనుంచే బయలుదేరుతున్నది. ఆ ఆనంద తేజోమూలం తనలోనే ఉన్నది! ఆత్మలోనే ఉన్నది!

ఇప్పుడు మనం ఆనందమూలానికి మరికొంచెం దగ్గరకుపోదాం. శిశువుకొఱకే శిశువు ప్రియంగాలేడు. ఆత్మకొఱకే శిశువు ప్రియంగా ఉన్నాడు. భార్యకొఱకే భార్య ప్రియంగాలేదు. భర్తకొఱకే భర్త ప్రియంగాలేడు. ఆత్మకొఱకే భార్య ప్రియంగాఉన్నది. ఆత్మకొఱకే భర్త ప్రియంగా ఉన్నాడు. ఇదే సత్యం. వస్తువును వస్తువుకొఱకే ప్రేమిస్తున్నామని జనులంటారు. కానీ అది వట్టిది! వట్టిది! ధనం ధనం కొఱకే ప్రియం కాదు. ఆత్మకొఱకే ధనం ప్రియంగా ఉన్నది. ఒకప్పుడు ప్రియంగా ఉన్న భార్య, భర్తకు ఉపయోగించనప్పుడు వదలిపెట్టబడు తున్నది. ఒకప్పుడు ప్రియంగొల్పినభర్త, భార్యకు ఉపయోగపడనప్పుడు త్యజింపబడుతున్నాడు. ధనంకూడా ఉపయోగపడనప్పుడు వదలివేయ బడుతున్నది. నీరో సంగతి మీకు తెలుసు. అతడు అందమైన రోం. నగరాన్ని లెక్కచెయ్యలేదు. అది తగులబడుతుంటే ఆనందించాడు. కొండమీది కెక్కి స్నేహితు లందరినీ పిలిచి తానుచూచి ఆనందించడం కోసం నగరాన్ని తగులబెట్టుమని చెప్పాడు. రోంనగరం తగులబడు

తుంటే హాయిగా కొండమీద కూర్చొని ఫిడేలువాయించుకొన్నాడు. ఈవిధంగా ధనంకూడా మనకు అవసరం లేనప్పుడు వదలిపెట్టడం మనం చూడగలం. రాము డొక మహావిచిత్రవిషయాన్ని- అత్యాశ్చర్యకర విషయాన్ని- చూచాడు. ఒకసారి గంగ పెద్దవరదలచేత ఉప్పొంగ సాగింది. ఒడ్డుల కెగ్రబాకి ఉప్పొంగసాగింది. గంగానదీతీరమందే గల ఒకచెట్టుపైన, ఒక తల్లికోతీ, దానిపిల్లలూ, కూర్చొనిఉన్నాయి. ఆ చెట్టుచుట్టూ నీరు గ్రమ్మి ఉప్పొంగుతున్నది. పిల్లకోతులు కిచకిచ లాడుతూ తల్లికోతిచుట్టూ చేరుకున్నాయి. నీరు, తల్లికోతి కూర్చున్న కొమ్మవద్దకుకూడా ఉప్పొంగింది. తల్లికోతి అంతకంటే ఎత్తైనకొమ్మ మీదికి ఎగిరింది. నీరు అక్కడికికూడా ఉప్పొంగింది. ఆ తల్లికోతి ఆ కొమ్మమీదినుంచి చిటారుకొమ్మమీదికి ఎగిరింది. అక్కడికూడా నీరు పొంగింది. పిల్లకోతులన్నీ తల్లికోతికడుపుచుట్టూ కరచుకొనియున్నాయి. తల్లికోతిపాదాలకు నీరుతాకింది. అప్పు డాతల్లికోతి ఒకపిల్లకోతిని బల వంతాన తననుండి విడదీసి, తనకాళ్ళక్రింద ఎత్తుగా నీళ్ళు తగలకుండా పెట్టుకున్నది. అప్పటికీ నీరింకా పైకిపొంగింది. ఇంకొకపిల్లను తీసి, కాళ్ళక్రింద ఎత్తుగా చేసికొన్నది. ఇంకా నీళ్ళుపొంగాయి. ఇంకోపిల్లను అదేవిధంగా చేసికొన్నది. చివరకు పిల్లలన్నిటినీ ఒకదానిపై నొకటి తన కాళ్లక్రింద నిర్దాక్షిణ్యంగా అదిమిపెట్టికూర్చొని తననురక్షించుకొ న్నది.ఇంతేసుమా! పుత్రమిత్రకళత్రాదులు గానియ్యండి, మఱే వస్తువు లైనా కానియ్యండి, మనకు ఉపయోగించినన్నాళ్ళు మనకు ప్రియంగా ఉంటాయి. మనకు ఉపయోగించనప్పుడు, ఉత్తరక్షణంలో వానిని మనం వదిలివేస్తాము.

ఇప్పుడు మనం ఆనందమూలం-ఆనందస్థానం-తనలోనే-ఆత్మ లోనే-ఎక్కడో ఉంటుందనే నిర్ణయానికి వచ్చాం. ఆనందస్థానం ఆత్మలో ఎక్కడో ఉంటుంది. ఆ ఎక్కడో అనేస్థానమేది? పాదాల్లోనా? పాదాలు శరీరాన్నంతా మోస్తాయి. అందుచే దేహానికి ఆధార భూతము లైనపాదాలు ఆనందమూలం కావచ్చు. కానీ పాదాలు ఆనందస్థానం కావు, పాదాలే ఆనందనిధాన మైనట్లైతే, ప్రపంచంలో అన్నిటికంటే పాదాలే ప్రియతమవస్తువులై యుండాలేకదా? పాదా

లన్ని వస్తువుల కంటే ఎక్కువ ప్రియమైనవి కావచ్చు- కానీ చేతులంత ప్రియమైనవికావే. అయితే- చేతులా ఆనందస్థానాలు ? పాదాలకంటే హస్తాలు ఎక్కువ ప్రియమైనవి కావచ్చు. కానీ అవికూడా ఆనంద స్థానం కావు. అయితే ఆనందం ముక్కులో ఉంటుందా? కండ్లల్లో ఉంటుందా ? కండ్లు, చేతులకంటే ముక్కుకుంటే ప్రియమైనవి కావచ్చు; కానీ ఆనందం కండ్లల్లో లేదు. ఆ కండ్లకంటేకూడా ప్రియమైన దేదో ఆలోచించండి. ప్రాణమని మీరు చెప్పవచ్చు. ముందు దేహమంతటినీ తీసికొందాము. కాని దేహం ఆనందస్థానంకాదు. క్షణక్షణం మన శరీరం మారిపోతున్నది. సంవత్సరాలు జరిగినకొలదీ శరీరములోని ప్రతిఅణువు పోయి క్రొత్తఅణువులు చేరుతుంటాయి. అయితే ఆనందం మనోబుద్ధి చిత్తాలలో ఉండవచ్చు. బుద్ధికంటే ప్రియకరమైనది ఇంకొకటి లేదేమో చూద్దాం. బుద్ధికంటే ఎక్కువ ప్రియమైంది, మధుర మైంది ఏదైనా ఉన్నట్లయితే అది ఆనంద నిలయమై ఉండాలె. ప్రాణం ఆనందధామమై ఉండవచ్చు. ఎందుకంటే-తరచు మానవులు బుద్ధి లేకుండానైనా సరే బ్రతికడానికి వాంఛిస్తుంటారు. మరణమో, మతి హీనతతో మనడమో-ఈ రెండిటిలో ఏదో ఒకటి కోరుకోవలసి. వస్తే-బ్రతికిఉంటే బలుసాకైనా తిని బ్రతుకవచ్చని - ఎవరైనా మర ణాన్ని కోరుకోకుండా పిచ్చివాడై బ్రదకడానికే వాంఛిస్తాడు. ఈ విధంగా ప్రాణంకోసం బుద్ధి త్యాగంచేయబడుతున్నది. అలాంటప్పుడు, ప్రాణమే ఆనందనికేతనం కావచ్చు. ఆనంద తేజమును విరజిమ్మే సూర్యుడు కావచ్చు. ఇప్పుడు ప్రాణం నిజమైన ఆనందనిలయమో కాదో పరీక్షించండి. కాదు! కాదు! ప్రాణంకూడా ఆనందమూలం కాదు. ఆనందమూలం, ఆత్మ స్వర్గం, ప్రాణంకంటే అధికోన్నతమైంది-అని వేదాన్తం ప్రవచిస్తున్నది. అయితే ఆనంద మూల మేది?

రాము డొకసారి మరణోన్ముఖుడైన యువకుని చూచాడు. అతిదుస్సహవ్యాధితో అతడు బాధపడుతున్నాడు. అతనిశరీరం నఖశిఖాపర్యంతం బాధతో నిండిపోయింది. ఆ బాధతో అతడు మర ణించాడు. అతడు మరణసమయంలో అన్నమాట లివి: "అయ్యో! ఈ ప్రాణాలు నన్నెప్పుడు వదలుతాయి!" అతని అంత్యవాక్యా లివి.

ఈ దేశంలో మీరు. "అతడు ఆత్మను (Ghost) వదలా" డంటారు. భారత దేశంలో మేము-"శరీరాన్ని వదలా" డంటాము. ఇందులో భేదం కనబడుతుంది. ఇక్కడ దేహం ఆత్మగా చూడబడుతున్నది. ఆత్మ అనేది (Ghost) దానితో అనుబంధింపబడియున్న మరేదో దానిగా తలచబడుతున్నది. హిందూ దేశంలో దేహం ఆత్మేతరంగా చూడబడుతుంది. సత్యాత్మ సత్యంగా దర్శింపబడుతుంది. దేహం నశించినప్పుడు దేహి నశించినట్లిక్కడ ఎవ్వరూ భావించరు. దేహం మరణిస్తుంది, కానీ దేహి మరణించదు. ఆ మరణోన్ముఖుడైన యువకుని మాటలు-"హా! ఈ ప్రాణం ఎప్పుడు వదలుతాను? ఈ ప్రాణం నన్నెప్పుడు వదలిపోతుంది?"

ఇక్కడ ప్రాణానికన్నా ఇంకొక గొప్పది ఉన్నది. 'నా ప్రాణం'-అని ప్రాణముపై అధికారము కలిగియున్న-ప్రాణాధికప్రియతమమైన-సర్వోన్నతవస్తువేదో ఉన్నది. ఈ పైన పేర్కొనబడిన శరీరంలో ప్రాణము, ఆ-"నా" "నేను".-అంటున్న పరమాత్మను సేవించలేక పోవడంచేత, ప్రాణం పరిత్యజింపబడుతున్నది. ఆ పరమాత్మే ప్రాణం కంటే మధురమైనదై తీరాలె. అదే ఆనందమూలమై యుండితీరాలె. అదే సుఖస్థానమై యుండితీరాలె. ఎందుకు ప్రాణం బుద్ధికన్నా ప్రియమైనదో ఇప్పుడు మనం చూద్దాం. సత్యాత్మకు-అంతరాత్మకు-ప్రాణం సమీపంగా ఉండడమే ప్రాణం ప్రియంగా ఉండటానికి కారణం. నేత్రాలకంటే బుద్ధి ఎక్కువ ప్రియంగా ఉండటానికి కారణం? నేత్రాలకంటే బుద్ధి సత్యాత్మకు సమీపంగా ఉన్నది. మఱి పాదాలకంటే నేత్రాలతిప్రియం గావడానికి కారణం? పాదాలకంటే నేత్రాలు నీలోని సత్యాత్మను ఎక్కువగా సేవిస్తున్నాయి. పరాయిపిల్లవాని మీదికంటే, తనపిల్లవానిమీద ఒకనికి ఎక్కువప్రీతి ఉంటానికి కారణమేమిటి? "ఈ పిల్లవాడు నావాడు"-అని నీ ఆత్మయొక్క బంగారుపూత పూశావుకనుక"-అని వేదాంతం వ్యాఖ్యానిస్తున్నది. ఒక పుస్తకంలో మీ రేదైన ఒక పంక్తి వ్రాశారనుకోండి, ఒక పత్రికకు మీరేదైనా వ్యాసం వ్రాసి పంపారనుకోండి, మీవి పేటో వ్రాసినవానికన్నా ఎక్కువగా కనబడతాయి. ఎందువల్ల? "నా" అనుకోబడిన,

మీరచన మీ ఆత్మ సూర్యకాంతితో భావిస్తున్నది-మీలోని స్వర్గ కాంతితో భాసిస్తున్నది! అందుకనే హైందవుడు, ఆనందం-సత్యానంద మూలం-నీలోనే ఉన్నదంటున్నాడు. స్వర్గం మీలో ఉన్నది. వైకుంఠం మీలో ఉన్నది. సమస్తానందమూలం మీలో ఉన్నది. అఖండానంద మూలం ఆత్మలో ఉంటే అన్యత్రా వెదకడం ఎంతమూఢత్వం!

భారతదేశంలో ఒక ప్రేమికునికథ చెప్పుకొంటారు. అతడు తాను ప్రేమించిన స్త్రీకోసం కృశించాడు. ఎముకలదట్టిమైనాడు. మాంసమంతా ఎండిపోయింది. ఆ దేశవురాజు అతణ్ణీ అతడు ప్రేమించిన స్త్రీనీ ఒకరోజు న్యాయస్థానానికి రప్పించాడు. రాజుకు ఆ స్త్రీ చాలా అసహ్యంగా కనబడింది. అప్పుడు రాజు, తన ఆస్థానంలో వున్న సుందరీమణు లందరినీ రప్పించి వారిలో ఎవరినో ఒకరిని ఆ ప్రేమికుని ఏరుకోమన్నాడు. అప్పుడా ప్రేమికు డన్నాడు; "ఓ రాజా! బుద్ధిహీను డవు కాబోకు. ప్రేమ గ్రుడ్డివానినిగా చేస్తుందని నీకు తెలుసుకదా. నీకు చూడను కండ్లులేవు. నాకండ్లు పెట్టుకొని చూచి-అప్పు డామె అందంగా ఉన్నదో అసహ్యంగా ఉందో చెప్పు. ఆమెను నాకండ్లతో చూడు." సమస్తప్రపంచాకర్షణాల్లో ఉన్న రహస్య మిదే! ప్రపంచ మందలి సమస్తాకర్షణీయ వస్తువులపైగల వ్యామోహంలోని రహస్య మిదే! ఓమానవుడా! నీ చూపులచేతనే నీవు ప్రపంచవస్తువులను ఆకర్షించేలాగు చేసికొంటున్నావు. ప్రపంచ వస్తువులపై నీచూపులు బరిపి, నీలోని సౌందర్యకాంతిని వానిపై ప్రసరింపజేసి, వానిని ఆకర్షించే లాగు చేసి వ్యామోహపడుతున్నావు. గ్రీసుదేశంయొక్క పురాణ గాథలో ఎకో (Echo) యొక్క కథ మనం చదువుతాం. ఆమె తన ప్రతి బింబాన్ని తానే ప్రేమించింది. లోకాకర్షణలన్నీ యిలాంటివే! సర్వా కర్షణీయ వస్తుజాలమంతా నీలోని ఆత్మయొక్క ప్రతిబింబమే. నీలోని స్వర్గముయొక్క ప్రతిరూపమే. ప్రపంచవస్తుజాలమంతా నీ నీడమాత్రమే! అలాంటప్పుడు నీ నీడను నీవు వెంటాడడం ఎంతమూఢత్వం!

రామునకు ఒక చిన్నపిల్లసంగతి తెలుసు. ఆపిల్ల దోగాడు తున్నది. ఆ పిల్ల తననీడను చూచుకొన్నది. అదేదో కొత్తవస్తు వను కొన్నది. వింతవస్తు వనుకొన్నది. ఆశిశువు తన నీడయొక్క తలను

పట్టుకొందా మనుకొన్నది. నీడలోనితలవైపు దోగాడసాగింది. నీడ గూడా ముందుకు దోగాడసాగింది. శిశువు ముందుకు పోయినకొద్దీ నీడకూడా ముందుకు పోసాగింది. నీడయొక్క తలను పట్టుకోలేనందుకు ఆ శిశువు ఏడవసాగింది. ఆ శిశువు క్రిందపడితే ఆ నీడా క్రిందపడేది. లేస్తే ఆ నీడా లేచేది. ఆ శిశువు నీడను వెంటాడసాగింది. ఆ అవస్థంతా తల్లి చూచి జాలిపడి, శిశువుచేతితో శిశువు తలను పట్టుకొనేలాగు చేసింది. నీడలోకూడా చేయి తలను పట్టుకొన్నది. మీతలను మీరు పట్టు కోండి. నీడకూడా పట్టుబడుతుంది. స్వర్గనరకాలు మీలోనేఉన్నాయి. శక్తియొక్క- ఆనందముయొక్క- చైతన్యముయొక్క- మూలం మీలోనే ఉన్నది. మానవులయొక్క, ప్రకృతియొక్క, జాతులయొక్క దేవుడు- మీలోనే ఉన్నాడు. ఓ ప్రపంచ మానవులారా! వినండి! వినండి! సౌధాగ్రాలపై నిలిచి, మహానగరరాజమార్గాలలో నిలిచి ప్రకటింపవలసిన మహాసందేశ మిది! ఉచ్చైస్స్వరంతో ఉద్ఘోషించ వలసిన మహాపాఠ మిది! మీ రేదైనా తెలిసికోవాలంటే, మీ కేదైనా కావాలంటే, నీడవెంట వేటాడకండి! మీ తలను మీరు స్పృశించండి! మీలోకి మీరు పొండి! అంతర్ముఖులు కాండి! మీ స్వస్వరూప మైనపరమాత్మను సందర్శించండి! అప్పుడు మీరు తెలిసి కొంటారు-తళతళ మెఱసే ఆ తారలన్నీ మీరు చేసిన వేననీ, ఆకర్ష ణీయవస్తుజాలమంతా మీ నీడయే యనీ! తరళప్రాపంచకవిషయాలకై నిత్యసత్యమైనఆత్మను వదలుకోవడం ఎంత అజ్ఞానం!

భారతదేశంలో ఒక స్త్రీనిగూర్చిన చక్కనికథ ఒకటి ఉన్నది. ఆమె ఇంట్లో సూది పోగొట్టుకొన్నది. ఆమె ఇంట్లో దీపంకూడా పెట్టుకోలేనంత నిరుపేదరాలు. అందుచేత ఆమె వీధుల్లోకి వెళ్ళి సూదిని వెదకడం ప్రారంభించింది. ఒకడు వచ్చి "ఏమిటి వెతుకు తున్నా?" వన్నాడు. "సూది" అని జవాబుచెప్పింది. "ఎక్కడ పోగొట్టుకొన్నా?" వన్నాడతడు. "ఇంట్లో నాయనా" అన్నది. "ఇంట్లో సూది పోతే, బైట దేనికి వెతుకుతావు పిచ్చిదానా?"- అన్నాడతడు "ఇంట్లో దీపంకూడా పెట్టుకోలేనంత దరిద్రురాలను.

బైట దీపమున్నది," అన్నదా స్త్రీ. ఆమె ఇంట్లో వెదుకలేకపోయింది. ఊరుకుండలేక వీధుల్లో వెదకసాగింది.

ఇట్లే ఉన్నది మానవులసంగతి. మీలో స్వర్గ మున్నది. ఆనంద ధామ మున్నది. అయినా మీరు బాహ్యావిషయాల్లో, ఇంద్రియ వీధుల్లో, ఆనందాన్వేషణ చేస్తున్నారు. ఎంత విచిత్రం!

ఒకణ్ణి గూర్చి ఇంకొక రమ్యమైన కథ ఉన్నది. వాడు పిచ్చి వాడు. వాడు బజారులో ఉన్న పిల్లల దగ్గరకు వచ్చి, 'ఆయూరి – పురపాలక సంఘాధ్యక్షుడు ఒక పెద్దవిందు ఏర్పాటు కాడనీ, ఆవిందుకు పిల్లలందరనీ పిలిచాడనీ' చెప్పాడు. పిల్లలకు మిఠాయీలంటే యిష్టంకదా. పిల్లలందరూ కలసి పురపాలక సంఘాధ్యక్షుని యింటికి వెళ్ళారు. అక్కడ విందు లేదు. అప్పుడు పిల్లలంతా నవ్వి పిచ్చివాణ్ణి ఈ విధంగా అడిగారు; "ఇక్కడ విందు లేదే, అబద్ధమని తెలుసుకదా నీకు! నీవుకూడా మాతో దేనికి వచ్చావు?" "ఒకవేళ ఉంటుందేమో అనే భావంతో వచ్చా" నన్నాడు పిచ్చివాడు.

భావుకుల సంగతి ఈవిధంగానే ఉంటుంది. ప్రతిదీ అందంగా ఉన్నట్లు ఆకర్షణీయంగా ఉన్నట్లు భావించి, ఆ పిచ్చివానిలాగా వ్యామోహితు లవుతుంటారు. ప్రాపంచక వస్తువులవెంట వేటాడు తుంటారు.

ఉ ప సం హా ర ము :

ఆత్మానం విద్ధి! ఆత్మను తెలిసికోండి! మీలోని స్వర్గమును తెలిసికోండి! మీ వాంఛలన్నీ సిద్ధిస్తాయి! మీ దుఃఖాందోళనలన్నీ ఉపశమిస్తాయి!

"వనవృక్షములు రక్తబాంధవుల్ నాకు!
పర్వతశ్రేణిలో స్పందించుచుండె –
నాలోన స్పందించునాయంతరాత్మ!
పృథ్వి నామాంసము – మృగతతి చర్మ –

మా మధు మధుపంబు లహా! రెండు నేన!
మృగమును నేన! ఆ మృగరాజు నేన!
ప్రసవముల్ మత్ప్రేమవాసన లోలుకు!
నాస్వప్నగీతాల నదనదీవితతి
శ్రుతి గల్పి నటియించుచుండు సంతతము!
నామందిరోపరిసవమణి – యినుడు!
మృత్యుంజయుడ నేను – మృత్యుడింభకుడు
నాయెడిలోన నే నాట్యం బొనర్చు!
జన్మింప నే, నైన జన్మవీచికలు
నే ననునిరతనిర్ణిద్రార్ణవమున
తాండవించుచునుండు తనియ కెల్లపుడు!"

ఓహో! వైకుంఠం మీలోనే ఉన్నది. సచ్చిదానంద స్వరూప పరబ్రహ్మజ్యోతి మీలో ఉన్నది. విషయ వస్తువుల్లో ఆనందాన్ని అన్వేషించకండి! ఆనందం మీలోనే – ఆత్మలోనే – స్వస్వరూపమైనపరమాత్మలోనే – ఉన్నదని తెలిసికోండి!

ఓం! ఓం!! ఓం!!!

ఓమ్

# ఆత్మవికాసం

[ శాన్ ఫ్రాన్సిస్కో, ఎకాడమీ ఆఫ్ సైన్సెస్, 1902 వం॥ డిశంబరు 2వ తేదీన ఈయబడిన ఉపన్యాసం. ]

ఆత్మస్వరూపులైన సోదరీ సోదరులారా !

ఈ రాత్రి మనం ఆత్మవికాసమునుగూర్చి కొంత వినబోతున్నాం. దీనినే మీరు జీవితంయొక్క అవస్థాభేదం, ఆధ్యాత్మికాభివృద్ధియొక్క అంతరువులు, లేక స్వార్థసంస్కరణదశలు అని పిలువవచ్చు. చెప్పబోయే సారాంశం చాలామందికి ఆశ్చర్యకరంగా ఉంటుంది.




ఇదిగో, ఇక్కడ మీరు చూస్తున్న బొమ్మలలో, ఒకసరళరేఖా కొన్ని వృత్తాలూ గీయబడినవి. ఈవృత్తాలకూ, ఆత్మవికాసానికీ, సంబంధ మేమిటని మీ రనుకోవచ్చు.

## వృత్తములు

ఇవి వృత్తాలు కావు; ఇవి వక్రంగా అపరిపూర్ణంగా ఉన్నవే అని మీరు తలచవచ్చు. ఇవి కొన్ని తరహాల జీవితాలను చూపడానికి గీయబడినవి. ఆ జీవితాలుగూడా వీటిలాగే అపరిపూర్ణంగా వక్రంగా ఉండడంచేత ఈ వృత్తా లీ విధంగా వ్రాయబడినవి. జీవితమునుగురించి దాంట్లో ఉన్నతరహాలను గురించి నిర్వచించడానికి పూర్వం ఈ వృత్తాలనుగురించి కొంతచెప్పవలసి ఉన్నది.

ఇది అన్నిటికంటే చిన్నవృత్తం; ఒక చిన్నచుక్క. ఇంతకన్నా చిన్నచుక్క చుట్టితే అది మనకు కనబడదు. కాబట్టి ఈ బిందువు కనపడేలాగ చుట్టబడింది. దీనితరువాత రెండవది ఇంతకన్నా కొంచెం పెద్దవృత్తం. దాని తరువాత మూడవది రెండవ వృత్తంకన్నా పెద్దది. దాని తరువాత అంతకన్నా యింకా పెద్దవృత్తం మరొకటి చిత్రంలో గీయబడినది. ఇక్కడ మీకొక విశేషంగూడా కనుపిస్తుంది. వృత్తం పెద్దదైనకొద్దీ వికాసంచెందేకొద్దీ ఈ వృత్తాలన్నిటినీ అంటేటట్లు గీసిన సరళరేఖయందలి ప్రారంభ బిందువు 'ఎ' నుండి కేంద్రం అంతకంతకూ దూరమైపోతున్నది. కేంద్రంనుండి వృత్తానికి పోయేరేఖ పెద్దదవుతున్నది. వృత్తం పెద్దదైపోతున్నది. వృత్తంయొక్క కేంద్రం మొదటచుట్టిన 'ఎ' చుక్కకు చాలదాపుగాఉండి, అంతకంతకు దానిని సమీపించి, దానితో కలుసుకొనేటట్లయితే, ఆ వృత్తమే బిందువవుతుంది. కనుక వృత్తముయొక్క తొలిఅవస్థ బిందు వవుతున్నది. వృత్తంయొక్క కేంద్రమూ ప్రారంభబిందువూ రెండూ ఇక్కడ ఒకటేఅవుతున్నవి. ఈ కేంద్రం ప్రారంభబిందువుకు దూరమైనకొద్దీ, కేంద్రమునుండి వృత్తంకడకుపోయేరేఖ అంతకంతకూ పెద్దదై అనంతమవుతున్నది. కేంద్రం అనంతదూరానికి పోయేటప్పుడు, వృత్తం సరళరేఖగా మారిపోతున్నది. కనుక ఒకవృత్తంయొక్క అంత్య పరిణామం సరళరేఖ అవుతున్నది. దాని కేంద్రం అనంతదూరానికి పోతున్నది. కేంద్రంనుండి వృత్తానికిపోయే రేఖగూడా అనంతమవుతున్నది.

మరియొక విశేషమేమిటంటే వృత్తం ఎంతెంతగా పెద్దదవుతున్నదో సరళరేఖ వది అంతంతగా సమీపిస్తున్నది. వృత్తం పెద్దదైనకొద్దీ వంకరకూడ తగ్గిపోతున్నది. పైపటంలో 'డి' కేంద్రంగాగల పెద్ద వృత్తం 'ఎ'అనే బిందువువద్ద 'సి' కేంద్రంగా ఉన్న చిన్నవృత్తంకన్న వంకరతీరి, సరళరేఖగా మారుతున్నది. అట్లే 'బి' కేంద్రంగా ఉన్న వృత్తానికంటే 'సి' కేంద్రంగా ఉన్న వృత్తము 'ఎ'బిందువువద్ద సరళమవుతున్నది. ఈకారణంచేతనే భూమియథార్థానికి గుండ్రంగాఉన్నా మన మెక్కడనుండిచూచినా బల్లపరువుగానే కనుపిస్తుంది. భూవల

యాలు ఎక్కడనుండిచూచినా మన మీానేత్రాలతో చూడలేనంత పెద్దవిగా ఉండడంవల్లనే మన కావిధంగా కనుపిస్తున్నవి.

## జీవితం

జీవితం! జీవితం అంటే ఏమిటి? దాని చిహ్నాలేమిటి? దేన్ని జీవిత' మంటాం? జీవితానికీ నిర్జీవస్థితికీ, ఎట్లు భేదం గుర్తిస్తున్నాం? చలనశక్తి-లేక-చైతన్యమే-జీవితం. ఇదే సర్వసాధారణ నిర్వచనం. ప్రకృతిశాస్త్రం మొదలైనవిసైతం దీని కిట్టినిర్వచనమే యిస్తున్నవి. సజీవుడైనమానవుడు కదలగల్గుతాడు; నడువగల్గుతాడు. మాట్లాడగల్గుతాడు. ఇంకా అనేక కార్యాలు చేయగలుగుతాడు. మృతశరీరం ఈచేష్టలను ప్రకటించలేదు. జంతువులు. మొక్కలు మొదలైన ప్రాణికోటి విషయంకూడా ఇంతే. మృతజంతువు సంచరించలేదు. సజీవజంతువో నడుస్తుంది. పరుగెత్తుతుంది. రకరకాలపనులు చేస్తుంది. చచ్చిన మొక్క పెరుగలేదు. పుష్పించలేదు. ఫలించలేదు.

జీవితమందలి అవస్థలు; ప్రాణికోటి సర్వసాధారణంగా నాలుగు రకాలుగా విభజింపబడుచున్నది. ఈ ప్రపంచంలో నాలుగు ప్రధాన రాజ్యా లున్నాయి. ఖనిజాలు, వృక్షాలు, జంతువులు, మానవులు. వీనిలో మానవుడు, జంతువుకన్నా ఎక్కువశక్తిని సంచలనమును - చైతన్యమును - కనపరుస్తున్నాడు. పశువులు నడువగలవు. పరుగెత్తగలవు. పర్వతా లెక్కగలవు. మానవుడు ఈ అన్నిపనులు "చేయుగలడు" ఇంతేకాకుండా ఇంకా అనేక కార్యాలు చేయగలడు. అతడు తనచలనమును, శక్తులనూ, అనేకరెట్లు వృద్ధిచేసుకోగలడు. దుర్భిణీయంత్రంద్వారా అతడు నక్షత్రమండలాన్ని సమీాపించగలడు. జంతువులీ పని చేయలేవు. మానవుడు పశువులను తన వశంలో ఉంచుకోగలడు. అతడు దేశకాలాలను ఆవిరి, విద్యుచ్ఛక్తి మొదలైనసాధనాలవల్ల రూపుమాపగలడు. పశువులు పొందలేని శీఘ్రమువగతిని పొందగలడు. ప్రపంచంలో ఎచ్చటికన్నా ఒక్కక్షణంలో సందేశము నంపగలడు. వాయుమండలంలో సంచరించగలడు. జగత్తులో మానవుడు ఇలాంటి శక్తులను చైతన్యమును, అధికారమును చూపగలడు. జంతువుల కిట్టి

శక్తులులేవు. కనుక జంతువులు, మానవునికన్న జీవశక్తిలో చాలా తక్కువస్థితిలో ఉన్నవి.

ఇకవృక్షాలను జంతుసంతితో పోల్చిచూడండి. వృక్షాలుకూడా వృద్ధియౌతుంటవి. అవి కదలికను చూపుతవి. కాని వాటి చలనం ఎప్పుడూ ఒకదిక్కులోనే ఉంటుంది. ఇవి ఎంతసేపటికి ఊర్ధ్వానికే పోగలవు. కాని స్థలాంతరానికి కదలలేవు. అవి ఒకచోటే పాతుకొని యుంటాయి. అవి వాటిశాఖలను నాలుగువైపులకు ప్రసరింపజేస్తాయి. వేళ్ళను భూమిలో పాతుకొనేలాగు చేయగలవు. కనుక వాటిలోఉండే చైతన్యము, శక్తి, కదలిక మొదలగునవి, జంతుజాలంలో ఉన్నంతగా లేవని విశదమవుతున్నది. శక్తిని ప్రదర్శించడంలో జంతువులకన్నా వృక్షాలు చాలాతక్కువస్థితిలో ఉన్నవి. ఖనిజాల్లో జీవితమే లేదని చెప్పుతారు. జీవశాస్త్రవేత్తలు నిర్వచించేవిధంగా మనం జీవితాన్ని నిర్వచిస్తే-వాటిలో ప్రాణంలేదని చెప్పాలె. కాని శక్తిని ప్రదర్శించడం కదలికనుచూపడంకూడ జీవితచిహ్నాలే అని మనం ఒప్పుకొంటే, వాటిలోగూడా సంచలనం ఉన్నది. అవికూడ మార్పు పొందుతుంటవి. మార్పువాటికీ ఆవశ్యకమే.

అవి చూపేశక్తి, కదలిక చైతన్యం మొదలైనవి-అతిస్వల్పంగా ఉంటుంది. ప్రాణశక్తి వాటిలో చాలాకొద్దిగా ఉండడంచేత, పైకి కన్పించదు. మనకు అగపడేశక్తి కదలిక మొదలగువాటియొక్క తారతమ్యాలబట్టియే ప్రాణం ఎక్కువగా ఉన్నదనీ తక్కువగా ఉన్నదనీ, మనం నిశ్చయిస్తున్నాము.

## ప్రకృతి పునశ్చరణ

ప్రకృతినియతిలో-కొత్తదనమేమీలేదు. మనకు బాహ్యంగా, ఎన్నివైవిధ్యాలు, బహుళనామరూప విభేధాలు గోచరించినా, ఈ ప్రకృతి-ఈజగత్తు-ఒకవిధంగా నిరుపేదరాలే. ప్రేమికుని కన్నీటి బిందువులను ఏధర్మం పరిపాలిస్తున్నదో, ఆ ధర్మమే, సూర్య చంద్రులగతిని గూడా పాలిస్తున్నది. అణువు మొదలు నక్షత్రమండలంవరకూ ఉండే సమస్తాన్నీ పాలించే ఆ ఏకరసాత్మక సర్వసామాన్యధర్మాలను మనం

వ్రేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. ప్రకృతి ఎప్పుడూ ఆత్మపునశ్చరణ చేస్తుంటుంది. ఈ విశ్వమును మనం ఒకమరమేకుతోగాని, చుట్టలు చుట్టలుగా చుట్టుకొనిఉండే తీగెతోగాని పోల్చవచ్చు. ఇందులో చుట్టలన్నీ ఒకేమాదిరిగా ఉంటవి. లేకపోతే, దాన్ని మన మొక ఉల్లి పాయతో పోల్చవచ్చు. ఒకపొరతీస్తే, అలాంటిదే ఇంకొక పొర వస్తుంది. దాన్నితీస్తే అలాంటిదే ఇంకొకపొర వస్తుంది. ఇట్లే మనం ఒకసంవత్సరంలో చూచే కలాపాన్నంతా సూక్ష్మరూపంలో ప్రతిఇరవై నాల్గుగంటలలో చూడగలం. ప్రాతఃకాలమును వసంతకాలముతో పోల్చవచ్చు. మధ్యాహ్నకాలమును, గీష్మఋతువుగా పోల్చవచ్చు. సాయంకాలమును ఆకురాలుకాలంతోనూ, రాత్రిని శీతాకాలంతోను పోల్చవచ్చు. సంవత్సరచర్యఅంతా ఇరవైనాల్గుగంటల్లో ఎట్లు పునస్సృష్టిచేయబడిందో చూడండి. మానవరూపమును ధరించడానికి పూర్వం తానుఅనుభవించిన జీవితపరిణామములన్నీ గర్భస్థశిశువు అత్యల్పవ్యవధిలోనే మరలప్రకటిస్తుంది. చేప, కుక్క, కోతి మొదలగు రూపములన్నిటినీ ఒకటివెంబడి ఇంకొకటి కడుపులో ఉన్నపిండం తాల్చిన పిదపనే మానవాకారం ఏర్పడుతున్నది. ఇట్లే ఈ పరిణామ క్రమాన్ని అనుసరించి ఈ విశ్వపాలకధర్మనియతి ననుసరించి, మానవ రూపంలోగూడ, ఖనిజావస్థ వృక్షావస్థ జంతుస్థితి, ప్రదర్శింపబడుతున్నవో, లేదో కొంచెం చూడవలసియున్నది. మానవులలో ఖనిజావస్థలోనిమానవులు, వృక్షావస్థలోనిమానవులు, పాశవికావస్థలోని మానవులు లేరా? మరి మానవులలో సత్యమానవులు, దేవజాతి మానవులుకూడా ఉన్నారేమో చూద్దాము. మానవఖనిజములను తీసికొందాం.

## ఖనిజజాతి మానవులు

ఖనిజాల్లో శక్తి, కదలిక, చైతన్యం మొదలైనవి చాలా తక్కువగా ఉంటాయి. మొత్తంమీద వాటిలోగూడ పెరగడం విరగడం మార్పుపొందడం కలవని ఒప్పుకోవలసిఉంది. సముద్రంతో పోలిస్తే ఈ భూమి ఒకచోట మెరకగామారడం, మరిఒకచోట పల్లమగుచుండడం, వివిధ పరివర్తనాలను పొందడం, జరుగుతున్నది.

అందుచేత పైకి కనబడకపోయినా, ఖనిజప్రపంచంలోకూడా ఒకరక మైన చైతన్యం, శక్తి, ఉన్నది.

ఇట్టి చలనాన్ని, ఇట్టి కించిచ్ఛక్తిని మాత్రమే చూపుమానవులు ఏవర్గంలో చేరుతారు? కుఱ్ఱవాడు బొంగరం తిప్పడం మొదలుపెడ తాడు. ఆ బొంగరం అంతకంతకూ వడిగా తిరగడం మొదలు పెడు తుంది. అప్పుడది తిరగనట్లే కనిపిస్తుంది. పిల్లలు బొంగర మాగి పోయిందని చప్పట్లుకొడుతూ అరుస్తుంటారు. బొంగరం కదలడం లేదు; కదలడంలేదు; నిలబడిపోయింది – అని వాండ్లు గంతులేస్తారు. ఇదే తనచుట్టూ తాను తిరగడం. బొంగరం తిరుగుతున్నది. కేంద్ర స్థానంలోనే ఉండి తనచుట్టూ తాను తిరుగుతున్నది. ఖనిజాల్లో ఉన్న కదలిక – ఈ బొంగరం తనచుట్టూతాను పరిభ్రమించడంవంటి – దని చెప్పవచ్చు. దాన్ని మనం పైబొమ్మలోని ఆ చిన్నసున్నాతో – ఆ చుక్కతో – పోల్చవచ్చు.

ఈ ప్రపంచమందలి చలనమంతా వృత్తాకృతిలో ఉంటుందని మీకు తెలుసు. చలనం సరళ రేఖాకృతిలో ఉండదు. శాస్త్రాలు దీన్ని రుజువుచేస్తున్నవి. అందుకే కదలికను నిరూపించడానికి మన మీ వృత్తా లను ఉపయోగిస్తున్నాము. గణితంలో చలనం రేఖలద్వారా తెలిజేయ బడుతుంది. ప్రస్తుత విషయం వృత్తాకార రేఖలద్వారా మనకు విస్పష్టమవుతుంది.

అక్కడక్కడే నిలిచి తిరుగుబొంగరంవంటి అత్యల్ప చైతన్యము గల బొమ్మలోని బిందువువంటి అతి సంకుచితవలయము గల జడ మానవులు ఖనిజములాగాక మరెవరు? ఈ ఖనిజజాతి మానవులు తమ కుక్షికే, తమ శరీర పోషణానికే ప్రాకులాడుతూ, అసత్యాత్మ కొఱకే తమ జీవితాన్ని ధారపోస్తుంటారు. స్వార్థమే వాండ్ల పర మార్థం. వాండ్లెంతవరకూ విషయులాలసత్వానికే ప్రాకులాడు తుంటారు. ఇదే మనుష్యునిలోని అధమాధమస్థితి. వాండ్లు కదలికను చూపిస్తారు. కృషిచేస్తుంటారు, అన్నిపనులు నిర్వర్తించగలరు. కానీ వారి ఆశయ మెంతవరకూ తమదేహమే తమ ఇంద్రియ సుఖాను

భూతే, విషయోప భోగమే వాండ్ల పరమావధి. తుదకు తమభార్యా బిడ్డలు తిండిలేక మలమల మాడుతున్నా లెక్కచేయనివారు కొంద రున్నారు. చుట్టుప్రక్కల వాండ్లు బ్రతకనీ, చావనీ, వారికి పట్టదు. ఏమి జరిగినాసరే తినడం, త్రాగడం, దేహాన్ని మఱచి విషయ లాలసత్వంలో మునిగి తేలుతూ ఉంటారు. కుటుంబం, జాతి, సంఘం, ఏది ఎటు నాశనమైనా సరే విషయేచ్ఛ! విషయేచ్ఛ! వాటి సంతృప్తి-ఇవే వారిపరమార్థం! శరీరమే వారి కేంద్రం. దేహమే వాండ్ల దేవుడు. దానికే ప్రదక్షిణాలు. ఇట్టివారిచైతన్యం శవచైతన్యం. ఇదే మనమానవునిలోని ఖనిజావస్థ! నీచస్థితి. ఈజగచ్చరిత్రలో మనం అనేక మందిగొప్పగొప్ప మానవఖనిజాలనుగూర్చికూడా వింటాము. రాళ్లలో కూడ మణులు, కెంపులూ, వజ్రాలు మొదలైన వున్నవి. అయినా అవి ఖనిజాలేకదా!

రోమ్ సార్వభౌములైన నీరో, టైబీరియసు, సీజరు మొదలైన వాండ్ల పేర్లు చెప్పితే, మీ. శరీరాలు కంపిస్తాయి. మీరు అపవిత్రు లౌతారు. వాండ్లు గొప్పచక్రవర్తులు, ఏకచ్ఛత్రాధిపత్యంగా పాలించిన మహారాజులు, అయితే నేమి? తమరాజ్య ప్రయోజనాలను గడ్డి పరకల్లాగ నిర్లక్ష్యంగా చూచారు. స్నేహితులను, బంధువులను వాండ్లు స్వప్నంలోనైనా తలిచిందిలేదు. తమ క్షుద్రతృష్ణను తీర్చు కోవడమే వారి ఆదర్శం. రాణులు, ప్రజాసందోహం, మంత్రులు మొదలైనవాండ్లందరూ మట్టిపాలైనాసరే! వాండ్లకు నిమిత్తంలేదు. వాండ్ల ఘోరకృత్యాలు, వాండ్లుచేసినదురంతాలు, చరిత్రఘోషిస్తునే ఉన్నది. వాండ్లలో ఒకడు పగలంతా మద్రసోపేతంగా తినడమే పనిగా పెట్టుకున్నాడు. ఒకసారి తినేది, మళ్ళీతినేది, మళ్ళీ తినేది ఇట్లా ఎన్ని సార్లు తినగలడు? ప్రకృతి సహించలేక తిరుగుబాటుచేసింది. రోగం వచ్చింది. మందులవల్ల అదంతా కక్కింపబడింది. కొంచెం తేలిక కాగానే అతడు మళ్ళీతినడంప్రారంభించేవాడు. తినడమే వాని బ్రతుకు. వానికి కడుపే కైలాసం.

నీరోచక్రవర్తి తనరోమ్‌సామ్రాజ్యానికంతటికీ, అంటే అప్పటి ప్రపంచానికంతటికీ ముఖ్యపట్టణమైనరోమ్‌నగరాన్నే దావాగ్నికిచూచి

వినోదించాలనే కోరికతో తగులబెట్టించి, ఒకపర్వతమెక్కి వీణ వాయించుకొంటూ, ఆనందించాడు. ఇలాంటివాళ్ళను మీరు ఎందులో పరిగణిస్తారు? వీండ్లు వజ్రాలే కావచ్చు, మణులే కావచ్చు, కానీ మానవులుమాత్రం కాదు. వీండ్లే మానవకోటిలోని ఖనిజాలు-రాళ్ళు-పాషాణాలు.

## వృక్షజాతి మానవులు

ఇక మానవుల్లో వృక్షజాతివా రున్నారు. ఖనిజజాతివారికన్నా వీరివలయాలు పెద్దవి. ఖనిజజాతివారికంటే వీండ్లుఉదారులు. వాండ్లల్లో ఉన్నంతస్వార్థం వీండ్లలో లేదు. వీరి చైతన్యమును మనం పందెపు గుడ్డుపరుగుతో పోల్చవచ్చు. పందెపుగుడ్డం బొంగరానికన్నా పెద్ద వృత్తాన్నే చుట్టుతున్నది. 'బి' కేంద్రంగాగల రెండవసున్న దీన్ని చూపుతున్నది. ఈ మానవులు ఏతరగతికి చెందుతారు? వీరు కేవలం తమ శరీరసౌఖ్యాలనే చూచుకుంటూ ఎవరిప్రయోజనాలనైనా భగ్నంచేసి ఆనందించేవారు కారు. వీరు తమబంధువులవరకు తమతో కలుపుకుంటారు. వీరు తమకుటుంబంవరకు పోతారు. వీరు తమ శరీరపోషణాదులనేగాక తమభార్యాబిడ్డలమేలుకూడా చూస్తారు. అందుకే మొదటివారికన్నా వీరు ఎక్కువ. మనకు కనపడే ద్వితీయవృత్తంలో మరికొన్ని చిన్నవృత్తాలున్నట్లే, వీరి ఆవరణలో ఇంకా కొందరు వ్యక్తు లుంటారు. తమస్వార్థాన్నేగాక వీరు మరికొంతమంది స్వార్థాన్నికూడ చూస్తున్నారు. కానీ అంతమాత్రంచేత వీరికి స్వార్థం లే దనుకున్నారా? స్వార్థం ఉన్నది. తమకుటుంబంవరకే వారి ఆత్మ వికసించింది. ఖనిజజాతి మానవులలో స్వదేహాంతప్ప మ రేదీ లేదు. ఈ వృక్షజాతి మానవులలో స్వార్థం మరికొంతఅధికంగా సంస్కరింపబడింది. వీండ్లు తమకుటుంబావరణవరకూ చాలామంచి వారనడంలో సందేహంలేదు. పటంలో రెండవవృత్తాన్ని చూడండి. దాని పరిధిలో ఉన్నవాటినన్నిటిని అది ఆవరిస్తున్నది, ఆశ్లేషిస్తున్నది, రక్షిస్తున్నది. ఆవరణకు వెలుపలఉన్న వాటిపట్ల తిరస్కారాన్ని చూపుతున్నది. చేతులనుజాపి మన మొక వలయాకారాన్ని కల్పిస్తాము ఇది ఒక ఆవరణను నిర్మిస్తున్నది. ఈ వలయంలో కుటుంబమునకుమాత్రమే స్థానమున్నది. ఈ ఆవరణలోపల

ఉన్న వారిపట్ల మాత్రం ప్రేమ, ఆదరణ చూపించబడుతున్నది. కాని దానికిబహిః ప్రదేశంలో ఉన్న విశ్వమంతా తిరస్కరింపబడడం జరుగుతున్నది.

కనుక ఈ రెండవతరగతివారు వృక్షజాతికి చెందిన మానవులు. తమకుటుంబమువరకు వాండ్లప్రేమ వికసిస్తుంది. దాన్ని దాటి పైకి పోవడంలేదు, కనుక ఒకకుటుంబానికీ మరొకకుటుంబానికీ ప్రయోజనాలు భేదించినపుడు, తగవులు, పుట్టుతున్నవి. ఒక కుటుంబంలోనివారికీ మరొకకుటుంబంలోనివారికీ, కలతలు, ద్వేషాలు, సంఘర్షణను సంఘటిస్తున్నవి.

## పశుజాతి మానవులు

ఇక మనం మూడవవృత్తంవద్దకు వద్దాము. వీండ్లు పశుజాతికి చెందినమానవులు. అంటే మానవస్వరూపంలో ఉన్న పశువు లన్న మాట. 'సి' కేంద్రంగాగల ఈవృత్తం తక్కినరెంటికన్నా పెద్దదిగా ఉన్నది. దీన్ని మనం సముద్రవాయువుల వలయంతో పోల్చవచ్చు. దేహంతోను కుటుంబంతోను ఆగిపోయే మనుష్యుల్లాగా కాక ఈజాతివారు మరికొంతముందుకు పోతున్నారు. వీరు తమకులంవరకు తమ ప్రేమనుప్రసరిస్తున్నారు. వీ రొకకులంతో ఏకమవుతారు. వీరువృక్షజాతివారికంటే ఎక్కువఉత్తములు. ఉదారులు. వీరికేంద్రం తమఅల్ప శరీరాన్ని దాటింది. అదిచాలాదూరంవరకూ పోయింది. అనేక కుటుంబాలు, అనేకవ్యక్తులు వీరిపరిధిలోపల ఉంటున్నారు. వీరు తమ స్వంతమేలేకాకుండా, ఒకకుటుంబపుమేలేకాకుండా, ఒకకులంయొక్క మేలును చూస్తుంటారు. వీరొకకులంవరకు ఆవరించుకోగలరు. వీండ్ల ప్రేమ ఒకకులంవరకు ప్రసరిస్తుంది. అయితే వీండ్లలో స్వార్థం లేదా? ఎందుకులేదు? ఉన్నది. వారి ఆత్మ ఒక్కతమకులంలో మాత్రమే ఏకీభవిస్తుంది. కాబట్టి వీరేమిచేసినా తమ కులంకొఱకే చేస్తుంటారు. కనుక ఇతరకులాలప్రయోజనాలకు, తమకులంయొక్క ప్రయోజనాలకు వ్యతిరేకతవచ్చినప్పుడు వీరు ఇతరకులాలను పారద్రోలుతారు. ఇతర కులాలపట్ల, ఇతరజాతులపట్ల వీరిభావాలు వ్యతిరేకంగా ఉంటవి. కనుక

ఇచ్చట కులానికీ, కులానికీ వైరంవస్తున్నది. ఒకకులంలోనివ్యక్తులు మరొకకులంలోని వ్యక్తులతో పోరాటాలు సాగిస్తున్నారు. ఇక్కడొక కులానికి మేలుజరిగితే, మరొకకులం అంతకంటే ఎక్కువస్థానాన్ని పొందు తున్నది. కులాల్లో పోరాటాలు లేస్తున్నవి. దీనివల్ల ఎంతఅసంతృప్తి చెలరేగుతున్నది! అయినా, వృక్షజాతి మానవులకన్నా ఈ స్వకులాభి మానులైన పశుజాతిమానవులే శ్రేష్ఠులు.

ప్రకృతి నియతి ఏమంటే – మనం ఒక్కచోటనే ప్రగతిశూన్యులమై కదలకుండ నిలువకూడదు. ముందుకు పోవాలె; ముందుకు పోవాలె! మనం మహాప్రస్థాన యాత్రలో ఆగకూడదు. స్తబ్ధత్వమునకు బలికాకూడదు. మార్పు, అభివృద్ధి అనేవి జరుగుతుండాలె; ఖనిజ జాతికి చెందిన మానవులు వృక్షజాతికి, వృక్షజాతికి చెందినవారు పశు జాతికి, పశుజాతివారింకాపైకి, అధిగమించాలె. అనర్థమంతా, ప్రమాదమంతా, దోషమంతా, అక్రమమంతా, ఎక్కడ కలుగు తుందంటే మనం ముందుకుపోక ఒక్కచోటనే ఉండి, అభివృద్ధిని విసర్జించి ఏదో అంధ విశ్వాసానికి స్వాతంత్ర్యాన్ని విక్రయించడం లోనే కలుగుతున్నది. ప్రతివాడు ఈ యవస్థలన్నింటినీ దాటవలసిందే! ఎప్పుడో ఒకప్పుడిది తప్పదు. అందుకని దానినే అంటిపెట్టుకొని ఎప్పుడూ ఆ విధంగానే ఉండడందోషం. ఈ పశుస్థితిలో ఆగిపోవడం దానికి బద్ధులవడం మానవ లక్షణం కాదు. ఒక పట్టణంలో నిప్పు అంటుకొని తగులబడడం జరిగింది. ఒక స్త్రీ నగరాన్ని వదలి పారి పోతూ వెనుకకు తిరిగిచూచింది. చిరకాలం నివసించిన స్వనగరాన్ని విడిచిపోవడం ఆమెకు యిష్టంలేక, వెనుకకు తిరిగిపోవాలె అనుకున్నది. ఇంతలో ఆ పెనుమంట ఆమెను చుట్టిముట్టి దహించివేసింది. ఇట్లే జీవిత మహాప్రస్థానంలో నిరంతరం ముందుకు పోక ఒకచోట నిలచి పోయేవాండ్లు ఆహుతి అవుతారు. నామరూపాలకు అమ్ముడుపోయి అభివృద్ధిని పోగొట్టుకుంటారు. జడత్వం, దురభిమానం, వాండ్లలో నుంచి బయలుదేరుతుంది. జడత్వమూ, దురభిమానమే దుర్గతికి కారణం. పశుజాతిమానవులు, ఆ దశలోనే ఆగిపోక ముందుకుపోవాలె, పురోగమించాలె.

## మానవజాతి మానవులు :

మనం నాలుగవ వృత్తంవద్దకు వద్దాము. దాని కేంద్రం 'డి' ఇక్కడ మానవజాతికి చెందిన మానవుని చూస్తున్నాము. ఇతడు మానవస్థితికి అధిరోహించిన సాధారణ మానవుడు. ఇతని పరిధిని చంద్రవలయంతో పోల్చవచ్చు. చంద్రుడు భూమిచుట్టూ వలయాకారంగా తిరుగుతాడు. ఆ చంద్రగతి గలిగిన మానవులెవరు ? ఈ చంద్రగతిగల మానవుల యావరణం అతివిశాలమైనది. ఇతని ప్రగతి ఘనమైనదే. ఇతడు తన ఆత్మను జాతి అంతటితో-స్వదేశ మంతటితో ఐక్యం చేశాడు. మనం ఇతనిని దేశభక్తు డనవచ్చు. ఇతని ఆవరణ మెంతో విశాల మైనది. కనుకనే ఇతడు పనిచేసేటప్పుడు కులవిచక్షణత ఉండదు. కుల, వర్ణ, శాఖామతముల పాటింపక స్వదేశీయులందరికీ మేలు చేకూర్చడానికే శక్తి నితడు ధారపోస్తాడు. ఇట్టి మానవుడు వందనీయుడే, అయినా ఇతడు మానవమాత్రుడుగానే పరిగణింప బడతాడు. ఈ చంద్రగతిగల మానవులు - ఈ దేశభక్తులు - ఈ మానవ మానవులు యింకా ముందుకు పోవాలె. లేకపోతే ఈ స్థితిలోకూడ సంపూర్ణ స్వార్థ నివృత్తి కాదు. చెడు పూర్తిగా పోవడం లేదు. చూడండి; చంద్రుడు సముద్రంలో విప్లవమును కల్పిస్తున్నాడు. తరంగకులమును పుట్టిస్తున్నాడు. ఆటుపోట్లను కలిగిస్తున్నాడు. ఉన్మాద జనులకు ఉద్విగ్నతను కలిగిస్తున్నాడు. అందుచేత చంద్రగతికి వచ్చిన మానవులు ఆ దశలోనే స్తంభించి కూర్చుంటే, వాండ్లలోకూడా స్వార్థం ముదిరి, అపాయకర మవుతుంది. విప్లవాలు దురుద్రేకాలు, యుద్ధోన్మాదాలు బయలుదేరుతవి. ఒక దేశం మరొక దేశంతో ఢీకొంటుంది. రక్తవాహినులు ప్రవహిస్తాయి. సుందరమైన క్షోణీమాత ముఖారవిందం, రక్తపంకిలమై భీషణంగా మారిపోతుంది.

ఈ మానవ మానవులు, ఈ దేశభక్తులు, తమ పరిధివరకు ఉత్తములే. తమ ఆవరణలో చేరినవారి వరకు వీండ్లు మంచివాండ్లే. కాని తమ ఆవరణకు ఆవలివారి విషయంలో వీరి విధానం ఏ రకంగా ఉంటుందో చూడండి. వాషింగ్టను అమెరికావారికి మంచివాడే కానీ అతణ్ణిగురించి ఇంగ్లీషువారిని ఏమంటారో అడిగిచూడండి. ఆంగ్ల దేశ

భక్తులు వారి దేశానికి చెందినంతవరకు సజ్జనులే. కాని వాండ్లు తమ దేశభక్తి పేర ఏ దేశీయుల రక్తాన్ని జుర్రుకొంటున్నారో ఆ దేశీయుల దృష్టితో - ఒక్కసారి వారివైపు పరికించండి.

## ముక్తపురుషులు

తుదకు మనం ఐదవ వృత్తం వద్దకు వద్దాము. ఇక్కడ కేంద్రం అనంత దూరానికి ప్రాలింది. కేంద్రంనుండి వృత్తానికిపోయే రేఖ అనంతమైంది. మరి ఈ వృత్తముయొక్క విషయం? కేంద్రంనుండి వృత్తమునకు పోయేరేఖ అనంతమైనప్పుడు వృత్తం సరళరేఖగా మారుతుంది. దాని వక్రత్వమంతా పోతుంది. ఈ వృత్తం సరళ రేఖగా మారింది, నిర్వక్రమైంది. సరళరేఖ ఎక్కడైనా సమంగాను, సరళంగానూ పోతుంది. దానికి ఒకదాన్ని ఆవరించడం మరియొకదాన్ని బహిష్కరించడం అనే గుణాలు లేవు. వక్రమంతా పోయింది. ఖండ దృష్టి సంపూర్ణంగా నశించింది. ఈ అఖండ ప్రేమవికాస మానవులే దేవమానవులు. వీరి వృత్తాన్ని సూర్యుని వృత్తంతో పోల్చుకోవచ్చు. సూర్యగతి సరళరేఖలో ఉంటుంది. అంటే కేంద్రంనుండి వృత్తమునకు పోయేరేఖ అనంతమైంది. సూర్యుడు సంపూర్ణ తేజోమూర్తి ఈ వృత్త కేంద్రం అంతటా ఉన్నది. అవధి (పరిధి) మాత్రం ఎక్కడా లేదు. ఇదే దివ్య వృత్తం. వీండ్లు ముక్తపురుషులు. సమస్త శోక భయాందోళనములనుండి, సమస్త శారీరక వాంఛలనుండి, సమస్త స్వార్థమునుండి, అహంభావమునుండి వీండ్లు విముక్తులు. వీండ్లలో స్వార్థంలేశమైనా ఉంటుందా? ఉండదు! ఈ మహాదశకు అధిగమించని వరకే స్వార్థం. సరళరేఖలో స్వార్థావరణం ఉంటుందా? సరళరేఖ సరళరేఖే - దానిలో ఖండత్వమే ఉండదు. అది ఎక్కడాకూడా ఒక ఆవరణమును కల్పించుకోదు. ఇక్కడ స్వార్థమంతా నశించింది, అంటే సత్యాత్మ ప్రాప్తి కలిగింది.

ప్రారంభంలో చిన్న చుక్కతో మొదలు పెట్టాం. అదే అధమా ధమమైన స్వార్థదశ. ఆత్మయొక్క ఆ వికాసదశ, ఈ బిందువు అంత కంతకు వికాసమును పొందుతూ చివరకు సరళరేఖగా మారింది.

ఈ పరిణత మానవులే దివ్యపురుషులు. ఈ దివ్యమానవులకు విశాల ప్రపంచమే ఇల్లు కులము, వర్ణము, సంఘము, మతం, జాతి, దేశం - అనేవాటికి ఈ మహాత్ములు అతీతులు. మీరాంగ్లేయులు కాండి; అమెరికనులు కాండి; హిందువులు కాండి! మహమ్మదీయులు కాండి; బౌద్ధులు కాండి. ఎవరైనా కాండి. మీరందరూ రాముని ఆత్మ స్వరూపులే! సాక్షాదాత్మ స్వరూపులే! ఈ విశాల జగత్తంతా, ఈ విశ్వమంతా, నా ఆత్మే! నేనే! ఇక్కడ క్షుద్రాహంకారం వికశించి మహదంకారరూపం ధరించింది.

ఇట్టి పరిపూర్ణ ముక్తస్థితి కధిగమించిన దివ్యపురుషుని దగ్గర కొకశిష్యుడు వచ్చి ఒక సంవత్సరం సేవ చేశాడు. విద్యాభ్యాసానంతరం అతడు గురువువద్ద సెలవు పుచ్చుకొని స్వగృహోన్ముఖుడై పోయేముందు, భారతదేశాచార ప్రకారం పాదాలపై వ్రాలి సాష్టాంగ దండప్రణామాలుచేసి గురు వియోగమునకు విచారపడడం మొదలుపెట్టాడు. గురువు మందహాసంతో ఆతనిని లేవనెత్తి ఇట్లన్నాడు. నీ వింకా ఘనతరవిషయాలెన్నో నేర్చుకోవలసి యున్నది. మరికొంతకాలం ఉండాలె, ఆ విధంగానే ఆ శిష్యుడు మరికొంత కాలము గురుసేవచేసి ఆత్మ వికాసమును పొందాడు. దివ్యజ్ఞానాన్ని పొందాడు. అతని హృదయం బ్రహ్మజ్ఞాన పూర్ణమైంది. ఆ తన్మయత్వంలో అతడు గురువు ననిగాని, శిష్యుడ ననిగాని - సంస్కృతికూడా లేక, గురుసన్నిధినుండి నిష్క్రమించాడు. సమస్త విశ్వము నాతడు తన ఆత్మగా దర్శిస్తూ నిర్గమించాడు. సమస్త విశ్వమూ ఆతని ఆత్మయే - స్వస్వరూపమే - అయినప్పుడు, ఆత్మ రూపమైన ఆతడింక ఎక్కడికి పోగలడు? ఆతడు జగమంతా తానే - తన నిజాత్మే - అని గ్రహించాడు. ఈ జగత్తంతా తన నిజాత్మే అయినప్పుడు అతడు పోయే దెచ్చటికి? అతని నిజాత్మే ప్రతి అణువులో ప్రతి స్థలంలో ప్రతి దేశంలో నిండి వున్నప్పుడు, అది పోయేదెచ్చటికి? వెళ్ళడం రావడం పోవడం - అనేవి అతనికి అర్థరహితాలైనవి, ఆత డాత్మ జ్ఞానమును పొందాడు. అతని నిజాత్మ సర్వాంతర్వర్తియైన సర్వవ్యాపియైన పరమాత్మ - అని తెలుసుకున్నాడు. అతడు తనలో తానున్నాడు.

దేహచలనం ఒక ప్రతిబింబ సంచలనం వంటిది. అప్పుడు గురువు సంతోషించాడు. ఈ విధంగా గురు పతనిని పరీక్షించి అతని శక్తిని కనుగొన్నాడు. శిష్యుడు గురువుకు నమస్కారాదులు చేయలేదు. అతడు గురువుతో ఐక్యమై పోవడంచేత, కృతజ్ఞతా భావంకూడా వదలిపోయింది. తన బోధలు శిష్యుడు నిజంగా గ్రహించాడని గురువు ఆనందపడ్డాడు. గౌరవాలనుకూడా అగౌరంగా తృణీకరించే దివ్యస్థితిలోనే గురుమహద్దశ ఉన్నది. "నేనీ దేహంలో బద్ధుణ్ణి కాదు. నేనీ సంకుచిత దేహమాత్రుడను కాదు – నేను విశాల విశ్వరూపిని. నేనే నీవు. నీలో నన్ను సమర్చించు." – అని సత్యే గురువు బోధిస్తాడు.

ఈ స్థితిలో ఉన్న మానవుడు దేనికీ బానిసగాడు. అతనికి దేహాభిమానం లేదు. గౌరవాగౌరవాలు అర్థంలేనివి. కీర్త్యపకీర్తులు మిధ్య.

భారతవర్షంలో ఒకరాజు ఒకయతీశ్వరుని సమీపించి ప్రణమిల్లాడు. ఆసన్న్యాసి, "నీవెందుకు నమస్కరిస్తున్నావు"అని రాజును ప్రశ్నించాడు. రాజు "మహాత్మా! నీవొక మహాసన్న్యాసివి. నీవిదివరలో రాజ్యపరిపాలనం చేసేవాడవు. దాన్ని త్యజించి నీవీ ఆశ్రమాన్ని స్వీకరించావు. నీవు మహాత్యాగివి. అందుచేత నేను దేవునిగా ఎంచి నీకు నమస్కరిస్తున్నాను"అని అన్నాడు. ఇక్కడలాగా భారతదేశంలో మానవులు వారిసంపదలనుబట్టి గౌరవింపబడరు. వారిత్యాగమునుబట్టే గౌరవింపబడతారు. భారతీయులకు ఆరాధ్యవస్తువు ద్రవ్యంకాదు–దైవం. అప్పుడాసన్న్యాసి ఇట్లన్నాడు : "అదే కారణమైతే నీకు నేనే మ్రొక్కాలె, నమస్కరించాలె. నీ పాదాలు ప్రక్షాళనంచేయాలె,ఓరాజా! ఈప్రపంచంలో ఉన్న సన్న్యాసులందరిత్యాగాన్ని కలిపినా, నీత్యాగానికి సరిపోదు." రాజాశ్చర్యపడి "అదెట్లుస్వామీ ?" అన్నాడు. సన్న్యాసి ఇట్లు నిర్వచించాడు. "ఒకనికొక దివ్యభవనమున్నది. అతడు అందులోనుండి వెలువడే దుమ్ము, ధూళి, చెత్తా మొదలైన మలినపదార్థమంతా వెలికితుడిచివేసి త్యాగం చేస్తుంటాడు. ఆ భవనంమాత్రం త్యజించడు. దాన్ని తనదిగా ఉంచుకుంటాడు. అట్టివాడు త్యాగేనా ?" ఆరాజు, "అతడు త్యాగి"కా

డన్నాడు. "మరియొకడు మాలిన్యమంతా తానేఉంచుకొని, తనదివ్య మందిరమునే త్యాగంచేస్తాడు. అత డెటువంటివాడు ?" అని సన్న్యాసి అడిగాడు. "అతడే త్యాగి"అని రా జన్నాడు. "కనుకనే రాజా! నీవే సత్యమైనత్యాగివి, నీవు నీ నిజాత్మను, పరమాత్మను, నీ ఆనంద ధామమును నీ దివ్యభవనమును, త్యాగంచేశావు; ఆ భవనమాలిన్యాన్ని మాత్రమే నీవు ఉంచుకొన్నావు నీ దేహామునుమాత్రమే నీక్షుద్ర స్వార్థమునుమాత్రమే, నీవు మిగుల్చుకొన్నావు. నేను దేన్నీ త్యాగం చేయలేదు. నేనుత్యాగం చేయడానికి రెండవవస్తువే లేదు. నేను సమస్త విశ్వరూపు డైనపరమాత్మను, నాకు మినహా యేదీ లేదు. నేను దేవాదిదేవుడను"అని ఆ సన్న్యాసి వచించాడు.

కొందఱు వెఱ్ఱిమానవులు ఇట్టిముక్తపురుషులను, ఇట్టి పరమో త్కృష్టస్థితినధిష్ఠించినవారిని, వెఱ్ఱివాండ్లని హేళనగా చూస్తారు. కానీ తమబ్రహ్మైశ్వర్యజనిత మహానందమును, మీా సృష్టిలోనున్న సర్వస్వమునూ సమర్పించినా, అణుమాత్రమైనా త్యజించడానికి ఒప్పు కుంటారేమో అడగండి! వాండ్లెన్నడూ ఒప్పుకోరు. ఒప్పుకోరు. ఆ మహాపురుషులు విషయసుఖాలవెంటబడి వేసారుతున్నా, ధనవంతుల మని అనుకొనేవారిదైన్యానికీ, నీచజీవితానికీ, దరిద్రపుబ్రతుకుకూ, విచారిస్తారు. ఈ ఐశ్వర్యవంతులు ఒకమహాఆషూల్యవస్తువు నమ్ము కొని, అడుక్కుతింటున్నారు. బ్రహ్మానందం మీాలోనే ఉన్నది. మహా దైశ్వర్యమంతా మీాలోనే ఉన్నది. బిచ్చగాండ్రలాగా దరిద్రులవలె బిచ్చమెత్తుకుంటూ దైన్యపడడం దేనికి ? మీా సత్యాత్మను గ్రహిం చండి? సర్వశక్తిమయమైన స్వస్వరూపబ్రహ్మమును సందర్శించండి ! బ్రహ్మానందపరవశులై ఈ గీతము నాలాపించండి!

కిరణలేశము, చండమార్తాండు డేనె !
అణువున "కిట నిల్వు"మని చెప్పినాడ.
గ్రహమండలములను తిరుగుమటంచు,
నేనె ఆజ్ఞాపించుచున్నాడ నిటుల ?
ఉదయరక్తారుణరాగంబు నేనె !
ఏనె సాయంకాల సులయమారుతము;

చిగురాకు మర్మరశబ్దంబు లేనె!
గంభీర సాగరగర్జన లేనె!
వల, వేటకాడు, విహగంబు మరియు
తత్పక్షిసంకులారవమును నేనె!
అద్దమందునదోచు ప్రతిబింబ మే నె!
శబ్దంబు తత్ప్రతిశబ్దంబు లేనె!
ప్రేమికుప్రణయాగ్ని, ప్రియురాలి ఉలుకు,
యోధు, డాతనిచంపు కరవాలధార,
ఆతని ముదుసలితల్లికన్నీళ్ళు,
పరవశత్వము, ద్రాక్షపండ్లు, తద్రసము
పిండుయంత్రమ్ము, కస్తూరియు. మధువు,
అతిథి, గృహస్థుడు, పాంథజనుండు,
తళతళ మెరసెడిమధుపాత్ర నేనె!
వేణువులోగల వాయువు నేనె!
నేనె మర్త్యునిమానసంబును; నేనె!
కాంచనకాంతి, వజ్రముల దీధితులు!
నేనె మౌక్తికగుచ్ఛశుభ్రరోచిస్సు!
విప్పారుచున్నగులాబిపుష్పంబు
ఆమె ఆస్థానమం దలరారుసుకవి –
కృష్ణపక్షియు, దానిమధురగీతికలు!
చెకుముక, నిప్పురవ్వలు, దానవెల్గు
మైనపువత్తియు, దానిపై కెగురు
శలభంబుసైతము నే నేను నేనె!
మంచియు, చెడుగును, రెండును నేనె!
కార్యకారణములు రెండును నేనె!
ఆకర్షణము, బలి, పాపి, నేరంబు
మొఱ, వానిపై వేయుశిక్షయు నేనె!
పూర్వమున్నది, ఇప్పు డుండునదియును
ముందుండబోవున దెల్లను నేనె!
ఈసృష్టి వృద్ధిక్షయంబులు నేనె!

జన్మము, జన్మపరంపర నేనె!
సర్వసృష్టిస్థితిలయములు నేనె!

ఓ పెహా! నీ ఆత్మైశ్వర్యం చక్రవర్తులవైభవాన్ని పరిహాస పాత్రంచేస్తుంది. అట్టి అద్భుతస్వర్గానివి నీవు. సచ్చిదానందస్వరూప పరబ్రహ్మవు నీవు!

ఓమ్ ఓమ్ ఓమ్

# సాంతములో అనంతము

[1903, జనవరి 10వ తేదీ, శాన్‌ఫ్రాన్సిస్ కో—గోల్డెన్‌గేట్
హాల్లో ఈయబడిన ఉపన్యాసం.]

అనంతాద్వితీయ బ్రహ్మస్వరూపులైన సోదరసోదరీ మణులారా !

అసలువిషయం మొదలుపెట్టేముందు ప్రపంచమున సభలకు వచ్చే జనాన్ని గురించి కొలదిమాటలు చెప్పవలసియున్నది.

సామాన్యంగా జనులు తమచెవులతో వినరు. ఇతరుల చెవులతో వింటారు స్వంత కండ్లతో చూడరు. స్నేహితుల కండ్లతో చూస్తారు. స్వాభిరుచితో రుచిచూడరు. అన్యాభిరుచితో రుచిచూస్తారు. ఎంత అన్యాయం! ప్రపంచ మానవులారా! మీ నిజ కర్ణాలను ఉపయోగించండి. మీ నిజ నేత్రాలను ఉపయోగించండి! మీ స్వబుద్ధిని ఉపయోగించండి! మీ కండ్లూ మీ చెవులూ వృధాగా లేవు. ఉపయోగం కోసం ఉన్నాయి.

ఒక రోజు రాముడు వీధుల్లో వెళ్ళుతున్నాడు. ఒక పెద్దమనిషి దగ్గరకు వచ్చి యీ విధంగా ప్రశ్నించాడు: "నీ వీ గుడ్డలు కట్టుకోవడంలో అర్థమేమిటి ? నీ వీ వస్త్రాలు దేనికి ధరించావు ? మా దృష్టిని దేనికి ఆకర్షిస్తావు ?" రాము డెప్పుడూ నవ్వుతాడు. చిరునవ్వు నవ్వుతాడు. మీరు హిందూ సన్న్యాసుల వస్త్రధారణకు ఆనందిస్తే, రాముడు మీ ఆనందమునుచూచి ఆనందిస్తాడు. ఈ వస్త్రధారణ మిమ్ము సంతోషంతో నింపివేస్తే మీచేత చిరునవ్వు నవ్విస్తే, మేము మీ చిరునవ్వుల్లోనుంచి ఆనందాన్ని పొందుతాము. మీ ఆనంద మందహాసాలు మా ఆనంద మందహాసాలె.

ఐతే దయచేసి సకారణులుగా ఉండండి. వార్తా పత్రికలు ఒక వ్యక్తిని దూషిస్తూనో భూషిస్తూనో వ్రాస్తే, దేశమంతా అదేవిధంగా వంతపాట పాడడం మొదలు పెడుతుంది. 'వార్తా పత్రిక లిట్లన్నవి, వార్తా పత్రిక లిట్లన్న' – వని జను లనుకోసాగుతారు. వార్తా పత్రికలలోని వార్తలకు మూల మేమిటి ? సాధారణంగా వార్తలు పంపే

వారు స్త్రీలూ పిల్లలే. వార్తా పత్రికలకు వచ్చేదంతా విజ్ఞాన వంతులైన విమర్శకులనుంచి రాదు. అధములైన పత్రికావిలేఖరుల నుంచి వస్తుంది. గొప్పవాడని పేరుపొందిన వాడొకడు ఒక వ్యక్తిని భూషిస్తే, జనులందరూ అతణ్ణి భూషిస్తారు. లేక ఆ గొప్ప వ్యక్తి దూషిస్తే, జనులందరూ అతణ్ణి దూషిస్తారు. ఇది స్వతంత్రంకాదు. స్వతంత్రమంటే – స్వేచ్ఛ అంటే – ప్రతి విషయంలో, మీ సొంత చెవులను ఉపయోగించడం, మీ సొంత కండ్లను ఉపయోగించడం, మీ సొంత బుద్ధిని ఉపయోగించి ఆలోచించడం.

"ఎందుకీ రంగుగుడ్డలు కట్టుకున్నావు?" అని అడిగినమనిషిని రాముడు, "ప్రియసోదరా! ఈ రంగుగుడ్డ దేనికి కట్టగూడదో, మరొక రంగుగుడ్డ దేనికి కట్టాలో నాకు తెలియజెప్పు. రాముడు, ఈరంగు గుడ్డకుబదులు నల్లరంగుగలగుడ్డో, తెల్లరంగుగలగుడ్డో ఎందుకు కట్టాలె? కారణం చెప్పు? ఈరంగుకట్టడంలో తప్పేమిటి?" అని అడిగాడు. అతనికి తప్పేమీ కనబడలేదు. "నా రంగుఎంత సుఖంగా ఉన్నదో, ఈ రంగూ అంతేసుఖంగా ఉన్నది. నావస్త్రంమాదిరే, ఈ వస్త్రంకూడా చలినుంచి, వేడినుంచి రక్షిస్తుంది. అన్నిరంగుల్లాగానే యిదికూడా ఒక మంచిరంగు. ఏదోఒకరంగులేనివస్త్ర ముండదు కదా! నలుపైనా రంగే, తెలుపైనా రంగే-ఎరుపైనా రంగే"—అని ఆ పెద్దమనిషి పలికాడు.

ఇప్పుడు చెప్పు–ఈరంగులో తప్పేమున్నదో? ఆతనికి తప్పేమీ కనపడలేదు. అప్పుడు రాము డాతనికి "నీమీద నీవు దయవహించు. నీకన్నులపై నీవు దయవహించు. నీచెవులపై నీవు దయవహించు. నీసొంతచెవులను ఉపయోగించుకో నీస్వంతకండ్లను ఉపయోగించుకో నీసొంతబుద్ధిని ఉపయోగించుకో స్వయంగా విచారించు. ఇతరుల అభిప్రాయాలతో ఆలోచించకు. అన్యాభిప్రాయాలచేత విభ్రాంతుడవు కావద్దు. పరాభిప్రాయవ్యామోహరూపకమైన దౌర్బల్యానికి ఎవ డెంతగా అతీతుడై నిలుస్తాడో ఆత డంతగా స్వతంత్రుడై దీపిస్తాడు" అని హితోపదేశంచేశాడు.

రాముని ఉపన్యాసాలను మీసొంత చెవులతో వినండి. మీ సొంతమనస్సులతో ఆలోచించండి. ఈ ఉపన్యాసాలను సరిగా విన్నట్లైతే, మీరు అపరిమితమైనలాభం పొందగల రని, మిమ్ములను మీరు సర్వభయాందోళనలకు, సర్వదుఃఖాలకు అతీతమైనస్థితిలో నిలుపుకోగల రని రాముడు వాగ్దానం చేస్తున్నాడు.

జనం మాకు కావలసింది ధన మంటారు. ధనం దేనికి? సుఖం కోస మని మీరంటారు. కానీ, ధనం సుఖాన్ని ఇయ్యలేదు. మీకు సుఖాన్ని ప్రసాదించే వస్తువు వేరొకటి ఉన్నది. దాన్ని గూర్చి మీ రిప్పుడు వినబోతున్నారు, కొందరు అప్పటికప్పుడు ఉద్రేకాన్ని కలిగించే ఉపన్యాసాలు కావా లంటారు. శిశుప్రాయులు కాకండి. శిశువుకు ఒక అమూల్యమైనరత్నమునూ, ఒక చెరుకుముక్కనూ చూపిస్తే, వెంటనే చెరకుముక్కను తీసుకుంటాడు. వానికి కావలసింది- తాత్కాలికమైనతీపి. రత్నముయొక్క విలువ తెలేక రత్నాన్ని తీసుకోడు. శిశువులై పోవద్దు.

కొన్నిసార్లు ఉపన్యాసాలు, వక్తృత్వాలు, తాత్కాలికమైన ఉద్రేకాన్ని కలిగిస్తాయి. వాటివల్ల మిగిలే దేమీ ఉండదు వాటిలో నిజతత్వం ఉండదు. శాశ్వతప్రభావం ఉండదు. అవి శిశువు లాశించే చెరకుముక్కల వంటివి. ఈ ప్రసంగాల్లో మీ కొకఅనశ్వరమైన, శాశ్వతమైన ప్రయోజనం సిద్ధిస్తుంది. విశ్వవిద్యాలయాల్లో, కళాశాలల్లో, విద్యార్థులు గంటలకొద్ది అధ్యాపకుల ఉపన్యాసాలను వింటారు. అధ్యాపకులు వక్తృత్వాన్ని ప్రదర్శించరు. ఏ భాషాలంకార నియమాలు పాటించరు. వాండ్లు సహజవిధానంలో, నెమ్మదిగా, ప్రశాంతముగా, మనస్సుకు పట్టేలాగు మరలమరల చెప్పతూ, ఉపన్యసిస్తారు! విద్యార్థులు, ఆ అధ్యాపకుల నోటినుండి వెలువడే ప్రతిమాటను అతి జాగ్రత్తతో వింటారు.

అలాగే నేడు రాముడు ప్రపంచమానవకోటికి తన సందేశమును వినిపిస్తాడు. తమ అధ్యాపకులవాక్కులను కళాశాలా విద్యార్థులు విన్నట్లు, ప్రపంచమానవు లాతనివాక్కులు వినవలసియున్నది. ఈ

మాటలు అహంభావపూరితము లని మీరెంచవచ్చు. కానీ ఒకా నొక కాలం రాబోతున్నది! అప్పుడు............*

ఈ రాత్రి చర్చనీయాంశం, 'సాంతములోని అనంతం.' తాత్త్విక విషయమును జనసామాన్యీకరించడం చాలాకష్టం. విజ్ఞానమును ప్రజా సామాన్యంచేయడం చాలాకష్టం.

"విజ్ఞానమే సౌశీల్య" మన్నాడు సోక్రటీసు. ఈ సూక్తి పరమ సత్యం. ఈ భావమే మానవజాతిని పరిపాలిస్తున్నది. విజ్ఞానమే మానవ జాతిని నడిపిస్తున్నది. విజ్ఞానమే సత్కార్యంగా పరిణమిస్తున్నది. మాకు విజ్ఞానంతో పనిలేదు. అప్పటికప్పుడే మాకు కర్మకనపడాలె— అని ప్రజ లంటారు. కానీ విజ్ఞానజనితముగాని, అప్పటికప్పుడే తయారైన కర్మ (Ready-made action) నిలవదు. మిమ్ము అఖండక్రియాశక్తి రూపులనుగా చేయగల విజ్ఞానామృతమును రాముడు మీకడకు తెస్తున్నాడు. ఈ జ్ఞానమును సర్వజననీనంచేయడం చాలాకష్టం. అయినా, ఈ మహాకఠినసమస్యను వీలున్నంతవరకు సులభంచేయడానికి ప్రయత్నిద్దాం.

ఈ లోకంలో మీరు భావింపగల వస్తువులన్నింటిలో— అతి చిన్న వస్తువుతో- మనం మనవిచారణ ప్రారంభిద్దాం. మీరు సర్వ సామాన్యంగా ప్రపంచంలోచూచే గసగసాలగింజనుగానీ, లేక ఆవ గింజనుగానీ లేక మరేదైనా చిన్నగింజనుగానీ తీసికోండి. ఆ గింజ ఎంతోచిన్నదిగా ఉంటుంది. దానిని అరచేతిలో పెట్టుకోండి. గింజ అంటే ఏమిటి? మీ అరచేతిలో కనపడుతున్న దేనా గింజ? లేక మీచే వాసనచూడబడుతున్న మీచే తూచబడుతున్న, మీచే స్పృశింప బడుతున్న దేనా గింజ? గింజంటే ఈ చిన్నపదార్థమేనా? లేక వేరొక వస్తువా? పరీక్షిద్దాం.

* పై వాక్యములు పలుకుతూ శ్రీ రామతీర్థస్వామివారు మౌనములో మునిగి పోయారు; తాను చూపించే పరమావధిని ప్రపంచం ఒక నాటికి గుర్తిస్తుందనీ, ఆధ్యాత్మికజీవనస్రవంతిలోని మధురామృతాన్ని తృప్తిదీర గ్రోలగలుగుతుందనీ, భావ సమాధిలో నిమగ్నులైనారు. —అనువాదకులు.

ఈగింజను భూమిలో నాటండి. కొద్దికాలంలో ఆగింజ— ఆవిత్తనం– ఒక అందమైన మొక్కగా మొలుస్తుంది. ఆ ఆదిబీజంలోంచి సముచితకాలంలో తిరిగి అనేకబీజాలు మనకు లభిస్తాయి. ఈ బీజాలు మళ్ళీనాటండి. మళ్ళీ ఇలాంటిబీజాలు వేనకువేలు మనకు లభిస్తాయి. ఈబీజాలు తిరిగి నాటితే. తిరిగి కోటానుకోట్లబీజాలు మనకు లభిస్తాయి. ఏమిటీచిత్రం? ఆ ఆదిబీజం– ఆ మూలబీజం– మొదట మనంనాటినబీజం– ఏమయింది? ఇప్పుడది ఎక్కడ ఉన్నది?

అది భూమిలో నశించింది. భూమిలో చచ్చిపోయింది. అది ఎక్కడా కనబడడంలేదు. కానీ ఆ ఆదిబీజంలోనుంచి ఇప్పుడు మనం అదేరకమైన అసంఖ్యాకబీజాలను పొందాము. ఎట్టి అఖండశక్తి, ఎట్టి అనంతశక్తి మనం మొదట స్వీకరించిన ఆ ఆదిబీజంలో దాగియున్నది?

ఇప్పుడు మళ్ళీ ప్రశ్న వేయబడుతున్నది. ఇక్కడొక బీజమున్నది – అన్నప్పుడు అర్థమేమిటి? బీజం – అనేపదానికి అర్థం – బీజముయొక్క ఆకృతీ, పరిణామమూ, బరువూ, వాసనా మొదలైనవనా? బీజమంటే కనపడుతున్నరూపమేనా? కాదు. కాదు. బాహ్యరూపమే బీజమైతే – ఆ విధమైన కృత్రిమబీజాన్ని మనం చేయవచ్చు. అదేరకమైన బరువు, ఆకృతి, వాసన, రుచీ – అన్నీ ఉన్న కృత్రిమ బీజాన్ని మనం చేయవచ్చు. కానీ ఈ కృత్రిమబీజం నిజమైనబీజమవుతుందా? కాదు. అది పిల్లలాడుకొనే బొమ్మ మాత్రమే. కానీ బీజం కాదు. ఇప్పుడు బీజము అనే పదానికి బాహ్యార్థమేగాక ఒకనిజమైన అర్థంకూడా ఉందని మనం తెలుసుకున్నాం. బీజము అన్న పదానికి బాహ్యార్థం – ఆకృతి, పరిమితి, భారం, వాసనా మొదలైన ఇంద్రియగోచరమైన గుణసముదాయం. కానీ బీజం అన్న పదముయొక్క సత్యార్థం – బీజాంతర్గతమైయున్న అనంతమైన అఖండమైన మహాశక్తి. ఇక్కడ మనం సాంతమునందు అనంతమును కనుగొంటున్నాము. అనంతశక్తి, అఖండ చైతన్యము, ఖండరూపంలో గుప్తమైయున్నది. కాబట్టి బీజము అన్నపదానికి నిజమైన అర్థం – అంతర్గతమైన అఖండశక్తియేగాని దాని బాహ్యరూపం కాదు.

బాహ్యశరీరం నశించినంతనే అంతర్గతమైన అనంతశక్తికూడా నశిస్తుందా? బీజరూపం నశిస్తుంది. బాహ్యబీజం భూమిలో నశిస్తుంది. కానీ ఆ నిజమైన బీజంకూడా – ఆ అనంతశక్తికూడా – నశిస్తుందా? నశించదు, నశించదు. ఎప్పటికీ నశించదు. అనంతశక్తి ఏవిధంగా అంత మొందుతుంది? అదెప్పుడూ నశించదు. ఆదిబీజ సంప్రదాయంలో వెయ్యోతరానికి చెందిన ఒక బీజాన్ని తీసికోండి. భూమిలో నాటండి. ఆ ఆదిబీజాంతర్గతమైన అనంతశక్తి ఏతత్సంప్రదాయంలో వచ్చిన ఈ బీజంలోగూడా ఉన్నదని మీరు తెలుసుకుంటారు. ఆదిబీజవంశానికి చెందిన ఈ నూతనబీజంలో ఆదిబీజాంతర్గతమైన ఆ అనంతశక్తే ప్రకాశిస్తున్నది. ఇప్పుడు 'బీజం' అన్నమాటకు నిజమైన అర్థం – అంతర్గతంగా ప్రకాశిస్తున్న అనంతశక్తే అనీ, అది ఆదిబీజంలో ఎట్లున్నదో అట్లే ఆదిబీజపు వెయ్యోతరానికి చెందిన నూతన బీజంలోకూడా ఏక రీతిగా వెలుగొందుతున్నదనీ మనం గ్రహించాము. ఈ అనంతశక్తి ఆది బీజంలోలాగే, కోట్లకొలది తరాలు గడచిన పిదప కలిగే బీజంలో కూడా ఒకేరీతి వెలుగొందుతుంది. కాబట్టి అంతర్గతమైన అనంతశక్తి ఆ అఖండ చైతన్యము, నిర్వికారమైంది. నిత్యమైంది. ఆ సత్యబీజము – ఆ అనంతశక్తి, ఆ అఖండ చైతన్యము – అవినాశమయింది. ఆదిబీజ శరీరం నశించినా ఆదిబీజ నిజస్వరూపమయిన అనంతశక్తి నశించడం లేదు. ఆ అనంతశక్తి శతశతాబ్దాలు గడిచినా సర్వదా, బీజపరంపరలో నిర్వికల్పమయి నిత్యమయి సాక్షాత్కరిస్తుంటుంది. బీజశరీరం నశించినా, అందలి సత్యమయిన అనంతశక్తి నశించదు. బీజముయొక్క ఆత్మ – అంటే – బీజాంతర్గతమయిన నిజమయిన అనంతశక్తి – నశించదు. అది మారదు. భూతభవిష్యద్వర్తమానకాలాల్లో – సర్వదా– ఒకే విధంగా నిర్వికల్పమయి వెలుగొందుతుంటుంది. ఇంతే కాదు. ఆ ఆదిబీజంలో ఉన్నమాదిరే, ఈనాడు మనకడనున్న బీజాలలోకూడా వికాసప్రదమయిన అభ్యుదయదాయకమయిన ఆ అనంతశక్తి, మార్పు లేక ఏకరీతిగా ప్రకాశిస్తున్నది. అది హానివృద్ధి క్షయాదులు లేక నిత్య నిర్వికారమయి యున్నది.

బీజం – అన్నమాటయొక్క నిజమయిన అర్థం మనకు తెలిసింది బీజాత్మ - బీజశక్తి - వృద్ధిక్షయాది వికారాలకు గురికాదు. సత్య బీజం, సర్వకాలసర్వావస్థల్లో ఒకేరీతి ప్రకాశిస్తుంటుంది. అది అనంతం. బీజశరీరం నశించినా అది నశించదు. అది అమరమయింది. అవికల్ప మయింది. వృద్ధి క్షయరహితమయింది.

(పునరుక్తులున్నట్లైతే క్షమించాలె. ఒక్కొకసారి సత్యనిరూప ణకు పునరుక్తి అవసర మని రాముడు తెలుసుకున్నాడు).

సూక్ష్మదర్శినిద్వారా చూడబడే అతిసూక్ష్మజీవులను (ఏకకణ జీవులను) తీసికోండి. అవి ఏవిధంగా వృద్ధి పొందుతాయో తెలుసా? ప్రకృతిః ఒక్కొక్కటి రెండుగా చీలి వృద్ధి పొందుతాయి. ఒకసూక్ష్మ జీవిని తీసికోండి. ఒక సన్ననికత్తితో దాన్ని రెండు సమభాగాలు చేయండి. అట్లా చేస్తే అదేమవుతుంది? ఇది క్రూరకార్యమనిపిస్తుంది కదూ? ఎందుకంటే, మనిషిని రెండుగా ఖండిస్తే చస్తాడు. కానీ సూక్ష్మజీవిని ఖండిస్తే చావదు. విచిత్రం! కోస్తే రెండవతుంది. పూర్వం ఒక్క సూక్ష్మజీవి ఎంతపరిణామంలో ఉన్నదో ఇప్పుడు రెండూ అంతపరిణామాన్ని పొందుతాయి. ఈ రెంటినీ తిరిగి రెండుగా చీలిస్తే నాలుగు సూక్ష్మజీవు లవుతాయి. ఈవిధంగా చీలుస్తూ వాటి నెన్నైనా చేయవచ్చు. ఎంతచిత్రం! ఎంతచిత్రం!

మీరు చూస్తున్నది సూక్ష్మజీవియొక్క శరీరం. సూక్ష్మజీవి అన్నపదానికి బాహ్యార్థం- కేవలం శరీర మని. పరిమాణము, బరువూ, రంగూ మొదలైనగుణాలతో కూడిన ఆకృతి యని. ఇదే బాహ్యమయిన సూక్ష్మజీవి. కానీ నిజమయిన సూక్ష్మజీవి- అంతర్గతశక్తియై యున్నది. అంతర్గత జీవమై యున్నది. సూక్ష్మజీవిదేహం నశించినా, నిజమయిన సూక్ష్మజీవి- అంటే- అంతర్గతమయినఆత్మ- నశించదు. అది మరణిం చదు. అది నిత్యమై శాశ్వతమై, ఉంటుంది. దేహాలను ఖండిస్తూపోండి. శరీరాలను నశింపజేస్తూపోండి. దేహాలునశించినా ఆత్మ నశించదు. శారీరకమయిన మరణంవల్ల రూపనాశనం కలుగుతుంది మాత్రమే.

మీ నిజస్వరూపము- సత్యమయిన దైవత్వము- అనశ్వరమయినది. సూక్ష్మజీవియొక్క ఆది దేహం అసంఖ్యాక దేహాలుగా అభివృద్ధి పొందవచ్చు. ఈ అసంఖ్యాక దేహాలన్నిటిలో, సూక్ష్మజీవియొక్క ఆది దేహమున అంతర్గతమైయున్న అనంతశక్తే వెలుగొందుతున్నది. సాంతములో అనంతం! ఖండరూపాలలో అఖండపరమాత్మ!

దేహాలు అభివృద్ధిపొందుతున్నప్పుడు- సూక్ష్మజీవుల దేహాలు అసంఖ్యాకంగా అభివృద్ధిఅవుతున్నప్పుడు- అంతర్గతమయిన ఆ అనంత శక్తికూడా (ఆత్మకూడా) అభివృద్ధి పొందుతుందా? లేక అది క్షయించడం జరుగుతుందా? ఆ ఆత్మ- ఆ అనంతశక్తి- వృద్ధిగానీ, క్షయంగానీ పొందదు. అది సర్వదా ఏకరీతిగా వెలుగొందుతుంటుంది- సూక్ష్మజీవియొక్క బాహిరమయిన ఖండరూపంలోగల సత్యాఖండ శక్తి మారదు. పెరగదు. తరగదు. అది నిత్యనిర్వికారమై ప్రకాశిస్తుంటుంది.

దీనినిగూర్చిన వైదాంతిక వివరణం ఒక ఉదాహరణ ద్వారా యివ్వబడుతున్నది.

ఎన్నడూ అద్దం చూడనటువంటి ఒక పసిపిల్లవాడున్నాడు. ప్రాచ్యహిందూ దేశంలో చిన్నపిల్లలకు అద్దాలు చూపించరు. ఒక పసిపిల్లవాడు తండ్రిగదిలోకి తప్పటడుగులువేస్తూ పోయాడు. అక్కడ ఒక అద్దం గోడకు ఆనించబడి ఉన్నది. అద్దందగ్గరకుపోగానే పిల్లవానికి తనపాప అద్దంలో కనబడింది. చిన్నపిల్లలు చిన్నపిల్లలచేత ఆకర్షింపబడతారు-మీకు తెలుసా? మీకు పిల్లవాడున్నాడనుకోండి-వాణ్ణి తీసికొని ఒకస్నేహితునింటికి వెళ్ళుతారు. మీరు మీ స్నేహితునితో మాట్లాడుతుంటే, ఆ పిల్లవాడు, స్నేహితునియింట్లోఉన్న యితర చిన్నపిల్లలతో స్నేహంచేసుకుంటాడు. గదిలోనికి వెళ్ళినపిల్లవాడు అద్దంలో ప్రతిబింబాన్ని చూచుకున్నాడు. ప్రతిబింబంతో ఆడుకోసాగాడు. ప్రతిబింబం తన స్నేహితుడనుకున్నాడు. పెదవులూ, ముక్కూ ఆనించాడు. ప్రతిబింబంతో చేతులుచేతులుకలపడం మొదలైన శిశుచేష్టలన్నీ చేశాడు. అద్దంమీద చేయిబెట్టేసరికి అద్దం క్రిందపడి రెండు ముక్కలైంది.

ఇప్పుడు రెండు ప్రతిబింబాలు కనబడుతున్నాయి. ఈ చప్పుడు విని ఆ బాలునితల్లి గదిలోకి వచ్చింది. కొట్టేటట్టుగా వచ్చింది. పిల్లల కెక్కువ సంగతులు తెలుసు. తల్లికి కోపంవచ్చినా ఏమీచెయ్యదని తెలుసు. ఇక్కడేం చేస్తున్నావని వాళ్ళమ్మ అడిగినప్పుడు, ఆ బాలుడు, నే నిక్కడ ఇద్దరుపిల్లలను చేశా''నని సంతోషంతో సమాధానంచెప్పాడు. నిజానికి పిల్లవా డొక్కడే. అద్దం రెండుగా పగిలినందున ప్రతిబింబాలు రెండేర్పడ్డాయి. చిన్నపిల్లవాడు ఈదురాకముందే ఇద్దరుపిల్లలకు తండ్రైనాడు "అమ్మా! నేను ఇద్దరిపిల్లల్ని చేశాను, ఇద్దరుపిల్లల్ని చేశాను'' అని ఆబాలు డానందంతో కేరింతలుకొట్టాడు. తల్లి ముసి ముసినవ్వులు నవ్వుకుంటూ పిల్లవాణ్ణిప్రేమతో ఎత్తుకొని గదినుంచి వెళ్ళిపోయింది.

ఈరెండుఅద్దంముక్కలను తీసికొని ఆపిల్లవాడు నాలుగుగా పగలగొడితే, నలుగురుపిల్లలు వస్తారు. నాలుగుఅద్దంముక్కలను ఎని మిదిగా పగులకొడితే ఎనిమిదిమంది పిల్లలు వస్తారు. ఈ విధంగా ఎంత మందిపిల్లలనైనా సృష్టించవచ్చు. కానీ ఆ నిజమైనదివ్యత్వం-ఆ నిజమైన బాలుడు-అద్దపుముక్కలతోపాటు పెరగడంకానీ తరగడంగానీ జరుగు తున్నదా? పెరగడంగానీ తరగడంగానీ లేదు. అద్దాలలో తరగడం పెరగడ మున్నదిగానీ, అద్దాలలో ప్రతిబింబిస్తున్న అసలుబాలునిలో ఏమార్పులూ లేవు. అసలువస్తువులో ఏ వికల్పాలు లేవు. అనంత మెట్లు అభివృద్ధిపొందుతుంది? అనంతం అభివృద్ధిపొందితే అది సాంతమైనదే. అది ఖండపదార్థమే, అల్లే అనంతం ఏవిధంగా క్షయిస్తుంది, అది క్షయించేటట్లయితే అది అనంతం కాదు.

ఈ విధంగానే సూక్ష్మజీవులను ఖండించినప్పుడుకూడా, వేదాంత మిట్లు వివరిస్తున్నది. ఆ సూక్ష్మజీవిని తీసికొని మీరు రెండు భాగాలు చేస్తారు. అంటే అద్దమును రెండుగాచేసినట్లు శరీరాన్ని రెండుగా చేస్తారు. ఆ అద్దంలాగానే ఈసూక్ష్మజీవిశరీరంకూడా రెండు ముక్క లవుతుంది. కానీ అంతర్గతమైన ఆశక్తి, ఆ నిజమైన అనం తత్వము, ఆ అసలుసూక్ష్మజీవి, శరీరముతోపాటు రెండుగా విభజింప బడడంలేదు. ఆఅనంతశక్తినిమీరు ఆత్మ అనండి, శక్తి అనండి, దేవు

డనండి - ఏ పేరుతోనైనా పిలువండి. సూక్ష్మజీవిశరీరాలు పెరుగుతున్నప్పుడు, సూక్ష్మజీవిలోని శక్తి సత్యతత్త్వము, దేవత్వము పెరగడం లేదు. అది సర్వదా నిర్వికారంగా ప్రకాశిస్తున్నది. ఆ నిర్వికారాత్మ అసలైన బాలునివంటిది. సూక్ష్మజీవిశరీరాలు, అద్దపుముక్కలవంటివి. సూక్ష్మజీవియొక్క శరీరాలు ఖండఖండములై, ముక్కముక్కలై, అసంఖ్యాకంగా పెరిగిపోతున్నప్పుడు, ఆ అఖండ నిర్వికల్పశక్తి ఆ ఏకైక మూలచైతన్యము - ఆ అసంఖ్యాక శరీరాలన్నింటిలోను సమానంగా ప్రతిబింబిస్తున్నది. వ్యక్తమవుతున్నది. ప్రత్యక్షమవుతున్నది. వివిధాకృతులలో ఏవిధంగా వ్యక్తమవుతున్నా, ఆ పరమాత్మ సర్వదా నిర్వికారమై నిరంజనమై ఏకరీతిగా ప్రకాసిస్తున్నది. అది అద్వితీయం. అఖండం. ఏకైకం. ఆహా! ఎంత విచిత్రం! ఎంత ఆనందకరవిషయం! ఈ దేహాన్ని ఖండించండి! ముక్కలుముక్కలు చేయండి! నేను చావను. ఈ సత్యాత్మ - ఈసత్యమున 'అహం' -ఈ నిజమైన 'నేను' చావదు! బ్రతికిఉండగానే ఈ శరీరాన్ని భస్మీపటలం చేయండి! మీ యిష్టమువచ్చినట్లు చేయండి! అసలైన నాకు ఏ అపాయమూ అంటదు! ఈ అంతర్గతమైన అనంతాత్మయే మీ స్వస్వరూపమని తెలుసుకోండి! తత్త్వమసి! స్వస్వరూపబ్రహ్మానుభూతిని పొందండి! అహం బ్రహ్మాస్మి - నేను పరబ్రహ్మాను - నేను అనంతాత్మను - అని తన సత్యతత్వమును తెలుసుకున్న తత్ క్షణం, మానవుడు ముక్తుడవుతున్నాడు. సర్వాపాయములకు, సర్వదుఃఖాలకు, సర్వబాధలకు అతీతుడౌతున్నాడు. తత్త్వమసి - స్వస్వరూపజ్ఞానాన్ని పొందు! పరమాత్మవైన నీవు, నీవుగా ప్రకాశించు!

ఆహా! ఎంతవిచిత్రం! ఒకే అఖండశక్తి - ఒకే అనంతాత్మ - సర్వశరీరాలలో - సర్వరూపాలలో - సర్వవ్యక్తిత్వాలలో - ప్రకాశిస్తున్నది. ఆ అఖండశక్తిని - అనంతాత్మను - ఆ అద్వితీయ బ్రహ్మమును నేనే! నేనే! ప్రవక్తల దేహాల్లోనూ, మహాపురుషుల దేహాల్లోనూ, పాపాత్ముల దేహాల్లోనూ - ప్రకాశిస్తున్నది నేనే! ఆహా! మహానందం! నే నఖండ బ్రహ్మమును. ఈ బాహ్యదేహాన్ని కాదు - అని తెలిసికోండి. మీరు ముక్తులై వెలుగొందుతారు. ఇవి వట్టి

మాటలు కావు. ఇది ఊహాగానం కాదు. సత్యాతిసత్య మిదే. మీరు సత్యశక్తి స్వరూపులన్న, అనంత చైతన్య స్వరూపు లన్న సత్యాతిసత్యమును గ్రహించండి! తత్క్షణమందే, సమస్త భయాపాయములకు సమస్తశోకాకులతలకు అతీతులై నిలుస్తారు.

ఈ ప్రపంచమనేది వేయి అద్దా లమర్చబడిన భవన మనుకోండి. ఒకఅద్దం నల్లటిది.ఇంకొకటి తెల్లటిది.మరొకటి ఎఱ్ఱటిది. వేరొకటిపసుపు పచ్చది. ఇంకొకటి ఆకుపచ్చది. వేరొకటి భూతద్దం. ఇ ట్లనేకరకాలైన అద్దాలున్నాయి. ఈ అద్దాలయింట్లో మధ్య ఒకమనిషి నిలువబడతాడు. చుట్టూ చూస్తాడు. అతడు ఎఱ్ఱనిఅద్దంలో ఎఱ్ఱగా కనిపిస్తాడు. వేరొక అద్దంలో పసుపుపచ్చగా కనిపిస్తాడు. ఇంకొక అద్దంలో నల్లగా కనిపిస్తాడు, మరొకఅద్దంలో కురూపిగా కనబడతాడు. రకరకాల అద్దాలలో ఆతడు రకరకాలగా కనపడతాడు. వివిధదర్పణాల్లో వివిధప్రతిబింబాలు కనబడతాయి. ప్రతిబింబాలుమారినా, బాహ్యరూపాలు భిన్నభిన్నంగా ఉన్నా, అసంఖ్యాకంగా కనబడుతున్నా, అన్నిటిలో ప్రతిబింబిస్తున్న అసలుమానవుడు- మూలసత్యం- ఒకటే. అది అఖండమై, నిర్వికల్పమై, శాశ్వతమై, నిత్యసత్యమై, ఏకైకమై వెలుగొందుతుంటుంది. ఈ సత్యమును తెలిసికోండి! విముక్తులుకాండి! ఈ సత్యమును తెలిసికోండి! సమస్తదుఃఖాలను పారద్రోలండి! ఈ ప్రతిబింబ సంబంధమయిన వికల్పాలూ, వికారాలూ మూలసత్యమయిన అఖండాద్వితీయ బ్రహ్మమున కంటవు. ఒకే నిర్వికారసత్యము, నామరూప వైవిధ్యంలో ప్రకాశిస్తున్నది. దేహాల్లోనే భేదం. ఈ శరీరాలు, మనస్సులు, రకరకాల అద్దాలవిధంగా ఉన్నవి. ఈ భిన్నభిన్నంగా కనుపించే అద్దాలవంటి శరీరాలు మీరు కాదు. ఈ అనాత్మ మీరు కాదు. అజ్ఞానంచేత శరీరమే నే నని నీవు తలపోస్తున్నావు. నీవు శరీరానివి కావు. నీవు అనంత శక్తివి. నీ వఖండాద్వితీయ నిత్యనిర్వికార పరబ్రహ్మవు. తత్త్వమసి! పరబ్రహ్మవునీవు! నీ స్వస్వరూపబ్రహ్మమును తెలుసుకో! నీవు సమస్త బ్రహ్మాండంలో- సమస్త విశ్వంలో- వ్యాపించియుండడాన్ని చూడ గలుగుతావు.

భారతదేశంలో అద్దాల యిండ్లుంటాయి. అద్దాలయింట్లో అన్ని వైపుల అద్దా లమర్చబడియుంటాయి. గృహయజమాని ఆ గదిలోకి వచ్చి, ఆ అద్దాలలో తనను తాను చూచుకొని ఆనందిస్తాడు.

ఈరకం అద్దాల యింట్లోకి ఒకసారి ఒకకుక్క ప్రవేశించింది. ఆ కుక్క, తనవైపు కుక్కలగుంపు పరిగెత్తి వస్తున్నట్లు చూచింది కుక్కలకు అసూయ ఎక్కువన్న విషయం మీకు తెలుసు. కుక్కలకు పరాయికుక్కను చూస్తే గిట్టదు. వాటికి అసూయ అధికం. కుక్కల గుంపు ఎదురుగా వస్తున్నట్లు కనబడే సరికి, ఆకుక్క వేరొక ప్రక్కకు తిరిగింది. అటువైపు గోడంతా అద్దా లమర్చబడియున్నందున అటు నుంచికూడా కుక్కలగుంపు తనను చీల్చి చెండాడడానికి పరుగిడివస్తున్నట్లు దానికి కనబడింది. అది మూడో గోడవైపు తిరిగింది. అటు నుంచిగూడా కుక్కలగుంపు రావడం చూచింది. నాలుగో గోడవైపు తిరిగింది. అటువైపూ అంతే. పైకి చూచింది. పైనుంచికూడా వేల కొద్ది కుక్కలు తనను చీల్చివేయడానికి వస్తున్నట్లు కనబడింది. దానికి భయంపుట్టింది. అటూ ఇటూ గంతులు వేసింది. ఎటుబట్టినా వేలకొద్ది కుక్కలు తనపై దుముకుతున్నట్లు కనబడింది. అది అరవసాగింది. ప్రతిబింబాలుకూడా నోరు తెరచుకొని అరుస్తున్నట్లు కనబడింది. దాని అరుపే ఆ అద్దాలగదిలో ప్రతిధ్వనింపసాగింది, దాని గుండెపగిలింది. అది అటూయిటూ దుముకి నాలుగుమూలలకు పరుగెత్తి, పాపం అలసి క్రిందపడి చచ్చిపోయింది.

ప్రపంచం ఒక అద్దాల యిల్లువంటిది. దేహాలన్నీ రకరకాల అద్దాలు. వీనిలో ఆత్మ - స్వస్వరూపం - ప్రతిబింబిస్తున్నదని వేదాంతం ఉపదేశిస్తున్నది. కుక్క అద్దాలలో ప్రతిబింబించినట్లు, అద్వయము అనంతము అయిన ఆత్మ - ఏకము, అఖండమూ అయిన పరబ్రహ్మము- అనంతాదిశక్తి - విభిన్న శరీర దర్పణాలలో ప్రతిబింబిస్తున్నది ఈ సర్వశరీరాలలో ప్రతిబింబిస్తున్నది - అనంతాద్వితీయ దైవ రాముడే. కుక్కలమాదిరి, మూఢులు ప్రపంచంలోకి వచ్చి, అమ్మో వాడు నన్ను తింటాడు. వీడు నన్ను చీల్చి చెండాడుతా" - డంటారు. ఆహా! ఈ ప్రపంచంలో ఎంత అసూయ ఉన్నది! ఎంతభయ మున్నది!

కారణం. ఈ ప్రపంచ మనే అద్దాలయింట్లోకి గృహమృగంలాగా (కుక్కలాగా) రావద్దు. గృహపతిలాగా (ఇంటియజమానిలాగా) రా! ఈ ప్రపంచంలోకి కుక్క (D-O-G) వలె రావద్దు. కువలయేశుని (G-O-D) వలె రా! ఈ అద్దాల యింటికి నీ వధిపతివౌతావు. నీ శత్రువులయొక్క నీ సోదరుల యొక్క, నీకు వ్యతిరేకులైనవారియొక్క అభ్యున్నతికూడా నీ కానందం గొలుపుతుంది. ఈ ప్రపంచంలో ఎక్కడ ఏ మహాత్వం కనబడ్డా, అది నీ విభూతిగా ఆనందం గొలుపుతుంది. ఈ విశ్వమంతా నీకు వైకుంఠంగా మారిపోతుంది.

ఇప్పుడు మనం మానవునిగూర్చి విచారిద్దాం. బీజవిషయంలో- సాంతమునందు అనంతశక్తిని మీరు కనుగొన్నారు. ఇది శాక సామ్రాజ్యమునకు సంబంధించిన ఉదాహరణ. సూక్ష్మజీవి విషయంలో- సాంతమునందు అనంతము - మీకు చూపబడింది. ఈ విషయం జంతు సామ్రాజ్యమునకు సంబంధించిన ఉదాహరణ. అద్దం విషయంలో - సాంతమునందు అనంతమును మీరు దర్శించారు. ఈ విషయం, ఖనిజ సామ్రాజ్యానికి సంబంధించిన ఉదాహరణ. ఇప్పుడు మనం మానవుని విషయం తీసికొందాం.

ఆదిబీజం చచ్చి, అసంఖ్యాక బీజాలను సృష్టించింది. కానీ నిజానికి నిజబీజం - బీజాంతర్గతశక్తి - అభివృద్ధి పొందలేదు. నశించలేదు. అదిసర్వదా ఏకరీతిగానే ఉన్నది. ఆది సూక్ష్మజీవి చచ్చి అసంఖ్యాక సూక్ష్మజీవులను సృష్టించింది. కానీ, నిజమైన సూక్ష్మజీవి - సూక్ష్మజీవిలోని మూలశక్తి - మారడంగానీ మరణించడంగానీ లేక సర్వదా ఒకేరీతిగా ఉన్నది. అద్దంపగిలి అసంఖ్యాక ప్రతిబింబాలను సృష్టించింది. అయినా, అసలు పిల్లవాడు మారలేదు. ఇదేవిధంగా, ఒక మానవుడు మరణించినప్పుడు, అతని స్థానంలోనుంచి బహుళ సంతానం బయలుదేరుతున్నది. భారతదేశంలో ఆంగ్లోయిండియనులకు ఆంగ్లేయులకు, అధిక సంతాన ముంటుంది. తల్లిదండ్రులు మరణిస్తే, వారి స్థానంలో గుంపులు గుంపులు పిల్లలుంటారు. కొంత కాలానికి వాండ్లు కూడా మరణిస్తారు. వాండ్ల సంతానం మళ్ళా అభివృద్ధి పొందుతుంటుంది. వాండ్లు గతించినా, వాండ్ల వెనుక

బహుసంతానం నిలిచేఉంటుంది. ఆది సూక్ష్మజీవి నశించి, దాని స్థానంలోనే రెండు సూక్ష్మజీవులు బయలుదేరినట్లు, ఆ రెంటిలో నుంచి నాలుగు బయలుదేరినట్లు, ఆ నాల్గింటినుంచి ఎనిమిది బయలుదేరినట్లు, ఆదిబీజం నశించి, దానిద్వారా వేలకొద్ది బీజాలు లుద్భవించినట్లు, ఒక్క మానవ మిధునంలోనుంచి అసంఖ్యాక సంతాన పరంపర ఆవిర్భవిస్తుంటుంది.

విషయవిపులీకరణ కిప్పుడు సమయంలేదు. సంగ్రహప్రాయంగా చెప్పవలసివుంది.

బీజము, సూక్ష్మజీవి, అద్దము— మొదలైనవాటివిషయం వంటిదే మానవవిషయంకూడా— అని వేదాంతం నిర్వచిస్తున్నది. క్రైస్తవమతగ్రంథమైన బైబిల్— ఆదం, ఈవ్- అన్నపురాణదంపతులనుండి అసంఖ్యాక మానవకోటి ఉదయించినట్లు చెపుతుంది. ఆది దంపతులు గతించినా వారి సంతాన పరంపర సాగిపోతున్నది.

వేదాంతం – ఈ బాహ్య పరిణామమంతా, ఈ దృశ్యమానమైన అభివృద్ధిఅంతా, సత్యమానవునకు – సత్యమైన ఆత్మకు – నీ స్వస్వరూపమునకు– సంబంధించింది కాదని చెపుతున్నది. సత్యమానవు డే వికారం పొందడంలేదు. నీలోని సత్యమానవుడు – నీ నిజతత్వమైన ఆత్మ – అఖండమైనది; అఖిలవ్యాప్తమైనది. అద్వితీయమైనది. మానవుడు అనంతముయొక్క వ్యక్తీకరణ మని మీ రనవచ్చు. మానవులందరూ మరణించినా, ఒక మానవ మిథునం మిగులనీయండి. ఆ దంపతుల వల్లనే కాలక్రమంలో అసంఖ్యాక ప్రజానీక పరంపర బయలుదేరుతుంది. ఆ ఆది మిథునాంతర్గతమైన అనంతమహత్వము, అనంతశక్తి, అఖండచైతన్యము, వారి పరంపరకుచెందిన ప్రతిమిథునంలో – నేటికీ తరుగక పెరుగక ఏకరీతిగా ప్రకాశిస్తునే ఉన్నది. ఈ అనంతశక్తి వే నీవు! ఈ అనంతశక్తి - ఈ అఖండమహిమ– ఈ పరిపూర్ణచైతన్యము– నీ స్వస్వరూపమైయున్నది. ఈ అనంతశక్తే, సర్వశరీరాల్లో ప్రకాశిస్తున్నది. ఈ శరీరాలు అద్దాలమాదిరి అసంఖ్యాకం కావచ్చు. కానీ, మానవుడు – సత్యాత్మ – అనంతశక్తి ఒక్కటే. నీ వీ శరీరాలను

గొప్పగా ఎంచుకోవచ్చు. ఎట్లైనా తలపోయవచ్చు. కానీ ఈ శరీరాలు మాత్రం నీవు కావు. అద్వితీయమై, అఖండమై, నిత్యమై, నిర్వికల్పమై యున్న అనంతపరబ్రహ్మవు నీవు! నీవు సర్వకాలసర్వావస్థల్లోమారక ఏకరీతిగా వెలుగొందుతుంటావు. ఈ విషయం ఒకసామాన్యమైన ఉదాహరణతో ఇంకా విశదీకరింపబడుతుంది.

నీ వెవరవయ్యా? నేను ఫలానావాణ్ణి. సరేగాని నీవు మనిషివి గాదా? కాకేం? నేను మనిషినే. మరి నీవెవరు? నేను ఫలానా ఆమెను. నీవు మనిషి గాదా? ఆ! మనిషినే. ఎవరిదెగ్గరకైనా వెళ్ళి అడగండి. నేను మనిషి నని చెప్పడం వింటాము. కానీ ఒక తాత్త్విక దృష్టిలేని వ్యక్తిని అడగండి. తాను మనిషినని చెప్పడం జరగదు. నేను ఫలానావాడననో ఫలానా ఆమెననో చెప్పడం జరుగుతుంది. మీరు మానవులు—అని చెప్పినపిదప, వాండ్లుకూడా మేము మానవుల మని ఒప్పుకుంటారు.

మీ రెప్పుడైనా నిర్మలుడైన, వ్యష్టిత్వరహితుడైన, అవ్యక్తుడైన మానవుని చూచారా? ఆ సత్యమును మీ రెప్పుడైనా చూచారా? మన కెక్కడబట్టినా, స్త్రీయో పురుషుడో, ప్రత్యక్ష మవుతుంటారు. అంతేగాని, సత్యమానవుడు పురుషోత్తముడు – మీ కెక్కడా కనబడడు. అయినప్పటికీ, సర్వ వస్తుజాలంలో ఆ పురుషోత్తముడు సర్వోన్నతుడై వెలుగొందుచున్నట్లు మనం తెలిసికోగలం. నామరూపాది వికారములనుండి వేరుచేయబడిన సత్యమానవుని మీరు స్పృశించలేరు. ఈ గుణములనుండి విడదీయబడిన సత్యమానవుని మన మెక్కడా చూడలేకపోయినా, ఈ సత్యమానవుడు సర్వ శరీరాలలో ప్రకాశిస్తున్నాడు. ఒక మానవుని తీసుకరండి. వానిలోని సత్యమానవుని తొలగించండి – ఇంక మిగిలే దేమిటి? ఏమీ లేదు. సర్వశూన్యం. సర్వశూన్యం. నామాదులను తొలగించండి. మన కేమీ కనబడదు. కానీ, సత్య మానవు డుండే ఉన్నాడు. సత్య మానవు డంటే – రాముని అభిప్రాయం – అంతర్గతమైన శక్తియని, మీలోని అనంత చైతన్యమని. (ఇంద్రియగోచరమైనది మాత్రమే సత్యమని సిద్ధాంతీకరించిన) 'బర్కలే' మాటలకు మీరు మోస పోవద్దు. ప్రగా

ఢంగా పరిశీలించి పరిశోధించండి. చూడడానికి వీలులేని, వినడానికి అవకాశంలేని, రుచిచూడడానికి వలనుపడనిదైనా, మీరు చూచే వాటన్నిటియొక్క మూలస్రోతమై, సమస్త దృష్టికి కారణమై, సమస్త శబ్దానికి మూలమై, సమస్తరుచులకు హేతుభూతమై - ఒకానొక వస్తువు, ఒకానొక అనంతశక్తి అంతర్గతంగా ఉన్నదని మీరు గ్రహించగలుగుతారు.

మీరు గ్రహించునట్టి, చూచునట్టి, తాకునట్టి, వినునట్టి, ప్రతి పదార్థమందలి సత్య తత్వము - పరబ్రహ్మము - అదే. అది ఉన్నది. కానీ అది వర్ణనాతీతం - సాంతమునగల అనంతం (ఖండవస్తుజాల మందలి అఖండ బ్రహ్మము) చూచుటకు వీలులేనిది, వినుటకు వలను పడనిది - ఆలోచించుటకు అవకాశము లేనిది. కానీ, మీరు చూచే దంతా దానిద్వారానే, మీరు వినేదంతా దానిమూలంగానే, మీరు ఆఘ్రాణించేదంతా దానివలననే. అది వర్ణనాతీతం అయినా, వర్ణింప బడే వాటన్నిటియొక్క మూలాధారం - సారభూతం - అదే.

ఉపన్యాసాంతంలో మీకు మీ రోక మేలు చేకూర్చుకొన వలసినదిగా రాముడు కోరుతున్నాడు. మానవుడా! సత్యమానవుడవై-పురుషోత్తముడవై - ప్రకాశించు! ఈ శరీరాలన్నీ మంచుబిందువులు. సత్య మానవుడు, ఈ మంచుబిందువులన్నిటిలో ఏకసూత్రమై ప్రకాశిస్తున్న సూర్యకిరణం. ఈ శరీరాలన్నీ పూసలు. ఈ పూసలన్నిటిలో ఏకాత్మకంగా వెలుగొందుతున్న దివ్యసూత్రమే సత్యమానవుడు. ఒక్క క్షణం నీవు నిశ్చలంగా, కూర్చొని, నేను విశ్వ మానవుడను; నేను అనంతశక్తిని; - అని సంభావించు! ధ్యానంచెయ్యి! ఈ విశ్వ మంతా నీవుగా చూడగలుగుతావు. నేను మానవుడనై సర్వమునై యున్నాను. నేను అవ్యక్త మానవుడనై, వ్యక్తమానవుడనై, సర్వమునై యున్నాను. మీ రంతా ఒకటే! మీ రంతా ఒకటే! శవదృష్టిని వదలి శివదృష్టి వహించండి! నామరూపాది వికారాలకు అతీతులు కాండి! మీరు సమస్త విశ్వంతో ఒకటౌతారు.

ఇక్కడొక ఉపనిషద్గీతముయొక్క ఛాయానువాదం వినిపింపబడుతుంది.

"అహా! అదృశ్యంబైన ఆత్మను నేను!
జగదధిష్ఠాన భూతంబును నేను!
అగ్నిలో నేను జ్వలించుచున్నాను!
సూర్యచంద్ర గ్రహతారకలందు
నే ప్రకాశింతు వినిర్మలరీతి!
వాయువులందు నే వీయుచునుంటి!
అలలలో కలసి నే నాడుచునుంటి!
పురుషుడ నేనె! నేనె స్త్రీని గూడ!
అల యువకుడ నేనె! యువతిని నేనె!
కన్నులు దెరువని పసికందు నేనె!
కఱ్ఱూతగొనినట్టి శతవృద్ధు డేనె!
నేనె షట్పదమును! నేనె వ్యాఘ్రమును!
నేనె మత్స్యంబును! ఎఱ్ఱని కనుల
ఆకుపచ్చని పక్షిగణములు నేనె!
తృణలతా గుల్మ వృక్షాదులు నేనె!
మెఱపు తీవెలుగల మేఘాలు నేనె!
అఖిలంబు నేనె! ఈ యఖిలంబు నేనె!
ఋతువులు, వనధులు, నాలోనె గలవు!
జగము నాలో బుట్టి నాలో లయించు!

(సర్ ఎడ్విన్ ఆర్నాల్డు చేసిన ఉపనిషదను వాదము ననుసరించి)

నీవు అనంతుడవు! తత్త్వమసి! అఖండశక్తివైన నీవు ఈ మాయా దేహాలను సృష్టించుకొన్నావు. ఈ ప్రపంచ మనే అద్దాల యింటిని నీవే సృష్టించికొన్నావు. నీ స్వరూప మైన అనంతాద్వితీయ విశ్వమయ పరబ్రహ్మమును సర్వజగద్వ్యాపకుడైన పరమాత్మను విస్మరించకు!

ఓం! ఓం!! ఓం!!!

# కారణశరీరముపై ఆత్మసూర్యుడు

( 1903 సం॥ జనవరి 12వ తేదీన, శాన్‌ఫ్రాన్సిస్కో - గోల్డెన్‌గేట్ హాల్లో ఇచ్చిన ఉపన్యాసం )

నిత్యనిర్వికారబ్రహ్మస్వరూపులైన మహాశయులారా!

ఈ రాత్రి ప్రసంగవిషయం-అనిత్యప్రపంచమందలి నిత్యవస్తువు. అసలువిషయం చర్చించబోయేముందు, రాముణ్ణి తరచుగా ప్రశ్నించిన దానినిగూర్చి కొలదిమాటలు చెప్పవలసిఉంది. "నీవు కట్టుకొనే గుడ్డలయొక్క రంగుకు అర్థమేమిటి? బౌద్ధులు పసుపుపచ్చనిగుడ్డలు కట్టుకోవడ మెందుకు? వైదాంతికసాధువులుగానీ సన్న్యాసులుగానీ కాషాయవస్త్రాలు (అగ్నివర్ణ వస్త్రాలు) ధరిస్తారెందుకు?

ప్రతిమతంలోకూడా మూడుముఖ్యభాగా లుంటాయని మీకు తెలుసు. అవి-తాత్త్వికదర్శనము, పురాణము, కర్మకాండ. తాత్త్విక దర్శనంలేనిమతం నిలువదు. విద్వాంసులను విజ్ఞానులను, విచారపరులను సంతృప్తిపరచడానికి తాత్త్వికదర్శనం (Philosophy) అవసరం. రస పిపాసువులకోసరం పురాణ (Mythology) మవసరం. సామాన్య జనులకొరకు కర్మకాండ (Ritual) అవసరం.

గుడ్డలరంగుకూ వేదాంతమతకర్మకాండకూ ఒక అంతర్హితమైన సంబంధ మున్నది. క్రైస్తవులు, 'శిలువను' దేనికి ధరిస్తారు? శిలువను ధరించడం, క్రైస్తవకర్మకాండలో ఒకభాగం. చర్చిలమీద శిలువ నెందుకు స్థాపిస్తున్నారు? అది కర్మకాండ. 'రోమన్ కాథలిక్కు'లకు కావలసినంత కర్మకాండ ఉన్నది. 'ప్రొటెస్టెంట్ల'కు అంతకర్మకాండ లేకపోయినా, వాండ్లకుండే కర్మకాండ వాండ్లకున్నది. కాస్తోకూస్తో కర్మకాండ వాండ్లకూ తప్పలేదు. అందుచేత ఈ రంగు వేదాంతమతము లోని కర్మకాండకు సంబంధించింది. 'క్రాస్' (శిలువ) క్రైస్తవుల కెట్లాగో, కాషాయవస్త్రం, అగ్నివర్ణవస్త్రం, హిందువులకుకూడా అట్లాగే. 'శిలువ'యొక్క అర్థమేమిటి? అది క్రీస్తుయొక్క మర ణాన్ని, క్రీస్తుయొక్క ప్రేమను, స్మరింపజేస్తుంది. క్రీస్తు మానవులకొరకు

తన శరీరాన్ని శిలువకర్పించి బలిదానంచేశాడు. క్రైస్తవులు ధరించే 'క్రాస్ (శిలువ) యొక్క అర్థమిదే. హిందువును శిలువయొక్క అర్థాన్ని చెప్పమన్నట్లయితే, ఇంకొకవిధంగా నిర్వచిస్తాడు. "నీశిలువను నీవు తీసికొని న న్నుసరించు"-మని క్రీస్తు ఉపదేశించిన ట్లాతడు నిర్వచిస్తాడు. "నాశిలువను తీసుకో" - మని క్రీస్తు ఉపదేశించిన ట్లాతడు అర్థం చెప్పడు. బైబిల్లో, క్రొత్తనిబంధనలో, సెయింటు పాల్గానీ, క్రీస్తుగానీ, "నీశిలువను తీసుకో"-అన్నాడుగాని, "నాశిలువను తీసికో" అనలేదు. "నీశిలువను తీసికో" అన్నమాటకుఅర్థం - "నీ శరీరమును బలిచెయ్యి. నీ విషయాసక్తిని హతంచెయ్యి. నీ అనాత్మదృష్టిని హననంచెయ్యి. నీ అహంకృతిని శిలువవెయ్యి - అని. ఇదే, 'నీ శిలువను తీసుకో' అనే మాటయొక్క అసలైన అర్థం. 'శిలువ' - స్వార్థవాసనలను, శారీరక వ్యామోహమును, క్షుద్రాహంకృతిని, శిలువవెయ్యాలి - అనేభావాన్ని సూచిస్తుంది. శిలువయొక్క అర్థం, శిలువను ధరించడంలోని అర్థం ఇదే. మీరు శిలువను ఈ భావంతో స్వీకరించవచ్చు. లేదా వేరొకభావంతో స్వీకరించవచ్చు. అది మీయిష్టం మీద ఆధారపడియున్నది. కానీ వేదాంతం శిలువను మీ రీభావంతో స్వీకరింపగోరుతుంది. ఈ భావంతోనే బౌద్ధులు పసుపుపచ్చని గుడ్డలు ధరిస్తారు.

భారతదేశంలో పసుపుపచ్చనిరంగు మృతిచిహ్నం. మృతకళేబరం పసుపువన్నెగా ఉంటుంది. పసుపువన్నె గుడ్డలు, ఈ పసుపువన్నె గుడ్డలు ధరించిన మానవుడు తనశరీరమును బలిదానం చేశాడని, దేహదృష్టిని పరిత్యజించాడని, సమస్త స్వార్థవాసనల కతీతుడైనాడని సూచిస్తాయి. రోమన్ కాథలిక్కుల్లో ఒక ఆచారం ఉన్నది. సన్న్యాసిని శవపేటికలో పండుకోబెట్టి అతని శిరస్సువద్ద జోబ్ (Job) నుంచి ఒక ఘట్టాన్ని పఠిస్తారు. మరణించిన వాండ్లకోసం చదివే మంత్రాలు మొదలైనవి చదువుతారు. ఈ కర్మకలాపాలతో, శవపేటికయందు శయనించిన మానవుని, తాను మరణించినట్లు సంభావించేలాగు చేస్తారు. తాను సమస్తవిషయ వికారాలకు సమస్త ప్రాపంచిక కామవాసనలకు, చచ్చినవానిగా తలచేలాగు చేస్తారు. బౌద్ధులు, పసుపుపచ్చని

గుడ్డలు ధరిస్తారు. అవి స్వార్థాశయాలు ప్రాపంచికతృష్ణలు నశించిన వని సూచిస్తాయి. వేదాంతులు కాషాయాంబరాలు ధరిస్తారు. కాషాయ వర్ణమంటే అగ్నివర్ణ మన్నమాట. ఈ రంగు (శ్రీ స్వామివారు ధరించి యున్న వస్త్రమునకు గలరంగు). అచ్చం అగ్నివర్ణంకాదు. అమెరికాలో లభించే - అగ్నివర్ణానికి దగ్గరైన రంగిదే. భారతదేశంలో కాషాయవస్త్రాలు, అచ్చం అగ్నివర్ణంతో దీపిస్తుంటాయి. భారత దేశంలో ఎక్కడైనా కూర్చున్న ఒక సన్న్యాసిని అల్లంతదూరంలో చూచినప్పుడు, ఆ కనబడేది-మనిషో, మంటో, మనం వెంటనే గుర్తుపట్ట లేం. ఈ కాషాయవర్ణం అగ్నివర్ణానికి ప్రతీకం. అందుచేత కాషాయ వస్త్రధారియైనవాడు, తనశరీరమును దహించివేశాడని సూచింప బడుతుంది. హిందూదేశంలో చచ్చినమనిషిని పూడ్చరు. దహనం చేస్తారు. అగ్నివర్ణపుకాషాయవస్త్రమును ధరించడంలో అర్థ మేమి టంటే - ఈ వస్త్రములు ధరించినమానవుడు తనశరీరమును త్యాగం చేశా డని, తన దేహమును సత్యబలిపీఠమునకు సమర్పించుకున్నా డని, సమస్త ప్రాపంచిక వాంఛలు, దగ్ధపటలము కాబడినవని సమస్త ప్రాపం చిక వాసనలు, సమస్త ప్రాపంచిక తృష్ణలు, జ్ఞానాగ్నిజ్వాలల్లో ఆహుతి చేయ బడ్డాయి!

క్రాస్ (శిలువ) వర్ణంకూడా ఎరుపే. క్రీస్తురక్తంకూడా ఎరుపే. క్రైస్తవులుకూడా ఎరుపునే వాంఛిస్తున్నారు. హైందవుల కాషాయ వస్త్రంకూడా ఎరుపే. ఈ కాషాయవర్ణంలో రక్తవర్ణమూ అగ్ని వర్ణమూ ఉండడంలో - రెండర్థాలున్నవి. పసుపచ్చని రంగుకూడా శారీరకమరణమును, విషయవాసనామరణమును, సూచిస్తుంది. కానీ హైందవసన్న్యాసులు అగ్నివర్ణదీప్తములైన కాషాయవస్త్రాలే ధరి స్తారు. ఇందులో విశేషార్థ మున్నది. అగ్నివర్ణం - ఒక దృష్ట్యా మరణ మునూ, వేరొకదృష్ట్యా జీవమునూ, సూచిస్తుంది. అగ్నిలో జీవం ఉన్నది. అగ్నిలో చైతన్య మున్నది. అగ్నిలో శక్తి ఉన్నది. అగ్నిలో కర్మశక్తి ఉన్నది. అరుణవర్ణ రంజితమైన కాషాయాంబరం సమస్త పశువాసనలు, సమస్తస్వార్థవాంఛలు, సమస్త క్షుద్రవాసనలు, అగ్నిలో ఆహుతిచేయబడిన వనీ, నాశనముచేయబడిన వని, సూచి

స్తుంది ; వేరొకవైపు, అస్థానమునందుండి. నవచైతన్యం, నవజ్వాల, నవశక్తి, నవజీవం ఉదయించిందని సూచిస్తుంది. కాషాయాంబరానికి ద్వంద్వార్థ మున్నది. అది అహంకార మరణాన్ని, ఆత్మచైతన్యమయినవజీవనాన్ని - రెంటినీ సూచిస్తుంది. భయపడబోకండి! భయపడబోకండి! జలంతో పరిశుద్ధి (Baptism of water) చేయడానికి బదులు, వేదాంతం అగ్నితో పరిశుద్ధి (Baptism of fire) చేస్తుంది. వేదాంతం అగ్నిపరిశుద్ధి కర్మను, జ్వాలా పరిశుద్ధి కర్మను, శక్తి పరిశుద్ధి కర్మను ప్రబోధిస్తుంది. ఓహో! అగ్ని కాల్చివేస్తుందని భయపడకండి. "జీవితాన్ని రక్షించుకోదలచినవాడు, జీవితాన్ని వదలుకోవాలె" - అని బైబిలులో ఒక వాక్య ముంది. మాయా జీవితాన్ని పరిత్యజించండి. సత్యజీవితం లభిస్తుంది. ఇది సూత్రం. అయ్యో! ప్రపంచ మానవులు, బ్రతుకుకోసం ఎంత ఆందోళన పడుతున్నారు! తమలౌకిక జీవితాన్ని కారాగృహవాసంగా, మరణావస్థగా, నరకయాతనగా గడుపుతున్నారు. రాముని మన్నించండి. ఇది సత్యం. సత్యాం. ప్రపంచ మానవులు, దుఃఖహిమవత్పర్వతం క్రింద బడి నలిగిపోతున్నారు. పొరపాటు - హిమవత్పర్వతం అనకూడదు. హిమవంతం దివ్యశక్తిమయ మహాపర్వతం. ఒక మహాదుఃఖపర్వత మందాం. గడియారంలో పెండ్యులం అటూయిటూ ఏవిధంగా ఊగుతుంటుందో, ఆవిధంగా మానవులు నవ్వుకూ ఏడుపుకూ మధ్య, ఇతరుల ఆగ్రహానుగ్రహాల మధ్య, ఊగుతుంటారు. వాతావరణ స్థితిగతులకు బానిసలై యుంటారు. తమతమ విభ్రాంత భావాలతో తమకై తామే తమచుట్టూ కారాగృహాన్ని, మారణ కూపాన్ని, నరకగహ్వరాన్ని సృష్టించుకుంటారు.

ఈ పశు ప్రకృతినుంచి, అజ్ఞానము నుంచి విముక్తి పొందండని - వేదాంతము ఉద్ఘోషిస్తున్నది. ఈ అజ్ఞానమును దహించండి. ఈ క్షుద్రాహంకృతిని దహించండి. ఈ నీచస్వార్థ ప్రకృతిని దహించండి. మిమ్ము ఘోర నరకంలో క్షోభింప చేస్తున్న దేహమోహాన్ని దగ్ధం చేయండి. హిందువులు జ్ఞానమును అగ్నితో పోలుస్తారు. జ్ఞానాగ్నిలో

సమస్త ప్రాపంచిక మాలిన్యము దహింపబడుగాక. దివ్యాగ్ని, జ్ఞాన జ్వాల, ప్రజ్వలించుగాక ! ఇదే కాషాయ వర్ణసందేశం

ఒకరు రామణ్ణి అడిగారు; "మా దృష్టిని యెందుకు ఆకర్షిస్తా" వని. "నాగుడ్డలు నీ కేమన్నా హాని చేస్తున్నాయా ?" – అన్నాడు రాముడు. తన కేమీ లేదు. కాని ఇతరులు అట్లా అనుకొంటున్నారు; అని చెప్పాడతడు. అయితే ఇతరుల అజ్ఞానానికి నీవు బాధ్యుడవు కాదు. నీ స్వబుద్ధితో, నీ స్వదృష్టితో చూడు. ఈ వస్త్రాలలో యేమైనా చెడు కనబడితే చెప్పు. కనబడదా ఇతరుల దృష్టితో నీ కేంపని ?

మహా సాధుమూర్తి, భారతీయ సన్న్యాసి పుంగవుడు, ఈ యానత్ప్రపంచంలో ఏకైక మహాస్వామి – సూర్య భగవానుడు ! ఉదయ సూర్యుడు! ప్రతిదినము ఉదయసూర్యుడు వైదాంతిక సన్న్యాసి లాగ కాషాయ వర్ణ వేషంతో మీకు సాక్షాత్కరిస్తాడు. ఈ రాత్రి ఉపన్యాసంలో, అనిత్య శరీరాలలోని నిత్యత్వానికి ఈ సూర్యుడే మీకు ఉదాహరణగా చూపబడతాడు. ఈ సూర్యుని, ఈ స్వామిని, ఈ సాధువును, ఈ కాషాయవర్ణ తేజస్విని, – నిత్యమైన, నిర్వికల్పమైన, అఖండమైన, సర్వకాల సర్వావస్థలయందు మారక వెలిగే సత్యాత్మమైన పరమాత్మకు చిహ్నంగా తీసికుందాం

మానవునిలోని అనిత్య శరీరాలకు పోలికగా వుండే చంచలమైన అస్థిరమైన వస్తువులను పేర్కొందాం. మానవునిలో అనిత్య పదార్థాలున్నవి. నిత్యమైన శాశ్వతమైన పరమాత్మకూడ ప్రకాశిస్తున్నది. సత్యాత్మ (పరమాత్మ) సూర్యునిలాగ వున్నది. అనిత్య పదార్థాలు మూడు దేహాలుగా వున్నవి. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలని వీటిని సంస్కృతంలో పేర్కొంటారు. ఈ స్థూల సూక్ష్మ కారణ శరీరాలు మూడూ అనిత్యాలు, అస్థిరాలు. ఇవి ఆత్మకాదు. అనాత్మ. ఇవి అనిత్యమైనవి. ఈ అనిత్య రూపాలు నీవు కాదు. నీవు అఖండమైన నిత్యమైన పరమాత్మవు. ఈ విషయం ఇప్పుడు చూపబడుతుంది.

ఈ మూడు శరీరాలను గురించి, సత్యాత్మను గురించి మీకు విశదంచేయడానికి ఒక ఉదాహరణ మివ్వబడుతుంది. దయచేసి మీరు

జాగ్రత్తగా వినాలె ఈ వేళ. తార్కిక జటిల విషయాలు ప్రసంగింప బడవు. ఈ రాత్రి హైందవులచే నిరూపితమైన మానవుని సహజ రూపాన్ని గురించి, మీకు విశదీకరింపబడుతుంది. అవకాశమున్నట్లైతే తాత్త్విక హేతు పథాలలోకి చొచ్చి సర్వతోముఖంగా ఇంకొకసారి విచారిద్దాం. తర్కాన్ని ఉపయోగించే ముందు అసలు విషయాన్ని అర్థం చేసికోవాలె. అందుచేత ఈ రాత్రి అసలు విషయాన్ని అర్థం చేసికుందాం. సత్యాగ్రహణంలోనే, సత్యదర్శనంలోనే, సత్యనిరూపణం వుంటుంది. ఒక క్రైస్తవాచార్యుడన్నట్లు.

"సత్య మత్యంత సౌందర్య సంయుతము ;
దాని జూచినచాలు ప్రేమింపగలము".

సత్యము పరమ సౌందర్య సంభాసురమైనది. అది మీ హృదయాలలో సుప్రతిష్ఠితం కావడానికి దాన్ని మీరు సుస్పష్టంగా దర్శించడం మాత్రమే చేయవలసి వున్నది. సూర్యు డున్నాడని నిరూపించడానికి, ఇతర సాధనలతో పనిలేదు. సూర్య దర్శనమే సూర్య నిరూపణం. కాంతిలేని వస్తువులను చూడ్డానికి దీపం కావాలెకాని, దీపాన్ని చూడ్డానికి దీప మక్కరలేదు. తర్కాలతో వాదాలతో పనిలేకుండా, సత్యం మీముందు పెట్టబడుతుంది. సరే. మన మిప్పుడొక ఉదాహరణను తీసికుందాం.

రామునితో హిమాలయ శిఖరాలకు యాత్ర చెయ్యండి. అక్కడ మనకు మహాద్భుత ప్రకృతి - వజ్ర పర్వతాలు, పరిశుద్ధ ధవళ హిమ శిఖరాలు, ధగధగ మెరసిపోతూ చూపులకు మిరిమిట్లు గొలుపుతూ శివమయంగా కనపడే పర్వతాగ్రాల మహాసాగరం - కనపడుతుంది. అక్కడ వ్యవసాయం లేదు. జంతు జీవనం లేదు. మనుష్యుల పొలకువే లేదు. కాని అక్కడ ఆ పర్వతాగ్రాలపైన - ఒక చైతన్య మూలమును, ఒక మహాద్భుత అరుణ తేజమును, సూర్య బింబాన్ని చూడగలము, ఓహో! ఎంత మనోహర దృశ్యం! ఒక్కొక్కసారి మేఘ మాలికల్లోనుంచి జారి సూర్య తేజము భూమిమీద పడి, సమస్త ప్రకృతిని అగ్నివర్ణదీప్తం చేస్తుంది. సమస్త పృథ్విని కాషాయ

వర్ణంతో కప్పివేస్తుంది. ప్రకృతిని ఒక మహాసాధువుగా, భారతీయ సన్న్యాసిగా, మార్చివేస్తుంది. కాసేపటికి సమస్త ప్రకృతి బంగారు పూతతో వెలిగిపోతుంది. కానీ ఆ మహా ప్రకృతిలో కనపడేది ఒక్కడే! ఒక్కడే!! అ సూర్య భగవానుడే!

హిందూ స్థానములోని మహానదులన్నీ, ఈ పర్వత శృంగాల పైననే పుట్టినవి. భారతదేశములోని గొప్పగొప్ప నదులన్నీ ఈ పర్వత శిఖరాలపైననే పుట్టి క్రిందికి ప్రవహిస్తున్నాయి. నదియొక్క కారణ శరీరం ఈ పర్వతాగ్రాలలోనే ఉన్నది. ఇంక రామునితో కలిసి నదీ జీవనములోని ద్వితీయావస్థను దర్శించడానికి క్రిందికి పయనించండి

ఇక్కడ మనము మఱొక ప్రకృతిదృశ్యంలోకి వచ్చాము. అయితే మన మింకా పర్వతాలలోనే ఉన్నాం. కానీ మంచుకప్పిన కొండ శిఖరాలు కావివి. ఇవి హిమశిఖరాలకు దిగువ భాగాలు. ఇక్కడ మెల్లకుమెల్లు యెక్కడబట్టినా, అతి మనోహరములైన గులాబీల పొదలే. తీయని రోజాపూల సువాసనలు విజృంభించి గాలిలో నృత్యం చేస్తున్నాయి. నిరంతరం కృష్ణపక్షులు, రకరకాల వనవిహంగాలు, గానం చేస్తుంటాయి. రమ్యరమ్యములైన మహోన్నత వృక్షపంక్తుల మధ్య, ఈ పర్వతాలగుండా వంకరటింకరగా ఒయ్యారంగా నృత్యం చేస్తూ ప్రవహించే గంగానదిని మనం చూస్తాం. ఆహా! అందమైన సెలయేళ్ళూ, మనోహర నదీనదాలు, మన కిక్కడ కనిపిస్తాయి. ఒడ్డుల మీది చెట్లనీడలు నదీగర్భాలలో పడి, ఎంత మనోహరంగా వుంటవి! ఈ కొండవాగులు, యీ సెలయేళ్ళూ, ఎంతో ఒయ్యారంగా పాముల్లాగ మెలికలు తిరుగుతూ నిరంతరం మధుర గానంచేస్తూ ప్రవహిస్తుంటాయి.

ఇదేమిటి? ఇది నదియొక్క ద్వితీయావస్థ. నది యిక్కడ సూక్ష్మశరీరావస్థలో వున్నది. అంటే నదియొక్క యీ రూపం, నదియొక్క సూక్ష్మశరీరం అన్నమాట. ఈ సూక్ష్మశరీరం, నదియొక్క కారణశరీరంలోనుంచి జనించింది. సూర్యుడు నదియొక్క కారణ శరీరంమీద (హిమశృంగాలమీద) ప్రకాశిస్తున్న సంగతి మీకు

తెలుసు. సూర్యునియొక్క వేడి (తేజస్సు) నదియొక్క కారణ శరీరం మీద పడడంచేత, నది సూక్ష్మ శరీరం దాల్చింది. ఇదే సూక్ష్మ శరీరం. ఈ సూక్ష్మ శరీరం అతి చంచలమైనది. ఈ సూక్ష్మశరీర నది, క్రిందికీ పైకి గంతులువేస్తూ, త్రుళ్ళింతలు గొడుతూ, అటూ యిటూ ఊగిసలాడుతూ, అతి చాంచల్య గమనంతో వచ్చివచ్చి ఒక సరస్సులో (శాంతిస్థితిలో) కలుస్తున్నది. ఈ నదియొక్క ద్వితీయావస్థ అతి చంచలమైనది. తరళమైనది.

మరికొంత క్రిందికి దిగి మైదానాలలోకి వద్దాం. మైదానాలలో మన కనేక రకాల దృశ్యాలు కనపడుతున్నవి. హిమశృంగాలపైన కారణ శరీరావస్థలోనున్న ఆ నదే-పర్వత మధ్యభాగాలలోకి వచ్చేసరికి సూక్ష్మ శరీరావస్థలో అతి మనోహర కవితారూపం ధరించిన ఆ నదే-మైదానాల మీదికి వచ్చేసరికి బురదనీళ్లతో ప్రవహిస్తున్నది. ఆ నదే-ఆ గంగే-మైదానాలలో మహా ప్రవాహంగా మారింది. పెద్ద మార్పు చెందింది. నూతనవేషం వేసింది. వినూత్నరూపం ధరించింది. ఇప్పుడు దీనికి, ఆ మొట్టమొదటిఘనీభవస్థితులు లేవు. ఆరెండవ అతి చాంచల్య స్థితిలేదు. ఆ నైర్మల్యము లేదు. ఇట నీటిలోని స్వచ్ఛత మారింది. నీరు మురికై రంగుకూడ మారింది. నీరు అస్వచ్ఛమైంది. ప్రవాహవేగం కూడతగ్గింది. ప్రవాహవేగం తగ్గడమే కాకుండా, యిప్పుడు ఇతోధిక జనోపయోగకరంగాకూడా మారింది. ఇప్పుడ మహానదిపైన, నౌకాయనం సాగిపోతున్నది. జనులు, స్నానపానాదులు చేస్తున్నారు. కాలువలు త్రవ్వబడి, వ్యవసాయాదికృత్యములుకూడా జరిగిపోతున్నవి.

నదియొక్క యీమూడవస్థితి, స్థూలశరీరావస్థ. అయితే, నదియొక్క మూలచైతన్యమేది? నదియొక్క మూలశక్తి యేది? నదియొక్క మూలచైతన్యం-మూలశక్తి - ఆ సూర్యభగవానుడు. ఆ మహాతేజోమూర్తి. ఇప్పుడీ ఉదాహరణాన్ని మానవునికి పోల్చి చూద్దాం.

మూడుశరీరాలెక్కడ వున్నవి? వాటిలో పరస్పర మున్న సంబంధమేమిటి? ఈ శరీరాలకూ, మీ సత్యాత్మయైన పరమాత్మకూ, వున్న సంబంధ మేమిటి?

నీ గాఢనిద్రావస్థలో - నీకు వేరొక టేమీ తెలియని ప్రపంచపు పొలకువకూడా కనపడని, తల్లీతండ్రీ ఇల్లూ పిల్లా మొదలైనవేమీ కనపడని ఆ అవ్యక్తమైన కేవలం అజ్ఞానమయమైన వ్యవహారహితమైన ఒకానొకమృత్యుస్థితిలో ఒకానొకశూన్యస్థితిలో కూడిన నీ గాఢనిద్రా వస్థలో - నిజానికి నీవు ఏమైయున్నావు?

వేదాంతమిట్లు నిర్వచిస్తున్నది : సామాన్యంగా మీలో యెవ్వరూ యెప్పుడూ సమీక్షించని గాఢనిద్రావస్థలో, మనం కారణ శరీరాన్ని కలిగివుంటాం. ఈస్థితిలో మానవునిశరీరం, సత్యాత్మక్రింద - అనగా మానవుని ఆత్మక్రింద-అణిగి పడివుంటుంది. హిమశృంగాలపైన ప్రకాశించే సూర్యునివలె, ఆ స్థితిలో,సత్యాత్మవుంటుంది. అప్పుడు ప్రాథమికనదీజీవనంతో మానవునిజీవితం పోలివుంటుంది.

మీరు కడుజాగ్రత్తగా యీవిషయాలు వినాలె. ఇక్కడ ఒక అతి సూక్ష్మవిషయం చెప్పబడబోతున్నది. క్రిందటిరోజు యీ విషయం చెప్పబడింది. కానీ అవసరానుసారం తిరిగి యీవిషయం చెప్పబడుతున్నది.

గాఢనిద్రావస్థలో, యీప్రపంచం, మనకు కనపడదు. అప్పుడు స్వప్న ప్రపంచంకూడా కనపడదు. మెలకువవచ్చిన తర్వాత మీ రేమంటారు? ఆ గాఢ నిద్రావస్థలో, శూన్యం, శూన్యం; ఏమీ లేదంటారు. వేదాంతం చెబుతున్నది - నిజమే; గాఢ నిద్రావస్థలో ఏమీ వుండదు. 'హెగెల్' నిరూపించిన రీతిగా (హిందువులు, జర్మన్ తాత్త్వికులైన "హెగెల్"కు పూర్వమే యీ "యేమీ లేకపోవడం," "ఏదో ఒకటి వుండడమే"నని నిరూపించారు.) ఈ ఏమీ లేకపోవడం కూడా, కారణ శరీరమై యున్నది. జాగ్రత్ స్థితికి వచ్చిన తర్వాత దేనిని నీవు "ఏమీ లేదు; శూన్యము," అని వర్ణిస్తున్నావో - అదే కారణ శరీరం. అదే నా జీవితంలోని హిమ శిఖరస్థితి, "శూన్యంలో నుంచి జగత్తు సృష్టించబడింది" అని బైబిలు చెప్పినట్లుగా హిందువులు కూడా కారణ శరీరంలోనుంచి - జాగ్రత్ స్థితికి వచ్చిన తర్వాత 'శూన్యము' అని నీవు వర్ణించేదానిలోనుంచి - ఈ సమస్త ప్రపంచం

ఉదయిస్తున్న దని నిరూపించారు. ఇక్కడ తాత్త్వికులు ముందుకు వచ్చి, ఏమీలేని దానిలోనుంచి ఒక టెప్పుడూ రాదు - అని అన వచ్చు. వేదాంతం, దానికి జవాబు యీరకంగా చెబుతున్నది. మేము శూన్య మని చెప్పేది, నిజానికి శూన్యం కాదు. మీరు జాగ్రత్ స్థితి లోనికి వచ్చిన తర్వాత దానిని శూన్యం అని మీరు పేర్కొంటు న్నారు మాత్రమే - ఒకే మాటను మనం అనేక రకాలుగా వ్యాఖ్యా నించవచ్చు నన్న విషయం మీకు తెలుసు. కాని, నిజానికి ఈ సుషుప్తి, శూన్యం కాదు. ఇది కారణ శరీరమై యున్నది - ఈ స్థితి, ఆ శిఖరాల మీది మంచుగడ్డల మాదిరి వున్నది. సరే, మీ రిప్పుడు శూన్యమని వర్ణించే గాఢ నిద్రావస్థలోనుంచి (సుషుప్త్యవస్థలోనుంచి) ఒకటి సృష్టించబడుతున్న దనిన్నీ, ఆ శూన్యంగా కనపడేదే కారణ శరీర మనిన్నీ, తెలిసికున్నారు. అయితే లోపల ప్రకాశిస్తున్న సూర్యుని గుర్తించండి! లోపలగల పరబ్రహ్మను గుర్తించండి! ఈ కారణ శరీర మనే హిమ శిఖరాలనుంచి యీ సమస్త జగత్తును సృష్టిస్తున్న మీలోని పరమాత్మను తెలుసుకోండి! ఆ సూర్య భగవానుని - ఆ ఆత్మ జ్యోతిని - ఆ పరబ్రహ్మను - సందర్శించండి! ఈ ఆత్మ సూర్యుని గూర్చి మీరు విశదీకరింప కోరవచ్చు. సావధానులై వినండి!

నీవు నిద్రలేచిన తర్వాత ఈ రకంగా చెబుతావు: "నేను శాంతిగా నిద్ర పోయాను. ఒక్క కలకూడా నేను కనలేదు!! ఈ మాటలు ఒక కాగితము మీద వ్రాయి. అప్పుడు వేదాంత మీ రకంగా ప్రత్యుత్తర మిస్తుంది: ఈ మాటలు, "అర్థరాత్రి సమయమున ఫలానా ఫలానా చోట, ఒక్క మనిషి పొలకువకూడా లేదు" - అని చెప్పినమనిషి మాటలవలె ఉన్నవి. అతని వాఙ్మూలమును విచారిస్తున్న న్యాయాధికారి, ఆ వాఙ్మూలమును కాగితముమీద వ్రాయమన్నాడు. అత డట్లే వ్రాశాడు. ఈ వాఙ్మూలము నిజమేనా? అని న్యాయాధి కారి అడిగాడు. ఆ మనిషి నిజమే నన్నాడు. "ఈవాఙ్మూలము నీదేనా? దీనికి నీవు సాక్షివేనా?" అని న్యాయాధికారి అడిగాడు. "అవునండి! నేనే కళ్ళారా చూచాను" అని అతడన్నాడు. "అయితే మంచిది. నీవు సాక్షివైనట్లైతే, యెవరు లేరని చెప్పే నీ వాఙ్మూలము నిజమై

నట్లైతే, కనీసము నీ వొక్కడవైనా అక్కడ వున్నావు కదా! నీ వొక్కడవైనా ఆ స్థలంలో వుండి వున్నట్లైతే. యీ నీ వాదము, నిజానికి సత్యం కాదు. ఎందుకంటె, నీవు ఒక మనిషి వే కదా, ఇక అక్కడ ఒక్క మనిషన్నా వున్నట్లే కదా. ఎవరూ అక్కడ లేరని చెప్పే యీ వాదం తప్పు. ఇది స్వవచన వ్యాఘాతం. ఆ స్థలంలో నీవైనా వున్నావు కనుక, యెవరూ లేరనే వాదం తప్పు" - అని న్యాయాధికారి నిర్వచించాడు.

అదే ప్రకారం, నీవు మేల్కొన్న తర్వాత, "ఏమండీ! ఈ వేళ నేను హాయిగా నిద్రపోయాను. బలేహాయిగా నిద్రపట్టింది. కలన్న మాట కన లేదు. ఆ గాఢనిద్రలో అంతా శూన్యం" అంటావు. నే నంటాను— "కానీ నీ వున్నావు. నీవే గనుక నిద్రపోయినట్లైతే, నీ సత్యాత్మ—నీ నిజాత్మ—సత్యసూర్యుడు—సత్యభగవానుడు — నిద్రపోయి వున్నట్లైతే, ఆ శూన్యస్థితికి సాక్షి యెవరు? ఆ గాఢనిద్రా తమస్సుకు సాక్షి యెవరు? ఆ నిద్రా శాంతికి, ఆ నిద్రాశూన్యస్థితికి నీవు సాక్షివైనట్లైతే, నీ వక్కడ వున్నట్లే కదా. నీ గాఢనిద్రావస్థలో, కనీసము, రెండు వస్తువులైనా వున్నవని వేదాంతము చెబుతున్నది. ఒకటి—శిఖరాలపైని మంచుగడ్డవలెవున్న శూన్యత—లేక కారణశరీరము. రెండవది—ఆ సాక్షి తేజము—ఆ సూర్యుడు—ఆ ఆత్మజ్యోతి—ఆ భగవంతుడు. ఆ పరమాత్మే సర్వసాక్షియై ఆ సుషుప్త్యవస్థయందుకూడా ఆ అవ్యక్తస్వభావస్థలో కూడా ప్రకాశిస్తున్నాడు—శాశ్వతమైన నిత్యమైన సూర్యబింబం—సత్యాత్మ ఆ గాఢనిద్రావస్థలోని శూన్యస్థితి, చంచలమైన అనిత్యమైన తరళమైన కారణశరీరమైయున్నది. ఈ కారణశరీరాన్ని—అనిత్యము, తరళమూ, చంచలమూ, అనడం దేనికి? దేనికంటే, స్వాప్నిక ప్రపంచంలోకి నీవు వచ్చినప్పుడు స్వప్నావస్థలో నీవు పడినప్పుడు. ఆ శూన్యత పోతున్నది. ఆ శూన్యత యీ స్థితిలో లేదు. సుషుప్తిలోని ఆ అవ్యక్తతే-ఆ శూన్యతే-నీ సత్యాత్మ అయినట్లైతే అది అలాగే మారకుండా స్వప్నలోకానికి నీవుదిగినవుడు యీ చంచలతే-ఈ మార్పే యీ కారణశరీరం నీ స్వప్నరూపం కాదని, సత్యం కాదని, చెబుతున్నది. కారణశరీరం సత్యమైనదికాదు. ఈ దృశ్య ప్రపంచం ఆ శూన్యస్థితిలోనుంచి

యెట్లు వస్తుందని మీరు ఆశ్చర్యపడుతున్నారు. కాని యిది నిజం. యూరపు అమెరికాలలో మీరు విషయాలను తల్లక్రిందులుచేసి చూస్తుంటారు. రాముని మాటలు నమ్మండి. ప్రతివ్యక్తి తప్పక గుర్తించ వలసిన సత్యమిది. సర్వ విశ్వమానవకోటి హృదయాలలో యెప్పుడో ఒకప్పుడు ప్రవేశింపదగిన సత్యమిది.

విషయాలను తలక్రిందులుగా చూడడం ఇచ్చటి ప్రజల కలవాటు. అసహజంగా నదులను క్రిందినుంచి కొండమీదికి పారించాలనుకుంటారు. అందుచేతనే మీ గాఢసుషుప్త్యవస్థలోనుంచి మీ స్వప్న ప్రపంచానుభవం వస్తున్నదన్న రాముని సిద్ధాంతానికి మీరు ఆశ్చర్య పడుతున్నారు కాని పరీక్షించండి. ఇది ప్రకృతి విధానం కాదా? ఈ మీ భూమి యెక్కడనుంచి వచ్చింది? ఈ మీ భూమి ఒకప్పుడు అవ్యక్తస్థితిలోవున్నది. ఒకప్పుడీ సమస్తబ్రహ్మాండం ఆకారరహితమై మీ గాఢనిద్రావస్థకు పోలికగా వున్నది. ఒకప్పుడీప్రపంచం అవ్యక్తావస్థలో, శూన్యావస్థలోవుండి వున్నది. ఆ అవ్యక్తస్థితిలోనుంచే క్రమక్రమంగా మీ వృక్షరాజ్యం, జంతురాజ్యం, మానవలోకం సముద్భూతమైంది. సమస్తప్రకృతిలో మీ రేమిచూస్తున్నారో, భౌతికదృష్ట్యా మీ కేది నిజంగా కనబడుతుందో, తత్వజిజ్ఞాసాత్మకదృష్టితోకూడా అది నిజమై వున్నదని వేదాంతం నిర్వచిస్తున్నది. ఈ సమస్తప్రపంచం శూన్యంలో నుంచి పుట్టినమాదిరిగా మీస్వప్న జాగ్రదవస్థలుకూడ ఆ సుషుప్త్యవస్థ లోనుంచి, ఆ అవ్యక్తావస్థలోనుంచి, ఆ శూన్యస్థితిలోనుంచి, పుట్టినవి. నీ జాగ్రత్ స్వప్నావస్థలు ఆ శూన్యంలోనుంచే పుట్టినవి. దీనిని ప్రతి మానవజీవితలో మనం చూడవచ్చు. శిశువు యిట్టి శూన్యస్థితిసిబోలిన అవ్యక్తావస్థలోనుంచే క్రమక్రమంగా పరిణతిపొంది వ్యక్తస్థితిలోకి వస్తున్నాడు. ఒక దశలోనుంచి ఒకదశలోకి అతడు అధిగమిస్తున్నాడు. దశలన్నిటికి పరస్పరసంబంధ మున్నది.

సమస్తజగదంతర్గతమైవున్నధర్మమే సామాన్యమానవజీవితంలో కూడా కనబడుతుంది. సుషుప్త్యవస్థలోనుంచి స్వప్నావస్థ వస్తున్నది. స్వప్నావస్థకు ఆధారము జాగ్రదవస్థ అనే విషయాన్ని విపులీకరింప మీరు కోరుతున్నారు. వేదాంతము, విషయులనువాటి సత్యరూపంలో

చూపించి, సమస్తపాశ్చాత్యతత్త్వవేత్తలందరు, మీ హెగేల్, కాంట్ మహాశయులందరు, ఈ స్వప్నానుభూతవిషయాలను (స్వప్నప్రపంచాన్ని) సమగ్రంగా విశదీకరించలేకపోయినా రత్నవిషయాన్ని మీకు చూపించి మిమ్ము ఆశ్చర్యచకితుల్ని జేస్తుంది. ఈ విషయం వివరించటానికి ఈ రాత్రికాలం చాలదు. ఇంకొకసారి ఉపన్యాసరూపంగానో గ్రంథరూపంగానో మీకు విశదీకరింపబడుతుంది.

మన మిప్పుడు స్వప్నావస్థలోనికి వద్దాం. హిమశిఖరాలమీది నుంచి మధ్యగల పర్వతభాగాలలోకి వచ్చినప్పుడు, మనం స్వప్న ప్రపంచంలోకి వస్తాం. ఇక్కడ సూక్ష్మశరీరం. స్వాప్నికాత్మ, ఒక విచిత్రలోకంలో కవితారాజ్యంలో వున్నట్లు తనను కనుగొంటుంది. మీ స్వాప్నికాత్మ యిప్పు డొకపక్షి అవుతుంది. కాసేపటిలో రాజౌతుంది. వెంటనే ఒకభిక్షుకు డవుతుంది. ఇప్పు డది హిమాలయాలలో దారితప్పిన బాటసారిగా, ఉత్తరక్షణంలో లండనువాసిగా మారుతుంది. ఈ నిమిషంలో ఈ పట్టణంలో, మరొకనిమిషంలో మరొక పట్టణంలో వుంటుంది. ఎంతచంచలం! పర్వతమధ్యాలలోని ప్రవాహాల మాదిరి, చంచలంగా తరళంగా రకరకాలదారులుత్రొక్కుతూ మీ స్వాప్నికాత్మ వుంటుంది. స్వప్నావస్థలో నీ వెంతో తరళంగా వుంటావు. కొండవాగులమాదిరి నీవు తీవ్రగమనంతో తీవ్రవేగంతో క్రీడామయంగా వుంటావు. నీ వప్పుడు ఊహాలోకంలో విహరిస్తుంటావు. అందులో చచ్చినవాడు బ్రతుకుతాడు. ఒకప్పుడు బ్రతికియున్నవాండ్లు మృతులుగా కనబడతారు. విచిత్రప్రపంచం! కవితాప్రపంచం! ఈస్థితి, కొండలమీద విచిత్రకవితాలోకంలో ప్రవహించే సూక్ష్మ శరీరావస్థలోని నదిలాగా లేదా? ఆనది, కొండలమధ్యభాగాలలోనుంచి మైదానాలలోకి దిగినట్లు, స్వప్నానుభవానంతరం నీవు జాగ్రత్ స్థితిలోనికి వస్తావు. మైదానాలలోకి దిగిన నది స్థూలశరీరాన్ని ధరించినట్లు, జాగ్రదవస్థలో నీవు స్థూలశరీరాన్ని సృష్టించుకుంటున్నావు. సుషుప్త్యవస్థలోని శరీరం, కారణశరీర మని పిలువ బడుతున్నది. స్వాప్నికశరీరం సూక్ష్మశరీర మని పిలువబడుతున్నది. జాగ్రదవస్థలోనిశరీరం, స్థూలశరీర మని పిలవబడుతున్నది. పర్వతాలనుంచినదులు క్రిందికి ప్రవహించి

మైదానాలలో ప్రవేశించినప్పుడు వాటిసూక్ష్మశరీరం అలాగే వుంటుంది. కాని అది ఎఱ్ఱనిబురదవేషం ధరిస్తుంది. ఇది కొండలమీదినుంచి వచ్చిన నీరే అని మీకు తెలుసు. ఆ కొండలమీది పరిశుభ్రమయిన స్వచ్ఛ జలమే యీమైదానంలోని బురదలో దాగియున్నది. అంటే పర్వత మధ్యభాగాలలో వున్నప్పుడున్న నదియొక్క సూక్ష్మశరీరం మారలేదు. కొత్తవేషం వేసికున్నదిమాత్రమే. ఇట్లు నదియొక్క సూక్ష్మశరీరం మైదానాలలోకి దిగి బురద అనే కొత్తవేషము వేసికున్నప్పుడు, మనము, నది స్థూలశరీరావస్థలోవున్నదని చెబుతాము. కారణశరీరం లోనుంచి సూక్ష్మశరీరం వచ్చినప్పుడు, నది ఆ విధంగాలేదు. కారణ శరీరం కరిగి సూక్ష్మశరీరాన్ని సృష్టిస్తున్నది. ఇప్పుడు జాగ్రదవస్థలో, సూక్ష్మశరీరం విలీనంగావడంగాని, మారడంగాని లేదు. క్రొత్తవేషం వేసికుంటున్నదిమాత్రమే. నిజానికి యిదే జరుగుతున్న విషయం.

జాగ్రదవస్థలో, సూక్ష్మశరీరం, అంటే స్వప్నావస్థలో పనిచేసే మనస్సు (బుద్ధి) – అదృశ్యంకావడంలేదు. అది నిలిచేవున్నది. కాని యీభౌతిక ఘటాంశములన్నీ యీ భౌతికమైన శిరస్సు మొదలైనవన్నీ నూతనవస్త్రాలలాగ తాల్చబడుతున్నవి. మీరు నిద్రావస్థలో ప్రవేశించేటప్పుడు, యీ భౌతికమైన స్థూలదేహం, వంకెకు తగిలించబడిన వస్త్రంమాదిరి తొలగింపబడుతుంది. దానినుంచి సూక్ష్మదేహం విడదీయుబడుతుంది.

రాత్రి పరుండబోయేముందు జనులు, చొక్కాలు విడిచిన మాదిరి మీరు స్థూలశరీరాన్ని వదలుతారు. స్వప్నావస్థలో మీ సూక్ష్మశరీరంమాత్రమే పనిచేస్తుంది. అయితే సూక్ష్మశరీరమంటే ఏమిటి? అదికూడా పదార్థభాగమే (భౌతికమైనదే) నని చూపబడుతుంది. సూక్ష్మానికీ స్థూలానికి, స్థూలానికీ సూక్ష్మానికి వున్నసంబంధం తెలుపబడుతుంది. శీతాకాలంలో (శీతాకాలం రాత్రిని బోలివుంటుంది) నదులు సహజంగా స్థూలశరీరాన్ని వదలి సూక్ష్మశరీరాన్నిమాత్రమే కలిగివుంటాయి. అంటే శీతాకాలంలో నదులు రూపపరిమాణాన్ని తగ్గించుకుంటున్నవి. బురదను, ఒండును, ఎఱ్ఱటిమురికిరంగును వదలుతున్నవి. అవి నిద్రావస్థలోకిపోయినట్లు మనకు కనపడతాయి.

ఏరకంగా నదులు తమస్థూలశరీరాన్ని వదలి, సూక్ష్మశరీరంతో వుంటున్నవో, అదేరకంగా, ప్రతిరాత్రి మీరు నిద్రలో ప్రవేశించినపుడు (శీతాకాలంలో) మీరు స్థూలశరీరాన్ని వదలి సూక్ష్మశరీరంతో మాత్రమే వుండడం జరుగుతున్నది.

కానీ కారణశరీరంపై ప్రకాశిస్తున్న సూర్యుడే నదియొక్క సూక్ష్మశరీరంపైనకూడ ఒకే రీతి ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యుడే నదియొక్క స్థూలశరీరంమీదకూడ ఒకేరీతి ప్రకాశిస్తున్నాడు.

సుషుప్త్యవస్థలో ప్రకాశించే ఆ సత్యాత్మయే నీ స్వప్నావస్థలోను నీ జాగ్రదవస్థలోను ఏకరీతిగా ప్రకాశిస్తున్నది. అనగా కారణశరీరంపై, సూక్ష్మశరీరంపై, స్థూలశరీరంపై, ఒకేసత్యాత్మ యేకరీతిగా ప్రకాశిస్తున్నది. అయితే తేడా యెక్కడ ఉన్నది? తేడా సూర్యప్రతిబింబంలో మాత్ర వున్నది. నదియొక్క కారణశరీరమైన మంచు శిఖరాలమీద సూర్యుడు ప్రకాశిస్తున్నప్పుడు సూర్యప్రతిబింబ మక్కడ కనపడడంలేదు. మంచుశిఖరాలపై సూర్యప్రభావం పడుతున్నది. కాని వానిలో సూర్యప్రతిబింబం కనపడడం లేదు. కాని నదియొక్క సూక్ష్మ శరీరంపై సూర్యుడు ప్రకాశిస్తున్నప్పుడు అందు సూర్యుడు ప్రతిఫలిస్తున్నాడు.

సూర్యుడు నదియొక్క సూక్ష్మశరీరంపైన ప్రకాశిస్తున్నప్పుడు, అందు సూర్యప్రతిబింబం కనబడుతున్నది. నదియొక్క కారణశరీర మైన హిమశిఖరాలపై సూర్యప్రతిబింబం కనపడడంలేదు. కానీ నదియొక్క సూక్ష్మశరీర మైనపర్వతప్రవాహాలలో సూర్యప్రతిబింబం కనబడుతున్నది. ఈ ప్రతిబింబం నిజానికి నీలోని నిత్యనిర్వికల్పపరమాత్మయై యున్నది. నీ సుషుప్త్యవస్థలో ఆ పరమాత్మయే ప్రకాశిస్తున్నాడు. ఆ పరబ్రహ్మయే నీ కారణశరీరముపై ప్రకాశిస్తున్నాడు. అయితే పరీక్షించండి. సుషుప్త్యవస్థలో అహంకృతి కనపడడంలేదు. "నేను నిద్రపోతున్నాను. నేను పెరుగుతున్నాను. నేను ఆహారాన్ని జీర్ణించుకొంటున్నాను. నేను అదిచేస్తున్నాను. ఇది చేస్తున్నాను" – అనే భావం నీకులేదు. అంటే అప్పుడు అహంకృతి లేదు. సత్యాత్మ ఒక్కటి

మాత్రమే వున్నది. అక్కడ అహంకృతి లేదు. ప్రజలచేత ఆత్మగా నెంచబడుతున్న మిధ్యాహంకృతి అప్పుడుండదు. స్వప్నావస్థలో ఆ అహంకృతి గోచరిస్తుంది. స్వప్నావస్థ నదియొక్క ద్వితీయావస్థవలె - నదియొక్క సూక్ష్మశరీరంవలె- ఉన్నది. అహంకృతి స్వప్నావస్థలో నేకాక జాగ్రదవస్థలోకూడా ద్యోతకమవుతున్నది. జాగ్రత్ స్థితి, మైదానాల లోని నదీ స్థితివలె, నదియొక్క స్థూలశరీరంవలె వున్నది. సూర్యుడు, సర్వదా, దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నాడు. హిమశిఖరాలమీద ప్రకాశిస్తున్నాడు. పర్వతాలమధ్య ప్రవాహంపై దేదీప్యమానంగా ప్రకాశించడమేకాక ప్రవాహమందు ప్రతిఫలించడంకూడా జరుగు తున్నది. మైదానాలలోని పంటలప్రవాహంమీదకూడా సూర్యుడు దేదీప్యమానంగా ప్రకాశించడమేకాక ప్రతిఫలించడంకూడా జరుగు తున్నది. అదేప్రకారం నీజాగ్రదవస్థలో ఆత్మసూర్యుని ప్రతిబింబం కూడా కనబడుతుంది, నేను ఇది చేస్తున్నాను. అదిచేస్తున్నాను అనే ఈ అహంకృతిఅంతా జాగ్రత్ స్థితిలోకూడా కనపడుతుంది. అయితే స్వప్నావస్థలోని అహంకృతికీ, జాగ్రదవస్థలోని అహంకృతికీ తేడా వున్నది. సత్యాత్మ యొక్క - లేక - పరమాత్మ యొక్క - ప్రతిబింబ మైన అహంకృతి, స్వప్నావస్థలో చంచలమై, అతి తరళమై, అస్థిరమై కనపడుతున్నది. ఈ స్వాప్నిక అహంకృతి, పర్వత మధ్య ప్రవా హాలలో పడ్డ సూర్య ప్రతిబింబంలాగా చంచలమైంది. జాగ్రదవస్థలోని అహంకృతి సమతల ప్రదేశాలలో నెమ్మదిగా ప్రవహించే మహా నదుల్లో పడే సూర్య ప్రతిబింబంలాగా సుస్పష్టమైంది. సుస్థిరమైంది.

ఇంకా చెప్పవలసిన విషయం కొంత వున్నది. సూక్ష్మ శరీరము యొక్క పరిణామదశే స్థూల శరీర మని చెప్పడానికి ప్రమాణ మేమిటని ప్రజ లడుగవచ్చు. స్వప్నావస్థ యొక్క పరిణామమే జాగ్రదవస్థ అని చెప్పటానికి నీ కే అధికార మున్న దని జను లడుగవచ్చు. గమ నించండి. జాగ్రదవస్థ ఏయే పదార్థాల సమ్మేళనం? మీ జాగ్రద వస్థానుభవము దేశకాల నిమిత్తాల మీద ఆధారపడి వున్నది. కాలము దేశము, నిమిత్తము, ఈ మూడింటి సమ్మేళనములేని పదార్థాన్ని దేనినైనా యీ ప్రపంచంలో మీరు భావించగలరా? లేరు. లేరు.

దేశకాల నిమిత్తాలతో సంబంధము లేని వస్తువు లేదు. ఇవి లేకుండా దేన్ని గురించియైనా తెలిసికోవడం అసాధ్యం. దేశకాల నిమిత్తాలతో యీ మీ ప్రపంచం అల్లబడివున్నది.పరీక్షించి చూడండి. అవి మీ స్వప్నావస్థలో వున్నవి. జాగ్రదవస్థలోకూడా వున్నవి. కాంట్స క్రిటిక్ ఆఫ్ ప్యూర్ రీజన్ (Kantis critique of pure Reason) అనే పుస్తకమును అనువదిస్తూ, 'మాక్స్‌ముల్లర్,' తన పీఠికలో, వేదాంతాభిప్రాయాన్నే 'కాంట్ చెప్పాడన్నాడు. దేశకాల నిమిత్తాలు ప్రాథమికములని (A priori) కాంట్ స్పష్టంగా నిరూపించాడని, హిందువులు యీ విషయాన్ని నిరూపించ లేదని మాక్స్‌ముల్లర్ చెబుతాడు. హిందూ శాస్త్రాలను మాక్స్‌ముల్లర్ చక్కగా పఠించలేదని రాముడు చెబుతున్నాడు. పదార్థ త్రయము (దేశకాల నిమిత్తాలు) ప్రాథమిక మని (Priori), ప్రాతీతిక మని (Subjective), తద్వారా జాగ్రదవస్థ స్వప్నావస్థయొక్క అనంతర పరిణామావస్థ యని, హిందువులు నిరూపించారు. ఓపికతో వినాలె. సుషుప్త్యవస్థలోగాఢనిద్రావస్థలో దేశకాలనిమిత్తాలభావన నీకు లేదు. నీవు స్వప్నావస్థలోకి వస్తావు. అప్పుడు దేశకాలనిమిత్తాలు కనబడుతున్నవి. హిందువు లీవిధంగా నిర్వచిస్తున్నారు. బీజంలోనుంచి చిన్న మొక్క అతిబలహీనంగా అతికోమలంగా బయులుదేరినమాదిరి, నీ స్వప్నావస్థలోని దేశకాలనిమిత్తాత్మకమైన పదార్థత్రయము, నీ గాఢ నిద్రావస్థలోనుంచి పుడుతున్నది. నీ జాగ్రదవవస్థలో యీ దేశకాల నిమిత్తాత్మకమైన పదార్థత్రయ మనే మొలక మహావృక్షంగా పరిణమిస్తున్నది. ఈ దేశకాలనిమిత్తాలు మహాప్రవాహరూపాన్ని ధరించి బలపడుతున్నవి. స్థూలరూపాన్ని ధరిస్తున్నవి. నీవు వృద్ధి అయినకొద్దీ దేశకాల నిమిత్తభావాలుకూడా నీతోపాటు అభివృద్ధి పొందుతున్నవి. దేశకాల నిమిత్తాల పరిణామ ఫలితమే యీ ప్రపంచం. మీ స్వప్నాలలో కాలమున్నది. కానీ జాగ్రదవస్థలోని కాలపరిమితికి, స్వప్నావస్థలోని కాలపరిమితికి, పోల్చి చూడండి. స్వప్నావస్థలోని కాలం అతి చంచలమైంది. అవ్యక్తమైంది. అస్పష్టమైంది. అనిర్దిష్టమైంది. జాగ్రదవస్థలోని కాలం పరిపక్వాకృతి కలది. అంటే స్వప్నావస్థలోని కాలముయొక్క పరిపక్వరూపమే-జాగ్రదవస్థలోని కాలం. స్వప్నంలో ఒక్కొక్కసారి

మృతులు సజీవులుగా కనబడతారు. సజీవులు మృతులైనట్లు కనబడతారు. జాగ్రదవస్థలో అట్లు కాదు. కాలము నియతంగా వుంటుంది. స్వప్నావస్థలో నియతిలేకుండా కాలసంచలనం జరుగుతుంది. భవిష్యత్తు భూతకాలంగా మారుతుంది. భూతకాలం భవిష్యత్తుగా మారుతుంది. జాగ్రదవస్థలో అట్లు కాదు. స్వర్గారోహణంలో సుదీర్ఘకాలం గడిపినట్లు కలగనిన మహమ్మదు విషయం మీరు వినియుండవచ్చు. ఆయన లేచి చూచేసరికి స్వప్నమునకు పట్టినకాలం రెండుసెకండ్లే అయిఉంటుంది. రెండు సెకండ్ల జాగ్రదవస్థలోనికాలం స్వప్నావస్థలో అనేక సంవత్సరాలుగా కనపడవచ్చు.

ఈ ప్రకారంగా జాగ్రదవస్థలోని విషయాలకూ స్వప్నావస్థలోని విషయాలకూ తేడా – తీవ్రతలో పరిమితిలో మాత్రమే ఉన్నదిగాని-జాతిలో లేదు. స్వప్నావస్థలోని విషయాలు చంచలములు, వికలములు, నియమరహితములైయున్నవి. ఒక లేత మొక్కను ఏ విధానంలో పెంచదలచుకుంటే ఆ విధంగా పెంచ నవకాశమున్నమాదిరి, ఆ మొక్క పెద్దమ్రానైన పిదప మార్చ నవకాశములేనిమాదిరి, స్వాప్నిక విషయాలు మార్చబడటానికి అవకాశమున్నది. నీ స్వప్నంలో ఇప్పుడు కనపడ్డ స్త్రీ, మరుక్షణంలో ఒక ఆడగుఱ్ఱ మవుతుంది. సజీవమానవుడు నిమిషంలో నిర్జీవుడయినట్లు కనబడతాడు. కనబడే కొండ మరుక్షణంలో మంటగా మారుతుంది. స్వప్నావస్థలో నీవు కనుగొంటున్న వస్తువులు, గాఢనిద్రావస్థలో (సుషుప్త్యవస్థలో) కనబడటంలేదు. హిమశిఖరాగ్రాలలోనుంచి సెలయేళ్లు, తరళవాహినిలు, సన్నని జలగా ఉదయించిన మాదిరి, గాఢ నిద్రాదస్థలో నుంచి, స్వాప్నిక వస్తుజాలం ఉదయిస్తున్నది. జాగ్రదవస్థలో, ఈ స్థల కాల నిమిత్తాల ప్రాథమిక రూపాలు పరిపక్వమై, స్థూలమై, సువ్యక్తములై బలపడుతున్నవి.

నీ స్వప్నావస్థలోని బుద్ధికీ, జాగ్రదవస్థలోని బుద్ధికీ సంబంధమున్నది. రాముడు విద్యార్థి దశలో, పరిష్కరించడానికి అవస్థపడుతున్న అనేక క్లిష్ట సమస్యలను తరచు, స్వప్నాలలో పరిష్కరించడం జరిగేది. కాని మెలకువ వచ్చిన పిదప, వాటిని తిరిగి పరిష్కరించే మార్గం కనబడదు. స్వప్నావస్థలోని విషయాలు చంచలములై, తరళము

లై యున్నవి. వీటికీ, జాగ్రదవస్థలోని విషయాలకూ – చంచలమైన, కోమలమైన, లేత మొక్కకూ, అదిపెరిగి పెద్దదైనప్పటి మ్రానుకూ ఉన్న సంబంధంలాగా – సంబంధమున్నది.

చాలాసార్లు రాముడు కలల్లో కవిత్వం వ్రాశాడు-కానీ మెలకువవచ్చి చూస్తే పంక్తులు సరిగా ఉండేవి కావు. ఒకదానికొకటి సంబంధంలేకుండా ఉండేవి. నదియొక్క సూక్ష్మ శరీరానికీ దాని స్థూలశరీరానికీ సంబంధమున్నట్లు, స్వప్నావస్థలోని నిమిత్తమునకు (Reasoning) జాగ్రదవస్థలోని నిమిత్తమునకూ, సంబంధమున్నది. అదేరీతిగా స్వప్నావస్థలోని స్థలమునకు (Space), జాగ్రదవస్థలోని స్థలమునకూ, సంబంధమున్నది. ఈ మాటలు విని మీరు, "జాగ్రదవస్థలో మేము ఎప్పుడు చూచే వస్తువులనే స్వప్నావస్థలో చూస్తున్నాము. మా స్వప్నాలు మా జాగ్రదవస్థలోని విషయాల యొక్క స్మృతులు మాత్రమే. స్వప్నావస్థలో యొక్క పరిణామమే జాగ్రదవస్థ యొక్క పరిణామ మెట్లవుతుంది? ఇది మేము నమ్మ" – మనవచ్చు. పోనీ మీరట్లే తలచినా సిద్ధాంత భంగంలేదు. ఒక బీజమున్నది. ఆ బీజంలో నుంచి, ఒక అందమైన చిన్న మొక్క బయలు దేరుతుంది. ఈ మొక్క చంచలమైంది. కోమలమైంది. ఈ చంచలమైన, కోమలమైన దుర్బలమైన మొక్క, పెరిగి సుదృఢమైన స్థూలమైన. పెద్ద వృక్షంగా పరిణమిస్తున్నది. ఈ స్థూల వృక్షంలో నుంచి, దాని ఉద్భవానికి కారణ భూతమైన బీజమువంటి బీజాలనేకం ఆవిర్భవిస్తున్నాయి – ఈ బీజాలలో ఆ మహా వృక్షమంతా యిమిడి వున్నది. ఆ మహావృక్షం తన సారమునంతా, తన శక్తినంతా, ఈ బీజాలలో తిరిగి నిక్షిప్తం చేసింది. అలాంటప్పుడు ఆవృక్షం బీజమునుండి ఆవిర్భవించలేదంటే మన మొప్పుకుంటామా? వృక్షము బీజము నుండి ఆవిర్భవించలేదనడానికి మన కేమి అధికారమున్నది? ఈ విధంగా వాదన చేయడానికి మన కధికారం లేదు.

వేదాంత మిట్లు చెపుతున్నది. సుషుప్త్యవస్థ (గాఢనిద్రావస్థ) బీజాన్ని పోలియున్నది. బీజరూపమైన యీ సుషుప్తినుంచి, స్వప్నావస్థ వస్తున్నది, అందులోనుంచి జాగ్రదవస్థ లేక స్థూలశరీరావస్థ–

బయలుదేరుతున్నది. ఈ నీ జాగ్రదవస్థ, తిరిగి నిద్రావస్థలోనికి సంగ్రహింపబడడంలో (తగ్గింపబడడంలో) ఆశ్చర్యంలేదు. అది సహజ విషయమే. నీ జాగ్రదవస్థ స్వప్నావస్థగా సూక్ష్మీకరింపబడుతున్న విషయం, రాముని సిద్ధాంతానికి వ్యతిరేకమైందికాదు. ఎట్టి సందర్భంలోకూడా, నీ జాగ్రదవస్థ నీ సూక్ష్మశరీరంలోనుండి-అంటే-నీ స్వప్నావస్థలోనుంచి బయలుదేరడంలేదు-అని చెప్పడానికి నీకవకాశంలేదు. వృక్షమంతా బీజంలోకి ఉపసంహృతమైనందున (సంక్షిప్తమైనందున) వృక్షం, బీజంలోనుంచి పుట్టడంలేదు-అని వాదించడానికి మనకవకాశంలేదు. మీ స్వప్నావస్థలో, మీ జాగ్రదవస్థలోని స్మారకాలే కనబడుతున్నందున- కాలదేశ నిమిత్తరూపకమైన వైవిధ్యాత్మకమైన స్వప్నావస్థలోనుంచి, జాగ్రదవస్థ పరిణతి పొందిందన్న రాముని సిద్ధాంతానికి మీరు సంశయింప పనిలేదు.

స్వప్న జాగ్రదవస్థలు, నీ సుషుప్త్యవస్థ (గాఢనిద్రావస్థ) అనే శూన్యావస్థలోనుంచి జన్మించినవని వేదాంతదర్శనం నిర్వచిస్తున్నది. హిందువులు, "ప్రపంచం మిథ్య. ప్రపంచం అజ్ఞానజనితం"-అని చెప్పడంలో అర్థం-ఒకానొక శూన్యతతో కూడిన. ఆ గాఢ నిద్రావస్థ-లేక గాఢనిద్రావస్థారూపకమైన ఆ శూన్యత-అజ్ఞానమని-సూక్ష్మీకృతమైన అజ్ఞానమని. మీరు అజ్ఞామును చీకటి అని పిలువదలచినట్లయితే, గాఢనిద్రావస్థయే అజ్ఞానాంధకారం. ఆ అజ్ఞానాంధకారంలోనుంచే ఈ ప్రపంచం ఉదయిస్తున్నది. ఈ వైవిధ్య వికల్పాదులతో కూడినప్రపంచం ఉదయిస్తున్నది. ఈ అజ్ఞానం నిత్యమైందకాదు. చంచలమైంది. స్వప్నావస్థలో, రెండు రకాల వస్తువులు నీవు కలిగియుంటావు.

అది- ద్రష్ట, దృశ్యము లేక విషయి, విషయము. (Subject and object) వేదాంతనిర్వచనానుసారం, ద్రష్టా, దృశ్యములు, రెండూ ఏకసమయంలో కనబడుతున్నవి. స్వప్నాలలో నీ వొకవైపు ద్రష్టవౌతున్నావు. వేరొకవైపు దృశ్య మవుతున్నావు. స్వప్నంలో నీవొక గుఱ్ఱాన్ని రౌతునూ చూస్తావనుకో. అప్పుడు, ఆ రెండూ ఒకేసారి కనబడుతాయి. స్వప్నంలో నీ వొక కొండను చూచినప్పుడు,

కొండ దృశ్యమవుతున్నది. నీవు ద్రష్ట వవుతున్నావు. ద్రష్టా, దృశ్యములు రెండూ—ఒకేసారి ఉదయిస్తున్నాయి. స్వాప్నికభూతభవిష్యద్వర్తమానరూపకమైన— ఒకవిధమైనకాలంకూడా దృశ్యంతోపాటు అందు ఒకేసారికలిసి ద్యోతకమవుతున్నది. స్వాప్నికభూతభవిష్యద్వర్తమానాలు, స్వాప్నికమైన అనంతత, స్వాప్నికమైననిమిత్తత, స్వాప్నికద్రష్టృదృశ్యములు— ఇవన్నీ ఒకేసారిగా గోచరిస్తున్నవి.

ఇదేరీతిగా నీ జాగ్రదవస్థలోకూడా చూడబడే దృశ్యాలివినీవే. చూచేద్రష్టవు నీవే— ఒకవైపు శత్రుమిత్రులుగా కనబడేది నీవే. వేరొకవైపు వారిని చూస్తున్నద్రష్టవు నీవే. ఒకవైపు శత్రులుగా తోచేది నీవే. వరొకవైపు మిత్రులుగా కనబడుతున్నది నీవే. సమస్త విశ్వమూ నీవే— అని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది. ఈ అవస్థాత్రయ (జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలకుసంబంధించిన) దృశ్యమానవిషయాలన్నీ అనిత్యమైనవి. తరళమైనవి చంచలమైనవి. అస్థిరమైనవి. సూర్యునితో పోల్చబడినసత్యాత్మ, నదియొక్క మూడుశరీరాలపై ప్రకాశించే సూర్యునిమాదిరి, యీ మానవదేహత్రయంమీద ప్రకాశిస్తున్నది. ఆ ఆత్మ అఖండమైనది. అవికల్పమైనది. నిత్యసత్యమైనది. ఆ ఆత్మ సూర్యుడు నీ గాఢనిద్రావస్థ అనే హిమశిఖరాలపై ప్రకాశిస్తున్నాడు. నీ స్వస్వరూపమైన ఆ ఆత్మసూర్యునిచేతనే గాఢనిద్రావస్థ ప్రకాశింపజేయబడుతున్నది. ఆ ఆత్మసూర్యునిచేతనే నీ జాగ్రదవస్థ ప్రకాశింపజేయబడుతున్నది. ఒకే సూర్యుడు ఒక్కనదియొక్క శరీరత్రయంమీద ప్రకాశించడమేకాక, ప్రపంచంలోని అన్నినదులయొక్క శరీరత్రయాలపై ప్రకాశించినట్లు ఒకే ఆ ఆత్మసూర్యుడు, సర్వమానవ శరీరత్రయాలపై ప్రకాశిస్తున్నాడు. ఈ శరీరమనే నది, ఇంకొక శరీరమనే నదికి వేరుగా కనబడితేమాత్రమేమి? ఈ జీవన వాహిని ఒకమార్గంలో ఆ జీవనవాహిని వేరొకమార్గంలో ప్రవహిస్తేనేమి? ఈ సమస్తజీవన వాహినులపై, ఈ సమస్తజీవన నదులపై, ఒకే ఆ నిత్య సత్యాఖండ పరమాత్మ — ఆ పరంజ్యోతి — సర్వకాల సర్వావస్థలలో — అవికల్పమై, అఖండమై ప్రకాశిస్తున్నది. తత్త్వమసి! తత్త్వమసి! నీ వా పరమాత్మవు! నీ వా పరబ్రహ్మవు! నీ వా సత్యాత్మవు! నీ స్వరూపమైన

ఆ సత్యాత్మయే సమస్త మానవుల యొక్క సమస్త బ్రహ్మాండము యొక్క సత్యాత్మయై యున్నది. నీ సత్యాత్మ ఒక జాగ్రదవస్థలోనే గాదు, గాఢనిద్రావస్థలోగూడ - సర్వకాల సర్వావస్థలందుగూడ - ఏకరీతిగా ప్రకాశిస్తున్నది.

ఆ మీ స్వస్వరూపమైన సత్యాత్మ, సర్వ భయాందోళలనకు, సమస్త దుఃఖాకులములకు అతీతమైన దని తెలుసుకోండి! ఎవరూ మీ కపాయం చెయ్యలేరు. ఎవరూ మీకు హాని కలిగించ లేరు.

మత్పాద పర్వత పాదంబు చెంత
ప్రీలిపో! ప్రీలిపో! ప్రీలిపో వార్ధి!
నా పాదముల చెంత నో ప్రపంచంబ!
ప్రీలిపో, ప్రీలిపో, ప్రీలిపో మ్రింక!
ఓ సూర్యులారా! భూకంపంబులార!
వాయు వర్షములార! యుద్ధంబులార!
స్వాగతం బిదె రండు! వేగ రారండు!
నాపైన జూపుడు మీశక్తి నెల్ల!
రమ్యా శతఘ్నులారా! ప్రేలిపొండు!
నా ఆటబొమ్మలారా! ప్రీలిపొండు!
ఓ తారలార! నా బాణంబులార!
ఎగరండి, ఎగరండి. గగన రంగమున!
దావాగ్ని! నను నీవు దహియింపగలవె?
నీవు నావల్లనే వెలుగుచున్నావు!
ఓ జ్వలత్ ఖడ్గమా! నను తాకగలవె?
నాశక్తియే కదా వెలుగు నీలోన!
తను వింతలింతలై యంత మొందినను
నే ననంతుడనై వెలుగొందుచుందు!
సర్వ కర్ణంబులు నాదు కర్ణములు,
సర్వ నేత్రంబులు నాదు నేత్రములు,
సర్వహస్తంబులు నాదు హస్తములు,
సర్వ మానసములు నాదు మనస్సు!

మృత్యుంజయుఁడ నేను కాలకాలుఁడను!
మ్రింగివైచితి భేద భావ విషంబు!
ఎట్టి దివ్యామృత మే కనుగొంటి!
లేవు భయాందోళనములు లేశమ్ము.
లేవు బాధాశోకములు లేశమైన.
శీతాతపంబులు నిఖిల ద్వంద్వములు
సతము నాకానంద మే కూర్చుచుండు!
అజ్ఞానతమము ప్రకంపించి, పారె
మర్రల నెప్పటికిని కానరాకుండ.
జ్వాజ్వల్యమానమద్బ్రహ్మ తేజంబు
అజ్ఞాన తిమమును హతి మొనరించె!
అహా! అఖండానంద! మానంద! మహాహా!

ఓం! ఓం!! ఓం!!!

ఓమ్

# సత్యాత్మ

[శాన్ ఫ్రాన్సిస్కో-గోల్డెన్ గేట్ హాల్లో - 1903 సం॥ జనవరి 7 వ తేదీన ఇచ్చిన ఉపన్యాసం.]

సర్వశక్తిమయి బ్రహ్మస్వరూపులైన మహానులారా!

ఒక్మనీ దేశపు జానపద సాహిత్యంలో తన నీడను పోగొట్టుకున్న ఒక మనిషిని గురించి వింటాం. ఇది ఒక విచిత్రమైన విషయం. ఒక మనిషి తన నీడను పోగొట్టుకొన్నాడు, ఆతడు తన నీడకోసం బాధ పడవలసి వచ్చింది. అతణ్ణి స్నేహితులందరూ వదలిపెట్టారు. వాని సంపదంతా సర్వనాశనమైంది. అతనికి నీడకోసం దుఃఖపడవలసినగతి పట్టింది. అయితే నీడను పోగొట్టుకోవడానికిబదులు అసలు శరీరమునే పోగొట్టుకొన్న మనిషిని గురించి మీరేమనుకొంటారు? నీడను మాత్రమే పోగొట్టుకొన్నవానికి ఏదైనా కొంత ఆశ ఉంటుంది, కానీ, అసలు శరీరమునే పోగొట్టుకొన్నవానికి ఇంకేమి ఆశ ఉంటుంది?

ఈ ప్రపంచంలో చాలామంది మానవుల పరిస్థితి యిలాగే ఉన్నది. మానవులు తమ నీడను పోగొట్టుకోలేదు. అసలు వస్తువునే పోగొట్టుకొన్నారు. సత్యపదార్థమునే పోగొట్టుకొన్నారు. చిత్రాతిచిత్రం. శరీరమొక నీడ మాత్రమే. సత్యాత్మయే సత్య పదార్థం. అసలు వస్తువు. ప్రతి మానవుడు, తన నీడనుగూర్చే చెప్తాడు. తన శరీరమునుగూర్చే ఏదైనా చెప్తాడు. కానీ తమ సత్యాత్మను గూర్చి, తమ స్వస్వరూపమైన ఆత్మనుగూర్చి, అల్పముగానో అధికముగానో చెప్పగలవాండ్లు నూటికి కోటికి ఒకరుంటారు మాత్రమే. నీ వెవరవు? నీ వనగా ఏమి? నీ స్వస్వరూపమైన ఆత్మను పోగొట్టుకొని, సమస్త ప్రపంచాన్ని పొందినా లాభమేమిటి? ప్రజలు ఆత్మను కోల్పోయి, ప్రపంచమంతా పొందాలని ప్రయత్నిస్తున్నారు. పోయింది. పోయింది. పోయింది. ఏమి పోయింది? అశ్వమా? ఆశ్వికుడా? ఆశ్వికుడే పోవడం జరిగింది. శరీరం అశ్వంవంటిది. ఆత్మ. ఆశ్వికునివంటిది. ఆశ్వికుడు అపహరింపబడ్డాడు. అశ్వం మాత్రం ఉన్నది.

ప్రతిమానవుడూ మనకు అశ్వాన్ని గురించే అల్పంగానో అధికంగానో చెప్పుతున్నాడు. కానీ మనం అశ్వముయొక్క అధిపతియైన ఆశ్వికుని గూర్చి తెలుసుకొనగోరుతున్నాం. నేటిరాత్రి, మనం ఆశ్వికునిగూర్చి తెలుసుకొందాం. ఆత్మనుగూర్చి తెలుసుకొందాం. ఇది లోతైన విషయం. ఈ విషయమును గూర్చిన విచారణలోనే మహా మహా తాత్వికులు తమ మేధస్సులను బ్రద్దలుచేసికొంటున్నారు. ఇది చాలా లోతైన విషయం. గంటలోనో రెండు గంటల్లోనో వివరింపగల విషయంకాదు. అయినా, ఉదాహరణలద్వారా ఉపాఖ్యానాలద్వారా దాన్ని వీలున్నంత సులభంగా గ్రాహ్యమయ్యేలాగు చేద్దాం.

ఈ విషయాన్నే రాముడొకసారి ఒక పదిహేను పదహారేండ్ల పిల్లవానికి ప్రబోధించాడు. అతడు దాన్ని కొద్దిసేపట్లోనే బాగా అర్థంచేసుకొన్నాడు. అంత చిన్న పిల్లవాడే అర్థం చేసికొన్నప్పుడు, కొంచెం జాగ్రత్తగా వింటె మీరుకూడా అర్థం చేసికోగలుగుతారు. ఆ పిల్లవానికి చెప్పిన పద్ధతిలోనే మీకుగూడా రాముడు చెపుతాడు,

ఒకానొక సమయంలో, పర్వతాలలో రాముని దగ్గరకు, ఒక భారత రాజకుమారుడు వచ్చి, "స్వామీ! స్వామీ! దేవుడనగా ఏమి?" అని ప్రశ్నించాడు. ఇది ఒక గంభీరమైన ప్రశ్న. క్లిష్టమైన సమస్య. ఈ సమస్యా పరిష్కృతికే సమస్త మతాలు సమస్త తత్వాలు, తమ తమ మీమాంసలు సాగిస్తున్నాయి. ఆ రాజకుమారుడు "స్వామీ! ఈ విషయాన్ని తెలుసుకోడానికి నన్నెక్కడికి వెళ్ళమంటారు? మీరే ఈ విషయాన్ని నాకు వివరించండి" - అన్నాడు. రాముడప్పుడు రాజకుమారు నీ విధంగా ప్రశ్నించాడు: "యువరాజా! నీవు దేవునిగూర్చి తెలుసుకోవా లనే ఇచ్ఛ ఉన్నదా? దేవుని పరిచయం పొందా లనే ఇచ్ఛ ఉన్నదా? మంచిదే కాని, నీ కొక విషయం తెలుసా? ఒక మహా వ్యక్తిని దర్శించబోయే ముందు, ఎవరైనా సరే, తన పేరూ ఊరూ మొదలైన వాటితో కూడిన విలాస పత్రమును, ఆ మహా వ్యక్తి కడకు పంపవలసి ఉంటుంది. నీవు దేవుని దర్శించా లని కోరుతున్నావు గనుక, నీ వట్లాచెయ్యి. నీ వెవరివో ముందు దేవునకు తెలియజేయాలె. నీ వెవరివో తెలియ

జేసే చీటీని వ్రాసి యివ్వు. దానిని తీసికొని వెళ్ళి నేను నేరుగా దేవుని కిస్తాను. దేవు డప్పుడు నీ దగ్గరకు వస్తాడు. నీవు దేవుని దర్శించి దేవు డనగా ఏమో తెలిసికోవచ్చు." రాము డిట్లనగానే రాజకుమారుడు, "బాగా ఉన్నది. మీరు చెప్పింది సకారణంగా ఉన్నది. నే నెవరో మీకు చెపుతాను. ఉత్తర భారతదేశంలో హిమాలయ పర్వతము లందు వసించే ఫలానా రాజుగారి కుమారుణ్ణి నేను. ఇది నా పేరు" - అని చెప్పి, ఆ విలాసమును ఒక కాగితం ముక్కపై వ్రాసి రాముని కిచ్చాడు. రాముడు దాన్ని చదువుకొని దేవుని కియ్యకుండా. తిరిగి ఆ రాజకుమారునకే యిచ్చి, ఈ విధంగా అన్నాడు: "ఓ రాజ కుమారా! నీ వెవరవో నీకు తెలీదు. నీ తండ్రియైన మహారాజుగారి దర్శనానికి వచ్చి, తన పేరేదో వ్రాసి పంపడానికి చేతగాని ఒక నిరక్షరాస్యుడైన అనాగరికుని లాగా నీ వున్నావు. తన పేరేదో వ్రాసి పంపలేని ఆ విద్యాగంధ శూన్యుడైన మూఢునకు మీ తండ్రియైన మహారాజుగారు స్వాగతమిస్తాడా? యువరాజా! నీకు నీ పేరు వ్రాయడం చేతకాదు. దేవుడు నీ కేవిధంగా దర్శన మిస్తాడు. నీ వెవరవో సక్రమంగా ముందు తెలుపు. అప్పుడు దేవుడు నీకడకు వచ్చి, రెండు చేతులు చాపి నిన్నాహ్వానిస్తాడు."

ఆ బాలుడు ఆలోచనా నిమగ్నుడైనాడు. తా నెవరో - నన్న విషయంపై ఆతడాలోచింపసాగాడు. అట్లా ఆలోచించి ఆలోచించి, ఆ రాజకుమారు డిట్లన్నాడు "స్వామీ! స్వామీ! ఇప్పుడు తెలిసింది. పొరపాటు తెలిసింది. నా పేరు వ్రాయడంలో నేను పొరపాటు బడ్డాను. నేను నా శరీరముయొక్క విలాసం మాత్రమే మీకు తెలిపాను. నే నెవరినో నేను వ్రాయలేదు."

రాజకుమారునిప్రక్కనే నిల్చుండియున్న సేవకున కీవిషయం అర్థంకాలేదు. తనసేవకున కీవిషయం అర్థమయ్యేలాగు చేయడంకోసం, రాజకుమారుడు సేవకు నిట్లు ప్రశ్నించాడు: "ఈ కాగితపుముక్క ఎవరిది?" సేవకుడు, "నాది" అని జవాబిచ్చాడు. రాజకుమారుడు, సేవకునిచేతిలోనికఱ్ఱ తీసికొని, "ఈ కఱ్ఱ ఎవరిది?" అని ప్రశ్నించాడు. "నాది" అన్నాడు సేవకుడు. "సరేగాని, ఈ తలగుడ్డ ఎవరిది?" అని

ప్రశ్నించాడు. రాజకుమారుడు. "నాది" అన్నాడు సేవకుడు. రాజకుమారు డాపైన ఇట్లన్నాడు: "సరే. తలగుడ్డ నీదైతే, నీకూ తలగుడ్డకూమధ్య సంబంధ మున్నది. అంటే ఈ తలగుడ్డ నీ ఆస్తి అన్నమాట. నీవు దీనికి యజమాని వన్నమాట. అంతేగాని. నీవు తలగుడ్డవు కాదు. తలగుడ్డ నీకు చెందిందిమాత్రమే. అంతేనా ?" సేవకుడు, "అవునంతే నండీ! ఇది సుస్పష్టవిషయం" అన్నాడు. తిరిగి రాజకుమారుడు, "ఈ పెన్సిలు నీది. ఇది నీకు చెందింది. కానీ నీవు పెన్సిలువు కాదుకదా" అని ప్రశ్నించాడు. "పెన్సిలు నాకు చెందింది. పెన్సిలు వేరు; నేను వేరు. పెన్సిలు నేను కాదు. పెన్సిలు నా ఆస్తి. దాని కధిపతిని నేను"- అని సేవకుడు ప్రత్యుత్తర మిచ్చాడు. "సరే" నంటూ రాజకుమారుడు, సేవకుని చెవులుపట్టుకొని, "ఈ చెవులు ఎవరివి ?" అని ప్రశ్నించాడు. "నావి" అన్నాడు సేవకుడు. రాజకుమారుడు, "చెవులు నీవి. కానీ చెవులు నీవుగావు. అలాగే- ముక్కు నీది. కానీ ముక్కు నీవు కాదు. అలాగే- ఈ శరీర మెవరిది?" అని మళ్ళీ ప్రశ్నించాడు. "ఈ శరీరం నాది. ఈ శరీరం నాకు చెందింద" అని సేవకుడు ప్రత్యుత్తర మిచ్చాడు. అప్పుడు రాజకుమారు డిట్లన్నాడు : "ఓయీ! ఈ శరీరం నీది అయితే, నీవు శరీరానివి కాదు. నా చెవులు, నా ముక్కు, నా తల, నా చేతులు నా శరీరం- అన్నమాటలోనే, ఈ వివిధావయవాలతోగూడిన శరీరం వేరనీ, నీవు శరీరానికి భిన్నమైన వేరొకపదార్థానివనీ, నిరూపణ మవుతున్నది. ఈ శరీరం నీ సొమ్ము. దీనికి నీవు స్వామివి. దీనికి నీవు అధిపతివి. ఈ శరీరం నీవు ధరించిన ఆభరణం. దీనికి నీవు యజమానివి ఈ శరీరం ఒక అశ్వంవంటిది. దీనికి నీవు యజమానివి. ఈ దేహాధిపతివైన నీ వెవరు ? నీ వేమైయున్నావు ?" ఇంతవరకు సేవకుడు అర్థంచేసుకొన్నాడు. దేహముయొక్క చిరునామావ్రాసి, తనయొక్క చిరునామా వ్రాసినానని తెలపడంలోని రాజకుమారుని పొరపాటు నాతడు గ్రహించాడు. "నీవు దేహానివి కాదు. నీవు చెవులు కాదు. నీవు ముక్కు కాదు. నీవు కండ్లు కాదు. నీవు ఇంద్రియాలు కాదు. మరి, నీ వేమిటి ? నీ వెవరు ?" రాజకుమారుడు, కొంతతడ వాలోచించి, "స్వామీ ! స్ఫురించింది. నేను మనస్సునై తీరుతాను. నేను మనస్సునై యుంటా" నన్నాడు. అప్పుడు రాజకుమారుని రాము డిట్లు ప్రశ్నించాడు :

"నీవు నిజంగా మనస్సువేనా? నీ శరీరంలో ఎన్ని ఎముకలున్నవో నీవు చెప్పగలవా? నీవు ప్రొద్దున భుజించిన ఆహారం నీ దేహంలో ఏ భాగంలో ఉన్నదో చెప్పగలవా?" ఈ ప్రశ్నకు రాజకుమారుడు సమాధానంచెప్పలేక "నా మనస్సునకు అంతదూరం ఆలోచించేశక్తి లేదు. నేను శరీరశాస్త్రాధ్యయనం చేయలేదు. నా బుద్ధి ఆ విషయాలను గ్రహించలే" దన్నాడు.

రాజకుమారు డిట్లు ప్రశ్నింపబడ్డాడు. "ప్రియమైన రాజకుమారా! నీ మనస్సుకు అంత శక్తి లేదన్నావు. నీ బుద్ధి ఆ విషయాన్ని అందుకోలేదన్నావు. నీ చిత్త మంతటి ఎత్తుల కెగరలేదన్నావు. నీవు నా మనస్సంటున్నావు. నా బుద్ధి అంటున్నావు. నా చిత్తమంటున్నావు. అలాంటప్పుడు నీవు చిత్తానివి కాదు. నీవు మనస్సువుకాదు. నీవు బుద్ధివికాదు. నీ మాటలే నీవు నీ మనస్సుకు అధినేతవని; చిత్తానికి అధిపతివని; బుద్ధికి స్వామివని; నిరూపిస్తున్నాయి. నీవు మనస్సువుకాదు. బుద్ధివికాదు. చిత్తానివికాదు. మరి, నీ వేమైయున్నావో ఆలోచించు. బాగా ఆలోచించు. నీవనగా ఏమో పొరపడకుండా సరిగా చెప్పు. నిన్ను నీవు తెలిసిన తత్క్షణం నీ ముందు దేవుడు నిలుస్తాడు. దేవుడు నీ ముందు ప్రత్యక్షమవుతాడు. నీవు ఎవరవో తెలుపు."

ఆ పిల్లవాడు తీవ్రంగా ఆలోచింపసాగాడు. ఎంత ఆలోచించినా సమాధానం తట్టక తుదకు, "నా మనస్సు ఇంక పైకి పోలే"దన్నాడు.

ఓహో! ఈ మాటల్లో సత్యమున్నది! నిజానికి మనోబుద్ధులు పరబ్రహ్మను అందుకోలేవు. సత్యాత్మ-సత్యబ్రహ్మము-మనోవాచామగోచరమైంది.

రాముడు, ఆ బాలుని కొంచెము సేపు కూర్చుండి, ఆతని మనస్సు అందుకోగలిగిన విషయాన్ని గూర్చి ధ్యానంచేయమన్నాడు. "నేను శరీరాన్ని కాదు. నేను మనస్సునుకాదు." అని నీవు తెలుసుకొన్నావుకదా. దీన్ని ధ్యానంచెయ్యి. అనుభవంలో పెట్టు. దీన్ని మరల మరల సంభావించు. సమాచరించు. నీవు శరీరానివి కావని తెలుసుకో. ఈ భావమును నీవు ఉజ్జీవించినట్లైతే, ఈ సత్యాంశమును

నీవు ఆచరణలో పెట్టుకోగలిగినట్లైతే, నీవు మనోదేహాలకు అతీతుడవు కాగలిగినట్లైతే, నీవు సమస్త దుఃఖాందోళనావిముక్తుడవవుతావు. నీవు మనోదేహభూమికల నధిగమించగానే, భయం నిన్ను వదలి పారిపోతుంది. నీవు శరీరానికీ, మనస్సుకూ అతీతమైన ఏదో ఒకానొక పదార్థానివి-అన్నంతవరకైనా సత్యాన్ని గ్రహించినంతనే, సమస్త దుఃఖభయాందోళనలు వదలిపోతాయి.

పిదప. తనను తాను తెలిసికొనేలాగు చేయడానికి, ఆ బాలు నిట్లు ప్రశ్నించడం జరిగింది. "నాయనా! రాజకుమారా! ఇవ్వాళ నీ వేమిచేశావు? ఇవ్వాళ ఉదయం నీవుచేసిన పనులన్నీ చెపుతావా?"

ఆ రాజకుమారుడిట్లు చెప్పాడు: "నేను ఉదయమే లేచాను, కాలకృత్యాలు తీర్చుకొన్నాను. అన్నం తిన్నాను. చాలాసేపు చదువు కొన్నాను. ఉత్తరాలు వ్రాశాను. కొందరు మిత్రులను కలసికొన్నాను. కొందరు మిత్రులను ఆహ్వానించాను. ఆ పిదప శ్రీ స్వాములవారిని సందర్శించడానికి వచ్చాను."

అప్పుడు రాజకుమారుని, రాముడు, "ఇంతేనా? ఇంకా ఏ పనులూ చేయలేదా? బాగా ఆలోచించ"-మని అడిగాడు. అతడు ఆలోచించాడు. ఆలోచించాడు. మఱచినవి గుర్తుకుదెచ్చుకొని, మరి కొన్ని అలాంటి పనులే ఏవేవో చెప్పాడు. "ఇవ్వేకాదు. ఇంకా నీవు వేలవేల పనులు కోటానుకోట్ల పనులు చేశావు. అసంఖ్యాక కార్యాలు చేశావు. కానీ నీవు వాటన్నిటినీ చెప్పడంలేదు. నీవువానిని దాచ కూడదు. ఇంకా నీ వేవే పనులు చేశావో చెప్పు. ఈ ఉదయం నీ వేవే పనులుచేశావో అవన్నీ చెప్పు"అని రాముడడిగాడు.

తాను తెలిపినకొలదిపనులేకాకుండా కోటానుకోట్లకార్యాలు తానెప్పుడు చేశానని రాజకుమారు డాశ్చర్యపడ్డాడు. "మీరు చెప్పిన పనులుతప్ప నే నేపనులూ చేయలేదు. నేనింకేమీ చేయలేదు" - అన్నాడు రాజకుమారుడు. "అట్లుకాదు. నీవుకోటానుకోట్లకార్యాలు చేశావు"అన్నాడు రాముడు. "అదెట్లు?" అని ఆశ్చర్యపడ్డాడు రాజకుమారుడు.

"ఇప్పుడు స్వామివైపుచూస్తూన్న దెవరు?" అని రాముడు రాజ కుమారుని ప్రశ్నించాడు. "నేను" అని జవాబిచ్చాడు రాజకుమారుడు, "నీవీ ముఖాన్ని చూస్తున్నావా? మరి ప్రక్కన ప్రవహించే గంగా నదినికూడా చూస్తున్నావా?" అని రాము డడిగాడు. "ఆ ముమ్మాటికి చూస్తున్నా" నని రాజకుమారుడు చెప్పాడు. "మంచిది. నీవు నదిని చూస్తున్నావు. స్వామిముఖాన్ని చూస్తున్నావు. అయితే, కండ్లలోని ఆరుకండరాలను చలింపచేస్తున్న దెవరు? నేత్రాలలో ఆరు కండరాలు సంచలిస్తాయన్నవిషయం నీకు తెలుసుకదా. మరి ఆ ఆరు కండరాలను సంచలింపచేస్తున్న దెవరు ? ఇతరులెవరూ కాదు. ఇతర మేదీ కాదు. దర్శనక్రియలో, కండ్లలోని కండరాలను సంచలింప జేస్తున్నది నీ స్వస్వరూపమైన ఆత్మే - నీవే

ఆ పిల్లవా డన్నాడు. "అవును. నేత్ర కండరాలను సంచలింప జేస్తున్నది, నేనే అయితీరుతాను. ఇతర మేదీ కాదు'

"మంచిది. ఇప్పుడు చూస్తున్న దెవరు ? ఇప్పుడు వింటున్న దెవరు?" అన్నాడు రాముడు. "నేనే. నేనే" అన్నాడు బాలుడు. "సరే నీవే చూస్తున్నట్లయితే, నీవే వింటున్నట్లయితే, శబ్ద నాళాలను ప్రకంపింపజేస్తున్న దెవరు? నీవే. ఇతర మేదీ కాదు, మరి, ఈ ఉదయం ఆహారం స్వీకరించిన దెవరు?" అన్నాడు రాముడు. బాలుడు, "నేనే, నేనే"అన్నాడు. అప్పుడు రాము డిట్లు చెప్పాడు : "ఈ దిన ముదయం నీవు భోజనంచేసినట్లయితే, నీవే మలవిసర్జనంచేసినట్లయితే, ఆ ఆహారాన్ని జీర్ణింపజేసిన దెవరు? భోజనంచేసింది నీవైనప్పుడు విసర్జించింది నీవైనప్పుడు, జీర్ణింపజేసిందికూడా నీవుగాక వేరొకరు కారు. ప్రకృతిలోని సంఘటనలకు బాహ్యాకారణాలను అంటగట్టేరోజులు పోయాయి. ఒక మనిషి క్రిందపడితే, దానికి కారణం ఏదోబాహ్యమైన పిశాచ మని చెప్పడ ముండేది. విజ్ఞానశాస్త్రం ఇలాంటిసమస్యాపరిష్కృతుల నొప్పుకోదు. విజ్ఞానశాస్త్రమూ, తత్త్వశాస్త్రమూ, ఒకవిషయముయొక్క కారణాన్ని (The cause of a phenomenon) ఆ విషయంలోనే అవలోకించమంటాయి.

నీవు ఆహారాన్ని స్వీకరిస్తావు. తదుపరి విసర్జిస్తావు. ఆ ఆహారం జీర్ణంగాబడిందంటే, అది నీవల్లనే జీర్ణంకాబడాలె. వెలుపలినుంచి ఏదో శక్తి వచ్చి దాన్ని జీర్ణంచేయడం లేదు. లోపల అన్నం జీర్ణకర్మను చేసినది నీ స్వస్వరూపమైన ఆత్మయే అయి తీరుతుంది. ఈ జీర్ణ క్రియా కారణాన్ని నీ లోనే చూడాలెగాని, నీకు వెలిగా చూడ కూడదు."

ఆ బాలుడు ఇంతవరకు అర్థంచేసికొన్నాడు. ఆ పిదప, ఆ బాలుని రాము డిట్లడిగాడు : "నాయనా! రాజకుమారా! కొంచె మాలోచించు. కానీవు నీలోనీవు విచారించు. అన్న జీర్ణ కర్మ జరగ డానికి వందలాది సంచలనాలు జరగాలె. జీర్ణ క్రియా విధానంలో చర్వణ క్రియలో, నోటి యందలి మాంస గ్రంథులనుండి లాలాజలం వెలువడింపబడుతుంది. తదుపరి జీర్ణక్రియా విధానంలో రెండవ ఘట్టం వస్తుంది. ఈ రెండవ ఘట్టంలో ఆహారం రక్తంగా మారుతుంది. ఆ రక్తం నాళములగుండా ప్రవహిస్తుంది. అదే ఆహారం, కండరాలుగా ఎముకలుగా, వెంట్రుకలుగా మార్పొందుతున్నది. ఈ విధంగా శరీరంలో అభివృద్ధి కార్యక్రమం జరిగి పోతున్నది. ఇట్లు జరిగి పోతున్న మహా కార్యక్రమ బాహుళ్యమంతా జీర్ణ కర్మకు సంబంధించిందే.

ఆహారమును తీసికొనేది నీవే అయినప్పుడు, ఆహార జీర్ణ కర్మకుకూడా కారణం నీవే. నీ రక్త నాళాలగుండా రక్తాన్ని ప్రవ హింప జేస్తున్నది నీవే. వెంట్రుకలను పెరుగ జేస్తున్నది నీవే. శరీరాన్ని వృద్ధిపరుస్తున్నది నీవే. ఇప్పుడు గమనించు. ఎన్నెన్ని కార్యక్రమాలు, ఎన్నెన్ని పనులు, ప్రతి క్షణమూ నీవు చేస్తున్నావో!"

ఆ బాలుడు ఆలోచిస్తూ ఇట్లన్నాడు : "అవు నవును-స్వామీ! ఈ శరీరంలో, బుద్ధికూడా తెలిసికోలేని విధానంలో అగణిత కార్య క్రమాలు జరుగుతున్నవి. మనస్సుకు తెలియకుండానే సాగిపోతున్న ఆ కార్యకలాప మంతటికీ కారణం తప్పక నేనే అయి ఉంటాను. ఆ అగణిత కర్మ ప్రవాహ సర్వకర్తను నేనే అయి తీరుతాను. సర్వ కార్యకర్తను నేనే అయికూడా, 'నే నీదైనందిన కృత్యాలు మాత్రమే

చేశాను. నే నీ కొద్ది పనులే చేశాను. ఇంతకన్నా నేనేమీ చేయ లేదు' - అని మనస్సు యొక్క ప్రాతినిధ్యంలో జరిగిన పనులు మాత్రమే నేను పేర్కొనడంలో పొరపడ్డాను."

ఈ విషయం విశదీకరింప పడుతుంది: నీ దేహంలో ద్వివిధ కార్యక్రమాలు జరుపబడుతున్నవి - తెలియకుండా జరిగే పనులు; తెలిసి జరిగే పనులు. తెలిసి జరిగే పనులు మనః ప్రాతినిధ్యం ద్వారా జరుప బడుతుంటాయి. ఉదాహరణకు - చదవడం, వ్రాయడం, నడవ డం, మాట్లాడడం, త్రాగడం, మొదలైన పనులు. ఈ పనులు మనః ప్రాతి నిధ్యం ద్వారా లేక బుద్ధి ప్రాతి నిధ్యం ద్వారా, నిర్వర్తింప బడుతుంటాయి. ఇక మనస్సుకు తెలియకుండా, బుద్ధియొక్క ప్రాతి నిధ్యంతో సంబంధం లేకుండా, మనో మధ్యవర్తిత్వం లేకుండా, నేరుగా నిర్వర్తింపబడే పనులు వేలకు వేలు. ఉదాహరణానికి - ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియ, నాడీమండలంలో రక్తం ప్రవహించడం, వెంట్రుకలు పెరగడం, మొదలైన పనులు

మనః ప్రాతినిధ్యంలో జరిగేపనులుమాత్రమే తాము చేస్తున్న పను లని ప్రజలు తలుస్తున్నారు. ఇది పెద్దపొరపాటు. మనఃప్రాతినిధ్యం లేకుండా నేరుగా జరుపబడుతున్న తదితర కార్యములన్నీ తమపనులు కానట్లు సంపూర్తిగా త్రోసివేయబడ్డాయి. ఈ పొరపాటుచేతనే, ఈ సంకుచితచిత్తమున సత్యాత్మను బంధించడంచేతనే, ఈ ఖండమైన బుద్ధితో అఖండమైనఆత్మను సరిపోల్చడంచేతనే, మానవులు తమ్ము తాము దుఃఖితులనుగా దురదృష్టవంతులనుగా చేసికొంటున్నారు. "దేవుడు మాలో ఉన్నాడు" అని జనులంటారు. నిజమే. స్వర్గరాజ్యం నీలో ఉన్నది. దేవుడు నీలో ఉన్నాడు. కానీ, ఆ నీలోఉన్నరసమే- నీవుగాని, పైతోలువు నీవు కాదు. ఈ సత్యమునుగూర్చి ప్రగాఢంగా చింతనచెయ్యి. నీవు లోనగలసత్యరసానివో పైనగల డిప్పవో గాఢంగా విచారణచెయ్యి. నీవు నీలోగలపరమాత్మవో లేక బాహ్యదేహానివో ఆలోచించు!

"నేను తింటాను. ప్రకృతి (Nature) జీర్ణింపజేస్తుంది. నేను చూస్తాను. ప్రకృతి కండరాలను కదలింపజేస్తుంది. నేను వింటాను. ప్రకృతి నాడీమండలాన్ని ప్రకంపించేలాగుచేస్తుంది" అని కొందరంటారు. న్యాయంపేరట, సత్యంపేరట, స్వాతంత్ర్యంపేరట, నీవా ప్రకృతివో లేక దేహానివో గుర్తించు. నీ వా ప్రకృతివి. నీవా అనంత పరబ్రహ్మావు. అసూయల నావలద్రోసి, దురభిమానముల దూరంగా నెట్టి, మూఢవిశ్వాసాలపై మోజునువిడిచి, ఈ విషయమునుగూర్చి బాగా ఆలోచించు. తర్కించు. అన్వేషించు. పరిశోధించు. రాముని ఆశయంతో నీ వేకీభవిస్తావు. నీవు లోనగల శక్తి వని, అఖండప్రకృతి వని, తెలుసుకొంటావు.

మీలో చాలామంది, ఈ వాదంలోనిమూలాన్ని అర్థంచేసికొని ఉంటారు. కానీ, ఆ రాజకుమారుడు సంపూర్ణంగా అర్థంచేసికోలేదు. బుద్ధికివేరైన- బుద్ధికి అతీతమైన- ఏదేబకానొకవస్తువును నేను- అన్నంత వరకుమాత్రం తెలుసుకొన్నా" నన్నాడు. ఆ సందర్భంలో రాజకుమారుని సేవకుడు "అయ్యా! విషయమును ఇంకా నాకు బాగా అర్థమయ్యేలాగు చెయ్యండి" అని అడిగాడు. రాముడా రాజభటు నిట్లు ప్రశ్నించాడు: "నీవు నిద్రపోయేటప్పుడు, చనిపోతావా? జీవించే ఉంటావా?" సేవకుడు, "నేను జీవించే ఉంటాను. నేను చావను"- అని సమాధానమిచ్చాడు. "అయితే, బుద్ధివిషయ మేమిటి?" అని ప్రశ్నింపబడింది. "నేను కలలుగంటుంటాను. బుద్ధి ఆ సమయంలో కూడా ఉన్నది." అని సేవకుడు ప్రత్యుత్తరమిచ్చాడు. "మరి, గాఢ నిద్రావస్థలో (స్వప్నములుండని సుషుప్త్యవస్థలో) నీ వున్నప్పుడు, బుద్ధి ఎక్కడ ఉన్నది? నీ మనస్సెక్కడఉన్నది?

ఆతడాలోచింపసాగాడు. "బుద్ధి అప్పుడు శూన్యంలోకి పోతుంది. బుద్ధి అప్పుడుండదు. మనసక్కడ ఉండదు. కానీ నీవు మాత్రం అక్కడ ఉన్నావా? లేవా?" అని రాముడడిగాడు. ఆతడు, "నేను మాత్రం ఉంటాను. నేను చావను. నిలిచే ఉంటాను"-అని ఆతడన్నాడు. రాముడిట్లు నిర్వచించాడు: "ఇక్కడ గమనించు. బుద్ధిఆగిపోతున్న- బుద్ధి సంస్తంభితమైన బుద్ధి దూరంగా వంకెకు తగిలింపబడిన ఆభరణం

లాగానో, కోటులాలాగానో ఉంటున్న-గాఢ నిద్రావస్థలో, నీవుమాత్రం ఉన్నావు. నీవు చావడంలేదు." అప్పుడు రాజకుమారు డిట్లన్నాడు: "బుద్ధి ఆ స్థితిలో లేదు. అప్పుడు నేను చావడంలేదు. ఈ విషయమే నాకు విస్పష్టంగా అర్థంకావడంలేదు."

రాముడు రాజకుమారు నిట్లు ప్రశ్నించాడు: "నీవు గాఢ నిద్రనుండి లేచిన పిదప, 'నేను ఈ రాత్రి శాంతంగా నిద్రపోయాను. నాకీరాత్రి ఒక్క కలగూడా రాలేదు'-అని నీవు పేర్కోవా?" "ఆ-పేర్కొంటాను"-అన్నాడు రాజకుమారుడు. ఇది అతి సూక్ష్మమైన విషయం. మీ రందరూ శ్రద్ధగా వినాలె. గాఢనిద్రనుండి లేచిన తర్వాత, "నేను స్వప్నరహితమైన సుఖనిద్రపోయాను. నేను నదులు చూడలేదు. పర్వతాలు చూడలేదు. ఆ స్థితిలో తల్లీ లేదు. తండ్రీ లేదు. ఇల్లూ లేదు. ఇల్లాలూ లేదు. ఏమీ లేదు. దృశ్య ప్రపంచమంతా నశించిపోయింది. అక్కడ శూన్యం, శూన్యం కేవల శూన్యంతప్ప వేరొకటి కనబడలేదు. నేను గాఢ నిద్రపోయాను. ఆ నిద్రలో అంతా శూన్యమే"-అని చెప్పడం జరుగుతుంది. ఈ విషయం, ఒక ప్రదేశం నిర్జనమైయున్నదన్న విషయానికి సాక్షిగా వచ్చిన ఒక మనిషియొక్క వాఙ్మూలంలాగా ఉన్నది. ఆ మనిషి, "అర్ధరాత్రివేళ, ఫలానా స్థలంలో, ఒక్క మనిషి కూడా లేడు"- అని సాక్ష్యం చెప్పాడు. ఆ మనిషిని ఈ విషయాన్ని కాగితంమీద వ్రాసి యిమ్మన్నారు. అట్లే అతడు వ్రాసి యిచ్చాడు. "ఈ నీ వాఙ్మూలం నిజమేనా?" అని న్యాయాధికారి అతణ్ణి అడిగాడు. అతడు, "అయ్యా! నిజమే" నన్నాడు. "సరేగాని, ఈ విషయం ఎవరైనా చెపితే విన్నావా? నీ కండ్లార నీవు చూశావా?"-అని న్యాయాధిపతి ప్రశ్నించాడు. ఆ మనిషి, "అయ్యా! నేను స్వయంగా చూచిన సాక్షిని. ఎవరో చెపితే నేను విని చెప్పడంలేదు." అని సమాధానం చెప్పాడు. "నీ వాఙ్మూల పత్రంలో తెలుపబడిన ఆ సమయంలో, ఆ స్థలంలో, ఒక్క మనిషికూడా లేడన్న విషయాన్ని నీవు స్వయంగా చూచావా?" అని మళ్ళీ న్యాయాధికారి ప్రశ్నించాడు. "ఆ స్వయంగా నేను చూచానయ్యా!" అన్నాడా మనిషి. "నీ వెవరు? నీవు మనిషివా? కాదా?" అని న్యాయాధికారి ప్రశ్నించాడు.

ఆ మనిషి "అవునండీ! నేను మనిషి నే" అని సమాధానమిచ్చాడు. అప్పుడు న్యాయాధికారి ఇట్లన్నాడు. "అయితే మంచిది. నీ దృష్ట్యా ఈ వాఙ్మూలం నిజమైతే, మా దృష్ట్యా అబద్ధం. ఎందుకంటే, ఆ సమయంలో నీ వొకడ వున్నావుకదా? నీవు మనిషివేకదా? అలాంటప్పుడు 'ఆ స్థలంలో, ఆ సమయంలో, ఒక్క మనిషైనా లేడు-అన్న నీ వాఙ్మూలం అక్షరాల (శబ్దార్థప్రకారం) నిజంకాదు. ఆ స్థలంలో నీవున్నావు. నీ ప్రకారం నీ వాఙ్మూలం నిజమైతే, మా ప్రకారం అది అసత్యమౌతుంది. అక్కడ ఎవరూ లేరని చెప్పడానికి అక్కడ కనీసం నీవైనా ఉండితీరాలికదా"

నీవు గాఢనిద్రావస్థలోనుంచి మేల్కొన్నపిదప, "నాకు స్వప్నంలో ఏమీ కనబడలేదు"-అని చెపుతావు. మే మంటాము కదా- నీవుమాత్ర మున్నావు. ఆ స్థితిలో, తండ్రి లేకపోయినా, తల్లి లేకపోయినా, భార్య లేకపోయినా, భర్త లేకపోయినా, ఇల్లు లేకపోయినా, కుటుంబం లేకపోయినా, ఏమి లేకపోయినాసరే-నీ వుండితీరుతావు. నీవు చెప్పినసాక్ష్యమే, నీవుమాత్రం నిద్రపోలే దని, నిరూపిస్తున్నది. 'నీవు' నిద్రపోయినట్లైతే, ఆ సుషుప్త్యవస్థలోని శూన్యతనుగూర్చి ఎట్లు చెప్పడం జరుగుతుంది? నీవు బుద్ధ్యతీతమైన ఒకానొకపరమపదార్థానివి. బుద్ధి నిద్రావశమైంది. బుద్ధి విశ్రాంతివహించింది. కానీ నీవుమాత్రం నిద్రపోలేదు. నీవుగనుక నిద్రపోయినట్లైతే, రక్తనాళాలగుండా రక్తాన్ని ప్రవహింపజేసే దెవరు? గర్భకోశంలో అన్నజీర్ణకర్మను చేయిస్తున్న దెవరు? నీవు నిజంగా గాఢనిద్రావశుడవైనట్లయితే, అనుక్షణం దేహాభివృద్ధికర్మను కొనసాగిస్తున్న దెవరు? అందుచేత నీవు నిత్యనిర్నిద్రమైన ఒకానొకపదార్థానివి. నీవు నిత్యప్రబుద్ధుడవు. బుద్ధినిద్రపోతుంది. కాని నీవు నిద్రపోవు 'నేను'- మనోబుద్ధ్యతీతమైన ఒకానొకపరమవస్తువు."

ఇప్పుడు రాజకుమారు డన్నాడు: "ఆర్యా! నాకింతవరకు తెలిసింది. నేను, నిత్యనిర్నిద్రమైన, నిత్యనిర్వికల్పమైనదివ్యశక్తి నని, అఖండశక్తి నని, తెలిసికొన్నాను.

యౌవనంలో శరీరం వేరొకవిధంగా ఉన్నది. శైశవ దశలో మనస్సు ఇప్పు డున్నట్లు లేదు. శైశవదశలో బుద్ధీ, దేహమూ, ఇప్పు డున్న విధానానికి సంపూర్ణంగా వేరైనవిధానంలో ఉన్నవి. వైద్య శాస్త్రజ్ఞులు, సప్తవర్షాలఅనంతరం, దేహమంతా ఒకమార్పు చెందుతుందంటారు. క్షణక్షణం, దేహం పరిణామాన్ని పొందుతున్నది. క్షణక్షణం మనస్సు పరిణామాన్ని పొందుతున్నది. నీ బాల్యావస్థలో ఉన్న మనస్తత్వం, మానసికభావాలు, ఇప్పు డెక్కడున్నవి? బాల్యావస్థలో నీవు, సూర్యబింబాన్ని దేవతలుభుజించే రమ్యమైన రొట్టెగా భావించావు. చంద్రబింబాన్ని తళతళలాడే వెండిరేకనుకున్నావు. తారకాకోటిని ధగధగ మెరసే వజ్రాలుగా ఊహించావు. ఇప్పు డా ఊహలన్నీ ఎక్కడికి పోయాయి? "నేను శైశవదశలో ఉన్నప్పుడు, నేను బాల్య దశలో ఉన్నప్పుడు, నేను డెబ్బదేండ్లవయస్సులో ఉండేటప్పుడు" అని నీవు చెప్పుతున్నప్పుడు- శైశవంలో, బాల్యంలో, వార్ధక్యంలో, 'నీవు మారకుండా ఉన్ననిత్యపదార్థాని వని నిరూపింపబడుతున్నది. "నేను నిద్రపోయాను, నేను గాఢనిద్రావస్థలోనికి పోయాను" - అని నీ వన్నప్పుడు- నీలో జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలన్నింటిలో మారక, నిరంతరం అవికల్పమై ఏకరీతిగా సత్యమైన "నేను" ఉన్నదని తేలుతున్నది. నీవు నిద్రపోతున్నా, స్నానంచేస్తున్నా, ఏపనిచేస్తున్నా, మారక ఏకరీతిగా వెలుగుతున్న ఒకానొకపరమవస్తువు నీలో ఉన్నది. అంతర్విచారణ చేసి చూచుకో. సత్యాన్ని తెలుసుకో. సర్వకాల సర్వావస్థల్లో నిర్వికారమై, నిర్వికల్పమై, ఏకరీతిగా ప్రకాశిస్తున్న ఒకానొక పరమవస్తువువు కాదా నీవు? అయితే, ఇంకా కొంచెం విచారణచెయ్యి- మరికొంచెం ఆలోచించి చూడు. ఇక ముఖాముఖి భగవద్దర్శనం కాబోతున్నది. నిన్ను నీవు తెలుసుకో; నీ సత్యమయినచిరునామా కాగితంమీద వ్రాయి. తత్క్షణం నీకు భగవద్దర్శనం లభిస్తుం దని రాముడు వాగ్దానం చేశాడుకదా.

ఇప్పుడు రాజకుమారుడు తనను తాను తెలిసికొన్నట్లు, తా నొక నిత్యనిర్వికల్ప నిర్నిద్రపదార్థము వని గ్రహించినట్లు తెలియజేసి, ఇక దేవు డనగా ఏమిటో తెలియగోరాడు. రాజకుమారున కిట్లు

ప్రశ్న వేయబడింది: "ఇక్కడ పెరుగుతున్న ఈ చెట్లనుచూడు. ఈ చెట్టును పెంచుతున్న శక్తి, ఆ చెట్టును పెంచుతున్న శక్తికి వేరైందా?" రాజకుమారుడు, "వేరైందికాదు. సర్వవృక్షాలను పెంచుతున్న శక్తి ఒకటే"- నని సమాధానమిచ్చాడు. "అయితే, ఇప్పుడు, ఈ వృక్షాలన్నిటినీ పెరుగజేస్తున్న శక్తి జంతుశరీరాలను పెరుగజేస్తున్న శక్తికి వేరైందా?" అని మరల ప్రశ్న వేయబడింది. "వేరైంది కాదు. వృక్ష దేహాలనూ జంతు దేహాలనూ పెంచుతున్న శక్తి ఒకటే" అని రాజకుమారుడు జవాబిచ్చాడు. "సరేగాని, తారకా కోటులను పరిభ్రమింప జేసే శక్తి, నదీనదాలను ప్రవహింపజేసే శక్తి వేరైనదా?" అని మరల ప్రశ్నింప బడింది. "వేరైనదికాదు. తారకాకోటులను పరిభ్రమింప జేసేశక్తి, నదీనదాలను ప్రవహింపజేసే శక్తి - ఒకటే" - అని రాజ కుమారుడు సమాధాన మిచ్చాడు. అప్పుడు రాముడిట్లు ప్రసంగించాడు: ఈ వృక్షాలను పెంచుతున్న శక్తి, నీ శరీరాన్ని పెంచుతున్న శక్తికి, నీ వెంట్రుకలను పెంచుతున్న శక్తికి భిన్నమైందికాదు. ఆ ఏకైక విశ్వాత్మక ప్రకృతి శక్తే - ఆ ఏకైక విశ్వాత్మక పరబ్రహ్మమే - ఆ ఏకైక విశ్వాత్మకా చింత్యమూల వస్తువే - నక్షత్ర కోటిని ప్రకాశింప జేస్తున్నది. నీ నేత్రాలను మిలమిల లాడే లాగు చేస్తున్నది. నీ శరీరమందలి వెంట్రుకలను పెరిగేలాగు చేస్తున్నది. సమస్త మానవ నాడీమండలాలలో రక్తాన్ని ప్రవహింప జేస్తున్నది. అలాంటప్పుడు నిజంగా నీ వేమై యున్నావు? నీ వెంట్రుకలను పెరుగ జేస్తున్న, నీ నాడీ మండలంలో రక్తాన్ని ప్రహింప జేస్తున్న, నీ ఆహారమును జీర్ణింప జేస్తున్న - ఆ శక్తివి - నీవు కావా? ఆ మహాశక్తివి నీవు కావా? నిజంగా ఆ మనోబుద్ధ్యా తీతమైన శక్తివి నీవు. అందుచేత, సమస్త బ్రహ్మాండాన్ని పరిపాలిస్తున్న తదేక శక్తివి నీవే. సమస్త విశ్వ వ్యాప్తమై ప్రకాశిస్తున్న, తదేక బ్రహ్మవు - తదేక పరమాత్మవు, - తదేకాచింత్య శక్తివి - తదేక మూలకారణానివి - నీవే! అనేక నామాలతో పేర్కొన బడుతున్న తదేక దివ్య తత్త్వానివి నీవే! సర్వ వస్తు జాలంలో ప్రకాశిస్తున్న ఆ ఏకైక పరతత్త్వానివి నీవే!

రాజకుమారుడాశ్చర్యపడి యిట్లన్నాడు. "హృత్పూర్వకంగా నేను దేవుని తెలుసుకో దలచాను. దేవుడనగా ఏమిటని నేను ప్రశ్నించాను. నా స్వస్వరూపమైన ఆత్మయే - సత్యాత్మయే - దేవుడని గ్రహించాను. ఎంత పిచ్చి ప్రశ్న వేశాను! నన్ను నేను తెలుసుకుంటే, దేవుని తెలుసుకొన్నట్లయింది." ఈ విధంగా దేవుడు తెలుసుకోబడ్డాడు.

ఈ మహా సత్యమును తెలిసికోవడంలో ఒకటే కష్టమున్నది. అది మానవులు శైశవ దశకు బానిసలు కావడమే. శిశువుల్లో ఒక విచిత్ర మున్నది. వాళ్ళకు ఒక ప్రత్యేకపు పళ్ళెంలో భోజనం చేయాలనే మోజుంటుంది. వాండ్లకు ప్రియమైన పళ్ళెం తెచ్చిపెడితేనే ఎంత మంచి పదార్థమైనా తినడం జరుగుతుంది - వాళ్ళనుకున్న పళ్ళెంలో పెట్టకపోతే "నా పళ్ళెం నాకు కావాలె. నా పళ్ళెంలో నేను తింటాను. నే నింకే పళ్ళెంలో తినను" - అని మారాం జేస్తారు. ఓ శిశువులారా! ఈ ఒక్క పళ్ళెమే మీదికాదు. ఇంట్లో ఉన్న పళ్లాలన్నీ మీవే. బంగారు పళ్లాలన్నీ మీవే. ఈ ఒక్క చిన్న పళ్ళెమే మీదనుకోవడం తప్పు. ఈ ప్రపంచ మానవులు, తమ్ము తాము తెలిసికొన్నట్లయితే, తమ స్వస్వరూపమైన సత్యాత్మయే - సర్వ శక్తిమయ పరబ్రహ్మమని అనంత శక్తియని, తెలిసికొంటారు: కానీ ఈ మానవులు, తమ బుద్ధియనే - మనస్సనే - ప్రత్యేకమైన పళ్ళెం మీదనే అభిమానం పెట్టుకొన్నారు. "బుద్ధిద్వారా చేయబడినదేదో, అదే నేను చేసింది. మనస్సు ద్వారాగాని, బుద్ధి ద్వారాగాని, చేయబడిందే నాకు సంబంధించింది. తదితర కార్యాలన్నీ, నావి కావు. ఈ మనస్సనే ప్రత్యేకపు పళ్ళెరంలో పెట్టబడిందే నాదిగా నేను స్వీకరిస్తాను." ఇక్కడే స్వార్థం బయలు దేరుతున్నది. ఈ మనస్సనే పాత్రకే (పళ్ళానికీ) మానవులు ప్రాధాన్య మిస్తారు. ఈ పాత్ర ద్వారానే సర్వం నిర్వహింపబడాలని ఆశిస్తారు. ఈ సంకుచితమైన పాత్రచుట్టే సమస్తాన్ని కూడబెట్టాలని చూస్తారు. ఈ పాత్రతోటే తాదాత్మ్యాన్ని పొంది, ఈ పాత్రే తామనుకుంటారు. ఈ ఆత్మ భ్రాంతియే, సమస్త స్వార్థానికి, సమస్త దుఃఖాందోళనలకు కారణం. ఈ మిథ్యాదృష్టిని వదలిపెట్టు; నీ స్వరూప

మైన ఆత్మయే సమస్త విశ్వాత్మగా గ్రహించు. ఈ స్వార్థాహంకృతికి అతీతుడవుగా, తత్క్షణం నీవానంద నిధివౌతావు. సమస్త విశ్వ చైతన్య మూర్తివై ప్రకాశిస్తావు. సమస్త జగదాత్మగా వెలుగొందుతావు. రాజకుమారునిలో మొదట ఉన్న పొరపాటు అనాత్మ భ్రాంతియే. "నీ స్వస్థలమెక్కడ ?" అని అడిగినప్పుడు, ఆతడు తన స్వస్థలంగా రాష్ట్రమందలి రాజధానిని పేర్కొన్నాడు. ఫలాని రాజధానే "నా స్వస్థల" మన్నాడు. వత్సా! రాష్ట్రంలోని రాజధాని యొక్కటే నీ స్వస్థలం కాదు. రాష్ట్రమంతా నీదే. దేశమంతా నీదే. రాష్ట్రం లోని రాజధాని నగరంలో నీ వుంటున్నా, ఆ రాజధాని ఒక్కటి మాత్రమే నీ స్వస్థలం కాదు. రాజ్యమంతా నీదే - ఆ ఒక్క చిన్న రాజధానిమాత్రమేగాక ఈ విశాలక్షేత్రములు, ఈ రమణీయ ప్రకృతిసీమలు, ఈ గంభీర హిమాలయదృశ్యాలు- ఇవన్నీ నీవే.

మానవులు పడుతున్న పొరపాటిదే. బుద్ధిని నీ స్వస్వరూప మైన సత్యాత్మయొక్క రాజధానిగా ఎంచవచ్చుకాని దీనినిమాత్రమే నీదిగా ఎంచి, మిగతాదంతా నాదిగా దనుకోవడం తప్పు. ఈ బుద్ధి అనే రాజధానిమాత్రమే, ఈ మనస్సనే ముఖ్యపట్టణంమాత్రమే, నీది కాదు. ఈ విశాలప్రపంచమంతా, విశాలజగత్తంతా, నీదే. సూర్య చంద్ర తారాగ్రహభూమండలాలు, స్వర్గపథాలు- ఇవన్నీ నీవే. ఈ సత్యమును తెలిసికో తిరిగి నీ జన్మహక్కును పొందు. సమస్తభయ దుఃఖాలు నశిసిపోతాయి.

మానవులు స్వాతంత్ర్యం కావాలంటారు. మోక్షం కావాలం టారు. అసలు మొదట మానవుని బంధిస్తున్న దేమిటి? నీకు స్వాతంత్ర్యం కావాలంటే, నీకు మోక్షం కావాలంటే, ముందు నీ బంధకారణ మేమిటో నీవు తెలిసికోవాలె. కథలో కోతి బంధింపబడినట్లే మానవుడు బంధింపబడుతున్నాడు. ఒకకోతివిచిత్రంగా పట్టుకోబడింది. ఒక సన్నని మూతిగలకూజాలో కోతులకిష్టమైన తినుబండారాలు కాసినిపోసి, దానిఅడుగును కదలకుండా భూమిలో బిగించి ఉంచారు. తినుబండా రాలు తినాలనే ఆశతో కోతి వచ్చి, ఆ ఇరుకుమూతిగలకూజాలో చేతిని జొనిపి, గుప్పిటనిండా లోనగల తినుబండారాలను పట్టుకొన్నది.

అప్పుడు ముష్టి (గుప్పిలి) పెద్దదవడంచేత, చేయి వెలికితీసికోవడానికి వీలుకలగలేదు. గుప్పిటలోని తినుబండారాలనువదలితే, అది యథారీతి పారిపోవచ్చు. కానీ, ఆ రహస్యం తెలేక ఆ కోతి దాని కదే విచిత్రంగా బంధింపబడింది.

మొట్టమొదట నిన్ను బంధిస్తున్న దేమిటి? నిజానికి మొదట నిన్ను నీవే బంధించుకొంటున్నావు. నీవు నీవే బానిసత్వాన్ని వరిస్తున్నావు. ఈ విశాలప్రపంచ మనే మహారణ్యంలో ఒక సంకుచిత ముఖముగలపాత్ర కనబడింది. సంకుచితముఖంగలపాత్ర అంటే ఏమిటి? ఈ నీ సంకుచితమైనబుద్ధే. ఈ బుద్ధి అనేకూజాలో కొన్ని ఫలహారాలున్నవి. మానవు లీఫలాపేక్షతో బద్ధులౌతున్నారు. బుద్ధియొక్క ప్రాతినిధ్యంతో– లేక మనస్సుయొక్క మధ్యవర్తిత్వంతో– చేయబడినదంతా మానవుడు, "నాది" అని ముద్రవేసికొంటున్నాడు. "నేను మనస్సును" అని ప్రతిమానవుడు విభ్రాంతిపడుతున్నాడు. ప్రతిమానవుడు, మనస్సుతో తాదాత్మ్యాన్నిపొంది, "నేను మనస్సును– నేను బుద్ధిని" అనేదృష్టితో, ఈ మనస్సనే సంకుచితముఖపాత్రలోని పదార్థాలను గట్టిగాపట్టుకొంటున్నాడు. ఈ సంకుచితమనో తాదాత్మ్యమే– ఈ సంకుచితమనోనిబద్ధతే– మిమ్ము బానిసలుగా చేస్తున్నది; భయాందోళనలకు, వ్యామోహాలకు, సమస్తబాధలకు దాసులను చేస్తున్నది. ఇదే మిమ్ము బంధిస్తున్నది. ఇదే ఈ సమస్తప్రపంచ దుఃఖానికి కారణం. నీకు మోక్షం కావాలంటే, నీకు స్వాతంత్ర్యం కావాలంటే, పిడికిలిని వదలిపెట్టు. పరిమిత దృష్టిని వదలిపెట్టు. ఈ విశ్వ మహారణ్యమంతా నీదే. వృక్ష వృక్షానికి, ఎగిరి, సమస్త ఫలాలను స్వేచ్ఛగా, ఆరగించు. ప్రపంచమంతా నీదే. ఈ స్వార్థరూపకమైన అజ్ఞానాన్ని వదలిపెట్టు. నీవు స్వతంత్రుడవుతావు. నీకు నీవు రక్షకుడవుతావు.

అక్షయసంపద యలరారుచోట
కరువు గల్పించుట ఘనతయే నోకొ?
ఇది ఆత్మ కెప్పుడైన హితమగు నోకొ?
ఈ విధంబుగ సల్పు టెన్నడు వలదు;
ఈ విధంబుగ సల్పు టెన్నడు వలదు.

ఈ విశ్వసంపదనెల్లను మఱచి,
అల్పమనఃపాత్ర యందున్న కొలది
వస్తువులకు మోహబద్ధుండ వగుట
వర్ణింపరాని లుబ్ధత్వమేగాదె!
ఈ వెఱ్ఱి లుబ్ధత్వ మికనైన విడుము;

నీకూ, సర్వాత్మయైన పరమాత్మకూ గల ఆభిన్నత్వమును నీవు సాక్షాత్కరించుకొన్నప్పుడు, నీ మనస్సు అనంతశక్తిమయమై దీపిస్తుంది. సమస్త ప్రపంచంతో నీకు సంపూర్ణ సామరస్యం లభిస్తుంది.

"ఓ-హొహో! మనమింక నోర్వగలేము
ఓ ప్రియమానసమా! మనమిద్దరమును
ఒకనావ గైకొని దానిపై నెక్కి,
దారులేలేని దుస్తరసాగరముల
పరవశోత్తుంగతరంగాలపైన
పూనికొట్టెడిగాలివానలమధ్య
(నను నీవు. నిను నేను కౌగలించుచును)
అజ్ఞాతతీరంబులకు నిర్భయముగ
యాత్రగావింత మానంద ముప్పొంగ.
స్వేచ్ఛగా గొంతెత్తి హాయిగా మనము
పరమాత్మసంకీర్తనల పాడుకొనుచు,
మనమహాప్రస్థానమంత్రరాజంబు
నుచ్చరించుచు మహోత్సాహవశ్యమున
నవ్వుచు, పలుసార్లు ముద్దాడుకొనుచు
అలరించుకొంద మొండొరులము, లెమ్మ!
(ఇతరులు తమపాపముల చెప్పుకొనుచు
ఆత్మనిందల చేసికొందురుగాక-
మన కట్టిదైన్యంబుతో బనియేల?)
మతబోధకులకన్న మనము యెక్కువగ
భగవంతునందు విశ్వాసముంచుదము;
కాని పరీక్షింప జన దీశుమహిమ.

ఈసముద్రాలలో, పర్వతాగ్రముల,
ఈ నీరవ నిశీథ జాగరణముల,
నను నీవు సంతోషపరతువు; నేను
నిన్ను సంతోషింపజేతు మానసమ!
భావముల్, స్థలకాల మృత్యుసంబంధ
మాన భావంబులు జలములవోలె
ప్రవహించిపోవుచున్నవి వడివడిగ.
ఈ యనంతాకాండజలసీమలందు
నీ గాలినే నేను పీల్చుచున్నాను;
నీ మర్మరధ్వనులే వినుచుంటి;
ఇట నన్ను రక్షించుచున్నది నీవె.
ఓ పరమేశ్వరా! ఓ పరబ్రహ్మ!
నన్నిదే ప్రక్షాళనముసేయు విరాళి!
నన్ను నీలో స్నానమొనరింపనిమ్ము!
నేను నాచిత్తము, ఓ పరమాత్మ!
నీ సన్నిధికి చేరుచున్నాము త్వరగ.
ఓ సమస్తాతీత! ఓనామరహిత!
ఓ విశ్వరూప! ఓ విశ్వాంతరాత్మ!
సకలవిశ్వాధార! ఓ పరంజ్యోతి!
నీ మహాకిరణముల్ సకలలోకములు—
సత్యధర్మప్రేమమూలంబు నీవు!
సకలసద్గుణగణసాగర మీవు!
(ఓ తృషార్తస్వాంతమా! ఓర్చుకొనుము.
మనల కౌగిటిలోన తనుపుటకొరకు
పరిపూర్ణుడును ప్రేమరసమూర్తియైన
మనప్రాణసఖు, డొక్కచో వేచి వేడ—
మనరాకకోసమై చేతులుజాచి?)
నక్షత్రసూర్యాది గ్రహరాసులందు
వెలుగొందు తత్పరంజ్యోతివి నీవె!
ఒక మహాఛందస్సులో భద్రలీల

అల, నిరాకార శూన్యాకాశమందు
గ్రహరాసులను త్రిప్పుచున్నావు నీవె!
నా స్వస్వరూపాత్మకన్న వేరొకటి
కానరా దెచ్చోట కనుగొన్నగాని—
ఎట్లు నే చింతింపగల నితరంబు?
ఎట్లు నే యూపిరైనను బీల్చగలను?
ఎట్లు నే నోరెత్తి భాషింపగలను?
ఆ దివ్యలోకాల కేను పోలేన?
బ్రహ్మభావము పొడసూపుమాత్రమున,
సలకాలమరణభావాత్మకమైన
ప్రకృతియద్భుతముల గనినమాత్రమున,
ఆనందపారవశ్యమున స్తంభింతు!
కాని యంతర్ముఖదృష్టితో చూడ
ఓ ఆత్మ! నిజమున నీవు నేనొకటె!
నీవె బ్రహ్మాండముల్ పాలించుచుంటి—
నీవె కాలపుచాప నల్లుచున్నావు!
నీవె మృత్యువున సంతృప్తి నవ్వెదవు!
నీవె నిఖిలంబున నిండియున్నావు!
సూర్యతారాగ్రహకోటుల మించి
ఓ ఆత్మ! నీవు భ్రమింతు వెల్లడల.
మనపరస్పరమైన ప్రణయంబుకన్న
మించినప్రేమ యేమున్న దింకొకటి?
మనపరస్పరసన్నైక్యంబునకన్న
మించిన శుభకాంక్ష యేమున్న దరయ?
మనపరస్పర సమాగమమునకన్న
మించిన ఆదర్శ మమలధర్మంబు,
పూర్ణత, బలము, ఏమున్న ఈ జగతి?
ఖండవస్తువుల కఖండవస్తువును
విడనాడు టెంతటి వెఱ్ఱితనంబు?
సాగరగర్భముల్ తరియింపబడియె,

శిఖరాగ్ర సీమలు చేరగా బడియె;
పరిసమాప్తంబయ్యె ప్రస్థానయాత్ర.
పరమాత్మ సన్నిధాన ప్రాప్తికలిగె!
పరమ లక్ష్యంబు సిద్ధించె – నోహోహూ!
స్నేహంబు నిందగా ప్రేమ ఫలింప
అగ్రజు దర్శన భాగ్యంబు కలిగె!
అగ్ర సోదరుని ప్రేమాలింగనమున
తమ్ముడు కరగి విలీనత పొందె.
భరతవర్షముకన్న నధికమైనట్టి
భారతాదర్శ తీరమునకు యాత్ర!
ఈ మహా యానమొనర్చి నందులకు
చిత్తమా! నీవు గర్వించుట లేదా?
ఎన్నెన్ని సాగరా లెగిరి వచ్చితివి?
ఎన్నెన్ని జలధుల దాటి వచ్చితివి?
సంస్కృత వాణి వేదోద్ఘోష నీకు
క్రింద భాగమున విన్పించుట లేద?
కనులగంతను వీడి కనుగొను మింక!
ఓ మహా జీవితాదర్శ తీరంబ!
యుగయుగా భీల సమస్యాకదంబ!
నీ చెంతకే మా మహాయాన మోహహో!
నీ చెంతకే మా మహా యాత్ర యోహహో!
భగ్నాస్థి సంచికా వృత్తమైన నిన్ను
ఎవరు ప్రాణాలతో చేరుకోగలరు!

సత్యాత్మ తీరానికి పయనించు! ఈ శరీర విభ్రాంతినంతా వదలివెయ్యి. ఈ క్షుద్ర దేహ వ్యామోహాన్ని పరిత్యజించు. ఈ శరీర పంజరంలో, ఈ మనో కారాగారంలో, నీకు నీవే వ్యామోహితుడవై బంధింపబడ్డావు. ఈ విభ్రాంతి నుండి విముక్తుడవుగా! ఆ అనంత పరబ్రహ్మ తీరానికి, ఆ పరమసత్య తీరానికి ఆ స్వస్వరూపమైన

సత్యాత్మ తీరానికి పయనించు! భారతదేశమనన్న అధికమైన - భారతా దర్శమైన - పరమాత్మ తీరానికి పయనించు!

భారతాధిక దివ్య భారతాధర్మ
బ్రహ్మలోకమునకు పయన మోహహో!
ఓ భూతలాకాశ గత రహస్యంబ!
ఓ సముద్రా పార జలరాసులారా!
ఓ నదులార! ఓ శిఖరంబులార!
ఓ అరణ్యములార! భూసీమలార!
ఓ మహోన్నత పర్వత శ్రేణులార!
ఓ ప్రాతరారుణ ప్రాగ్దిశా కాంతి!
ఓ మేఘమాలికా! ఓవర్ష ధార!
ఓ తుషారమ! ఓహిమాలయశిఖరి!
మీచెంతకే మా మహాయాన మోహహో!

దేహాతీతుడవుగా! ఈ విశ్వమంతా నీ వౌతావు. ఈ యావద్విశ్వహృదయంలో నీవు ప్రవేశిస్తావు. ఈ సమస్తవిశ్వమూ నీవుగా- నీ స్వస్వరూపమైనఆత్మగా- తెలుసుకొంటావు.

ఓ సూర్యచంద్ర తారావళులార!
ఓబుధా! మృగశిరా! గ్రహకోటులార!
మీలోకి పయనంబు! మీలోకి యాత్ర!
జాగేల, తత్క్షణమే యాత్ర! యాత్ర!
ఉడుకుచున్నదిరక్త ముప్పొంగికొనుచు!
ఓచిత్తమా! తత్క్షణము లంగరెత్తి
పగ్గాల వదలుము తెరచాప విడుము!
పాతుకపోయిన వృక్షాలలీల
ఎన్నాళ్లు మన మిట నిల్చియున్నాము?
పశువులవిధమున తిని త్రాగుపనుల
ఎన్నాళ్లు మన ముంటిమో మూర్ఖవశత?
బహువిధగ్రంథముల్ బట్టీలుబెట్టి,

శుష్క పాండిత్యాలతో భ్రాంతినొంది,
మనకయి మనమె చీకటిలోన బడమె?
పోదాము ముందుకు- భయపడనేల?
ఆయగాధజలాలయందె పోవుదము.
సను నీవు నిను నేను కౌగలించియును
పోదాముపద నిర్భయత్వంబుతోడ.
ఏప్రాణి సాహసించనిచోటు లివ్వి-
పోదాముపద నీవు నేనును కలసి-
నావపోయిన మఱి మనమె పోయినను-
వెనుకంజ వనికిరా దీయాత్రలోన.
ఓధీరచిత్తమా! నావ పోనిమ్ము!
నాయనా! ప్రియసఖా! ముందు కేగుదము!
సాహసానందము! మన కేమిభయము -
భగవంతునిగావ ఈ సాగరములు?
నాయనా! ప్రియసఖా! పయనింప వోయి!

ఓం! ఓం!! ఓం!!!

# పాపము - పరమాత్మతో దానికిగల సంబంధము

[ శాన్ ఫ్రాన్సిస్కో - ఎకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో - 1902, నవంబరు 16వ తేదీన ఇచ్చిన ఉపన్యాసం ]

ఆత్మస్వరూపులైన సోదరసోదరీమణులారా!

ఈ ఉపన్యాసం గతవారంలో ఇచ్చినఉపన్యాసాల అనుబంధమే. గతఉపన్యాసాలు ఆకర్ణించినవాండ్లు, ఈ ఉపన్యాసాన్ని ఎక్కువగా అర్థంచేసి కొంటారు.

ఈ ఉపన్యాసంలో రాముడు పాపలక్షణమునుగూర్చిగానీ, లేక పాపమనేది ప్రపంచంలో ఏవిధంగా ఉన్నది? ఎవరు దీన్ని తెచ్చారు? ఎప్పుడిది వచ్చింది? కొందరుమానవులు మరికొందరుమానవులకన్నా ఎక్కువపాపులై ఎందుకున్నారు?, కొందరికి ఇతరులకన్నా ఆశ ఎందుకు ఎక్కువగా ఉన్నది? మరికొందరికి ఆశకన్నా ఆక్రోశం ఎందుకు ఎక్కువగా ఉన్నది? అన్న విషయాలనుగూర్చిగానీ చెప్పబోవడం లేదు. ఈప్రశ్నలు, అవకాశంచిక్కినప్పుడు, వేరొకఉపన్యాసంలో విచారింపబడతాయి.

ఈరాత్రి, "పాపం"అనేపదం, సర్వసామాన్యమైన అర్థంలో - ఉపయోగింపబడుతుంది. లేక క్రైస్తవప్రాపంచక దృష్టిలో - స్వీక రింపబడుతుంది.

భారతదేశమున, ఒకానొక దేవాలయంలో, ఒకమనిషి, మధుర పదార్థాలను పంచిపెడుతున్నాడు. ఆనందోత్సాహ శుభసమయాలలో, బీదలకు మధురపదార్థాలుపంచడం, అన్నదానాదులుచేయడం భార తీయులకు ఆచారం. ఆ దారిన పోతున్నవ్యక్తియొకడు, ఆలయంలోకి వచ్చి, ఆ సంతోషసంరంభాలకు కారణ మడిగాడు. మధురపదార్థాలు పంచుతున్నమనిషి, "నాగుఱ్ఱమును పోగొట్టుకున్నాను. ఇదే నా సంతోషానికి కారణం" - అని చెప్పాడు. ఆమాటలు విని జనులంతా ఆశ్చర్యపడి, "బలేబాగున్నది. గుఱ్ఱాన్ని పోగొట్టుకొని, విచారపడ డానికి బదులు సంతోషపడుతున్నావేమిటయ్యా?" - అన్నారు. అత

డప్పుడు ఇట్లు సమాధానమిచ్చాడు: నన్ను సరిగాఅర్థంచేసికోండి. నేను అశ్వాన్ని పోగొట్టుకొన్నాను. కానీ అశ్వికుని పోగొట్టుకోలేదు. అశ్వికుని రక్షించుకొన్నాను. నాఅశ్వం దొంగలగుంపుచేత అపహరింపబడింది. ఆ సమయంలో అశ్వంమీద నేను ప్రయాణంచేయడం లేదు. అశ్వంమాత్రమే అపహరింపబడింది. నేనేగనుక అశ్వంమీద ఉన్నట్లయితే నేనుగూడా అపహరింపబడేవాడినే. అశ్వంతోపాటు నేనుగూడా అపహరింపబడనందుకు నేను అదృష్టవంతుణ్ణి. అశ్వికుడుపోలేదు. అశ్వం మాత్రమే పోయింది". ఈజవాబు విని జనులంతా హృత్పూర్వకంగా నవ్వుకొన్నారు. ఎంతఅమాయికమానవుడు!

సోదరీసోదరులారా! ఈకథ మీకు హాస్యాస్పదంగా కనబడవచ్చు. ప్రతివ్యక్తి, ఈకథను ఆత్మీయం చేసికోవాలె. ఆ అశ్వికుని కంటే తానేవిధంగా వివేకియో ఆలోచించుకోవాలె. అతడుఅశ్వాన్ని పోగొట్టుకున్నాడు. కానీ అశ్వికుడైన తనను రక్షించుకున్నాడు. ఆహా! వేలకువేలు-కాదు - కోటానుకోట్లప్రజలు - ఏంచేస్తున్నారు ? అశ్వికుని కోల్పోయి, అశ్వాన్ని రక్షించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు. ఇదే శోచనీయమైన మౌఢ్యం. ఆతడశ్వాన్ని పోకొట్టుకున్నా, అశ్వికుని రక్షించుకోవడంచేత ఆనందపడడంలో అనుచితం లేదు. సత్యశక్తి - సత్యాత్మ - నిజమైన అహం - అశ్వానికీ అశ్వికునకూ ఎట్టిసంబంధమున్నదో-సూక్ష్మశరీరంతో అట్టి సంబంధాన్ని కలిగియున్నదని అందరికీ తెలుసు. కానీ, ఎవరిదగ్గరకైనాపోయి, నీ వెవరు ? నీ సత్యప్రకృతి ఏమిటి ? - అని అతని సమాచారమడగండి. "నేను ఫలానాఫలానా పుల్లయ్యను. నేను ఫలానా ఉద్యోగశాలలో పని చేస్తుంటాను" - అని ఏవేవో ఏకరువుపెడతాడు. ఇవన్నీ స్థూలశరీరానికి సంబంధించినవి మాత్రమే. అడగబడిన ప్రశ్నకూ అతని సమాధానాలకూ సంబంధంలేదు, మన మడుగుతున్నది- "నీ వెవరవు ? నీ వనగా ఏమిటి?"-అని. ఆతడెవరో - అతని నిజస్వరూపమేమిటో - మన కాతని సమాధానంలో తేలడంలేదు. మన మడిగిందొకటి. ఆతడు చెప్పేది వేరొకటి. మన మాతని నిజస్వరూపమైన అశ్వికునిగూర్చి అడుగుతున్నాము. కాని ఆతడు తన దేహమనే అశ్వమునిగూర్చి చెపుతున్నాడు.

మనం ఆశ్వికుని విషయమడిగితే, అతడు ప్రశ్నను మార్చి మన మెన్నడూ అడుగని విషయాన్ని గూర్చి మాట్లాడుతున్నాడు. ఇది అశ్వమును, ఆశ్వికునిగా చూడ్డం కాదా? అశ్వం పోయింది, పోయింది, పోయింది-అని ఉద్ఘోషించడానికిది మంచి సమయం. పోయింది; పోయింది; తప్పి పోయింది-అని వార్తాపత్రికల్లో కూడా ప్రకటించండి. పోయిందేమిటి? అశ్వమా? అశ్వం పోలేదు. ఎవరుబట్టినా అశ్వమును గూర్చే అభి వచిస్తాడు. పేర్లూ, ఊర్లూ,- మొదలైన వ్యక్తిగత విషయాలను ఏకరువుపెట్టడానికే ప్రతి మానవుడూ సంసిద్ధుడౌతుంటాడు. కోల్పో బడింది-ఆశ్వికుడు. కోల్పోబడింది-ఆత్మ - స్వస్వరూపమైన సత్యాత్మ. ఎంత విచిత్రం!

సత్యాత్మను-ఆశ్వికుని-మన మెలా కనుగొనడం? గతవారం ప్రతిదిన మిచ్చిన ఉపన్యాసాల్లో, ఈ ప్రశ్నకు సమాధానాలు చెప్పబడి నవి. కానీ, ఇవ్వాళ మన మొక నూతన దృక్పథమునుండి-పాపసంఘ టనములనుండి-సమాధానం పొందడానికియత్నిద్దాము. పాపానికి కారణ మేమిటి? పాపం ప్రపంచంలో ఏవిధంగా ప్రవేశించింది? ఈ వ్యాఖ్యానము వింతగా విపరీతంగా తోచవచ్చు. మీరు వింతపడనవరంలేదు. మీకు వింతగాదోచే ఈ వ్యాఖ్యానము, మీ బైబిలులోని ప్రబోధాల ననుస రించే నిరూపింపబడుతుంది. బైబిలును, ఐరోపా ప్రజానీకం, భారత ప్రజా నీకంవలె, అర్థంచేసికోలేదు. ఎందుకంటే-క్రీస్తు ఆసియాఖండవాసి. క్రీస్తు భారతీయుడని కూడా రాముడు నిర్వచించగలడు. బైబిలు గ్రంథంలో కనబడే ఉపమానాలు, అలంకారాలు - మొదలైనవన్నీ - హిందూ శాస్త్రాలలో ఉన్నవే. అందుచేత, ఆ పరిభాషాపరిచయముగల ప్రాచ్యు లైన హైందవులే, పాశ్చాత్యులకన్న ఎక్కువగా బైబిలును అర్థం చేసికోగలరు. ఇప్పుడు చెప్పబోయే వివరణము వింతగా, విపరీతంగా, స్వీయాభిమాన విశ్వాస విరుద్ధంగా, తోచినా, ఇది మీ బైబిలులోని ప్రబోధాలకు విరుద్ధమైనది కానందున మీరు దీన్ని మన్నించక తప్పదు. పాపము యొక్క సమస్యలోకి దిగేముందు, కొన్ని ప్రాథమిక విష యాలను విచారిద్దాం.

జన్మించిన ప్రతి మానవుడూ మరణించి తీరవలసిందే. కానీ; మానవులు, మరణిస్తామని తలచరు - కారణ మేమిటి? మరణ మనే విషయం మతికిరాగానే మానవులు గడగడ వణకిపోతారు. నఖశిఖా పర్యంతం ప్రకంపిస్తారు. ఎందువల్ల? మహారాజులు మరణించారు. మృతులను పునర్జీవింపజేసిన మహా ప్రవక్తలుకూడా మరణించారు. మహామహా భాగ్యవంతులు మహామహా బలశాలురు మరణించారు. మానసికదృష్ట్యా మరణం తప్పదని మనకు తెలుసు. నీవు డెభ్భై యేండ్లు బ్రతకవచ్చు. లేక, నూటనలభై ఏండ్లు బ్రతకవచ్చు. కాక, రెండు వందల ఎనభై ఏండ్లు బ్రతకవచ్చు. ఎన్నాళ్లు బ్రతికినా-నీవు మరణించ వలసిందే. నీవు మరణాన్ని తప్పించుకోలేవు. మరణం అనివార్య మైంది. అనుల్లంఘనీయమైంది. కానీ మహా విచిత్రం! ఎవ్వడు కూడా తాను మరణిస్తానని ఆచరణాత్మకంగా విశ్వసించడు. ప్రతి మానవుడు, మరణమునుగూర్చిన భావాన్ని దగ్గరకు రానియ్యడు. మృత్యువును గూర్చిన తలంపును అసహ్యించుకుంటాడు. పుత్రమిత్ర కళత్రాదులతో మమకారబంధాలు పెంచుకుంటుంటాడు. తన కర్మక్షేత్ర మును విశాలంచేసి కుంటుంటాడు. మృత్యువనేది తనకు లేనట్లుగా, తాను మరణించేలాగా, జీవయాత్ర సాగిస్తుంటాడు. కారణ మేమిటి? మరణమనే మాట వింటే చాలు-మానవ దేహంలో ఆపాదమస్తకం భయకంపం బయలుదేరుతుంది. ఎందువల్ల? మరణం తప్పనిదైనా, మరణాన్ని మానవుడు మనస్సుకు దూరంగా ఉంచుతాడు. పక్షి, తన రెక్కలకు నీళ్లంటినప్పుడు, ఆ నీటిని విదల్చివేస్తుంది. మర ణాన్ని మానవుడు అంతమాత్రంగూడా మనస్సుకు తాకనియ్యడు. ఆచరణలో మనం మరణిస్తామని నమ్మకపోవడానికి కారణమేమిటి? మృత్యువును వర్ణించే గీతాలు మీరు ఆలాపించవచ్చు. కానీ, ఆచరణలో మీరు మృత్యువును నమ్మరు. కారణమేమిటి? మరణరహితమైన మీ స్వస్వరూపమైన సత్యాత్మయే సత్యకారణమని- వేదాంతం వ్యాఖ్యా నిస్తున్నది. మరణశీలమైన, అనుక్షణము మరణగ్రసితమగుచున్న, క్షణక్షణము పరివర్తనమొందుచున్న దేహం-మీ స్వస్వరూపమైన, సత్యాత్మకాదు. మీలో, ఎప్పుడూ మరణించని ఒకానొక వస్తువున్నది. మీలో అనశ్వరమైన నిత్య సత్యమైన ఆత్మ ఉన్నది. కానీ మీరు-

"మా ఆచరణలో, మా దైనందిన జీవితంలో, మేము ఆత్మ మరణించదని నమ్మాం. దేహం మరణించకుండా శాశ్వతంగా ఉంటుందని నమ్ముతా"-మంటారు. హిందూమతమందలి వేదాంతదర్శనం- అనశ్వరమైనది ఆత్మ; నశ్వరమైనది దేహం. అయినా ఆత్మయొక్క విశేషణాలు- సత్యమైన ఆత్మయొక్క ప్రభావవిశేషాలు, భ్రాంతిచేత, అనిత్యమైన దేహానికి అధ్యసింపబడినవని (ఆరోపింపబడినవని)- నిర్వచిస్తున్నది. ఈ విపర్యయభావానికి మూలం అజ్ఞానమే. ఈ భావం విశ్వవ్యాప్తమైయున్నది. ఈ భావన, సమస్తదేశాల్లో, సమస్తప్రదేశాల్లో, జంతుప్రపంచంలోకూడా వ్యాప్తమైయున్నది. వేదాంతముతప్ప ఏ యితర దర్శనమూ, ఈ విశ్వాసముయొక్క (ఈ భావముయొక్క) విశ్వవ్యాపకతనుగూర్చి వ్యాఖ్యానంచేయలేదు. ఈ విశ్వాసముయొక్క విశ్వమయత నిజమైనదే. ఈ విషయం వివరింపబడాలె. ప్రకృతిలోని సమస్తవిషయాలను సమగ్రంగా వివరించలేనిదర్శనం దర్శనం కాదు. అనేక ఇతరదర్శనాలవలె, వేదాంతదర్శనం, ఈ విషయాన్ని సమగ్రంగా వివరించందే వదలిపెట్టదు. కారణం సహజమైనదై యుండాలె. విషయాలకు బాహ్యకారణాలు అంటగట్టేరోజులు పోయినవి. ఒక మనిషి క్రిందపడతాడు. ఆ పడడానికికారణం, ఆతనిలోనే మనం కనుగొనగలం. అతడు, భూమి జారుడుగాఉన్నదనో మరేమనో చెప్పవచ్చు. కారణం, కార్యమందుగాక అన్యత్రా కనుగొనబడదు. కారణం కార్యమందే కనుగొనబడగలిగినప్పుడు, వేరుగా కారణాలను వెదకడం వెఱ్ఱితనం. మరణరహితత్వమునగూర్చిన ఆచరణాత్మకవిశ్వాసమును, బాహిరముగాని ఆంతర్యకారణంచేత ఏవిధంగా వ్యాఖ్యానించగలం? దేహంలో, అమృతత్వవిశ్వాసమునగూర్చే కారణ మొకటికూడా మనకు కనబడదు. మనస్సులోకూడ, అమరత్వభావమునుకలిగించేకారణ మేమీకనబడదు. మనోదేహాల నధిగమించండి. మనోదేహాల కతీతులు కాండి. వేదాంత మప్పుడు సత్యాత్మను చూపిస్తుంది. పూర్వోపన్యాసంలో వర్ణింపబడినపరమాత్మను చూపిస్తుంది. ఈ ఆత్మ అమరమైంది. అది సాక్షితేజం. అది సర్వకాలసర్వావస్థలలో అవికల్పమై వెలుగొందుతుంటుంది. ఈ ఆత్మలో, అమరత్వమునుగూర్చిన (మరణరాహిత్యమునుగూర్చిన) విశ్వమయవిశ్వాసముయొక్క కారణాన్ని మనం చూడ

గలం. గెలీలియోమహాశయుని జన్మకుపూర్వ మున్నమానవునిభ్రాంతి లాంటిదే,మానవుని వ్యావహారిక జీవితమందలి ఈ దేహాత్మభ్రాంతికూడ భూమియొక్క పరిభ్రమణం సూర్యునకు ఆపాదించారు. ఆత్మయొక్క దివ్యమైననిత్యత్వాన్ని (అమరత్వాన్ని) దేహానికి అధ్యస్తంచేయడంలో కూడా ఇదే పొరపాటున్నది.

ఇప్పు డీప్రశ్నవస్తుంది: నిత్యమైన ఆత్మఉన్నది. వీటితోపాటు అజ్ఞాన మున్నది. ఈ అజ్ఞానం ఎక్కడనుంచి వచ్చింది? ఇక్కడ మనం చూస్తున్నాము - అజ్ఞానమూ, మానవునిలోనే యున్నది. దివ్యాత్మ కూడా మానవునిలోనే యున్నది. దేహంకూడా, మానవునిలోనే యున్నది. ఇవన్నీ అంతర్హితమై యున్నవి. ఇవి వెలిగాలేవు. ఇవేవీ నీకు వెలిగా లేవు. ఈశరీరముయొక్క, మనస్సుయొక్క నిత్యమైనఆత్మయొక్క, అజ్ఞానముయొక్క ప్రభావంచేత - దేహముయొక్క అనిత్యతను ఆచర ణాత్మకంగా విశ్వసించకపోవడం జరుగుతున్నది.

ఇంకొకవిషయం : ప్రపంచంలో ప్రతిమానవుడు తాను స్వతం త్రుడుగా ఉండలేకపోయినా, తాను స్వతంత్రుడుగా ఉన్నట్లే భావిస్తాడు. స్వాతంత్ర్యాన్నే వాంఛిస్తాడు. స్వాతంత్ర్యంకోసం పరితపిస్తాడు. మీరు మేము స్వతంత్రుల మనవచ్చు. మీలో రాగద్వేషవ్యామోహ వాసనలు లేవా? అటువంటప్పుడు, మేము స్వతంత్రుల మని మీ రేవిధంగా చెప్పగలరు? మధురఫలాలు, రుచ్యాహారాలు, మిమ్ము బానిసలుగాచేయగలవు. ఏ అందమైన రంగైనా మిమ్ము ఆకర్షించి ఒక్కక్షణంలో బంధించగలదు. ఏప్రాపంచిక భోగవాంఛాలేశమైనా సరే మిమ్ము దాసులనుగా చేయగలదు. ఇట్లుండికూడా మేము స్వతంత్రుల మని మీ రనుకొంటుంటారు. సంపూర్ణమైన స్వాతంత్ర్యంతో, మీరొక్కపనైనా చేయగలరేమో- ఒక్క నిమిష మాలోచించండి. ఏవో మీ వ్యావహారిక జీవితాలలో లోటుపాట్లు కలగడం, మీరు మీమనస్సమతను కాపాడుకోలేకపోవడం జరగడం లేదా? మీరు కామక్రోధలోభాదులకు దాసులై యున్నారు. ఇట్లు మానవులు నిజానికి సంపూర్ణస్వతంత్రులుగా ఉండకపోయినా, సర్వదా స్వాతంత్ర్యమునే వాంఛిస్తారు. ప్రేమిస్తారు. దీనికి కారణ మేమిటి?

హిందూదేశంలో ఆదివారం స్వాతంత్ర్యదినం. స్వాతంత్ర్య చింతనతో, ఆదివారాన్ని అభిలషిస్తూ, పిల్లలుదినపాఠాలు చదువుకుంటారు. ప్రతిరోజూ, "ఇవ్వాళ ఏవారం?" – అని తమతల్లులను అడుగుతుంటారు. తల్లులు, సోమవారమనో, మంగళవారమనో, బుధవారమనో, చెవుతుంటారు. ఆదివారం ఎప్పుడు వస్తుందా అని – వ్రేళ్లపై వాండ్లు వారాలు లెక్క పెడుతుంటారు.

ప్రపంచమందలి మహారుధిరపాతానికి కారణ మేమిటి? స్వాతంత్ర్యేచ్ఛ. తమ మాతృభూమితో ఉండే సంబంధాలను అమెరికా దేశీయులు వదలుకోవడానికి కారణ మేమిటి? స్వాతంత్ర్యేచ్ఛ. సర్వమతాల యొక్క పరమాశయ మేమిటి? మోక్షం. సంస్కృతంలో "మోక్ష" మంటే స్వాతంత్ర్యం. ఓహో! స్వాతంత్ర్యం! స్వేచ్ఛ! విముక్తి! మధురాతిమధురమైన ఆ స్వాతంత్ర్యం కోసం, ప్రతిమానవుడు పరితపిస్తుంటాడు. కానీ, సత్యంగా స్వతంత్రులైన మానవులు ఎంతమంది ఉన్నారు? బహుకొద్దిమందే.

ఈ ప్రపంచమున కాలదేశనిమిత్తము లనే కుడ్యాలతో కూడిన కారాగారంలో మీరు సర్వదా బద్ధులై యున్నారని – వేదాంతం చెవుతున్నది. మీ ప్రతిభావన, మీ ప్రతికర్మ, "నిమిత్త" మనే శృంఖలముచే నియమితమైయుండగా, మీ రా శృంఖలముచే బద్ధులైయుండగా, ఈ ప్రపంచంలో ఎట్లు మీరు స్వతంత్రంగా జీవించగలరు? అయినా, సర్వులూ స్వాతంత్ర్యమునే అభిలషిస్తున్నారు. ఇది పరస్పర వ్యతిరేక వాదంగా కనబడడంలేదా? దీనికి కారణ మేమిటో వివరింపబడుతుంది.

"ఈ స్వాతంత్ర్యవాంఛకు కారణ మున్నది. ఆ కారణం మీలోనే ఉన్నది. మీకు వెలిగా లేదు"—అని వేదాంతం నిర్వచిస్తున్నది. మీలోని ఈ స్వాతంత్ర్యేచ్ఛ, ఈ విశ్వాత్మకమైన స్వాతంత్ర్యభావం—'మీలో ఒకవస్తు వున్నది. అది మీ స్వస్వరూపమైన సత్యాత్మ. అది మీలోని సత్యమైన "అహం". మీ స్వాతంత్ర్యభావానికి అదే మూలం – అని ప్రవచిస్తున్నది. మీలో సత్యస్వాతంత్ర్యదీప్తమైన, అఖండమయిన, నిత్యముక్తమయిన ఒకపరమవస్తు వున్నది. ఆ శుద్ధ

ముక్తస్వరూప పరమవస్తువు మీ స్వస్వరూప మను సత్యాత్మయై యున్నదని - స్వాతంత్ర భావముయొక్క విశ్వమయత్వం చక్కగా ఉద్బోధిస్తున్నది. కానీ అజ్ఞమానవులు భూపరిభ్రమణాన్ని సూర్యునకూ, సూర్యప్రకాశాన్ని భూమికీ ఆపాదించినట్లు, మనంకూడా దేహాత్మ భ్రాంతిచేత ఆత్మయొక్క స్వాతంత్ర్యమును దేహానికి ఆపాదించుకొంటు న్నాము.

ప్రపంచంలో ఇంకొక విచిత్రవిషయాన్ని చూస్తాము. దేహ దృష్ట్యా ప్రతిమానవుడూ పాపియే. ప్రతివ్యక్తికీ ఏదోఒకలోపం ఉండే ఉంటుంది. కానీ, అంతరాంతరాల్లో ఎవడుకూడా, తను పాపి నని తలంచడు. ఈ యావత్పృథ్వీమండలంలో- ఈ యావద్విశాలవిశ్వంలో- ఒక్కవ్యక్తికూడా తనపాప ప్రకృతిని నమ్మడు. హృదంతరాంతరాల్లో, తాను పవిత్రు డ్ణనే సంభావిస్తాడు. ఆచరణలో, తాను పాపి నని ఎవడూ అనుకోడు. బైటికి పాపి నని చెప్పితే నేం? లోపల ఆశయం- ప్రజలచేత తాను పవిత్రుడుగా ఎంచబడాలనే. మేము పాపుల మని చెబుతూ, పరులు తమ్ము పవిత్రులుగా గౌరవించాలని ప్రజలు వాంఛిస్తారు. కానీ, తమఅంతరాల్లో తమపాపప్రకృతియందు ఎవరికీ విశ్వాస ముండదు. ప్రతివ్యక్తీ తనకుతాను పవిత్రుడ ననే భావిస్తాడు. నికృష్టాపరాధాలుచేసిన వాండ్లుకూడా, నీచాతినీచములైన నేరాలు చేసినవాండ్లుకూడా, న్యాయస్థానంలో "మీరు పాపంచేశారా?" అని ప్రశ్నించినప్పుడు, "మేము పాపం చేశా" చెప్పుకోవడం అరుదు. బలవంతముచేత, ఒక వేళ బైటికి "పాపం చేశా" మని చెప్పినా, అంత రాంతరాల్లో ఆ చెప్పడం తప్పని వాళ్ళు నమ్మకం. తాము పాపం చేయలే దనే వాండ్లవిశ్వాసం. ఆలయాల్లో ప్రజలు మతాధిపతుల ముందర పాపపశ్చాత్తాపాన్ని ప్రకటిస్తారు. వీధిలోకిరాగానే, ఎవడైనా కొంచెం, "దొంగా" అని పిలిచాడా గిట్టున వెనక్కుతిరిగి ఎగిరి మెడ బట్టుకుంటారు. లేదా కోర్టు కెక్కుతారు. గుడిలోనే పశ్చాత్తాపం. గుడిగడపదాటితే దేవుని కండ్లల్లో దుమ్ముగొట్టడానికి యత్నిస్తుంటారు. ఆలయంలోమాత్రమే అపరాధ క్షమాపణాదులు.

ఈ విషయంకూడా ప్రపంచమందలి వైపరీత్య విశేషమును చూపుతున్నది. ఈ వైపరీత్యము నే విధంగా వ్యాఖ్యానించడం? మేము పాపులం కాదు. మేము పాపాలకు అతీతులం - అన్న మానవుల అప్రతిహతభావం, మానవులు తమ పాపరహిత ప్రకృతిలో కలిగియున్న నిత్యానుభూత విశ్వాసముయొక్క విశ్వాత్మకత - మానవులలోని సత్యాత్మయొక్క నిత్యవినిర్మల నిష్పాప ప్రకృతికి ప్రత్యక్ష నిరూపణ మని వేదాంతం నిర్వచిస్తున్నది. సత్యాత్మ - మన స్వస్వరూపమైన సత్యాత్మ - పాపరహితమైనది. పరిశుద్ధమైనది. పరమ పవిత్రమైనది. ఈ వ్యాఖ్యానం మీకు నచ్చనట్లైతే ఈ వైపరీత్యమునుగూర్చి మీరింకొకవిధంగా వ్యాఖ్యానించగలిగితే వ్యాఖ్యానించండి.

మానవుల ధనతృష్ణకు కారణ మేమిటి? మనం నిత్యం చూస్తున్నాము. ప్రపంచ సంపదనంతా తాను కైవశం చేసికోలే నని ప్రతి మానవునకూ తెలుసు. తన తృప్తిదీర తనకు సంపద లభింప దని ప్రతి వ్యక్తికీ తెలుసు. కోటీశ్వరుల దగ్గరకు వెళ్ళి వాళ్ళకు తృప్తి ఉన్న దేమో అడగండి. మాకు తృప్తి లే దంటారు. ఇంకా ఇంకా మాకు కావా లంటారు. నాలుగు డాలర్ల డబ్బున్న పేదవారితో సమానంగా వాండ్లు లోపల పేదరికంతో కుములుతుంటారు. నాలుగు రూపాయలు గానీయండి, నాలుగుకోట్ల రూపాయలు గానీయండి మనశ్శాంతిని, సంతృప్తిని, ప్రసాదించలేవు. ఈ భాగ్యభోగ్యాలవల్ల మనశ్శాంతి కలగదు. అయితే భాగ్యభోగ్యాలుకలిగియున్నవాండ్లు కూడా కొందరు, మనశ్శాంతిని కలిగియుండవచ్చు. వాండ్లశాంతికి కారణం వాండ్లసంపద కాదు. వాండ్లశాంతికి కారణం - వేరొకటై యున్నది. వాండ్లశాంతికి కారణం - వేదాంతమును వాండ్లు వాండ్లకు తెలియకుండానే ఆచరణలో పెట్టడమైయున్నది. అంతేగాని మానవ మనశ్శాంతికి కారణం కేవలం ధనమెప్పటికీ కాదు.

భాగ్యం, భౌతికమైనసంపద, మనశ్శాంతిని ప్రసాదించలే దని మనకు తెలుసు. అయినా, ప్రతిమానవుడు, సంపదకొరకు సంతపిస్తుంటాడు. ధనాశాదాహంతో తహతహపడుతుంటాడు. ఈ విచిత్ర విపరీత విషయాన్ని వ్యాఖ్యానించండి. ఈ విషయమునుగూర్చి ఏ యితర

తత్త్వదర్శనాదులు సక్రమంగా నిర్వచించడంలేదు. వేదాంత మిట్లు నిర్వచిస్తున్నది ; ఈ ఐశ్వర్యతృష్ణ, ఈ సమస్తాన్ని పొందాలనేఆశ, దేని వల్ల ఉన్నది? శరీరం ఎప్పటికీ సర్వప్రపంచాన్ని సంపాదించ లేదు. ఒక వేళ, నీవు సర్వప్రపంచాన్ని సంపాదించినప్పటికీ నీకు తృప్తి కలుగదు. ఆపైన చంద్రలోకాన్ని ఆక్రమిద్దా మనే ఆశ పుడుతుంది. సమస్త ప్రపంచాన్ని పరిపాలించిన చక్రవర్తులను - రోమ్‌చక్రవర్తులను - కొంచెం గుర్తుకు తెచ్చుకోండి. సీజరు నీరోలను స్మృతికి తెచ్చుకోండి. మీ శరీరాలు ప్రకంపిస్తాయి. ఆ సీజరు నీరో మొదలైనవారి మానసిక స్థితిగతులను గూర్చి ఆలోచించండి. వాండ్లు సుఖపడ్డారా? సంతృప్తి పడ్డారా? శాంతి ననుభవించారా? వాండ్లలో భోజనప్రియు డొక డున్నాడు. వారికి దివారాత్రులు కమ్మని తిండి కడుపు కెక్కించడమే పని. వాడు కడుపునిండా తినేవాడు. ఆశ తీరేదికాదు. మాత్రలు మింగి, ఆ తిన్నది కక్కి, మళ్ళీ క్రొత్త పదార్థం కడుపునిండా నక్కుకునేవాడు. ఇట్లు కడుపు పట్టకుండా తినడం, ఆ తిన్నది మందుల సహాయంతో కక్కివడం, మళ్ళీ కడుపు పట్టకుండా తినడం, ఆ తిన్నది మళ్ళీ మందుల సహాయంతో కక్కివడం-ఇదే వాని దైనందిన జీవితం. మరి వానికి తృప్తికలిగిందా? శాంతి లభించిందా? లేదు. ఇది మనకు నిగూఢమైన విషయం. జగచ్ఛర్వస్వాన్ని మనం సంపాదించలేకపోయినా, లేక సంపాదించగలిగినా, అదే లెక్కలోకి వస్తుంది? సర్వ ప్రపంచాన్ని సంపాదించగలిగినా, స్వాత్మను కోల్పోవడంవల్ల లభించే దేమిటి? ఈ సమస్త పృథ్వీమండలం, గ్రహగణితంలో కొన్ని నక్షత్రాలతో పోల్చబడేటప్పుడు, ఒక బిందుమాత్రంగా పరిగణింపబడుతున్నది.

ఈ మీ పృథ్వి ఎంత అల్పమైంది! ఈ పృథ్వీ మండలాన్ని పొందడంవల్ల నిజమైన సంతృప్తి, నిజమైన శాంతి, ఏ విధంగా కలుగుతుంది? క్షుద్రమైన ఈ ప్రాపంచిక సంపద సంతృప్తినీ, శాంతినీ సమకూర్చలేదని మనకు మానసికంగా తెలుసు. అయినా మనం, ప్రాపంచికసంపద వెంట పరుగిడకుండా ఉండలేము. ఎందుకంటే- మీలోని

సత్యాత్మ- మీలోని సత్యమైన ఆ "నేను"- సమస్తజగత్పరిపాలకశక్తి యని వేదాంతం నిర్వచిస్తున్నది.

భారతదేశంలో, కుమారునిచేత కారాగృహబంధితుడైన ఒక రాజుకథ ఉన్నది. రాజ్యకాంక్షచేత, కుమారుడు తండ్రిని బంధించాడు ఒకసారి. తండ్రి కొడుక్కు- కొందరుపిల్లలను తనదగ్గరకు పంపించవలసిందని, ఆ పిల్లలకు పాఠాలుచెప్పి కాలంగడుపుకుంటానని లేఖవ్రాసి పంపించాడు. అప్పుడు కుమారుడు, "విన్నారా, మా ముసలివాడికోరిక? ఎన్నోసంవత్సరాలతడు రాజ్యాన్ని పరిపాలించాడు. ఇప్పటికీ ఆ పరిపాలించే పాతఅలవాటు అతనికి పోలేదు. ఇప్పుడాతడు పిల్లవాండ్లను పరిపాలించడానికి అభిలషిస్తున్నాడు. ఎవరినో ఒకరిని పరిపాలంచాలని ఆతనికోరిక. వెనుకటిఅలవాట్లు ఆతడు పోగొట్టుకో లేదు"- అని సేవకులతో అన్నాడు.

మనవిషయంకూడా అట్లే ఉన్నది. మనము మనపూర్వపు అలవాట్లను ఏవిధంగా వదలగలం? వదలలేం. మీసత్యాత్మ 'షాహిజహాన్'. (Shah-i-jahan- షాహిజహాన్- అనగా సమస్తప్రపంచ చక్రవర్తి యని, సమస్తజగత్ప్రభు వని అర్థం.) ఈ ప్రభువును మీరు దేహకారాగారంలో- క్షుద్రాహంకారకారాగృహంలో- బంధించారు. ఆ సత్యాత్మ- ఆ జగత్ప్రభువు- తనపూర్వపుఅలవాట్లను ఎట్లు విస్మరిస్తాడు? తననైజప్రకృతిని ఏవిధంగా వదలుకోగలుగుతాడు? తన నైజప్రకృతిని ఎపుడూ వదలుకో లేడు. తననైజప్రకృతినుండి ఎవడూ ఆవలికి దూకలేడు. అట్లే, మీలోని సత్యాత్మ ఏవిధంగా తననైజప్రకృతిని విడనాడగలుగుతుంది? మీరు మీ సత్యాత్మప్రభువును దేహకారాగారంలో బంధించారు. అయినప్పటికీ ఆ ఆత్మప్రభువు సమస్తప్రపంచాధిపత్యాన్ని చెలాయించడానికి అభిలషిస్తున్నాడు. ఎందుకంటే ఆతడు తన సర్వప్రపంచాధిపత్య స్వభావాన్ని ఏవిధంగా వదలుకోగలడు? "ఆశను విడనాడండి. తృష్ణను పారద్రోలండి"- అని బోధించి, ఈ తృష్ణాశక్తిని, ఈ ఆశాతత్వమును ప్రపంచమానవులలో మీరు శమింపజేయగలరా? ఇది అసాధ్యమైనవిషయం.

రాముడు బలీయమైనసత్యవాక్యాలు చెప్పుతున్నందుకు క్షమించండి. రాముడు వ్యక్తులమీదకన్నా సత్యంమీద ఎక్కువగౌరవాన్ని చూపుతాడు. సత్యంవద- అని ఆర్యోక్తి. బైబిలుగ్రంథంలో యిట్లు చెప్పబడింది; నిన్నెవరైనా ఒకచెంపమీద కొడితే ఇంకొకచెంపకూడా చూపు. పవిత్రమతబోధల ప్రచారంచేసేటప్పుడు, నిర్ధనులై, పాదచారులై నిరాడంబరులై పోవాలె. న్యాయస్థానాలకు పిలువబడినప్పుడు, అక్కడ ఏమిచెప్పాలో ముందుగా ఆలోచించుకోగూడదు. నోరు తెరవండి. సత్యవాణి వినదిస్తుంది. అరణ్యాపక్షులను, క్షేత్రసీమలలోని పుష్పాలను చూడండి. అవి రేపటినిగూర్చి ఆలోచించుకోవు. ఆ అరణ్యపక్షులు, క్షేత్రపుష్పాలు, సోలమన్ ప్రభువుకూడా అసూయపడేటంత ఘనంగా అలంకరింపబడుతున్నాయి. బైబిలులో మరొకచోట, "ఒంటె సూదిబెజ్జంలోనుంచి దూరవచ్చుగాని, ధనికుడు స్వర్గరాజ్యాన్ని తెలిసికోలే"డని ఉన్నది. బైబిల్లో మీరు చదివిఉంటారు: క్రీస్తుదగ్గరకు వచ్చి ఒక ధనికుడు, ఉపదేశం చెయ్యమన్నాడు. క్రీస్తు, "నీకు శాంతి కావాలంటే సర్వభాగ్య పరిత్యాగం చెయ్యి. ఇంతకంటే నీకు వేరు మార్గం లే"దన్నాడు.

ఈ వైరాగ్య తత్త్వాన్ని భారతదేశంలోని క్రైస్తవ మిషనరీలు, ఇంకా చెప్పాలంటే యావత్ప్రపంచంలోని మిషనరీలు, పూర్ణంగా విస్మరించారు. ఈ వైరాగ్య తత్త్వం వేదాంతమే. ఈ పరిత్యాగ ప్రబోధాలను, భారతీయ సన్న్యాసులు నేటికీ సమాచరిస్తున్నారు. ఈ పవిత్ర మతంపేరిట, ఈ పరిత్యాగ ప్రబోధంపేరిట, ఇక్కడనుంచి ప్రచారకులు మన్నించాలె, భారతవర్షానికి పోతున్నారు. రాముణ్ణి మీరు క్షుద్రాహంకృతినిగూర్చి ఏదైనా వ్యతిరేక ప్రసంగం వచ్చినప్పుడు ఆక్రోశపడడానికి ఎవరికీ అధికారంలేదు.

క్రైస్తవమతప్రచారకులు, పరిత్యాగధర్మంపేరట హిందూదేశానికివచ్చి, పరిత్యాగధర్మాన్ని ప్రచారంచేస్తామంటూ, భోగభాగ్యలాలసులై జీవించడం ఎంత ఆశ్చర్యకరమైనవిషయం? ఐశ్వర్యఆశాదాహాన్ని ప్రార్థనా వేదికలనుంచి చేసేప్రబోధాలద్వారా, మీరు ఎన్నటికీ అణచలే రని వేదాంతం చెప్పుతున్నది. మీ సత్యాత్మయొక్క

విశ్వపాలకత్వమును- మీ సత్యాత్మయొక్క జగదాధిపత్యమును- మీరు నశింపజేయలేరుగనుక- మీరు ఆశాదాహాన్ని నశింపజేయ లేరు. అయితే ఈ రోగనివృత్తికి మార్గం లేదా? ఉన్నది. ఉన్నది. ఈ మహాతృష్ణకు కారణం- అజ్ఞానం. ఆత్మయొక్క ప్రతిభను దేహానికీ, దేహముయొక్క దైన్యాన్ని ఆత్మకూ అధ్యస్తంచేసే అజ్ఞానం. ఈ అజ్ఞానమును పోగొట్టండి. ధనంలేకుండనే మానవుడు మహాభాగ్యశాలి అవుతాడు. ఏ రాజ్యాలు లేకుండనే మానవుడీ విశ్వసామ్రాట్టవుతాడు. ఎంతవరకైతే అజ్ఞాన ముంటుందో, అంతవరకు, మీరు ఆశాదాహార్తులై అవస్థపడవలసిందే. వేరొకమార్గం లేదు. ఈ జ్ఞానాన్ని పొందండి. ఈ బ్రహ్మజ్ఞానాన్ని పొందండి. దేహభావకారాగారమునుండి ఆత్మను వదలిపెట్టండి. అంటే మీ స్వస్వరూపమైన, సత్యమైన, శాశ్వతమైన, నిత్యమైన, జగన్నాథుడైన, పరమాత్మను తెలుసుకోండి! ఆ మూల తత్త్వమును తెలుసుకోండి! తెలుసుకున్నారా, మీరు పవిత్రాతి పవిత్రులౌతారు. పరమపావనులౌతారు. అప్పుడు ప్రాపంచిక భాగ్యవాంఛా లేశంకూడా మీకు అగౌరవంగా, పాపంగా కనబడుతుంది. మీలోని ఆత్మశ్రీ మిమ్ము నిత్యసంతృప్తులనుగా చేస్తుంది.

ప్రపంచంలో సర్వరాజ్యాలను జయించి, అలెగ్జాండరు మహారాజు హిందూదేశానికి వచ్చాడు. విశ్వవిఖ్యాతిగడించిన హిందూదేశ మహాజనులను తాను చూడా లనుకున్నాడు. సింధు నదీతీరమున గల ఒక సన్న్యాసి సన్నిధికి ఆతడు తీసుకపోబడ్డాడు. ఆ సన్న్యాసి దిగంబరుడు. ఆతనివద్ద ఏమీలేదు. నదీతీరంలో సైకతశయ్యపై ఆతడు నిశ్చింతగా ఆసీనుడైయున్నాడు. రాజవస్త్రాలంకారాలతో పర్షియానుండి తేబడిన వజ్రవైడూర్యాది మణులచే వెలిగిపోతున్న కిరీటంతో అలగ్జాండర్ మహారాజు ఆ సన్న్యాసిచెంత నిల్చున్నాడు. వివిధాభరణ భూషితుడైన అలగ్జాండర్ చక్రవర్తి. ఆతనిప్రక్క దిగంబరుడైయున్న ఒక సన్న్యాసి. ఉభయులమధ్య ఎంతవ్యత్యాసం! జగద్భాగ్యమంతా అలగ్జాండర్ శరీరంపైన తాండవిస్తున్నది. బాహ్యదారిద్ర్యమంతా ఆ సన్న్యాసి శరీరంమీద గోచరిస్తున్నది. కానీ ఆ యిరువురి అంతరైశ్వ

ర్యాన్ని గానీ, దరిద్రాన్ని గానీ కనుగొనడానికి వాండ్ల ముఖాల నవలోకి స్తే తెలు స్తుంది.

సోదరీ సోదరులారా! మీరు ధనదాహంతో పరితపిస్తున్నారు. కనబడకుండా పై పట్టుగుడ్డ కట్లు కట్టుకొని మీ ప్రణాలను దాచుకుం టున్నారు. ఆత్మ శ్రీని దర్శించిన మహర్షి! ఆతని ప్రక్క, ఆత్మదారి ద్ర్యాన్ని కప్పిపుచ్చను బహిరలంకారాలు చేసికొన్న అలెగ్జాండరు మహారాజు! తేజోమయుమై ఆనందమయుమై మహర్షి ముఖారవిందం ప్రకాశిస్తున్నది. అకించనుడై ఆనందస్వరూపుడై యున్న ఆ మహర్షిని చూచి, అలెగ్జాండరు మహారాజు ప్రముఖ్యుడై స్వదేశమైన గ్రీసుకు రమ్మని ఆహ్వానించాడు. మహర్షి నవ్వి, ఇట్లు ప్రత్యుత్తర మిచ్చాడు: "బ్రహ్మాండమంతా నాలోనే ఉన్నది. బ్రహ్మాండం తనలో నన్ను ఇముడ్చుకో లేదు. గ్రీసూ, రోమూ మొదలైన దేశాలన్నీ నాలోనే యున్నవి. సూర్యచంద్ర తారాకోటులు, నాలోనే ఉదయించి నాలోనే అస్తమిస్తున్నవి."

అలెగ్జాండరు మహారాజు ఈ పరిభాషను అర్థం చేసికోలేక ఆశ్చర్య చకితుడయ్యాడు. "నీకు నేను కావలసినంత ధన మిస్తాను. నిన్ను భోగభాగ్యాల్లో తులతూగేలాగు చేస్తాను. సర్వ సౌఖ్యాలు నీకు సమకూరుస్తాను. దయచేసి నాతో గ్రీసుకు పయనించ వలసిందన్నాడు.

మహర్షి పకపకానవ్వి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చాడు: "సమస్త మణులు, సూర్య చంద్ర తారకాకోటులు నావల్లనే ప్రకాశిస్తున్నవి. సమస్తాకర్షణీయ ప్రకృతి, సమస్తవాంఛనీయ వస్తుజాలం, నావల్లనే ఉద్దీపింప బడుతున్నవి. ఈ జగద్వస్తుజాల మంతటికీ నేనే ప్రతిభను ప్రసాదించి, తిరిగి వాటిని నేను భిక్షించడం నా గౌరవానికి భంగకర మైన విషయం. ఈ ప్రాపంచిక భోగభాగ్యాలను యాచించడం, ఈ దైహిక పాశవిక సుఖాలకోసం అర్థించడం ఆత్మగౌరవానికి తగని పని. అంతదైన్యస్థితికి నే నెప్పడూ దిగజారను. ఈ విషయవస్తు కవాటాలముందు నే నెప్పుడైనా సరే బిచ్చమెత్తను."

అలెగ్జాండరు మహారాజు ఆశ్చర్యపోయాడు. మహర్షి యొక్క శిరస్సును ఖండించడానికి ఒఱనుండి ఖడ్గాన్ని పెరికాడు. మహర్షి హృత్పూర్వకంగా నవ్వి ఇట్లన్నాడు: "అలెగ్జాండర్! నన్ను చంపుతానంటున్నావా? ఇంత అబద్ధం నీ వెప్పుడూ ఆడియుండవు. చేతనైతే చంపు! చంపు! తత్ క్షణం చంపు! నన్ను చంపగల ఖడ్గ మెక్కడున్నది? నన్ను సంహరించగల ఆయుధ మెక్కడున్నది? నా ఆనందాన్ని భగ్నంచేయగల ఆపద ఎక్కడున్నది? నా సుఖాన్ని నివారించగల దుఃఖ మెక్కడున్నది? నిత్యమైన, నిర్వికల్పమైన, నిర్మలమైన, నిఖిల విశ్వాధినేతయైన పరమాత్మను నేను! ఈ శరీరం పోయినా నేను చావను. నీ చేతులను కదలించే శక్తిని నేనే! నీ కండరాలను సంచలింపజేసే శక్తిని నేనే!" అలెగ్జాండర్ హస్తంలోనుంచి ఖడ్గం క్రింద పడిపోయింది.

పరిత్యాగ తత్త్వమును తెలిసికోవడానికి ఒక్కటే మార్గమున్నది: పారమార్థిక దృష్ట్యా మనం శ్రీమంతులమైనప్పుడే, ప్రాపంచకదృష్ట్యా మనం సర్వస్వాన్ని పరిత్యాగం చేయడానికి సంసిద్ధులమవుతాము. దారిద్ర్యంలో సంపాదించుకొన్నది మాత్రమే శాశ్వతంగా నిలుస్తుంది- అన్న నిగూఢమైన వైజ్ఞానిక సూత్రాన్ని మీరు వినలేదా? ఆంతరంగికమైన పరిపూర్ణతను-అంతర్గతమైన స్వామిత్వమును-ఆత్మికమైన సామ్రాజ్యాధిపత్యమును-పొందినప్పుడే, మానవుడు, బాహిరమైన పరిత్యాగ ధర్మమును పరిగ్రహింపగలుగుతాడు. ఇంతకంటె వేరొక మార్గంలేదు. వేరొక మార్గంలేదు.

ప్రపంచమందు క్రోధముయొక్క ఉనికికి కారణమేమిటి? దౌర్బల్యాన్ని జయించాలని, క్రోధాన్ని నిగ్రహించాలని, మనం ప్రతి దినం, పెద్దపెద్ద బోధలు వింటున్నాం. ఎంత వింటున్నా, సమయం వచ్చినప్పుడు, మనం దౌర్బల్యానికి వశంకాక తప్పడంలేదు. ఎందుచేత? స్వాతిశయాది సమస్త పాపాలకు కారణమేమిటి? ఈ సమస్త పాశవిక వికారాలకు హేతువేమిటి? ఈ సమస్త పాపాలకు కారణం-ఒకటేనని వేదాంతం నిర్వచిస్తున్నది. ఒక్కొక్క పాపాన్ని తీసికొని, ఆ యా పాపాలన్నిటిని గూర్చి వివరించడానికిప్పుడు వ్యవధిలేదు. వివరాంశాలు

కావలసినవాండ్లు, తదుపరి, రామణ్ణి కలుసుకొని, తెలిసికోవచ్చు. ఇప్పుడు సారభూతంగా విషయం నిర్వచింపబడుతుంది. ఈ పాపాలన్నిటికి కారణం-అవిద్య-లేక-అజ్ఞానం. ఈ అజ్ఞానంచేత దేహాత్మ భ్రాంతి కలుగుతున్నది. మనో దేహాలను ఆత్మగా తలచే ఈ అజ్ఞానాన్ని పరిత్యజిస్తే ఈ పాపాలన్నీ పారిపోతాయి. అజ్ఞానాన్ని విడనాడకుండా అన్యయత్నాలు మీ రెన్నిచేసినా అపజయం తప్పదు. ఎందుకంటే-పదార్థం నాశం చేయబడదు. కానీ అజ్ఞానాన్ని నాశం చేయవచ్చు. అజ్ఞానాన్ని నివృత్తి చేసికోవచ్చు. శిశువులు జన్మించినప్పుడు వాండ్లలో ప్రాపంచికమైన అజ్ఞాన ముంటుంది. అయినా లోకవిషయాలకు సంబంధించిన ఆ అజ్ఞానం క్రమక్రమంగా వాండ్లను వదలిపోవడం మనం చూస్తాము. కనుక అజ్ఞానాన్నిమాత్రం మనం నివృత్తి చేసికోగలం.

కామక్రోధలోభమోహాది పాపవికారాలకు దారితీసే ఒకానొక శక్తి లోపల ఉన్నది. ఇది మీ ప్రబోధప్రచారాలద్వారా నశించదు. ఈ శక్తిని మీరు అణచలేరు. దీన్ని మీ రేవిధంగానైనా నిగ్రహించలేరు. అయితే ఈ శక్తియొక్క మూలతత్త్వాన్ని గ్రహించి, ఈ శక్తిని ఏతదభిముఖంచేసి సద్వినియోగంచేయడంద్వారా మనం దుర్వికారాలను జయించగలమని వేదాంతం నిర్వచిస్తున్నది. ఈ శక్తిని దుర్వినియోగంచేయక సద్వినియోగం చెయ్యాలె. సమస్త జగదీశ్వరుడైన అద్వితీయుడైన మీ స్వస్వరూపమైన మీ సత్యాత్మయైన పరమాత్మ యొక్క శక్తి యిది. ఈ శక్తిని పరమేశ్వరాభిముఖం చెయ్యాలె

ప్రతిమానవుడు స్వేచ్ఛను స్వాతంత్ర్యాన్ని ఆకాంక్షిస్తాడు. ఈ స్వాతంత్ర్య పిపాసయొక్క ప్రధానలక్షణ మేమిటి? తనకంటె రెండవ వాడులేని ఒకానొక అద్వితీయ స్థానము నధిరోహించడమే. సత్యాత్మ శక్తి సంపూర్ణస్వాతంత్ర్యపదాన్ని పొందమని తనకంటే రెండవది లేని అద్వితీయ స్థానమును పొందమని మానవుని ప్రేరణ చేస్తున్నది. మానవ స్వస్వరూపమైన పరమాత్మ అద్వితీయమైనది. ప్రాపంచికమైన స్వార్థము నుండి స్వాతిశయాభిమానాదులనుండి విముక్తి పొందాలంటే నిజమైన శక్తిని చంపడానికి వీల్లేదు. శక్తి నశించదు. శాశ్వతమైన ఆత్మ నశిం

చదు. నిత్యమయిన ఆత్మ ఏవిధంగా నశిస్తుంది? కానీ శక్తిని సక్రమంగా ఉపయోగించడంద్వారా నరకాన్ని నాకంగా (స్వర్గంగా) మార్చవచ్చు.

ఇంగ్లండు దేశపు క్రైస్తవ మతాధిపతిని గూర్చిన కథ ఒకటి ఉన్నది. అతడు డార్విన్ హక్స్లే మొదలైన గొప్ప విజ్ఞానశాస్త్రజ్ఞుల మరణాన్ని గూర్చి చదివాడు. వాండ్లు స్వర్గానికిపోయారో, నరకానికి పోయారో – అనే సందేహం అతనికి కలిగింది. "వాండ్లు ఏ పాపం చేయలేదు. కానీ వాండ్లు బైబిలును నమ్మలేదు. క్రీస్తును నమ్మలేదు. వాండ్లు క్రైస్తవమతంలో చేరలేదు. కనుక వాండ్లు నరకానికే పోయి ఉంటా"-రనుకొన్నాడు. మనస్సును సమాధానపరచుకోలేక పోయాడు. "వాండ్లు మంచివాండ్లు. వాండ్లు ప్రపంచానికి కొంత మేలుచేశారు. వాండ్లు నరకానికిపోవడానికి తగరు. మరి ఎక్కడికి పోయిఉంటారు?" అని తలపోయసాగాడు. ఆ ఆలోచనలో నిద్రపట్టింది. ఆ నిద్రలో అతని కొక విచిత్రమయిన కల వచ్చింది. తను మరణించినట్లు, తనను స్వర్గానికి తీసుకపోయినట్లు అతడు కలగన్నాడు. అతడు స్వర్గంలో ఉంటారనుకున్న వాండ్లందరూ స్వర్గంలో కనపడ్డారు. తనచర్చికి వస్తుండే క్రైస్తవ సోదరులందరూ అతనికి స్వర్గంలో కనపడ్డారు. డార్విన్, హక్స్లేలుమాత్రం స్వర్గంలో కనబడలేదు. స్వర్గద్వారపాలకుల నడిగితే డార్విన్ హక్స్లేలు పాతాళనరకంలో ఉన్నారని చెప్పారు.

మతాధిపతి వెంటనే ఆ పాతాళనరకానికి వెళ్ళి, ఆ విజ్ఞానశాస్త్రజ్ఞులను కలుసుకొని బైబిలును నమ్మనందుకు వాండ్లకు గలిగిన దుర్గతిని తెలిపి బైబిలును బోధించిరావడానికి అనుమతీయవలసినదిగా స్వర్గద్వారపాలకుల నర్థించాడు. చివరకెట్లాగో ద్వారపాలకు లనుమతించి పాతాళ నరకప్రయాణాని కాతనికొక టిక్కెట్టిచ్చారు. స్వర్గనరకాల్లోగూడా రైళ్ళున్నాయంటే మీ రాశ్చర్యపడతారు. ఆ మతాధిపతి రైళ్ళూ టెలిగ్రాఫులమధ్య పుట్టి పెరగడంచేత అతడు కలగంటున్న స్వర్గనరకాల్లో రైళ్ళుండడంలో ఆశ్చర్య మేముంటుంది?

సరే – ఆ మతాధిపతి ఒక ఫస్టుక్లాసు టిక్కెట్టు తీసికొన్నాడు. రైలుపోయింది. పోయింది. మధ్యమధ్య ఎన్నెన్నో స్టేషన్లు దాటడం

జరిగింది. ఎందుకంటే ఆతడు సర్వోన్నత స్వర్గంనుంచి అధమాధమ నరకానికి ప్రయాణం చేస్తున్నాడు. పొయ్యేకొద్ది స్టేషన్లలో నరకవాసనలు కనపడసాగాయి. ఇంకొక స్టేషనుకు పాతాళనరకం వస్తుందనంగా అసహ్యమయిన దుర్వాసన కొట్టింది. దుర్భరమయిన ఆక్రందనాలు వినబడ్డాయి. ఆతడాదుర్గంధాన్ని భరించలేక ఆ ఆక్రందనాలు వినలేక, ఎందుకు నరకానికి ప్రయాణం చేశానా అని పశ్చాత్తాప పడసాగాడు:

కొలది నిమిషాల్లో, ప్లాట్ ఫారంపైన "ఇదే పాతాళ నరకం!– పాతాళనరకం!" అనే కేకలువినబడ్డాయి. "పాతాళనరకం" అని వ్రాయబడ్డ బోర్డు కనబడింది. రైలాగింది. జనులు దిగుతున్నారు. మతాధిపతి ఆశ్చర్యపడ్డాడు. "ఇది పాతాళ నరకమా? మహోన్నత స్వర్గంలాగా ఉందే! ఇది పాతాళ నరకం కానేకాదు. మహోన్నత స్వర్గమై తీరుతుంది. నిజంగా ఇది పాతాళ నరకమా?"– అని ఆతడు ప్రతి వ్యక్తినీ ప్రశ్నించాడు. చివరకు గార్డు నడిగాడు. "ఇదే పాతాళ నరకం, చివర స్టేషన్ దిగి పొమ్మన్నాడు గార్డు"

మతాధిపతి దిగాడు. ఆశ్చర్యపడ్డాడు. ఈ అంతిమ నరకం అతి ఘోరంగా ఉంటుందని అత డూహించాడు. కానీ అది ఆతని ఉన్నత స్వర్గంలో పోటీచేస్తున్నట్లున్నది. స్టేషనులో నుంచి ఆవల అడుగు బెట్టగానే, అద్భుతోద్యాన వనాలు, మధుర సుగంధ పుష్పాలు, చల్లని పిల్లగాడ్పులు అతణ్ణి పరవశుణ్ణి చేశాయి. అక్కడ ఒక పొడగాటి మనిషి కనబడ్డాడు. అతడే హాక్స్లే. "ఇది నరకమా?" అని మతాధిపతి హాక్స్లేను ప్రశ్నించాడు. "అవును, ఇది నరకమే"– నన్నాడు హాక్స్లే. మతాధిపతి, "నీకు నేను మతబోధ చేయడానికి వచ్చాను. కానీ ముందు, నాకు కనపడుతున్న ఈ విచిత్ర దృశ్యాన్ని గూర్చి చెప్ప మన్నాడు. "నిజంగా ఇది నీచాతి నీచమయిన నరకమే. మొదట మేము వచ్చినప్పుడిది పరమాసహ్యకరమయిన నరకంగా ఉన్న మాట నిజమే"– నని హాక్స్లే, పూర్వం మురికినీళ్ళ గుంటలున్న ప్రదేశాలను, ఇనుమును కాల్చి కరగిస్తున్న కొలుములున్న ప్రదేశాలను, దుర్గంధమలకుండా లున్న ప్రదేశాలను, చూపి, ఇట్లు సంభాషించాడు : మురికి గుంటల్లోని నీళ్ళు తోడి, ఒడ్డునఉన్న కొలుములనార్పి

ఆ యినుముతో కావలసిన పనిముట్లు, ఆయా యంత్రాలు తయారు చేసికొన్నాము. వాటి సహాయంతో భూమిని బాగాదున్ని, మల కుండాల్లోని మలాన్ని ఎరువుగా ఉపయోగించి, సారవంతంచేసి, తోటలు పెంచుకొన్నాము. ఇట్లు కృషిచేసి, క్రమక్రమంగా అసహ్యాకరమయిన నరకాన్ని ఆనందకరమయిన స్వర్గంగా చేసికొన్నాము."

నరకంలోని ఆయా పదార్థాలను సక్రమస్థానాల్లో ఉంచి సద్వినియోగం చేయడంవల్ల అసహ్యాకరమైన నరకం అత్యున్నతమైన స్వర్గంగా మారిపోయింది, వేదాంతం దీన్నే సూత్రీకరిస్తున్నది. మానవునిలో భవ్యమయిన పరమాత్మ జ్యోతి ఉన్నది. క్షుద్రమైన దేహమూ ఉన్నది. మానవుడు, దేహస్థానంలో దేవుని (పరమాత్మను), దేవుని స్థానంలో దేహాన్ని ఉంచాడు. బండికిముందు గుఱ్ఱాన్ని ఉంచడానికి బదులు, గుఱ్ఱానికిముందు బండిని ఉంచాడు. అందుచేతనే ఈ ప్రపంచాన్నొక నరకంగా అనుభవిస్తున్నాడు. మీరు దేన్నీ నాశంచేయ నవసరంలేదు. మీ వాంఛాశక్తిని, మీ స్వార్థభావనాశక్తిని, మీ క్రోధ ప్రకృతిని, మీ పాప స్వభావమును, మీరు చంపలేరు. కానీ మీరు దానిని సక్రమ స్థానంలో పెట్టవచ్చు. ఆ విధంగా నరకాన్ని స్వర్గంగా మార్చవచ్చు.

వేదాంతం సమస్త ప్రాపంచిక దుఃఖనివృత్తికి ఒక్కటే మార్గం చెపుతున్నది. ఏడుపు ముఖాలతో ఈడుపు కాళ్లతో పరిస్థితులు చక్కబడవు. సమస్త పాపనివృత్తికి, సమస్త వ్యసన విముక్తికి ఏకైక మార్గం—ఆత్మజ్ఞానం! స్వస్వరూప సత్యాత్మ జ్ఞానం! మిమ్ము ఆకర్షిస్తున్న, మిమ్ము బంధిస్తున్న ఈ మాయా భ్రాంతులకు మీరు అతీతులుకాంది, మీరు పశువికారాలను జయించలేరు. మీరు ఆత్మజ్ఞానులుకాగానే, బ్రహ్మజ్ఞానులుకాగానే, సమస్త పశువాసనల కతీతులౌతారు. సంపూర్ణ ముక్తి స్వరూపులై ప్రకాశిస్తారు. పరిపూర్ణానందమయులై వెలుగొందు తారు. ఇదే స్వర్గజీవనం!

ఓం! ఓం!! ఓం!!!

ఓమ్

# పాపలక్షణము - పాపనిర్ణయము

[ 1902, డిశంబరు 20వ తేదీ శాన్‌ఫ్రాన్సిస్కో-ఎకాడమీ అఫ్ సైన్సెస్‌లో ఇచ్చిన ఉపన్యాసం. ఈ ఉపన్యాసం వెనుకటి ఉపన్యాసముయొక్క అనుబంధమే]

ఆత్మ స్వరూపులైన మహాజనులారా!

ప్రపంచములో ఆశ్చర్యకరమయిన విషయాలను మీరు దర్శిస్తున్నారు. తాత్వికుల మనస్సులను కలవరపెట్టే విషయాలను - విజ్ఞానులను ఆందోళనపరచే నైతికమతవిషయాలను మీరు గమనిస్తూన్నారు. వీటినిగురించిన వైదాంతిక వ్యాఖ్యానము ఈరాత్రి చెప్పబడుతుంది. ఈ వైచిత్ర్యాలల్లో పాపంకూడా ఒకటి. ప్రపంచంలో జన్మించిన ప్రతివారు విధిగా మరణించవలసిందే అనే సూత్రం సర్వులకు ఎట్లా తెలుసు? భూమిమీద దర్శింప బడుతున్న ప్రతివృక్షము ఒకరోజుకు నశిస్తుంది. భూమిమీదచూడబడుతున్న ప్రతిజంతువు నశిస్తుంది. మానవుడికి మరణం విధి. ప్రతివానికి ఈ విషయం తెలుసు. అనంతకోటి మానవుల మరణానికి కారణమయినమహాయోధులు అలెగ్జాండర్, నెపోలియన్, వాషింగ్‌టన్, వెలింగ్‌టన్ మొదలైన వారందరూ వర్ణించరాని ఒక నిత్యవిధికి ఆహుతి ఐనారు. ఎవరిహస్తాలవల్ల రక్తపాతము, ఘోరహత్యలు జరిగినవో, వారందరూ మరణాన్ని జయించలేక పోయినారు. మరణించినవారిని తిరిగి బ్రతికించినవారుగూడా మరణించారు. దేహాలు అశాశ్వతములైనవని మనకు తెలుసు. ప్రతివాడికి తెలుసు. తెలిసినా జీవితాచరణలో ఎవ్వరూ దానిని నమ్మరు. మానసికంగా ప్రతివారు దేహాలు అశాశ్వతాలనే సూత్రాన్ని నమ్మితీరుతారు. కాని ఆచరణలో ఎవ్వరూ దానిని నమ్మరు. ఈ సూత్రవిషయమయి మానసికంగా ఒప్పుకుంటారుగాని ఆచరణపూర్వకమయిన నమ్మకం లేదు. అది ఎందుచేత? శతవృద్ధుడు కూడా సంసారాన్ని విడిచిపెట్టడానికి వాంఛించడు. ప్రపంచంలో శాశ్వతంగా బ్రతక వాంఛిస్తాడు. మరణాన్ని తృణీకరిస్తాడు. అసహ్యించుకుంటాడు. దైనికమయిన ఆచరణాత్మకమయిన కర్మజీవితంలో మరణాన్ని గురించి చింత చెయ్యనే చెయ్యడు. ఆస్తిని వృద్ధిచేసుకోను

వాంఛిస్తాడు. స్నేహితులను బంధువులను ఎక్కువ చేసుకోను ఆశిస్తాడు. తన అధికారం క్రింద ఇంకా ఇంకా ఆస్తి ఉండాలెనని దురాశ పడతాడు. శాశ్వతమైనదని దైహికజీవితాన్ని భ్రాంతిచేత అపేక్షిస్తాడు. ఆ వృద్ధ మానవునకు ఆచరణాత్మకమైన కర్మజీవనములో-మరణములో నమ్మకం లేదు. అంతేకాక మరణనామమే వృద్ధ మానవునకు దేహంలో భయాన్ని, కంపాన్ని కలగచేస్తుంది. మరణనామమాత్రాన్నే వణికిపోతాడు, మానవుడు. మరణ భావాన్ని సహించలేక పోయినప్పటికీ, మరణనామాన్ని అసహ్యించుకున్నప్పటికీ, మరణం సత్యమని మానసికంగా నమ్ముతాడు. అది ఎందుచేత? ఇది పరస్పర వ్యతిరేక విషయం. వ్యాఖ్యానం చేయండి. మానవునికి ఆచరణాత్మకమైన కర్మజీవితమందు, మరణవిధిలో నమ్మకం లేకపోయినా, మరణమును గురించిన మానసిక విజ్ఞానం ఏ విధంగా ఉన్నది? వేదాంతము ఈ విషయాన్ని ఈ విధముగా వ్యాఖ్యానం చేస్తుంది. "మానవునిలో సత్యాత్మ ఉన్నది. అచంచలమై, భూతభవిష్యద్వర్తమాన కాలాల్లో-సర్వకాలసర్వావస్థల్లో నిత్యమైన పరబ్రహ్మ ఉన్నది. మానవునిలో మార్పులేని - మరణం అంటే ఏమిటో తెలియని - సనాతనతత్త్వం ఉన్నది. కర్మ జీవితంలో మానవునికి మరణం అంటే నమ్మకం లేకపోవడానికి కారణం-అతనిలోనిత్యమై మరణరహితమై ఉన్న చైతన్యమయ సత్యాత్మయే.

మనం మరొక వైచిత్రాన్ని గురించి విచారిద్దాము. మానవుని యొక్క స్వేచ్ఛావాంఛ: ప్రపంచంలో ఉన్నటువంటి ప్రతిజీవి - కుక్కలు, సింహాలు, వ్యాఘ్రాలు, పక్షులు, మానవులు - ప్రతిజీవి - స్వాతంత్ర్యాన్ని, స్వేచ్ఛను, వాంఛించడం చూస్తాము. ప్రేమించడం చూస్తాము. స్వేచ్ఛాభావం విశ్వమయమైనది. జాతులు రక్తపాతం చేస్తున్నవి. భూమిని, రక్తంతో తడుపుతున్నవి. భూమియొక్క సుందరముఖం - స్వేచ్ఛ పేరట జరిగే రక్తపాతానికి, ఘోరహత్యకు సిగ్గుచేత తలవంచుకోవలసి వస్తుంది. క్రైస్తవులు, హిందువులు, మహమ్మదీయులు, సర్వమతస్థులు ఒకే అంత్యాన్ని చూస్తున్నారు. అదేమిటి? ముక్తి, దాని అర్థ లేకమే స్వేచ్ఛ.

కుమ్మరిపురుగు బురదలో తిరిగినప్పటికి దాని కాబురద అంటదు. వేదాంత మిలా నిర్వచిస్తున్నది - "అదేమాదిరి ఓ మానవుడా! నీలో అతి పవిత్రమైన, దోషరహితమైన, శరీర వాసనారహితమైన, పరమాత్మ ఒకటి ఉన్నది. పాపపంకిలమయిన యీ ప్రపంచములో, ఆ పరమాత్మ నిరంతరము పరిశుద్ధముగా వెలుగుతుంటుంది. అయితే దోషం పుట్టేదెక్కడ? పావిత్ర్యము నిజానికి సత్యాత్మ సంబంధమైనది. కాని ఆ పవిత్రత భ్రమచేత దేహానికి అధ్యస్తంచేస్తున్నారు." ఈ మనోదేహాలు పరిశుద్ధములయినవనే భావము దేనివల్ల కలిగింది? మానవ హృదయాల్లో యీ భావము నెవరు నాటారు? ఎవరూ నాటలేదు. పై నుంచి ఏ సైతానో దిగి, ఏ భూతమో దిగి మీ హృదయాలలో యీ భావాన్ని నాటలేదు. ఇది మీలోనే యున్నది. ఈ కారణము మీలోనే యున్నది. లోపలి కారణాలను బయటి విషయాలకు అంటగట్టే రోజులు పోయినవి. ఎవరైనా మనిషి క్రిందపడిపోతే దానికి కారణం - ఒక భూత మనుకొనేవారు. ఆ రోజులు పోయినవి. విజ్ఞాన తత్వశాస్త్రాలు యీ సమాధానాలకు అవకాశ మివ్వవు? మన మీ సమాధానాలను లోపలే చూడాలి. శరీరము పాపమయమైందని, ఎప్పుడూ దోషభూయిష్టమయిందని మనకు తెలుసు. అయినా మనము మనలను పవిత్రులుగనే చూచుకుంటాము. దీనినెలా వ్యాఖ్యానం చేయడం? వేదాంత మిలా సందేశిస్తుంది. "ఏదో బయటనున్నదనే సైతానుకో, ఏదో భూతానికో యీ కారణాన్ని అంటగట్టబోకండి. ఈ కారణము మీలో ఉన్నది. పరమ పవిత్రమయిన - పాపరహితమయిన - పరమాత్మ అవినాశమయిన - అప్రతిహతమయిన పరబ్రహ్మ మీలో వెలుగుతున్నాడు. శరీరం ఎంత పాపపంకిలలో వున్నా, సత్యాత్మ, నిరంతరం ప్రకాశిస్తూ ఉండడముచేత, ఆ సత్యాత్మయొక్క పవిత్రానుభూతే మనకు నిరంతరము నిలిచియున్నది. అది అవినాశమయినది"

మనమిప్పుడు వివిధపాపాలనుగురించి విమర్శిద్దాము. వివిధ విభ్రాంతులనుగురించి విచారిద్దాము.

పొగడ్త : ఇది పాపాలలో ప్రధానమయినది. ఈ పాపం మృత ప్రాయమయిందికాదు. ఇది సమస్తప్రపంచములో వ్యాపించింది. నీచుని దగ్గరనుంచి దేవతవరకు పొగడ్తను ఆహ్వానిస్తారు. ప్రతివారు పొగడ్తకు దాసులౌతారు. ఇది ఎందుచేత ? ప్రతివాడు గౌరవింపబడాలని సమాదరింపబడాలని స్తుతింపబడాలని ఆశిస్తాడు. ఎందుచేత ?

చివరకు కుక్కలను చూడండి. వీపుదువ్వి కొంచెము పొగడండి. ఉత్సాహంతో పొంగిపోతవి. వాటికికూడ పొగడ్త యిష్టం. గుఱ్ఱాలకు కూడా పొగడ్త యిష్టం. యజమానివచ్చి వెన్నుజరచి జూలు దువ్వి ఉత్సాహపరుస్తాడు. గుఱ్ఱం చెవులు నిక్కబొడుచుకొని శక్తిమంత మౌతుంది.

హిందూదేశంలో వేటకొఱకై రాజులు కుక్కలబదులు పెద్ద పులుల నుపయోగిస్తారు. వేటలో ఆ పెద్దపులి మూడు దుముకులలో జంతువులను పట్టుకోవాలి. జంతువు పట్టుబడుతుందా సరే. లేదా ఆ పులి గుండె చెడి నిరుత్సాహంతో నిలుచుంటుంది. ఆ సమయాల్లో రాజకుమారులు పులియొక్క వెన్ను జరచి పొగడుతూ ఉత్సాహ పరుస్తారు. దాని కప్పుడు ధైర్యము, ఉత్సాహము నరనరాలలో పొంగి పోతుంది. చూచారా ! పెద్దపులులుకూడా పొగడ్తను ప్రేమిస్తవి. ఇక మనిషి విషయం చూడండి. ఎందుకు పనికిరాని మానవుని – విలువలేని మనిషిని చూడండి. అతని దగ్గఱకు వెళ్ళి కొంచెం తమాషాగా పొగడండి. ఓహో! అతని ముఖము ఆనందంతో వికసిస్తుంది. అతని బుగ్గల మీద అరుణకాంతులు వికస్తాయి. రకరకాల దేవతలను పూజించే దేశాలలో, ఆ దేవతలుకూడా పొగడ్తకు వశులు కావడం మనం చూస్తాము. ఏకేశ్వరవాదుల ప్రార్థనల చూడండి. ఏమిటి వాళ్ళ ప్రార్థనల్లో కనబడేది ? పరీక్షించండి. నిష్పాక్షికంగా పరీక్షించండి. వాటిలో పొగడ్తతప్ప వేరేమీ కనబడదు. ఈ పొగడ్త యింత విశ్వ మయంగా ఉంటానికి కారణమేమిటి ? ప్రతివ్యక్తీ పొగడ్తను ప్రేమిస్తాడు. కాని యిలా పొగడ్తల ప్రేమించే మనుష్యులలో ఆ పొగడ్తకు తగిన మానవుడు ఒక్కడైనా వుండడు. ఈ అనవసర గౌరవాలకు ఒక్కడైనా అర్హుడుండడు. దీనికి కారణం – వేదాంత మీ రంగాక

నిరూపిస్తున్నది. - ప్రతి వ్యక్తిలో, ప్రతి మానవుడిలో సత్యాత్మ ఉన్నది. యథార్థంగా ఆ పరమాత్మ మహాపూజ్యమైంది. మహోన్నతమైంది. అత్యధికమైన, అన్నిటికంటే ఎక్కువైన, ఒక సత్యవస్తువు లోపల ఉన్నది. పొగడినప్పుడు, ఉత్సాహపరచినప్పుడు, మనం సంతోష పడుతున్నాము. ఎందుచేత? కారణం యీ పొగడే విషయాలన్నీ నిజమని కాదు. ఈ పొగడ్తకు తగిన అర్హత, యీ భౌతిక దేహంలో లేదు. నిజమైన కారణము నిజమైయున్న ఆ పరమాత్మలో ఉన్నది. ఈ తెరల వెనుక, యీ మాయాయవనికల వెనుక, ఒక దివ్యశక్తియున్నది. ఏదో ఒక సుస్థిరమైన, ఏదో ఒక అఖండమైన, ఏదో ఒక మహాధిక్యమైన ఏదో ఒక మహా ఘనమైన దివ్యశక్తి ఉన్నది. ఆ సత్యాత్మే మీ స్వరూపం. ఆ సత్యాత్మ స్తోత్రార్హమైంది. సత్యాత్మ తప్ప గౌరవనీయమైంది, పూజ్యమయినదీ, యింకొకటి లేదు. ఏ పొగడ్తను, ఏ స్తోత్రాన్ని ఏ ప్రతిభను సత్యాత్మేతరమైన దేహానికి యివ్వకూడదు "సీజరు వస్తువులు సీజరుకివ్వండి. భగవంతుని వస్తువులు భగవంతుని కివ్వండి". భగవంతుని కివ్వవలసిన వానిని సీజరుకివ్వడం, సీజరున కివ్వవలసిన వానిని భగవంతుని కివ్వడంలోనే - ఇలా పొగడ్తయొక్క పాపం పుడుతున్నది. ఈ తల్లక్రిందుల విధానములోనే యీ స్తోత్రబానిసత్వమనే పాపం పుడుతున్నది. ఇదే పాపకారణం. గుఱ్ఱం ముందర బండి ఉంచబడింది. నీవు ఆత్మజ్ఞానం పొందితే త్రిలోక పూజనీయమైన, దివ్యాతిదివ్యమైన పరమాత్మను నీ స్వస్వరూపంగా గ్రహించగల్గినప్పుడు, శరీరమనస్సులకు అతీతుడవైనప్పుడు నిజంగా నీవు మహాత్ముడవు. పరమపూజ్యుడవు. నీకు నీవే ఆదర్శము. నీకు నీవే భగవంతుడవు. నీవే సాక్షాత్ భగవంతుడవు. బ్రహ్మజ్ఞానులై విముక్తులు గాండి. కాని ఆత్మయొక్క మహా ప్రతిభను, సత్యాత్మయొక్క ఉన్నతిని, శరీరానికి యివ్వడమే చేస్తున్న పొరపాటు. ఈ దేహాభిమానమే, పాపకారణము. ఇందులోనే దోషమున్నది. ప్రతి వ్యక్తీ, ప్రతి మానవుడూ, ప్రతి జంతువుకూడా, 'పొగడ్త' అనే గర్వంఅనే విష రోగానికి గురి గావడం దేనికి? అహంకృతి, గర్వము, డాంబికత, సమస్త విశ్వంలో రాజ్య మేలడం దేనికి?

ఒక పెద్దమనిషి రామునితో యిలా అన్నాడు - "చూడండి! మా మతంలో చేరినవాళ్లు అనేకమంది ఉన్నారు. మా మతములో అనుచరుల సంఖ్య చాలా ఎక్కువ. అందుచేత మా మతము చాలా గొప్పదిగాకపోతే, యింతమంది చేరుతారా?" రాము డతనితో యిలా అన్నాడు. "తమ్ముడా! సరిగా ఆలోచించు. సైతానును నీవు నమ్ముతావా?" "ఆ, నమ్ముతాను" అన్నాడతడు. "అయితే చెప్పు. సైతాను మతము నమ్మే జనసంఖ్య ఎక్కువ వున్నారా? నీ మతంలో జనసంఖ్య ఎక్కువ యున్నారా? జనసంఖ్యయొక్క ఎక్కువ చేతనే సత్యాన్ని నిర్ణయించవలసియుంటే అన్నిటికంటే సైతాను మతానికే ప్రథమ స్థానం వస్తుంది."

సైతానుయొక్క ముఖాల్లో ఒకటైన గర్వము లేక డంబము, ఈ ప్రపంచంలో ప్రతివానిలో పాతుకొనిపోయింది. శరీరానికి గర్వపడ దగిన కారణాలు లేవు. దానికే ఆధిక్యతా లేదనేవిషయం ప్రతివానికి తెలుసు. కాని ఒకవైపు తదేక సమయంలోనే ప్రతివ్యక్తి గర్వపడు తుంటాడు. ఇలా ఉంటానికి కారణ మేమిటి? ఈ విశ్వమయమైన డాంబికరోగం ఎక్కడనుంచి వచ్చింది? ఇది నీలోనే పుట్టింది. కారణం దూరంగాలేదు. నీలో సర్వాధికమైన సత్యాత్మ వున్నది. సత్యాత్మ నీవని తెలుసుకోవాలి. ఆ సత్యాత్మ జ్ఞానము కలిగినట్లైతే, ఈ శరీరాభిమానం నశిస్తుంది. అహంకృతి అప్పుడు నిలువలేదు. నీవు నీ సత్యాత్మను తెలుసుకొన్నట్లయితే, నీవు నీ హృదయాన్ని సంస్కరించుకున్నట్లయితే నిన్ను నీవు ఉద్ధరించుకుంటావు. నీలోని భగవంతుని సందర్శించినతర్వాత, నీలోని పరబ్రహ్మను తెలుసుకున్న తర్వాత, నీకీ దేహసంబంధమైన గౌరవాలు స్తోత్రాలు, ఆడంబరాలు ఆత్మను అగౌరవించడంగా, శుష్కంగా మిథ్యగా కనబడతవి. నీ వప్పుడుశరీరాహంకృతికి, స్వార్థగర్వానికి అతీతుడవై నిలబడగలవు. ఇదే గర్వాహంకారాలను జయించడానికి మార్గము.

నీలోని సత్యాత్మ అన్నిటికంటె మహోత్తమమైంది. నీలో దేవాదిదేవు డున్నాడు. ఆ పరబ్రహ్మ తన సహజప్రతిభను ఎలా వదలగలడు? సర్వోన్నతమైన యీ ఆత్మ, తనను ఏ రకంగా న్యూన

పరచుకోగలదు? అది ఏరకముగా తననుతాను దారిద్ర్యవంతంగా, నీచమైనదానిగా, క్షుద్రకీటకంగా, సంభావించగలదు ? ఇంతి అజ్ఞానపు అడుగుల్లోకి ఆ ఆత్మ ఎలా తనకుతాను తలవంచుకొనగలదు? ఆ ఆత్మ తన సహజ ప్రకృతిని వదలలేదు. గర్వాహంకారాలు సమస్త ప్రపంచంలో నిండివుండడానికి కారణం యిదే. అయితే యీవివరణ శరీరానికి అహంకారముతప్పక ఉండాలనా ? గర్వాహంకృతులు శరీరానికి ఉండాలనా? గర్వాహంకృతులు శరీరానికి ఉండాలని యీ వివరణం తీర్పు జెప్పదు.

భూమి తిరుగుతున్నది. సూర్యుడు నిశ్చలుడై యున్నాడన్న సంగతి మన కందరికి తెలుసు. అయినా మనము భ్రమపడుతున్నాము. భూమియొక్క పరిభ్రమణాన్ని సూర్యునికి, సూర్యునియొక్క నిశ్చలతను భూమికి మనము ఆపాదిస్తున్నాము. గర్వాహంకారాలవెంట దాహంతో పరుగెత్తే మానవులయొక్క పొరపాటుకూడా యిదే. నిశ్చలమైన, నిజముగా సమస్తప్రతిభకు మూలకందమైన, పరంజ్యోతియైన, సత్యసూర్యుడైన పరమాత్మ ఉన్నది. చంచలమైన, గౌరవహీనమయిన, ప్రతిభావిహీనమయిన భూమివంటి శరీరమున్నది. శరీరముయొక్క నైచ్యాన్ని, అశాశ్వతత్వాన్ని. సత్యాత్మకూ ఆత్మయొక్క మహాప్రతిభను, పావిత్ర్యాన్ని శరీరానికి- మనము అంటగట్టుతున్నాం. ఈ పొరపాటే, ఈ అజ్ఞానమే, యీక్షుద్ర దేహాహంకార తృష్ణకు కారణం. ఈ అజ్ఞానమును సైతానని మనము వ్యవహరిద్దాం. ఈ అజ్ఞానరూప సైతానే విపర్యయాలను తలక్రిందుచేసి ఆత్మయొక్క ప్రతిభను దేహానికీ, దేహముయొక్క నైచ్యాన్ని ఆత్మకూ ఆపాదిస్తున్నాడు. ఈ అజ్ఞానాన్ని తొలగించుకో. గర్వాహంకారాలు అదృశ్యమౌతవి.

ఆశ ప్రపంచమంతా నిండియుండడానికి కారణమేమిటి? జంతువులకు ఆశ ఉన్నది. సమస్త ప్రజలకు ఆశ ఉన్నది ? ఇంత విశ్వమయంగా ఆశ ఉండడానికి కారణమేమిటి ? ప్రతివ్యక్తి తనయింట్లో సమస్త వస్తువులు ప్రోగుచేయాలని కోరుతుంటాడు. ఎంత కూడబెట్టినా ఆశకు అంతు లేదు. ఎంత ఎక్కువగా సంపద కూడుతుందో, అంత అత్యధికంగా ఆశాజ్వాల నాలుకలు చాపుతూ చెలరేగుతూంది. నీవు చక్రవర్తివి

కా. అప్పటికీ ఆశ నిలిచేయున్నది. అయితే ఆయాశ రాజ్యాశ. నీవు బీదవాడై యుంటావనుకో. ఆ యాశ బీదవానిఆశగా యుంటుంది.అంతే. ఈ ఆశ యింత విశ్వమయంగా ఉండడానికి కారణమేమిటి? చర్చీలలో, హిందూ దేవాలయాలలో, మహమ్మదీయ మసీదులలో, ఎక్కడబట్టినా ప్రబోధకులు "సోదరులారా! ఆశవద్దు, ఆశవద్దు, ఆశవద్దు" అని పెద్ద పెద్ద ప్రబోధాలు చేస్తుంటారు. ఈ ఆశను అణచడానికి ప్రబోధకులు తమశక్తినంతా ఉపయోగిస్తారు. ధారపోస్తారు. ఎంతచేసినా ఆశ చావదు. ఏమిటి కారణం? ఆశ చావదు. ఆశావిముక్తి గలుగదు. ఈ ఆశను వ్యాఖ్యానించండి. ఈ ఆశారోగాన్ని చంపడానికిముందు, దానికి కారణాన్ని తెలుసుకోండి. రోగకారణాన్ని తెలుసుకోకపోతే, రోగనివృత్తికి మార్గము దొరకదు. కారణము గ్రహిద్దాం. వెలుపలి సైతాను యీ యాశ మనలో పుట్టిస్తున్నది అని చెప్పడం - విజ్ఞాన తత్వశాస్త్ర విరుద్ధం. సమస్త తార్కికన్యాయాలకు విరుద్ధం. విషయాలకు, విజ్ఞానశాస్త్ర వివరణాన్ని యివ్వలేకపోయినట్లయితే పుక్కిటివివరణాలు దేనికి ? ఎందుకీ ఆశ విశ్వమయంగా యున్నది? వేదాంత వ్యాఖ్యానమిది. మానవుడిలోసత్యాత్మ స్వయంభూతమై యున్నది. అది అవినాశమయినది. శక్తి నశించదు. శక్తి యొక్క రక్షణ ధర్మమును గురించి శక్తియొక్క అవినాశనధర్మమును గురించి, పదార్థ అవినాశన సిద్ధాంతాన్నిగురించి, శక్తితీక్ష్ణతా సిద్ధాంతాన్ని గురించివింటాం. వేదాంతమిలా చెబుతున్నది - "ఓ మంత్రులారా! ఓ క్రైస్తవులారా! ఓ హిందువులారా! ఓ మహమ్మదీయులారా! ఆశాస్వరూపముతో ఉన్న యీ యాశక్తిని మీరు అణచలేరు. మీరు అణచలేరు. అనంతకాలాలనుంచి సర్వమతాలు ఆశాపరిత్యాగాన్ని బోధిస్తున్నవి, ఎన్ని వేదములున్నా, ఎన్నిబైబిళ్లున్నా ఎన్ని ఖొరానులున్నా ఆశ పోలేదు. శక్తిచావదు. అయితే ఆ శక్తిని మీరు సక్రమోపయోగపథంలో పెట్టవచ్చు. వేదాంత మిలా నిర్వచిస్తున్నది- "ఓ ప్రపంచమానవుడా! మహా పవిత్రపదమయిన G. O. D. (భగవంతుడు) అన్న మూడు అక్షరాలను తీసుకోండి. ఈ అక్షరాలను తలక్రిందు చేసి చదవండి. ఏమి అర్థమిస్తున్నది? D. O. G. (కుక్క). నీ వీ విధంగా పవిత్రాతిపవిత్రమయిన పరమపావనమయిన నీలోని

భగవంతుని వ్యత్యస్తం చేస్తున్నావు. అపార్థం చేస్తున్నావు. తల్లకిందులుగా చూస్తున్నావు. నిన్ను నీవు కుక్కగా మార్చు కుంటున్నావు. నిజంగా నీవు పవిత్రాతిపవిత్రమయిన భగవంతు డవు. ఈ దోషంచేత - యీ అనాత్మ భ్రాంతిచేత - యీ దేహాత్మ భ్రాంతిచేత - నీవు ఆశాగ్నిలో పడిపోతున్నావు. నీదోషాన్ని సవరించు. నీవు శాశ్వత పరబ్రహ్మమూర్తి వౌతావు. నీలోని సత్యాత్మను ఉద్ధరించుకో. సత్యాత్మలో సుస్థిరుడవు కా. నీవు దేవాది దేవుడు వని పరమపావనుడ వని, జగన్నాధుడవని, పరమేశ్వరుడవని, ఆత్మస్వరూపు డవని తెలుసుకో. అప్పుడు యీ మిథ్యావస్తువులు, యీ మిథ్యా సంపదలు, యీ మిథ్యాభోగాలు నిన్ను వశం చేసుకోలేవు. ఆశా తాపం చల్లారుతుంది.''

మన మింక 'రాగం', లేక 'మోహాన్ని' గురించి విచారిద్దాం. మోహానికి కారణ మేమిటి? వస్తువులు మారకుండా పోకుండా ఉండా లనే యీ రాగానికి కారణ మేమిటి? తన ప్రియబంధువుడు చనిపోయి నపుడు మానవుడు దుఃఖమగ్నుడౌతున్నాడు. అతని శోకాందోళనల్లోని అర్థ మేమిటి? ఈ దుఃఖం నిరూపించే దేమిటి? ఈ ప్రాపంచిక వస్తువులన్నీ క్షణభంగురాలని, అశాశ్వతములని. మనకు మానసికంగా తెలిసి నప్పుడు యీ ప్రపంచ వస్తువులను, మన ప్రియబంధువులను స్థిరంగా మనయెదుట ఉంచుకోవాలని ఆశించగలమూ? అయినా మనం, వస్తువులు మారక శాశ్వతంగా నిలవాలనే కోరుతున్నాం. దీని అర్థ మేమిటి? వేదాంతము ఈ విధంగా నిర్వచిస్తున్నది - ''ఓ మానవుడా! నీలో అవికల్పమైన, సర్వకాల సర్వావస్థలయందు శాశ్వతిమైన, సుస్థిర మైన బ్రహ్మవస్తువున్నది. అజ్ఞానంచేత ఆ సత్యాత్మయొక్క అవినాశ ప్రకృతిని దేహానికి ఆపాదిస్తున్నావు. ఇదే రాగ కారణం. అజ్ఞానాన్ని వదలు. ప్రాపంచిక వ్యామోహవలయాలకు నీ వతీతుడ వౌతావు.''

సోమరితనానికి కారణ మేమి? వేదాంతదృష్ట్యా విశ్వమయంగా ఉన్న సోమరితనానికి కారణం - సమస్తజనుల్లో ఉన్న సత్యాత్మ, పూర్ణశాంతిమయం కావడమే. సత్యాత్మ అనంతమయింది కావడమే. అనంతం నిశ్చలమైందికదా. పరిమితం కలదే కదలగలదు. అపరిమితాత్మ

ఏవిధంగా చలిస్తుంది? ఇక్కడ ఒక సున్నా ఉన్నది. ఇక్కడ ఇంకొక సున్నా ఉన్నది. ఈ ఒక్క సున్నే ఉండాలంటే, రెండో సున్నా ఉండదు. ఒకే సున్నాతో స్థలమంతా ఆవృతం చెయ్యాలంటే, సున్నా అనంతం అవుతున్నది. చిన్న సున్నాకు అవకాశం ఉండదు. ఈ సున్నా అనంతం కావాలంటే, దీన్ని పరిమితంచేసే వేరే పరిధి యింకొకటి ఉండకూడదు. అనంతం సర్వవ్యాప్తమయినది. అది సంచలించడానికి వేరే అవకాశమేది? అనంతత్వం అవికల్పమయింది. అంతరాత్మ, సత్యాత్మ అనంతమైంది. అపరిచ్ఛిన్నమైంది. పరిపూర్ణమైంది పూర్ణశాంతి స్వరూపం. అది నిశ్చలమైంది. అందుచేత, ఆత్మయొక్క శాంతి, అనంతత్వం, అజ్ఞానంచేత దేహానికి సంక్రమింప బడుతున్నది. ఇదే సమస్త విశ్వంలోని జడత్వానికి, సోమరితనానికి, కారణం.

ప్రపంచంలో ఎవరుకూడా తనకు ఎదురు లేకుండా ఉండాలని కోరుతారు. కారణ మేమిటి? ప్రతి వ్యక్తీ, తానే సర్వాధిపతియైన ఏకైక పరిపాలకుడు కావాలని వాంఛిస్తాడు.

"సర్వలోకాలకు నేనే పాలకుడ
ఎవరు నా ఆజ్ఞను జవదాటరాదు"

ప్రతి వ్యక్తీ ఇట్లే అనుకుంటాడు. సమస్త విశ్వజనీనమై ఈ భావం ఉండటానికి కారణమేమిటి? ఈ సుస్థిరసత్యాన్ని వ్యాఖ్యానించండి. వేదాంతనిర్వచన మిది :- మానవుడిలో సత్యాత్మ ఉన్నది. ఆ పరమాత్మ అద్వితీయమైంది. ఏకైకమైనది. రెండవదిలేనిది. అనుపమానమైంది. ఎదురులేనిది. భ్రమచేత, అజ్ఞానంచేత, ఆత్మయొక్క అద్వితీయ ప్రతిభ దేహానికి ఆపాదింప బడుతున్నది.

ఇతర పాపాలను గురించి చెప్ప నవసరంలేదు. వాటినికూడ వేదాంతం యీ రకంగానే వ్యాఖ్యానిస్తుంది. సర్వ సాధారణమైన భయంకర పాపాలన్నీ వ్యాఖ్యానింపబడినవి ఈ సర్వ పాపాలనుంచి విముక్తిపొందే మార్గం - ఒకటే ఉన్నది. అది దేహాత్మ భ్రాంతిని తొలగించుకోవడం మాత్రమే.

ఒక మనిషి రెండు రోగాలతో బాధపడుతున్నాడు. కండ్ల రోగంతో కడుపు రోగంతో బాధపడుతున్నాడు. వైద్యుణ్ణి రోగ నివారణకు సలహా అడిగాడు. వైద్యుడతనికి రెండు రకాల ఔషధాలు, రెండురకాల పొడరిచ్చాడు. ఒకటి కండ్లకు, ఇంకొకటి కడుపులోకి. కండ్లలో వేసుకొనే మందులో తుత్తునాగము కలిసి ఉంది. అది కడుపులోకి తీసుకుంటే విషం. కాని కండ్లల్లో అది ఉపయోగించవచ్చు. రెండో మందు కడుపులోకిచ్చాడు. ఇది కండ్లల్లో పెట్టుకోకూడదు. కాని ఆ మనిషి భ్రమచేత పొరపాటుబడి కండ్లమందును కడుపులోకి, కడుపు మందును కండ్లలోకి తీసుకున్నాడు. కండ్లు పోయినవి. గర్భకోశం చెడిపోయింది.

ప్రజలుచేస్తున్న పొరపాటిదే. ప్రపంచంలోని సమస్త పాపాలకు కారణం - ఈ విభ్రమే. మీలో పరంజ్యోతియైన ఆత్మ ఉన్నది. దేహదృష్టితో ఆత్మను చూస్తున్నారు. ఆత్మయొక్క మహా ప్రతిభా విశేషాలను దేహానికి ఆపాదిస్తున్నారు. ప్రతి విషయాన్ని తలక్రిందు చేశారు. ప్రతిదీ కలగాపులగమయింది. ఇదే ప్రపంచ పాపానికి కారణం. వస్తువులను సక్రమవిధానంలో ఉంచు. భౌతికంగా నీవు అభివృద్ధి పొందుతావు. ఆధ్యాత్మికంగా నీవు దేవాదిదేవుడ వవుతావు.

మీలో సమస్తమూ ఉన్నది. అజ్ఞానముచేత భగవంతుణ్ణి క్రింద, వస్తువులను - లేక - శరీరాన్ని పైగా - ఉంచారు. స్వర్గం తలక్రిందులు చేయబడి ఘోర నరకంగా మార్చబడింది. వీటిని సక్రమస్థానాల్లో ఉంచండి. ఈ భయంకరమైన నరకంకూడా - ఈ పాప ప్రపంచంకూడా - మీలోని దివ్యత్వాన్నే, పావిత్ర్యాన్నే, ఉద్ఘోషిస్తున్నది. సక్రమ దృష్టితో అవలోకించండి. మీరు సాక్షాత్ పరమేశ్వర స్వరూపులై ప్రకాశిస్తారు.

ఒక నాస్తికుడు - ఒక భగవద్విశ్వాసంలేని మానవుడు, తన యింటి గోడలమీద, "God is Nowhere" (దేవుడు లేడు) అని ఎక్కడబట్టినా వ్రాశాడు. అతడొక లాయరు. ఒకసారి ఒక ఫిర్యాది వచ్చి ఏదో ఒక దావాలో రు. 500-0-0 లు ఇస్తానన్నాడు. ప్లీడరు

"కాము వెయ్యిఇవ్వా" లన్నాడు. ఫిర్యాది "సరేలేండి. మీరు దావా గెలిపిస్తే వేయి రూపాయలిస్తాను. గెలిపించినపిదపనైతే, వేయి రూపాయిలిస్తాను, ఇప్పుడే కావాలంటే, అయిదువందలిస్తాను - "అని సమాధానం చెప్పాడు. లాయరుకు తప్పక యీ కేసు గెలుస్తుందని నమ్మకమున్నది. అందుచేత గెలిచిన తర్వాతనే వెయ్యిఇచ్చేలాగు ఒప్పందంచేసుకొని దావా తీసుకున్నాడు. అంతా సరిగ్గా ఉందనే ధైర్యంతో కివిగా కోర్టుకు వెళ్ళాడు. కేసంతా బాగా పఠించాడు. అయితేనేమి ? విచారణనాడు ప్రతివాది తరఫున లాయరు ఒక గట్టి పాయింటు తీసి వాదించాడు. మన ప్లీడరు ఓడిపోయాడు. వేయి రూపాయలు పోగొట్టుకున్నాడు. విచారంతో ముఖం వ్రేలాడవేసుకొని యిల్లుచేరాడు. దిగాలాపడి కుర్చీలో విచారంగా కూర్చున్నాడు. ఆ గదిలోకి అప్పుడప్పుడే మాటలు చదవడం నేర్చుకుంటున్న ఆతని చిన్నకుమారుడు వచ్చాడు. ఆ పిల్లవాడు ముద్దుగా గోడమీదిమాటలు చదవడం మొదలు పెట్టాడు. G O D I S - గాడ్ - ఈజ్ - "తరువాత పదం అతనికి దీర్ఘమయింది. ఆ పసిపిల్లవాడు ఉచ్చరించలేకపోయాడు. ఆ పదాన్ని భాగించి, (Now here) "నా...హి...యర్" అని ఉచ్చరించి, తాను విజయంపొందినందుకు ఆనందంతో ఒక్క గంతు వేశాడు. (God is Now here) "గాడ్ ఈజ్ నౌ హియర్" - అని బిగ్గరగా ఉచ్చరిస్తూ గంతులు వేశాడు; శిశువు. చూచారా! "గాడ్ ఈజ్ నో వేర్, "God is Nowhere" (దేవుడెక్కడా లేడు) అనే పదం "God is Now here, గాడ్ ఈజ్ నౌ హియర్, (దేవుడిక్కడే ఉన్నాడు)" అనే పదంగా పఠింపబడింది.

ఇదేమాదిరి విషయాలను (వస్తువులను) సక్రమంగా పఠించండని, సరిగా ఉచ్చరించండని వేదాంతం చెబుతున్నది. "God is **no where**" అన్న పదాన్ని సరిగా చదవండి. "God is **now here**" గా మారుతుంది. పాప ప్రపంచాన్ని సరిగా పఠించు. స్వర్గంగా మారుతుంది. నీ పాపాల్లోకూడా నీ దివ్యత్వం, నీ బ్రహ్మప్రకృతి ఋజువయింది. అంతర్బ్రహ్మ జ్యోతిని దర్శించు. సమస్త ప్రపంచం

ఒక మనోహర స్వర్గంగా మారుతుంది. నీవు వివరించే వైకుంఠ మవుతుంది.

ఒకసారి ఒక పరీక్షలో విద్యార్థులను, క్రీస్తు నీటిని ద్రాక్ష రసంగా మార్చిన విషయాన్ని గురించి వ్యాసం వ్రాయమని అడిగారు. పరీక్షా శాలంతా విద్యార్థులతో నిండిపోయింది. విద్యార్థులు జవాబు వ్రాస్తున్నారు. కాని ఒక పిల్లవాడుమాత్రం, వినోదంగా, కూని రాగాలు తీస్తూ, ఈలలువేస్తూ నిర్లక్ష్యంగా దిక్కులుచూస్తూ కూర్చు న్నాడు. ఒక్క అక్షరంకూడా అతడు వ్రాయలేదు. పరీక్షాశాల్లో కూడా అతడు వినోదంగా స్వానందమగ్నుడై యున్నాడు. ఓహో! అత డెంత స్వతంత్రుడు! కాలపరిమితి అయినతర్వాత, పరీక్షాధికారి వచ్చి అతణ్ణి కొంచెం హేళనగా "ఓ! చాలాపెద్ద వ్యాసం వ్రాశావే" అన్నాడు. 'బైరన్' ఆపిల్లవానిపేరు. బైరన్, కాగితం తీసుకొని ఒక వాక్యంమాత్రంవ్రాసి పరీక్షాపత్రం ఇచ్చాడు. పరీక్షాపత్రాలు దిద్దిన తర్వాతచూస్తే, సోమరిగాకూర్చున్న - ఆ ఒక్క వాక్యంమాత్రమే గీకిన బైరన్‌కు, ప్రథమ బహుమానం వచ్చింది. మొట్ట మొదట బైరన్‌ను సోమరిగా తలచిన విద్యాధికారి ఆశ్చర్యపడ్డాడు. మిగతా విద్యార్థులందరూ బైరన్ వ్రాసిన ఆ ఒక్కవాక్యం చదివి వినిపించుడని పరీక్షాధికారిని ప్రార్థించారు. బైరన్ వ్రాసిన వ్యాస మిది:-"నీరు తన ప్రభువునుచూచి సిగ్గుపడి ఎఱ్ఱనయింది." నీరును ద్రాక్షరసంగా మార్చిన క్రీస్తుమాహాత్మ్యమిది. బైరన్ వ్యాసమంతా ఈ ఒక్కమాటే. నిజంగా యీ వ్యాసం అత్యద్భుతంగా లేదా? సిగ్గుచేత ముఖం ఎఱ్ఱ బడదా? నీరు ఎఱ్ఱని ద్రాక్షరసంగా మారింది. స్త్రీ, తన ప్రియుణ్ణి చూచినప్పుడు సిగ్గుచేత ఆమె ముఖపద్మం ఎఱ్ఱబడుతుంది. అదేమాదిరి నీరు, తన ప్రభువునుచూచి సిగ్గుపడి ఎఱ్ఱబడింది. ఇదీ వ్యాస మంతా. అద్భుతంగా లేదా ?

"మీలోనిసత్యాత్మను తెలిసికోండి." మీస్వస్వరూప మైన పరబ్రహ్మమును తెలిసికోండి. తండ్రి (భగవంతుడు), కొడుకూ (మానవుడు) ఒక్కటేనని తెలిసికోండి! "సృష్ట్యాదిని శబ్దం ఉన్నది" - ఆశబ్దం భగవంతునితో కలిసి ఉన్నది"-అన్నసత్యమును తెలిసికోండి!

తెలిసికోండి! మహాస్వర్గం మీలో ఉన్నది. ఆ మహాస్వర్గమును తెలిసికోండి! మీరు అడుగుపెట్టినచోట, ఏ అసహ్యకరమైన మురికినీరైనా సరే, ఆనందకరమైన ద్రాక్షారసంగా మారిపోతుంది. ఘోరనరకాలు మహాస్వర్గాలుగా మారిపోతాయి. ఏ బాధగానీ, ఏకష్టంగానీ మీకుండదు. మీరు సర్వేశ్వర స్వరూపులై ప్రకాశిస్తారు !

ఓం! ఓం!! ఓం!!!

ఓమ్

# ౧ నాగరకత

## ఓ నాగరకత

ఓ మాయ స్వప్నమా! ఓ నాగరకత!
నామరూపాదిసన్మానాల నీవు
కనులకు గొట్టెద వవివేకధూళి
నీవు చీకటి నుంట నెఱుగవగాద;
తల దువ్వుకొనుటకు కొండ ప్రాకెదవు
విషయసుఖాలకై ఆత్మ జంపెదవు.
పరులను సంతోషపరుపగా నీవు
ఆత్మహత్యను చేయు వట్టి మూఢుడవు.
అకట నాగరకత కంథ బానిసలు
గౌరవరూపవంచకులు మోదింప
నీవు నీచత కొడిగట్టినా వహావా!
కృత్రిమవేషంబు డాంబికవృత్తి
అడుగడుగునకు, "మన కేమి లాభంబు"
"జను లేమి అనుకొనుచున్నారో?" అనుచు
పరులకుగల యభిప్రాయాలమీద
ఆధారపడి హాతమాచు నున్నారు!
స్ఫోటకగ్రస్తు లాశాజ్వరతప్తు
లైన ఓ జనులార! ఉన్మత్తులగుచు
పరుగిడుచున్నట్టి ఓ ప్రజలార!
ఈ యుపద్రవమార్గముల, డాంబికముల
వదలండి, వదలండి స్వస్థులు గండి!

## ౨ నాగరకులకు

సోమరితనమున కక్కటా మీరు
వశులౌచు బలహీను లైపోయినారు.

మీరు స్వార్థంబుతో ధారుణినెల్ల
మోసమ్ము సేయు నభ్యాసంబుపడిరి.
వి భ్రాంతిపీడితకలుషాత్ములార !
ఏల మీరలు పరాభిప్రాయములకు
బానిసలై వేషమోహాంధు లగుచు
ఆత్మగౌరవమును త్రోసివేసెదరు ?
గడియారమున పెండ్యులముచందముగను
అల్లాడుచున్నార లటునిటు లాగి.
ఆస్థిరవస్తుసంపాదనకొరకు
మీ ఆననంబులు పాలిపోయినవి.
తృష్ణాపిశాచికర్కశహస్తములను
చిక్కి మీ రెల్లరు దుర్బలులైరి.
వ్యాపారబుద్ధియు, వర్ధియు, కలసి-
మీ ప్రేమ నక్కటా ! పారద్రోలినవి.
ధనపిశాచము కృప రవ్వ లేకుండ
ఉద్యత్ప్రశుకకంఠమును నల్పుచుండె.
స్వేచ్ఛ మీ కున్నదా నవ్వుకొనంగ
చివర కేడ్పుటకైన స్వేచ్ఛయే లేదు.
ప్రేమించుటకు స్వేచ్ఛ రవ్వంత లేదు.
నిద్రించుటకు మీకు స్వేచ్ఛయే లేదు;
కృత్రిమనటనాపరాయణుల్ మీరు
అవమానధరులు మీ రవమానధరులు!
పేరుకు కీర్తికి పరితపించెదరు !
మీ శరీరపుశోభ రోగగర్భితము,
మీ మంచివన్నియు చెడుగులే సుమ్మి.
అస్థిరంబగు నాస్తి మిమ్ము బాధించు
వస్త్రాలు పాడెలు, ఇండ్లు గోరీలు
చేసి మీ ఆత్మను పూడిచిపెట్టి
వనరుచున్నా రహో ! వనరుచున్నారు.
చిత్తనుదాచి, ఆత్మను పూడ్చినారు;

ఒక భాగమును గాచు నుద్దేశ్యమునను
సర్వంబు గోల్పోవుచున్నారు మీరు.
ఆస్తులకే మీరు ఆస్తులైనారు.
పరులకుగల యభిప్రాయాలమీద
ఆధారపడి మీరు నిహతు లయ్యెదరు.
లెండు! లేలెండు! లేలెం డిదె వేగ!
మాయావరణముల ఛేదింపుడింక!
అజ్ఞాననిద్రను విడనాడు డింక!
దేవతల్ మీ రహో దేవతల్ మీరు,
దయ్యాలు కా రహో దయ్యాలు కారు!
వాంఛల వదలండి, సూర్యులపగిది,
తారల విధమున, జ్వాలలవోలె
వెలుగండి వెలుగండి నిర్బంధలీల.
నిర్భయులై మీరు ప్రజ్వలించండి!
వాంఛానికాయవిభ్రాంతుల కెల్ల
కర్మల నొనరించి గంభీరఫణితి
మారణమంత్రాలు చదువండి మీరు!
విమలమంత్రాలను వినుడి వినండి!
ఆనంద మోహూ! మహానంద మోహూ!
భేదాలు నశియించి ప్రీలిపోయినవి,
ఆస్తులు పాస్తులు వాంఛింపవద్దు.
లేదనూయభయంబు లేదహో లేదు.
అఖలవస్తువులలో నతిప్రియం బేదు!
ముడి రహస్యములన్ని విడివడిపోయె.
నేను బ్రహ్మానందమగ్నుండ నైతి!
సూర్యునిలో జేరు చుక్కలవోలె
అల్పమౌ సంగీతయంత్రశబ్దములు
ఘనమృదంగధ్వని కలసినయట్లు
వనధిలో జేరుడి కాల్వలపగిది
జాగ్రదవస్థలో స్వప్నాలవోలె

ప్రేమలో భయము కంపించి నశించు.
ఆ విధంబుగ నేను సకలబాధలను
బలహీనతాసూయమృత్యుదేవతల
పారద్రోలితి నహా పారద్రోలితిని.
సర్వగోళములార! జలరాసులార!
కొడుకులు మీరు, నా కూతుళ్ళు మీరు,
నా దివ్యమధురగానంబున నహహా
పరిమితు లెల్లను హరియింపబడియె.
జయ దేవ! జయ దేవ! జయ జయ దేవ!

## 3 నేను నవ్వాపుకోలేను

ఒక భయాకులకంపనమ్ము జనించె
నరములు స్తంభించె, వణకెను తనువు;
దీని కెల్లను కారణము సంశయంబె
సంశయంబను నీడ యజమాని నహహా!
తలక్రిందుగా పడద్రోయుచున్నదిగ.
ఆపగాలేను న వ్వాపగాలేను!
ఒక కుక్క రొట్టెముక్కను నోట గొనియు
పోవుచు నీటిలో తన పాప చూచి
ప్రతిబింబమున గల రొట్టె నాశించి
నోటిలో రొట్టెస్సైతము జారవిడచె.
కృత్రిమసుఖమున కాశించి మతిని
ఏల సత్యానందమును కోలుపడుట?
ఇది ఎంత నవ్వించు మూర్ఖత్వ మోహహో!
ఆపగాలేను! న వ్వాపగాలేను!
అంతమైనది యాత్ర, అవధి చేరితిని.
తీవ్రసాధనయు ను త్తీర్ణింపబడియె.
దీనికే విశ్వము నాచుట్టు నిట్లు
చేయుచున్నది ప్రదక్షిణముల నహహా!
కాపరి కే రీతి గొఱ్ఱెలన్నియును

స్వాగతసంతోష మందించు నట్లె
సూర్యనక్షత్రాదు లివ్వడు నాకు
అభివందనము లిచ్చుచున్న వోహోహోహో !
ఆపుకోలేను ! న వ్యాపుకోలేను !
ఆ మహాశక్తితో, ఆ ప్రేమతోడ
ఏకీభవించితి, నైక్యమై తిపుడు !
ఆ యనంతునిలోన శ్రుతిగల్పినాడ.
ఆ శాశ్వతునితోడ నే నొక్క_టైతి.
ఆ స్వర్గసందేశమం దేక మైతి
ఉచ్చనీచంబుల, బాహ్యాంతరముల
సర్వంబులో పరమాత్మనే గనుచు
పరమశాంత్యానందమం దేక మైతి
ఓహోహో ! ఎటువంటి ఆనందశాంతి
అఖిలప్రకృతియు నా కానందమయము
విశ్వసంగీతంబు నేను పాడెదను
నక్షత్రనృత్యాల నే తాండవింతు
నే సముద్రములలో గంతులు వైచి
చప్పట్లు చరతు నుత్సాహ ముప్పొంగ
భయదసంగ్రామముల్ నాయాట లహహ !
ఆపుకోలేను ! న వ్యాపుకోలేను !
ఓ ఉదయార్కుడా ! ఓ బాలసూర్య !
సిగ్గేల ? భయ మొందె దేల రావోయి
కొట్టను చెంపపై కొట్టను రమ్ము
నా ముద్దుబిడ్డ ! ఓ ప్రకృతి ! రారమ్ము
నా కన్న ముద్దుకుమార రారమ్ము !
రమ్ము కౌగిలిలోకి రావోయి తనయ !
నాకన్న దయగల దేదియు లేదు
ఆపుకోలేను, న వ్యాపుకోలేను !
నేను ప్రేమింపలే నెందుచే ననగ
నేనె ప్రేమనుగాన, ప్రేమించు టెట్లు ?

దేని నే నాశింతు వాఛింతు నోహహో!
ఈ విశ్వసర్వస్వవ్యాదయంబు నేను
వాంఛించుటకు బదుల్ సంతసించెదను
సర్వవస్తువుల నావలె చూచుకొందు
సర్వంబు కే నిత్తు జీవ తేజముల
ప్రతినావ నడిపెడు నావికు డేన!
ఆపగా లేను! న వ్వాపగా లేను!
అప్పుడే విచ్చు గులాబిచందమున
అరుణకాంతుల జిమ్ము ప్రియురాలి చెంప
తుమ్మెదవిధమున నాశించునట్టి
ప్రియుని మనోహర నేత్రముల్ నేను.
తత్ప్రేమలో నుండు తీపిని నేను.
తళతళ మెరసెడి హిమములో నేను –
స్తంభించియుండెద జడతను పూని.
అగ్నిలో నేనె ప్రకాశించుచుంటి.
నీ విచారము పోవు పథము నే చెప్పుదు:
నీదగు కఠినసమస్యలు, ప్రకృతి
నాలోన నగు పరిష్కృతము తత్క్షణము:
నన్ను పెండ్లాడుము, నన్ను గైకొనుము
నాలో విలీనమై కలిసిపొ మ్మిపుడె.
ఇంతియే కాదు నీ వెరుగు మో ప్రియుడ!
నీవు మహాజగన్నాథుండ వరయ,
ఇదివరకే నీవు విశ్వేశ్వరుడవు,
సర్వంబులో వెల్గు పరమేశ్వరుడవు;
నీవె ప్రకృతివి, ధర్మాలు, లోకములు
గుర్వాజ్ఞానసగోచరమైన
పరమాత్మ వీ వహో! పరమాత్మ వీవు
ఓ సంశయాకులదుఃఖనిమగ్న!
ఓ మాధ్యచిత్తుడా! ఓయి ఖేదాత్మ!
ఓయి తృష్ణాకులభారవిచార!

ఆప్తుల బాసియు హా యని యేడ్చు
ఓ ఖిన్నహృదయుడా! ఓ యవివేకి
ఏల నోయీ! నీ వె నీచేతులార
దుఃఖభారము నెత్తిపై నెత్తుకొనుట?
దాహంబుతోడను తపియించుచున్న
ఓ చేపలార! ఓహో జనులారా!
అంబుధి యుండ దాహంబు మీ కేల?
మీలోననే మహాస్వర్గంబు గలదు.
మీ చిత్తమో, బాహ్యవస్తుజాలముల
పై కేగుచున్నది పక్షిచందమున!
అంతర్ముఖుడవౌచు పరమాత్మ గనుమ,
సర్వదుఃఖములు భస్మీభూత మగును!
నీలోని రాముని తెలుసుకో వోయి
ఆనంద మానంద మానంద మహాహా!
ఆపుకో లేను, న వ్వాపుకో లేను!
గట్టినేల యటంచు భ్రమనొంది మనము
నురుగుపై కాలు బెట్టిన నేమి యగును-
బురదలో దిగబడి తన్నుకోవలయు.
ఆ విధంబుగ మిథ్యయౌ నహంకృతియు
నిజముగా గనుపించి నిను ముంచు వనట.
రాగరోషంబులు, కామతృష్ణలును
వెదకుచు వెదకుచు పరుగెత్తివచ్చి
అంట్రింతలట్టుల నతుకు గాఢముగ;
కాని సత్యాత్మదర్శన మైనయపుడు
సూర్యతేజమున చీకటి వ్రీలునట్లు
అవియెల్ల పంచబంగాళమై పారు.
పక్షుల మృదువైన రెక్కలచేత
విదలింపబడు వర్షబిందువులట్లు
దూరమై చను నంటుకోకుండ సుంత.
సతము నే నిష్కళంక స్వరూపుడను!

అప్పుకోలేను, నవ్వాపుకోలేను !
నిస్సంగసాక్షి తేజంబులోపలను
చిత్తవికారంబులకు చోటులేదు,
వాని ముఖాలపై దృష్టి సారింతు
నీ విచిత్రపు టల్పకీటకావళులు
తత్క్షణంబే భస్మపటలమైపోవు.
జీవితరక్తప్రవాహనాళమున
దైహికాహంకారమే అడ్డు చెఱుగు;
ఆ అహంకృతియను సుడి పోయె నింక
సర్వరూపంబులు నా స్వరూపములె !
శత్రుమిత్రాదుల దేహాల వెనుక
వైవిధ్యవ్యక్తిత్వముల సృష్టి జేసి
శోకభారము గూర్చుచున్న దోహోహో
అజ్ఞానమే సుమా! అజ్ఞానమేను!
ఈ భావమే బాధనము దుఃఖకరము
ఈ భేదభావము పారిపోయినది
రామున కే వ్యక్తిభావాలు లేవు.
తనువు లసంఖ్యాకములు, ఆత్మ ఒకటె,
ఆ పరమాత్మ యేదో కాదు నేనె.
కర్మియు, సాక్షియు, న్యాయాధికారి
ప్రతివాది, హితవాది సర్వులు నేనె!
ముక్తులు, ముక్తులు, నేను సర్వులును.
బంధంబు హద్దులు దోషంబు లెచట
కానవచ్చుట లేదు నాకు రవ్వంత.
ఋణబాధ, విధి, భయాపాయముల్ లేవు
సర్వత్ర సర్వకాలంబులం దున్న
ఏక సత్యస్వరూపుండను నేను.
సర్వవాంఛల ముఖ్యమూలంబు, మరియు
చిత్తవికల్పాల మూలకారణము,
సౌందర్యమూలంబు, ప్రేమహృదయమ్ము,

ఖగమయూరశుకాదిపక్షుల ఆత్మ,
వాంఛాంతరాంతర కేంద్రంబు, మరియు
ప్రతిబొమ్మ నాడించు నాపరాశక్తి,
సర్వకారణముల మూలకారణము.
ఆకర్షణారూపమున ప్రకాశించు
నది, నేనె, అది నేనె, సర్వంబు నేనె!
ప్రతిదానిలోన నామెద నిశ్వసించు,
సూర్యభూచంద్రాదిగోళంబులందు
నేనె నృత్యము సేయుచున్న దీ రీతి.
గాలిలో వీచెద; గరికలో మొలుతు;
నదులలో బారెద; గిరులలో నిలుతు.
ఉన్నది, లేనిది, దూరంబు, దాపు
భూతభవిష్యత్తులును, వర్తమాన
గతులు, పుష్పంబులు; తారాగణంబు,
నీలికన్నులును, మనోజ్ఞగానంబు,
మోహనోన్నతభావసంచయంబులును
తీయని రతనాలవంటి వాక్యములు,
తేనెలు చిలికెడి మృదులాధరములు,
పట్టుకుచ్చులవంటి నీలకేశములు,
అనురాగపూర్ణగాఢాలింగనములు,
నావలె; నావిగా ఆనందపడెద!
ఓహో! మహానంద మానంద మహహా!
భావరాజ్యముకన్న విపులమై రేగ
ఆపగాలేను న వ్యాపగాలేను!

## ౪ చంద్రబింబం

*ఆ కాస మంటెడి కొండపైనుండి
తొంగితొంగియు చూచుచున్నావు నీవు,

---

* ఈ గీతము అర్థరాత్రి వ్రాయబడినది. రాము నప్పుడు శాస్త్రాపర్వతాల్లో ఉన్నాడు. ఆయన పర్ణశాలలోకి వెన్నెల ప్రాకిన సమయ మది.

బాగుగా గనుము నా ఏకాంతశాల
తృణమణిపగిదిని, లజ్జావివర్ణ
ముఖముతో ముగ్ధకన్యక చందముగను,
ఎవరైన ప్రక్క నున్నా రేమో యనుచు
నలుదిక్కులను నీవు తొంగిచూచెదవు;
సిగ్గుతో చల్లగా నున్నను నీవు
అతిసాహసముతోడ కిటికీని దూరి,
నాతృణశయ్యచెంతకు జేరవచ్చి
నా కపోలారుణరాగంబు, దొంగ!
అపహరించుచునుంటివా నిశీథమున;
నాకనుబొమ్మల, నానేత్రములను
ముద్దాడుచున్నావు నను మేలుకొలుప.
భవదీయకిరణకరస్పర్శనంబు
గుసగుసవోవు నీయధరాల వెలుగు
మేఘవిహీన నీనగ్న తేజంబు
నీ మహాపరిమళ మోప్రియా! చంద్ర!
నా నిద్ర నపహరించిన వెట్టివోను.
నీవు నేనును గూడి యీాదర్భశయ్య
శయనించుదము ప్రియా! ఒకకొంతసేపు
నీ బాహులతల నామెడ చుట్టివైచి
అతిగాఢముగ కౌగలింపుమా నన్ను;
ఒకరిలో ఒకరము, లీనమౌదమిక -
నేను నీమధువు నాస్వాదించుకొనెద.

ఓమ్ ! ఓమ్ !! ఓమ్ !!!

# శ్రీ రామతీర్థ వేదాంతభాష్యము

## శ్రీ రామతీర్థ సంపూర్ణసారస్వతము



ద్వితీయ సంపుటము



శ్రీ రామతీర్థ సేవాశ్రమము
పిడుగురాల (పోష్టు) గుంటూరు జిల్లా - ఆంధ్ర

# శ్రీ రామతీర్థస్వామి



"విశాలవిశ్వమే నా గృహం. మంచిచేయడమే నా మతం."

SRI RAMA TIRTHA SEVASHRAM, PIDUGURALLA (P. O.) GUNTUR DT., A. P.

# శ్రీ రామతీర్థస్వామి - మానవకోటికి

## ఆశాజ్యోతి

డాక్టర్ శ్రీ రాధాకుముదముఖర్జీ,

యం. ఏ., పిహెచ్. డి.; పి. ఆర్. యస్.

శ్రీరామతీర్థ స్వామివారి జీవితం మానవ లోకానికి ఒక మహోన్నత ఆశాజ్యోతి. అతి సాధారణ జీవిత పరిస్థితులలోనుంచి, పద్మం బురదలోనుంచి వెలువడి సౌందర్యరూపంలో వికసించినట్లు, మహాపురుషస్థితికి అధిగమించటానికి శ్రీరామతీర్థ జీవితం ఆదర్శ ప్రాయం. మానవుని వెన్నాడే అవస్థలన్నీ శ్రీరామతీర్థస్వామి అనుభ వించాడు, వారికి కలిగిన అవరోధాల్లో పెద్దది ఆయనకు పదేండ్ల వయ స్సులోనే జరిగిన బాల్యవివాహం. తన గ్రామంనుంచి నిత్యం ఆరుమైళ్లు నడచి పాఠశాలకాయన పోవలసి వచ్చింది. పంజాబు విశ్వవిద్యా లయంలో ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణుడు అయినపిదప, లాహోర్ కాలే జీలో ఆయన ప్రవేశించాడు. అక్కడ ఆయన నెలకు ఒకరూపాయ అద్దె గల ఒక చిన్నగదిలో నివసించాడు. తన చదువునిమిత్తం నెలకు రు 5-0-0 లు వెచ్చించడానికి ఆయనకు దారిద్ర్యంచే కనాకష్టమై పోయింది. తండ్రి అభిమతానికి వ్యతిరేకంగా ఆయన బి. ఏ. తరగతిలో చేరినప్పుడు తండ్రి ఆయనను పరిత్యజించాడు. సహాయం చేయడం మానాడు. ఆ సమయంలో, ఇంటిఅద్దె, కాలేజీ జీతము తనభార్యాపోష ణము- మొదలైన వాటికిపోగా ఆయన దినానికి మూడుపైసలమీద జీవించవలసి వచ్చింది. ఇంక రోజుకు ఒకపూటే ఆహారం తీసుకోను ప్రారంభించాడు. గణితశాస్త్రంలో ఆయన ఒక విశిష్ట ప్రతిభాశాలి. ఒకసారి, ఒక గణిత సమస్యాపరిష్కారానికి, ఒకరాత్రీ పగల్లా 24 గంటలు పనిచేశాడు. ఈ శ్రద్ధ, ఈ సామర్థ్యము, ఈ కార్యశూర త్వము, శ్రీరామతీర్థుని గొప్పతనాన్ని చూపుతుంది. ఆ పిదప లాహోర్ ఫోర్మన్ క్రిష్టియన్ కాలేజీలో గణితశాస్త్ర పండితుడుగా పనిచేశాడు. అక్కడే ఆయన జీవితంలోని పరివర్తనాధ్యాయం ప్రారంభించింది.

దానికి కారణం గీతాధ్యయనం. శ్రీకృష్ణభక్తిలో ఉన్మత్తుడై పోయాడు కృష్ణనామస్మరణలో మునిగి ఆయన రావీనదీతీరంలో కృష్ణప్రణయ వేదనా మాధురిలో నిశీధాలు గడుపుతుండేవాడు. భగవత్కథా గోష్ఠులందు, ఆయన పరవశుడై సమాధి పొందేవాడు.

2. భక్తి వికసించి ఆయనను వేదాన్తిగా నిర్మించింది. "వేద మంత్రశబ్ద శ్రవణ మాత్రంచేత నాకు సమాధికలుగుతున్నది. నేను అనంతానందంలో మునిగిపోతున్నాను" — అని స్వామి వచించేవాడు. వేదాంతదీప్తుడై ఆయన ఆదర్శసన్న్యాసమును స్వీకరించాడు. ఋషీకేశ మందలి పవిత్రగంగానదీ తీర భూములలో ఆయన ఆత్మసాక్షాత్కృతి పొందాడు. ఆపయి ఆ ఉత్తరఖండమందలి పరమైకాంతిక హిమాలయశృంగాలకు, ఆ మహాపురుషుడు నిర్గమించాడు. హిమాలయపు కౌగిళ్ళను ఆ ఋషివదలలేక పోయాడు. హిమాలయపు పిలుపుకు ఆయన వశుడైనాడు. అంతకంతకు ఆయన ప్రకృతి మూలాగాధాల్లోకి నిర్గమించాడు. వేని అగాధ గర్భాలలో ఆయన విరాట్ పురుషదర్శనాన్ని పొందాడో, ఆ హిమాలయ దివ్య సౌందర్యములో శ్రీ రామతీర్థస్వామి విలీనుడైనాడు. తన అనుభూతిని స్వామి ఈ రకంగా వ్యక్తీకరించాడు : "ప్రకృతి నా శరీరం. ఈ నదీనదాలు, నానాడులు. పర్వతశ్రేణులు నా ఎముకలు—కాళ్ళకు చెప్పులు తొడుగుకొని ఈ కొండరాళ్ళపై నడవడం పాపం. ఈ నగ్న భూమిస్పర్శ నా నగ్న పాదములందు సర్వజ్ఞత్వమును ప్రేరితం చేస్తున్నది. పరస్పర ఐక్యతను సంపూర్ణంగా తెలుసుకోడానికి ఈ శరీరమూ, పర్వత శరీరాలు పరస్పరం స్పర్శించడం అవసరం—నేను శివుడను. మలబార్, కారమాండల్ నా పాదద్వయం. రాజపుతానా ఎడారులు నా వక్షస్థలం. వింధ్యాచలాలు నా కటిమండలం. నేను ప్రాక్పశ్చిమ దిశలను సమానంగా కౌగలించుకొనడానికి నా బాహువులను చాచుతున్నాను. హిమాలయాలు నా శిరస్సు. నాజటామండలినుంచే రజతగంగ ప్రవహిస్తున్నది. శివోఽహం. నేనే ఇంద్రుడను. నేనే మానవుడను. నేనే పశుపక్షి మృగజాలమంతా. నేనే పరబ్రహ్మ జ్యోతిని."

3. ఈరకంగా శ్రీరామతీర్థస్వామి ప్రకృతిమయ దివ్యమహాకవియై గానంచేశాడు. ప్రకృతియొక్క ఆరాధన ఆఋషికి జగన్నాథుని

ఆరాధనలోనిదే. బాహ్యాభ్యంతరాలమధ్య, సదసత్తులమధ్య భౌతిక ఆధ్యాత్మికతలమధ్య భేదం ఇక్కడ లేదు. సమస్తమైన అనుభూతి ఒకటే. సర్వంలో వాసుదేవుడూ,వాసుదేవునిలో సర్వమూ ఉన్న మహానుభూతి అది!

4. సమస్త భూతకోటులూ తన రూపాలే, అన్న ఆత్మైక్యజ్ఞాన్ని సంపూర్ణంగా శ్రీరామతీర్థస్వామి పొందాడు. సోదరప్రజల సేవాశయం, స్వామిలో ఆవిర్భవించింది. తనకుగల సర్వోత్కృష్టమైన పరిపక్వజీవిత ప్రదానంచేసి మానవలోకోద్ధరణ చేయడానికి స్వామి సముద్యుక్తుడైనాడు.

5. తన సమాజానికి, తన దేశానికి మానవుడు సర్వోత్కృష్టమైన సేవ చేయడం ఆత్మసాక్షాత్కార సంతృప్తిచేతనే, తన సర్వస్వమును ఆత్మజ్యోతికి సమర్పించగలిగిన మహార్పణచేతనే జరుగుతుంది. ప్రతి వ్యక్తి, ప్రజోద్ధరణకార్యానికి ముందు తనను తాను సముద్ధరించుకోవాలె. దురదృష్టవశాత్తు యువకులు భావావేగవశులై ఆత్మవికాసస్థితిని పొందడానికి తగిన క్రమశిక్షణపొందే ఓర్పు వహించడంలేదు. మానవుడు తన జీవితాశయసిద్ధిని పొందేముందు, గడుపవలసిన శిక్షణావధిని గూర్చి-దాని ఆవశ్యకతను ప్రగాఢంగా గ్రహించిన స్వామి, ఈ క్రింది వాక్యాలలో ఎంతో బాగా వర్ణించాడు: "ప్రపంచానికి నా పూలతోటే పని. నేను పూలరూపంలో కనపడినప్పుడు, ప్రజలు నన్ను చూచి ఆనందిస్తారు. కానీ భూగర్భంలో, అంధకారాజ్ఞాత సీమల్లో, పైనపూసే పూలకూ కాసే కాయలకు ఆహారాన్ని సమకూర్చేలోని నా మూల (వేళ్ళకడ) స్థానంలో, నేనెంతగా పరిశ్రమించాలో వారికి తెలియదు. నే నిప్పుడు అడుగున మూలస్థానంలో వున్నాను. శంకరాచార్యుని ప్రదీప్తవిజయ కర్మల వెనుకాలగల మహాకారణం - గౌడపాద గోవిందాచార్యుల మహామౌనమే.";

6. స్వామి ఇప్పుడు, మానవ కోట్లమధ్య- ధర్మసందేశ వాక్కులతో మహాప్రవక్తగా నిల్చాడు. ఆయన మహోపన్యాసాలతో ప్రజా కోటులు ప్రముగ్ధులుకాసాగారు. వివేకానందస్వామివలె శ్రీరామ

తీర్థస్వామి సత్యసందేశమును, భారత వర్షపరిధులదాటి జపాన్ అమె రికా ఖండాలకు ప్రాకించాడు. ఇతర ఖండాలలో భారతమత రాయబారిగా శ్రీరామతీర్థస్వామి రెండు సంవత్సరాలు పనిచేశాడు. భారత పరమసత్య సందేశాన్ని పాశ్చాత్య ఖండాలకు అందించాడు. ఆ సత్యం ఏకైకం. దానికి స్థలకాలనియమాలు లేవు. పాశ్చాత్య భూములందు శ్రీరామతీర్థస్వామి ఇచ్చిన ఉపన్యాసాలు మహాశక్తి మంతములు. ఎందుకంటే వానిలో విశాల విశ్వాత్మక సందేశం ఉన్నది. అదిగాక సత్యమును నేరుగా సందర్శించిన మహానుభూతిలోనుంచి వచ్చిన సందేశంలో ప్రచండశక్తి ఉంటుంది.

7. సమస్త ఆధ్యాత్మిక సంపదలతోపాటు, శ్రీరామతీర్థస్వామికి భారతదేశపు రాజకీయాలు వాని ప్రాముఖ్యతలు, జాతీయసంస్కృతి, ఆధ్యాత్మికతల్లోకూడా పూర్ణాభినివేశం ఉన్నది. భారతదేశముయొక్క ఆ బానిసత్వ దినాల్లో స్వామివారివంటి మత ప్రచారకుని యొక్క భక్తునియొక్క, ఉద్యమాలుకూడా ప్రభుత్వ గూఢచారుల చూపులకు గురికాకతప్పలేదు. ఆయన ప్రజ్ఞాహృదయం ఇట్లు గర్జించింది. "నేనొక భారతీయుడిగా నా దేశం విముక్తిని కాంక్షిస్తాను. ఒకనాటికది స్వాతం త్ర్యం పొంది తీరుతుంది. ఈ రాముడే దాని విముక్తిని చేకూరుస్తాడో లేక ఇంకా అనేకమంది రాములే చేకూరుస్తారో ఎవరికి తెలుసు."

8. దేశభక్తులలో అగ్రగణ్యుడు నిజమైన భగవద్భక్తుడే. సత్యమైన మతం రాజకీయాలనుండి వేరుపడజాలదు. పురాతన కాలం నుంచి, మహాత్మా గాంధీయుగం వరకూ, భారతదేశం తన రాజకీయా లను ఆధ్యాత్మీకరించింది. ప్రపంచ నిస్సంగుడైన బుద్ధుడు ఆయన కాలంలోని రాజకీయాలలో ఎంతో సజీవశ్రద్ధను తీసుకొన్నాడు. ఆయన ప్రపంచంలో ఉన్నా, దానికి అతీతుడై నిలచాడు. ఆయన ఆధ్యాత్మికత, నిజమైన సమాజ సేవాదర్శానికి అనుకూలించింది. అందు చేతనే బుద్ధభగవానుని హితబోధ రాజులచేత, సమ్రాట్టులచేత, ప్రజా తంత్ర నాయకులచేత సైతం వారి రాజ్యాంగవ్యవహారాలలో ఆచర ణలో పెట్టబడినది. బింబిసారుడు, అజాతశత్రుడు, ప్రసేనజిత్తు, లేక విరూధకుడు మొదలైన రాజులు, శాక్య మల్ల లిచ్ఛవ ప్రజాతంత్ర

నాయకులతో పాటు బుద్ధుని ఉపదేశాలను స్వీకరిస్తుండేవాళ్లు. వాండ్ల కాయన మార్గదర్శి, గురువు, తత్త్వవేత్త, మిత్రుడు. సత్య భారతీయ మతము ఆధ్యాత్మికమును, ఐహికమును వేరుచేయదు. మతానికీ రాజకీయాలకూ మధ్య భేదమును చూడదు.

9. మానవులను, సత్యాభిముఖులనుగా, విముక్తిపదాభిముఖులనుగా నడిపించ నవతరించిన మహానాయకుడు శ్రీరామ తీర్థ స్వామి. ఆ మహాపురుషుని నిర్యాణంతో ఆయన మహాకర్మ ఆగిపోలేదు. తన రచనలరూపంలో వారి జీవితప్రబోధ సంప్రేరణచే నిర్మితములైన అనేక సంస్థల రూపంలో ఆ ధర్మవీరుడు మన మధ్య నిలిచియే యున్నాడు. మన సాంఘిక ఆధ్యాత్మిక సమున్నతిక పరమోపయోగకరమైన శ్రీరామ తీర్థ వాఙ్మయమును, సంపూర్ణంగా భద్రపరచి, విశాలప్రచారం చేయవలసిన సమయ మిదే !

# విజయరహస్యం 1

(1902 అక్టోబరు మానవమంవ టోకియో (జపాను)లో
హై కమర్షియల్ కాలేజీలో ఉపన్యసించినది)

ఉపాధ్యాయ విద్యార్థి బృందరూపమున వెలుగొందుచున్న మహాత్మా! భారతదేశంలోకన్న జపాను దేశంలో ఎక్కువ సామర్థ్యంతో సాధింపబడే ఈ విషయాన్ని నేను మాట్లాడడం ఆశ్చర్యకరముగా ఉండవచ్చు. అనేక కారణాలచేత ఇప్పుడు మీముందర నేను ఉపదేశకుడుగా నిల్చున్నాను.

ఒక భావాన్ని చతురతతో అభ్యసించడం వేరు. దాని తత్త్వార్థాన్ని గ్రహించడం వేరు. కొన్ని సామాన్యసిద్ధాంతాలను అమలులో పెట్టడంవల్ల ఒకజాతి నేడు ఉచ్చస్థితిలోఉన్నా ఆ సిద్ధాంతాలను ఆ జాతీయహృదయం గ్రహింపలేక పోయినట్లయితే, ఆ సిద్ధాంతాలకు ఒక పునాది లేకపోతే, అట్టి జాతికి పతనం ప్రాప్తింపవచ్చు. ఒక కూలి కొన్ని వస్తువుల సమ్మేళనంచేత ఒక నూతన వస్తువును తయారు చేసినంత మాత్రాన, అతడు రసాయన శాస్త్రజ్ఞుడు కాలేడు. అతనికి ఆ శాస్త్రము ఏమీ తెలియదు. ఇంజనులో బొగ్గువేసినంత మాత్రాన బొగ్గువేసేవాడు యంత్రవేత్త అవడంలేదు. ఒక వైద్యుడు వ్రణచికిత్స చేస్తూ, వ్రణంపై దూదికట్టు గట్టిగా కట్టి దాన్ని ఒక కత్తితో స్పృశించుచుండేవాడు. వారం దినాల్లో పుండు మానిపోయింది. కట్టుకడుతూ శీతాతపాలనుండీ కాపాడడంచేత అది మానిపోయింది. కాబట్టి ఆ వైద్యుడు అదంతా ఆ కత్తిమహత్తనిన్నీ, దానితో తాకడంచేత అది మానిపోతున్నదని చెప్పడం మొదలు పెట్టాడు. ఇట్టి ఛాందసంలో మునిగి, కొన్నిపరిస్థితుల్లో అతడు కట్టు కట్టినమాత్రాన అది మాననిచోట్లలో, అతడు విఫలమనోరథుడయ్యాడు. కనుకనే నిజమైన సిద్ధాంతం, నిజమైన ఆచరణం – ఈ రెండూ ముఖ్యావసరాలే! జపాను దేశం, నా దేశమని జపానీయులు నా దేశస్థులని నేను నిర్వచింపగలను. మీ పూర్వులు భారతదేశం నుండే మొదట జపానుకు వచ్చారని నేను రుజువు చేయగలను.

మీ పూర్వులు మా పూర్వులే! కనుక నేను నూతనాగంతకుని వలెగాక మీతో మీ సోదరునివలె కరస్పందనం చేయడానికే వచ్చాను. నాకు మరో హక్కుకూడా ఉంది. నా పుట్టుకనుండి నేను స్వభావముచేత, భావముచేత, వర్తనచేత జపానీయుణ్ణి. ఈ పరిచయ వాక్యాలతో అసలు విషయానికి వస్తాను.

౧ విజయ సూత్రములు-కర్మనిష్ఠ

ప్రకృతిలో కార్యసిద్ధి ఏవిధముగా సాధింపబడుతున్నదో చూడండి. నదీప్రవాహమేమి సందేశమిస్తున్నది? పర్వత పంక్తులు ఏం బోధిస్తున్నవి? కృషి! నిరంతరకృషి! ఎడతెగని కర్మనిష్ఠ! ఇదే వాటి ప్రబోధం. దీపము మనకు దృష్టిని ప్రసాదిస్తున్నది. అట్టి దీపం ఈ విషయమై మన కేం చెప్పుతున్నదో చూడండి. ఒక మామూలు దీపాన్ని తీసుకోండి. దాని కాంతికి దాని తేజస్సుకు మూలరహస్య మేదో మీకు తెలుసా? అది దాని వత్తినిగాని, చమురుగాని, దాచు కోడంలేదు. వత్తీ, చమురు దాని బాహ్యశరీరం. ఈ బాహ్యశరీరం నిరంతరం దహింప బడుచుండడంవల్లనే ఈ తేజం ఆవిర్భవిస్తున్నది. ఆ దీపం ఏమి బోధి స్తున్నది? నీ లోభంవల్ల నీ వొక్క నిమిషం ఊరకున్నావా, నీ బాహ్యశరీరం దాచుకున్నావా, ఈ నిమిషంలోనే నీ కాంతి నాశనమవుతుంది. దీప మారిపోతున్నది. మీరు విషయ సౌఖ్యాలను మరగి, దైహిక సుఖాన్ని చూచుకుంటూ, కాయమును కష్టపెట్టకుండా కాపాడుకుంటారా, మీ కిక ఆశ లేదు. జడత్వం లేక సోమరితనం మృత్యువుచైతన్యమే ప్రాణం. క్రుళ్లు గుంటకూ, నిర్మల ప్రవాహానికి భేదం. చూడండి. స్ఫటికనైర్మల్యంతో ఉండే ప్రవాహ జలము ఎప్పుడూ పరిశుద్ధంగా, వినిర్మలంగా, పాన యోగ్యంగా, నేత్ర పర్వంగా ఉంటుంది. క్రుళ్లుగుంటలో నీరు దుర్గంధం, మురికి, పురుగులు మొదలైనవాటితోనిండి చూడడానికి అసహ్యంగా ఉంటుంది. కార్యసిద్ధి కావాలంటే మీ రా నదీజలాలవిధముగా నిరంతర చైతన్యాన్ని పూనాలె. కార్యదీక్షను వహించాలె. తన వత్తిని, నూనెను దాచుకో చూచువాడు నిర్భాగ్యుడు. వాటిని అతడు దుర్వినియోగం చేసి, భ్రష్టుడవుతున్నాడు. ఆనిర్మల జలాలవిధంగా నిరంతరం ప్రవహిస్తూ,

(2)

వృద్ధిచెందుతూ, ఆత్మావగతం చేసుకొంటూ, పరిస్థితులకు తగినట్లు ప్రవర్తిస్తూ నిరంతరకృషి చేయాలి. కృషి, కృషి!! ఇదే కార్యసిద్ధికి ప్రథమసూత్రం. 'దినదినాభివృద్ధి పొందాలి' అనే సూత్రాన్ని అనుసరిస్తూ పనిచేస్తే అల్పులు గావడం ఎంత సులభమో గొప్పవారు గావడంకూడా అంత సులభంఅని నిర్ధారణ చేయవచ్చు.

## నిస్వార్థత్యాగం

ప్రతివాడు తెల్లటి వస్తువులనే ప్రేమిస్తాడు. ఈ తెల్లటి వస్తువులు ఇంత ప్రేమపాత్రం గావడానికి కారణం ఏమిటో కొంచెం విచారణీయము. నల్లటి వస్తువులు ప్రతివాడూ ద్వేషిస్తాడు. వాటిని తృణీకరిస్తూ అవల త్రోసివేస్తాడు. దీనికి కారణం ? ఈ రంగులు ఏవిధంగా తయారు కాబడుతున్నవో, వాటి విధానం ఏమిటో మనకు పదార్థవిజ్ఞానశాస్త్రం బోధిస్తున్నది. ఎరుపు ఎరుపు కాదు. పసుపువర్ణం పసుపువర్ణంకాదు. నలుపు నలుపు కాదు. బాహ్యానికి గోచరమయ్యేదంతా యథార్థంకాదు. ఎఱ్ఱటి గులాబిపువ్వం ఎరుపురంగునే త్రోసివేస్తున్నది. దానినే ఇచ్చివేస్తున్నది. కనుక దానికా రక్తవర్ణం ప్రాప్తించింది. సూర్యకిరణాలనుండి గ్రహింపబడిన వర్ణాలన్నిటినీ గులాబిపువ్వం తనలో ఇముడ్చుకొంది. కాని దానికి ఆ రంగులన్నీ ఉన్నవని ఒక్కడు భావించడంలేదు. అది ఏ రంగు ప్రదర్శిస్తున్నదో ఆ రంగే దాని నిజవర్ణమని ప్రతివాడూ భావిస్తున్నాడు. ఆకుపచ్చరంగుగల ఆకు అన్ని రంగులను తనతో అంతర్గతం చేసుకొని ఒక్క ఆకుపచ్చరంగే బహిర్గతం చేస్తున్నది. మన కది ఆ రంగులోనే నవ నవ కాంతులతో కనపడుచున్నది. నల్లని వస్తువులు అన్నిరంగుల్ని తామే మ్రింగుచున్నవి. అవి ఒక్కరంగునుగూడా ఇవ్వడంలేదు. త్రోసివేయటంలేదు. వానిలో త్యాగంలేదు. అవి తాము పొందిన వాటిలో నుండి ఒక్కక్షణమైనా దానంచేయడానికి ఒప్పుకోవు. ఈ నల్లవస్తువులు మీా కే పాఠాన్ని బోధిస్తున్నవో మీాకు తెలుసా ? ఎవరు తాము సంగ్రహించే దానిలో లవమైనా తమ ఇరుగు పొరుగువారికి ఇవ్వడానికి ఇష్టపడరో వాండ్లు తమలాగే కారునలుపు, రాక్షసిబొగ్గునలుపుగా కనుపించుతారు. తమ సర్వస్వాన్ని తమ ఇరుగు పొరుగువారికి ఇచ్చి

వేయుడమే, సంపూర్ణ త్యాగమే తెల్లవస్తువుల స్వభావం. ఈ స్వభావాన్ని మీరూ అలవరచుకోవచ్చు. మీకు జయం ప్రాప్తిస్తుంది. తెలుపు అంటే ఏమిటి ? తెల్లవాడనా? తెల్లటి అద్దమా ? తెల్లటి ముత్యమా ? తెల్లటి పావురమా ? తెల్లటి మంచా ? పవిత్రతను, సత్యాన్ని, ధర్మాన్ని బోధించే తెల్ల వస్తువులన్నీ, నీకీ విషయాన్నే బోధిస్తున్నవి. త్యాగసూత్రాన్ని గ్రహించి మన కున్నదాన్ని ఇతరుల కిచ్చివేయూలె. స్వార్థం పూర్ణంగా నశిస్తే నీవు పవిత్రుడ వౌతావు, ధవళమూర్తి వౌతావు. మహావృక్షం కావాలంటే విత్తనం మొదట భూమిలో నశించడం లేదా ? ఫలప్రాప్తే ఈ పరిపూర్ణ త్యాగానికి పర్యవసానం. మన మెంత జ్ఞానదానం చేస్తే మన కంత జ్ఞానం, దానం చేసినకొద్ది చేకూరుతుంటుంది.

### 3 అహంకార విస్మృతి

విద్యార్థులు ఉపన్యాసవేదికలపై మాట్లాడేటప్పుడు 'నేను మాట్లాడుచున్నాను నేను మాట్లాడుచున్నాను.' అను అహం ప్రవేశించగనే తమ ఉపన్యాసం చెడిపోతున్నట్లు ఇదివరకనేకసార్లు అనుభవం వల్ల తెలుసుకునేవుంటారు. నీవు కృషిచేసే టప్పుడు నీ దేహాభిమానం పూర్తిగా మరచిపోయి, నీ కార్యంలో నిమగ్నుడవై పోవాలి. అప్పుడు నీకు జయం తప్పదు. నీ వాలోచించేటప్పుడు నీవు ఆలోచనలే అయిపోవాలె. పని చేసేటప్పుడు ఆపనివే ఆయిపోవాలె. ఇదే కార్యసిద్ధికి మార్గం.

"నే నెప్పుడు ముక్తుణ్ణి అవుతాను?" ఆ "నేను" నశించినప్పుడు. ఇద్దరు రాజపుత్రులు అక్బరుపాదుషావద్దకు ఉద్యోగంకోసరం వెళ్లారు. అక్బరు వారి గుణగణాలనుగురించి ప్రశ్నించాడు. 'మేము వీరులము' అని వారు ప్రత్యుత్తర మిచ్చారు. తమ శక్తిని ప్రదర్శించమని పాదుషా ఆజ్ఞాపించాడు. వెంటనే ఇద్దరూ ఒరలోనుండి కత్తులు దూశారు. ఖడ్గాలు మెరుపుల్లాగ ధగ ధగ మెరిశాయి. కత్తులు ధగ ధగమనే కాంతి వారి పౌరుషాన్ని రగుల్కొల్పింది. ఆ రెండు మెరుపులు వారి రెండు శరీరాలను తాకినవి. వాళ్ళిద్దరూ, ఒండొరుల దేహాల్లోకి తమ

తను శక్తి మొనలను పోనిచ్చారు. పెదవులు కదల్లేదు. ధైర్యం చెదర లేదు. స్థైర్యం సడలలేదు. ఖడ్గాలు ఇరువురి శరీరాల్లో గుచ్చుకున్నవి. శరీరాలు క్రిందవడిపోయినవి. ఆత్మలు కలుసుకున్నవి. వారి పౌరుషం దృఢపడింది. ఈ కథ బోధించే నీతి మనకు ఇక్కడ కావాలి. నీ అహంకారాన్ని త్యజించు. నీ కార్యంలో నిమగ్నుడవై నీ అహంకారమును మరచిపో. అపుడు నీకు కార్యం సిద్ధిస్తుంది. వ్యతిరేకం ఎవ్వడూ తటస్థించదు. కార్యం నెరవేరేవరకు మీకు ఫలాసక్తి ఎవ్వడూ ఉండ కూడదు.

## ౪ విశ్వప్రేమ

కార్యసిద్ధికి ప్రేమకూడా ముఖ్యావసరం. ప్రేమించడం, ప్రేమింపబడడం ఇదేకదా పరమావధి. ఈ చేయి సరిగా ఉండాలంటే శరీరంలో ఇతరావయవాల నన్నింటినీ ప్రేమించాలే. అట్లుకాక, అది స్వార్థంచేత, "నావల్ల ఈ శరీరంలోని అవయవాలన్నీ పోషింపబడు తున్నవి. నావల్ల శరీరమంతా ఎందుకు లాభం పొందాలె!" అని ఊరుకున్నదా, దాని కదే చేటు తెచ్చుకొంటుంది. అదే నశిస్తుంది. ఈ స్వార్థంవల్ల అది ఆహారపానీయాలను నోటిలో పెట్టడం మాని వేస్తుంది. తత్పూర్వము హస్తమే శరీరానికి అన్నిటిని సమకూరుస్తున్న విషయం మనకు తెలుసు. ఇప్పుడది తనకోసరం చర్మముగుండా ఆహారపదార్థాలను బలవంతముగా చొప్పించుకుంటుంది. ఈ విధంగా తనవల్ల పరులకు ఎట్టి లాభము లేకుండా అదిచేయగలదు. కానీ దీని ఫలితమేమిటి ? ఈ విధంగా తనలోకి ఎక్కించుకొన్న ఆహారంవల్ల అది లావుగా ఉండవచ్చు. చేయంతా వాయవచ్చు. కాని వాపు బలం కాదు. అది ఆరోగ్యాన్ని సూచించదు. అది చివరకు చావునే తెచ్చి పెట్టుకొంటుంది. చేయి ఈ విధముగా జీవించలేదు. దాని స్వార్థమే దీనికంతకూ కారణం. చేయి తనలో ఉన్న ఆత్మే ఇతరేంద్రియాలతో కూడిన శరీరంలోగూడా ఉన్నదని గ్రహించి దాన్ని స్వానుభవంలోకి తెచ్చి తనువుయొక్క మంచే తన మంచి అని భావించే నాడే దానికి మేలు ప్రాప్తిస్తుంది. స్వార్థం ఆత్మవినాశనానికి హేతువు. నహాకారమంటే ప్రేమను బాహ్యంగా ప్రదర్శించడమే అని మీకు

తెలుసు, మీరు చేసే సహకారం మీ హృదయంలోనుండే, మీ ప్రేమ స్వభావంలోనుండే రావాలె. నీవే ప్రేమైతే, నీకే విజయం తథ్యం. తన ఖాతాదారుల ప్రయోజనాలను, తన ప్రయోజనాలవలెనే చూడని వర్తకుడు వృద్ధిలోకి రాడు. తాను అభివృద్ధి చెందాలంటే తన ఖాతాదార్లను ప్రేమించాలె. తన హృదయంలో వాళ్ళకు స్థానమియ్యాలె.

౫ ప్ర స న్న త

సుముఖత్వము, ప్రసన్నత, మరొక ముఖ్యసూత్రం. మీరు స్వభావసిద్ధంగా చాలా సుప్రసన్నులు. మీ ముఖాంబుజాలనుండి బయలుదేరే చిరునవ్వులు మాకానందాన్ని కలుగజేస్తవి. మీ రానంద పరిమళాన్ని వెదజల్లే పుష్పాలు, మానవలోకంలో వికసింపనున్న ముకు ళాలు ఆనందానికి ఆటపట్లు. మీరు సర్వకాలాల్లో మీ ప్రసన్నత్వాన్ని కాపాడుకొంటారని నే నాశిస్తున్నాను. మీరు దాన్ని ఏ విధంగా సంరక్షించుకుంటారు ?

మీరు మీ నిరంతరకృషిని సాగిస్తుండండి. దానిఫలం కోసం ఎట్టి ఆదుర్దాను పెట్టుకొనవద్దు. భవిష్యత్తునుగురించి, జయాపజయా లనుగురించి విచారించవద్దు. కృషి చేయుడమే మీ ధర్మం, కృషి కోసరమే మీరు కృషిచేయాలి. కృషే దాని ఫలితం చేసినదానికి అసంతృప్తిపడపలసిన అవసరంలేదు. చేయబోయేదానికి సంశయం వద్దు. ప్రస్తుతాన్నే పరిగణిస్తూ కృషిచేయండి. ఈభావం మీస్థితుల్లో సంతోషమును చేకూర్చగలుగుతుంది. భూమిలో సజీవముగా ఉన్న విత్తనాన్ని గాలి, నీరు, మట్టి మొదలైన భూతాలన్నీ వాటంతటవే స్వయంగా అనివార్యమైన ఆకర్షణసూత్రంవల్ల వచ్చిచేరుతూ తగిన దోహదాన్ని ఇస్తున్నవి. ఇట్లే ప్రకృతి, ప్రసన్నతతో చేసే కృషికి తప్పక సర్వసహాయం చేస్తుంటుంది. "మన కున్నదాన్ని విశ్వాసంతో ఉపయోగించడమే నూతనజ్ఞానార్జనానికి మార్గము" అనే సామెత ఉంది. అమావాస్యరాత్రి, నిశీధములో ఒంటరిగా ఇరవైమైళ్లు పోవ లసిఉంటుంది. నీచేత ఉండేదీపం పది అడుగులవరకే నిన్ను తీసుక

పోగలిగితే, తక్కిన మార్గమంతా చీకటిగా వున్నదే అని తలచవద్దు. వెలుగు ప్రసరించి నంతవరకు నడచిపోతే, మరి పదడుగులు వాటంతటవే తేజోవంతములౌతాయి. పోయేకొలది నీకు చీకటే ఉండదు.

నిజమైన కార్యతత్పరత్వముగల మానవులకు విఘ్నాలు అడ్డం రావు. ఫలితము విషయమై సందేహపడితే, మన ప్రసన్నతనూ, మన మేలునూ పోగొట్టుకుంటాము. కాలుజారి నీళ్ళలో పడిన మనిషి ఈత చేతగాకపోయినా స్వస్థుడైయుండి తన సమత్వాన్ని పోగొట్టుకోకుండా ఉంటే ఆత్మరక్షణం చేసుకోగల్గుతాడు. మానవుడు సహజంగా నీటికన్నా తేలిక కాబట్టి తేలిపోతాడు. కాని సాధారణముగా మానవుడు నీటిలో పడడంతోనే అస్వస్థుడై, తేలాలె అని గిజగిజ కొట్టుకొని దానివల్లనే చివరకు మునిగిపోతాడు. కనుక అనేకచోట్ల, ముందు కలుగబోయే ఫలితముకొరకు పడేపరితాపమే విఫలత్వానికి దారితీస్తుంటుంది.

భవిష్యత్తుకొరకు విచారపడుతూ, జయంకొరకు తొందరపడుతూ ఉండడంవల్ల ఏం జరుగుతుంది? దీని ఫలితం ఏమవుతున్నది? ఒకడు తన నీడను పట్టుకోవాలెనని పరుగెత్తుతుంటాడు. అతడు అబ్దాంతరాల వరకట్లు పరుగెత్తినా లాభంలేదు. దాన్ని పట్టుకోలేడు. అతడు నీడవెంట బడిపోకుండా వెనక్కు తిరిగి సూర్యునకు అభిముఖంగా పోతే, నీడే వాణ్ణి అనుసరిస్తూ వానివెంబడే పరుగెత్తుతూ వస్తుంది. నీవు జయంకోసం తపించకుండా లాభా లాభాలనుగురించి ఆలోచించకుండా నీ ప్రస్తుత విధాయక ధర్మముపై, సంపూర్ణలక్ష్యముంచి పనిచేస్తే ఈ క్షణమందే జయం పెంపుడుకుక్కలాగ నీవెంటబడుతుంది. జయాన్నే పరమావధిగా ఉంచుకోకుండా ఉంటే, నీకు జయం తప్పక లభిస్తుంది. న్యాయసభను తీర్చి న్యాయాధికారి కొలువుకోసం పార్టీలను, ప్లీడర్లను, బంట్రోతులను, పిలవ నక్కరలేదు. ఆయన వచ్చి గద్దెమీద కూర్చుంటే, వాళ్ళంతా ఎవరంతటవారే తమ తమ స్థానాల్లో చేరుకుంటారు. అలాగే మీరందరు అత్యుత్సాహముతో మీమీ కార్యాలను ఆరంభిస్తే జయం సపరివారంగా దానంతట అదే మీపాదాలకడ నిలుస్తుంది.

## ౬ నిర్భయత్వం

మీా కుండవలసిన మరిఒక లక్షణం నిర్భయత్వం. ఒక్క చూపుతో సింహాలను మచ్చిక చేయవచ్చు. ఒక వీక్షణతో ఎలాంటి విరోధినైనా సాధువుగా చేయవచ్చు. నిర్భయంగా చేసే ఒక్క ప్రయత్నంచేత జయాన్ని సాధించవచ్చు. నేను హిమవత్పర్వతసానువులలో, సాంద్రారణ్యాగర్భాలలో సంచరించాను. పెద్దపులులు, ఎలుగుబంట్లు, తోడేళ్ళు మొదలైన క్రూరమృగాలను కలుసుకున్నాను. వాటిచేత నాకెట్టి అపకారం జరుగలేదు. ఆ యడవి మృగాలను నేను ముఖాముఖి తేరిపార చూచాను. మా చూపులు కలుసుకున్నాయి. ఆ వనమృగాలు నా దృష్టికి ఆగలేక నెమ్మదిగా తోకఝాడిస్తూ పారిపోయేవి. కనుక మీారు నిర్భయంగా ఉంటే మిమ్మెవరూ స్పృశింపలేరు. మీాకపాయం చేయలేరు.

పిల్లిని చూడగానే పావురం కండ్లు మూసుకుంటుంది! పాపం! తాను పిల్లిని చూడడంలేదు కనుక పిల్లికూడా తన్ను చూడనట్లుగా అది భావిస్తుంది. పిల్లి దానిమీాద కురికి ఒక్కసారి దానిని కబళిస్తుంది. నిర్భయత్వంవల్ల పెద్దపులినైనా సాధువు చేయవచ్చు. భయపడే పిరికివాణ్ణి పిల్లికూడా పీకి చంపుతుంది.

మనం ఒక పాత్రనుండి మరొక పాత్రలోకి నీళ్ళుపోసేటప్పుడు, చేయివణుకుతుంటే నీరంతా క్రిందనే ఒలికిపోతుంది. కాని నిర్భయంగా వణుకు లేకుండా పోసే హస్తమైతే ఒక్క చుక్కైనా క్రిందపడదు. ఇది మన నిత్యానుభవంలో ఉన్నవిషయం. ఇట్లు ప్రకృతి మీాకు అనేక పాఠాలను ముక్తగళంతో బోధిస్తునే ఉంటుంది.

ఒక పంజాబు సిపాయి ఒకప్పుడు పెద్ద రోగంవల్ల బాధపడుతున్నాడు. అతడు ఓడమీాద ప్రయాణం చేస్తున్నాడు. వైద్యుడు అతణ్ణి పరీక్షించి ఆశ లేదని, సముద్రంలో అతనిని త్రోసివేయండని ఆజ్ఞాపించాడు.

పాపం! వైద్యులు ఇంతకన్నా ఏమిచేస్తారు! వారప్పుడు అట్టి శిక్షలనే విధిస్తూండేవారు. ఈ సంగతి సిపాయికి తెలిసింది. సంకటా

వస్థలు సంభవించినప్పుడు సాధారణ మానవులుగూడా అసాధారణ ధైర్యం పూనుతారు. అత డెక్కడలేని శక్తిని తెచ్చుకొని, నిర్భయుడై, తన శయ్యపైనుండి వేచి, చిన్నగా ఆ వైద్యునివద్దకుపోయాడు. అతడు తన పిస్తోలు తీసి వైద్యునిమీద గురిపెట్టి "నాకు నిజంగా రోగమున్నదా ? నీ వలా చెప్పగలవా ? నిన్ను నేను కాల్చివేస్తాను" అని బెదరించాడు. వెంటనే ఆ వైద్యుడు అతడు ఆరోగ్యముగానే ఉన్నాడని ధ్రువపత్ర మిచ్చాడు. నిరాశే దుర్బలత్వం. ఈ దుర్బలత్వాన్ని పారద్రోలు. నిర్భయత్వంలోనుంచే అఖండబలం సముద్భూతమవుతుంది. ఈ మాటలు గుర్తుంచుకోండి ! నిర్భయులుకాండి! నిర్భయులుకాండి!!

౭ ఆ త్మ వి శ్వా స ం

వెనుక చెప్పిన అన్నిటికంటె ముఖ్యమైనది అత్యావసరమైనది, జయలక్ష్మికి ముక్తాహారంవంటిది-ఆత్మ విశ్వాసం-లేక "ఆత్మజ్ఞానం"-అని నేను చెపుతాను. ఓ మానవులారా ! వినండి ! మిమ్ము మీరు తెలుసుకోండి. మీకు మీరు సహాయం చేసుకుంటే భగవంతుడు విధిగా మీకు సహాయం చేస్తాడు - అన్నవాక్యం సత్యవాక్యం, వేదవాక్యం. నీ ఆత్మే భగవంతుడు. అనంతుడు, సర్వశక్తుడు. దీనిని నిర్ధారణ చేసుకోవచ్చు. అనుభవంచే గ్రహించండి. ఈ సత్యం ఈ యథార్థం, నన్ను మీ అనుభవంచేత రుజువు పరుచుకోండని మిమ్మాహ్వానిస్తున్నది. మీ శక్తిపై మీరు ఆధారపడండి. మీరు దేనినైనా సాధించవచ్చు. మీ కసాధ్యమైన దేదీ ఉండదు.

మృగరాజైన సింహం అరణ్యానికి అధిపతి. అది తనపై-తన ఆత్మపై తానాధారపడుతుంది. అది తనలో తానుండుటచేత ధైర్య బలసాహసాలతో ఒప్పుతున్నది. అన్ని సంకటాలను అవలీలగా దాటగల్గుతుంది. కదలే పర్వతాల్లాగా ఉండే మత్తగజాలెప్పుడూ తమ విరోధులకు భయపడుతుంటవి. అవి ఎప్పుడూ గుంపులు గుంపులుగా జీవిస్తూ, నిద్రపోయేటప్పుడు కొన్నిటిని తమకు కావలాఉంచుకొని నిద్రిస్తుంటవి. అం దొకటిగూడా, స్వశక్తిపై ఆధారపడదు. తాము దుర్బలులమని అవి చింతిస్తుంటవి. యద్భావం తద్భవతి. చివరకు ఆవిధంగానే

అవి తయారవుతున్నవి. సింహంగర్జించి, ఏనుగుపై ఒక్కదూకుదూకగానే, ఎక్కడి ఏనుగులక్కడ కకావికలై పారిపోతవి. ఎంత ఆశ్చర్యం! పర్వతసమానమైన మదపుటేనుగుకాలిక్రింద ఎన్నిసింహాలైనా నలిగిపోవలసిందేకదా!

ఇద్దరు అన్నదమ్ములున్నారు. వారిరువురూ సమానంగా తమ పిత్రార్జితమును పంచుకొన్నారు. కొన్నిసంవత్సరాల్లో ఒకడు అంతా పోగొట్టుకొని సర్వసామాన్యుడుగా తయారయ్యాడు. రెండోవాడు తన ఆస్తి వృద్ధిచేసుకొని లక్షాధికారయ్యాడు. దీనికికారణం ఏమిటని లక్షాధికారిని పిలిచి అడిగితే, తనసోదరు డెప్పుడూ, "వెళ్ళు వెళ్ళు", అని చెపుతుండేవాడనీ, నేను 'రండి, రండి' అని అంటుండేవాడననీ చెప్పాడు. అంటే మొదటివాడు, హాయిగా హంసతూలికాతల్పంపై శయనించి నౌకరులతో 'పోండి! పోండి! మీరది చేయండి' అంటుండేవాడు. రెండోవాడు నడుంబిగించి, తనపని తానుచూస్తూ, తన నౌకరులను సహాయానికిపిలుస్తూ, "రండి, రండి! మీ రిదిచేయండి' అంటుండేవాడు. రెండవవాడు తనశక్తిపైననే తా నాధారపడ్డాడు. కాబట్టి తన ధనాన్ని సేవకుల్ని వృద్ధిచేశాడు. మొదటివాడు 'వెళ్ళు వెళ్ళు' అనే ఎంతసేపూ ఆజ్ఞాపిస్తూ ఉండేవాడు. దానివల్ల అతని నౌకర్లు 'వెళ్లు, వెళ్లు' అనే ఆజ్ఞ శిరసావహించి వెళ్ళిపోతుండేవాండ్లు. రాముడెప్పుడూ, 'రండి, రండి' అని చెప్పుతుంటాడు. నా ఆనందాన్ని, నా జయాన్ని మీరుకూడా పంచుకోండి. సోదరులారా! స్నేహితులారా! దేశీయులారా! ఇది నిజం. మానవుడు తనగతికి తనే కర్త, అధిపతి అవుతున్నాడు. మీరు పుక్కిటికథలను నమ్మి మీమీద మీరాధారపడక బాహ్యవిషయాలపై ఆధారపడడం ఆత్మహత్య అని మీకింకా రుజువు చేయగలను. స్వతంత్రతవల్లనే మనము విజయాన్ని పొందుతాము. మన స్వాతంత్ర్యంవల్లనే మనం బాధలు అనుభవిస్తాము. మన స్వాతంత్రంవల్లనే మనం బానిసల మవుతున్నాం. మన మింక గోణగడం, గోడుపొందడం దేనికి? మనకున్న సత్యస్వాతంత్ర్యాన్ని ఉపయోగించి ఎందుకు శారీరిక, సాంఘిక, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యాలను పొందకూడదు?

బుద్ధదేవుని అనుచరులు శతాబ్దాలక్రిందట బోధించినమతాన్నే రాముడిప్పుడు మీకు బోధిస్తున్నాడు. కాని ఈ మతాన్నే మనం ప్రస్తుత యుగానికి అనుగుణ్యముగా ఉండేలాగున, నూతనదృష్టితో చూడవలసిఉంటుంది. పాశ్చాత్యశాస్త్ర (Science) తాత్త్వికదర్శనాలతో దానికి కొంత మెరుగుపెట్టవలసి ఉంటుంది. నా మతముయొక్క మూలసూత్రాన్ని గెథీకవిమాటలతో ఇట్లునిర్వచించవచ్చు. 'మానవ పరమార్థాన్ని మీరు గుర్తిస్తారుగాక! నాకు పూర్వం ప్రపంచంలేదు. దాన్ని నేనే సృష్టించాను. సముద్రగర్భంనుండి సూర్యగోళాన్ని ఉదయింపచేసింది నేనే! నాతోనే చంద్రుడు, తన శుక్ల, కృష్ణపక్ష గతులు ప్రారంభించాడు.

దీన్ని మీరొకసారి గ్రహిస్తే, మీ రీ నిమిషమునందే ముక్తులౌతారు. దీన్ని మీరొకసారి గ్రహిస్తే మీకు శాశ్వతజయం సమకూడుతుంది. దీన్ని మీరొకసారి గ్రహిస్తే మీరున్న నరకగహ్వరాలే స్వర్గమందిరాలుగా ఉత్తరక్షణంలో మారుతాయి.

ఓమ్! ఓమ్!! ఓమ్!!!

# విజయ రహస్యం 2

[శాన్‌ఫ్రాన్సిస్కో గోల్డెన్‌గేట్ హాలులో 1903, జనవరి 26 వ తేదీ ఉపన్యసింపబడింది. టోకియోలో జరిగిన ఉపన్యాసంకంటె ఈ ఉపన్యాసం మరింత విపులీకరింపబడింది.]

సభికమహాజనరూపమునగల మదాత్మా! ఒక గురువు ముగ్గురు విద్యార్థులకు అయిదణాలిచ్చి సమంగా పంచుకోవలసిందని ఆజ్ఞాపించాడు. వారాడబ్బులతో ఏదోవస్తువును కొనాలనే ఉద్దేశంతో బయలు దేరారు. ఒకడు భారతీయుడు, ఒకడు పరిషియాదేశీయుడు, ఒకడు ఆంగ్లేయుడు. వారికి ఒకరిభాష ఒకరికి పూర్తిగా తెలియకపోవడంవల్ల ఏమికొనాలనే విషయంలో చాలాసేపు చర్చజరిగింది. ఆంగ్లేయుడు వాటర్ మెలన్ (Water melon) కావాలనీ, హిందూబాలుడు 'హిందువానా' కావాలనీ, పరిషియా పిల్లవాడు 'తార్బూజా' కావాలనీ పరస్పరం కలహించుకున్నారు. చివరకు వాళ్ళేమికొనాలో నిశ్చయం చేసుకోలేకపోయారు. ప్రతివాడికి తనపట్టు నెగ్గాలని పట్టుదల. వారిలో వారికి పెద్దతగువుబయలుదేరింది. వాండ్లు పోట్లాడుతూ, వీధుల్లో పోతుంటే ఒకపెద్దమనిషి వారినికలుసుకున్నాడు. అతనికి ఇంగ్లీషు, హిందూస్తానీ, పరిషియన్ భాషలు మూడూవచ్చు. వాండ్లతగాదా వినడంతోటే అతనికి నవ్వువచ్చింది. మీ తగాదా నేను తీరుస్తానన్నాడు. దానికా పిల్లవాండ్లు ఒప్పుకున్నారు. ఆ పెద్దమనిషి ఆ అయిదణాలూతీసుకొని వాండ్లనొకచోట ఉండండని చెప్పి, తాను ఒంటరిగాపోయి, ఒకపెద్దపుచ్చకాయకొన్నాడు. అతడు దాన్ని బట్టచాటున దాచిపెట్టి, ఒక్కొకరిని పిలిచి, ఆకాయకోసి మూడుభాగాలను ముగ్గురికీ సమంగాపంచిపెట్టి, వాండ్లకు సంతృప్తిగలిగించాడు. అందరూ కోరింది ఆ పుచ్చకాయే.

వాండ్లలో తగవు ఏవిధంగాపుట్టిందో చూచారా? ఈ తగవుకు కారణం? పేరులు! - నామాలు! ఇంతకుతప్ప కారణం ఏమీ లేదు. పేర్లు తొలగించిచూస్తే ఒక్కటే! వాటర్ మిలన్, హిందువానా, తార్బూజా - ఇవి మూడూ పుచ్చకాయకు పేర్లు. ఒకపదార్థమే వివిధ దేశాల్లో వివిధనామాలతో పేర్కొనబడుతుంది.

ఇదేవిధంగా వివిధమతాలవారు తమలో తాము పోరాడుచుండడం చూచి రాముడు నవ్వుకుంటాడు. క్రైస్తవులు యూదుమతస్థులతోను, యూదులు మహమ్మదీయులతోను, మహమ్మదీయులు బ్రాహ్మణులతోను, బ్రాహ్మణులు బౌద్ధులతోను, బౌద్ధులు మరొకరితోను వాదులాడడం, పోరాడడం, తగవులాటలు పెంచుకోవడం హాస్యాస్పదం గాక మరేమవుతుంది? ఈ అన్నిటికి పేర్లే కారణం. ఈ తెరను తొలగించి యథార్థాన్ని చూస్తే భేద మేమీ కనుపించదు.

వేదాంతం అనుపదాన్ని రాముడు, తరచు వాడుతుంటాడు. ఈ పేరు వినడంతోటే వినడానికిగూడా ఇష్టపడనివారు కొందరుంటారు

ఒకడువచ్చి బుద్ధుని పేర, బోధచేయడం ఆరంభిస్తాడు. కొందరు అతని మాటలను వినడానికి ఇష్టపడరు. తమకు ఇష్టంలేని పేరు పేర్కొవడమే దీనికి కారణం. ఎంత అన్యాయం? మన మింతకన్నా ఎక్కువ వివేకంచూపాలె. ఇరువదో శతాబ్దంలో నామరూపాలకతీతులై ప్రవర్తించవలసిన సమయమాసన్నమయింది. రాముడు మీ కేది బోధించినా లేక మరి ఎవరేమి బోధించినా దాని గుణగణాలనుబట్టే మీరు దాన్ని స్వీకరించాలె. మీరు ప్రతిదాన్ని పరీక్షించికొనండి' పేర్లవల్ల మోసపోకండి. దాన్ని అనుభవంవల్ల రుజువుచేసుకోండి. అతి పురాతనమైనదని మీ రొక మతాన్ని స్వీకరింపనవసరం లేదు. అతి పురాణత సత్యానికి రుజువుకాజాలదు. ఒక్కొక్కప్పుడు, చాల పాతబడిన, జీర్ణగృహాన్ని మనం పీకివేయకతప్పదు. పాతబడి చినిగిపోయిన గుడ్డలను మార్చివేయాలె. అది క్రొత్తపరిశోధనమైనా, హేతుబద్ధమైతే, నవనవోన్మేష కాంతులతో ప్రకాశించేగులాబిలాగ ఆకర్షణీయమే అవుతుంది. క్రొత్తదికదా అని, ఏ మతాన్ని స్వీకరింపవద్దు. క్రొత్తదైనంతమాత్రాన సర్వమూ మంచిదికాజాలదు. అది కాలపరీక్షకు నెగ్గాలె. మానవకోటిలో చాలమంది విశ్వసించినమాత్రంచేత మన మే మతాన్ని స్వీకరింప నవసరంలేదు. మానవకోటిలో ఎక్కువమంది సైతానుమతాన్నే నమ్ముతుంటారు. వారికి అజ్ఞానమతమే శరణ్యాం. ఒకప్పుడు మానవకోటిలో చాలమంది బానిసత్వాన్ని నమ్మారు. అంత మాత్రంచేత బానిసత్వం పవిత్రసంస్థకాజాలదు. కొద్దిమంది ఎవరో

గొప్పవారు అవలంబించినంతమాత్రాన, మీ రోకమతాన్ని స్వీకరింప నవసరంలేదు. ఒక్కొక్కప్పుడు అట్టి కొద్దిమందే తప్పుదారి తొక్క వచ్చు. అజ్ఞానకూపంలో పడవచ్చు. సమస్తపరిత్యాగం చేసిన ఒక గొప్ప సన్న్యాసి బోధించినంతమాత్రాన, మీరొకమతాన్ని స్వీకరింప వద్దు. సమస్తాన్ని త్యక్తంచేసిన సాధువు లెందరో జ్ఞానలేశంగూడా లేనివా రున్నారు. రాజులు, చక్రవర్తులు బోధించినంత మాత్రాన మీ రొకమతాన్ని స్వీకరింప నవసరంలేదు. రాజులు తరచుగా ఆధ్యాత్మికదారిద్ర్యంచేత పీడింపబడుతుంటారు.

గొప్ప శీలవంతుడు బోధించినందున మీరొకమతాన్ని స్వీకరింప వద్దు. సత్యప్రచారం చేయడంలో, అతిశీలవతు లెందరో విఫలులైనారు. ఒకని జీర్ణశక్తి మరింతగొప్పది కావచ్చు. కానీ జీర్ణకోశాన్నిగురించి అత డేమీ ఎరుగకపోవచ్చు. ఒకశిల్పి అద్భుతమైన, కన్నుల పండువు చేసేకళాకౌశలంతో ఒక చిత్రాన్ని రచింపవచ్చు. కాని, అతడు, ప్రపంచంలో అందరి కన్నా అనాకారి కావచ్చు. కొందరు చూడడానికి చాలా అందవికారంగా ఉంటారు. కాని పరమ సత్యాలను బోధిస్తుంటారు. మహా వేదాంతి 'సోక్రటీసు' ఇలాంటి వాడే. ఫ్రాన్సిసు బేకను నీతిమంతుడు కాడు. సత్ప్రవర్తన కలవాడు కాడు. అతడు (Nounorganon) అనే ఉత్కృష్ట గ్రంథాన్ని వ్రాసి, ప్రపంచానికి మహోపకారం చేశాడు. అతని సిద్ధాంతం అతి ఉన్నతమైంది. కీర్తిమంతుడైనంతమాత్రంచేత, నీ వొకని మతాన్ని స్వీకరింప నవసరంలేదు. ఇజాక్ న్యూటను చాలా కీర్తిశాలి. అయినా అతని తేజః ప్రసారసిద్ధాంతము తప్పిపోయింది. మీరు దేన్నైనా ఏమతాన్నైనా దానిగుణాన్నిబట్టి గ్రహించండి. విశ్వసించండి. దాన్ని మీరే పరీక్షించండి. మథనం చేయండి. 'మీ స్వాతంత్ర్యాన్ని, బుద్ధుడు, జీసను, మహమ్మదు, కృష్ణుడు-మొదలైన వాండ్లెవ్వరికీ అమ్మివేయకండి. బుద్ధుడు, జీసను, మహమ్మదు మొదలైనవా రొకవిధంగా, మరొకరు మరొకవిధంగా బోధించారని మీ రనవచ్చు. వారి కాలాలు వేరు. వారి పరిస్థితులు వేరు. అప్పటి సమస్యలు వేరు. దేశకాలపాత్రాలు అప్పటివి వేరు. ఇప్పటివి వేరు. వారు సర్వవిషయాలను కూలంకషంగా తరచి, వారి

వారి మేధస్సుల నుపయోగించి, కాలోచితధర్మాలను కనిపెట్టారు. మన ఇప్పటికాలం వేరు. పరిస్థితులు క్రొత్తవి. మన సమస్యలు మనమే పరీక్షించుకోవాలి. విమర్శించుకోవాలె. మన బుద్ధిబలాన్ని వినియోగించుకోవాలె. ప్రతి విషయాన్ని, మన దృష్టితో మనం చూచుకోవడానికి స్వాతంత్ర్యమున్నది. మీ పూర్వులు వారి మోక్షాన్ని వారు చూచుకున్నారు. వారు నమ్మిన మతము వారికి శ్రేయస్కరమే. ఇప్పుడు మీ విముక్తి మీ చేతుల్లో ఉన్నది. దీన్ని పొందవలసినపని మీదిగాని మీపూర్వులది కాదు. వాండ్లు ఏ ఒక్కమతాన్నో ఎరిగి ఉండవచ్చు. ఇప్పుడు మీకు సమస్త మతాలూ, సమస్తసత్యాలూ సమస్త తాత్త్విక పథాలూ సమస్త శాస్త్రాలూ, సేవచేస్తున్నవి. మీ పూర్వుల మతం మీ ముందర ఉన్నంత మాత్రంచేత మీ ద్వైతే, బౌద్ధము, వేదాంతము మొదలైనవి కూడా మీవే. అవికూడా ఇప్పుడు మీ ముందర ఉన్నవి.

సత్యం ఒకరి సొత్తుగాదు. అది జీససు, బుద్ధుడు, మహమ్మదు, కృష్ణుడు మొదలైనవాండ్ల సొత్తు గాదు. కనుక దాన్ని మనం, వారి పేర్లతోనే బోధింప నవసరంలేదు. సత్యం మన అందరి సొత్తైయున్నది. నీకు పూర్వం ఎవడైనా సూర్యకాంతిలో ఆనందిస్తే ఇప్పుడు నీవూ ఆ తేజాన్ని ఆశ్లేషింపవచ్చు.

ఒక డొక నదీజలం త్రాగితే, నే డా నదీజలాన్ని నీవు కూడా తనివిదీర త్రాగవచ్చు. అన్ని మతాలపట్ల మీ రిట్టి భావాన్నే కలిగి ఉండాలె. పొరుగువాని కున్న ఆస్తిని తాను తీసుకోవాలనే ప్రతివ్యక్తీ చూస్తున్నాడు. కానీ మీ ఇరుగు పొరుగువాండ్లు తమ ఆధ్యాత్మిక సంపదను మీకు స్వేచ్ఛగా సమర్పిస్తామని చెప్పుతుంటే, దాన్ని మహానందంతో స్వీకరించక, వాండ్లపై కత్తిదూయడం ఎంతఆశ్చర్యకరం! రాముడు మీకు వేదాంతాన్ని ప్రసాదిస్తున్నాడు. దాన్ని మీరు తీసుకోండి; జీర్ణింపచేసుకోండి. మీ స్వంతం చేసుకోండి. దీన్ని మీరు క్రైస్తవమతమనే పిలుచుకోండి. పేర్లతో మాకు అవసరంలేదు. రాముడు మీకు బోధించేమతం బైబిల్లోను, అతి పురాణ మతగ్రంథాల్లోనే గాకుండ, అతినవీన వేదాంత గ్రంథాల్లోను, శాస్త్రాల్లోను కనబడు

తుంది. రాముని మతం మీకన్ని చోట్ల కనబడుతుంది. మీరు దాన్ని వీధుల్లో చూడవచ్చు. నదుల్లో వృక్షాల్లో, వాయువులో- సమస్తంలో ఈమతం నిండిఉన్నది. ఇది నీనాడీమండలంలో స్పందిస్తున్నది. ఇది మీ నిత్యజీవితానికీ, మీ హృదయానికీ, సంబంధించింది. దీనివల్ల మీరే ఒక్క మతానికో బద్ధులైయుండ పనిలేదు. దీన్ని మీరు మీ నిత్యజీవితంలో, ఆడుకొనేటప్పుడు, పాడుకొనేటప్పుడు, సర్వకాలసర్వావస్థల్లో, ఆచరించవచ్చు. ఆచరించాలె. మీరు దీన్ని వేదాంత మనవద్దు. మీ యిష్టంవచ్చిన పేరుతో దీన్ని వ్యవహరించుకోండి. వేదాంతమంటే, మూలతత్వమని అర్థం. ఇది మీస్వాంతం. ఇది మీ కెంత స్వాంతమో, రామునకంతే! ఇది యే ఒక్కరిసొత్తూ కాదు. ప్రతి మానవుడు ప్రతి వస్తువూ దీనిసొత్తే. ఈ వేదాంతం మన మార్గాన్ని నిష్కంటకంగా, మన భారాన్ని అతి ఆనందప్రదంగా చేసి, జీవితాన్ని సారవంతం చేస్తుంది. మనము 'అనుభవ వేదాంతం', లేక విజయాన్నేవిధంగా పొందుతాము?' అన్న విషయాన్నిగురించి నేడు చర్చిద్దాము. వేదాంతాన్ని, ఆచరణకు దేవడమే, విజయభేరీని మ్రోగించేమార్గం. ప్రతిశాస్త్రానికి కళ ఉంది. శాస్త్రం (Science) సిద్ధాంతభాగం; కళ దాని ఆచరణ భాగం. మన మిప్పుడు వేదాంతకళనుగురించే తీసుకొందాము.

కొంతమంది, వేదాంతం సోమరితనాన్ని, స్తబ్ధత్వాన్ని కార్యోత్సాహశూన్యతను, నిరాశను కలిగిస్తుందని చెపుతారు. మీ రిట్టి తర్కంవల్ల మోసపోవద్దు. వివేకాన్ని యితరులకు అమ్మివేయకుండా వేదాంతబోధలు శక్తిని, సామర్థ్యాన్ని కార్యసిద్ధినీ చేకూర్చగలవో, లేవో, మీరే విచారించుకోగోరుతాను. హిందువులు ఆవిధంగా చేస్తున్నారా? అని మీరడగవద్దు. ఇది మీయందరి సొమ్ముగాని, హిందువులది మాత్రమేకాదని, నే నిదివరకే చెప్పాను. కార్యశూరులైన అమెరికను లెంతోమంది, తమకు తెలియకుండానే వేదాంతమును అనుష్ఠించడం చేత ఐశ్వర్యవంతులైనారు. హిందువులు దీన్ని మీవిధంగా ఆచరించడం లేదు, అందుకనే వాండ్లు చాలా వెనుకబడ్డారు. నిర్ధనులైనారు.

రాముడు మీకు తల్లక్రిందుల వేదాంతాన్ని బోధింపడు. ప్రకృతి యొక్క నిరంతరజీవప్రవాహమునుండి బయలుదేరే యథార్థ వేదాం

తాన్నే మీముందు పెడుతున్నాడు. ఇదే మీ జీవితకార్యంలోని వివిధ శాఖ లన్నిటిలో సంపూర్ణవిజయం చేకూరుస్తుంది. ప్రతి మానవుడు అవ్యక్తంగానైనా ఈ మార్గాన పోకతప్పదు.

కార్యసాధనకు అనేక ముఖ్యసూత్రా లున్నాయి. మన ముఖ్యోక్క సూత్రాన్ని తీసికొని, హైందవ శాస్త్రోక్త వేదాంతముతో వానికిగల సంబంధాన్ని దర్శిద్దాము.

## మొదటిసూత్రం—కర్మనిష్ఠ

కృషి, నిరంతరం కర్మనిష్ఠ, సంతత పరిశ్రమ, తీవ్రసాధన–కార్యసిద్ధికి కీలకమన్న విషయం నిరూఢ సత్యం. 'కృషి చేయందే నీవు దేన్నీ సాధించలేవు. సోమరిపోతు జీవన సంగ్రామంలో నలిగిపోతాడు, నశిస్తాడు. 'నిరంతరకృషి' కీ నిర్వికార, నిర్గుణ, నిశ్చలాత్మతత్త్వానికీ సమన్వయం ఏ విధంగా కుదురుతుంది? వేదాంతులు ఆత్మ ఇట్టి దనే కదా చెప్పడం? అని మీరు అడుగవచ్చు, వేదాంతం, సన్న్యాసాన్ని శాంతిని, ఆత్మజ్ఞానాన్ని బోధించడంచేత సోమరితనాన్ని, జడత్వాన్ని బోధించడం లేదా? అని మీరు ప్రశ్నించవచ్చు. కర్మ అంటే ఏమిటి? సన్న్యాస మంటే ఏమిటి? ఈ రెంటిని సరిగా అవగాహనంచేసుకోక పోవడంవల్లనే ఈ అనర్థం వాటిల్లుతున్నది.

కృషే– నిరంతరకర్మే– విశ్రాంతి– అని వేదాంతం బోధిస్తున్నది. కృషే విశ్రాంతి. యథార్థకర్మ విశ్రాంతే! ఈ మాటలు మీకు పరస్పరవిరుద్ధంగా కనుపిస్తున్నవి. మీరు నిరంతరకృషిలో మగ్నుడైన గొప్పవ్యక్తిని ఎవ్వరినైనా పరీక్షించండి. అతడు ఒక లిప్తకాలమైనా, వృథాపుచ్చకుండా పనిచేస్తుంటాడు. చూచేవారందరికీ అతడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు లేకుండా పనిచేస్తున్నట్లు కనిపిస్తాడు. కాని మీ రతనిదృష్టితోనే చూస్తే, అతడు పని చేయడమే లేదు. అతడు కర్తే కాదు. ఇంద్రధనుస్సును మనం దూరంనుండి పరీక్షించినపుడే మన కది విచిత్రంగా కన్పిస్తుంది. దాని సమీపానికి పోయి పరీక్షిస్తే రంగు లేవీ కనపడవు. యుద్ధరంగంలో తాండవించే ఒకవీరవరుణ్ణి పరీక్షించండి. నెపోలియన్, వాషింగ్టన్, లక్ష్మీబాయి మొదలైనవారు వీరవిహారం

చేస్తున్నప్పుడు మీకేం కనుపిస్తుంది? శరీరం దానంతటదే పనిచేసుకొని పోతుంటుంది. మనస్సు ఆ పనిలో లగ్నమై పోవడంచేత, "నేను చేస్తున్నాను" అనుకొనేవాడు ఇచ్చట నశించి పోయినాడు. గొప్పవింతను తనపై వేసుకోజూచు 'అహం' తొలగిపోయింది. ఇట్టి నిరంతర కర్మే మిమ్ములను మీకు తెలియకుండగనే, మహాయోగసిద్ధికి తీసుకపోతుంది. నిరంతరకర్మద్వారా మీ అహంకారమును మీరు జయించాలని వేదాంతం నిర్వచిస్తున్నది. మీ మనఃకాయాలను నిరంతర కర్మలో నిమగ్నంచేస్తే శ్రమ అనేది మీకు ఉండనే ఉండదు. కవి తన అహాన్ని తన దేహభావాన్ని వీడి, "నేను కవిత్వం చెపుతున్నాను" అనే స్మృతి పోగొట్టుకున్నప్పుడే, ప్రబోధతరంగాల్లో ఓలలాడుతున్నాడు. గణితశాస్త్రవేత్తను ఎవరినైనా చూడండి. క్లిష్ట సమస్యలను సాధింపవలసినప్పుడు 'నేను చేస్తున్నా' ననేభావం పూర్ణంగా అతనిలో నశించినప్పుడే, అది సాధింపబడుతున్నది. 'అహం' ఎంత ఎక్కువగా నశిస్తే, వానిలో అంత మహోత్తమశక్తి ప్రజ్వలిత మౌతున్నది.

వేదాంతం, కర్మవల్లనే 'అహం'ను మరచిపోయి, అవ్యక్తానిర్వచనీయ తత్వమైన 'ఆత్మ' లేక భగవంతునిలో మగ్నంకావాలని వాంఛిస్తున్నది. వేదాంతి, కవి, శాస్త్రవేత్త, ముని-మొదలైనవాండ్లు, ఇట్టి అవ్యక్త ప్రభావంలో ప్రవేశించి అహంకారశూన్యులై, తమ వ్యక్తిత్వాన్ని దాటినపుడే, వేదాంతం అనుభవానికి వస్తున్నది. అప్పుడే భగవంతుడు, వేణుగానలోలుడు తన దివ్యకరాలతో అట్టి శరీరమనో వేణువును చేతబట్టి, అమృతగీతికాసుధారసాన్ని మనోహరశ్రుతులతో పూరిస్తాడు. అట్టివానికి, దివ్యత్వ మావేశించిందని ప్రజలు చెపుతారు. కాని అతనికిమాత్రం ఆ స్థితిలో 'వాడు-నేను' లు లేవు. అతని దృష్టిలో కార్యం లేదు. కర్తృత్వం లేదు. అతడు వేదాంతాన్ని తనకు తెలీకుండా, ఆచరణలోకి తేవడంవల్లనే, ఇట్టి అద్భుతాలు చేకూరుతున్నవి.

వేదాంతయోగాన్ని సాధించడానికి మనం అరణ్యాలకు పోనక్కరలేదు. విపరీతయోగసాధనలను, అభ్యసింప నవసరంలేదు. నీవు నీ కృషిలో మగ్నుడవైతే నీవే అన్ని యోగాలకు జనకుడవౌతావు. నీవే శివుడవౌతావు. శరీరం నీ ఆత్మ కానేరదని వేదాంతం చెప్పుతున్నది.

ఈ సత్యాన్ని నీవు అనుభవంచేత గ్రహించేటప్పుడు, నీ శరీరమనస్సులు లేనప్పుడు, నీలో అనంతశక్తి సంభూత మవుతున్నది. అనంతకర్మ వెలువడుతున్నది.

కృషి అంటే ఏమిటో, దీపము చక్కగా బోధించగలదు. తన శరీరాన్ని, తన వత్తిని, చమురును, నిరంతరం దహించివేయడంచేతనే, దీప మంత ప్రకాశవంత మగుచున్నది. నిరంతరకృషిలో, అది తన శరీరాన్ని ఆహుతిచేస్తున్నది. ఒక నిమిషం అది బద్ధకం పూనితే, ఒక్క నిమిషం శరీరాన్ని దాచదలచితే, అంతా అంధకార మవుతున్నది. తేజోవిహీన మవుతున్నది. పరాజయము, విఫలత్వము సంభవిస్తున్నవి. నీవు అభివృద్ధి పొందాలంటే, నీవు జయభేరీ మ్రోగించాలంటే, నీ నిరంతరకృషివల్ల, నీ కార్యకలాపాలద్వారా, నీ నిత్యజీవితంవల్ల నీ దేహాన్ని, నీ కండరాలను దగ్ధీభూతం చేయాలె. వాటిని సంతతకర్మానలంలో దగ్ధం చేయాలె. చివరకు "కర్మ" అంటే ఏమి తేలుతున్నది ? నీ మనోదేహాలు మాయావాగురలని గ్రహించడం, భ్రమలో పుట్టినవని తెలుసుకోవడం, నీ ఆత్మదృష్టిచే అవి శూన్యాలని అవగతం చేసుకోవడం, వీటిని త్యజించి ముందుకు పోగలగడమే.

అక్బరుపాదుషా సభకు ఇద్దరు రాజపుత్రులు వచ్చారు. వారతని కొలువులో ఉద్యోగాలు కోరారు. అక్బరు వారి శక్తిసామర్థ్యాలను గూర్చి ప్రశ్నించాడు. మేము యోధులమని వారు ప్రత్యుత్తరమిచ్చారు. వారిని తమ పరాక్రమ ప్రదర్శనం చేయమని పాదుషా ఆజ్ఞాపించాడు. వాళ్లిద్దరూ వెంటనే తమఖడ్గాలు ఒరల్లోనుంచి ఊడబెరికారు. అవి ధగధగ మెరుస్తున్నవి. ఆ మెఱుపులు వారి పౌరుషాన్ని రగుల్కొల్పాయి. త్రుటిలో ఒకరిపై ఒకరు దుమికారు. వారి ముఖకాంతి తరగలేదు. చేతులు వణకలేదు. ధైర్యం సడలలేదు. ఆ ఖడ్గధారాగ్రాలు వారి ఒండొరుల శరీరాల్లో గుచ్చుకొన్నవి. వారి ఆత్మలు స్వర్గంలో కలుసుకున్నవి. వారి శరీరాలు రక్తంలో తడిసి భూమిమీద కలుసుకొన్నాయి. పాదుషా ఆశ్చర్యపడ్డాడు. 'నేను చేస్తున్నా'నని అహంకరించు కర్త నశించినపుడే సత్యమైన కర్మ జరుగు

తున్నదని పై కథ బోధిస్తున్నది. తేనెటీగలు కుట్టేటప్పుడు, తమ ప్రాణాలను అకుట్టులో ఉంచుతున్నవి.

'తన్ను తాను జయించనివానికి కవిత్వకవాటాలు తెరవబడవు అని ప్లేటో వ్రాశుచ్చాడు.

కనుక వేదాంతాన్ని ఆచరించువాడే, అభివృద్ధి పొందగల్గుతాడు. జయశాలి కాగల్గుతాడు. నిరంతరకృషే ఈ ప్రపంచవాసులకు మహా యోగం. నీకు నీవు అధిపతివైనపుడే, ప్రపంచానికి అధిపతివి కాగల్గు తావు.

మనం ఎట్టి అవస్థలో ఉన్నపుడు, ఎట్టి మనఃస్థితి గలిగిఉన్నప్పుడు కార్యాలు సుసాధ్యా లవుతున్నవి? సహజంగా సిద్ధిస్తున్నవి? "కృషి! కృషి!" అనడం చాలా సులభమే! కాని పనిచేయడం చాలా కష్టం. ప్రతివాడు గొప్ప చిత్రకారుడు కావాలనే కోరుతాడు. గొప్ప పండి తుడు కావాలనేకోరుతాడు. కాని ప్రతివాడు తానుకోరినట్లు అవడం లేదు. మిమ్ము జడత్వానికి పురికొల్పేదేది? మీరు పరిశ్రమను సంతోష పూర్వకంగా స్వీకరించేటట్లు చేసే దేమిటి? చాలా సారులు పని చేయాలనేకోరిక వుండి, ఏమి చేయలేక పోవడం మీకు తెలుసుగదా! ఒక్కొక్కప్పుడు మీకు ఏపనీ చేయాలనే కోరిక లేకపోయినా, అద్భుత మైన పని జరుగుచుండడం చూడలేదా? మీ క్రియాశక్తిని పైనుండి పాలించే శక్తి ఒకటి ఉన్నదని మీ కెప్పుడూ అనుభవంలోకి రాలేదా? నీ వనేకసారులు ఉదయం లేవగానే ఒక అనిర్వచనీయస్థితిలో, దివ్యా వస్థలో ఉండడం లేదా? ప్రకృతితో సంపూర్ణ సామరస్య మనుభవిం చడం లేదా? నీ వప్పుడు కలంబట్టి వ్రాయబూనితే, అద్భుతమైన వేదాంతాన్నో, కవిత్వాన్నో మధురంగా వర్ణించడంలేదా? చిత్రకా రుడు మంచి చిత్రాన్ని వ్రాద్దామని కూర్చుంటాడు. కాని అత డెంత తన్నుకులాడినా లాభ ముండదు. ఒకనాడు సూర్యోదయాత్పూర్వమే లేస్తాడు. అతనిలో దివ్యతరంగాలు ఉప్పొంగినట్లవుతుంది. అప్పు డద్భుత చిత్రాలు అనంతకళలతో అతని చేతినుంచి రాలుతాయి! ఏమిచిత్రం! ఇది నిజం కాదా?

మీ క్రియాశక్తుల్ని, అత్యుత్తమస్థితిలో ఉంచే దివ్యశక్తి ఒకటి ఉన్నదని దీనివల్ల మీకు తెలియడంలేదా? ఇట్టి దివ్యస్థితిని, మీరు ఉపయోగించుకుంటే, మీ రెవ్వరూ, ఉత్కృష్టులుగానే ఉంటారు. మీరు చేసేపనులుకూడ కళావంతముగాను, పరిపూర్ణముగానుఉంటవి. ఆ ఉత్తమస్థితినే, ఆ ఉత్తమరహస్యాన్నే వేదాంతం మీకు ప్రసాదిస్తున్నది. అది ఈజగత్తంటితో, దివ్యత్వంతో, సామరస్యంపొందడమే! నీ సత్యాత్మలో నీ వుండడమే! అంతఃస్థితుడై ఉన్న పరమాత్మలో లీనమై, దేహభావవిముక్తినొందడమే! జ్ఞానాలకెల్ల జ్ఞానమై, తేజాలకెల్ల తేజమై, అంతర్గతంగావున్న మూలశక్తిని ఉపయోగించుకొనడము చేతనే, మనక్రియలు అద్భుతాలవుతాయి.

చిత్రకారుడు వీధుల్లో తిరిగేటప్పుడు, అనేక ముఖపద్మాలు చూస్తుంటాడు. ఒకరి విశాలనేత్రాలు అతన్ని ఆకర్షింపజేస్తవి. వెంటనే అవి అతని మనస్సులో కెక్కుతవి అతడు మరి ఒకణ్ణిచూస్తాడు. అతని గడ్డము ఎంతో అందంగా ఉంటుంది. అది వెంటనే చిత్రకారుడి మనస్సులో లిఖింపబడుతుంది. మరి ఒకడు అతని దుకాణానికి చిత్రాలు కొనడానికి వస్తాడు. పటాలు కొని వెళ్ళిపోతాడు. కాని, చిత్రకారుడు అతని ముంగురుల సౌందర్యాన్ని దొంగిలించిన విషయం అతనికి తెలియదు. మరొకడు ఏదో పనిమీద అతనివద్దకు వస్తాడు. పని ముగించుకొని వెళ్ళిపోతాడు. కాని అతని చెవులను ఆ చిత్రకారు డదివరకే అపహరించాడు.

ఈ విధంగా ఆ చిత్రకారుని మనస్సు అవ్యక్తంగా పనిచేస్తునే ఉన్నది. చిత్రకారు డీవిధంగా, ఒకనికండ్లను, మరొకని గడ్డాన్ని, ఇంకొకని ముక్కును తీసుకుంటున్నా అత డట్లుచేసేసంగతి అతడికే తెలేదు. అవ్యక్తంగా, అమనస్కంగా, ఆ పనిజరిగిపోతున్నది. కొన్ని రోజులైనతర్వాత, అత డొకచిత్రాన్ని వ్రాయబూని కూర్చుంటాడు. వెంటనే, వానికి ఆ నేత్రాలు, మరొకనినాసిక, ఇంకొకడి ముంగురులు, ఇవన్నీ స్ఫురించి ఒకచిత్రం కూర్పబడుతుంది. ఈచిత్రం మాతృకలకన్నా అద్భుతంగా తయారవుతుంది. ఈ కళ ఏ విధంగా సాధింపబడిందో, చూచారా? దీన్ని ఏవ్యక్తి చేశాడు? ఇదంతా అవ్యక్తంగానే

జరిగిపోయింది. "నేను చూస్తున్నాను" అనే భావం పోయినస్థితిలోనే ఈ కార్యమంతా జరుగుతుంది. ఆ చిత్రకారుడు, ద్వేషంచేతగాని, మానాన్యాధిక వికారంచేతగాని, కలుషితుడై ఉంటే, వెంటనే అతని మనస్సనే గడియారం ఆగిపోతుంది. అతడు తన స్వస్థతనుంచి పతితుడవుతున్నాడు. అతనిలో ఉన్న అవ్యక్తశక్తిపోయింది. స్వార్థం అతన్ని ఆవేశించింది. మనలను విశ్వమంతటితో సామరస్యానికిదెచ్చే వేదాంత తత్వానికి బదులుగా, ద్వేషం లేక మోహం ప్రవేశించింది. ఇప్పుడా మనస్సు పూర్వంలాగా, అవ్యక్తంగా వివిధపురుషులనుండి రూపరేఖలను గ్రహించే సామర్థ్యాన్ని కోల్పోయింది. అనుభవవేదాంతము నశించింది. దానితోపాటు, అద్భుతకళలను సృష్టించే దివ్యశక్తిసైతం నశించింది. "కర్మకోసం కర్మనాచరించ"మని వేదాంతం చెప్పుతున్నది. మీ కర్మ సఫలం గావాలంటే మీరు ఫలిత మాశించకూడదు. మీ ఫలమూ, సాధనా రెంటినీ కలిపి 'కర్మే మీ ఫలమని పనిచేయండి. మీరు సర్వదా స్వస్థులై ఉండాలె. మీ దేహం ఎల్లప్పుడు, కార్య నిమగ్నత్వములో ఉండాలె. శరీరం జంగమధర్మాన్ని ఆత్మ స్థావర ధర్మాన్ని అవలంబించాలె. శరీరం స్థావరధర్మాన్ని స్వార్థంచేత అవలంబిస్తే, మనస్స్వాస్థ్యం పోతే కార్యాలన్నీ విఫలమౌతాయి. శాంతి కొరకే-నిర్వాణంకొరకే-కర్మ ననుష్ఠించు.

## ౨ స్వార్థత్యాగం

ఒక నదికీ, ఒక గుంటకు తగాదా వచ్చింది. ఆ గుంట ఇట్లు సంబోధించింది : "ఓ నదీ! నీవు చాలా మూర్ఖురాలవు. నీ సంపద నంతా సముద్రుడి కెందుకు సమర్పిస్తున్నావు? నే నొక చుక్కను గూడా పోనీయను. సముద్రుడు విశ్వాసద్రోహి. మన నీరు వాని కవసరంలేదు. నీ సర్వస్వాన్ని ప్రతిక్షణమూ, సముద్రునికే ఇచ్చివేస్తున్నా, దాని ఉప్పదనం ఒక వీసమైనా తగ్గడంలేదు, దాని గర్వము ఆవంతా తగ్గదు. అది ఒక అంగుళమైనా పైకి లేవడంలేదు. మన శ్రమంతా వృథా అవుతున్నది. బూడిదలో పోసిన పన్నీరులాగా అవుతున్నది". ఈ 'మా కాయువ్యం, మా కారోగ్యం, అనడం ప్రాపంచికజ్ఞానం. ఫలితాన్ని, లాభాలాభాలనుగూర్చి విచారించాలని గుంట నదికి బోధి

స్తున్నది. తన సంపద నంతా తానే ఉంచుకోవాలె నట! ఆ నదికి కొంత వేదాంతజ్ఞానమున్నది. అది ఇట్లు బదులు పల్కింది: "ఫలితంతో లాభాలతో నాకు నిమిత్తం లేదు. జయాపజయాలు నాకవసరంలేదు. నేను కర్మనే ప్రేమిస్తున్నాను. కనుక నే నీవిధంగానే పని చేస్తుంటాను. కృషియే నాలక్ష్యం. నిరంతర చైతన్యమే నాకు ప్రాణం. శక్తే నా సత్యాత్మ. నేను పని చేస్తూనే ఉంటాను". ఇట్లా నది ఎంత జలం ఆ సముద్రానికి అర్పించిందో లెక్కలేదు. దా న్నెవరు గణిస్తారు? పాప మా పీనాసి గుంట మూడు మాసాల్లో, ఎండిపోయింది. అది క్రుళ్ళు తోను, పురుగులతోను నిండిపోయింది. నది ఎప్పటివిధంగా శుభ్రజలా లతో పారుతున్నది. దాని ఉత్పత్తిస్థానము ఎప్పటికీ ఎండేదికాదు సముద్రాన్నుంచి నీరు మెల్లగా గ్రహింపబడుతున్నది. నీరు నదీమూలా నికి నిరంతరప్రవాహాన్ని ప్రసాదిస్తున్నది. ఆ బురదగుంట తత్వాము నామోదింపవద్దని వేదాంతము చెపుతున్నది. మీూకు, "నే నే మవు తాను? నాపని ఏమవుతుంది?" అని స్వార్థపరత్వముతో నిండిన చిన్ని బురదగుంటలే ఏడుస్తుంటాయి. పనికొరకే నీవు పని చేయాలి. పనే నీకు పరమావధి. ఐతే, లేనిపోని విచారాలు ని న్నెప్పుడూ బాధిం చవు. వాటినుండి నీవు ముక్తుడ వౌతావు. నీవు ప్రజలనుండి ఏమీూ కోరవద్దు. నీ పనినిగురించి జరిగే పూర్వపక్ష సిద్ధాంతాలకుగాని, సుముఖ విముఖ విమర్శనలకుగాని, విచారపడవద్దు. నీ పని జరుగు తుందా, జరగదా, అనే విచారముగూడా నీ కుండకూడదు. నీ పని పని చేయడమే. ఈ విధంగా నీవు నిష్కామంగా కర్మ చెయ్యాలె. కానీ సోమరివి కాకూడదు. అప్పు డద్భుతమైన కార్యం జరుగు తుంది. నిన్ను సర్వమోహాలనుండి, బలవద్రాగాదులనుండి, వ్యాధులనుండిగూడ తప్పించేది పనే అని నీ అనుభవము వల్ల నీ కెప్పుడూ తట్టలేదా? నిన్ను చెడుగునుండి రక్షించడమే గాక విశ్వాసముంచి చేసే కర్మవల్ల కలిగే ఆనందము, ముక్తి యొక్క అంశమే! అదే ప్రత్యక్షముగాసిద్ధించే ఆత్మజ్ఞానం. అది నిన్ను పవిత్రుని చేస్తుంది. నిష్కళంకునిగా చేస్తుంది. నీకు బ్రహ్మైక్యాన్ని ప్రసా దిస్తుంది. ఇలాంటి దివ్యసుఖమే, పనివల్ల గలిగే సత్యమైన బహుమానం. పనికి స్వార్థ ప్రయోజనాలను కల్పించుకోని, ఈ దివ్యైశ్వర్యాన్ని

మలినం చేయవద్దు. ఇట్టి వాంఛలు నీ అభివృద్ధిని అరికట్టి, నీ శాంతిని పోగొడతాయి. బాహ్యామోహాలూ, పారితోషికాలు, మీ పరిశ్రమ పటుత్వాన్ని, సారాన్ని తీసివేస్తవి. పనివల్ల మీకు కలిగే ఆనందం కన్న, ఘనతరమైన ఫలం వేరొకటిలేదు. కనుక 'నది' బోధించే త్యాగాన్ని సేవను గ్రహించడానికే నీవు కర్మ నాచరించాలి. తక్కిన పనికిరాని ఫలాలను సరకుచేయవద్దు. నీపై బాధ్యతనుగాని, బహుమానాలపై ఆశగానీ పెట్టుకోవద్దు. ప్రజలు "మొదట నీ వర్తనను సంపాదించుకో, తర్వాత కోరుకో" అని చెప్పుతారు. "నీ వర్తనే సంపాదించుకో, నీకు కోరికతో అవసరమే లేదు" అని వేదాంతం చెబుతున్నది. "గోడకు ఉపయోగించే రాయి, వీధుల్లో పడి ఉండడంలేదు. నీ కర్వాత ఉన్నప్పుడు సమస్తమూ, నీ పాదాలకడకే వస్తుంది. దీపము ప్రకాశించేటప్పుడు, పురుగులు వాటంతట అవ్వే వచ్చి వ్రాలుతుంటాయి. వాటి నెవరూ ఆహ్వానించడం లేదు. నిర్మలోదకాలు ప్రవహిస్తుంటవి. మనుష్యులు వారంతట వారే వచ్చి త్రాగుతుంటారు. ప్రవాహం వారికోరకు చూడాలా ? చంద్రోదయం కాగానే ప్రజలు తమంతట తామే వెన్నెల నాశ్లేషించడానికి పరుగిడుతారు. వారి నెవ్వ రాహ్వానిస్తున్నారు ? కృషి ! కృషి ! సంతతకృషివలన నీ దేహారాహిత్యాన్ని, సత్యాత్మయొక్క నిత్యసత్యతను గ్రహించు. ఈ విధముగా నీవు బాహ్యానికి కర్మక్షేత్రంలో మగ్నుడ వైనప్పుడే- నిర్వాణ సుఖాన్ని రుచిచూడ గల్గుతావు. నీ అహంకారాన్ని నీ వ్యక్తిత్వాన్ని నీ వీవిధముగా కర్మపీఠంపై బలి యిచ్చినప్పుడే జయం నిన్ను అనుసరిస్తుంది. ప్రజలు వారంతట వారేవచ్చి, నిన్నభినందిస్తారు. జీసస్ జీవించినంతకాలం ప్రజ లతన్ని సన్మానించలేదు. అతడు శిలువపై ప్రాణాలర్పించాడు. ప్రజ లతణ్ణి సేవించడం ఆరంభించారు. సత్యాన్ని పాతాళానికి అణగద్రొక్కండి ! అది యథాప్రకారంగా, మరల ప్రకాశిస్తుంది. బీజ మేదైనాసరే, మొదట భూమిలో నశిస్తేనేగాని, (బాహ్యశరీరం) మొలకెత్తడంలేదు. కనుక జయానికి రెండో సూత్రం త్యాగం, ఆత్మార్పణం, సన్యాసం. సన్యాసమంటే, దండకమండలాలు ధరించడమే కాదని గ్రహించాలి. ప్రతివాడు ప్రకాశవంతంగా ఉండాలనే కోరుతాడు. నీ వే విధంగా తేజస్వంతు డవుతావు? వస్తువులు తెల్లగా ఉండడానికి

కారణమేమిటి? త్యాగమే దీనికి కారణమని విజ్ఞానశాస్త్రం చెపుతున్నది. సూర్యకిరణాల్లో ఉన్న సప్తవర్ణాలున్నూ, వస్తువులపై బడతాయి. చాల వస్తువులు ఈరంగులన్నిటినీ తమలో ఇముడ్చుకొని, ఏదో ఒకరంగు మాత్రమే బాహ్యానికి త్రోసివేస్తున్నవి. అవి తమలో ఉంచుకొనక, త్రోసివేసేరంగునే, మనం దాని కాపాదిస్తుంటాము. అది దానంచేసే వర్ణంతోటే మనం దాన్ని చూస్తుంటాము. గులాబిపుష్పం మనకు ఎర్రగా కనుపిస్తుంది. కాని ఆ రంగు దానిలో లేనేలేదు. దానిలో తక్కినరంగు లన్నీ ఉన్నవి. కాని ఆరంగులు మన కేమీ కాన్పించడం లేదు. అవి దానిరంగులని మనం చెప్పనేచెప్పం. నల్లవస్తువులు అన్ని రంగుల్ని తమలోనే ఉంచుకుంటాయి. అవి ఒకరంగైనా తిరిగి దానం చెయ్యవు. కనుకనే అవి నల్లగా ఉన్నవి. వానికి త్యాగంలేదు. స్వార్థమే వానికి ఆ నల్లరంగు తెచ్చిపెట్టింది. తెల్లటి వస్తువులు ఒక్క రంగైనా తీసుకోవడంలేదు. అవి అన్నివర్ణాలను ఇచ్చివేస్తున్నవి. దాచుకొనేతత్వం వాటిలో లేదు. స్వార్థములేదు. అందుకనే అవి ధవళవర్ణంతో ప్రకాశిస్తున్నాయి.

నీవుకూడా అభివృద్ధిపొందాలంటే, స్వార్థత్యాగం చేయాలి. నిత్యత్యాగివి గావాలి. స్వతంత్రుడవై పనిచెయ్యి. దీనత్వాన్ని, ఆశను పోద్రోలాలి. నా దనే స్వామ్యబుద్ధిని విడనాడాలి. నీ శ్వాసకోశాలలో ఉన్నగాలి అందరిదీ కాదా? అదిగాక నీ శ్వాసకోశాలలో ఉన్న కొద్ది గాలినిమాత్రమే, నీ స్వంతమనుకోకపోతే వాతావరణమంతా నీదే అవుతుందికదా? నీ ఆస్తి ఇప్పుడు అనంతమవడంలేదా? ఈ విశ్వమంతా పూరింపబడిన ప్రాణవాయువును ఆనందంగా ఆస్వాదించు.

అహంభావాన్ని, గర్వాన్ని వదలిపెట్టు. నీ వేవస్తువును నీదని ఎప్పుడూ అనుకోవద్దు అది భగవంతునిది. అది నీ నిజాత్మది. ఇజాక్ న్యూటన్ ప్రపంచదృష్టిలో, గొప్పవాడెట్లయ్యాడు? కీర్తిశాలి ఏ విధంగా అయ్యాడు? అత డెలాంటి తత్వంలో పనిచేశాడో, అతని అవసానకాలంలో ప్రపంచానికి బహిరంగపడింది. ప్రపంచంలో ఉత్కృష్టపురుషుడివి నీవే అనిశ్లాఘిస్తే, ఆతడు ఈ విధంగా ఉత్తర మిచ్చాడు: 'అట్లనవద్దు. ఈ నా బుద్ధిలేక ఈ స్వల్పవ్యక్తి అఖండమైన

అపారమైన జ్ఞానసముద్రతీరాన చిల్లపెంకు లేరే చిన్నపిల్లవానిలాగా ఉన్నది'' ఆ పండితుడింకా సముద్రతీరాన చిల్లపెంకులే ఏరే పిల్లవాడే నట! స్వార్థాభివృద్ధికి ఆశింపక, 'నేను చేస్తున్నా' ననే అహంకర్తృత్వం లేకుండా అవ్యక్తంగా పనిచేసే తత్త్వమే నీ కపారశక్తిసామర్థ్యాలను, కార్యధురీణతను, ప్రసాదిస్తున్నది. ఇదే వేదాంతతత్వం.

నీకు అనేకవాంఛ లుండవచ్చు. అవన్నీ సఫలంకావాలనే నీ కుంటుంది. కాని, ఈ కోరిక లేవిధంగా సిద్ధిస్తవో నీవు గుర్తించాలి. వాంఛారహితుడ వైనప్పుడే అవి సిద్ధిస్తవి. బాణాలేవిధంగా పోతున్నవి? నీవు విల్లుచేతబట్టి, నారిని బాగా వెనకకు గుంజి బాణాన్ని సంధించి ఉంచుతావు. నీవు వింటిని త్రాటిని ఎందాక లాగిపెట్టిఉంచినా, బాణం శత్రువునుతాకడంలేదు. అది నీతోనేఉంటుంది. నీవా త్రాడువిడిచిపెట్టి నప్పుడే, బాణము, వాయువేగంతోపోయి శత్రుసంహారం చేస్తున్నది. నీ వెంతకాలం కోరుకుంటావో, వాంఛిస్తావో, కోరికలనుపట్టుకొని ఉంటావో, అంతకాల మా కోరికలు ఫలించవు. లక్ష్యమునుభేదించలేవు. నీవు వాంఛలను విడిచిపెట్టినపుడే వాంఛలు సిద్ధిస్తాయి.

ఇద్దరుసాధువులు పోతున్నారు. వారిలో ఒకడు డబ్బు కూడ బెట్టేగుణంకలవాడు. రెండోవాడుత్యాగి. రెండవవానికడ ఒక పైసైనా లేదు. వాళ్ళిద్దరూ, త్యాగాన్నిగురించి, ఆర్జననుగురించి చర్చించు కుంటూ, ఒక నదీతీరానికిచేరారు. అప్పటకప్పుడే సంజచీకట్లు క్రమ్ము కుంటున్నవి. వా రానదిని దాటవలెను. త్యాగాన్నిగురించి వాదించిన వాడివద్ద పైసకూడలేదు. రెండోవానివద్ద ధనమున్నది. అప్పుడు త్యాగియైన సాధు పీవిధంగా అన్నాడు: ''మనం శరీరంకోసం ఆలోచింప నవసరంలేదు. పడవవానికీయడానికి మనవద్ద పైసలేదు. భగవన్నామ స్మరణం చేసుకుంటూ మన మీరాత్రి నీ నదీతీరాన్నే సుఖంగా గడుపుదాము.'' ధనమున్నసాధువు ఈవిధంగా జవాబిచ్చాడు: ''మన మీరాత్రి యీా నదిగొడ్డునే ఉంటే, మనకు దిక్కెవరూ ఉండరు. ఈ ప్రాంతంలో ఊరులేదు. పల్లెలేదు. చివరకు ఒకకొంపైనాలేదు. మానవ శబ్దం వినిపించడంలేదు. మనల్ని తోడేళ్లు మ్రింగివేస్తాయి. త్రాచులు కరుస్తాయి. చలిబాధ పీడిస్తుంది. మన మవతలితీరానికి పోదాం.

(5)

నావద్ద డబ్బున్నది. మన యిద్దరికి పడవఖర్చు నే నిస్తాను. మనే మూవలితీరాన సురక్షితంగా నిద్రపోవచ్చు." ఇంతలో పడవవచ్చింది. వాళ్ళిద్దరూ రేవుదాటి అవతలివొడ్డుచేరారు. రాత్రి ఆ ధనికుడు (ప్రథమసాధువు) త్యాగి (రెండవసాధువు) నీ విధంగా మందలించాడు. "డబ్బుండడంవల్ల లాభం నీ కిప్పుడైనా తెలిసిందా? నేను డబ్బు దాచానుగాబట్టే, మన ఇరువురిప్రాణాలుదక్కినవి. ఈ దినం మొదలు నీ విక ఎప్పుడయినా త్యాగాన్నిగురించి ఉపన్యసించవద్దు. నీవలె నేను గూడా సన్న్యాసినైతే, మన మిద్దరం చలిచేత, ఆకలిచేత చచ్చిపోవల సిందేకదా?" అప్పుడా త్యాగి వాని కీవిధంగా ఉత్తరమిచ్చాడు: "నీ వాపైకం నీదగ్గరనే ఉంచుకుంటే, నీవు దాన్ని విడిచిపెట్టకపోతే, నీవా నావికునకు పైక మియ్యనియెడల, మన మక్కే చనిపోయేవాండ్లం. నీ డబ్బును నీవు త్యజిస్తేనేగదా మనం రక్షింపబడింది. నా జేబులోధనం లేదని నీవు నన్ను మందలింపవచ్చు. కాని నీజేబే నాజేబు. నా విశ్వాసమే నాకొరకు నీజేబులో ఆ పైకముంచింది. నే నెప్పుడూ బాధపడి ఎరుగను. నా కెప్పు డేది కావలసివచ్చినా, సమకూరుతునే యున్నది." ఈకథ మీాకేం బోధిస్తున్నది? నీ వాంఛలను నీ వెంత కాలం నీజేబులోనే ఉంచుకుంటావో అంతకాలం నీకు రక్షణఉండదు. శాంతీలేదు. నీకోరికను నీవు త్యజించినప్పుడే, నీకు ద్వివిధమయిన ప్రశాంతిచేకూరుతున్నది. తత్క్షణమే, శాంతిచేకూరుతున్నది. చివరకు నీ కోరికలన్నీగూడ ఫలిస్తున్నవి. నీవు బుద్ధిపూర్వకంగానో, అబుద్ధి పూర్వకంగానో, నీదివ్యతత్వంలో మగ్నుడవైనపుడే, నీ కోరిక లన్నీ ఫలోన్ముఖమాతున్నాయి.

## 3 ప్రేమ

ప్రేమ మూడవసూత్రం. అంటే విశ్వంతో సామరస్యం అనుభవించాలి. పరిస్థితులకు అతీతులమై ప్రవర్తించాలి. ప్రేమ అంటే, నీ ఇరుగుపొరుగుతో, నీకు సంబంధముండే ప్రతివానితో ఐక్యంకావడమే. ఏకత్వం అనుభవించడమే! నీవు దుకాణదారువైతే, నీ ఖాతాదారుల ప్రయోజనాలను నీ స్వప్రయోజనాలవలె చూచుకోవాలి. లేకపోతే, నీవు అభివృద్ధి పొందలేవు. చేయి ఇతరశరీరావయవాలతో ఐక్యం

పొందకపోతే దానికే కష్టంకలుగుతున్నది. ఒక కుడిచేయి తనలో తా నీవిధంగా తర్కించుకొన్నది; "నేను ఈ శరీరాన్నంతా పోషిస్తున్నాను. అన్నిపనులు నేను చేస్తున్నాను. నా కష్టంవల్ల ఇతరేంద్రియాలన్నీ సుఖపడుతున్నవి. నాసంపాదనంతా పొట్టకు సమర్పించడమూ, దానిద్వారా తదితరావయవాలకు పోవడం సమంజసంగా లేదు. నేనే సర్వం అనుభవించాలి" అని తలపోసి అన్నం తనచర్మంలోకి ఎక్కించుకున్నది. కాని ఇట్టి సంకుచితత్వంవల్ల దానికేమైనా ప్రయోజనముంటుందా? దానివల్ల చేయి లావెక్కింది. వాచింది. కాని వాపు బలంకాదు. ఆరోగ్యంకాదు. అది ఒక కందిరీగను తీసుకొని కుట్టించుకుంటే వాయడంలేదా? ఇతరేంద్రియాలకన్న, బలంగా ఉండడానికి మార్గమిదేనా? ఇట్టి స్వార్థపద్ధతులవల్ల, ఆత్మవంచనే జరుగుతుంది. స్వనాశనమే సంభవిస్తుంది.

ఈ ప్రపంచమంతా ఒక్కటే శరీరం. దానికి నీ శరీరం ఒకచేయి లాంటిది కనుక, నీవు జయం పొందాలంటే ప్రపంచమంతా వేరు, నేనొక్కణ్ణివేరు అనే పాక్షికబుద్ధిని పరిత్యజించాలి. చెయ్యి అభివృద్ధి పొందాలంటే, శరీరప్రయోజనమే తనప్రయోజనమని గ్రహించవలసి వచ్చింది. తన ఆత్మ మణికట్టు మొదలు, బుజాలకరకే బంధింపబడి ఉండలేదు. శరీరమంతా ఉన్నఆత్మ తనఆత్మే అని చేయి గుర్తింపలేకపోతే, స్వనాశనం సంభవిస్తుంది. నాకు విశ్వానికీ భేదంలేదు. విశ్వమే నేను, నేనే విశ్వం; నేనే దేవుడను మేమిద్దర మొక్కటే అని నీవు గ్రహిస్తేనేకాని, నీకు పరిపూర్ణజయ మెన్నటికైనా కలుగదు. భిన్నత్వం అనేకత్వం అనే తత్వాన్ని తెచ్చిపెట్టుకుంటే, ఈ బురదగుంటలోపడితే నీకు దుఃఖం, అశాంతి, రోగం మొదలైనవి తప్పవు. సమస్తాన్ని అనంత విశ్వాన్ని నేనే-అని గ్రహించినపుడే నీవు పరిపూర్ణుడ వవుతున్నావు. ముక్తుడ వవుతున్నావు. ఇదే అనుభవవేదాంతం. ఈ పవిత్రసత్యాన్ని, ఈ దివ్యతత్వాన్ని నీ వతిక్రమిస్తే, ఆ చేయివిధంగా నీవు బాధపడక తప్పదు. కాలరెడ్జి, బైరను అను ఆంగ్లేయకవులు ఈతత్వాన్నే బోధించారు. ప్రకృతితో సామరస్యమును కోల్పోయినపుడు, మానవుడు దుఃఖిస్తున్నాడు. 'నీ తోడివారితో, నీ వైక్యమయినపుడే, సమస్త

సౌఖ్యాలను పొందుతావు' అని వారు బోధించారు. "మానవపశు పక్ష్యాదుల నన్నిటినీ అత్యాదరంతో ఎవడు ప్రేమిస్తాడో, వాడే నిజ మైన భక్తుడు, భగవత్సేవకుడు. అణువు మొదలుకొని బ్రహ్మాండం వరకు, పిపీలికాది బ్రహ్మపర్యంతం, ఎవ డత్యాదరంతో ప్రేమిస్తాడో, వాడే యథార్థభక్తుడు; భగవత్సేవకుడు."

ఒకరాజు అడవికి వేటకిపోయాడు. ఆ వేటమధ్య అతడు తన పరివారంనుండి చీలిపోయాడు. సూర్యుడు ఆకాశములో మండి పోతున్నాడు. ఆ రాజుకు 'దాహం' మించిపోతున్నది. ఆ ప్రాంతంలో అతనికొక చిన్నతోట కనబడింది. అత డాతోటలో ప్రవేశించి, తోట మాలిని చూచి తన దప్పికతీర్చవలసిందని కోరాడు. ఆ తోటమాలి, అతడు రాజనేసంగతి ఎరుగడు. వాడు వెంటనే తోటలోనికి పరుగెత్తి కొన్ని దానిమ్మపండ్లరసాన్ని పిండి, ఒకగ్లాసునిండా పోసుకొనితెచ్చి రాజుకిచ్చాడు. రాజా రసమంతా ఒక్కగుటకలో త్రాగివేశాడు. కాని అతని దాహం తీరకపోవడంచేత, మరికొంతరసం తెచ్చిపెట్టమని అతణ్ణికోరాడు. మళ్ళీ వాడు తోటలోనికి పరుగెత్తుకొని వెళ్ళాడు. తోట మాలి పరుగెత్తుక వెళ్ళిపోగానే, రా జీవిధంగా తలపోయడం ప్రారంభిం చాడు. "ఆహా! ఈ వనం చాలా ఫలవంతమైందిగా నను పిస్తున్నది. ఒక్క అరనిమిషంలో వీడు నా కొక పెద్దగ్లాసునిండా పండ్లరసం తెచ్చిపెట్టాడు. ఈ తోటయజమానికి, మన మెంత రాబడిపన్ను విధించినా విధించవచ్చు." అతి డీవిధంగా ఆలోచిస్తున్నాడు. ఈసారి తోటమాలి ఎప్పటికీరాలేదు. ఒకగంట గడచిపోయింది. అత డింకా రాలేదు. రా జాశ్చర్యపడుతున్నాడు. "నేను తోటలోనికి వచ్చి నపుడు, ఇతడు అరనిమిషంలోనే గ్లాసునిండా రసం తెచ్చిపెట్టాడు. ఇపుడు గంటకాలమైనా, ఆ గ్లాసునిండలేదా? ఏమికారణం? అని అతడు తర్కించుకొంటున్నాడు. చివరకు తోటమాలివచ్చాడు. కాని ఈసారి రసం గ్లాసునిండాలేదు. రా జాతోటవాణ్ణి దానికి కారణ మేమి టని ప్రశ్నించాడు. ఆ తోటమాలి ఒకజ్ఞాని. అతడు వెంటనే ఈ విధంగా ప్రత్యుత్తరమిచ్చాడు.

"నేను మొదటిగ్లాసులో, రసం తేవడానికిపోయినప్పుడు, మా రాజుగారి ఉద్దేశాలు సదుద్దేశాలుగనే ఉన్నవి. కాని రెండో పర్యాయం వెళ్ళినపుడు, ఆయన ఉద్దేశాలు మారిపోయి ఉండాలి. నిత్యఫలరసవంతమైన నావనం ఒక క్షణంలో ఈ విధంగా మారిపోవడానికి నే నింతకన్నా మరోకారణం ఊహింపలేను." రా జామాట విని ఆశ్చర్యపడ్డాడు. అతడు మొదట తోటలోకివచ్చినపుడు, అచటి ప్రజలు చాలా కష్టిస్తారనీ, వాండ్లు భాగ్యవంతులుకారనీ, వారికి సహాయం చేయడము తనధర్మమనీ తలంచాడు. వారిని ప్రేమించాడు. కాని ఆ తోటమాలి కొద్దికాలంలోనే గ్లాసునిండా పండ్లరసం తేవడంలోనే రాజుయొక్క బుద్ధి మారిపోయింది. ప్రేమపోయి ద్వేషం, స్వార్థం తలయెత్తింది. ఈ విధంగా అచ్చటిప్రకృతిని ద్వేషించడంతోడనే, దానిమ్మచెట్లుకూడా తమ ఫలరసాలను మాయంచేసినవి. నీ వీ విశ్వంతో, సామరస్యం అనుభవిస్తే ఈ సర్వాన్నీ నీ స్వరూపమే అని గ్రహిస్తే, సమస్తపరిస్థితులు సమస్తభూతాలు నీ ఆజ్ఞలనే సిరసావహిస్తవి. నీలో విశ్వసామరస్యం ఎప్పుడు నశిస్తుందో, ఆక్షణంలో నీ బంధుమిత్రులు నీకు ఎదురు తిరుగుతారు. ఈ ప్రపంచమంతా, నీతో ఢీకొంటుంది. ప్రేమే సమస్తానికి మూలం. ప్రేమే జయానికి ముఖ్య సూత్రం.

## ౪ ప్ర స న్న త

స్వస్థత, లేక ప్రసన్నత నాల్గవసూత్రం. ఇది ఏ విధంగా లభిస్తుంది? "స్వస్థులు కాండి. ప్రసన్నులు కాండి. ఎట్టి విపరీత పరిస్థితుల్లోనైనా శాంతి ననుభవించండి" అని బోధించడం సులభమే. కాని అట్లు చేయడం బహుకష్టం. అట్లుండవలె నని శాసనం చేసుకున్నంతమాత్రాన లాభం లేదు. మనం సర్వదా ఆనందంగా ఎట్లుండగలం? మన సంతోష విచారాలకు మూలకారణమేమిటి? మనం మనశరీర దృష్టికి- విషయ వికారస్థితికి దిగజారినప్పుడు ఆనందవిహీనులమై, నిరంతర విచారగ్రస్తులమై, దుఃఖభాజనులమై, శోకభయార్తులమైపోతాము.

అప్పుడే మన స్వస్థత చెడిపోతుంది. మనకు కడుపునొప్పి వచ్చినపుడే కడుపుభారం తెలియవస్తున్నది. జలుబు చేసినపుడే ముక్కు మనకు భారమవుతున్నది. చేయి వాచినపుడే మన కది భారమవుతున్నది. మనకు ఆధ్యాత్మికప్రసన్నత్వం చెడిపోయినపుడే వ్యక్తిజ్ఞానం-శరీరభారం- కలుగుతున్నది. దైహికలాలసత్వాలు విజృంభించి, వ్యక్తి భోగాలకొరకు మనస్సు క్షోభించేకొద్దీ ఆధ్యాత్మిక విహీనతారోగం ప్రబలమవుతుంటుంది. మనం శరీరదుర్బలత్వానికి స్వాధీనమైనకొద్దీ మహదానందానికి, స్వర్గానికి దూరమవుతుంటాము. ఆత్మస్థితినుండి పతితులమవుతాము. భిన్నత్వం, అనేకత్వం అనే ఫలరసాలను మనం గ్రోలితే, ఆ క్షణమందే స్వర్గకవాటాలు బంధింపబడుతాయి. మన దేహభ్రాంతిని దహించినపుడే. శరీరజ్ఞానం గతించినపుడే మనం తిరిగి స్వర్గస్థితిని పొందగలం. కామ క్రోధాదులనుండి ముక్తుల మైనప్పుడే, నీ సంపూర్ణ ప్రశాంతి నీకు చేకూరుతుంది.

కనుక వేదాంతబోధలలోని ప్రధానసూత్రమూ, సనాతన తత్వమూ ఐన 'తత్వమసి! నే నాత్మను-అదొక్కటే సత్యం' అనేదాన్ని అనుభవానికి తెచ్చుకున్నప్పుడే. బ్రహ్మానందం, పరమస్వస్థత కలుగుతున్నది. నీ వాత్మీయుడవై ఉన్నప్పుడే, ఈ మిథ్యా ప్రపంచ పరిస్థితులన్నీ నీ కంతర్ధానమై పోతవి. అదృశ్య మవుతవి. నే నీ శరీరాన్ని కాను, ఈ శరీరానికి సంబంధించిన వన్నీ, తత్సంబంధబాంధవ్యా లన్నీ క్రీడావస్తువులు. మన బాంధవ్యమంతా నాటకరంగంలో పాత్రలకుండు బాంధవ్యంలాంటిది. నే నొకపాత్ర ధరించినపుడు నా కొకడు స్నేహితుడు. ఒకడు శత్రువు. ఒకడు తండ్రి. ఒకడు కొడుకు. ఈ విధంగా అనేకసంబంధా లుంటాయి. కాని నిజానికి నేను తండ్రినిగాను, కొడుకునుగాను, స్నేహితులు స్నేహితులుగారు. శత్రువులు శత్రువులుగారు. నేను బ్రహ్మను. ప్రాపంచికసంబంధాలు నన్ను బాధించవు. ఈ జగన్నాటకంలో పాత్రధారు లందరూ తమతమ పాత్రల్ని యథోచితంగా నిర్వహించాలి. కాని నాటకంలో చూపు రాగద్వేషాలనే ఎవడు నిజంగా తనకు చెందినవిగా తలుస్తాడో వాడు పిచ్చివాడు. ఈ ప్రపంచమంతా ఒక నాటకరంగమైఉంటే, నేను నిర్వహించవలసిన బాహ్యాధర్మాలకు,

ఎందుకు ఇంత అనవసరప్రాముఖ్య మియ్యాలె? ఒకడు రాజైతే అతన్ని చూచి నేనెందుకు అసూయపడాలి? ఒకడు బిచ్చగాడైతే అతణ్ణి నేనెందుకు ద్వేషించాలి? "మన భాగ్యభోగ్యాలనుపట్టి ఉత్తములంగాని, నీచులంగాని కాజాలం. నీ స్వధర్మాన్ని నీవు యథాశక్తిగా నిర్వహించు. అదే ఘనత; ఉత్కృష్టత!"

నీ పరిస్థితులకూ, పరిసరాలకు విచారించవద్దని వేదాంతం బోధిస్తున్నది. సత్యాన్ని తెలుసుకో. నిర్భయుడవుకా. న్యాయమూర్తి సభనలంకరిస్తాడు. అంతకుముందే కక్షిదార్లు, న్యాయవాదులు, గుమాస్తాలు పరివారమంతా అతనికోసరం వేచి ఉంటుంది. న్యాయాధికారి న్యాయవాదుల్నిగాని, ఫిర్యాదీలనుగాని, తదితరులనుగాని పిలువనవసరం లేదు. అతడు గదులు ఊడువనక్కరలేదు. దుమ్ము దులపనవసరంలేదు. బల్లలు, కుర్చీలు అమర్చనవసరంలేదు. నదులు, వృక్షాలు, పక్షులు, జంతువులు మొదలైన సమస్తప్రకృతి సూర్యసందర్శనమాత్రాన, జాగరితమైనట్లు, ఆ న్యాయమూర్తి రాక సర్వసభికులను ప్రబుద్ధులనుచేస్తుంది. అట్లే నీవు నీ యథార్థతత్వమున స్థిరుడవై ఉంటే, ఆ న్యాయమూర్తివిధంగా ఏపక్షం వహించని ధర్మపీఠ మలంకరిస్తే, నీ ఆత్మ తన దివ్యకాంతులతో ప్రకాశిస్తే, పరిసరాలన్నీ తమంతటతామే మేల్కొంటవి. నీ దివ్యతేజంముందు అన్నీ క్రమంగా ఉంటవి. అనన్యభారతయోధుడైన శ్రీరాముడు సీతాన్వేషణార్థం (అంటే దివ్యజ్ఞానం) బయలుదేరినప్పుడు నదులు, గిరులు, పక్షులు, వానరాలు, ఉడుతలు, రాళ్ళుకూడా ఆయనకు సహాయభూతాలైనవి. పంచభూతాలాయనకు సేవచేసినవి. నీ నిజప్రకాశంతో నీ ఆత్మ దీప్తితో నీవు జ్వలిస్తే, సమస్తదేవతలు, సమస్తశక్తులు, నీకు బానిసల్లాగ పనిచేయకపోతే వారికి చేటుకాలం సంభవిస్తుంది! ప్రతివాడు పసిపిల్లల్ని దేనికి ప్రేమిస్తాడు? పిల్లవాడు ఎంత ఆజానుబాహుని తలపైనైనా ఎక్కి త్రొక్కుతున్నాడు. నిరంకుశులకు అతడు నిరంకుశుడవుతున్నాడు. ఎంతటి కీర్తిశాలినైనా, వాడు జుట్టుపట్టుకొని లాగుతాడు. ఇదేవిధంగా జరుగుతున్నది? శిశువు పరిస్థితుల కతీతుడై తనకు తెలియకుండానే దివ్యత్వంలో సంస్థితుడై ఉండడమే దీనికి కారణం.

నీ ధర్మాన్ని నీవు నిర్వర్తిస్తే, నీ కార్యంలో నీవు భక్త్యుత్సాహాలు చూపితే, బాహ్యసహాయాన్ని గురించి నీవు చింతింపనవసరంలేదు. సహాయం తనంతటదే నీకోసం వెతుక్కుంటూవస్తుంది. నీవేదైనా ఉపన్యాసం ఇస్తే, దానిలో జాగ్రత్తపరచాలసిన మహా విషయాలుంటే, దాన్నెవరు వ్రాసుకుంటారు? ఎవరు ప్రచురిస్తారు? అనే ఆందోళన నీకవసరంలేదు. నీవొక న్యాయమూర్తిలాగ, సుస్థిరుడవై ఉండు. నీమహత్త్వంలో నీవుండు. బాహ్యవిషయాలకు, పరిస్థితులకు అంటకుండా నిలువు.

నీ శరీరంలో ఎచ్చటైనా జిల బైలుదేరుతుంది. వెంటనే నిద్దరలోనైనా నీచేయి, తనంతట తాను అచటికిపోయి గోకుతుంది. ఎందువల్ల? చేతిలోవున్న ఆత్మశక్తి, దురదపుట్టిన స్థలంలోఉన్న ఆత్మశక్తి ఒకటే. అదేవిధంగా నీలో వున్న ఆత్మశక్తే, నీ పరిసరాల్లో కూడా ఉన్నది. పరమాత్మతో నీమనస్సు ఏకీభవించి ఉన్నప్పుడే-ఈ ప్రపంచమంతా నీ శరీరమైనపుడే - బాహ్యసహాయాలన్నీ తమంతట తాము చేయి దురదపుట్టిన స్థలానికి పరుగెత్తునట్లు పరుగెత్తుకొని వస్తాయి.

నీడకొరకు దానివెంట పరుగెత్తినపుడు మనం దాన్ని ఎన్నడూ పట్టుకోలేం. ఇది మనకంటె ముందు పరుగెత్తుతుంటుంది. మనం సూర్యునికభిముఖులమై మన వీపులు వెనుకకు తిప్పగానే నీడ మనల్ని కుక్కలాగ వెంటాడుతుంది. అట్లే నీవు బాహ్యవిషయాలను పట్టుకోవాలని పరుగెత్తినంతకాలం, నీకన్నా అవి ముందు పరుగిడుతుంటాయి. నీ కవి అందకుండా పోతుంటాయి. కాని నీవు వానికి విముఖుడవైనంతనే, జ్యోతిర్జ్యోతియైన ఆత్మజ్యోతి కభిముఖుడవు కాగానే, సుముఖపరిస్థితులన్నీ వాటంతట అవ్వే నీకోసం వెతుక్కుంటూ వస్తాయి. 'విధ్యుక్తధర్మం' అనేమాట కొంతమందికి ప్రాణాంతకంగా ఉంటుంది. వా రామాట వినడంతోటే వివర్ణులౌతారు. అదొక దయ్యంలాగ వాళ్ళను బాధిస్తుంటుంది. వెంటాడుతుంటుంది. దానివల్ల వారికి శాంతి ఉండదు. నిమిషమైనా విశ్రాంతి ఉండదు. అది వారిపై కెక్కి త్రొక్కుతుంటుంది. అట్టి తొందరపాటు చూపే బానిసలు విధ్యుక్త ధర్మానికి

కీలుబొమ్మలైనవా రెంతశక్తిని గడిస్తారో అంతశక్తిని పోగొట్టు కుంటారు. 'విధ్యుక్త' కర్మ నిన్ను నీ స్వస్థానంనుండి, నీ ఆత్మానందం నుండి పదభ్రష్టుని చేయకూడదు. ఈ విధ్యుక్త క్రియలన్నీ నీకు నీవు పైనవేసికొన్నవే. నీకు నీవే యజమానివి. నీ స్థితిని నీవే నిర్మించు కున్నావు. సేవకత్వాని కొడంబడి నీపై అధికారుల్ని నీవే నిర్మించు కున్నావు. నీవు వారి ధనాన్ని ఆశించినమాట నిజమే. కానీ వారు మాత్రం నీసేవ ఆశించడంలేదా? ఒకరిపై ఒకరు ఆధారపడియుండడం వల్ల ఇద్దరికి సమానప్రపత్తే ఉంటుంది. నీ ఇచ్ఛనే నీవు సేవిస్తున్నావు. నీ ప్రస్తుతపరిస్థితులన్నీ నీ సృష్టే! ఈ స్వల్పప్రపంచ బాంధవ్యాలన్నీ నీ నిర్మాణాలే! నీ భవిష్యత్తుకూడా నీ కృత్యమే. కాని ఇతరంకాదు. నీ విధికి నీవే యజమానివి. దీన్ని గ్రహించు. ఆనందమనుభవించు!

మంచిగాని, చెడుగాని మన భవిష్యత్తును మనమే నిర్మించుకుంటు న్నాము. భావమే విధికి నామాంతరం. కనుక నీ విధిని నీవే నిర్ణ యించుకో. తన పరిస్థితులకు మనస్సే యజమాని. స్థిరుడవు, శాంతు డవు, శ్రద్ధాళుడవు కా! భయానికి భయమే శత్రువు. నీలో వున్న భగవంతుడు, లేక ఆత్మ విపరీతపరిస్థితులను, 'ఆగండి. విధేయులుగా ఉండండి' అని ఆజ్ఞాపిస్తుందిగాక! నీ ఇచ్ఛ నెరవేరుతుంది.

నీ పనిని విధిలేకచేసే కూలివానిలాగా గాక, బంతి ఆడే రాజ కుమారునిలాగా ఆనందంకొరకే నిర్వహించాలె. భయకంపితుడవై, నీవు ఏ పనినీ ప్రారంభించవద్దు. ఆత్మస్థితుడవై ఉండు. రాజులు, అధ్య క్షులు మొదలైనవా రంతా నీకు సేవకులని గ్రహించు. నీవు తారా గణంవలె పనిచెయ్యి. బాధ్యతాభారాన్ని నీనెత్తిపై వేసుకోవద్దు. ప్రతిఫలాన్నాశించకు. అధికారాలకు నీవధిపతివై నిలువు. నీకు నీవే అధిపతివి. విధులుగాని బాహ్యాధికారాలుగాని, నీ యానందాన్ని కప్పివేయగూడదు.

## ౫ నిర్భయత్వం

నిర్భయత్వమంటే ఏమిటి? మాయను విశ్వసింపక సజీవజ్ఞానాన్ని కలిగియుండడం; సత్యాత్మలో సంపూర్ణ విశ్వాసమును కలిగిఉండడం.

అన్నిభయాలకు నిలయమైన ఈ దేహమే మన మని భావించినప్పుడే, మనకు భయం కలుగుతున్నది.

ఈ శరీరా న్నెప్పుడు బాధావిచారము లనే కీటకాలు తిని వేస్తుంటాయి. ఈ యల్పదైహికజ్ఞానా న్ని వీడినప్పుడే మనం నిర్భయుల మవుతున్నాం. దివ్యజ్యోతివై జీవించు! వేదాంతము ననుష్ఠించు. ని న్నెవరూ స్పృశింపలేరు. నీకెవ్వరూ కీడుచేయలేరు. నిర్భయత్వమే వేదాంతం. వేదాంతమే నిర్భయత్వం!

జయానికి నిర్భయత్వం ఏవిధంగా ప్రాముఖ్య మవుతున్నది? నా అనుభవమే మీా కుదాహరణంగా చూపుతాను. రాముడు హిమాలయారణ్యాలల్లో తిరుగాడుతుంటే, ఒకప్పుడు అయిదు ఎలుగు బంట్లు అడ్డంవచ్చాయి. కాని వానివల్ల రాముడి కెలాంటి ఆపద కలుగలేదు. దీనికి కారణమేమిటి? నిర్భయత్వం! నే నీశరీరాన్నిగాను. నే నీమనస్సునుగాను. నేను పరమాత్మను, దివ్యత్వమును అనేతత్వమే రాముని శరీరమంతా నిండివున్నది. "అచ్ఛేద్యో౽య మదాహ్యో౽య మక్లేద్యో౽శోష్య ఏవచ."

వాటిని రాముడు తీక్ష్ణంగా చూడడంతోటే అవి పరుగెత్తినవి. ఒకసారి ఒక అడవితోడేలు పారిపోయింది. మరొకసారి ఒక పెద్దపులి కాలికొద్దీ పరుగెత్తింది. పిల్లినిచూచి పావురం కండ్లుమూసుకుంటుంది. తాను పిల్లిని చూడ్డంలేదుకదా, పిల్లిగూడా తన్ను చూడడంలేదని అది భావిస్తుంది. ఇంతలో పిల్లి దానిపైబడి మింగివేస్తుంది. నీవు భయ పడితే, పిల్లిగూడా నిన్ను మింగుతుంది. నీ వేమాత్రం భయంచూపించినా కుక్కలుగూడా నీపైబడి చీల్చివేస్తాయి. మనం నిర్భయులమైతే, పులులు, సింహాలుగూడా మచ్చికగావచ్చు. మనం ఒకపాత్రనుండి మరొకపాత్రలోకి నీరుపోసేటప్పుడు, చేయి ఏమాత్రం వణికినా, నీరంతా క్రిందనేపడిపోతుంది. నిర్భయముగా, వణక్కుండాపోస్తే ఒక చుక్కయినా క్రిందపడదు.

సంశయంచేత, భయంచేత, నీదుఃఖాన్ని నీవే తెచ్చుకుంటు న్నావు. నీసమత్వాన్ని ఏదీ భంగంచేయలేదు. విశ్వమంతా నీవే. శరీర

లంపటత్వమే భయానికి మూలకారణం. కనుక ఇట్టి సక్తతను నాశనం చేయాలి. ఈ నూటయేబదిపౌనుల శరీరం ఒక చిన్న ఎలుకనుచూచి, కదిలే చిన్న ఆకునుచూచి, చివరకు నీడనుచూచి భయపడుచుండడం ఎంత విషాదకరం! దుఃఖాలకన్నా దుఃఖమయిన భయమే మహానరకం. నేను చనిపోవడానికి ఇష్టపడతాను గాని, మరణానికిమాత్రం ఎన్నడూ భయపడను.

నీ మనస్సులో లేనిదేదీ నీకు ప్రాప్తించదు. నీ మనస్సులో ప్రేమ వుంటే నీకు సర్వత్రా ప్రేమే కనబడుతుంది. ద్వేషముంటే, నీకోసం ద్వేషమే ఎదురుచూస్తుంటుంది. నిన్ను వంచకులు మోసం చేస్తారని భయపడితే, తప్పక నిన్ను వంచించేవాండ్లు బయలుదేరుతారు. స్వార్థపరులు, మోసగాండ్రు నిన్నేమిచేస్తారో అని భీతిల్లితే వాండ్లు అన్ని దిక్కులనుండి గుంపులుగా వచ్చి నీ పైన బడతారు. నిర్భయత్వమే నీకు పట్టుగొమ్మ. నీ హృదయంలో ఎప్పుడు పవిత్రతే నిల్చుగాక! అప్పుడు నీకు అమంగళం ఎన్నడూ జరుగదు. జీవిత విజయం- ఆధ్యాత్మిక విజయం- ఈరెండూ ఒకటే. వీనిని విడదీయనెంచే వాండ్లు విభ్రాంతులు.

తగిన బందోబస్తు లేనప్పుడే, దొంగలు ఇంట్లో ప్రవేశిస్తారు. ఇంట్లో దీపం వున్నంతసేపూ వారు జొరబడరు. నీ హృదయంలో సత్యదీపం జాజ్వల్యంగా ప్రకాశిస్తుంటే, భయమోహాలనే దయ్యాలు నిన్నెప్పుడూ బాధింపవు. ఈ దివ్యతత్వాన్ని నమ్ము! ప్రాపంచికజ్ఞానంతో ప్రేలాడుతూ మీ జీవితాలను దుర్భరంగా చేసుకుంటారు! పిరికితనంలో కలసి మెలుకువచే మీరు శుద్ధనాస్తికులే అవుతారు. పరిస్థితులనే మాయా మేఘాలు మిమ్మెందుకు ఆవరించాలి? నీవు సూర్యులకల్లా సూర్యుడవు గాదా? నీవు విశ్వనాథుడవుగావా? నీముందర, పరుగెత్తక, మాయంగాక, పరాజయ మొందక, అంతర్ధానంగాక నిలబడే పరిస్థితులు ఏ మున్నవి? ఎట్టి భయంకరపరిస్థితిగూడా, యథార్థం కాజాలదని ముమ్మాటికి నమ్ము. నిర్భయత్వం! నిర్భయత్వం! నీవే నిర్భయత్వం!

## ౬ ఆ త్మ వి శ్వా స ము

ఆత్మవిశ్వాసం ఆరవసూత్రం. ఏనుగు సింహానికన్నా చాలరెట్లు పెద్దది. సింహశరీరంకన్నా ఏనుగ శరీరం ఎంతో బలిష్ఠంగా కనబడు తుంటుంది. అయినా ఒక్క సింహం ఏనుగుల తండాన్ని ఒక్క వ్రేటుతో అదల్చివేస్తుంది. సింహానికి ఇంత శక్తి ఎక్కడనుండి వస్తు న్నది ? దీనికి రహస్యం సింహం అనుభవవేదాంతి; ఏనుగులు ద్వైతులు. ఏనుగులు తమ దేహమందే నమ్మక ముంచుతాయి. సింహం శరీరం గాక, దానికన్నా ఉత్కృష్టమైన ఆత్మనే విశ్వసిస్తుంది. సింహ శరీరం చిన్నదైనా తన ఆత్మశక్తి అనంతం, అఖండం అనే అది విశ్వసిస్తుంది. ఏనుగ లెప్పుడూ వందలకొద్దీ, ఒక గుంపుగా నివసిస్తూ, నిద్రించే టప్పుడు, కొన్నిటిని కాపలా ఉంచుతవి. శత్రు వెప్పుడు వచ్చి మీద పడతాడో అని ఎప్పుడూ భయపడుతుంటాయి. ఆత్మవిశ్వాసమే ఉంటే, తమలో ఏ ఒక్కటో వేలకొద్దిసింహాలను నలగద్రొక్కగలదు- అనే జ్ఞానం వాటికి శూన్యం.

ఆత్మవిశ్వాసమే ఆనందప్రధానసూత్ర మని దీనివల్ల తేటపడడం లేదా ! "నేను పాపిని. నేను మూర్ఖుణ్ణి. నేను నీచుణ్ణి. నేను దీనుణ్ణి" అని దీనాలాపాలు చేయ వద్దనే వేదాంతం బోధిస్తున్నది. నీ ఆత్మ శక్తిని విశ్వసించు. నీవు అనంతుడివి. అఖండశక్తివి. పరబ్రహ్మ స్వరూపుడివి. నీవు దీన్నే నమ్మాలె. ఆహా! ఎట్టి దివ్యసత్యం! నీవు బాహ్యాన్ని విశ్వసిస్తే విఫలుడవుగాక తప్పదు.

ఇద్దరు అన్నదమ్ములు ఒక న్యాయస్థానంలో న్యాయాధికారి యెదుట హాజరు కాబడ్డారు. వాళ్ళల్లో ఒకడు లక్షాధికారి, మరొకడు భిక్షాధికారి. న్యాయమూర్తి, ఆ లక్షాధికారిని ఆతడావిధంగా ధనవం తుడుగా ఉండడానికి, ఆతని సోదరుడు ధనహీనుడుగా ఉండడానికి కారణ మడిగాడు. అత డీ విధంగా బదులు చెప్పాడు.

"అయిదేండ్లక్రితం మేము సమాన పిత్రార్జితాన్ని పంచు కొన్నాము. చెరి ఏభైవేల డాలర్లు మాకు వచ్చినవి. ఇతడు చాల ధనికుడననే గర్వంతో, (కొంతమంది ధనికులు పనిచేయడమే తమ గౌర

వానికి లోటని తలుస్తారు). సోమరిపోతైతే ఏపనైనా నౌకర్లకే వదలి పెడుతుండేవాడు. ఉత్తరమేదైనా వస్తే, దాన్ని నౌకరుకిచ్చి, 'వెళ్లండి. ఈ పని చూడండి' అని చెప్పుచుండేవాడు. అతడు కాలమంతా భోగ లాలసత్వంతో గడిపేస్తుండేవాడు. నౌకర్లు చెప్పాను, 'పోండి, పోండి. ఆ పని చేయండి' అని ఆజ్ఞాపిస్తుండేవాడు". తన్ను గురించి అతడిట్లు చెప్పాడు : "నాకు ఏబది వేల డాలర్లు వచ్చినపుడు, నా వ్యాపారం ఇతర్లకు ఒప్పజెప్పలేదు. ప్రతిపని నేనే స్వయంగా చేసుకుంటుండేవాణ్ణి. నే చెప్పాను నౌకర్లను, 'రాండి! రాండి! నేను చేసేట్లు చేయండి' అని చెప్పుతుంటాను. నా సోదరు డెప్పుడు 'పోండి! పోండి!' అనే పలుకు తుంటాడు. అట్లే అతని ఆస్తి అంతా పోయింది. నౌకర్లు, స్నేహితులు ఆస్తి, చివరకు సర్వైశ్వర్యాలు తొలగిపోయినవి. 'రండు. రండు' అన డమే నా సూత్రం. స్నేహితులు చేరారు. ఐశ్వర్యం అభివృద్ధి అయింది. సర్వం సమృద్ధమయింది".

మనము ఇతరులపై ఆధారపడియున్నప్పుడు 'వెళ్ళండి, వెళ్ళండి' అంటుంటాము. దానితో సర్వం వెళ్ళిపోతుంది. మనకై మనం ఆధార పడినప్పుడు, మన ఆత్మనే మనం విశ్వసించినపుడు సర్వం మనకు చేకూరు తుంది. నేను దీనుణ్ణి, పాపిని, కీటకమువంటివాణ్ణి అని నీవనుకుంటే, నిస్సందేహంగా నీ వావిధంగానే అవుతావు. నిన్ను నీవు గౌరవించు కుంటే, నీ ఆత్మవిశ్వాసాన్ని వీడకుంటే నీవు మహాత్ముడవు గడిస్తావు. 'యద్భావం తద్భవతి'.

ఒక పరీక్షాధికారి, ఒక పాఠశాలను పరీక్షించడానికి వచ్చాడు. ఒక విద్యార్థినిచూపి ఉపాధ్యాయుడు ఇతడు చాలమేధావి అనీ, చాలా సాహిత్యం గలవాడనీ, పెద్దపెద్ద గ్రంధాలనే కంఠస్థంచేశాడనీ చెప్పాడు. ఆ పిల్లవాణ్ణి పరీక్షాధికారి యెదుటపెట్టాడు. పాప మా పిల్లవాడికి వేదాంతజ్ఞానం లేదు. అతనికి తెగ సిగ్గు. పరీక్షాధికారి, 'నీకే గ్రంథం కంఠస్థమైందా?' అని ప్రశ్నించగానే, 'లేదు, నా కేమీ రాదు. నేను మూర్ఖుణ్ణి' అని చెప్పాడు. ఆమాటలు వినమ్రతాసూచకాలని అతని తలంపు. పరీక్షాధికారి మళ్ళీ మళ్ళీ అతణ్ణి ప్రశ్నించాడు. ఎన్నిసార్లడి గినా అతడావిధంగానే చెప్పాడు. ఉపాధ్యాయుడు తెల్లబోయాడు.

మరొక పిల్లవాడు, పుస్తకాలు సొంతంగా పఠించకపోయినా, "నేను చదివాను. నన్నెక్కడ ప్రశ్నించినా నేను చెప్పగలను" అని అదురు బెదురు లేకుండా చెప్పాడు. పరీక్షాధికారి అతన్ని అనేకచోట్ల ప్రశ్నించాడు. అత డన్నిటికి సరియైన సమాధానమిచ్చాడు. అతనికే బహుమానమీయబడింది. నీవు నీకిచ్చుకునే విలువకన్నా, ఎక్కువ విలువ నీకెవ్వరూ ఇవ్వరు.

ఒకనా డొక వేదాంతి ఇంటి కొకమనిషి వెళ్ళాడు. ఆ వేదాంతి ఇంట్లో లేకపోవడంచేత, అతడు ఆ యజమానిపీఠం తా నధిష్ఠించాడు. కొంతసేపటికి యజమాని వచ్చాడు. ఆ యజమానిని చూడడంతోటే, "ఓ వేదాంతశిఖామణి! దేవుడనగా ఎవరు? మానవు డనగా ఎవడు?" అని ఆ నూతనవ్యక్తి ప్రశ్నించాడు. ఆతడు ఆతని కెట్టి సమాధానం ఇవ్వకుండా, తన నౌకర్లనుపిలచి, వాళ్ళపై బిగ్గరగా కేకలువేస్తూ, ఆ కొత్తమనిషిని ఇంటినుండి పంపండని ఆజ్ఞాపించాడు. ఆతడు భయభ్రాంతుడై, ఆ పీఠంవదలి పిల్లివిధంగా క్రిందికి జారాడు. ఆ వేదాంతి వెంటనే తన పీఠాన్నెక్కి, (తన్నుచూపి) భగవంతుడివే అయ్యేవాడివి. నీ భయం, నీ దివ్యత్వాన్ని నమ్మకుండడం, ఇవే నిన్ను దీనుణ్ణి చేసినవి. నీవు బాహ్యంపై ఆధారపడినంతకాలం విఫలుడవౌతావు. నీ అంతరంగంలోవున్న దేవుని విశ్వసించు. నీలోని దివ్యత్వమును విశ్వసించు. జయం నిజం. పర్వతం మహమ్మదుదగ్గరకు రాకపోతే, మహమ్మదే పర్వతందగ్గరకుపోతాడు. ఒకమానవుడు చాలా ఆకలిగొనివున్నాడు. అతడు తన ఆకలి తీర్చుకోవాలి అని ఒకచెట్టుక్రింద కూర్చొని, కండ్లుమూసుకొని, అన్నందింటున్నట్లూహిస్తూ లొట్టలు వేస్తున్నాడు. ఈ విధంగా కొంతసేపైనతర్వాత, అతడు నోరుకారంగా ఉండడంచేత వగర్చుచున్నాడు. ఎందుకా విధంగా బాధపడుతున్నావని ఒక డతని ప్రశ్నిస్తే, తన భోజనంలో పెద్దమిరపకాయవచ్చిందని అతడు చెప్పాడు. అప్పుడు ఆ ప్రక్కనవున్న మరొకడు ఇట్లన్నాడు: "ఓరి మూర్ఖుడా! నీవుతిన్నది హుళక్కిభోజనంకాదా! అటువంటప్పుడు కారంగావుంటే మిరపకాయనుమాని మరేదైన మధురపదార్థాన్ని నీ వేల ఎన్నుకోలేదు? అది నీ సృష్టేఅయినప్పుడు, నీకర్మే అయినప్పుడు,

నీ ఊహే నైనప్పుడు, ఈ కర్మ మెందుకు? నీవింతకన్నా యోగ్యమైన దాన్ని ఎందుకు కోరుకోకపోయావు?" అని బుద్ధిచెప్పాడు.

ఈ ప్రపంచమంతా నీ సృష్టే, నీ భావమే అని వేదాంతము బోధిస్తున్నది. అటువంటప్పుడు "నేను అధముణ్ణి, దీనుణ్ణి, పాపిని" అని నీ వెందుకు బాధపడడం? నేను నిర్భయుణ్ణి, సర్వశక్తుణ్ణి, దివ్యత్వాన్ని నేనే అని నీ వెందుకు భావింపకూడదు? సత్యాన్నే విశ్వసించు. ఈ పరిసరాలకూ, పరిస్థితులకూ, వానికి తగినస్థానమే ఇవ్వు. ప్రపంచ మంతా మిథ్య అనేటంత తీవ్రతతో ఆత్మవిశ్వాసివికా! ఖగోళ శాస్త్రంలో స్థిరనక్షత్రాల దూరాలు కొలవవలసివచ్చినపుడు, ఈ ప్రపంచం ఒకచుక్కలాగ పరిగణింపబడుతున్నది. నక్షత్రాలముందర ఇది శూన్యమవుతున్నది. ఇది నిజమయినప్పుడు ఈ ప్రపంచం ఆ దివ్య శక్తిముందర, అనంతునిముందర, నీ ఆత్మతేజంముందర ఏ లెక్కకు వస్తుంది? తేజస్సులోకల్ల తేజస్సువు, శక్తుల్లోకల్ల శక్తివి, నీవే ఐనప్పుడు ఈ పేరుప్రఖ్యాతులు, ప్రపంచబాంధవ్యాలు గౌరవా గౌరవాలు, దూషణభూషణాలు, మిత్రత్వశత్రుత్వాలు, ధనకనక వస్తువాహనాలు మొదలైనవన్నీ మిథ్యలని, అసత్యాలనిగుర్తించు. నీ జయానికిదే రహస్యం. 'నయాగరానదిలో' ఇద్దరు మనుష్యులు కాలుజారి కొట్టు కొనిపోతున్నారు. అందులో ఒకనికి పెద్దదూలందొరికింది. వాడు దాన్ని గట్టిగా పట్టుకొని ఆత్మరక్షణ చేసుకోదల్చాడు. రెండోవాడు గట్టు మీద ఉన్నవారు తమ్ము రక్షించడం కోసరం వేసిన త్రాడు పట్టు న్నాడు. ఇది దూలంలాగా బరువైంది కాదు. ఈత్రాడంత స్థూల మైందికాదు. అదే వాణ్ణి రక్షించింది. ఈ దూలము పట్టుకొన్నవాణ్ణి నదీవేగం దూలంతోపాటు ఈడ్చివేసి సుడిగుండాల్లో ముంచివేసింది.

ఓ మానవుల్లారా! ప్రపంచవాసులారా! మీరు ప్రతిష్ఠలు, ధనకనక వస్తువాహనాలు, భూవసతులు మొదలయిన బాహ్యావిషయా లను విశ్వసిస్తున్నారు. అవి దూలంవిధంగా మిక్కిలి పెద్దవిగా కనబడు తున్నవి. కాని ఇవి మిమ్మల్ని రక్షించే సూత్రాలు గావు. మిమ్ము రక్షించేది-ఆ త్రాడువిధముగా చాల సూక్ష్మమైంది. నీవు దాన్ని నీ ఇంద్రియాలద్వారా తెలుసుకోలేవు. అది విషయసంబంధమైందికాదు.

ఆసూత్రం, ఆ సత్యం అతిసూక్ష్మమైంది. సున్నితమైంది. బాహ్యావిషయాలన్నీ నిన్ను చిట్టచివరకు నాశనం చేస్తాయి. బాధ, విచారం, అగాధమైన నిస్సహాయం-ఇవే వాని ఫలితాలు. బాహ్యం ఎప్పుడూ, నిన్ను ముంచకమానదు. నీ ఆత్మే నిన్ను రక్షిస్తుంది. ఇంద్రియాలనే తస్కరవర్గానికి మీరెందుకు చిక్కుతారు ?

మీ ఇరుగు పొరుగువారి భావాలు, తత్వాలు మిమ్ము లాగివేస్తుంటాయి. ఇట్టి ప్రాపంచికబంధాలు మిమ్ము లాగివేస్తుంటాయి. ఇట్టి ప్రాపంచికపాశాలు మిమ్మల్ని అధోగతిపాలు చేస్తాయి. శోకమే దీని ఫలితం. నీ దివ్యత్వాన్ని సంభావించుకో. దానితో ఐక్యంగా. నీవు ముక్తుడవవుతావు. పిన్నదీ బాధింపకుండా ఉంటుందిగాక! వైద్యులు రోగులకు చికిత్స చేస్తుంటారు. కాని ఆ రోగులవ్యాధిని వాండ్లు తెచ్చుకోవడంలేదు. ఆ విధంగా నీవు కర్మ చెయ్యి. నీవు సాక్షిమాత్రుడవై నీ యుద్యోగాలను సాగించు. అప్పుడవి పిన్నేమీ అంటవు. బాధించవు.

## ౭ పవిత్రత

పవిత్రతకూడా చాలా ముఖ్యమయింది. 'భావమే విధికి నామాంతరం.' యద్భావం తద్భవతి. మనం అపవిత్రభావాలను, దుస్సంకల్పాలను, దహిస్తే, అవి మనకు దుఃఖము, దుస్సహామయిన మనోవ్యథ తెచ్చిపెడతవి. నిన్నెప్పుడు విచారమే పట్టిపీడిస్తుంటుంది. మూర్ఖుడు తాను ఇంద్రియభోగాలను అనుభవిస్తున్నానని అనుకుంటాడు. కాని దానివల్ల అతని ప్రాణశక్తే పోతున్నదనీ, దహనమవుతున్నదనీ తెలుసుకోలేకుండా ఉన్నాడు. కర్మను నీవు స్వార్థాల కొరకు దుర్వినియోగం చేసినపుడు, కర్మసూత్రం నీపై పగదీర్చుకుంటుంది. నీవు నీ ఇచ్ఛలకై భగవంతుని ఆదేశించకూడదు. నీ దైహికవాంఛల విషయమై, భగవదభీష్టమే నెరవేరుతుందిగాక! ఈ విషయంలో భగవదిచ్ఛే నీ ఇచ్ఛకావాలి. నీకున్న పరిస్థితులన్నిటినీ ఆవిధంగా సృష్టించిన దివ్యశక్తి, నీవే అని గ్రహించాలి. నీదారిద్ర్యము నీ కర్మే అని నీవు తెలిసికోవాలె. ఇంద్రియాలు చెలరేగి నిన్నొక

వంకకు లాగివేస్తూ. విషయులాలసత్వాని కీడ్చివేస్తే, నీవు ఉత్థితుడవై నీ అద్వితీయఇచ్ఛాశక్తిని ప్రయోగించి, బ్రహ్మత్వాన్ని నిల్పుకోవాలి. ఈ దేశంలో మన్మథవికారాన్ని ప్రేమ అనే పవిత్రనామంతో పిలుస్తున్నారు. ఇంతకన్న నగుబాటింకేముంది! ప్రజలు పవిత్రజీవనాన్ని కోరరు. అసహజవాంఛలు అపరిమితరాగాలు, మన అభివృద్ధికి భంగకరాలు. సంపూర్ణ మానవుడు, మన కెచ్చటా కనపడడు. అతడు సాధారణంగా, అరమనిషి, పావుమనిషి, పావుపాతిక మనిషై ఉంటాడు. అతనిలో సగంభాగం అతనిభార్యపైనా, కొంత మరొకవస్తువుపైన, మరికొంత మరొకదానిపైనా, వినియోగింపబడి ఏ దశాంశమో శతాంశమో చివరకు మిగులుతుంది. మీ రావిధంగా చేయకూడదు. మీరు ప్రేమించండి. మీ చేయి యెచట ఉంటుందో హృదయాన్నిగూడా అక్కడనే ఉంచండి. మీ చేతులు, కాళ్లను పరిశ్రమచే అధికోష్ణంగా ఉన్నప్పుడు, మీబుద్ధిని చాలా నిర్మలంగా, ప్రశాంతంగా ఉంచాలె. మీ ఆలోచన లెప్పుడు ఆత్మపై కేంద్రీకరించాలి. పరిస్థితులను ఎప్పుడూ లెక్కించవద్దు. మానవలోకానికి కల్యాణం సమకూర్చాలి అనేచింతగూడా నిన్ను బాధింపగూడదు. నీ అనుగ్రహానికై ప్రార్థింపవలసినంత దౌర్భాగ్యస్థితికి ప్రపంచం ఎందుకురావాలి? నీముక్తికోసరమే, నీశరీరము పనిచేస్తుంటుందిగాక! మూర్ఖులు బుద్ధిహీనులు, జ్ఞానార్థం వృథాగా ప్రార్థిస్తుంటారు. వాపోవుచుంటారు. నీ కా వాంఛగూడా ఎందుకు ఉండాలి? జ్ఞానంకోసం నీవు దేవిరించినకొద్దీ, నీవు అంధకారంలోనే ఉంటావు. ఒక్క నిమిషం వాంఛావిదూరుడివి కా! ఓం ఓం అని గానం చెయ్యి. రాగద్వేషసంగాది విహీనుడవు కా! పరిపూర్ణప్రశాంతి! స్వస్థత! అప్పుడు నీవ్యక్తి సర్వమూ తేజోమూర్తే అవుతున్నది. ప్రాపంచిక వాంఛావిహీనుడవై, కర్మ చెయ్యి, నీ కర్మనంతా పవిత్రవంతంచెయ్యి. సక్తతను, సంగాన్ని విసర్జించు. నీ వొక వస్తువుకు ఆసక్తుడవైనపుడు, విశ్వంనుండి విడిపోవడం తప్పదు. స్వార్థప్రయోజనాలే నీ కర్మను, నీ జీవితాన్ని ప్రాపంచిక ముఖానికి ఈడుస్తుంటవి. పరిశ్రమవల్ల, బుద్ధిపూర్వకంగా సన్న్యాసం ఆపాదించడానికే కర్మచేస్తూ నీ శరీరజ్ఞానం వీడి (కర్మ నిన్ను భగవత్సన్నిధానంలో ఉంచుతుంది) ఉండాలి. కర్మనుండి కోరికను తీసివేస్తే దానికే మహోత్తమమైన సన్న్యాసం, లేక సేవ అని

నామాంతరం. కర్మ వెనుక నీకు వాంఛ ఎందుకుఉండాలి? కర్మ చేయడం కంటె మేము దీన్ని సాధించాము. దాన్ని సాధించాం అనడంలో ఆనంద మున్నదని మూర్ఖులు తలుస్తుంటారు. ఫలితాలకన్నా ఎక్కువగా కర్మే మహదానందాన్ని ఇస్తుందని మూఢులు తెలుసుకోలేరు. నీ జయ మెప్పుడూ నీతోటే వుంది. ఈ విధంగా నీ వీ ప్రపంచాన్నొక పవిత్ర దేవాలయంగా, నీ జీవితాన్నొక నిరంతరదివ్యగానంగా చేయగలవు. ఫలితంకోసరం ఎందుకు నీవు పరితపించాలె? జీవితభృతులు, ప్రతిఫలాలు నిన్నెపుడూ బాధింపగూడదు. నీకు గొప్పపదవి దొరక్కపోతే, వీధులను తుడవడానికైనా సిగ్గుపడవద్దు. నీవు ముమ్మందు చేయవలసిన ధర్మాన్ని నిర్వహించడానికి ఎంతమాత్రం ఆలస్యం చేయగూడదు. పదిమందిలో చిన్నతనంగా ఉంటుందని ఒకపని విడవడం ఆత్మగౌరవం కాదు. యథార్థమైన ఆత్మగౌరవమంటే, మన నిజాత్మను, అంతరంగములో ఉన్న భగవంతుణ్ణి గౌరవించడమే! దేహాభిమానం నరకానికి సమీపమార్గం; సుకృతానికి కేవలం వ్యతిరేకమైంది. నీ వేపనికైనా సమకట్టినప్పుడు ఉత్తమోత్తమ ధర్మాలు, గౌరవప్రదాలైన వృత్తులు, తమంతతామే నిన్ను వరిస్తాయి. పరిశ్రమలో ఉన్న భగవంతునకు విముఖత్వం చూపకపోతే, నీకంటే ఎక్కువ గౌరవంగా అతడు ప్రవర్తిస్తాడు. అతడు నీ కెప్పుడు ఋణపడడు. నీ ప్రసక్తి లేకుండా తేజస్సు నీయందావిర్భవిస్తుంది.

మానవలోకంలో చేసే నిందాస్తుతులను నీవెప్పుడు విశ్వసింపవద్దు అవన్నీ నిన్ను దుష్పథానికి దారితీస్తవి. వంచనచేస్తవి. నీ స్వర్గం నీ అంతరంగంలోనే ఉన్నది. నీవు బాహ్య విషయభోగాల్లో చిక్కుకుంటే, వ్యభిచారదోషానికి పాల్పడిన వాడవౌతావు. 'ఓ భౌతిక భోగాల్లారా! పొండి, పొండి! ఓ సైతానువర్గమా! తొలగండి! తొలగండి! నేను మీ సంపర్కాల నెప్పుడూ అంగీకరింపను!' అని మీరు విషయాలను త్రోసివేయండి. ఆనందమూలస్థానానివి నీవే! "అసూయాకలుషితాలై ఋతువులు, తమ తమ ప్రభావాలను ప్రకటింపవచ్చు. కాని నిత్య తేజస్వంతుడైన సూర్యునిలో ఈ వికారాలు ఉండవుకదా!" కోకిల నవచూత వృక్షాల నధిరోహిస్తుంది. వెంటనే

వికస్వరస్వనాలు దిక్కులు పిక్కటిల్లుతాయి. నీమనస్సు స్వస్థానము నలంకరిస్తే, అప్రయత్నంగానే, పర్వతప్రవాహంలాగ ఆనందం పొంగిపోతుంటుంది. నీ బ్రహ్మత్వం నీవు నూతనంగా సాధింపవలసిన విషయం కాదు. ఆత్మజ్ఞానంకోసం నీవు నూత్నంగా కృషి సల్ప నవసరంలేదు. దివ్యదృష్టిని సంపాదించుకోడానికి నూతన ప్రయత్నాలు చేయ నవసరం లేదు. నీ విదివరలో నీ చుట్టూ సృష్టించుకున్న కాషపాశాలను పుటుక్కున త్రెంచుకోవడమే నీ విప్పుడు చేయవలసిన కార్యం. భయపడ వద్దు. నీవు స్వతంత్రుడివి. నీకు కనబడే బంధాలుకూడా, నీ కున్న స్వాతంత్ర్యం మూలకంగానే గల్గుతున్నవి. నీ యాహ్వానం లేనిదే నీ కెట్టి బాధలు దాపురింపలేవు. కోస్తుందని నిన్ను కోసుకుంటేనే గాని కత్తి నిన్ను కోయజాలదు.

నీ బంధాలను, నీ పాశాలను అలంకారాలవిధాన నీవు ప్రేమించ నవసరంలేదు. సర్వవాంఛలను వినాశనం చెయ్యి. సమత్వాన్ని సర్వములో ఆరాధించు. అప్పుడు ఈ ప్రపంచ మెంత మహాశక్తైనా, నీ పాదరక్షలు మోయడమే మహాభాగ్యమని, నీకు అంజలిచేస్తుంది. నీ బ్రహ్మత్వాన్ని నీ వెప్పుడు మరువగూడదు. నీవ్యక్తిత్వాన్ని, నీ దేహాన్ని లేనిదానివలె పరిగణించు. దేహవిస్మృతిపొందు. చిన్న నీటిబుడగ పగిలిపోతూ, సముద్రమంతా తానే అవుతుంది. నీ వఖండమూర్తివి! అనంతుడివి! సర్వవిశ్వం నీవే! నీ స్వప్రభతో ప్రకాశించడమే నీపని! ఓ సిద్ధుడా నీవు నిర్వర్తించాలసిన విధి కాని, కర్మగాని ఏమీ లేదు. ప్రకృతి సర్వం చేష్టలుడిపి నీకోసం నిరీక్షిస్తున్నది. నిన్ను సేవించగలగడమే మహాప్రసాదమని నక్షత్రరాశితో ఈ ప్రపంచం వేనోళ్ల కొనియాడుతున్నది, ప్రకృతిశక్తులన్నీ నీకోసం నీముందర మోకరిస్తూ, ప్రణామాలు చేస్తున్నవి. వానిసేవలు గ్రహించు!

౧

నమ్మకుము నమ్మకుము పరమాత్మ నొకని
మంచుబిందువులట్లు తరళంబులైన
అస్థిరవస్తువులందు నమ్మకమె

మూలకారణ మాత్మలో నశాంతికిని.
నిను నీవు పరిశుద్ధునిగ నుంచుకొనగ
ప్రతినిగూఢశ్రీని తెలుసుకొనంగ,
మార్గ మే మందువా చెప్పెద వినుము:
తుచ్ఛమౌ మాయభోగంబుల వదలి
సత్యాత్మనే ప్రతిపాదింపవలయు.
నీవు నిర్వర్తింపవలసినయట్టి
విధి లే దహో అద్వితీయ! సర్వస్వ!
కర్మకై ఏల చిరాకు, తాపంబు,
తెలుసుకో! తెలుసుకో! పరమసత్యమును
ఆవేదనాసర్వ మంతరించెడిని.
"ఒహోహో! బలేపని చేయుచున్నావు!"
అని పల్కు జనవాక్యముల నమ్మవద్దు.
కలనైన నమ్మకు వారిభూషణాల,
గౌరవాగౌరవా లనునవి భ్రాంతి.
ఏ నెప్పుడును స్వార్థకర్మనే యెఱుగ
కర్తృత్వరహితపరబ్రహ్మ మేను,
పిచ్చితార్కికుల వృథావాదనములు
విభ్రమచంచలేంద్రియవర్గములును
న న్నెఱుంగగ లేవు నిజముగా నెపుడు.
సర్వేశరణ్యుడ వాసుదేవుడను
ఓంకారమును నేను! ఓంకార మేను!

౨

పరమదివ్యానందపరవశుం డగుచు
శాంతుడై నిర్మలనిశ్చలుం డగుచు
రాము డున్నాడు దివ్యానందమూర్తి!
ఆనంద మానంద మానంద మహాహా!
అస్మదీయానంద మప్రతిహతము
అడ్డమే లేదు నాగమనంబు కెపుడు

నర దేవ మృగ పక్షి సంఘంబులెల్ల
నే వేయు వేష మే నిజముగా కనిన.
నా మహానందము జగముల దాటి
అఖిలంబు నేనె సర్వంబున నేనె.
ఏ నెక్క డున్నా ననే ప్రశ్న లేదు.
ఎప్పుడు నే నున్నాననే ప్రశ్న లేదు–
అహా! తత్త్వమసి! నేను అనునది యేమి
అను ప్రశ్నయే లేదు బ్రహ్మను నేను!
ప్రశ్న కతీతమౌ బ్రహ్మను నేను
అద్వితీయుడ నేను! ఆదిని నేను!
అఖిలంబు నేనె ఈ సర్వంబు నేనె!
ఎక్కువ నేనె, ఆ తక్కువ నేనె!
నేనె సంఖ్యలును, నేనే క్రమంబుగను
ముందు కేగే సాంఖ్యపుంజంబు నేనె!
ప్రశ్న కతీతమై భాసిల్లు నట్టి
ఏకసత్యము నేనె! భూతకాలంబు,
ముందుకాలము, వర్తమానంబు నేనె!
సర్వకాలము నేనె సర్వంబు నేనె!
జ్ఞాతయు, జ్ఞేయంబు, జ్ఞానంబు లేనె!
మధురాతిమధురమౌ ఆత్మను నేనె!
నేను నీవును లేదు, వాడును లేదు
ఏకసత్యం బగు నేనె సర్వంబు;

3

పరిపూర్ణ మది, మరి పరిపూర్ణ మిద్ది
పరిపూర్ణ మెన్నడు మారుట లేదు,
పూర్ణ మందుండియు పూర్ణంబు చనిన
అవికల్ప మగు పూర్ణ మే నిల్చియుండు
అహా! పూర్ణమును క్షీణవృద్ధు లెప్పుడును
మోసగింపగ లేవు, పైకిచూచుటకు

ఎన్నివచ్చినను మరెన్ని పోయినను,
పూర్ణంబు నిలుచును పూర్ణమై సతము-
ఎట్టి అద్భుత కాంతి వ్యాపించె నహహా !
ప్రతికొండపైనను, లోయలయందు
రంగురంగులతోడ నతిసుందరముగ
వెలుగుచున్నవి నామృదుశయ్య లహహా !
ప్రతితుషానున రాళ్ళవానలపైన
ప్రసరించు నత్యద్భుతం బగు కాంతి !
సౌందర్యమయముగా సర్వవిశ్వమును
నలుపుచున్నది స్వర్గసందేశ మహహా !

ఓమ్ ! ఓమ్ !! ఓమ్ !!

# భగవత్ప్రేరణా రహస్యం

[1903 ఫిబ్రవరి 21న శాన్‌ఫ్రాన్సిస్కోలో గోల్డెన్‌గేట్ హాలులో ఇచ్చిన ఉపన్యాసము]

ఈ సభిక జనస్వరూపంతో ఉన్న నా ఆత్మా!

భారతవర్షంలో ఒకసారి ఒక మహాసభ జరుగుతున్నది. అక్కడ కూడినవారు మహాబుద్ధిశాలులు. హిందూశాస్త్రములు, ఆధ్యాత్మిక గ్రంథాలక్కడ పఠించబడుతున్నవి. ఒకనాడు సభాంతంలో, ఆ సభికులలో ఒకరు, పట్టణంలోకివచ్చి నదీతీరంలోనివసిస్తున్న ఒకమహాత్ముని గురించి ప్రసంగించి, ఆ మహర్షిని మహాపురుషుడని కీర్తించాడు. సభాసదులు ఆ మహాత్మునిగూర్చి ఇంకా ఎక్కువవిషయాలు తెలుసుకోవాలని కుతూహలపడ్డారు. అక్కడ ఉన్న ఒక చిలుక ఈ విషయమంతా విన్నది. చిలుక అంటే ఒక బానిస లేక అస్వతంత్రమానవు డని మీరు భావించవచ్చు. పంజరములో బంధింపబడిన ఈ చిలుక (లేక ఈబానిస వ్యక్తి) పట్టణంలో నదీతీరంలో వసించే మహాత్ముని తనయొక్క విముక్తి ఎలాకలుగుతుందో అడిగిరావలసిందని ఆ ప్రసంగిస్తున్న సజ్జనుని ప్రార్థించింది. మంచిదేనని ఆ మహాత్మునిగూర్చి ప్రసంగించిన సజ్జనుడు ఆ మహాత్మునిదగ్గరకు వెళ్లాడు. ఆ మహాత్ము డప్పుడు నదిలో స్నానంచేస్తున్నాడు. ఆ మనిషి ఆ మహాత్మునిట్లు ప్రశ్నించాడు: "అయ్యా! పంజరంలో బంధింపబడ్డ చిలుక (లేక బద్ధమానవుడు) విముక్తిపొందే మార్గమేది?" ఈ ప్రశ్న వినగానే ఆ ఋషి నదిలో విరుచుకపడి నిమిషములో మృతకళేబరంగామారి కొట్టుకపోతున్నాడు. పట్టణ ప్రజలందరు ఋషి నీళ్ళలోచచ్చి తేలిపోవడం చూచారు. చూచిన జనమంతా ఆశ్చర్యపడ్డారు. చిలుకనుగూర్చి ప్రశ్న వేసిన వ్యక్తిని దూషించారు. "పాపం! ఈ మహాత్ముడు, బంధింపబడినచిలుక (అస్వతంత్రుడైన బానిస) మీది ప్రేమచేత ప్రాణాలు విడిచాడు." అని జనమంతా అనుకున్నారు. ఆ రోజు ఆ ఋషి తేరుకోలేదు. ఇక చనిపోయినట్లేకదా! మరునాడు సభాస్థలములో ఆ చిలుక – లేక (బానిసవ్యక్తి) వచ్చిన సజ్జనుని తనవిషయమై ఆ మహాత్ముడు ఏమి

చెప్పాడని అడిగింది. ఆ సజ్జనుడు "ఆ! విన్నవించాను. కానీ ఒకనీచుని, ఒక విచారమగ్నుని, ఒక బద్ధజీవుని (చిలుక) విషయమూ మహాత్మునికి చెప్పినందుకు నేను విచారపడుతున్నాను"- అని విసుక్కున్నాడు. ఆ చిలుక (బానిస), 'విచార కారణమేమి?' టని అడిగింది. ఆతడీవిధంగా చెప్పాడు:

"నీవా ర్తనంతా చెప్పేసరికి ఆ మహాత్ముడు ప్రాణంవిడిచాడు. చూచిన జనమంతా ఆశ్చర్యపడ్డారు. ఇదేం ప్రారబ్ధమో నా కర్థం కాలేదు." చిలుక (బానిస) ఈ విషయం విన్నది. ఋషియొక్క సందేశంలోని అంతరార్థాన్ని పూర్ణంగా గ్రహించింది. ఆ చిలుక (బానిస) చాల తెలివిగలది. ఆఋషి తనమాటవిని ప్రాణాలువిడిచాడు అన్నమాటవిని వెంటనే పంజరంలో విరుచుకపడిపోయింది. స్మృతి విహీనమై చచ్చినట్లుపడిపోయింది. అక్కడున్న జనమంతా ఆశ్చర్య పోయారు. "ఇది ఎంత విచిత్రం! రెండుప్రాణాలు నేడు పోయినవి. మాటలువిని ఆ ఋషిప్రాణం విడిచాడు. తిరిగి ఆవార్తవిని, పాపం ఈ చిలుక (బానిస) ప్రాణంవిడిచింది." అని జనం ఆశ్చర్యపడ్డారు. తర్వాత ఏమిజరిగిందో మీకు తెలుసా? చిలుక చనిపోవడం చూడగానే జనం'ఇంక ఎందుకు చచ్చినచిలుక పంజరంలో' అని జాలిపడ్డారు. పంజరం తెరిచారు. చిత్రం! తుర్రునఎగిరి చిలుక ఒక చెట్టు కొమ్మమీదకూర్చున్నది. 'ఓసభికులారా! ఓజనులారా! నిత్యమూ భగవత్సంబంధమైనశాస్త్రాలను, పురాణేతిహాసాలను వినడానికి మీరిక్కడికి వస్తున్నారు. నిత్యం మీరు శ్రవణము చేస్తున్నా, మీకు భగవద్దర్శనం. బ్రహ్మజ్ఞానం, మోక్షం తన్మయత్వం పొందేమార్గం తెలియదు. ఆ ఋషి పంపిన దివ్యసందేశం వల్ల నేను నేను విముక్తిపథాన్ని తెలుసుకున్నాను. ఆ మహాత్ముడు చావలేదు. చచ్చినట్లు పడి సమాధినిమగ్నుడై నాకు బ్రహ్మజ్ఞాన ముపదేశించాడు. విముక్తిపథం- బ్రహ్మజ్ఞానపథం- మరణంలో, అహంకార మరణంలో, పరిత్యాగ మనే దేహవాసనామరణ మనే మరణంలోనే ఉన్నది. ఆ దివ్యతన్మయతకు ఇదే ఏకైకమార్గం. శరీరానికి అతీతులమై దివ్యస్థితికి, ఆ అంతర్ముఖస్థితికి అధిగమించడమే- మోక్షమార్గం. శరీరాభిమానం చచ్చి, అహంకృతి నశించి, పరిపూర్ణంగా విషయ

వాసనా రూపదేహ భావమరణమే- నిజమైన జీవితానికి మార్గం. సంస్కృతములో రెండు మనోహరమైన పదాలున్నవి. ఒకటి భోగము. రెండోది యోగము. సామాన్యులు రెండూ వ్యతిరేకార్థాలుగల పదాలనుకుంటారు. 'భోగ'మంటే సుఖము, ఆనందము. 'యోగము' అంటే వైరాగ్యము, సర్వసంగపరిత్యాగమని అర్థం. ఆనందమంటే, సుఖమంటే, ఏమిటి? ఆనందము అనేదాన్ని కొంచెములోతుగా విచారించి చూస్తే, యోగమే ఆనందమని, యోగమే నిజమైన భోగస్వరూపమని మీరు తెలుసుకోగలుతారు. వైరాగ్యానికి మించిన భోగం లేదు. సర్వసంగపరిత్యాగానికి మించిన ఆనందం లేదు. విరాగానికి, సత్యసన్న్యాసానికి మించిన ప్రార్థన లేదు. అహంకృతి ఉన్నంతకాలమూ ఆనందం అనుభవించలేరు. పరమానందభూతి ఎక్కడ ఉంటుందో, అక్కడ 'నేను' అనే అహంకృతి ఉండదు. తన్మయత ఉదయించినతత్క్షణమే, 'నాకు తెలుసు, నేను చేస్తున్నాను' అనే క్షుద్రభావాలు అస్తమిస్తాయి. మహామహులైన ఆచార్యపురుషులు ప్రబోధించిన దీ విషయమే. తనకు తాను ప్రభువైన మానవునిలోనుంచి అతనికి తెలియకుండగనే కవిత్వం పొంగి ప్రవహిస్తుంది. 'కవిత్వం బాగుండాలి. నాకవిత్వం మనోహరంగా ఉండాలి' అని తనకవిత్వాన్ని గురించి ఆనందింపదలచిన మానవుడు, కవితారచనచేసే సామర్థ్యస్థితిలో ఉండలేడు. వ్రాస్తున్నాననే దేహస్మృతి ఉన్నంతకాలం వ్రాయలేడు. తెలివే తానైపోయి, తల్లీనుడై తేనేగాని, ఆనందపారవశ్యము నందుకోలేడు. కళాకారులు, కళకొఱకై ఆహుతి కావాలె. నీ వొక మహాకళాకారుడవైతే, ఇతరుల దృష్టిలో మహాకళాకారుడివి కావాలిగాని, నీ కాస్మృతి ఉండకూడదు. సమస్త విశ్వరూప పరమాత్మలో నీవు ఏకీభావం పొందినప్పుడు, "నేను చేస్తున్నాను" అనేభావం నీలో జనించదు. నీ కప్పుడు నేను కళాకర్తను అనే స్మృతే ఉండదు. నీదృష్టిలో నీవు కళాకర్తవుగావు. ఆ స్థితిలో నిన్ను అభినుతించేవాడూ, రచయిత, రచన, ఏకీభవిస్తాయి. అప్పుడు విభేదత్వమంతా అదృశ్యమవుతుంది. ఇలాంటి స్థితిలోనే తన్మయత, పారవశ్యము, ఈశ్వరప్రేరణయొక్క రహస్యమున్నది. ప్రజలు "ఇడుగో ఈయన మహాత్ముడు". అని ఒకనినిగూర్చి అంటారు. అతడు తన్మయుడై బ్రహ్మానందపరవశుడై, ఆత్మస్థితుడై యుండడంచేత, అతనిదృష్టిలో

అతనికి మహాత్ముడనని తెలియదు. ఇంద్రధనుస్సును చూచి జనులు దానిలోని మనోహరమైన రంగులకు ముగ్ధులై 'ఏమిరంగులు ఏమి రంగులు' అని పొగడుతారు. కాని, ఇంద్రధనుస్సుదగ్గరకుపోతే, అక్కడ ఇంద్రధనుస్సే కనబడదు. ఇతరులదృష్టిలో ఇంద్రధనుస్సు ఉన్నది. కాని, ఇంకొకస్థలదృష్ట్యా, లేక ఇతరులకు ఇంద్రధనుస్సు ఎక్కడ కనబడుతున్నదో ఆ స్థలంలో ఉండి చూచేవానిదృష్ట్యా, ఇంద్రధనుస్సు లేదు. ఈవిధంగానే ఫలానా వ్యక్తి దైవానందతన్మయుడు, మహాత్ముడు, లేక గొప్పరచయిత, గొప్పభావుకుడు, గొప్ప శాస్త్రికుడు, అని ఇతరుల దృష్ట్యా పిలువబడవచ్చు. కాని అతని స్వదృష్ట్యా "నేను ఫలానావాణ్ణి, నేను వ్రాస్తున్నాను, నేను భక్తుడను, నేను దైవానందమగ్నుడను" అన్న దైహికాహంకృతి ఉండదు. చిత్రకారుడు, తన కళాకర్మలో ఆహుతికావాలి. తేనెటీగలు, తమకుట్టులో ప్రాణాలను ఉంచినట్లు కళాభిజ్ఞులు తమ కళాకర్మలో మగ్నంకావాలె. ఇక్కడే తన్మయత్వము, లేక ఆనందపారవశ్యతయొక్క రహస్యమంతా ఉన్నది. తేనెటీగ కుట్టిన తర్వాత చచ్చిపోతుంది. ఇదేమాదిరి తన్మయుడు, దైవప్రేరితుడు, కళాభిజ్ఞుడుకూడ తమ దేహదృష్టిని, అహంకృతిని చంపుతాడు. ఈ అహంకారవినాశనంలోనే రహస్యమంతా ఉన్నది. నీకు ఆనందించాలనే కోరిక ఉన్నంతకాలం, నీవు ఆనందతన్మయత్వం పొందలేవు. ఒక వస్తువుతో ఆనందించాలని ప్రయత్నించకు. నీ కానందతన్మయత కలగదు. నీవు ఆనందతన్మయుడవై యున్నప్పుడు, ఇతరులు నిన్ను చూచి ఆనందిస్తారు. కాని నీవుమాత్రం ఆనందించేవాడుగా ఉండవు. ఆనందతన్మయుడవై ఉంటావు. అంటే ఇతరులు ఆనందించే తదేకసమయంలో నీవు అంతకంటె అధికస్థితిలో ఉంటావు. ఆనందమే నీవై యుంటావు.

మిడుత దీపపు మంటలో పడిపోయి, తన ప్రేమను రుజువుచేస్తున్నది. సామాన్యమైన ఈగకూ, ఆ మిడుతకూ మనం భేదం చూడగల అవకాశం ఎప్పుడు ఏర్పడుతున్నది? జ్యోతిచే తన శరీరాన్ని దహనం చేస్తున్నది. అప్పుడది మిడుత అని మనం రుజువు చేయగలం. అదే మాదిరి, ఆనందపరవశుడైన మానవుడు, అతని ఆనందతన్మయతను రుజువు చేయడానికి అతడు యోగి కావలసియున్నది, భయా

తీతుడై సర్వప్రాపంచిక విషయ వాసనాదూరుడై ఆ మానవుడు నిర్గమిస్తాడు.

ఏ మహామేధావికూడ నిజమైన ఆనంద తన్మయతను, సజీవ ప్రకృతినుంచి తప్ప వేరుగా గ్రహించలేదు. ప్రకృతినుంచి ఒక ఉదాహరణ తీసి ఈ విషయాన్ని విమర్శిస్తాను. నీరు భూమికి జీవాన్ని ఇస్తుంది. తేజస్సువలె నీరు ప్రపంచవృద్ధికి కారణభూతం. పంటలు జలముచేత కదా అభివృద్ధి పొందడం, జలము భగవంతుని మహావరప్రసాదం. ఈ దేశంలో జనులకు వర్షం అయిష్టము. కాని భారతదేశములో ఉత్తర దేశాలన్నిటిలో వర్షము దివ్యవరప్రసాదం. మహామహాతత్త్వవేత్తలు, మహాకవులు, మహాపురుషులు, ఆకాశంలో మేఘాలు గర్జిస్తున్నప్పుడు, కుంభవర్షం కురుస్తున్నప్పుడు, ఆనందతన్మయు లౌతారు. స్వానుభవము ద్వారా చెబుతున్నాను. మేఘాలు క్రమ్మి వర్షము కురుస్తున్నప్పుడే, ఎప్పుడైనాసరే రాముడు ఇతరసమయాల్లోకంటె ఎక్కువగా కవిత్వం వ్రాశాడని చెప్పగలడు. వర్షము కురియబోయేముందు, తుంపరగా చినుకులుపడుతున్నప్పుడు, దానంతట అదే మనస్సు వికసించి, ఒక కవితాస్థితిలో మగ్నమవుతుంది. ప్రతిదీ అప్పుడు ఆనందతన్మయత కలిగిస్తుంది. దీనికి కారణం, వర్షధారలచేత పృథివీస్వర్గాలు ఏకం కావడమే. స్వర్గమూ, పృథివీ వర్షముచేత ఏకమవుతాయి. సాధారణంగా వర్షకాలంలోనే భారతదేశంలో వివాహకార్యాలు జరుగుతవి. 'పృథివీ స్వర్గాలు ఏకమైనరీతి, దంపతులిద్దరూ ఏకమవుతారుగాక' అని జను లనుకుంటారు. ఈ వర్షవాతావరణం ఏ విధంగా ఆనందతన్మయత కలిగిస్తుంది? వర్షధారలను, తుంపరులజల్లులను, శీతల సుగంధవాయువులను, వర్షవాతావరణాన్ని ప్రకృతి ఏవిధంగా ప్రసాదిస్తున్నది? సమస్తాకాశాన్ని ఆనందమయం చేసే దేమిటి? ఆకాశములో కలిగే ఆనందతన్మయతకు కారణాన్ని విజ్ఞానశాస్త్రం – పూర్ణస్థితి (Saturation) అని నిర్వచిస్తున్నది. ఈ పదమును వివరించవలసియున్నది. ఒక క్షీరపాత్రను తీసుకోండి. క్షీరములో చక్కెర వేయండి. ఆ చక్కెర కరిగిపోతుంది. ఇంక కొంచెము కలపండి అదికూడా కరిగిపోతుంది. కాని చివరకు చక్కెరవేస్తే కరిగిపోని ఒక స్థితివస్తుంది. ఇప్పుడు

చక్కెరవేస్తే యిక కరుగదు. పాలకు కొంతవరకు చక్కెర కరిగించి, ఇంక ఏ కొంచెముగూడా చక్కెరకరిగించుకోలేని ఒక నిర్భరస్థితి వస్తుంది. ఈ నిర్భరస్థితినే పూర్ణస్థితి (Saturation) అని అంటాము. ఒకస్థితివరకు లవణం నీటిలో కరుగుతుంది. ఆ స్థితి దాటితే లవణం నీటిలో కరుగదు. ఆ స్థితి దాటినతర్వాత, లవణాన్ని నీటిలో వేస్తే కరగక క్రిందికి దిగి ఊరుకుంటుంది. కాని కరుగదు. ఇక్కడ ఉప్పుతో నీరు పూర్ణస్థితిపొందింది. అదేమాదిరి జలం భూమితో పూర్ణస్థితిపొందగలదు. మనం మట్టిని నీటిలో కలుపుతాము. కొంతవరకు మట్టికరుగుతుంది. ఒకస్థితికివచ్చినపిదప, ఇంక ఏ కొంచెము వేసినా మట్టికరుగదు. అంటే జలము, భూమితో పూర్ణస్థితిని పొందింది. ఇక్కడ వాతావరణంలో ఈ భాగా లున్నాయి. నైట్రోజిన్ (ఉదజని) ఆక్సిజిన్ (ప్రాణవాయువు) కార్బన్ డయాక్సయిడ్ (బొగ్గుపులుసువాయువు) ఆర్గానిక్ మాటర్, మెటీరియల్ పార్టికల్సు, ఎక్వ్యాయస్ వేపర్ (aqueous vapour) జలకణాలు గాలిలో వదలబడినవి. ఒకస్థితివస్తుంది. అప్పుడు వాతావరణం, ఎక్వ్యాయస్ వేపర్ (తడితో కూడిన ఆవిరి aqueous vapour) తో పూర్ణస్థితి పొందుతుంది. ఒక్కొక్కసారి వాతావరణం జలకణాలతో (aqueousvapour) పూర్ణస్థితిపొందని సమయాలుకూడా ఉంటవి. కాని, వాతావరణం 'ఎక్వ్యాయస్ వేపర్' (నీటితుంపరల ఆవిరి)తో బాగా పూర్ణస్థితిని పొందినప్పుడు, గాలి నీటిని భరించలేదు. ఎక్కువగా ఉన్నజలం, లేక వాయువుకంటే అధికంగా ఉన్నజలం, వర్షరూపంగాపడుతుంది. వాతావరణం జలంతో పూర్ణస్థితినిపొంది నిర్భరస్థితినిపొందినప్పుడు మనకు వర్షాలు, తుపానులు మంచుతుంపరులు, జల్లులూవస్తున్నవి. నిర్భరస్థితిలో ఇలాంటి మనోహర దృశ్యాలు మనం చూడగలం. ఇప్పుడు మనము తెలుసుకున్నాము:- వాతావరణము ఆనందపరవశతపొందాలంటే, మనకు వర్షాలుకావాలంటే, పూర్ణస్థితిని వాతావరణము అందుకోవాలి. ఎంత నిర్భరస్థితిని పొందితే, అంత ప్రచారానికి మేలు జరుగుతున్నది. అదేప్రకారము మన మనస్సున్నది. ఈ మనస్సును మనము వాతావరణముతో లేక గాలితో పోల్చవచ్చు. మనస్సు ఒకభావంతో పూర్ణతపొందుతుంది. ఆ భావం నీ మనస్సులో నిండుతుంది. నీ మనస్సును జయిస్తుంది. నీ

మనస్సంతా వ్యాపిస్తుంది. అప్పుడు నీ మనస్సా భావముతో పూర్ణస్థితి పొందుతుంది. ఇప్పుడు గ్రహించండి. ఎప్పుడు నీ మనస్సు ఒక భావముతో నిండిపోతుందో, అప్పుడు నీ మనస్సొక విచిత్రస్థితిలో ఉండడం నీవు చూడగలవు. దాన్ని నీవు అశాంతిస్థితి అని పిలుస్తావు. ఈ స్థితిని సరిగా మనము వర్షంవచ్చేముందు ఉండే ఒకవిధమయిన స్తబ్ధస్థితికి, ఒకవిధమయిన కావురుగమ్మినస్థితికి, పోల్చవచ్చు. చీకటి గ్రమ్మి, గాలి బిగిసినప్పుడు, జనం వర్షమువస్తుందని చెప్పడం మీకు తెలుసు. వాతావరణం జలంతో నిండి, నిర్భరస్థితిని పొందగానే వర్షము వస్తుంది. అదేమాదిరి నీమనస్సు ఒక భావంతో పరిపూర్ణంగానిండి, ఒక విధమయిన, నిస్తబ్ధమయిన, మూసుకపోయిన ఒక స్తంభనస్థితిలో ఉంటుంది. నీమనస్సు ఏదో ఒక ప్రియమయిన వస్తువునుగూర్చిన విచారముతో నిండిపోయినప్పుడు, ఒకస్థితికి వచ్చినతర్వాత—నీమనస్సు ఒకవిధమయిన నిరామయమయిన, స్తబ్ధమయిన, అశాంతిమయమైన, వర్ణనాతీతమయిన స్థితిలో ఉంటుంది. ప్రజలాస్థితిని తీవ్రపరివేదన అని అంటారు. ఆ స్థితిని దాటినతరువాత, నీవు ఒక కవి వవుతావు. కవిత్వం నీలోనుంచి జలగా ప్రవహిస్తుంది. వర్షములాగా కవిత్వము లేదా ఏదో మధురగానం నీలోనుంచి ఉద్గతమవుతుంది. ఇదీ స్థితి. నీ మనస్సు తన్మయశిఖరాలకు అధిగమించినప్పుడు, నీలోనుంచి కవితావాహిని వెలికి ఉబికి పాగుతున్నది.

ఒక మనిషి ఉన్నాడని అనుకోండి. అతని మనస్సులో సమస్యా పరిష్కారభావం వొకటి వచ్చిందనుకోండి. సమస్యను పరిష్కరించాలని అవస్థపడుతుంటాడు. ఎంత అవస్థబడ్డా పరిష్కారము కాదు. గాఢములయిన తాత్త్వికసంబంధసమస్యలుగానీ, గణితసమస్యలుగానీ, పరిష్కరించడానికి ప్రయత్నాలుచేసేవారు, రాముడుచెప్పే ఈ విష యాలను స్వానుభవంలో చూడగలరు. ఒక కఠినసమస్యను పరిష్క రించాలని మనము కూర్చుంటాము. సమస్యాపరిష్కారానికి మనము మొదట కూర్చోగానే, మన మనస్సు ఆ భావముతో పూర్ణంగాదు. ఇంక ఏవో కొన్నితలంపులు మనస్సులో ఉంటవి. మనస్సులో సమస్యా విచారమేకాకుండా, విచారఫలితవాంఛకూడా ఉంటుంది. ఆ కఠిన

సమస్యా పరిష్కారంకాలేదు. ఎప్పుడైతే నీ ప్రయత్నాలచేత సమస్యా పరిష్కారం కాలేదో, నీకు కొంచెంవిసుగుపుట్టి, ఇతర విషయసంబంధం వదలివేస్తావు. అప్పుడు నీవింకా ఎక్కువస్వేచ్ఛ వహిస్తావు. అంటే, ఏకైకమయిన ఆ సమస్యాభావనమాత్రమే నీ మనస్సులోపల అంత కంతకు అధికంగానిండి, ఇతర ఆలోచనలను మనస్సునుంచి తరిమి వేస్తుంది. అప్పటికీ ఆ సమస్య పరిష్కారంకాదు. ఇతర భావాలన్నీ అణిగిపోతవి. అయినా ఇంకా నీ మనస్సులో 'నే నిది చేస్తున్నాను, దీనివల్ల నాకు మహాకీర్తివస్తుంది'- అన్న కర్తృత్వ అహంకారభావన నిలిచే ఉన్నది. అప్పుడేమి జరుగుతుంది? సమస్య పరిష్కారంకాదు. కొంతసేపటికి, ఆ కార్యములో, ఆ భావములో ఆ విచారములో మగ్నుడవుకాగా చివరకు నీవూ నేననే భావనపోయి, ఆ ఏకైకసమస్య నిలుస్తుంది. ఆ స్థితిలో నీవూ నేననే భావమంతా, స్థలకాలనిమిత్తాలను గూర్చిన సమస్తస్మృతీ, పూర్ణంగా నిన్ను విడిచిపోతుంది. ఆ ఏకైకభావమే నీ హృదయములో, నీమనస్సులో నిలిచిపోతుంది. ఆభావమే మనస్సులో నిండిపోతుంది. అప్పుడు నీమనస్సు ఆ భావముతో పూర్ణమవుతుంది. అంటే ఆ భావముతో నీవు ఏకమవుతావు. ఈస్థితిలోనే మిడుత దీపంలో కాలుతున్నది. ఈ స్థితిలోనే తేనెటీగ తంగేడుపుట్టులో ప్రాణాలు విడుస్తున్నది. ఇప్పుడే అహంకృతి, భోగవాంఛ నశిస్తున్నది. ఇదే పరిత్యాగానుభూతి. ఈ స్థితికివచ్చిన తరువాత, అప్రయత్నంగా నీవు ఆనందోద్విగ్నుడ వవుతావు. సమస్య మెరుపులాగా నీలో మెరుస్తుంది. "నాకు తట్టింది. నాకు తట్టింది"-అని ప్రజలప్పుడు అనడం వినలేదా? ఈ సజీవమరణ మంటే లేక బ్రదుకులో చావునందే ఆనందమున్నది. అప్పుడు మాత్రమే నీకు తన్మయత్వం ప్రాప్తిస్తున్నది.

కళాభిజ్ఞులు, ప్రబోధకులు, తత్త్వవేత్తలు, విచారకర్తలు, తమ తమ విధానాల్లో రసోద్విగ్నులవుతున్నారు. కాని ఈ దివ్యోద్విగ్నత, ఈ తన్మయత, ఈ ఈశ్వరప్రేరణ అహంకారపరిత్యాగమువల్లో మాత్రమే కలుగుతుంది. ఈ ప్రపంచమానవులు, వస్తువులతో భోగించవలె నని కోరుతుంటారు. వస్తువులను భోగించడం ప్రకృతిధర్మం కాదని వేదాంతం నిర్వచిస్తున్నది. వస్తువులతో భోగించడం మానవ

ధర్మంకాదు. భోగాసక్తిపడేది నీవుకాదు. అది మిథ్యాహంకృతి. భోగవాంఛ ఆత్మకులేదు. సమస్తవిచారకర్తలూ, సమస్త తత్త్వవేత్తలూ, తమ మనోదేహాలను, సమస్తప్రపంచంచేత అనుభవింపజేశారు. ఇదే పథం! నీకు భోగాసక్తి ఉన్నదా, నీకీ ప్రపంచసుఖాన్ని అనుభవించాలని ఉన్నదా, మోక్షమార్గం, ఆనందపథం, భోగపథం నీకు దూరమవుతుంది. కఠినకర్కశమవుతుంది. ఈ ప్రపంచసుఖం నీవు అనుభవించలేవు. అనుభవించలేవు. ఎందుకంటే—ఒకటే మార్గమున్నది. ఆ మార్గము, ఆ ఏకైకపథము, నీ మనోదేహ ప్రాణాదు లన్నిటినీ భగవంతునికి ఆహుతిచేయడమే, భగవంతునిచేత భోగింపచేయడమే. "ఇదిగో నా మాంసం తినండి. ఇదిగో నా రక్తం తాగండి"—అని క్రీస్తు వచనాలు. ఎవని జీవితము, నిరంతరం ఒక మహాయజ్ఞమో, అతడే నిజమైన మహాభోగి.

ఎప్పుడు మనము నిర్భరస్థితికి అధిగమిస్తామో, ఎప్పుడు మనస్సు భావప్రపూర్ణ మవుతుందో, తదేకధ్యానములో ఎప్పుడు సర్వేంద్రియ విస్మృతి కలుగుతుందో, అప్పుడే మన శరీరమనే వేణువును మహాగాయకుడైన భగవంతుడు స్వీకరిస్తాడు. అప్పుడు మధురసంగీత స్రవంతులు ప్రవహిస్తాయి. అద్భుతసంగీతధ్వనులు పొంగులెత్తుతాయి. కాని, ఆ వీణను సమర్థుడైన గాయకునిచేతి కియ్యక, పసిపిల్లవాడు తానే వాయిద్దామనుకుంటాడా, కఠోరమైన అపశ్రుతులే నినదిస్తాయి. ఎంతవరకైతే ఈ మిథ్యాహంకృతి, ఈ అనాత్మ, ఈ భోగవాంఛాచిత్తం నిలచి, శరీరాన్ని గట్టిగాబట్టుకొని, దేహసాంగత్యాన్ని వదలదో, అంతవరకు ఈ శరీరంలోనుంచి అపశ్రుతులే వస్తాయి. ఈ వేణువును, ఈ దేహాన్ని భగవంతునికి ఒప్పజెప్పు. ఈ మిథ్యాహంకృతిని, ఈ క్షుద్ర దేహభ్రాంతిని, ఆహుతిచెయ్యి. అతీతుడవుగా! నిర్భరస్థితికి అధిగమించు. భగవంతుడు స్వయంగా తన అమృతహస్తాలతో నీ శరీర వేణువును అందుకుంటాడు. ఆ మహాగాయకుడు స్వయంగా తానే ఈ వేణువును పాడుతాడు. ఓహో! అప్పుడు మధురగానవాహినులు ఉప్పొంగి పారుతవి. అప్పుడు నీవు తన్మయత పొందినట్లు. అప్పుడు నీవు బ్రహ్మానంద పరవశుడవైనట్లు. అప్పుడు నీవు భగవత్ప్రేరితుడవైనట్లు. పార

వశ్యత అంటే అహంకృతిగాక, భగవంతుడే పనిచేయడమన్నమాట. క్షుద్రాహంకారం, శరీరంమీద అధికారాన్ని వదలినప్పుడు, ఆ మానవుడు తన్మయుడౌతున్నాడు. భగవత్ప్రేరితు డౌతున్నాడు.

క్రీస్తు తన ధర్మప్రచారం చేయబోయేముందు సైతాను అతన్ని ఎన్నోభ్రమలు చూపి ప్రపంచభోగాసక్తుని చేయాలని చూచాడు. "ఇవిగో ఏడు లోకాలు. ఇవిగో రకరకాల మధుర భోజనపదార్థాలు. ఇదిగో సామ్రాజ్యం. ఇవిగో విచిత్రాలు చెయ్యి. ఎంతోకీర్తి వస్తుంది" అని సైతాను క్రీస్తుకు అనేకఆకర్షణలు, మిథ్యాభోగానుభవాలు చూపించాడు. క్రీస్తు ఏమన్నాడు ? "వెళ్ళిపో, సైతానా! నాకు నీ విచ్చే సుఖం అక్కరలేదు. అక్కరలేదు". అమోఘం! అమోఘం! ఓ అమెరికా దేశీయులారా! క్రీస్తుయొక్క ఈ బోధను మీ మనస్సులో ఉంచుకోండి. "వెళ్ళిపో, సైతానా! నీ విచ్చేవి నా కక్కరలేదు." ఈ విధంగా క్రీస్తు. సమస్తప్రాపంచిక భోగాలను తృణీకరించి, సర్వసంగపరిత్యాగ మనే శిలువను ధరించాడు. ఇందులోనే తన్మయత యొక్క, భగవత్ప్రేరణయొక్క రహస్యం ఉన్నది. ఎంతవరకైతే మీ మనస్సులో, లోకభోగాసక్తి లేక క్షుద్రాహంకృతి నిలచిఉంటుందో, అంతవరకు నీవు తన్మయత్వం పొందలేవు. ఈశ్వరప్రేరణ పొందలేవు. "నేను పనిచేస్తున్నాను. నాకే యీకీర్తిరావాలె" అనే భోగాసక్తిని, మిథ్యాహంకృతిని, పరిపూర్ణంగా పరిత్యాగం చేసినప్పుడుమాత్రమే నీవు తన్మయుడ వౌతావు.

రాము డొక కథతో ఈ విషయాన్ని ముగిస్తాడు: ముగ్గురు అసురులనుగురించి, హిందూశాస్త్రాలలో ఒక మహాద్భుతకథ ఉన్నది. ఈ అసురత్రయానికి అద్భుతశక్తు లున్నవి. వాండ్లు మహాయోధులు. వారిని జయించేవాడు బ్రహ్మాండంలో ఎవడూ లేకపోయినాడు. మహాద్భుతమైన, అత్యద్భుతమైన వ్యక్తులు వాండ్లు. ఎందరెందరో వచ్చి వాండ్లతో పోరాడారు. అందరూ ఓడిపోయినారు. వారితో యుద్ధం చేయడానికి వచ్చినవారు వేనకువేలు. అందరినీ ఓడించి తరిమినవారు ఈ ముగ్గురే. ఓడిపోయిన శత్రువులు ఇంక గెలిచే మార్గంలేక ఒక మహర్షి దగ్గరకు పోయి శరణాగతులై, ఆ అసురులను జయించే

ఉపాయం తెలుపమని ప్రార్థించారు. ఆ ఋషి, ఆ అసురులయొక్క అజేయత్వానికి కారణ మేమిటని ప్రశ్నించాడు. ఎంతో కష్టబడి, ఆ అసురులు అజేయులు కావడానికి కారణం- వాండ్లల్లో రవ్వంతకూడా వాంఛాసక్తి, అహంభావము, లేదని తెలుసుకున్నారు. "మేము వీరులము; మేము యోధులము; మేము సుఖపడాలె" అనే దేహభ్రాంతి ఆ అసురులకు లేదు. విజయానంతరమైనా, అహంభావం వాండ్లకు కలిగేది కాదు. విజయసుఖాసక్తి వాండ్లకు లేదు. ఆ అసురులు యుద్ధం చేసేటప్పుడు "నే నీ దేహాన్ని. నేను యుద్ధం చేస్తున్నాను"— అనే భావన రవ్వంతకూడా వాండ్లకుండేదికాదు. దేహస్మృతే వాండ్లకు లేదు. ప్రపంచంలో వీరులని వన్నెకెక్కినవారిలోగల రహస్యమిదే. యుద్ధంలో వీరుడు, కర్మలో మగ్నుడై యున్నప్పుడు, కర్మే తానౌతాడు. "నేను చేస్తున్నాను" అనే భావనకు అతనిలో రవ్వంత చోటుకూడా వుండదు. అతని శరీరము ఒక యంత్రమై పనిచేస్తుంటుంది. అతడు మూర్తీభవించినకర్మే అయిపోతాడు. అప్పుడతని నఖశిఖ పర్యంతము దివ్యత్వంతో నిండిపోతాడు. అదే ప్రకారము, ఈ అసురులుకూడా యుద్ధరంగాలలో కర్మే ఐపోయి, "నేను పనిచేస్తున్నాను" అని రవ్వంతకూడా అహంకారానికి చోటివ్వరు. యంత్రము పనిచేసిన మాదిరి వారి దేహాలు పనిచేసినవి. భగవంతుని యంత్రాల్లాగా వారి దేహాలు పనిచేసినవి. అసురులయొక్క విజయరహస్యమిదే. ఎవరూ వారిని గెలువలేకపోయినారు. వారి విజయరహస్యము తెలియడంచేత, ఆ మహర్షి ఆ అసురశత్రువులకు, ఆ అసురులను జయించేమార్గం ఇలా బోధించాడు :- "మీరు ఆ అసురత్రయాన్ని యుద్ధానికి పిలిచి, వారు యుద్ధానికి రాగానే వెన్నుచూపి పారిపోండి" ఆ ప్రకారమే ఆ అసుర శత్రువులు ఆ అసురులను యుద్ధానికి పిలిచి తీరా వారు రాగానే పారిపోయినారు. ఇలా అనేక పర్యాయములు వారు అసురులచేత పరాభూతులైనారు. ఈ రకంగా క్రమంగా ఆ అజేయులైన అసురవీరులు, తమ సత్యపదవినుంచి, తమ సత్యమైన అజేయస్థితినుంచి, శత్రువుల యొక్క కపటపరాజయనటనచేత జారిపోయి దేహవిభ్రాంతిలో పడిపోయినారు. "మేము విజయులము" అనే అహంకృతి వారిలో జనించింది. "మేము పరాక్రమ సంపన్నులము, మేము విజయ దురంధరు

లము'' అనే దైహిక విశ్వాసము వారికి కలిగినది. ఆ నిరంతర విజయాలు, ఆ అసురులలో ''మేము వీరులం'' అనే అహంభావాన్ని కలిగించినవి. ఇప్పుడు ఆ అసురత్రయము, దేహకారాగారములో బంధింపబడ్డారు. — ''నేను చేస్తున్నాను. నేను ఘనుడను''— అనే భావము వారిని పట్టుకొని, కారాగారబద్ధులను చేసింది. అంటే వారిలోని భగవంతుని స్థానంలో అహంకారం వచ్చి కూర్చున్నది. ఇంక వారిని జయించడం సులభసాధ్యం. అతి అవలీలగ అహంకారంచేత బంధింపబడిన ఆ అసురులు జయింపబడి బంధింపబడ్డారు.

ఈ కథలోని సందేశాన్ని గుర్తించండి. ఎంతవరకు నీవు పని చేస్తున్నప్పుడు నీ దేహము భగవంతుని చేతులో సాధనా మాత్రంగా వుంటుందో, నీ వ్యక్తిత్వం దివ్యత్వంలో లీనమైఉంటుందో, ఆ స్థితిలో వున్నంతవరకు నీవు అజేయుడవు. ఆ అసురత్రయంమాదిరి ''నేను పని చేస్తున్నాను. నేను అనుభవిస్తున్నాను''. అనే అహంకారభావానికి అతీతుడవై ఉంటావు. ఈ అహంకారవిజయంచేత నీవు అజేయుడవౌతావు. కాని, జనులు నిన్ను పొగడడం ప్రారంభిస్తారు. ప్రజల్లో నిన్నుగూర్చిన అభినుతులు బయలుదేరుతవి. నలుమూలలనుంచి నీకు స్తోత్రనినాదాలు వినిపిస్తవి. అప్పుడు నీలో ''నేను వీరుడను. విజయలక్ష్మి నా బానిస. నా శత్రువులు నన్నెదిర్చి పరాభూతులైనారు''— అనే విశ్వాసం బయలుదేరుతుంది. అసురులకు పుట్టిన అహంభావం ఇదే కదా! ''నేను చేస్తున్నాను. ఈ సుఖంనాకే కావాలె. నేనే కర్తను'' అనే అహంకారభావనయే, నిన్ను బంధించి పతితుని చేసి, శరీరమనే బోనులో వేస్తుంది. అప్పుడు నీ వేం చేయలేవు. నీ శక్తి కోలుపోయినావు. మీరు చూడలేదా బైబులులో— మొదట క్రీస్తు పర్వతాల నుంచి, నూతనంగా వచ్చినప్పుడు, ఆయన అనంతశక్తితో దీపించాడు. జన మధ్యంలో చిరనివాసం చేసి, వాండ్లమధ్య దీర్ఘకాలం ప్రసంగాలు చేసి, ప్రాపంచిక చిరసాంగత్యఫలితంగా ''నన్నెవరు స్పృశించారో? నాలోశక్తి పోతున్నట్లు కనబడుతున్నది''—అని అనవలసివచ్చింది. ''నేను చేస్తున్నాను. నేను భోగిస్తున్నాను'' అనే అహంకృతికి నీవు అతీతుడవై యున్నప్పుడు, భగవంతుడు నీద్వారా పనిచేస్తున్నాడు. నీ

వప్పుడు ఈశ్వర ప్రేరితుడవు, తన్మయుడవు. కానీ ఎప్పుడైతే నీ వొక పనిచేసి, ప్రజల విమర్శలు, జనుల అభినందనాలు, ప్రజల స్తోత్రాలు ఆశిస్తావో, తత్ క్షణమె నీలోని దివ్యశక్తి అదృశ్య మవుతుంది. నీవు కారాగార బద్ధుడ వవుతావు. ఈ అహంభావ మనే చెఱనుంచి వెలువడు. నీలో దైవప్రేరణ, తన్మయత్వం ఉద్గత మవుతుంది. తిరిగి దేహవాసనాకారాగారంలోకి వెళ్ళు. తిరిగి నీలో దివ్యశక్తి స్తంభిస్తుంది.

ఇక్కడొక మంచిగడియారం ఉందనుకోండి. అది బాగా పని చేస్తున్న దనుకోండి. దాన్నొక సూదంటు రాయికి దగ్గరగా ఉంచుతాను. గడియారం ఆగిపోతుంది. అది కాలాన్నింక సూచించ లేదు. నిరుపయోగ మవుతుంది. దాన్ని ఇక మనం ఏమి చెయ్యాలె? గడియారాన్ని భూమిలో పూడ్చండి. ఆ అయస్కాంత ప్రభావం పోయిందాకా దాన్ని దూరంగా ఉంచండి. అది అయస్కాంతశక్తినుంచి విడివడి, తిరిగి యథాప్రకారం పనిచేస్తుంది. నీ మనస్సనే తెరవెనుక నీ అంతరాత్మ దివ్యమై, పరమపావనమై ప్రకాశిస్తున్నది. ప్రతి శిశువు ప్రకృతి సహజంగా దైవప్రేరితుడే! ప్రతిశిశువు, ప్రకృతిసహజంగా కవే. భగవద్ధర్మాలకు అనుగుణ్యంగా జీవించండి. భగవంతునితో శ్రుతిగల్పి జీవించండి. మీరు నిరంతరం దైవప్రేరితులై, తన్మయులై, బ్రహ్మానందపరవశులై జీవిస్తారు. మీరు గనుక మీలోనిసత్యాత్మతో, మీలోని దివ్యశక్తితో ఏకీభవించి జీవించినట్లయితే, మీలోని పరమేశ్వరుని సంబంధాన్ని, మీ స్వస్వరూపమైన పరమాత్మయొక్క అడుగుజాడలను మీరు తప్పనట్లయితే, మీరు నిరంతరం దైవప్రేరితులై ఆనందతన్మయులై జీవించగలరు. మీరుచేసే పొరపాటేమిటంటే- నలువైపుల వున్న ప్రాపంచికవస్తువులనే అయస్కాంతాలకు మీ మనస్సు సమీపిస్తుంది. ప్రపంచవ్యామోహాలు మిమ్ముల ఆకర్షిస్తవి. ఆ ఆకర్షణలచేత భ్రమితులై ధర్మపథాన్ని మీరు తప్పుతున్నారు. ఈనాడు మీరు దైవప్రేరణ పొందకపోతే, దానికి మూలకారణం - చాలినంత ఏకాంతసాధన మీరు చేయలేదన్న మాట. ప్రాపంచక వస్తుజాలం, మిమ్ములను ఆకర్షించేటటుల మిమ్ములను వ్యామోహపెట్టేటటుల మీరు చేసుకుంటున్నారు. మీ సహజమూలశక్తిని మీరు

పొందదలచినట్లయితే, దైవప్రేరణతో భగవత్పారవశ్యముతో, తన్మయత్వంతో మీరు ఉద్దీపించదలచినట్లయితే కొంతకాలం ఏకాంతసాధన చెయ్యండి. పరమసత్యంలో మిమ్ములను మీరు ఇముడ్చుకోండి. భగవంతునిలో మీ స్వస్వరూపాత్మలో మిమ్ములను మీరు ఇముడ్చుకోండి! కొంతకాలం ఏకాంతవాసం చెయ్యండి. కొంతకాలం సత్యధ్యానంతో ఏకాంతసాధన చెయ్యండి. భగవంతునిలో నిమగ్నంకాండి! భగవంతునిలో మిమ్ములను మీరు లీనంచేసికోండి! ఈ పని చెయ్యండి. ఈ ప్రాపంచికవస్తువులనుంచి సంక్రమించిన దుష్టమైన అయస్కాంతత్వం, నీచమైన ఆకర్షణ, మిమ్ములను వదలిపోతుంది. మీ మనస్సు సక్రమ విధానంలో పనిచేస్తుంది. మళ్ళీ మీరు దైవప్రేరితు లవుతారు! భగవదానంద తన్మయు లౌతారు!

పడవలు చెడిపోయినప్పుడు, కొంతకాలం వాటిని బాగుచేయడానికి ప్రయాణాలు ఆపి రేవులో ఉంచుతారు. అదేమాదిరి, ప్రాపంచిక విషయాల్లో చిరసంచారం చేయడంచేత, ప్రాపంచిక కార్యాల్లో ఎక్కువగా ఉండడంచేత, వ్యామోహ వాతావరణంలో నివసించడంచేత, నైచ్యమైన దుష్టమైన లౌకిక పరిసరాల్లో ఉండడంచేత నీవు శక్తిని కోలుపోయినావు. నీలోని దైవత్వంలోనుంచి జారిపోయినావు. ధర్మచ్యుతుడవైనావు. చెడిన పడవలను ఏమిచెయ్యాలో, మీ శరీరాలను కూడా అదేరకంగా చెయ్యాలి. కనీసం కొంతకాలమయినా, రేవులలో అంటే ప్రాపంచిక కోలాహలదూరమయిన ఏకాంత ప్రదేశంలో, ధ్యాన ప్రదేశాల్లో మీ శరీరాలను ఉంచండి. మీ మనస్సులను వికసింపచేసే గ్రంథాలు పఠించండి. మిమ్ముల ఉద్ధరింపగల సత్పురుషుల సాంగత్యం చెయ్యండి. ఏకాంత వనప్రదేశాల్లో వసించండి. కొంతకాలం నిత్యం భగవద్ధ్యానం చెయ్యండి. తిరిగి మీరు ఆ భగవచ్ఛక్తిని పొందగలుగుతారు! ప్రతిదినం మీరు శరీరాన్ని స్నానాదులతో పరిశుభ్రపరచడం లేదా ? ప్రతిదినం మీ గృహాలను కడిగి పరిశుభ్రపరచడం లేదా ? అదేమాదిరి మీ మనస్సును నిత్యం పరిశుభ్రపరచ నవసరం లేదా ? ఎంతవరకైతే ప్రాపంచికవాసనలు, ప్రాపంచికవ్యామోహాలు, ప్రాపంచికభావాలు, ప్రాపంచికభోగవాంఛలు, "నేను ఇది చేస్తున్నాను"–

మొదలైన అహంకార భావాలకు నీలో చోటున్నదో, ఎంతవరకైతే నీవు పరిపూర్ణంగా పరిత్యాగివి కావో, ఎంతవరకైతే నీవు అహంకృతిని బలిచెయ్యవో అంతవరకూ ఆశలేదు. అహంకారబలి- సర్వసంగ పరిత్యాగమే- ఈశ్వరప్రేరణకు, బ్రహ్మానంద తన్మయతకు మహాపథం!

ఓమ్! ఓమ్!! ఓమ్!!!

# సమస్తవాంఛాపూర్ణతకు మార్గం

(1902 డిశెంబరు 13వ 'హెరిమిటిక్ బ్రదర్‌హుడ్'లో ఇచ్చిన ఉపన్యాసం)

ఈ సమస్తరూపాలలో ఉన్న మహాత్మా!

అసలు విషయాన్ని ప్రారంభించటానికి ముందు, భారత దేశపు భౌతికపతనాన్ని గురించి కొన్ని విషయములు చెప్పవలసివున్నది. నేడు ఐరోపాఖండంలో ఎంత భాగ్యం వున్నదో ఒకప్పుడు హిందూ దేశములో అంతకన్నా ఎక్కువ భాగ్యం ఉండేది. నేటి అమెరికా సర్వస్వముకంటే రత్నరాసులతో, వజ్రవైడూర్యాలతో, మణులతో, సర్వసౌభాగ్యంతో హిందూదేశం తులదూగినకాలం ఒకప్పుడున్నది. భౌతిక శ్రీమంతమై భారతవర్షం దిగ్దేశాలకు మిరుమిట్లుగొలిపిన ఒక కాలం ఉన్నది. జాతుల వెంట జాతులు. భారతవర్ష సంపదను కొల్లగొట్టడానికి పరుగెత్తి వచ్చాయి. గ్రీసు హిందూదేశంనుంచే భాగ్యవంతమైంది. పరిష్యా భారత దేశంనుంచే భాగ్యవంతమయింది. ఆఫ్ఘనిస్తానం భారత దేశంనుంచే భాగ్యవంతమయింది. ఈరోజు ఇంగ్లాండు భారత దేశంనుంచే గదా సర్వసంపదను ఆర్జిస్తున్నది? నిజంగా భారతవర్షము ఒకప్పుడు సువర్ణ ఖండము! రత్నఖండము!

కాని మేము విచారపడం. భారతదేశపు భౌతికమైన నేటి పత నావస్థనుగురించి మేము విచారపడం. ఒక దైవధర్మం ఉన్నది. ప్రకృతి ధర్మం ఒకటి ఉన్నది. ఆ ధర్మం సర్వాన్ని పరిపాలిస్తున్నది. ఈ విష యము మాకు తెలుసు. మా కర్మలను పరిపాలించే ఒక దైవహస్త మున్నదని మాకు తెలుసు. అందుచేత ఈ భౌతిక పతనావస్థకు మేము విచారపడం. ఈ భౌతికసంపదియొక్క నష్టానికి మేము విచారపడం. భారతీయులు భౌతికశ్రీలను విచారించి అది నిస్సారమని గ్రహించారు. అమెరికా నేడు శిశువు. కండ్లు తెరువని పసికూన. యూరప్ కూడా కండ్లు తెరువని పసికూన. ఇప్పుడిప్పుడే ఈ పరిశోధనలోకి దిగుతున్నది. భారతవర్షం ఈ భౌతికవిధానంలో అనేక పరిశోధనలు చేసింది. ఈ సంప దలన్నీ తూచి నిష్ప్రయోజనమని గ్రహించింది. భారతీయులు ఈ సంప దలను నీటి బుడగల్లాగ గ్రహించారు. ఈ సంపదలు ఆనందమీాయ

లేవు. భాగ్యంచేత సత్యానందం రాదు, రాదు. ఇనుము, బంగారం చేత ఇనుమూ బంగారమే సంపాదిస్తాము. అంతే ఈ భౌతిక సంపద యొక్క ప్రయోజనం. నిజమైన ఆనందం ఈ భౌతికపదార్థాలచేత ఆర్జింపబడేదికాదు. ఈవస్తుజాలంచేత సత్యానందం సంపాదింపబడలేదు.

ఆనందరహస్యం వేరుగా నున్నది. ఎంత నీవు వస్తువులను అన్వేషిస్తావో, అంత ఎక్కువగా వాటిని నీవు పోగొట్టుకుంటావు. ఎంత నీవు వాంఛలకు అతీతుడ వవుతావో ఎంత నీవు కోరికకంటే ఉన్నతి స్థానంలో నిలువగలవో, అంత ఎక్కువగా వస్తువులు నిన్ను అన్వేషిస్తూ రాగలవు. లౌకిక జ్ఞానంగల, ఈ నాటి భారతీయులకు కూడా ఈ రహస్యం తెలియదు. సునిశితమయిన గాఢవివేచన లేకపోవడంచేత నిజంకాని ఏవేవో బాహ్యకారణాలకు విషయా లను ముడివేస్తున్నారు. రాజకీయంగా భారతవర్షం దేనికి పడిపోయింది? భౌతికదృష్ట్యా భారతవర్షం దేని కింత హీనస్థితిలో ఉన్నది ? ఎందు కంటే, నాటి పతనప్రారంభకాలంలోని భారతీయులు, నేటి భారతీ యులవలెనే అనుభవవేదాంతవిహీనులు. వేదాంతానికి జన్మభూమి యైన, బ్రహ్మవిద్యాఖనియైన భారతవర్షం- ఐక్యభావమునకు పుట్టిల్లైన, బ్రహ్మజ్ఞానగంగానదికి జన్మప్రదేశమయిన, బ్రహ్మవిద్య, ఆత్మగౌరవం ఆత్మజ్ఞానం, పుట్టిపెరిగి దేవ భూమియైన, భారతవర్షం, అనుభవవేదాం తంలేక పతనమయింది, అనే విషయానికి మీరు ఆశ్చర్యపడవచ్చు. కాని, ఈ విషయం విశదీకరించడానికి ఇప్పుడు వ్యవధిలేదు. అవకాశం చిక్కినప్పుడు, ఇంకొక ఉపన్యాసంలో ఈ విషయం విశదీకరింపబడు తుంది. జాతులయొక్క అభ్యుదయ పతనాలు ఏ రకంగా కలుగుతున్నవి ఒక జాతి పడిపోవడానికీ, ఇంకొకజాతి అభివృద్ధి పొందడానికీ కారణ భూతము, తెరల వెనుకఉన్న దేమిటి ? జాతులయొక్క మహా సముద్రంలో కలిగే ఆటుపోట్లకు కారణమయిన ఆ చంద్రబింబం ఏమిటి? భారతదేశాన్ని, ఇతర జాతులను పూర్ణంగా అర్థం చేసికొని, భారత వర్షంనుంచి వచ్చి మాట్లాడుతున్న ఒక మానవుని వచనా లివి. ఈ మాటలను మీరు సమాదరించగలరు. ఆధ్యాత్మికంగా పతనం కానిది ఏ దేశమూ, ఏ జాతి ఇంకొక విధముగా పతనంకాలేదు. ఈ సిద్ధాం

తములో, బహుశః ఇతర భారతీయులు రామునితో ఏకీభవించక పోవచ్చు. కాని, రాముడు తన స్వానుభవాధికారంమీద, గాఢ వివేచనాధికారంమీద, ఈ సిద్ధాంతాన్ని నిర్వచిస్తున్నాడు. అయితే నేడు అమెరికా ఏకారణంచేత ఇంత శీఘ్రంగా ఇంత అద్భుతంగా అభివృద్ధి పొందుతున్నది? భౌతికాభ్యుదయదృష్ట్యా, అమెరికా ఇంత వేగంగా అభివృద్ధిపొందడానికి కారణమేమిటి? కారణమిది:- అమెరికా దేశీయులు, తమకు తెలియకుండగానే భౌతికరంగంలో వేదాంతాన్ని ఆచరిస్తున్నారు. అమెరికా దేశీయులు ఏ రకంగా వేదాంతాన్ని సమాచరిస్తున్నారు? ఈ అనుష్ఠానవేదాంతమే, వారి భౌతికాభ్యుదయానికి కారణ మెలా అవుతుంది?- ఈ విషయాలనుగురించి ఎక్కువ ఇప్పుడు ప్రసంగించడానికి అవకాశంలేదు. సత్యం, సత్యం, పరమసత్యం మాత్రమే మహాప్రతిభావంతమయింది. సత్యం, సత్యమైన ప్రవర్తన, యథార్థమయిన జీవితంమాత్రమే ప్రకాశిస్తుంది. జయిస్తుంది. ఇంకొకటి ప్రకాశించదు. విజయం పొందదు.

ఇప్పుడు మనం ఈ వివరణాలన్నీ వదలి నిజమయినదయినా సంశయాస్పదంగా కనబడే ఈ విషయాన్నిగూర్చిన వ్యాఖ్యానాలను ఆవల ఉంచి, ఆశ్చర్యకరమయిన ఈ సిద్ధాంతాన్ని ప్రస్తుతమాపి, అసలు ప్రసంగవిషయానికి వద్దాము.

"అడుగు. నీవు పొందగలవు. తలుపు తట్టు. వాకిలి తెరువబడుతుంది"- అనే వాక్యాలు బైబుల్లో మనం చదువుతున్నాము. ప్రతి వాంఛా ఫలిస్తుంది; ప్రతికోరికా ఎప్పుడూ ఒకనాటికి ఫలితాన్ని పొంది తీరుతుంది- అనే కర్మసిద్ధాంతధర్మాన్ని హిందువులు ప్రబోధించారు. ఈ విషయాన్ని గురించి విపులంగా రాముడిప్పుడు ఉపన్యసించడు. ప్రస్తుతవిషయానికి దీన్నిగురించి ఈ సూక్ష్మవివరణంచాలు. తోటలోని ప్రతిమొగ్గ, తన వాంఛాఫలితాన్ని పొందుతుంది. ఎప్పటికో ఒకప్పుడు ప్రతిమొగ్గ వికసిస్తుంది. పుష్పిస్తుంది. జంతువులు సైతం ఏదో ఒక నాటికి తమ వాంఛలయొక్క ఫలితాలను పొంది తీరుతవి అని హిందూ కర్మసిద్ధాంతం. ఈ ప్రపంచంలో ఏశక్తీ నశించదు. ఏ పదార్థం నశించదు. ఏదీ నశించదు. శక్తిప్రతిఘటనాసిద్ధాంతం (Persistence of

force) శక్తిరక్షణసిద్ధాంతం, (Conservation of energy) నాశరహిత పదార్థసిద్ధాంతం, (Indestructibility of matter) మొదలైన వాటిని గూర్చి మనం చదివియున్నాం. మనఃకర్మ, మనోవాంఛలు, వాంఛలు, కోరికలు, మానసికశక్తి ఏవిధంగా నశించగలదు ? అది తప్పక ఫలించి తీరుతుంది. ఆలస్యంగానో, తొందరగానో మనోవాంఛలు ఫలించి తీరుతవి. ఇదీ కర్మసిద్ధాంత ధర్మముయొక్క సారాంశం. "అడుగు. నీకు లభిస్తుంది. తలుపు తట్టు, ద్వారం తెరువబడుతుంది" – అన్న యీ ధర్మానికి అనుగుణ్యంగా, హిందువులు ఈ కర్మసిద్ధాంతం ప్రబోధించారు. అయితే ఇది నిజమేనా ? ఇది నిజమేనా ? మన దైనందిన జీవితంలో యిలా జరుగుతున్నదా ? ఇది నిజమే. అయితే కర్మధర్మాన్ని సామాన్యంగా అర్థంచేసుకున్న ప్రజలవిధానంలో, నీ అనుభవంలో దీనిని రుజువుచేయాలనుకుంటే, నీవు పొరపడతావు. "అడుగు నీకు లభిస్తుంది. తలుపు తట్టు. ద్వారం తెరువబడుతుంది." — అన్న వాక్యార్థాన్ని సామాన్యజనం అర్థంచేసుకొన్న విధానంలో, ఈ కర్మసిద్ధాంతాన్ని రుజువుచూడదలచుకుంటే నీవు పొరపడతావు. అపార్థవశుడవైతే ఈ సిద్ధాంతం పనిచెయ్యదు. ఈ సూత్రం ఆచరణలో పనిచెయ్యదు. ఈ సిద్ధాంతం పూర్ణసత్యంకాదు. సత్యంలో ఒకభాగం మాత్రమే. 'అడుగు నీవు పొందుతావు. తలుపుతట్టు. ద్వారం తెరువబడుతుంది'—అన్న బైబిలుగానీ, హిందువులుగానీ నిర్వచించిన సిద్ధాంతంలో ఏమి లోపించి ఉన్నదో, సామాన్య ప్రజానీకం అర్థంచేసికొనుటకు ప్రయత్నించరు. 'అడగటం మాత్రమేకాదు. విలువకూడా చెల్లించవలసియున్నది. అడగటంతోపాటు చెల్లించవలసిన వెలకూడా ఉన్నది. వెలకూడా చెల్లించడం అత్యవసరం' అనే విషయాన్ని మరచిపోవాకండి. విలువనుగురించిన ప్రశ్నకు సమాధానంగా బైబిలులో ఈ వాక్యం ఉన్నది:- 'తన జీవితాన్ని ఎవడు వాంఛిస్తాడో, అతడు జీవితాన్ని పోగొట్టుకుంటాడు.' అంటే అర్థం ఏమిటి? అంటే అర్థం – ఎవడు వాంఛిస్తాడో, ఎవడు యాచిస్తాడో, ఎవడు కోరికలతో కుములుతుంటాడో, అతడు ఆ వస్తువును పోగొట్టుకుంటాడు. యాచనలో, వాంఛాతపనలో, కోరికలో, మనజీవితాన్ని మనం నిలువుకోవాలనుకుంటాము. "జీవితాన్ని ఆశించినవాడు, జీవితం పోగొట్టుకుంటాడు."

"మానవుడు, ఒక్క ఆహారంమీదమాత్రమే జీవించడు." చూడండి ప్రభుప్రార్థనలో మన మీరకంగా ప్రార్థిస్తాము:- "మా అనుదినాహారమును, మాకు ప్రసాదించవలసినది". ప్రార్థన ఇలా ఉన్నది. అయితే మానవుడు ఆహారంమీదమాత్రమే జీవించలేడు. ఈ రెండు వాక్యాలను సరిగా విచారించండి. 'ఈరోజు, మా అనుదినాహారం మాకు ఇవ్వవలసినది' — అన్న ప్రభుప్రార్థనలోని అర్థం నీ వడుక్కోమనీ, యాచించమనీ, కోరికలతో కుమిలిపొమ్మనీ, కానేకాదు. ఈ అర్థం కానేకాదు. దాని అర్థ మిది:- రాజైనాసరే, అనుదినాహారానికి వెతుక్కోనవసరంలేని చక్రవర్తైనాసరే, నిత్యభోజనానికి లోటులేని రాజకుమారుడైనాసరే, ఈప్రార్థన చేయవలసియున్నది. అలాంటప్పుడు 'ఈదినం, మా అనుదినాహారం మాకు ప్రసాదించవలసినది' - అనే దానికి అర్థం భైక్షుకస్థితిలో, భౌతికసంపదను ఆశించే మానసికస్థితిలో, వాంఛాబంధస్థితిలో ఉండాలనికాదు. ఆ ప్రార్థనలోని అర్థమేమిటంటే— ప్రతివ్యక్తీ, అతడు రాజకుమారుడుగానీ, మహారాజుగానీ, లేక సన్న్యాసిగానీ, ఎవరైనాగానీ, తనచుట్టూ ఉన్న ఈ సమస్త ప్రపంచ వస్తువులను, సర్వసంపదలను, భోగభాగ్యాలను, ఆకర్షణీయములయిన సర్వపదార్థాలను, తనవిగావని, అవన్నీ భగవంతుని వని, ముమ్మాటికి అవి "నావిగావు. నావిగావు" "భగవంతునివే. భగవంతునివే!" అనే పవిత్రదృష్టితో చూడాలని భావమైయున్నది. ఈ ప్రార్థనలోని ఆశయం భిక్షించడంకాదు. యాచించడంకాదు. ఈ ప్రార్థనలోని ఆశయం పరిత్యాగం చెయ్యమనే. ఇక్కడచూడండి. 'ఈరోజు మాకు మా అనుదినాహారం ప్రసాదించవలసినది.' దీని అర్థం యాచన కాదు. అడగడం గాదు. దీని అర్థం త్యాగం చెయ్యడం. ఇచ్చివేయడం. భగవంతునికి సర్వార్పణం చెయ్యడం. ఇదీ దీనిఅర్థం. సామాన్యార్థంలో తీసుకునేటట్లయితే, 'ఈరోజు మా అనుదినాహారం మాకుప్రసాదించు'- అనే ప్రార్థన ఒకరాజు చెయ్యడం ఎంత అసంగతం! అయితే ఈప్రార్థన ఎప్పుడు సహేతుకంగా ఉంటుంది? ప్రార్థనచేసేటప్పుడు, రాజు తన సర్వ వజ్రవైడూర్యాలు, తన సర్వసంపదా, తన రాజసౌధంసైతం, తనసర్వస్వమూ, భగవంతునికి సర్వార్పణంచేసే, ఆ సంపదంతా భగవంతునికి ఒప్పజెప్పే పరిత్యాగమయస్థితిలో ఉన్నప్పుడు, ఈప్రార్థన

సమంజసంగా ఉంటుంది. ఇట్టి దివ్యభావనలో, అతడు ఈ సంపదతో ఉన్న తనసంబంధాన్ని తెంపుకుంటున్నాడు. అంటే, ఈ లోకశ్రీకి అతడతీతుడవుతున్నా డన్నమాట. అలాంటిస్థితిలో అతడు మహాసన్న్యాసి అవుతున్నాడు. అట్టి జ్ఞాని "ఈ సమస్తమూ భగవదధీనం. నా దనేది ఏదీ లేదు. నాకు కావలసింది పరాత్పరుడే ప్రసాదిస్తున్నాడు"– అని ఊరకంగా ఈ ప్రార్థనను గ్రహిస్తాడు. 'ఈరోజు, నా అనుదినాహారం నాకు ప్రసాదించవలసినది'– ఈ ప్రార్థనకు రాముడు చెప్పిన సత్యార్థాన్ని గ్రహించిన ట్లయితే, "మానవుడు ఆహారంమీాదమాత్రమే జీవించడు" అనేదానికి అనుగుణ్యాంగా ఉన్నట్లు మీారుగ్రహించగలరు. కాదా ఈ రెండు విపరీతంగా కనబడుతవి.

"స్వర్గరాజ్యాన్ని అన్వేషించు. సమస్తమూ నీ కైవశమవుతుంది"– అనే వచనం బైబిల్లో మనం చూడగలం. ఇందులోనే రహస్యమున్నది. ప్రార్థనలోని రహస్యమంతా యిందులోనే గర్భితమైయున్నది. 'మొదట స్వర్గరాజ్యాన్ని అన్వేషించు. సమస్తమూ నీ కైవశ మవుతుంది'– ఇదే ప్రభుప్రార్థనలో క్రీస్తు చెప్పిన జీవ వాక్యము.

ఇంకొకవాక్యం:- 'వేదనలో, స్త్రీ, శిశువును కంటుంది.' ఇదే మనము తప్పిపోయిన విషయము. ఆనందప్రదమయిన శిశువును కంటుంది. కానీ, చెల్లించవలసినవెల వేదన, వేదన! కోరికలుఫలిస్తాయి. నీ వడిగినదంతా యివ్వబడుతుంది. నీసర్వవాంఛలు పూర్ణమవుతాయి. కానీ, ఓహో! నీవు వేదన అనే విలువ చెల్లించాలి. 'వేదనలో, స్త్రీ శిశువును కంటుంది.' ఇది స్త్రీలకుమాత్రమే సంబంధించినమాటకాదు. ఇది అందరికీ సంబంధించినమాట. కోరికలు ఫలిస్తాయి, కానీ వెల చెల్లించాలె. వెల ఏమిటి? వేదన? ఈ 'వేదన' అనే మాటకుకూడ అర్థం విశదీకరించాలి. వేదన– అంటే సమస్తవాంఛాపరిత్యాగం. ఎవరు తమ వాంఛలు ఫలింపజేసుకోగలరు? ఎవరు? కోరికలనుపట్టుకొని వ్రేళ్ళాడపడుతూ తన మనస్సునూ, హృదయాన్నీ వాంఛలకు అమ్మిన వాడా? కాదు. కాదు. గంభీరనీరత్వంతో వాంఛలను ఏ మానవుడు పరిపాలిస్తాడో, అభేదదృష్టితో ఏ మానవుడు కోరికలను నిగ్ర

హిస్తాడో, ఆ మానవుడు మాత్రమే తన వాంఛలను సఫలపరుచు కుంటాడు.

మా ప్రార్థనలు ఫలించాయి– అని ప్రజలు చెబుతారు. ప్రార్థనలంటే ఏమిటి? ప్రార్థనఅంటే, యాచించడము, కోరుకోవడము, ఆశించడము అని కొందరి అభిప్రాయము. ఇది సరియైన అర్థం కాదు. ప్రార్థన అంటే, యాచించడము, కోరుకోవడము, ఆశించడమే అని నీవు అనుకున్నట్లయితే, నీ ప్రార్థనలు భగవంతుడు వినవే వినడు. ప్రార్థించు. వాటికి ఆలనా పాలనా ఉండదు. యాచించు. నీవు పొందలేవు. భిక్షించు తిరస్కరింపబడతావు. కానీ ప్రార్థన అంటే సాధారణార్థము ఉన్నతంగా ఉన్నది. ఆ అర్థము ఏమిటి? ప్రార్థన అంటే, వాంఛాతీతస్థితికి అధిగమించడం. "నీ ఇచ్ఛే నెరవేరుగాక" అనే భావముతో మేళవించడము. చూడండి. ప్రార్థన అంటే యాచన కాదు, భిక్షుకవృత్తి కాదు. కోరడముగాదు. తన కోరిక నెరవేరాలని తపించడము కాదు. ప్రజలు 'ప్రార్థన' అంటే, 'నా కోరిక నెరవేరాలి' అని అర్థం చేసుకున్నారు. క్షుద్రమైన అహంకారానికి అధికారమిస్తున్నారు. ప్రార్థనలోని జీవమంతా, "నీ ఇచ్ఛే నెరవేరుగాక"— అనే భావనలోనే ఉన్నది. శరీరము కష్టపరంపరల్లో వ్రేగుతున్నా, అవస్థల మధ్య, బాధలమధ్య నీ శరీరము క్రుగ్గిపోతున్నా, నీ హృదంతరాళాల్లో నుంచి "నీ ఇచ్ఛయే నెరవేరుగాక" అనే ప్రార్థన వెలువడాలి. ఇదే సత్యప్రార్థన. దేహము రోగముతో బాధపడుతున్నప్పుడు, నీ పరిసర పరిస్థితులన్నీ మహావిషమంగా, విరుద్ధముగా ఉన్నప్పుడు "నీ ఇచ్ఛే నెరవేరుగాక" అనే ప్రార్థన నీ అంతస్సులోనుంచి ఉద్గతంకావాలె. భగవదిచ్ఛగాని, నీ ఇచ్ఛకాదు. ఇదే నివృత్తి. ఇదే ఆత్మార్పణం. ఇదే అహంకారబలి. ఇదే ప్రార్థనజీవం. ఇదే హృత్పూర్వక ప్రార్థన. స్వార్థవాంఛలతో నిండిన, తుచ్ఛయాచనాభావాలతో కూడిన ప్రార్థనలు భగవంతుని చెవులోపడవు. పడనేపడవు. ప్రపంచము ప్రపంచంగా తోచని:పరిపూర్ణ దేహభావాతీతమైన, మనస్సు మనస్సుగాని, సమస్త సంబంధాలకు, సమస్తవాసనలకు అతీతమై లేచిన ఆ పరవశస్థితిలో మాత్రమే– నీ ప్రార్థనలు భగవంతుడు ఆకర్ణిస్తాడు. కనీసము అట్టిస్థితి

క్షణమయినా నీవు అనుభవించవలసి యున్నది; తరువాత, ఆ స్థితిలో నుంచిలేచిన తర్వాత, కాదు ఆ స్థితిలోనుంచి, నిద్రలో ప్రవేశించిన-తర్వాత- ఆ స్థితిలోనుంచి క్రిందికి దిగిన తరువాత- నీ ముందు ఏ దైన వాంఛ బయలుదేరి నట్లయితే, ఆ కోరిక ఫలించితీరుతుంది. ఒక స్థితికి అధిగమించినప్పుడు, అంటే పరిపూర్ణమయిన దేహవిస్మృతికి అధిగమించినప్పుడు, పరిపూర్ణంగా అహంకారమును వర్జించిన స్థితికి అధిగమించినపుడు, పరిపూర్ణంగా ప్రపంచాన్ని మరచిన, సర్వాన్ని మరచిన ఆత్మార్పణస్థితికి సర్వసంగ పరిత్యాగస్థితికి అధిగమించినప్పుడు, చేసే ప్రార్థనలు మాత్రమే భగవంతుడు వింటాడు. ఈ ప్రార్థనలను యాచనా ప్రార్థన లని, భైక్షుకప్రార్థన లని మనం పేర్కొనగూడదు.

ఇంకొక రకం మానవు లున్నారు. వారు సామాన్యవిధంగా ప్రార్థించరు. వాండ్లు ఏరూపకమైనప్రార్థనలు చేయరు. అయినా వారి కోరికలు సఫలమవుతాయి? ఏరకంగా సఫలమవుతాయి? ఈ మానవులు ఎలాంటివారు? వీరు ఏరకపు పురుషులు? చూడండి. నీకొక కోరికవుంటుంది. ఇకనీవు ఆ కోరికతో సతమతమవుతుంటావు. ఆశతో, కోరికతో, వాంఛతో నీ మనస్సు పరితపిస్తుంటుంది. ఎంతవరకైతే, నీ వా రకంగా యాచనా స్థితిలో ఉంటావో, అంతవరకు ప్రతిదీ నీకు దూరమవుతుంది. మన మెవరైనా గొప్పమనిషి దగ్గరకు పోవలసివస్తే, మంచిగుడ్డలు వేసుకొని పోతాం. గౌరవనీయ వేషంతో పోతాం. భగవంతుడు సర్వలోకేశ్వరుడు. అన్నిటికంటే అధికుడు సమస్తవాంఛలకు అతి అతీతుడు. అవాప్తకాముడు. అలాంటి భగవత్సన్నిధికి పోయేటప్పుడు, పరిశుభ్ర వేషంతో పో. ఆయనతో సమానమైన వేషముతో పో! వాంఛాతీతుడైన భగవంతుని దగ్గరకు, వాంఛాతీతుడవుగా పో. ఆయన వాంఛాతీతుడు. నీవూ వాంఛలకతీతుడవుగావాలె. నీవుకూడా యాచకత్వమునకు అతీతుడవు కావాలె. వ్యాపార వేషమునకు అతీతుడవై పోవాలి. భిక్షుకవేషానికి అతీతుడవుగా పోవాలి. యాచకుడంటే అందరికీ అసహ్యమే. యాచకుణ్ణి అందరూ తిరస్కరిస్తారు. ఈ దేశంలో యాచకులను అసహ్యించుకుంటారు. ఇక్కడ యాచకులకు చోటులేదు. అదేమాదిరి, భగవత్సన్నిధికి నీవు పోవాలనుకుంటే, భగవత్సంబంధ

వేషంతో శీఘ్రంగా వెళ్ళు. భగవద్వేషమంటే ఏమిటి? యాచకత చూపించని, వాంఛాదాహం కనుపరచని నిష్కామవేషం అన్నమాట. నిష్కామత్వాన్ని సంభావించు. నిష్కామివి కా. అప్పుడు భగవంతుడు నిన్ను చేతులు జాపి ఆహ్వానిస్తాడు. అప్పుడుమాత్రమే ఆహ్వానిస్తాడు.

ఎప్పుడూ యాచనాతత్వములో, వాంఛావాగురుల్లో, కోరికల్లో తృష్ణలో మునిగి ఎవడు సంతాప పడుతుంటాడో, నిరంతరవాంఛాపీడితుడై ఎవ డుంటాడో అతన్ని ఆనందం సమీపించదు. ఎంతవరకైతే నీవు యాచనాస్థితిలో వాంఛాదాహంలో ఉంటావో అంతదనుక అశాంతి, అస్వస్థత వదలదు. కోరికయొక్క ఫలరూపమైన ఆనందం నీదృష్టిలో ఆనందపూర్ణంగా కనబడే వాంఛావస్తువు-నీకు సిద్ధించదు. ఇప్పుడు రెంటిమధ్య ఒకవైరం బయలుదేరుతున్నది. నీ మనస్సేమో యాచనాస్థితిలో వాంఛాదాహంలో ఉన్నది. వాంఛావస్తువు ఉన్నత స్థానంలో ఆనందపూర్ణమై ప్రతిభావంతమై ఉన్నది. ఇప్పుడు రెంటి మధ్యా వ్యతిరేకత రాలేదా? వాంఛావస్తువు అలాంటప్పుడు నీకు చిక్కదు. నీవే వాంఛావస్తువుకు దాసుడ వవుతావు. దాన్ని నీవు అన్వేషిస్తుంటావు. అది నిన్ను అసహ్యించుకొంటుంది. కానీ ఆ వస్తువును వదిలివేస్తావు. కొంతకాలానికి విసుగుపుట్టి అపజయాలచేత విసిగి వస్తువుమీద విముఖుడ వౌతావు. వస్తువును వదిలివేస్తావు. దాని మీద నీకు నిరాశ పుడుతుంది. వదిలివేస్తావు. దానినుంచి వెనుకకు తిరుగుతావు. ఏక్షణంలో దానికి వీపుచూపావో, ఏక్షణంలో దాన్ని వదలుతున్నావో, తత్ క్షణమే నీవు ఆవస్తువుకు అతీతుడ వవుతున్నావు. ఆక్షణమందు నీవు నిన్ను ఆవస్తువుకంటే, ఉన్నతస్థానంలో ఉంచు కొంటున్నావు. నీవు వస్తువుకు అతీతుడవుతున్నావు. అప్పుడు ఆవస్తువు నీ వెనువెంట వెతుక్కుంటూవస్తుంది. కాదా మరి? ఈసంగతి ప్రతి వ్యక్తీ అనుభవంలో తెలుసుకున్నదే. ఊరక ఒకసారి మీస్వానుభవం లోకి విచారించండి. ప్రతివాంఛలో ఇలాంటి అనుభవం నీవు పొంది యుంటావు. నీ వొకవ్యక్తిని ప్రేమిస్తావనుకో! అతనిమీద అనురాగం చేత తహతహ పడతావనుకో! నీవా వ్యక్తిని వాంఛిస్తావు. నీవతణ్ణి రాత్రింబగళ్ళు వాంఛిస్తావు. అతణ్ణి నీవువిడిచి ఒక ఉన్నతస్థితిలో-నీవూ,

నేనూ లేని ఒక ఉన్నతస్థితిలో-నీ వున్నప్పుడే, ఆ వాంఛావస్తువును నీ ప్రక్కన చూడగలుగుతావు. ఇది ఒకసుస్థిరసత్యం. అప్పుడే నీవాంఛా వస్తువు నీకు సిద్ధిస్తుంది.

ఎందుచేత ? ఏ జాతిని ఆ జాతి ఆకర్షించడం మీరు చూస్తున్నారు. సూర్యుడు పదార్థం. భూమీ పదార్థం. సూర్యుడు భూమినీ, సమస్త గ్రహాలనూ ఆకర్షిస్తున్నాడు. భూమి సూర్యుణ్ణి ఆకర్షించలేదు. కానీ సూర్యునిచేత ఆకర్షింపబడుతున్నది. సూర్యుడు భూమిని ఆకర్షిస్తున్నాడు. అదేమాదిరి ధనాత్మకవిద్యుత్తు (Positive electricity), ఋణాత్మక విద్యుత్తు (Negative electricity) లు కూడా. పరిమితి భేదమేకానీ, జాతిభేదం వానిలో లేదు. విజ్ఞానశాస్త్రం దీన్ని అభినిరూపి[illegible] - డొక అయస్కాంత మున్నది. ఇక్కడొక ఇనుప ముక్క ఉన్నది. ఇందులో ఏది బరువైనదో అది తేలికదాన్ని ఆకర్షిస్తున్నది. ఇది సుప్రసిద్ధమయిన విజ్ఞానశాస్త్ర న్యాయం.

నీవు వస్తువును త్యజించినప్పుడు, నీవు వస్తువాంఛను త్యాగం చేసినప్పుడు, ఒక వాంఛారహితస్థితికి, ఒక వాంఛాతీతస్థితికి, ఒక నిష్కామస్థితికి, నీవు అధిగమిస్తున్నావు. అప్పుడు నీ కొక ఉన్నతస్థానాన్ని అలంకరించి సూర్యమండలమయి ప్రకాశిస్తావు. ఆ సమయంలో వాంఛా వస్తువు భూగ్రహంగా మారుతుంది. అప్రయత్నంగా ఆ వస్తువు నీచేత ఆకర్షిత మవుతుంది.

వాంఛావస్తువు నీ దగ్గరకు వచ్చినప్పుడు నీవు కొంచెం క్రిందికి జారుతావనుకో, తిరిగి నీలో వాంఛ తల ఎత్తుతున్నది. వెంటనే తిరిగి విభేదం పుడుతున్నది. వస్తువు అందకజారిపోతుంది. నీవురాజ్యసింహాసనం అలంకరిస్తావనుకో. అప్పుడుప్రజలునిన్ను వెతుక్కుంటూవస్తారు.సమస్తసంపదలు నిన్ను ఆశ్రయిస్తాయి. రాజసన్నిధికి సమస్త దేశాలుసమస్త ఉద్యోగులు అన్వేషిస్తూ వస్తారు. జనం, రాజసాన్నిధ్యంకోసం, వెతుక్కుంటూ వస్తారు. పిలువకుండగనే జనంవచ్చి ఆశ్రయిస్తారు. అదేమాదిరి, నీవు వాంఛాతీతుడవైతే, కోరికలను విడవమనే రాజసింహాసనాన్ని అధిరోహిస్తే, ఈ వస్తుజాలమంతా, యీ వాంఛాజాలమంతా ఉద్యోగుల

మాందిరి, దేశ దేశాలమాదిరి, పరిజనంమాదిరి, నిన్ను అన్వేషిస్తూ, నీ సేవకై వెతుక్కుంటూ రాగలవు. అయితే ఏమిజరుగుతున్నది? సాధారణంగా ప్రజలు, వర్ణనాతీతమయిన-అనుభవైక గోచరమయిన ఆ దివ్యస్థితిలో ఉన్నతరువాత, తమ సన్నిధికి ఈ ఆకర్షణీయవస్తుజాలం రావడం చూస్తారు. ఈ వస్తుజాలం ఆకర్షితమై తమ్ము సమీపించగానే భ్రమితులై సింహాసనమువదలి వాటికోసం క్రిందికి దిగుతారు. పాపం వాంఛాదాసు లవుతారు. తమ్ముతాము ఈ విధంగా న్యూనపరుచు కుంటారు. వెంటనే వాంఛావస్తువు చిక్కక వదలిపోతుంది. ఈ విష యము ఇంకొక విధంగా వ్యాఖ్యానం చేయబడుతున్నది.

ఒక కారులో ఒకద్వార మున్నది. వాకిటిదగ్గర ఒకమనిషి నిలు చున్నాడు. అక్కడ నిలువబడి కారులోపోతూ, "లోపలికిరా; లోప లికిరా" అని తన స్నేహితుణ్ణి పిలుస్తున్నాడు. స్నేహితుడు ఎక్కడానికి వచ్చినప్పుడు ఆతురతచేత వాకిటిలో నిలుచున్న యీ మనిషి ప్రక్కకు తొలగక అడ్డంగా అక్కడే నిలుచున్నాడు. ఇక స్నేహితుడు ఎక్కడ నుంచి లోపలకు వస్తాడు? స్నేహితుడికి చోటి స్తేగదా, అతని లోనికిరావడం. కారు పోయింది. స్నేహితుని లోపలికి ఎక్కించుకో లేకపోయాడు. ఇదే మీరుచేస్తున్నపని. సరిగా ఇదేమీరుచేస్తున్నపని.

మీ కొకకోరిక ఉంటుంది. ఆ కోరిక చాలతీవ్రమయింది, గాఢ మయింది, కోరికచేత వాంఛావస్తువును ఆహ్వానిస్తున్నావు. అది వస్తుంది. కానీ ఆతురుతచేత నీవు వాకిటిలో తప్పుకోవడంలేదు. వాకిట్లో అడ్డంగా నిలుచుండి వస్తువును నీవు లోనికి రానీయడంలేదు. నీ వప్పుడు బాధపడుతున్నావు. వేదనపడుతున్నావు. నీవు పూరక యాచిస్తున్నావు. నీ కా వస్తువు కనపడదు. యాచించి యాచించి, అడిగి అడిగి వాకిటిలోనుంచి తొలుగుతావు. లోపలికి మళ్ళుతావు. అప్పుడు స్నేహితుడు, నీ వాంఛాఫలం లోపల అడుగుపెట్టగలుగుతుంది. అప్పుడు నీవు నీ స్నేహితుని సాంగత్యం అనుభవిస్తావు. ఇదీ విధానం.

నీ కేదైనా కోరిక ఉన్నదనుకో! ఆ కోరికను నిగ్రహిస్తావు. అప్పుడు ఆ వస్తువు నీ దగ్గరకు ఆకర్షితమయి వస్తుంది. కాని, నీవు

వాంఛాతీతుడవు కానిది, నీలోకి నీవు పోనిది, కారులోకి పోయిన మనిషి మాదిరి నీలోకి నీవు పోనిది, నీ ఆత్మలోకి నీవు పోనిది అంతర్ముఖుడవు కానిది, ఆ వస్తువు నీ కెప్పుడూ చిక్కడం సున్నా. ఈ ప్రకారం వస్తువు చిక్కడం, చిక్కకపోవడం కోరికను వదలడంలో, వదలకపోవడంలో ఉన్నది.

ఈ స్థలంలో ఉన్నగాలి సూర్యునిచేత ఉష్ణమయి, పైకి లేస్తున్నది. ఈ స్థలం ఖాళీకాగానే, ప్రక్కగాలి ఆ ఖాళీస్థలాన్ని నింపడానికి పరుగిడి వస్తుంది. గాలి కనుక స్థలాన్ని వదలకపోతే, వెలుపలిగాలి ఆ స్థలంలో ప్రవేశించగలదా ?

అదే మాదిరి ఎంతదనుకైతే వాంఛలను, అహంకారాన్ని, సకామబుద్ధిని నీలో నిలుపుకుంటావో, అంతదనుకా వాంఛావస్తువులు నీవైపు పరుగెత్తిరావు. వాంఛలు వదలు. మొదలు అడుగు. యాచించు. కాని ఇది చాలదు. తరువాత యాచనకూ, వాంఛలకూ, నీవు అతీతుడవై నీ పీ వాంఛావాసనలకు దూరంకా. అప్పుడు వాంఛలు ఫలిస్తాయి.

కొందరు మహాపురుషు లున్నారు. వారి వాంఛలను, వారి ఆజ్ఞలను సూర్యచంద్రనక్షత్రాదులు, పంచభూతాలుకూడా శిరసావహిస్తాయి. వారి శక్తిలోని, వారి ప్రతిభలోని రహస్య మేమిటి ? రహస్య మిదే. ఆ మహాత్ముల వాంఛలు స్వార్థవాంఛలు కావు. వారి వాంఛలు ఏకోరికలు లేకపోయినా, ఏ అవసరాలు లేకపోయినా, వినోదార్థం ఏవో మాట్లాడే మహాసార్వభౌముని యొక్క మాటల్లాంటివి. పని జరుగుతుందా, సరే మంచిదే. జరుగదా మరీ మంచిదే. అట్టి మహాత్ముడు సర్వవాంఛలకు అతీతుడై నిలుస్తాడు. ఏ అవసరాలు పీడించని మహారాజు ఎవరినీ ఏమీ అడగడు. కాని దేశదేశాల సామంతులు, ప్రజలు, పరిజనం, అతనిప్రసన్నత నాశిస్తారు. అతనికి స్వయంగా ఏ వాంఛా ఉండదు. తనస్నేహితుల పరితృప్తికై విలాసార్థం, వారిని ఏదైనా అడిగినా, తనకోసం అడగడు. అతడు తనలో తానే సంతృప్తుడై భాసిస్తుంటాడు.

ఆత్మశ్రీకి మహారాజులైన, మహాపురుషులే వాంఛాతీతులై చరించగలరు. అట్టి మహాపురుషుల ఆజ్ఞనే, సూర్యచంద్ర భూ నక్షత్రాదులుసైతం శిరసావహించగలవు. వారు వాంఛాతీతులు గాబట్టే, వారి వాంఛలు సఫలము లౌతున్నవి. నీవు వాంఛాతీతుడవు కా. నీవాంఛలు సఫలములౌతవి. ఇదే వాంఛా సంపూర్ణతలోని రహస్యం.

ఈ సమస్త ప్రపంచకర్మకు సూర్యుడు ఆధారభూతం. అయితే సూర్యునిచేత సమస్తకర్మ ఎలా జరుగుతున్నది ? సూర్యుడు కేవల సాక్షిమాత్రుడై, ఒక మహారాజువలె నిర్లిప్తుడై, స్వయంప్రకాశమానుడై ఉన్నాడు ఇప్పుడు ఇక్కడికి ఒకమహారాజుగాని, యువరాజుగానీ వస్తాడు. అతను ఏ వస్తువైన అడుగుతాడా ? ఏమీ యాచించడు. అయితేనేమి ? ప్రతివ్యక్తి వారంతటవారే, అతనికి స్వాగత సన్మానాలు చేస్తారు. సమస్తసేవలూ చేస్తారు. కానుకలు సమర్పిస్తారు. అదేమాదిరి—ఈ దృశ్యమానకర్మ అంతా సూర్యునిచేత నిర్వర్తితమవుతున్నది. నీవు చూచేదంతా, సూర్యునివల్ల చూస్తున్నావు. నీవు వినేదంతా సూర్యునిచేతనే వింటున్నావు.

సూర్యుడు లేకపోయినట్లయితే, గాలిఅంతా చల్లబడి స్తంభించి ఇంక ఏ శబ్దమూ నీ చెవికి తాకదు. సూర్యుని కిరణోష్ణతచేతనే, నీవు రుచిని అనుభవిస్తున్నావు. సూర్యుని వేడిమిచేతనే సస్యాలు ఫలిస్తున్నవి. నీవు ఆఘ్రాణించేదంతా సూర్యునిచేతనే. ఈభూమి ప్రస్తుత రూపంలో నిలవడానికి కారణము సూర్యుడే. ప్రతిదీ సూర్యునిచేతనే జరుగుతున్నది. కాని అన్నిటికీ కారణభూతుడు సూర్యుడే అయినప్పటికీ, ఇంతవరకు ఒక్కసారైనా సరే, న్యాయవిచారణసభలో ఆయన మీాద ఫిర్యాదు ఎవరూ చేయలేదు.

సూర్యుడు తన స్వయంప్రతిభలో మగ్నుడై, నిస్సంగ సాక్షిమాత్రుడై నిలిచి ఉన్నాడు. అందుచేత, భూమి ఆయనచుట్టూ భక్తిపూర్వకముగా ప్రదక్షిణము చేస్తున్నది. గ్రహాలు సైతము, సూర్యుని చుట్టు భృత్యానుభృత్యత్వంతో ప్రదక్షిణ చేస్తున్నవి. తదేకసమయములో సూర్యుడు నిర్లిప్తుడై సాక్షిమాత్రుడై యున్నాడు. ఆతనిదర్శన

మాత్రంచేత హిమశిఖరాలనుంచి జలం ప్రవహిస్తున్నది. సూర్యదర్శనం చేత, వాయువు ప్రసరిస్తున్నది. చెట్టుచేమలు మొలుస్తున్నవి. సమస్త ప్రపంచకర్మ సాగిపోతున్నది. ఈ రకంగా సూర్యసాన్నిధ్యంలో ప్రతిదీ వస్తున్నది. పోతున్నది. ఇది ఎలా జరుగుతున్నది. కారణమిది: సూర్యుడు సాక్షిమాత్రుడై యున్నాడు. అంతర్ముఖుడై నిస్సంగియై యున్నాడు. అతడు దేనితో కలవడంలేదు. అతనివల్ల జరిగే కర్మలో ప్రపంచ వస్తుజాలంలో అతడు కలియడంలేదు. అతనివల్లనే సమస్తం జరుగుతున్నా, అతడందులో కలియడంలేదు తన ఆత్మ ప్రతిభలో తానుమగ్నుడై సాక్షీభూతుడైయున్నాడు.

వేదాంత మీారకంగా ఉద్ఘోషిస్తున్నది: ఈ ప్రాపంచికజీవనంలో నీ ఏ స్థితిలో ఉండగలిగినట్లయితే–ఆత్మ ప్రతిభామగ్నుడవై సూర్యుని వంటి సాక్షీభూతస్థితిలో నీవు వుండగలిగినట్లయితే, ఏ వ్యక్తిగతమైన, ఏస్వార్థసంబంధాన్ని ప్రపంచంలో కలిగించుకోకుండా సూర్యునియొక్క నిస్సంగ సంబంధముమాత్రమే కలిగి ఎక్కడికిపోయినాసరే, అక్కడక్కడల్లా జీవతేజస్సులను మాత్రమే వెదజల్లుతూ, అహంకార త్యాగివై నీలోని బ్రహ్మాత్మయొక్క సత్యప్రతిభలో మగ్నుడవై చరించగలిగినట్లయితే, 'అహంబ్రహ్మాఽస్మి' అన్నదివ్యస్థితిలో నిరంతర మగ్నుడవై, సత్యస్థిరుడవై, సత్యాత్మస్థిరుడవై అహంకారదృష్టివదలి బ్రహ్మదృష్టితో సంచరింపగలిగినట్లయితే, ఈ సమస్త ప్రపంచశక్తులను పరిపాలించే ఆ పరాశక్తిస్వరూపుడవు నీవు కాగలవు!

సమస్త దుఃఖాలు, సమస్తబాధలు, సమస్తసుఖాలూ, సమస్త భోగభాగ్యాలు సమస్తమైనదారిద్ర్యం. ఈ ప్రాపంచికమైన సమస్త హీనత నీమీాద విరుచుకపడితే పడనీ, అవి నిన్ను తాకలేవు. నీ కవి భారం కావు. అవి నీకు మేరువుమీాద ఈగవాలినమాదిరి కాగలవు. వాటిభారం నీకు పూవుల పుప్పొడిగా మారుతుంది. అవి ఎంత గంభీర రూపంలో వున్నా, నీదృష్టిలో ఎంతవిశాలభూదృశ్యం కనబడినా అది నీ కండ్లకు ఏరకంగా భారం కాదో, అదేమాదిరి ఈ సమస్త శోక సంకులపరిస్థితులన్నీ నీకు ఏ రవ్వంతకూడా భారంకావు ఆ సమస్త భూదృశ్యమునూ నీవు హాయిగా, సుస్పష్టంగా, సుఖంగాచూడగలిగిన

మాదిరి ఈ సమస్తమూ నీకు బాధారహితమవుతుంది. అదేమాదిరి ఈ ప్రపంచములో, ఈ జీవితవిధులలో, నిస్సంగివై అంటక సంచరించు! ప్రతివస్తువునూ మృదువైన నిర్మలదృష్టితో అంటకసాక్షిమాత్రుడవై దర్శిస్తూ, దేనిచేత బంధమూ భారమూ పొందక, నిర్మోహివై సంచరించు! నీ వీ రకంగా జీవించగలవా, నిజంగా నీవు సమస్తబ్రహ్మాండ రాశితో సేవలుపొందే మహర్షివవుతున్నావు.

వాంఛల కతీతుడవు కా. వాంఛలు ఫలిస్తాయి. కర్మసిద్ధాంత విషయమేమిటి? కర్మధర్మానికీ, సమస్తప్రపంచంలో పనిచేస్తున్న ప్రతిశక్తులకూ సమన్వయం ఏరకంగాకుదురుతుంది? ఇంకొకమాటలో- విధివాదానికీ, ముక్తివాంఛకు సమన్వయం ఏవిధంగా కుదురుతుంది?

ఒక చిన్న ఉదాహరణ వినండి.

నీలోని వాంఛలు నిజానికి అయత్నకృతివాంఛలుకావు. యాదృచ్ఛికమయిన వాంఛలుకావు. నీలోనివాంఛలు సహజమయినవి. ఆ వాంఛలు రాబోయేవిషయాలకు, ప్రకృతిలో ఎప్పుడో ఒకప్పుడు ఒక సమయములో రాబోయే విషయాలకు నీడల్లాంటివి మాత్రమే. రాబోయేవిషయాలు నీమనస్సులో నీడలుగా పడతవి. అవేవాంఛలు.

ఒక కథ ఉన్నది. ఒకసారి ఒక స్త్రీ మంచి ఫొటోగ్రాఫర్ దగ్గరకివెళ్ళి తన ఫొటో తీయమన్నది. ఫొటోగ్రాఫర్ కెమేరా సరిగా ఉంచాడు. ఒక మంచిప్లేటు లోపల పెట్టాడు. నెగటివ్‌లో అతనికి ఆ స్త్రీ ముఖంమీద స్ఫోటకపు చిహ్నాలు కనబడినవి. అతడు ఆశ్చర్యపడ్డాడు. "ఇదేమిటి? ఆమె ముఖము పరిశుభ్రముగా ఉన్నది. కాని, ముఖముమీద స్ఫోటకము మచ్చలు స్పష్టముగా కనపడుతున్నవి." మచ్చలు రాకుండా తీయాలని ఎంతో ప్రయత్నించాడు. లాభం లేక పోయింది. విసుగు పుట్టింది. మంచిఫొటో తీసుకోవడానికి ఆ స్త్రీని ఇంకోరోజు రమ్మని చెప్పాడు. ఆమె ఇంటికి వెళ్ళిన కొన్ని గంటల లోనే, స్ఫోటకం పోసింది. ఏమిటి కారణం? ఆమెకు ఒక అక్క ఉన్నది. ఆమెకు స్ఫోటకంపోసింది. ఆమె ఒక ఉత్తరం వ్రాసి కవరులో పెట్టి నాలుకతో తడిపి కవరు అతికించింది. క్రిందటి దినం ఆ కవరు ఈమె

నాలుకతో తడిచేసి తెరిచింది. ఇదీ కారణ మని గ్రహించింది. చర్మంలో రోగాన్ని కండ్లు చూడలేక పొరపాటుపడినా, కెమిరా గా యొక్క గ్రహణశక్తి గ్రహించింది. నిజంగా ఇదే ప్రకారం వాంఛ లున్నవి. కెమిరాలో చూడగలిగిన స్ఫోటకపు మచ్చలు ముఖము మీద పైకి కనబడనిమాదిరి వాంఛలున్నవి. నిజంగా వాంఛలు పూర్ణతయొక్క భద్రతను కలిగియున్నవి. తప్పక రాబోయే విషయా లకు వాంఛలు సూచనలుమాత్రమే.

ఒకదృష్ట్యా మనకు వచ్చే సమస్తఫలితాలూ మన పరిసరాల చేత, పరిస్థితులచేత, బాహ్యప్రభావాలచేత నిశ్చయింపబడుతున్నవి. ఇంకొకదృష్ట్యా మనలోని వాంఛలన్నీ ముక్తి-సంకల్పమును అనుసరించి సఫలత పొందితీరటానికై మనముందు కనపడుతున్నవి. మనం ముక్తు లము అనుకున్నాము. అప్పుడు మన ముక్తసంకల్పము తప్పక సఫల మవుతుంది. ఈ రకంగా ముక్త - సంకల్పము, నియతివాదము, సమ న్వయం పొందుతున్నవి. నిజానికి వాంఛలు అంతకు పూర్వమే పరి పూర్ణత పొందియున్నవి. అయితే ఎందుచేత ఈవేదన ? వేదన ఎందుకు మరి ? వాంఛాసఫలతకై ఎందుకింక ఈవేదన అనే వెల చెల్లించాలె ? ఇదికూడా ఆలోచింపదగిన విషయమే. ఒక ఉదాహరణంతో దీన్ని వ్యాఖ్యానము చేద్దాము.

ఒకడు తాను ఎన్నాళ్ళనుంచో చూడాలని అనుకున్న తన స్నేహితునికి ఉత్తరం వ్రాస్తున్నాడు. ఆ స్నేహితుణ్ణి కలవక చాలా కాలమయింది. టావులు టావులు ఉత్తరము వ్రాస్తున్నాడు. తదేక దీక్షతో నిమిషముగూడా కలము ఆపకుండా పేజీలు పేజీలు ఉత్తరము వ్రాసేస్తున్నాడు. తలయెత్తకుండా ముప్పావుగంట ఉత్తరం వ్రాశాడు. ఉత్తరమంతా పూర్తిఅయి, సంతకంపెట్టినతర్వాత తలయెత్తా డతడు. చిత్రం! అతని ప్రియస్నేహితుడు ఎదుట నిలువబడి యున్నాడు. అతడు ఎగిరి గంతువేశాడు. ప్రేమ పొంగిపోగా కౌగలించుకున్నాడు. "నీ విక్కడనే ఉన్నావా?" అని అడిగాడు. స్నేహితుడు "అరగంట పై కాలమునుంచి నేనిక్కడేనిలిచి ఉన్నాను"అని సమాధానంచెప్పాడు. అతడన్నాడు: "అంతసేపటినుంచి నీవు ఇక్కడే ఉన్నావుగదా- నాతో

ఎందుకు వచ్చానని చెప్పలేదు?" స్నేహితుడు ఈ రకంగా సమాధానము చెప్పాడు: 'నీవు చాలాపనిలో ఉన్నావు. నీ పని భంగంచేయడం బాగుండదనుకున్నాను.'

ఇదేమాదిరి మీ వాంఛలు ఉత్తరం వ్రాయడమును పోలియున్నవి. మీ వాంఛలు, మీపరితపనలు, మీ తృష్ణలు, మీ ఆవేదనలు ఇదంతా లేఖారచనం లాంటిది. ఎవరిని గురించి నీవు లేఖ వ్రాస్తున్నావో, అంటే దేనినిగూర్చి నీవు వాంఛిస్తున్నావో - అది నిగూఢమయిన కర్మధర్మప్రకారం నీముందు అంతకుముందే నిలిచియున్నది. అయితే నీవు దాన్ని చూడని కారణమేమిటి? కారణం-నీవు వాంఛలో మునిగియున్నావు. లేఖారచనంలో తలవంచియున్నావు. ఇదే కారణం. ఏ క్షణంలో నీవు వాంఛలను నిగ్రహిస్తావో, లేఖారచనను ఆపుతావో నీముందు తత్ క్షణమే వాంఛితవస్తువులు వచ్చి నిలిచి యుండడం నీవు కనుగొనగలవు. ఇందుచేతనే వెల చెల్లించడం పూర్ణంగా అత్యావసరమవుతున్నది.

హిందూ శాస్త్రాలలో ఈ విషయానికి ఉదాహరణంగా అనేక ఉపాఖ్యానాలున్నవి. ఒక భారతీయకథలో ఒకప్రధానమంత్రినిగూర్చి ఉన్నది. ఆ ప్రధానమంత్రి భాగ్యదేవతయైన లక్ష్మీదేవిని సాకారంగా దర్శించాలని, తద్విహితమయిన సమస్త తపఃసాధనలు చేశాడు. మంత్రాలన్నీ పునశ్చరణచేశాడు. లక్ష్మీదేవి దర్శనానికి ఎన్నిసార్లు జపించాలో అన్నిసార్లు - కోటిసార్లు మంత్రం జపించాడు. కాని, లక్ష్మీ దర్శనం కాలేదు. ఎన్నిసార్లు జపించినా, ఎంత తపించినా ఆమె దర్శనం కాలేదు.

ఈ విషయాల్లో అతనికి విశ్వాసముపోయింది. విసిగి సమస్త వస్తుపరిత్యాగంచేసి, వైరాగ్యముతో సన్న్యసించాడామంత్రి. ఏ క్షణంలో అతడు తన సర్వభోగ భాగ్యాలను, రాజనగరును పరిత్యజించి సన్న్యాసాన్ని స్వీకరించి అరణ్యాలకు వెళ్ళాడో - ఆ క్షణమే అతని ముందు అప్రయత్నంగా లక్ష్మీదేవి సాక్షాత్కరించింది. కోపఘూర్ణితుడై అతడు ఈ రకంగా అరిచాడు: "వెళ్ళిపో ఓ లక్ష్మీ! వెళ్ళిపో.

ఇప్పుడెందుకు వచ్చావు? నీతో నాకిప్పుడు అవసరంలేదు. నేను సన్యాసిని. ఈ భోగభాగ్యాలతో, ఈ సంపదతో, ఈ సౌఖ్యాలతో సన్యాసినైన నాకేంపని? నేను నీకోసం మొత్తుకున్నప్పుడు నీవురాలేదు. నీమీద ఆశ వదలుకున్న తర్వాత ఇప్పుడు నీవు వచ్చావు." లక్ష్మీదేవి ఈ రకంగా సమాధానం చెప్పింది: "నీవేకదా నా దారికడ్డంగా నిలువబడింది. ఎంతవరకైతే, నీవు కోరికతో ఉన్నావో అంతవరకు నీవు భ్రమను వదలలేదు. నిన్ను నీవు యాచకునిగా చేసుకుంటున్నావు. యాచకస్థితిలోనివారికి ఏదీ లభించదు. వాంఛలను పరిత్యజించిన, కోరికల కతీతుడవైన, ఉత్తరక్షణంలో - నీవు సాక్షాద్భగవంతుడవైనావు. భగవంతునకు ఐశ్వర్యం దాసికదా! అందుకని వచ్చాను." ఇదీ రహస్యం.

ఓమ్! ఓమ్!! ఓమ్!!!

ఓమ్

# ఆధ్యాత్మిక బలమే జయిస్తుంది

(శాన్‌ఫ్రాన్సిస్కోలో గోల్డెన్ గేట్ హాల్లో 1903 ఫిబ్రవరి 5 న ఇచ్చిన ఉపన్యాసం)

ప్రశ్న : మనలను ఇతరులు చూచినవిధంగా మనలను మనం ఏవిధంగా చూచుకోగలం? ప్రత్యుత్తరం : ఇతరులు నిన్ను చూచిన విధంగా నిన్ను నీవు చూచుకోవడంవల్ల నీకు మంచి జరుగదు. ఇతరులు, మనం ఏది కాకుండా వున్నామో దానిగా చూస్తారు. మనము నిజంగా ఏదైయున్నామో దానిగా ఇతరులు మనలను చూడరు. ప్రజలు నిన్ను భగవంతునిగా చూచినట్లయితే- నీలోని బ్రహ్మాత్మ్యమును దర్శించగలిగి నట్లయితే నీవు సక్రమముగా అర్థంచేసుకోబడినట్లు. సోదరులు, తల్లి దండ్రులు, మిత్రులు, ఈ బాంధవులు నీవు ఏమి కాకుండావున్నావో దానిగా చూచి, ఆ అజ్ఞానాన్ని నీ చెవులల్లో నూరిపోస్తారు. ఒకడు నిన్ను మంచివాడని పిలుస్తాడు. ఈరకంగా నిన్నతడు పరిమితత్వంలో బంధిస్తున్నాడు. ఇంకొకడు నిన్ను చెడ్డవాడని పిలుస్తాడు. ఈ రకంగా అతడు నిన్ను ఖండత్వంలో బంధిస్తున్నాడు. ఇంకొక మానవుడు నిన్ను పొగడి ఉబ్బిస్తాడు. ఇతడుకూడా నిన్ను పరిచ్ఛిన్నుని చేస్తున్నాడు. ఒకడు నిన్ను అగౌరవిస్తాడు. అదికూడా నిన్ను బంధించడమే. ఏ మానవుడు సమస్త జగత్తుకు అతీతుడై నిలచి, తన బ్రహ్మాత్మ్యమును, తన దివ్యత్వమును ప్రతిష్ఠించుకోగలడో అతడే ఆనందమయుడు. తన సత్యాత్మను తెలుసుకున్న మానవుడు సమస్త ప్రపంచముముందు తనచుట్టూ ఉన్న ఇతర లోకాలన్నిటిముందు సుస్థిరుడై నిలచి తన దైవత్వమును ప్రతిష్ఠించుకోగల మానవుడు. బ్రహ్మైక్యానుభూతిపొందిన మానవుడు ఈ సమస్తప్రపంచములను ఎదిరించి నిలువగలడు. ఏ క్షణంలో నీవు నీ దైవత్వంలో నిలువ సంసిద్ధుడవు కాగలవో, తత్‌క్షణమే ఈ సమస్త ప్రపంచం నిన్ను భగవంతునిగా గౌరవించుటకు బద్ధమైయున్నది. ఈ సమస్తజగత్తు నిన్ను భగవంతునిగా సమర్చించి తీరుతుంది.

ప్రశ్న : దయచేసి రాజయోగం అంటే అర్థంచెప్పండి.

[illegible] గమంటే, ఏకాగ్రితకు రాజమార్గమని అర్థం. [illegible] పథమని. యోగమంటే ఏకాగ్రత అని, మనోసంయమన మని.

ప్రశ్న : వేదాంత తత్వమును సమస్తజనులూ వ్యాప్తంచేసే ఉత్కృష్టవిధాన మేమిటో మాకు చెప్పండి.

ఉత్తరం : వేదాంత తత్త్వమును వ్యాప్తంచేసే ఉత్కృష్ట విధానం- వేదాంతమును అనుష్ఠించడమే. ఇంతకంటె వేరు రాజపథం లేదు.

మానవు లెప్పుడూ, స్థూలపదార్థాలను, భౌతికవస్తువులను, చేతిలో గట్టిగా పట్టుకోవాలని తపిస్తుంటారు. భౌతికవస్తువులను సమార్జించాలని నిరంతరము వాంఛిస్తారు, తత్ఫలితంగా వేదనే చిక్కుతుంది. అయినా తిరిగి భౌతికతపన వదలరుకదా! రూపాయలకుప్పలమీద కూర్చోవా లనుకుంటారు. రూపనామభ్రమల్లోనుంచి విడివడలేరు.

ఓ ప్రియసోదరా! ఈ రూపాయలనబడేవి, ఈ భోగభాగ్య స్వరూపాలు, ఈ భౌతిక విషయాలు ఇంద్రియాలవిభ్రమమేసుమా, ఈ భౌతిక విషయాలమీద ఏ మానవుడు ఆధారపడతాడో అతడెన్నడూ విజయము పొందలేడు. స్వరూపాలమీద, ఈ పరిమితచంచల విషయాలమీద ఆధారపడడం, ఎప్పుడైనాసరే విజయాన్ని చేకూర్చదు. విజయరహస్య మిది కాదు. అతి సూక్ష్మసూత్రమైన పరమసత్యంమీద ఆధారపడడమే విజయరహస్యం. పరమసత్యమును పట్టుకో. పరమ సత్యమును సందర్శించు. సంభావించు. సత్యమును ఉజ్జీవించు. ఈ పేర్లూ, ఈ రూపాలూ, ఈ సమస్త ప్రపంచమూ నిన్ను వెతుక్కుంటూ వస్తాయి.

ఒక కథచేత ఇది సువ్యక్తమవుతుంది. ఒక మహాప్రవాహంలో ఇద్దరుమనుష్యులు పడి కొట్టుకపోతున్నారు. ఒకడు ఒక పెద్దదూలమును పట్టుకున్నాడు. రెండోమనిషి ఒక సన్నని త్రాడుపట్టుకున్నాడు. పెద్ద లావాంటి దూలమును పట్టుకున్న మనిషి నదిలో మునిగిపోయినాడు.

సన్నని దారమును పట్టుకొన్న మనిషి రక్షింపబడ్డాడు. అదేమాదిరి పెద్ద పెద్ద అండలమీద, ఆస్తులమీద, పెద్ద పెద్ద పేరులమీద ఆధార పడిన మానవులు పడిపోతారు. పరమసత్యమనే సూక్ష్మమయిన త్రాడు (సూత్రం) మీద ఆధారపడండి. నీలోని బ్రహ్మాత్వమును, నీవు తెలుసు కున్నావా, నీలోని బ్రహ్మాత్వ దివ్యానుభూతి పొందావా, నీవెక్కడున్నా ఫరవాలేదు. కీకారణ్యాగర్భాలలో ఉండు, లేదా జనసంకులపుర వీధుల్లో వసించు. ఆ సత్యసాక్షాత్కారం సమస్తమును, సర్వ ప్రపంచమునూ మార్చివేస్తుంది.

ఇక్కడ ఒకబల్ల ఉన్నది. దీన్ని కదలింపదలచామనుకో ఏమూలపట్టుకున్నా, ఏచివరికొన కదలించినా బల్ల మొత్తం కదలుతుంది. ఏ చివరపట్టుకొని లాగినా బల్ల మొత్తం జరుగుతుంది. ఈ ప్రపంచ మంతా ఒక పెద్ద శరీరంలాంటిది. నీ శరీరం దానిలోని ఒక అంచు. బల్లలోని ఒకమూలలాంటిది. ఈ ఒక్కమూలను నీవు పట్టుకొని పైకెత్తు. దాన్ని ఊర్ధ్వదృష్టికిత్రిప్పు. భగవంతునిలో మగ్నంచెయ్యి. దైవశక్తితో నీ శరీరమనే ఒక అంచును ఉద్ధరించు. ప్రపంచమంతా సంచలిస్తుంది. ఎందుకంటే, ప్రపంచమంతా ఒక స్థూలమయిన, కఠిన మయిన బల్లలాగా ఉన్నది. నీ వ్యక్తిత్వాన్ని ఉద్ధరించు. సమస్త ప్రపంచము ఉద్ధరింపబడుతుంది. నిర్మాణాల్లో, సంఘాల్లో, పెద్ద పెద్ద రూపాల్లో, గొప్ప గొప్ప మందిరాల్లో, సంస్థలలో, విశ్వసించడం పెద్ద పొరపాటు. వీటివల్ల వచ్చేది అపజయంతప్ప వేరేమీ లేదు. ఈవిషయము యివ్వాళ్ళగాకపోతే రేపైనా ప్రపంచం తెలుసుకుంటుంది. నిర్మాణాల మీద, సంఘాలమీద ఆధారపడక తమమీదే తా మాధారపడిన మానవులుమాత్రమే సమస్త ప్రపంచపరివర్తనం తేగలరు. సంఘాలకూ సంస్థలకు సంబంధించిన జనులు రూపాయలు పోగుచేస్తారు. భవనాలు కడతారు. మంచి దుస్తులు సంపాదిస్తారు. కాని ఈ విజయం ఆధ్యాత్మి కాభ్యుదయం కాదు.

అడవులలో నక్కలు ఎప్పుడూ సంఘాలుగా సమావేశ మవు తుంటవి. గుంపులు గుంపులు చేరి సభలు చేస్తుంటవి. కూర్చున్నా, నిలుచున్నా కలిసి ఉంటవి. అన్నీ కలిసి కూతలు పెడుతవి. ఓహో!

ఎంతెంత పెద్దసమావేశాలు చేస్తాయనుకున్నారు! ఎంత గందరగోళం చేస్తా యనుకున్నారు! అంతే గొఱ్ఱెలుకూడా. గొఱ్ఱెలుకూడా గుంపులమీద ఆధారపడుతవి. వేనకువేలు కూడి సంచరిస్తాయి. కాని, ఈ నక్కలుగానీ, గొఱ్ఱెలుగానీ నిలిచి కొంచెము శత్రువు నెదురించగలవా ? లేవు. లేవు. సింహాలు ఎప్పుడైనా గుంపులు గుంపులు కూడినట్లు, మందలు మందలుగా సంచారంచేసినట్లు పెద్ద పెద్ద సమావేశాలు చేసినట్లు విన్నారా ?

రాబందులు అడివిపక్షులకు రాజులు. అవి సమావేశాలు చేస్తాయా ? ఎన్నడూ చేయవు. చిన్నిచిన్ని పిట్టలే గుంపులు గుంపులుగా కూడి తిరుగుతుంటాయి. సింహాలుగానీ, రాబందులుగానీ, ఒంటరిగా మాత్రమే జీవిస్తాయి. కాని, ఒక్క రాబందు ఈ పిట్టలగుంపుల సమావేశాలను వికావికలు చేసి పారద్రోలుతుంది.

ఏనుగులు సమావేశములు చేస్తాయి. గుంపులు గుంపులుగా ప్రయాణం చేస్తాయి. కారణం సాంఘిక ప్రకృతి. ఏనుగులు భయంకరమైన పెద్ద జంతువులు కదా! ఒక్క సింహం ఆ సంఘంలో దుమికి ఒక్క సింహం గర్జనతో వాటి గుంపును చెదరగొట్టుతుంది. సంఘాలమీద, సమావేశాలమీద ఆధారపడకండి. తనలో తా నాధారపడి ఆత్మబలం కలిగి యుండడం ప్రతిమానవుని విహితకృత్యం. కాబట్టి వేదాంత ప్రచారంచేసే ఉత్కృష్టవిధానం జనమధ్యంలోగానీ, ఏకాకిగాగానీ, వేదాంతమును అనుష్ఠించడమే. వేదాంతమును జీవించు. వాయువు దీన్ని స్వీకరించడానికి బద్ధమై యుంటుంది. సూర్యచంద్ర తారాకాశములు, సమస్త భూతములూ నీ సందేశాన్ని శిరసావహించి తీరుతవి. ఈరకంగా ప్రచారం అప్రతిహతంగా సాగితీరుతుంది.

క్రీస్తు సంఘసమావేశాలు కూర్చాడా ? లేదు. లేదు. పాపమతడు ఏకాకిగా జీవించాడు. శంకరాచార్యులు సమాజాలు కూర్చాడా ? లేదు. పాప మాయన ఏకాకియై జీవించాడు. ప్రతివ్యక్తీ ఏకాకిగా జీవించాలి. ఏకాకియై నిలవాలె. ప్రతివ్యక్తీ తనలోని బ్రహ్మత్వమును సంభావించాలి. సాక్షాత్కారానుభవం పొందాలి. ఏక్షణంలో

నీవు నీబ్రహ్మాత్మ్యాన్ని సంభావిస్తావో, నీలోని బ్రహ్మాత్వసాక్షాత్కారం పొందుతావో, నీలోని జ్ఞానజ్యోతిని జీవిస్తావో, తత్ క్షణమే జ్ఞానకాంతి, సూర్యునిలోనుంచి వెలుగువలె, నీలోనుంచి పొంగిపొరలి ప్రవహిస్తుంది.

గుర్తుంచుకోండి. ఈ సంస్కరణప్రయత్నాలన్నీ - మానవులను సంస్కరించాలని చేసే యీ ప్రయత్నాలన్నీ - ధనమూ మొదలైన బాహ్యసహాయాలమీద, పరులనుండిపొందే సహాయాలమీద, యాచనలతో కూడిన యత్నాలమీద ఆధారపడి చేసే ప్రయత్నాలన్నీ — విఫలాలు కాక తప్పవు. ఇది ధర్మనియతి. పరమమైన, అనంతమైన నీలో ప్రకాశిస్తున్న పరమ సత్యంమీద మాత్రమే ఆధారపడు. బాహ్యం సహాయం నిన్ను వెతుక్కుంటూవచ్చినప్పుడు మంచిదే-నీవా సహాయాన్ని అనుగ్రహదృష్టితో స్వీకరించవచ్చు. బాహ్యసహాయాలు నీకు శుశ్రూష చేయాలని వచ్చినప్పుడు నీవు వాటిని అనుగ్రహించినట్లుగా స్వీకరించు. నీవుగనుక ఏక్షణమందు ఈ సహాయాలమీద ఆధారతడతావో, ఆ క్షణమందే అవి నిన్ను వదులుతవి. ఇది ధర్మనియతి. ఎప్పుడైనాసరే బాహ్యసహాయంమీద ఆధారపడకు. నీ మీదనే నీవు ఆధారపడు. నీలోని దివ్య శక్తిపై ఆధారపడు. ఇది అత్యావసరం ఇంకొక విధానం లేదు. ఈ పెద్ద పెద్ద సమావేశాలు, పెద్ద పెద్ద చేదగ్రాడులాంటి బిరుదాలు, ఈ వివిధడాంబికరూపాలన్నీ నిష్ఫలాలు. వీటిపై ఆధారపడే మానవులు లక్ష్యమును తప్పుతున్నారు. ఇలాంటి వారు ఎవరినీ విముక్తులను చేయలేరు. ఎవరికీ స్వాతంత్ర్యం గూర్చలేరు. ఇట్టి మానవులు జగద్దుఃఖనివృత్తి చేయలేరు. పైగా లోకానికి కడగండ్లే తెచ్చిపెడతారు.

ఒక నిర్జీవమైన శవాన్ని తీసుకోండి. విద్యుచ్ఛక్తిచేత దాన్ని మనం కదిలేలాగ చేయవచ్చు,దాని పెదవులు మనం కదిలేలాగ చేయవచ్చు. దానికాళ్లూ, చేతులూ చలింప జేయవచ్చు. కాని అదిసజీవత్వం కాదు. అదే ప్రకారం బాహ్యసహాయమంతా, ధనంచేత కూర్చుకున్న బలమంతా, ఐశ్వర్యంచేత, వస్త్రాభరణాలచేత సమకూర్చుకున్న శక్తి అంతా, వార్తాపత్రికలచేత పొందబడిన కీర్తిఅంతా, శిష్యులచేతా

భక్తులచేతా పొందబడిన గౌరవమంతా, ఈ బాహ్యాధారమంతా, శవాన్ని చలింపచేసే విద్యుచ్ఛక్తియొక్క ఆధారం లాంటిదే. దీనివల్ల శవం రాదు. దీనివల్ల దుఃఖనివృత్తి కలగదు. దీనిచేత మానవుడు విముక్తుడై, స్వతంత్రుడు కాడు. టమటమాలు ప్రయోగించడంలో జీవం జనించదు. జీవశక్తి మూలమునుంచి- లోనుంచి – ఆత్మలోనుంచి – జనిస్తుంది. ఇక్కడొక సజీవబీజ మున్నది. ఇందులో జీవశక్తి ఉన్నది. ఆ జీవ శక్తి లోనుంచి మొలుస్తుంది. ఆ మొలవడానికి కొద్దికాలం తీసుకుంటుంది. అయినా అది నిజమైన జీవం. కృత్రిమ నటన కాదు.

మన మొక శవంలో విద్యుత్ప్రయోగంచేత విచిత్ర సంచలనాలు కలిగించవచ్చు. కాని ఆ సంచలనం జీవంకాదు. ఆ శవంలో జీవం లేదు. మనకు కావలసింది జీవం. అదే ప్రకారం రాముడు చెబుతున్నాడు.—బీజము నాటండి. మీ హృదయాల్లో సత్యమును నాటుకోండి. విత్తనము ఒకసారి నాటబడిన తర్వాత దాన్ని గురించి మనము అంతగా తహతహ బడ నవసరంలేదు. అదేమాదిరి వేదాంతమును వ్యాప్తంచేయడానికి, వేదాంత ప్రచార ప్రబోధాలు చేయడానికి నీవు స్వయముగా సత్యసాక్షాత్కారం పొందాలె. బీజము నాటబడుతుంది. మొక్కనుగురించి ఇంక విచారం అనవసరం. నెమ్మదిగా మొక్క నీ ఆందోళనతో సంబంధం లేకుండగనే మొలిచితీరుతుంది.

ఒకప్పుడు ఒక ఋషి ఉండేవాడు. అతనికి ఒక అత్యంత ప్రీతిగల శిష్యుడున్నాడు. ఆ శిష్యుడు ప్రతి దినమూ, తప్పకుండా గురుదర్శనానికి వచ్చి వెళ్ళుతుండేవాడు. ఒకసారి ఆ ఋషి కొంతకాలము వరకు ఎక్కడికో వెళ్ళాడు. తిరిగి ఆశ్రమానికి వచ్చాడు. కాని, అతని ప్రియశిష్యుడు ఇప్పుడు రావడం మానాడు. వారూ వీరూ వచ్చి, అంతకు ముందు అతిభక్తితో ఆశ్రమానికి వస్తుండే శిష్యుడు ఇప్పుడు బొత్తిగా రావడంలేదని ఆ ఋషితో నేరాలు చెప్పారు. వారి మాటలు విని ఆ ఋషి చిరునవ్వు నవ్వి ఇలా అన్నాడు:- "అతనిలో ఏమి తప్పు ఉన్నది? ఎందుకు అతనిలో మీరు నేరాలు వెదకడం? అతడు నా దగ్గరకు రావలసిన అవసర మేమున్నది? అతడు ఎందుకీ దేహానికి వ్యామోహబద్ధుడు కావాలె? నే నీ వ్యక్తినిగాదు. నే నీ

శరీరాన్ని కాదు. నన్నతడు ఈ శరీరంగా భావించినట్లయితే, నన్ని వ్యక్తిత్వంగా అతడు గ్రహించినట్లయితే తనను తానే అతడు హత్య చేసుకుంటున్నాడు. ఈ సత్యాత్మను, నా స్వస్వరూపమైన ఈ పరమ సత్యమును, ఈ బ్రహ్మాత్వమును, ఈ పరమచిచ్ఛక్తినిమాత్రమే-నేనని-అతడు తెలుసుకుంటాడుగాక. నా ప్రబోధాల నతడు విశ్వసించి, ముక్తుడై, ఆనందమయు డౌతాడుగాక!'' ఇంకా ఆ ఋషి ఇలా అన్నాడు :- "ఆడగుఱ్ఱము ఒకసారి గర్భము ధరించినపిదప, తిరిగి మగ గుఱ్ఱాన్ని పొంద నవసరంలేదు. బీజం నాటబడింది. ఉచితసమయంలో గుఱ్ఱపుపిల్ల పుట్టుతుంది. అదే ప్రకారం విత్తనాలు నాటబడినవి. ఫలితాలకోసం నేను గందరగోళపడను. బీజాలు అవే ఫలిస్తాయి."

అదేమాదిరి మీరు సమావేశాలూ, సభలూ చేసినా, చేయక పోయినా రామునికేమీ లేదు. రాముని పేరు మీరు గుర్తుంచు కున్నా లేక మీ పాదాలక్రింద త్రొక్కినా రాముని కేమీ లేదు. మీరు పొగడినా, నిందించినా, ఈ దేహాన్ని మీరు తృణీకరించినా రాముని కేమీ లేదు. విత్తనము నాటబడింది. ఫలితం దానంతటదే వస్తుందిగాక! తిరిగి మన కెందుకీ ప్రపంచవిషయమైన ఆందోళన ? ఏ నిమిషములో మనము ప్రపంచ సంస్కర్తల మని నిలుచుంటామో, ఆ నిమిషంలోనే మనము ప్రపంచమును వికారపరిచేవాండ్ల మవు తున్నాము. వైద్యుడా! ముందు నీ రోగము నీవు బాగుచేసుకో.

వేదాంతదృష్ట్యా సమస్తప్రపంచమూ పరబ్రహ్మమే. సమస్త ప్రపంచమూ పూర్ణమైనది. సమస్త ప్రపంచమూ భగవంతుడే. సమస్త ప్రపంచమూ నా ఆత్మే. సమస్త ప్రపంచమూ ఒకటే! అసలువిషయం ఇదైనప్పుడు నేను సంస్కరణానికిపూనితే, నేను మిమ్ము పతితులనుగా చూస్తే, నేను మిమ్ములను దుఃఖపీడితులని భావిస్తే, దుర్జనులని నిందిస్తే, ఆ క్షణమందే నేను మిమ్ము వికృతరూపులను చేస్తున్నానన్న మాట. ఎందుకంటే నా ఆత్మకు వేరుగా మిమ్ము చూస్తున్నానకదా మరి. అందుకనే వేదాంత మీ విధంగా ప్రవచిస్తున్నది. "ఓ సంస్కర్తలారా! ఈపనికి పూనిన మీరు ప్రపంచాన్ని వికృతంగాచూచి నిందిస్తున్నారు." నీ సహాయంకోసం దేబిరించేటంత దౌర్భాగ్యం ప్రపంచానికి ఎందుకు

పట్టాలి ? క్రీస్తువచ్చి ప్రజలను సముద్ధరించడానికి చేయవలసినదంతా చేశాడు. కానిప్రపంచం సంస్కరణం పొందలేదు. కృష్ణుడువచ్చి తన శక్తికొలది ప్రయత్నించాడు. బుద్ధుడు వచ్చాడు. సమస్త తాత్వికులు వచ్చారు. బాధాశోకాలు ప్రపంచంలో సాగిపోతూనే ఉన్నవి. ప్రపంచ దుఃఖానికి అంతం కనబడలేదు. ఈనాటివరకు ప్రజలు ఏమయినా ఎక్కువ సుఖం గడించారా? మీా రైళ్ళూ, మీా టెలిగ్రాఫులూ, మీా టెలిఫోనులూ, మీా పెద్దపెద్దనావలూ, మీా పెద్దపెద్ద సమస్తమయిన విజ్ఞానశాస్త్రనిర్మాణాలూ ప్రపంచప్రజలకు ఎక్కువ సుఖం ఏమైనా యిచ్చినవా? ఇది ఒకే భిన్నముయొక్క లవహారములను రెంటినీ హెచ్చించడంవంటిది. భిన్నం, రూపంలో మారుతుంది. పెంచబడినట్లు కనబడుతుంది. కాని, అది నిజానికి ఒకే భిన్నమును నిష్పత్తిప్రకారం పెంచడంలాంటిది. మీా రాబడి పెరిగినకొద్దీ, మీా ఆస్తి పెరిగినకొద్దీ మీా కోరికలుకూడా పెరుగుతవి. ఇది ఒక కుక్కతోకలాంటిది. కుక్క తోకను పట్టుకున్నంతసేపు సరిగా వుంటుంది, ఏ నిమిషంలో వదిలితే ఆ నిమిషంలో తిరిగీ యథారీతి ముడుచుకుపోతుంది. సంస్కరిద్దామనే కోరికతో నిలబడేమానవులు, జగత్తులో ఈ రకంగా ఏదో గోలచేసే మానవులు, ఆత్మవంచకులు. యువకులారా! ప్రపంచంలో మీారు ఏదో ఒక డాంబిక కర్మను ప్రారంభించి పెద్ద తప్పుచేస్తున్నారని గుర్తించు కోండి. మీా ఆత్మకేంద్రంలోనుంచి బహిర్ముఖులుకావద్దు. మీా సత్య బ్రహ్మత్వాన్ని సంభావించండి! ధ్యానించండి! ఏ క్షణంలో మీారు దివ్యత్వప్రపూర్ణులౌతారో ఆ క్షణమందే అప్రయత్నంగా, శాశ్వ తంగా మీాలోనుంచి శక్తి, దివ్యబలం ప్రవహిస్తుంది. ఇదే సత్య వ్యాపన చేసే మార్గం.

'నాకేమాత్రం నిశ్చలమయిన ఆధారం లభించినా నేను ప్రపంచాన్ని కదిలించగలను.' అని 'ఆర్కిమెడిస్' అంటుండేవాడు. పాప మతనికి నిశ్చల బిందువే కనబడలేదు. నిశ్చలస్థానం నీలోనే ఉన్నది. దాన్ని గ్రహించు. దాన్ని సంభావించు. దాన్ని సందర్శించు. నీవు పరబ్రహ్మవని తెలుసుకో. విశ్వనాథుడవు, ధర్మసింహాసనాధిపతివి, సమస్తసౌందర్యమూలం, సమస్తశక్తి, సమస్తబలము, నీవని తెలుసుకో.

సమస్త జగదీశ్వరుడవు నీవని గ్రహించు! తత్త్వమసి! నీ సత్యాత్మ సాక్షాత్కారం దానంతటదే సమస్త జగత్తును జయించగలుగుతుంది. ప్రపంచమునకు జీవప్రదానం చేయగలుగుతుంది

సూర్యుడు తన కర్మనంతా వేదాంత సూత్రాల ననుసరించి నిర్వర్తిస్తున్నాడు. అతడే సమస్త ప్రపంచ జీవశక్తులకు మూలస్రవంతి. సూర్యుడు ఆదర్శవేదాంతి. రాముడు మీకు బోధించే విషయాలనే సూర్యుడు ఆచరిస్తున్నాడు. సమస్తప్రపంచమునకు జీవశక్తుల నతడు ప్రదానం చేస్తున్నా, నిస్సంగుడై, నిర్లిప్తుడై చేస్తున్నాడు. అతనిలో అహంకృతి లేదు. అతనిలో స్వార్థదృష్టి లేదు. అతనిలో గర్వంలేదు. డాంబికత లేదు. అతడు తనలో తాను శక్తిని నింపుకొనియున్నాడు. సర్వశక్తిప్రపూర్ణుడై, సర్వబల ప్రపూర్ణుడై, సర్వతేజః ప్రపూర్ణుడై, సర్వచైతన్యమూర్తియై అతడు ప్రకాశిస్తున్నాడు. అతడు ఉదయించే ముందుతన రాకను గురించి ఏమయినా ప్రచురణాసంరంభంచేస్తున్నాడా? ఏదైనా కరపత్రంప్రకటిస్తున్నాడా? ఏమైనాగందరగోళం చేస్తున్నాడా? ఓహో! లేదు. కాని, చూడండి. ఈ సమస్త భూమండలము ఈ మీ ప్రపంచమంతా ప్రబుద్ధ మవుతున్నది. చైతన్యదీపిత మౌతున్నది. ఓహో! ఎంత ప్రశాంతంగా, ఎంత నెమ్మదిగా, ఎంత క్రమవిధానంగా, ఎంత సత్యవిధానంలో జగద్వికాసకర్మ చేస్తున్నాడు సూర్యుడు! ప్రకృతి మేలుకొంటున్నది. నదులు మేల్కొంటున్నవి. రాత్రివేళ నదీ నదులు మంచుగా పేరుకొంటవి. సూర్యుడు ఉదయించి వాటిని ఉష్ణీకరించి మేలుకొలుపుతున్నాడు. అవి జీవశక్తితో ప్రవహిస్తాయి. సూర్యభగవానుని ప్రేమకిరణస్పర్శ మాత్రంచేత సరోవర నదీకూలములందలి గులాబీపూలు, రకరకాలపూలు వికసిస్తాయి.

మానవ నేత్రపద్మాలుకూడా వికసిస్తాయి. అంటే మానవులు కూడా మేలుకుంటారు. శక్తిప్రపూర్ణు లవుతున్నారు. గాలిసంచరిస్తుంది– జీవప్రపూర్ణ మవుతున్నది. సూర్యభగవానుడు చైతన్య ప్రపూర్ణుడు. అతనిలోనుంచి జీవతేజము, ప్రపంచముమీదికి ప్రసరిస్తున్నది. ప్రపంచ సంచలనం కలిగించినందుకు, మిమ్ములను మేలుకొలిపినందుకు, పక్షుల కంఠాల్లో సంగీత మధు వొలికించినందుకు, పూవులను వికసింపచేసి

నందుకు సూర్యుడు, ప్రతిఫలం కాంక్షించడం లేదు. నేను చేశానని కర్తృత్వం వహించడంలేదు. నిష్కామకర్మ చేస్తున్నాడు. అతడు తనపై తానాధారపడియున్నందున, తనలో తాను జీవించడంచేత, అంతర్ముఖుడై యుండడంచేత, సమస్తమూ ఆయనముందు జరిగిపోతు న్నది. ఇదే సూత్రం. అంతర్ముఖుడవుకా. నీలో నీవు జీవించు. నీలో, ఆత్మలో జీవించు. నీవు పరంజ్యోతివని సంభావించు. జగన్నాధుడవని తెలుసుకో. ధర్మశాసకుడవని, సౌందర్యమూలమవని, సమస్త జగత్తా రకుడవని సంభావించి, దివ్యానుభూతి పొందు. ఈ దివ్యానుభవాన్ని పొందు. ఈ దివ్యానుభూతి పొందు. ఈ ఆధ్యాత్మిక సాధనచేసి, తరువాత చూడు!

పసిబిడ్డను, శిశువును సంతోషపరచడానికి ఏంచేస్తారో తెలుసా? ఈ పిచ్చి తల్లిదండ్రులు, శిశువునకు శిష్యులవుతున్నారు. పిల్లవాని గుణవిశేషాలు అందరునూ నేర్చుకుంటున్నారు. శిశువున కందరూ ఎట్లు శిష్యులగుచున్నారోచూడండి! తల్లి దండ్రులుగానీ, పక్క ప్రజలుగానీ శిశువు మాట్లాడిన విధంగా మాట్లాడుతారు. శిశువు ఆడిన విధంగా ఆడుతారు. శిశువు ముఖ విన్యాసాలను నటిస్తారు. శిశువు వారి భుజాలపైన స్వారి చేస్తాడు. ఈ పసికూన ఎంత బలశాలి! శిశువు అమాయకంగా జీవిస్తాడు. అతనికి ఏ బంధాలు లేవు. అతడెవ్వరికీ భయపడడు. శిశువుయొక్క అమానాధరాలు ఎంత హృదయంగమంగా ఉంటవి. ఎంత అసమానసౌందర్యంగా ఉంటవి. ఆ శిశువు సంకల్పానికి అడ్డులేదు. పసిబిడ్డశరీరము ఎంతకోమలమైంది. చిట్టి కాళ్లు, చిట్టి చేతులు. ఇలాంటి శిశువు తనలో తాను నమ్మి యున్నాడు. అతని కోరిక నెరవేరితీరవలసిందే. శిశువు అంత బలహీన తలో ఎంత బలశాలి! తనలో తాను విశ్వాసపూర్ణుడై అతడు దేహ దృష్టికి అతీతుడుగా ఉన్నాడు. తల్లి దండ్రులు అతని కొరకు తరచు ఆస్తిపాస్తులుకూడా అమ్మివేస్తారు. ఆ శిశువుకోసమని- ఆ చిట్టి మహా యోధుని కోసమని- సమస్తం త్యాగం చేస్తారు. అతని ఆజ్ఞలు నిర్వహించనివానికి ఆనందము లేదు! శిశువులో ఉన్న ఆశక్తియొక్క రహస్యం వేదాంతమైయున్నది. అతనికి ప్రపంచం

ప్రపంచంకాదు. అతనికి ఈ జ్ఞానం జ్ఞానంకాదు. అతనికి పరమానందం తప్ప ఇంకొకటి తెలియదు. సమస్తశక్తి మధురమయిన ఆ అమాయిక శిశువులో ఉన్నది. ఇదే శిశువుయొక్క విజయంలోని రహస్యం.

ఈ విధంగా వేదాంతము ననుష్ఠించు. నేను సర్వశక్తిమయ పరబ్రహ్మను, విశ్వనాథుడను, మహాదేవుడను, దేవదేవుడను, సమస్త ప్రపంచ భూతనాథుడను అని సంభావించు. "నేను పరమసత్యమును" అని సంభావించు. జీవించు. యీ బ్రహ్మానుభూతిపొందు. ఓ, నీకు శిష్యులకు కరువుండదు. కావలసినంతమంది శిష్యులు. శిశువులు ఏ ప్రచారం చేయకుండగనే, ఏ టమటమాలు వేసుకోకుండనే, ఏ పెద్ద మనిషియొక్క సానుభూతి పొందకుండనే, ఏ పత్రికలయొక్క మన్నన పొందకుండానే శిష్యులను సమకూర్చుకుంటున్నారు. శిశువును చూచిన వారంతా వానికి శిష్యులై పోతున్నారు. నిజంకాదా ఇది?

వేదాంతము ననుష్ఠించు. నీ ఆజ్ఞను శిరసావహించే ప్రజలు నీకు గుంపులు గుంపులు దొరుకుతారు. చంద్రోదయమయినపుడు వచ్చి ఆ ఆనందసౌందర్యాన్ని అనుభవించే జనులు కరువౌతారా? ప్రాగ్భారతదేశంలో విదియరోజున సమస్త జనులు ఇండ్లలోనుంచి బయటికివచ్చి చంద్రదర్శనం చేసుకొని చంద్రగతమయిన భగవద్రూపాన్ని ఆరాధిస్తారు. ఆ రోజును విదియ అని పిలుస్తారు. అంటే ఆనందదిన మని పిలుస్తారు. ఆనాడు ప్రజలు మంచి విందుచేసుకుంటారు. పండగచేసుకొని బంధువులతో, స్నేహితులతో సంతోషపడతారు.

మీ హృదయాకాశంలో చంద్రోదయం కానివ్వండి. ప్రేక్షకుల కోసం, అనుయాయులకోసం ఆతురత పడనవసరంలేదు. సమస్త అనుకూలతలూ మిమ్ములను వెతుక్కుంటూవస్తాయి. రోజాపువ్వు వికసించినపుడు తుమ్మెదలకు కరువు వస్తుందా! తేనె ఉన్నచోటికి చీమలు వెతుక్కుంటూ వస్తాయి.

అదేప్రకారం మీ హృదయాల్లో జ్ఞానమధూదయానికే జాగ్రత్తపడండి. మీలో జ్ఞానపద్మసుగంధ వికాసానికే జాగ్రత్తపడండి. సర్వం అప్రయత్నంగా లభ్యమవుతుంది. నీవు కోరదగిన వస్తువే

ఉండదు. నీవు ఒకదాన్ని కోరనవసరమేలేదు. నీవు కోరదగినవస్తువు ఏదైనా వున్నదంటే అది బ్రహ్మత్వమే! నీ ఆత్మ సాక్షాత్కారమే - నీవు వెనుకకు పడిపోతావా, సర్వమూ నిన్ను పరిత్యజిస్తుంది. నీవు నీలోని పరమాత్మను వదలక గట్టిగాపట్టుకున్నప్పుడు, నీలోని బ్రహ్మను తెలుసుకున్నప్పుడు, ఆ సత్యాత్మను నీవు జీవిస్తున్నప్పుడు, సమస్త ప్రపంచం కుక్కలాగా నీ పాదాలు నాకడాని కభిలషిస్తుంది. ప్రపంచ వస్తువుల కోసం వేటాడబోకు. సమస్త శక్తియొక్క రహస్యం నీలోనే ఉన్నది. ఇంకొకచోట లేదు.

ఇక్కడ కాలిఫోర్నియాలో శాస్తాజలస్రవంతులున్నవి. అక్కడ జలదృశ్యం అతిమనోజ్ఞమని జనప్రతీతి. ప్రతివ్యక్తి అక్కడికిపోయి చూడాలని అభిలషిస్తాడు. కాని శాస్తాజల స్రవంతులు, ప్రేక్షకులకోసం తహతహపడ నవసరంలేదు. రాండి రాండని కరపత్రాలు జనులకు పంచనవసరంలేదు. ప్రజలే తప్పక వారంతటవారు వచ్చి చూచి తీరుతారు.

అదేప్రకారం ఏ నిముషంలో పరిశుద్ధ జ్ఞానజలం, జీవజలం, పవిత్రప్రేమజలం నీ హృదయంలోనుంచి వెలికి ఉబికి పొంగుతుందో, ఆక్షణమందే శాస్తాజలస్రవంతులతీరాలకువలె, నిన్ను వెతుక్కుంటూ ప్రజలు వారంతటవారే పరుగిడి వస్తారు. ఇది అప్రతిహతమైన ఏకైక మైన ధర్మనియతి. కావలసిన విషయ మేమిటంటే, బ్రహ్మజ్ఞానజలను నీలో కనుగొనడమే! నీవు ఒకేచోట ఉండు—లేదా ఒకచోటునుంచి ఇంకోచోటుకు నీ స్వేచ్ఛారీతి పరివ్రజించు. ఎట్లైనా ఒకటే. నీవు ఒకేచోటఉన్నా ప్రజలు నీసన్నిధికి వస్తారు. నీవు ఒకచోట నిలువక, నిరంతరసంచారం చేస్తున్నా, ప్రజలు నీ సన్నిధికి వస్తారు. అయితే నీలో నిజమైన సత్యం, దైవశక్తి ఉండాలె. బాహ్యాటనల్లో ఏమీ లేదు. నీలో బ్రహ్మభావవాహినులు స్వేచ్ఛాలీల, స్వచ్ఛరూపంతో ప్రవహింపచేయడమే-నీవు శ్రద్ధతో చేయవలసినపని.

కాంటు (Kant) చరిత్రలో, అతను ఎప్పుడు పుట్టాడోకూడా అతనికి తెలియదని వ్రాయబడింది. కాని ప్రపంచంలో నలుమూలలా

అతని విషయం తెలుసు. ఒకే స్థలములో నివాసంచేసినంతమాత్రాన విజయం లభించదు. నీలో దైవశక్తిని ప్రబుద్ధంచెయ్యి. నీవప్పుడు కాలుకదల్చక సోఫామీద హాయిగా కూర్చోవచ్చు. ప్రపంచ మప్పుడు నీనుండి సత్యమును గ్రహించడానికి రాకపోతే, నీకేం—దానికే చేటు మూడిందన్నమాట.

న్యాయాధికారి సభలో ఉచితాసనాన్ని అలంకరిస్తాడు. వాదులు, ప్రతివాదులు న్యాయవాదులు, సాక్షులు, గుమాస్తాలు మొదలైన వాండ్లందరూ వాండ్లంతటవాండ్లే వచ్చి సభకు హాజరవుతారు. వాండ్ల కోసం న్యాయాధికారి ఎదురుచూడనవసరంలేదు. సభలో కుర్చీలు అమర్చటానికీ బల్లలు సర్దడానికి అత డవస్థపడ నవసరంలేదు. వాది ప్రతివాదులకోసం, సాక్షులకోసం, న్యాయవాదులకోసం ఆహ్వానాలు పంపనవసరంలేదు. ఆ పనులన్నీ ఇతరులే చూస్తారు.

రాముని సందేశ మిది:— నీలో ఉన్న స్వర్గరాజ్యాన్ని, ఈ బ్రహ్మపదవిని పట్టుకో! ఓ పరబ్రహ్మ స్వరూపా! ఓ దివ్యైశ్వర్యసిధీ! ఓ మానవుడా! నీ బ్రహ్మపదవీవైభవంతో నడువు చక్రవర్తివై నడువు. నీ దివ్యైశ్వర్య ప్రతిభతో నడువు. ఒక దేవతవలె గమించు. నీ వ్యావహారికవిషయాలను గురించి, నీ వేషభూషణాదులనుగురించి, నీ ప్రయాణపుఖర్చులను గురించి, నీ ఆస్తిపాస్తులను గురించి, నీ యింటినిగురించి, ఈ సమస్త ప్రాపంచిక విషయాలను గురించి విచారించబోకు. ఇదంతా బాహ్యప్రపంచానికి సంబంధించిన వ్యవహారం. లేచి రా. నీ బహ్మాత్మసాక్షాత్కారం పొందు. నీవు సూర్యసూర్యుడవని తెలుసుకో. ఈ సూర్య చంద్ర తారాదేవతా కోటిసైతం నీ అభిమతానుసారం నడుస్తుంది. చచ్చినట్లునడిచి తీరుతుంది. ఇది ధర్మం, ఇది పరమసత్యం, ఇదే విజయ రహస్యమని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది. ఏ నిమిషంలో నీవు బ్రహాత్మస్థితుడ వౌతావో, నీ సత్యాత్మానుభవం పొందుతావో, ఆ నిమిష మందే నీవు మహాశక్తి సంపన్నుడ వౌతావు. ఆ నిమిషమందే ప్రపంచం నిన్ను అన్వేషిస్తుంది. ఆ నిమిషమందే ప్రపంచం నీ అనుగ్రహాన్ని అర్థిస్తుంది.

చట్టాలవల్ల, కృత్రిమశాసనాలవల్ల విజయం లభిస్తుందని,విజయం ధన వస్తువాహనాలమీద, వన్నాగాలమీద బాహ్యసహాయాల మీద, సేవక బంధు మిత్రాదులమీద ఆధారపడియున్నదని ప్రపంచ ప్రజల తలంపు. ఇది పెద్ద పొరపాటు. ఓహో! తమ నాశనానికి తాము దారి తీసుకుంటున్నారు. ఇలాంటి ప్రయత్నాలు, కృష్ణపక్షిని కృత్రిమంగా పాడేలాగు చేసే యత్నాల్లాంటివే.

ఒక పావురం ఉందనుకోండి. దాన్ని హిమాలయశిఖరాల మీద, ఆకాశ మంటుతున్న దేవదారు శాఖాగ్రముపైన కూర్చో నివ్వండి. అప్పుడు దానంతటదే పావురం ఉద్రిక్త మవుతుంది. మధుర గాన వాహినులు దాని గళంలోనుంచి ప్రవహిస్తాయి. ఆ హిమాలయ శిఖరాలపైన, గులాబీపూల సుగంధానిలంలో ఉన్మత్తమైన కృష్ణపక్షి గానమధువు వర్షిస్తుంది. అదే ప్రకారం సాక్షాత్కార పర్వతాగ్రం పైన నీవు స్థిరంగా నిలువు. నీ బ్రహ్మత్వంలో గాఢంగా మగ్నుడవుకా! ఆరూఢస్థితి నలంకరించు! అప్పుడు నీ దివ్యత్వంలోనుంచి జగద్ధిత కర్మలు, పవిత్రజీవితం, పరిశుద్ధశీలం, లోకసంగ్రహం అనే సర్వ శుభోదయకాంతి దానంతటదే ఉద్గతమౌతుంది. పొంగి పొరలి ప్రవహిస్తుంది. కట్టలు తెంచుకొని వెలువడుతుంది.

సంస్కర్తలు ఏ మేమిటో చట్టాలు, నిబంధనలుపెట్టి, మనుష్యులను బాగుపరచా లనుకుంటారు. ప్రజలపైన తమ ఆదేశాలను చెలాయించా లనుకుంటారు. తమకు తామే ప్రజాశోధక కంకణం కట్టుకుంటారు. ఇది అసహజం. ఇలా మంచి జరుగదు.

"ఓ! మాకు ఆచరణ కావలె."అని జను లంటారు. "ఆచరణ ఎక్కడనుంచి రావాలె?"అని రాము డడుగుతున్నాడు. బాహ్యకర్మల చేత ఆచరణ, కృష్ణపక్షియొక్క కృత్రిమ సంగీతంలాగా ఉంటుంది. కృష్ణపక్షి గొంతు గట్టిగా పట్టుకొని "ఇంక పాడు. క్రిందికి దిగి పాడు" అంటే అది మనోహరగానం చేయలేదు. అది స్వేచ్ఛపొందిన నిమిషంలో మాత్రమే కంఠమెత్తి గానం చేయగలుగుతుంది. అదే ప్రకారం, ఏ క్షణంలో నీవు నీ కేంద్రస్థానంలో నిలుస్తావో, అంత

ర్ముఖుడవై బ్రాహ్మీస్థితి నలంకరిస్తావో, బ్రహ్మభావారూఢస్థితి పొందు తావో, సాక్షాత్కార శిఖరాలపైకి ఎగురుతావో, ఆ నిమిషమందే నీలోనుంచి ధర్మాచరణ కృత్యాలు, వీరకర్మలు, ఉచితస్థానంలో కూర్చున్న కృష్ణపక్షి గళంలోనుంచి మధుగీతాల్లాగా వెలికి పొంగి ప్రవహిస్తాయి. ఇదే సరైన మార్గం.

ఇక్కడొక ఇనుపముక్క ఉందనుకోండి. దీన్ని మనం అయ స్కాంతంగా మార్చి, ఇనుపముక్కలు ఆకర్షించేలాగు చేయాలను కుంటాము. ఏరకంగా చేయగలం? ఇనుపముక్కకు అయస్కాంతత్వం పొందించడంచేత చేయగలం. ఈ చిన్న ఇనుపముక్క, ఇతర చిన్న ఇనుపముక్కలను ఆకర్షించి పట్టుకునేటట్లు చెయ్యడానికి ఇదే నిజ మయిన మార్గం. కాని, అయస్కాంతత్వం పొందకుండగానే, దానంతట అదే ఈ చిన్న ఇనుపముక్క ఇతర ఇనుపముక్కలను ఆకర్షించలేదు. ఆకర్షణశక్తి రావాలంటే ఈ మొదటి ఇనుపముక్క అయస్కాం తంగా మారాలి. ఇప్పుడు మనం ఇక్కడ ఒక అయస్కాంతం ఉందను కుందాము. ఈ మొదటి ఇనుపముక్కను ఈ అయస్కాంతంతో కలుపుదాము. అప్పుడు ఈ మొదటి ఇనుపముక్కకూడా ఒక అయ స్కాంతంగా మారి రెండో ఇనుపముక్కను ఆకర్షించి పట్టుకోగలదు. ఇప్పుడు ఈ మొదటి ఇనుపముక్క అయస్కాంతంతో కలిసి ఉండడం చేత అయస్కాంతంగా మారియున్నది. అయితే ఈ మొదటి ఇనుప ముక్కను అసలు అయస్కాంతంనుంచి విడిచేయండి. దానిశక్తి పోతున్నది. అది రెండవ ఇనుపముక్కను పట్టుకోలేదు. గుర్తుంచు కోండి. ఈ మొదటి ఇనుపముక్క అసలైన అయస్కాంతంతో కలిసి ఉన్నప్పుడు అదికూడా అయస్కాంతమై ఉన్నది. అప్పుడు దానికి అయస్కాంతముయొక్క గుణగణములన్నీ ఉన్నవి. స్వయంగా ఏ ఇనుపముక్కనైనా అది ఆకర్షించగలదు. ఎప్పుడు మనం అసలు అయస్కాంతంతో ఈ మొదటి ఇనుపముక్కను విడదీస్తామో, అప్పుడు దానిశక్తి పోతున్నది. అప్పుడది ఇంకొక ఇనుపముక్కను ఆకర్షించలేదు.

ఆదేశ ప్రకారము ఇక్కడ ఒక శరీరం ఉన్నదనుకోండి. దానిని మనము క్రీస్తు అని పిలుద్దాము. అతడు మహోత్తముడు. పరిశుద్ధ మానవుడు. అతని విషయమేమిటి? అతని మొదటి ముప్పైఏండ్ల జీవితములో, అతడు ఒక చిన్న ఇనుపముక్కలాగా ఎవరికీ తెలియని అజ్ఞాత జీవితము గడిపాడు. అతడొక వడ్రంగికుమారుడు. చాల బీద బాలుడు. ఒక అజ్ఞాతమాతకు పుట్టాడతడు. అతన్నెవరూ పట్టించుకో లేదు. ఈ ఇనుపముక్క క్రమంగా సత్యాత్మతో అంటే అయస్కాంతంతో ఆకర్షణమూలంతో సమస్త జీవశక్తుల మూలంతో ఏకీభవించాడు. భగవంతునితో, పరమ సత్యంతో, చిచ్ఛక్తితో అతడు కలిసి పోయినాడు. అప్పుడేమయింది? ఈ ఇనుప ముక్కకూడా అయస్కాంతత్వం పొందింది. అతడు అయస్కాంత మయినాడు. ప్రజలు అతనిచే ఆకర్షితులైనారు. శిష్యులు, గుంపులు గుంపులు ప్రజానీకము అతనిచేత ఆకర్షితులయినారు. వాండ్లంతట వాండ్లే వచ్చి అతనికి శరణాగతులైనారు. అతని జీవితాంత్యంలో క్రీస్తుయొక్క శరీరమనే ఇనుపముక్క, భగవంతుడనే అయస్కాం తంతో విడివడింది. అప్పుడేం జరిగింది? అతనికి సంబంధించి కూడివున్న ఇనుపముక్కలన్నీ పడిపోయినవి. అతని శిష్యు లందరూ వదలివేశారు. అంతకుముందు అతనిని మహాగౌరవంతో ప్రేమించి పూజించిన జెరుసలేం ప్రజలే అతనిని పరిత్యజించారు. అతనిని ఆహ్వానిస్తూ, తమ పురమును అలంకరించిన ప్రజలే చివర కతణ్ణి పరిత్యజించారు. అప్పుడాతని శక్తి పోయింది. అయస్కాంతమునుండి ఇనుపముక్కలోనుంచి విడివడిన దాని ఇతఃపూర్వశక్తులు పోతున్నవి. అతని శిష్యులు అతన్ని పరిత్యజించి నప్పుడు, ఆ పదకొండుమందీ అతన్ని వదలిపెట్టినప్పుడు, ప్రజలు ఎదురుతిరిగి అతనిమీద కక్షతీర్చుకోవాలని సంసిద్ధులై అతనిని హింసించడానికి పూనుకున్నప్పుడు, "ఓ తండ్రీ! నన్నెందుకు విడిచిపెట్టావు" అని క్రీస్తు నిర్వచించాడు. దీనిలో భగవంతునిలోనుంచి అతడు పొందిన చ్యుతి కనపడుతున్నది. క్రీస్తుజీవితము ఏమి బోధిస్తున్నదో చూడండి. క్రీస్తు యొక్క సర్వశక్తి, క్రీస్తుయొక్క సర్వప్రభావము, అతనికే సత్యాత్మ అనే అయస్కాంతంతో ఉన్న సంబంధంలోనే కలదని అతని జీవితం ప్రబోధిస్తున్నది. క్రీస్తుయొక్క భౌతిక దేహం, సత్యశక్తిఅనే

అయస్కాంతముతో కలిసి ఉన్నప్పుడు, ఆయన దేహంకూడా అయస్కాంతమై ఉన్నది. మరి క్రీస్తు శరీరం సత్యశక్తి అనే అయస్కాంతమునుంచి విడిబడ్డప్పుడు, ఆయన శక్తిపోయింది. ఆయన శిష్యులు, అనుచరులు పరిత్యజించి వెళ్ళారు. తిరిగి క్రీస్తు తన మరణానికి ముందు తనదైవైక్యస్థితిని పొందగలిగాడు. క్రీస్తుశిలువ వేయ బడినప్పుడు మరణించలేదని మీకు తెలుసు. దీన్ని రుజువుచేయవచ్చు. శరీరం కొరత వేయబడినప్పుడు అతడు సమాధిస్థితిలో నున్నాడు. ఆ స్థితిలో ప్రాణసంచలనం ఉండదు. హృదయం కొట్టుకోదు. రక్త స్పదనం నాడుల్లో పైకి కనపడదు. ఆ స్థితిలో ప్రాణము ఉన్నట్లే కన పడదు. క్రీస్తు మూడు రోజులు ఆ సమాధిస్థితిలో లయమై యోగివలె తిరిగి సజీవుడై తప్పించుకొని కాశ్మీరుకు వచ్చాడు. రాముడు కాశ్మీరులో ఉన్నప్పుడు క్రీస్తు అక్కడ వసించిన అనేక చిహ్నాలు కనుగొన్నాడు. అప్పటివరకు, కాశ్మీరులో క్రైస్తవసంఘము ఉండేదికాదు క్రీస్తు పేర్లతో అనేకప్రదేశాలు కాశ్మీరులో ఉన్నవి. ఏ క్రైస్తవులు రాని అనేకపట్టణాలు, జెరుసలేము సంబంధమైన పట్టణాల పేర్లతో ఉన్నాయి. రెండు వేల సంవత్సరాలక్రిందటి ఒక ప్రాచీనమయిన గోరీ ఉన్నదక్కడ. ఆ గోరీని అతిపవిత్రంగా చూస్తారు. అది 'ఏసు సమాధి' అని పిలువ బడుతున్నది. హిందూస్తానీ భాషలో క్రీస్తుపేరును 'ఏసు' అని పేర్కొంటారు. ఏసు అంటే రాజకుమారుడని అర్థం. ఈ విధంగా క్రీస్తు శిలువ అనంతరము తాను ఏ భారతవర్షంలో మొదట తనప్రబోధాలు నేర్చుకున్నాడో ఆ భారత దేశానికి తిరిగి వచ్చాడని రుజువు చేయ డానికి అనేక తార్కాణా లున్నవి.

ఇంకొక విషయం : కాశ్మీరప్రాతంలో ప్రజలు ఒకరకమైన విచిత్ర ఓషధిని 'క్రీస్తు ఓషధి'అని పిలుస్తారు. ఈ ఔషధాన్ని తయారుచేసే వైద్యులు, సజీవుడై వచ్చిన తర్వాత క్రీస్తు తన గాయా లకు ఈ మందు ఉపయోగించాడని అనుశ్రుతంగా చెబుతారు. నిజా నికి ఈ ఔషధము అన్నిరకాల గాయాలను విచిత్రంగా నయం చేస్తుంది.

తిరిగి క్రీస్తు భారతదేశానికి వెళ్ళినాడన్న విషయానికి తగినన్ని తార్కాణా లున్నవి. ఇప్పు డీవిషయాలను రాముడు విశదీకరించ డానికి అవసరంలేదు. రాముడు చెప్పే విషయమిది-క్రీస్తు దైవత్వమనే అయస్కాంతముతో తన శరీరాన్ని కలిపి యున్నప్పుడు, సమస్త ప్రపంచము అతనిచేత ఆకర్షితమైంది. అయితే ఆ సంబంధము ఎలా తెగింది? అనేక కారణా లున్నవి. బాహ్యసంపర్కాలచేత, జనులతో అతిగా కలిసి తిరగడంచేత, ఆధ్యాత్మిక శిఖరాలకు అతిదూరమై పోవడంచేత, మనము శక్తిని కోలుపోతాం. జనసమ్మర్దాన్ని విడిచి క్రీస్తు పర్వతాలకు విశ్రాంతికై పోయిన సంగతి మీకు తెలుసు. ఒక శిష్యునితో ఆయన ఇట్లన్నాడు:- "నానుంచి శక్తిపోయినట్లు కనబడు తున్నది. ఎవరు నన్నుస్పృశించారు?" ప్రజలతో అతి దీర్ఘకాలము కలిసి జీవించడంచేత, ఆధ్యాత్మిక శిఖరాలకు అతిదూరమైన న్యూన స్థితికి దిగజారడముచేత, సంబంధము తెగిపోయింది. ఇది మనుష్య లక్షణం. ఇది ప్రకృతి సహజం. క్రీస్తుయొక్క పొరపాట్లుకూడా మీకు మేలు చేకూరుస్తవి. ప్రతివాని జీవితము మనము సక్రమముగా పరిస్తే ప్రతివాని జీవితము క్రీస్తు జీవితమంత మేలు మీకు చేకూర్తుంది. మూలశక్తినుంచి, భగవంతునీనుంచే విడివడిన నిమిషమందు, నీ కింక ఆశ లేదు. దైవత్వంలో మగ్నుడవు కా. బ్రహ్మైక్యత పొందు. ఆ మహా శిఖరాలనుంచి క్రిందికి జారబోకు. సత్యసాక్షాత్కారానుభవాన్ని పొందు. అయస్కాంత సంపర్కముచేత, ఇనుపముక్క అయస్కాంత మైన విధంగా, నీవు అయస్కాంత మవుతావు. పసిబిడ్డ అతని సర్వాంగాలు, అతని కన్నీళ్ళు, అతని కోమలమైన ఆక్రందనం, సర్వమూ సజీవ మైనవిధముగా, నీశరీరం చైతన్యమయమౌతుంది.

నీవు బ్రహ్మైక్యానుభవాన్ని పొందితే, నీవు పరమ పావనుడవై ప్రకాశిస్తావు. అయస్కాంతత్వం పొందిన ఇనుమువలె నీవు అయస్కాంత మువై ప్రకాశిస్తావు. కాని, ఇంకోరకంగా ప్రజ లీ విషయాన్ని అపార్థం చేసుకుంటున్నారు. సత్యమూలమును, సత్యకారణాన్ని సత్యమైన శక్తి రహస్యాన్ని మనమిప్పుడు సూచించాము. కాని, ప్రజలు మూలమును వేరుగా తలుస్తారు. శిశువులో సత్యాత్మానభూతి పొందడంవల్ల నిజ

మైన శక్తి వెలువడుతున్నది. కాని, జనులు అతని శరీరానికిమాత్రమే ప్రాముఖ్య మిచ్చి వ్యామోహబద్ధులౌతారు. శిశువుయొక్క జీవితంలో యీ నిజమైన శక్తిమూలమును అభివృద్ధి చేయడానికి బదులు జనులు శిశుజీవితాన్ని అణగ ద్రొక్కుతారు.

క్రీస్తుజీవితమును పఠించు. క్రీస్తుచేసినట్లు నీవూ చేయి. కాని, క్రీస్తు శరీరంపైన ఆధారపడకు. క్రీస్తు ఆత్మతత్వంమీదనే ఆధార పడు. నీలోని దివ్యశక్తిమీదనే ఆధారపడు. క్రీస్తుకావడానికి ఇదే నిజమైన మార్గం.

వేదాంతం హిందూ దేశానికి మాత్రమే సంబంధించిందికాదు. హిందువుల కెంత సంబంధించిందో, క్రైస్తవులకు అంతే సంబంధించి యున్నది. వేదాంత దృక్పథంలో క్రీస్తుమీద విశ్వాసంచేత రక్షింప బడటం ఎంతవరకు నిజం ? దీనిని ఒక కథచేత వ్యాఖ్యానం చేద్దాము. ఒక అవివేక చిత్తముగల తల్లి వున్నది. ఆ తల్లి తన చిన్నికుమారునితో ప్రక్కగదిలో మూలన ఒక పెద్ద భయంకరమైన భూతం ఉందని చెప్పి భయపెట్టింది. శిశువు ఆ గదిలో అడుగుపెట్టడానికి భయపడ్డాడు. ఒకనాటి సాయంకాలం తండ్రి ఆఫీసునుంచివచ్చి ఆ పిల్లవానిని ఆ గదిలోకి వెళ్ళి ఏదో వస్తువు తెమ్మన్నాడు. ఆ బాలుడు భయపడి ఆ చీకటిగదిలో అడుగుపెట్టలేకపోయాడు. తండ్రి దగ్గరకు పరుగెత్తు కుంటూ పోయి "ఓ నాన్నా! నే నాగదిలోకి వెళ్ళను. అందులో ఒక పెనుభూత మున్నది. నాకు భయం." అని చెప్పాడు. తండ్రికి పిల్లవాడీ రకంగా పిరికివాడవడం యిష్టంలేదు. "అందులో భూతం లేదు. నీ కేం భయంలేదు. వెళ్ళి ఆ వస్తువు తీసుకురా పో." అని బుజ్జగించాడు. కాని బాలుడు భయముచేత ఆమాటలు నమ్మలేదు. తండ్రి మంచి మేధావి. పిల్లవానిలోని ఈ మూఢనమ్మకాన్ని, ఈ భయరోగాన్ని పోగొట్ట డానికి ఉపాయ మాలోచించాడు. ఒక పరిచారకుని పిలిచి అతని చెవిలో ఏమిటో రహస్యం చెప్పాడు. ఆ సేవకుడు నెమ్మదిగా వెళ్ళి, ఆ భూతముందని పిల్లవాడు భయపడుతున్న గదిలోకి, వెనుక వాకిలి గుండా ప్రవేశించాడు. ఒక దిండు తీసుకొని, దాన్నొకమూల నిలబెట్టి దానిపైన ఒక నల్లనిగుడ్డ కప్పి ఉంచాడు. పిల్లవాడు ఆవిచిత్రరూపాన్ని

చూచాడు, నిజమైన ఏదో దయ్యంకూర్చున్నట్లు కనబడింది. పిల్లవానిని పిలిచి తండ్రి ఇలా అన్నాడు:—"అదిగో! చూచావా? దానిచెవి" (దిండుయొక్క ఒకమూల చూపించాడు.) పిల్లవాడి ఊహాశక్తిమంచి చురుకైనది అవడంచేత, తన భావనాభూతముయొక్క చెవి అని వెంటనే విశ్వసించి, "ఓ నాన్నా! నేను చెప్పలేదా? ఈ యింట్లో పెద్దదయ్యం ముందని—నిజంచూడు"అని బాలుడు బిగ్గరగా కేక వేశాడు. తండ్రి "కుమారా! నిజమే. కానీ నీవు మహాధైర్యశాలివి. మంచి బలశాలివి నీకేంభయం లేదు. ఒక కట్టె తీసుకొని దానిని కొట్టి చంపు".అని ఉత్సాహపరిచాడు. కుఱ్ఱవాండ్లు వీరులు. వాండ్లు దేనికైనా సాహసించగలరు. ఆ మాటలకు ఉత్సాహితుడై, బాలుడు తండ్రిగారి బెత్తము తీసుకొని భూతరూపంమీద ఒకదెబ్బ కొట్టాడు. సన్నని ఏడుపు వినిపించింది. గదిలో దాగిన సేవకుడు, చెవిమాదిరి కనపడే దిండు కొసను, ఇవతలకు లాగాడు. పిల్లవాడికి ఆనందమైంది. దయ్యము ఓడి పోతున్నదనే ఉత్సాహంతో కేకలు వేశాడు. తండ్రి ఉత్సాహమిస్తూ, 'ప్రియకుమారా! నీవు మంచి ధైర్యశాలివి. నీవు మంచివీరుడవు.'' అని పొగడి వెన్నుచరచి ఉద్రేకపరిచాడు. ఈ విధంగా మాట్లాడే సమయములో దయ్యపు చెవులు రెండూ బైయటికి కనబడినవి. పిల్లవాడు ఉద్రిక్తుడై, ఆ భావనాభూతవు తలమీద దెబ్బమీద దెబ్బ, వెంట వెంట కొట్టాడు. బాది వదిలిపెట్టాడు. లోపల ఏడుపు వినబడింది. తండ్రి వెన్నుచరుస్తూ, ''ఏడుపు విను: ఏడుపు విను. దయ్యము ఏడుస్తున్నది, నీవు గెలిచావు. నీవు గెలిచావు.'' అని ఉత్సాహపరిచాడు. పిల్లవాడు ఊహాభూతమును చావకొట్టాడు. తండ్రి, దిండును వెలికి లాగి, ''చిట్టీ! బలే ధైర్యమున్నది నీకు. నీవు దయ్యాన్ని కొట్టి దిండుగా చేశావు. దెబ్బలు తిని దయ్యము దిండైపోయింది. చూడు." అన్నాడు. పిల్లవాడు నిజమనుకొని సంతోషపడ్డాడు. మూఢవిశ్వాస జనితమైన పెనుభూతము అదృశ్యమైంది. బాలునికి ధైర్యము వచ్చింది. పాటలు పాడాడు. గంతులు వేశాడు. గదిలోకి నిర్భయముగా వెళ్ళి, తండ్రి తెమ్మన్న వస్తువు తెచ్చి యిచ్చాడు. శైశవదశ దాటిన పెద్ద బాలురకు ఏ తండ్రిఅయినా ఇలా చెపుతాడా? చెప్పడు. పసిబాలురకు ఈ పంథా మంచిదే. కాని పెద్దవాండ్లకు మంచిది కాదు. శిశువు

కీవిధానము కొంత మేలు చేకూర్చింది. ఉపయోగించింది. కాని, పెద్దవాండ్లకు ఈడొచ్చినవాండ్లకు ఈవిధాన మవసరంలేదు, శిశువుల హృదయాలలో విహరించే ఇలాంటి విచిత్రభూతాలను, తీరిక ఉంటే మనము ఎన్నైయినా వెలుపలికి తరిమివేయగలం. జాగ్రత్తగా వినండి. వేదాంత నిర్వచన మిది: ఆ చీకటిగదిలో పిల్లవాడు దిండును కొట్టడము చేత, నిజమైన భూతము పోలేదు. భూతాన్ని పారద్రోలడానికి నిజమైనకారణము దిండును కొట్టడము కాదు. దయ్యము గదిలో లేదు అనే విశ్వాస పరిణామాన్ని శిశువులో కలిగించడమే నిజమైన కారణం. భూతము లేదు అనే విశ్వాసము శిశువులో కలిగింప బడింది. అప్పుడు భూతం పోయింది. శిశువుయొక్క భావనచేత గదిలోనికి భూతము ప్రవేశించింది. నిజానికి గదిలో భూతం లేదు. భ్రాంతిభావనే గదిలో భూతాన్ని సృష్టించింది. ఈ భ్రాంతినే నివృత్తి చేయాలె.. పెద్దవాండ్ల భ్రాంతిని పోగొట్టే మార్గం వేరుగానున్నది. "మేము పతితులము. ప్రకృతిసిద్ధముగా మహాపాపులము. భయంకరమైన నరకముఖములో మేము ఉన్నాము. సమస్తపాపాలు మా గుండెలమీద పర్వతాలై కూర్చున్నై. ఆదము ప్రప్రథమములో చేసిన నేరమువల్ల మాకీ పాపప్రకృతి కలిగింది. మేము పుట్టుకతోటే పాపాత్ములము. ప్రాపంచిక జీవులము. క్షుద్రాతిక్షుద్రమైన దౌర్భాగ్యపు క్రిమికీటకాలము మేము!"— అని ప్రజల నమ్మకము. (ఉన్న దున్నట్లు మాట్లాడుతున్నందుకు రాముని మన్నిస్తారు. గాక) బైబిల్లో ఒక భాగము మానవులను తమ పాపప్రకృతి విశ్వసింపజేస్తుంది. పాతనిబంధన పాపము క్రైస్తవ హృదయాల్లోకి, మీ తేజోహృదయము మందిరాల్లోకి, పతితత్వభూతమును, పాపప్రకృతిని, నీచప్రకృతిని ప్రవేశపెట్టింది. "మేము ప్రపంచములో నిష్ప్రయోజకులము. క్షుద్రకీటకాలము. నీచమైన పురుగులము. దురదృష్ట సముద్రతరంగాల్లో తన్నుకలాడే పురుగులము, దుర్బలులము." అనేభావాలు మానవహృదయాల్లోకి తరుమబడినవి. మొదట మూఢవిశ్వాసభూతం ప్రపంచహృదయంలోకి ప్రవేశపెట్టబడింది. తరువాత 'క్రొత్త నిబంధన' వచ్చింది. రాముడు పక్షపాతదృష్టితో మాట్లాడడంలేదు. 'పాత నిబంధన' అనేతల్లిచేత ప్రవేశపెట్టబడిన మూఢ విశ్వాసాన్ని 'క్రొత్త నిబంధన' అనే తండ్రి

వెలికి గిరిమివేశాడు. క్రొత్త నిబంధనలో తండ్రియైన సైంట్‌పాల్ వచ్చి మానవ హృదయాల్లోనుంచి భూతాన్ని వెలికి తరుమడానికి, మానవుల విముక్తుల చేయుటానికి శక్తికొలది ప్రయత్నించాడు. అతను ఏ ఉపాయం పన్నాడు? సైంట్‌పాల్ కాదు మానవవిముక్తికి మార్గం చూపింది. భగవంతుడే అతని శరీరంద్వారా విముక్తి పథం చూపించాడని రాముడు చెప్పుతున్నాడు. ఈ పాప ప్రకృతి, ఈ మానసికాందోళన, ఈ పాపపిశాచం, 'బాప్టిజం' (శుద్ధిస్నానం) అనే ఒక కర్మచేత పోతుందని పాల్ ప్రబోధించాడు. అంటే క్రైస్తవులు కావటంచేత, చర్చిలలో చేరడంచేత ఏవో కర్మకలాపాలు చేయడం చేత మతాధిపతులను భోజనాది సత్కారాలతో పోషించడంచేత, క్రీస్తు చిహ్నాలను ధరించడంచేత, మీరు రక్షింపబడతారనీ, జీవిత గ్రంథంలో మీ పేరు వ్రాయబడుతుందనీ పాల్ బోధించాడు. ఈ పని చేయండీ, దిండును కొట్టిన మాదిరిగా ఉన్న ఈ పనులన్నీ చేయండి. క్రీస్తునామం ధరించండి. చర్చిలలో గానం చేయండి. ఏవో కర్మలు చేయండి. మతాధిపతులను పోషించి, వారికి గొంతులకు ఎగదట్టేలాగ విందులు చేయండి. ఇది మీకు రక్షణమార్గము. రాముడు చెబుతున్నాడు:—సజీవవిశ్వాసంలో ప్రజ లీకర్మలు చేసే టట్లయితే, తాము రక్షింపబడినా మనే సజీవవిశ్వాసాన్ని పొందినట్లతే, నిజంగా ప్రజలు రక్షితులే. శిశువు గదిలోని భూతాన్ని కొట్టి దిండుగా మార్చినట్లు, అప్పుడు గది భూత విముక్తమైనట్లు నిజమైన క్రైస్తవుడు చర్చి పేరుమీద ఈ కర్మలు చేసి, నేను రక్షింపబడ్డానని విశ్వాసియైన ట్లయితే, తప్పకతక: రక్షితుడే యని రాముడు చెప్పుతున్నాడు.

అదే ప్రకారము మీరు క్రైస్తవులైనట్లయితే మీరు రక్షింపబడ్డారని గాఢవిశ్వాసము పూనండి. నిజముగా మీరు రక్షింపబడతారు. క్రైస్తవ సజీవ విశ్వాసము నిష్ఫలమని చెప్పే స్వేచ్ఛాభావులతో నాస్తికవాదులతో రాముడు ఏకీభవించడు. క్రైస్తవవిశ్వాసాన్ని తృణీకరించే ప్రజలతో రాముడు ఏకీభవించడు. మీ విస్వాసము మనోధైర్యము నిస్తుందా, మీరు రక్షింపబడ్డారని గాఢవిశ్వాసము కలిగిస్తుందా, మీరు రక్షింపబడినట్లే, కాని, ఇంకొక విషయము

రాముడు చెపుతున్నాడు. ప్రపంచ మిప్పుడు శిశుదశలో లేదు. ప్రపంచ మిప్పుడు యువకదశలోకి పెరిగింది. ఇప్పటివరకు ఈ రకపు నమ్మకము కోటానుకోట్ల ప్రజలను రక్షించింది. ఇది నిజమే కాని, మీగదులలో నుంచి భూతమును తరిమివేయదగిన కాలం వచ్చింది. నీ ప్రకృతి పాప మయం కాదు. నీ హృదయపు గదిలో ఏభూతమూ లేదు. నీవు నీచ మైన పురుగువు కాదు. నీ ఆత్మ పతితంకాదు- అని తెలుసుకోదగిన తరుణం వచ్చి కూర్చున్నది. వేదాంతముతో నీవు నిత్యపరిశుద్ధడవని నీవు నిత్యనిష్పాపుడివని, నీవు వాసుదేవుడవని, సర్వాంతర్యామివని తెలుసుకో. నీవు పరమ పావనుడ వని జగన్నాథుడ వని, పరమేశ్వ రుడ వని తెలుసుకో! దీన్ని విచారించు,. ఈ మహాసత్యమును దర్శించు. ఈ దివ్యానుభవాన్ని పొందు. దీన్ని అనుష్ఠించు. నీ ముక్కేది అన్నప్పుడు నేరుగా ముఖంమీదికి చేయిపోనివ్వక తలవెనుక నుంచి త్రిప్పిచూపడంవల్ల ఏమి లాభము? కేవల కర్మలచేత మోక్షము కలుగుతుందని నమ్మడమువల్ల ప్రయోజనం లేదు.

'నేను సర్వదా రక్షితుడను' — అనే ధైర్యమును నీ విశ్వాసము కలిగించినటయితే, నీవు జగద్రక్షకుడవు కాగలవని వేదాంత సందేశము. 'నేను దేహాన్ని కాదు. నేను నరకబద్ధుడ నెప్పుడూ కాదు'- అనే విశ్వాసము నీ హృదయంలో వెలుగు తున్నట్లయితే, ఏమీ తెలియని శిశువువుకాక వయస్సు వచ్చిన పెద్ద బాలుడవు నీవు కాగలిగితే, వేదాంతానుభవంచేత నీవు నిరంతర రక్షితుడవే నని తెలిసికోగలిగితే, సాక్షాద్రక్షకశక్తి నీవని గ్రహించినట్లయితే, సర్వ ప్రపంచ రక్షకుడవు నీవై భాసించ గలవు. అపరిమితమైన, అర్థరహిత శుష్క డాంబిక కర్మ కలాపాల్లో నీ శక్తిని వృథాచేయబోకు. రక్షింపబడటానికి, దిండును కొట్టడంవంటి పిల్లతనపు చేష్టలలో మీ శక్తులను వృథాచేయబోకండి. ఇంకా పిల్ల తనమా! మీరు రక్షితులని తెలుసుకోండి. మీరు రక్షణపొందు తారు. క్రైస్తవమతములోని రక్షణతత్త్వము వేదాంతమైయున్నది. వేదాంతము ఉత్తమ మార్గము. అన్ని కర్మకలాపాలు అయిన తరు వాత 'నేను రక్షింపబడ్డాను' అనే గాఢవిశ్వాసము నీలో దీపిస్తుంది.

ఇది వేదాంతమే నని గుర్తుంచుకోండి. మీ క్రైస్తవతలో వ్యాపించి మీకు రక్షణ చూపిస్తున్నది వేదాంతమే. బాహ్య నామరూపాలకు కర్మకలాపాలకు అనవసర ప్రాముఖ్య మివ్వబోకండి.

క్రూసేడ్సులో జూడియాలోని క్రైస్తవులచేత మహారక్తపాతం జరిగింది. క్రైస్తవులు ఒక యుద్ధంలో ఓడిపోయి తరుమగొట్టబడ్డారు. క్రైస్తవ సైన్యాలలోని స్వార్థకీర్తి కాముడైన ఒక మతావేశపరుడు తన కొక స్వప్నం వచ్చిందనిన్నీ, ఒక దేవత కనపడి క్రీస్తుచేత స్పృశిత మైన ఒక బల్లెం భూమిలో పూడ్చబడి యున్నదనిన్నీ, దాన్ని కనుగొన్నట్లయితే విజయం మనదేననీ తెలియపరిచాడు. ఈ వదంతి సమస్త జనంలో వ్యాపించింది. జనమంతా ఈ కథ నిజమా అబద్ధమా అనే విచక్షణ లేకుండా నేల త్రవ్వడం మొదలుపెట్టారు. పొద్దున మొదలుబెట్టి పొద్దుగుంకే దనక త్రవ్వారు. బల్లెం కనపడలేదు. ఇక విసుగుబుట్టి వెతకడం మానబోయే సమయంలో తటాలున ఆ మతావేశవ్యక్తి 'బల్లెం ఒకచోట వున్నది, ఒకచోట వున్నది'అని ఆకాశం పగిలే పగిది కేకలువేయడం మొదలుపెట్టాడు. అతడు చూపిన స్థలంలో జనులు త్రవ్వారు. బల్లెం కనబడింది. అది త్రుప్పుపట్టి కొరుక్కు తినబడియున్నది. "ఇదిగో బల్లెం. భూమిలో ఉన్నది. క్రీస్తు స్పృశించిన పవిత్రమైన బల్లెం యిదే"-అని అతడు అందరూ చూచేలాగు పైకెత్తాడు. క్రైస్తవులందరూ సంతోషం పట్టలేక దానిచుట్టూ గంతులు వేశారు. వాండ్ల సంతోషం ఇంతింత కాదు. భూమిలోవున్న బల్లెం కనబడినందున ఉద్రిక్తములై క్రైస్తవసైన్యాలు నూతన బలశక్తులతో పొంగిపోయి శత్రువుల ఢీకొని విజయంపొందాయి. తరువాత క్రైస్తవులు తిరిగి యూరపుకు వచ్చినపుడు విజయకారణమంతా బల్లెముయొక్క మహిమే అని అందరూ విశ్వసించారు. కొలది కాలానికి ఈ ప్రథమకథ చెప్పిన మనిషి జబ్బునపడడం తటస్థించింది. చావబోతున్నాడు. అతనిని దీవించడానికి వచ్చిన మతాధిపతితో అప్పుడు చెప్పాడు—ఆ బల్లెపు కథ అంతా అబద్ధమని. "నిజానికి ఆ బల్లెం మా ముత్తాతది."

"ఆయనకూడా సైన్యములో పనిచేశాడు." ఆ బల్లెము మా ముత్తాతే కాదు ధరించింది. మా పూర్వీకు లందరూ ధరించి వాడు తున్నారు. క్రైస్తవు లందరూ జెరుసులేముకు వెళ్ళేటప్పుడు, దీన్ని నేను తీసుకవచ్చాను. దీనివల్ల ఉపయోగము కనపడలేదు. జన ప్రశక్తికోసం ఈ పన్నాగం చేశాను. జనులు బల్లెంకోసం త్రవ్వు తున్నప్పుడు ప్రక్కగుంటలో దాన్ని పూడ్చిపెట్టాను. జనం త్రవ్వగానే బైటపడింది"— అని అతడు జరిగిన విషయము విశదీకరించాడు. చరిత్రకారులు పొంచివిని, ఈ రహస్యమును దైవీకరించి- బల్లెంలోది గాదు ఈ మహత్తు ప్రజలలోని ఉత్సాహములో పరిపూర్ణ విశ్వాసములో ఉన్న మహత్తది, అని వ్యక్తపరిచారు. విజయం బల్లెము నుంచి కలుగలేదు. ప్రజలలోని శక్తిచేత, ప్రజలు తమలో ప్రబుద్ధం చేసుకొన్న ఆధ్యాత్మికబలముచేత. ప్రజలలోని సజీవ విశ్వాసముచేత వారికి విజయం లభించింది. అందుకనే వేదాంత మీలా నిర్వచిస్తుంది:— "ఓ క్రైస్తవులారా! ఓ మహమ్మదీయులారా! ఓ వైష్ణవులారా! ప్రపంచములోని ఓ సమస్త మతస్థులారా! క్రీస్తుచేత, బుద్ధునిచేత, కృష్ణునిచేత లేక ఏ యితర మహాత్మునిచేతనైనా సరే మీరు ఉద్ధరింపబడుతున్నారని అనుకొనేటట్లతే, గుర్తుంచుకోండి—నిజమైన మహిమ, క్రీస్తులో లేదు. బుద్ధునిలో లేదు. కృష్ణునిలో లేదు. ఇంకెవరిలో లేదు. నిజమైన మహిమ మీ ఆత్మలో ఉన్నది. మీ ఆత్మే క్రీస్తు. మీ ఆత్మే బుద్ధుడు. మీ ఆత్మే కృష్ణుడు." బాహ్యమతానికీ విశ్వాసానికీ ఉన్న భేదం కనిపెట్టండి. బల్లెపుకథ మానవుల బాహ్యమతం. ఆ సజీవశక్తి, ఆ మూర్తీభవించిన ఆ ఉత్సాహబలం మానవుల విశ్వాసమని మనం పేర్కొనవచ్చు. సజీవ శ్రద్ధే (విశ్వాసం) మానవులను రక్షిస్తుంది. బాహ్యమతం రక్షించదు.

ఈ సజీవ విశ్వాసం, ఈ సజీవశక్తి క్రైస్తవులకు విజయం కలిగిస్తుంది. అలాంటప్పుడు, ఆ సజీవవిశ్వాసమును మీ ప్రియాత్మకు, మీ సత్యాత్మకు ఎందుకు అంకితంచేయరు? మీలోని పరమాత్మపైన, సత్యాత్మపైన ఎందుకు మీ విశ్వాసమును వినియోగించరు? ఎందుకు మీ సజీవ - లేక మృతవిశ్వాసమును క్రీస్తులో, బుద్ధునిలో, కృష్ణు

నిలో, వారిలో వీరిలో వినియోగించడం దేనికి? మీలోని పరమాత్మలో, భగవంతునిలో, పరమసత్యములో ఆ విశ్వాసమును ఎందుకు వినియోగించరు? ఇట్టి మీ సజీవ విశ్వాస వినియోగం ఎంత సులభముగా, ఎంత సహజంగా ఉంటుంది? తరచుగా ఈ ప్రశ్న రాముని అడుగుతుంటారు- "ఇది వేదాంత మయినట్లయితే వేదాంతసార మిది అయితే, వేదాంతము పుట్టినభూమి భారతదేశ మైనట్లయితే, మరి భారతదేశం ఎందుకు పతనమైంది?" భారతదేశపతనానికి కారణం- భారత ప్రజలలో అనుభవ వేదాంతము లేకపోవడమే. భారతీయుల కంటె, అమెరికా దేశీయులు ఎక్కువగా వేదాంతమును అనుష్ఠిస్తున్నారు. అందుకే అభ్యున్నతి పొందారు, భారతదేశ పతనహేతువు వేదాంతమని చెప్పడానికి ప్రపంచానికి హక్కులేదు. ఒక మనోహరమైన కథచేత రాము ఈవిషయమును మీకు సువ్యక్తం చేస్తాడు. ప్రాగ్భారతదేశంలో ఒక గ్రామంలో ఒక బాలు డున్నాడు. అతడు బాగా చదువుకున్నాడు. అతడు విశ్వవిద్యాలయంలో చదువుకొన్నాడు. పట్టణవాసంలో అతనికి కొన్ని పాశ్చాత్యుల విధానాలు అలవాటయినవి. మీకు తెలుసా? హిందూదేశస్థులు సంప్రదాయబద్ధులు. ఈమధ్యనే పాశ్చాత్యాచారాలు వచ్చాయి.

ఆంగ్ల విశ్వవిద్యాలయాల్లో చదివికూడా ఆంగ్లేయ వస్త్రధారణ చేయనటువంటి, ఆంగ్లభాష మాట్లాడనటువంటివారు అనేకమంది ఉన్నారు. తల్లిదండ్రులు ఇలాంటివి సహించరు. సరే- ఈ విద్యార్థి పట్టణవాసంలో ఒక గడియారం కొన్నాడు. మూడుమాసాల సెలవులలో అమ్మమ్మగారింటికి వెళ్ళుతూ అవసరమని గడియారంకూడా తెచ్చుకొన్నాడు. ముసలమ్మ కిలాంటి విషయాలంటే సహజంగా గిట్టవు. ఆ యువకుడు ఆంగ్లేయ దుస్తులు అప్పటికీ తెచ్చుకోలేదు. అత్యవసరం అవడంచేత గడియారం తెచ్చుకోక తప్పింది కాదు. ఏ ఇంగ్లీషు కుర్చీగానీ, బల్లలుగానీ అతడు తెచ్చుకోవడానికి భయపడ్డాడు. గడియారము అవసర మని తెచ్చుకొన్నాడు. కుటుంబమంతా ఈ గడియారమంటే యిష్టంలేదు. అందులో ముసలమ్మకు మరీ. ఆమె ఇది సహించలేకపోయింది. "ఓహో! ఇది రోజంతా

టిక్కు, టిక్కు, టిక్కు మని అపశబ్దం పలుకు తుంటుంది. ఈ పాడు చప్పుడు వినకూడదు. దీన్ని ముందర పగుల గొట్టండి. ఇది అసుభ సూచకముగ అపశబ్దం చేస్తున్నది. ఇది ఉంటే యేదో కీడు మూడు తుంది బాబూ!"- అని ముసలమ్మ గోలపెట్టింది. ఎంతచెప్పినావినదు. కుఱ్ఱవాడు ఎంతో బోధించాడు. లాభంలేక తీసి దానిని తను చదువు కొనే గదిలో పెట్టుకున్నాడు. ఒక నాడు ఇట్లుండగా ఆ యింట్లో దొంగలుపడి కొంత సొమ్ము కాజేశారు. ఇక ముసలమ్మ వాడనకు బలం దొరికింది, 'నేను చెప్పలేదా ఇది మనకు కీడు తెస్తుందిరా అని! దొంగలుపడి సొమ్మంతా దోచివేశారు. కాని యీ గడియారం తీసుక పోలేదు. ఎందుకు తీసుకపోలేదో తెలుసా? తీసుకపోతే కీడు మూడుతుందని తీసుకపోలేదు. ఓయినాయనా! ఎందుకురా ఈ పైశాచిక వస్తువు మన యింట్లో?" అని ముసలమ్మ గోలపెట్టింది. ఆ విద్యార్థి మంచి ధీరుడు. ఎన్ని చెప్పినా వినలేదు. ఆ గడియారం గదిలోనే వుంచు కొన్నాడు' ఇంతలోఅతని తండ్రి కాలవశాత్తు చనిపోయినాడు. ఇంకే ముంది? ముసలమ్మకు మరీ భయం వేసింది. 'ఓరి దౌర్భాగ్యపు పిల్ల వాడా! ఈ పాడువస్తును దిబ్బలో పారవేయరా ఇంకా దీన్ని ఇంట్లో ఉంచుకుంటావా? నీ ధైర్యం చట్టుబండలుగాను'—అని గందరగోళం చేసింది. అయినా అతడు గడియారం ఉంచుకున్నాడు. తిరిగీ కొద్ది రోజుల్లోనే అతని తల్లికూడా చనిపోయింది. ఇంక ముసలమ్మ గడియారం ఏమాత్రం ఇంట్లో ఉంచడానికి సహించకపోయింది. ఈ ముసలమ్మకు 'ఈ గడియారంలో ఒక పురుగు ఉన్నదని నమ్మకం, ఎందుకంటే వాండ్లకు యంత్రసాధనాలు తెలియవు. గడియారములో ఒక పురుగున్న దనీ, అదే టికటిక్కుమని ముళ్ళు కదిలిస్తున్నదని ఆమె నమ్మకం. ఈ గడియారమే ఈ కష్టాలన్నిటికీ కారణమని ముసలమ్మ నమ్మకం. ఇక సహించలేక గడియారము తీసుకొని ఎవరూ చూడకుండ రాతితో కొట్టి ముక్కలు, ముక్కలు చేసింది. జాగ్రత్తగా గ్రహించండి! భారతదేశంలోని ముసలమ్మల విషయాలకు మీరు నవ్వుతున్నారు. ఇంకొకరకంగా, మీరీ ముసలమ్మల పనేచేస్తున్నారు. జనులు, అదీయిదీ కలిపి, ఏమి కేమిటో ఊహించి, ఒకదాని విషయము మరొకదానికి అసంబద్ధంగా అంటగట్టుతారు. యూరోపియనులు ముఖ్యంగా అనూ

యాగ్రస్తులై, పిచ్చిసిద్ధాంతాలుచేసి వేదాంతమే భారతదేశపతన కారణ మని స్వేచ్ఛగా అనివేస్తారు. ఇలాగే ఇతర విషయాలలో యథేచ్ఛగా సిద్ధాంతాలు చేస్తారా? యూరప్ అమెరికాల అభ్యున్న తికి కారణం క్రీస్తు వ్యక్తిత్వం కాదు. నిజమైన కారణము- అవ్యక్త ముగా వేదాంతమును ఆచరణలో పెట్టడమై యున్నది. భారతదేశ పతనకారణము- ఆచరణలో వేదాంతము లేకపోవడమై యున్నది.

సమస్త ప్రపంచోద్ధారణానికీ తల్లి ఏరూపంగా ఉపకరిస్తున్నదో రాముడు కొన్ని మాటలు చెప్పుతాడు. ప్రపంచములోని మహావీరు లందరూ మహోత్తమ ప్రవర్తనగల మాతలకు జనించినవారే.

సమస్త ప్రపంచాన్ని ఉద్ధరించగలవారు మాతలే. దేశాన్ని ఉద్ధరించాలన్నా, పాడుచేయాలన్నా, చేయగలవారు మాతలే. ప్రకృతి యొక్క పతనోన్నతత్వాలను నియమించగలవారు మాతలే. ఎవ్వ రైనా చూడండి. ఉత్తమ మాతల కుమారులే మహావీరులై యున్నారు. తమ బిడ్డలకు శైశవదశలోనే ఈ మహాసత్యాలు బోధించి నట్లయితే, పసితనములోనే ఆత్మజ్ఞానమును హృదయంలో నాటినట్ల యితే ఆ శిశువు పెరిగి కృష్ణుడుగానో, క్రీస్తుగానో తయారవుతాడు.

తల్లులు శిశువులను బాగుచేయగలరు. పాడుచేయ గలరు. తల్లియొక్క విశిష్టత యిది. స్పార్టన్ దేశీయురాలైన ఒకమాత యుద్ధానికి పోతున్న తన కుమారునితో ఈ రకంగా చెప్పింది:- 'తండ్రీ! నాదగ్గరకు విజయం పొందైనా రా, లేక మరణించైనా రా. కాని, అపజయం పొంది రావద్దు.'

హిందూదేశంలో ఒక మహారాజ్ఞీమణి యున్నది. అపజయం పొంది భర్తవస్తున్నాడని తెలిసి నగరద్వారాలు మూయించింది. 'వెళ్ళిపో. రాజద్రోహి! నీవు నాభర్తవు కావు. నీవు అపజయం పొం దావు ఇంక నీకూ నాకూ సంబంధం లేదు. వెళ్ళిపో'- అని భర్తకు కబురుపంపించింది.

భారతవర్షంలో ఒక మహారాణికథ ప్రసిద్ధి వహించియున్నది. ఆమె తన సంతానమంతా జ్ఞానపూర్ణులుగా చేయాలని వ్రతంపూనింది.

తన కుమారుల నందరినీ పునర్జన్మరహితులుగా చేయాలని వ్రతం పూనింది. భారతదేశమాతల ఆదర్శమూ ఆశయమూ, ఒకటే. అది తన బిడ్డలను పునరావృత్తి రహితులనుగా చేయడం. బ్రహ్మజ్ఞాని ముక్తుడు. అతడు తిరిగి పుట్టడు. ఆమెకూడ తన పుత్రులందరికీ బ్రహ్మోపదేశం చేసి బ్రహ్మజ్ఞాన మిచ్చి బ్రహ్మస్వరూపులను చేయాలని వ్రతము పూనింది.

ఆమె వ్రతం ఫలించింది. ఆమె కుమారు లందరూ కృష్ణులూ, బుద్ధులూ, తత్త్వవేత్తలూ-సర్వసంగ పరిత్యాగులూ ఐనారు. సమస్త మానవలోకాన్ని పరిపాలించారు. ఆమె కుమారులందరు జీవన్ముక్తులైనారు. భగవత్ స్వరూపులైనారు. ఒక్క స్త్రీ ఈ దివ్యకర్మ చేసింది. ఏమి చేసింది? ఆమె కుమారులను పసిపిల్లలుగా ఉన్నప్పుడే జ్ఞానగీతాలతో లాలించేది. పాలిచ్చేటప్పుడు బ్రహ్మజ్ఞానగీతాలు ఆలాపించింది. పాలతో, ఉగ్గుపాలతో, జ్ఞానక్షీరములతో పిల్లవాండ్లను పెంచింది. చిన్నప్పటి నుంచే శిశు హృదయాల్లో బ్రహ్మదృష్టిని నాటింది. ఊయల ఊపుతూ శిశువుల హృదయాల్లో వేదాంతామృతమును పోసేది. ఊయల ఊపుతూ, జోలపాట పాడుతూ శిశువులహృదయాల్లో ఆమె వేదాంత క్షీరమును పోసింది.

౧

నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల!
ఏడవవద్దోయి దుఃఖింపవద్దు
శాంతిగా నిద్రింపవో ప్రియబాల!
భయములు నిను వీడి పరుగిడుచుండె;
కిన్నరల్ నినుగూర్చి పాడుచున్నారు:
సౌందర్యభోగ భాగ్యాధీశ్వరుండు
నీ అమాయకమగు ఆత్మ నిన్నెపుడు
రక్షించి సర్వదా యుద్ధరించెడిని -
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల!

౨

మృదుపుష్పగుచ్ఛముల్, తళతళలాడు
హిమకణబిందువుల్, తీయగానుండు
పరిమళముల జిమ్ము మలయానిలములు,
సరసోష్ణమును, మహామధురగానములు
సర్వేంద్రియాహ్లాదదాయకంబులును,
నీ దివ్యమగు మహానందమందిరము
నందుండియే పుట్టుచున్న వో బాల !
పరమపావన మగు ఓంకృతి నీవు
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల !

3

శత్రువుల్ లేరోయి, భయ మేమి లేదు
ని న్నే యుపాయముల్ స్పృశియింపలేవు,
ఓ నిత్యుడా! మహామధురాతిమధుర !
కోమల సుస్నిగ్ధ శాంతిస్వరూప !
తారక మాక్తికాకాశపు గొడుగు
నీ వెత్తినదె ప్రియోంకారస్వరూప !
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల !

౪

నీ వాడుబంతులు చంద్రభాస్కరులు;
నీ గృహప్రాంగణ శుభతోరణంబు,
వివిధవర్ణము లొప్పు ఇంద్రధనుస్సు,
పాలపుంతలు నీవు నడచు మార్గములు;
పైన మేఘంబులు కలుసుకున్నపుడు,
నినుగూర్చియే ముచ్చటలు చెప్పుకొనుర !
నీ ఆటబొమ్మలు గ్రహగోళసమితి
అవి నిన్ను పాడుచు, ఆడుచు, తిరుగు
ఓం తత్సదోం ఓం అటంచు మెల్లెత్తి

నిన్నె కీర్తించుచున్నవిరా కుమార!
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల!

౫

తామరపూలలో, కలువపూవులలో
కొలకులలో, కొండవాగులయందు
నీదు నిద్రామనోజ్ఞత ఎంతతీపి!
నిద్రాకరంబుతో ముఖభాగమందు
నీవు కప్పగ జేసుకొన్న సోయగపు
శాలువలో శిశూ! దేశకాలములు.
క్రీగంటినవ్వుల చూపులతోడ
ఓ కొంటెబాలుడా! ఇక నిద్రపొమ్ము!
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల!

౬

పదునైన కోయిల కంఠరావములు
నీవు ఘ్రాడెడి యీాలపీకలో బాల!
పిచ్చుకల్, చిరుగాలి చుక్కలన్నియును
నీ వాడుకొను ముద్దుబొమ్మలు, బండ్లు.
నీ వినోద స్వప్నమే ప్రపంచంబు;
బాహ్యముగా నున్నపగిది దోచినను
నీ లోననే జగ మున్నదో వత్స!
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల!

౭

దేశకాలాదు లవస్థాత్రయంబు
తనయందు గలిగిన నిత్యప్రబుద్ధ!
ఓ మహాజ్ఞానవారాశిమూలంబ!
జీవనకర్మప్రశాంతిమూలంబ!
కలహావివాదాల ప్రియకారణంబ!

స్వస్తి చెప్పుము పరిచ్ఛిన్నత్వమునకు,
చెప్పుమా స్వస్తిని చెప్పుమా స్వస్తి !
నిద్రపో, నిద్రపో, నిద్రపో బాల !

౮

మోహనవస్తు సమూహంబు లెల్ల,
ఓ మహానంద ఖగాధీశ! నీదు
పక్ష సంజనిత మనోజ్ఞ రావములు
కాద; మనోజ్ఞ సౌందర్యంబు కొంత
కనబడి కనబడకుండగా చెలగి
అటునిటు చలియించుచుండెడి నీదు
రెక్కల నీడలో ముద్దుల తనయ !
ఆ వేషధారి ఓంకారంబ వీవు.
సత్యాత్మ! ఓం తత్సదోం ఓం! ముకుంద!
నిద్రపో! నిద్రపో! నిద్రపో! బాల!

తన ఏడుగురు కుమారులకు, ఆ మహారాణి ఇలాంటి జోలపాట పాడింది. ఆ ఏడుగురూ వేదాంతమును ఉగ్గుపాలతో జీర్ణించుకొని, ప్రాపంచిక రాగత్యక్తులై ఇల్లు విడచి వెళ్ళారు. వారు పరివ్రాజకులైనారు. వారిచేత జ్ఞానం ప్రపంచములో నలుమూలల వ్యాప్తమైంది, కాని ఎనిమిదవ కుమారుని, తల్లి ఈ విధంగా పెంచలేదు. ఎందుకంటే, తండ్రికి ఈ కుమారుడు, సింహాసనం వదిలివెళ్ళడం పరిపూర్ణముక్తపురుషుడు కావడం ఇష్టం లేకపోయింది. అందుచేత తల్లి యీ శిశువుకు ఈ జోలపాట పాడలేదు. కాని ఆమె వ్రతం ఏదో ఒక రకంగా నెరవేర్చుకొని తీరాలనుకొన్నది. తన కుమారుని ఎలాగైనా దుఃఖవిముక్తుని చేయాలని ఆమె దీక్ష. ఈ అష్టమశిశువు రాజ్యసింహాసనాధిపత్యము వహించడముకోసం, తక్కిన ఏడుగురివలె పెంచబడలేదు. ఈ శిశువును దాది పెంచింది. ఒక నాడు తల్లి మరణశయ్యమీద ఉండి, ఈ అష్టమశిశువును తీసుకరమ్మన్నది. పిల్లవానిని తెచ్చారు. ఆమె ఒక కాగితంమీద ఈ జోలపాటను వ్రాసి, మడచి- భద్రంగా ఒక

అమూల్య వజ్రపేటికలో పెట్టి కుమారుడి భుజానికి కట్టి, ఇలాచెప్పింది. "కుమారా! ఈ పేటిక నివ్వుడు తెరువవద్దు. నీవు దుఃఖమగ్నుడవై, దిక్కు తెలియక బాధపడే సమయమున, అత్యవసరమైనప్పుడు. దీన్ని తెరచి చదువుకో, వ్రాసినదానిని విచారించు. అర్థము చేసుకో. గాఢంగా మనస్సులో ధ్యానించు. నీ దుఃఖమంతా మాయమవుతుంది." తరువాత తల్లీ తండ్రి చనిపోయినారు. ఈ బాలుడు రాజై అనేక సంవత్సరాలు రాజ్యపరిపాలన చేశాడు.

ఒకనాడు ఈతని పెద్దన్నలు ఎక్కడనుంచో తండ్రిగారి రాజధానికివచ్చి, ఈ అలర్కునికొక సందేశము పంపించారు. అలర్కుడని ఇతని పేరు. ఏమనీ సందేశం? మేము పెద్దవాండ్లం. మాదీ రాజ్యాధికారం. హక్కు మాది. కాబట్టి సింహాసనముదిగి పెద్దవానికి యివ్వవలసింది అని. ఈ వార్త వినేసరికి అలర్కుని గుండెలో పిడుగు పడినట్లయింది. అతనికి ఏమి చేయాలో తోచలేదు. తన ఐశ్వర్యమంతా, ఈనాడు పోతున్నదని భోరున దుఃఖించాడు. గడగడ వణకిపోయినాడు. రాత్రి తన శయనాగారం చేరి, విచారభారంచేత బాధపడుతున్నాడు. కుమిలిపోతున్నాడు. అప్రయత్నంగా తల్లి చనిపోతూ తన దండచేతికి కట్టిన రక్ష కనబడింది, తన తల్లి మరణ సమయంలో చెప్పినమాటలు స్మృతికి వచ్చినవి. కాగితం విప్పి బొటబొటగారే కన్నీళ్ళతో ఈ విధంగా పఠించాడు: 'నీవు పరిశుద్ధుడవు. నీవు అవినాశివి. నీవు పరిపూర్ణజ్ఞానస్వరూపుడవు. సమస్త శక్తిస్వరూపుడవు. సమస్తశక్తికి నీవేమూలం. నీవే సమస్త సౌందర్యప్రదాతవు. సౌందర్యనిధివి. ఆనందస్వరూపుడవు నీవు. నీవు ఈ శరీరానివని భ్రాంతిపడకు. అస్థిరములైన ఈ ప్రాపంచిక వస్తువులమీద ఆధారపడకు. వీటికి అతీతుడవుకా. బాగా విచారించు. నీ స్వస్వరూపము ప్రపంచాతీతమైన పరబ్రహ్మ. ఏకాగ్రచిత్తుడవై ఈ సత్యమును ధ్యానం చెయ్యి. నీ ఆత్మే యీ శతృమిత్రాదుల రూపంలో కనబడుతున్నది!'' గాఢంగా చదివి విచారించాడు. అతనికి జ్ఞానోదయమైంది. భయాందోళనలు త్రుటిలో మాయమైనవి. ఆనందము హృదయంలో వెల్లివిరిసింది. తల్లి వ్రాసిన ఉపదేశమును తిరిగి తిరిగి పఠించాడు. ఆ

పాటలోని దివ్యార్థముచేత, తనతల్లి యొక్క మహోదార సంత్సంకల్పము చేత అతడు స్వస్థుడై, స్వస్వరూపజ్ఞానము పొందాడు. భయవిచారాలు పలాయనమైనవి. సమస్త ప్రాపంచక వాంఛలను, రాగమోహాలను అతడు పరిత్యజించాడు. బ్రహ్మజ్ఞాన మతనిలో దేదీప్యమానమై ప్రకాశించింది. పవిత్రత, దివ్యశక్తి అతనిలో సముద్రమై పొంగినవి. నిద్ర గూడ మరచిపోయాడు. వెంటనే దుస్తులు ధరించి తన అన్న లున్న చోటికి వెళ్ళాడు. "రాండి! రాండి! రాండి! అన్నలారా! నాకీ భారం తొలగించండి. ఈ తలమోయలేని ఈ క్షుద్రకిరీటభారం తొలగించండి. ఇదిగో భారం. దీన్ని తొలగించండి. ఈ సమస్తదేహాలూ నేనే. ఈ సింహాసన వాంఛతో ఉన్న మీ రందరూ నేనే. మీరు నేనూ ఒకటే. భేదంలేదు."—అని జ్ఞానోన్మత్తుడై కేకలు వేశాడు. అలర్కుని ముఖరంగముమీద దీపిస్తున్న పవిత్రతను, ఆనందపారవశ్యమును అన్నలు గ్రహించారు. వారు ఈ సింహాసనముకోసం రాలేదు. ఎందుకంటే వారే సమస్త ప్రపంచ పరిపాలకులుకదా! వారు వచ్చింది-లోపలనేయున్న నిజమైన అతని జన్మహక్కును అతనికి ఇద్దామని వచ్చారుమాత్రమే. వా రిలా అన్నారు: తమ్ముడా! ఈ యింద్రియ వంచితుడవు నీవు కాదు. నీ వీభూమికి మాత్రమే రాజువుకాదు. ఈ సూర్యచంద్ర తారామండలాలకు, యీ సర్వలోకాలకు నీవే అధిపతివి. ఓ తమ్ముడా! అనంతాఖండమైన పరమాత్మవు నీవు. సూర్యసూర్యుడవు నీవు. పరంజ్యోతివి నీవు, ఈ సత్యసాక్షాత్కారంపొందు." అలర్క రాజకుమారుడపుడు సత్యసాక్షాత్కారం పొంది రాజ్యపరిపాలనం చేశాడు. కాని, ఎలా పరిపాలించాడు? రాజరికమును నాటకరంగంలోని నటకునివలె నిస్సంగుడై నిర్వర్తించాడు. వివేకదీప్తమైన అతని మానసంలో ఇంక దుఃఖానికి తావు లేదు. మహాచక్రవర్తియై అత్యంత విజయవంతంగా కర్మమార్గంలో రాజ్యమును పాలించాడలర్కుడు. విజయం అతన్ని వరించింది.

నిత్యానందము, అఖండశాంతి, నీదే - కాదు - నీవే! నీ స్వస్వరూపమే! నీ మూలమును తెలుసుకో. అంతర్ముఖుడవు కా! నిరంతరము ఆత్మానందమయుడవై ప్రకాశించు!

ఓమ్ ఓమ్ ఓమ్

ఓమ్

# వేదాంతము : మోసెస్ యోగదండము

(శాన్‌ఫ్రాన్సిస్కోలో, 1903 మార్చి 5వ చెప్పిన ఉపన్యాసం)

ఓడ్ ఫెలోస్ హాల్లో ఉపన్యాసానంతరం, ఒకరు రాముని ఒక ప్రశ్న అడిగారు. ఉపనిషత్తులలోని ఒక భాగ పఠనము ఈ ప్రశ్నకు సమాధాన మీయగలదు.

ప్రశ్న యిది: "వైరాగ్యాన్నిగూర్చి. సమస్తప్రపంచ సంబంధాలు త్రెంపివేసి, కోరిక లన్నీ పరిత్యజించడాన్నిగూర్చి ఎందుకు మీరు బోధించడం? ఈ సమస్త ప్రపంచంతో ఉన్న సర్వసంబంధాలు త్రెంపు కొని, ఈ సమస్త ప్రపంచంమీది మా ప్రేమను అణిచివేసుకోండని వేదాంతం చెబుతున్నది. వేదాంతము మా హృదయాల్లోని మానవ ప్రేమను అణగద్రొక్కి, హృదయార్ద్రతను ఎండించివేస్తుంది."

ఉపనిషత్తులు : "ఒకడు సత్యానందమును పొందినప్పుడు తన సత్యాత్మను తెలుసుకొన్నప్పుడు, అతని కర్మలు సత్కర్మలుగా మారు తున్నవి. అప్రయత్నంగా, మంచి, జగత్కల్యాణగంగ అతనిలో నుంచి ప్రవహిస్తుంది. ఇదీ ధర్మనియతి. బ్రహ్మానందానుభూతి పొందని మానవుడు, మానవలోకానికి ఆనందప్రదానం చేయలేడు. బ్రహ్మానం దానుభవం పొందిన మానవుడుమాత్రమే మానవలోకకల్యాణం చేయగలడు. నీవు కడు నిరుపేదవనుకో, నీకే అన్నం లేక మలమల మాడుతుంటే, ఇతరులకు నీవు ఆకలి తీర్చగలవా!"

శిష్యుడు:— అయ్యా! బ్రహ్మానందమంటే ఏమిటో నాకు విశదం చేయండి.

గురువు :— అనంతత్వమే బ్రహ్మానందం. పరిపూర్ణత్వమే ఆనందం. నీవు పరిమితత్వములో ఉన్నంతవరకు ఆనందాన్ని పొంద లేవు. పరిపూర్ణత్వమే ఆనందం.

పరిపూర్ణత్వం! దీన్ని ఎలా మనమర్థంచేసుకోగలం? ఏ వ్యాఖ్యా నాలతో పనిలేదు. కాని, రాముడు ఈ మాటలు గ్రహించి విచారించి

మీ మనస్సులో నిలుపుకొనగోరుతున్నాడు. "పరిపూర్ణత్వమే ఆనందం. పరిమితత్వంలో ఆనందం లేదు."– అనే ఈ వాక్యాలు మీరు అనుభవంలో చూడగలసమయం వస్తుంది. ఈ పరిపూర్ణత్వమనేదాన్ని మీరు అర్థము చేసుకోవలసి ఉంది.

ఇంగ్లీషు భాషలో, హోల్ (Whole) అనే ఒకమాట ఉన్నది. 'Are you whole' నీవు పూర్ణంగా ఉన్నావా? అంటే నీవు బలంగా ఆరోగ్యంగా ఉన్నావా అని. ఈ మాట మనోజ్ఞమైంది. ఎంతవరకు నీవు 'నేనొక అంశమును; నేనొక భాగాన్ని; నేనొక పదార్థభాగాన్ని', అని ఎంచుకుంటావో, 'నేను 150 పౌనుల బరువుగల, ఇంత పొడవుగల. ఇంత ఎత్తుగల, ఈ మాంసాస్థికలతో కూడిన పరిమిత దేహాన్ని' అనుకుంటావో, ఎంతవరకు నీవు పరిమితత్వంలో ఉంటావో, అంత వరకూ నీవు ఖండితుడవే. నీవు విభాగితుడవే. నీవు స్వస్థుడవు, పరిపూర్ణుడవు కావు. you are not whole, నీవు ఖండపదార్థాని వవుతున్నావు. నీవు ఆరోగ్యబలశక్తులతో గూడినవాడవు కావన్నమాట. నీవు చైతన్యమును విడిచి స్తంభించిపోతున్నావన్నమాట. సముద్రములోనుంచి ఒక నీటిచుక్కను విడదీయండి. ఆ నీటిచుక్క మురిగి చెడి ఇగిరిపోతుంది. అదే మాదిరి, ఏ మానవుడైనా, ఏ ఋషియైనా, ఎవరైనాసరే, "నేనుఖండపదార్థాన్ని. దేశకాల నిబద్ధమైన ఖండవస్తువును నేను" అని సంభావించిన మానవుడు స్వస్థత పొందలేడు. ఆతడు పూర్ణుడు కాడు. అతడు ఆనందాన్ని పొందలేడు. ఆతడు ఆనందాన్ని పొందడానికి అనధికారి. నీ దృష్టి ఏ క్షణంలో పరిమితత్వాన్ని వదలుతుందో, ఆ నిమిషంలోనే ఖండభావాన్ని వదలి నీవు "సమస్తమూ నేనే; ఈ సమస్త ప్రపంచమూ నేనే, నేను పరిపూర్ణుడను" – అని తెలుసుకోగలవు. దీనిని నీవు పరిజ్ఞాతం చేసుకుంటే, నీవు పరిపూర్ణత్వ (Whole) మొందగలవు. స్వస్థుడవు కాగలవు. వ్యాధిబాధలు, శోకాందోళనలు, సర్వ శారీరకదుఃఖాలు నిన్ను విడిచి అదృశ్యములై పోగలవు.

ఇదే సమస్త దుఃఖనివారణారహస్యం. ఇదే సమస్త వశీకరణ విద్యారహస్యం. పూర్ణుడవు కా! అఖండదృష్టి వహించు! ఈ పూర్ణత్వమే పరమసత్యం. పరమసత్యంలో జీవించు. "నే నఖండ స్వరూపు

డను, పరిపూర్ణుడను. నేను సర్వశక్తి స్వరూపుడను. నేను పరమాత్మను. పరబ్రహ్మను"—అని సంభావించి తెలుసుకో.

శిష్యుడు :— ఈ పరిపూర్ణ మంటే ఏమిటి ?

గురువు :—పరిమితత్వం మూడువిధాలుగా ఉన్నది-కాల సంబంధమైన పరిమితత్వం, స్థలసంబంధమైన పరిమితత్వం, నిమిత్త సంబంధమైన పరిమితత్వం. పరిపూర్ణుడు కావడమంటే ఆత్మజ్ఞానం పొందడం. సమస్త కాల దేశ నిమిత్తాలకు అతీతులు కావడం. సమస్త దేహవాసనల నతిక్రమించడం. ఎక్కడ రెండవది కనబడదో, ఎక్కడ రెండవది వినబడదో, ఎక్కడ రెండవది జ్ఞానం కాదో, అక్కడే పరిపూర్ణత్వం, అఖండత్వం ఉన్నది. ఎంతవరకు రెండవది నీకు కనబడుతున్నదో అంతవరకు నీవు పరిమితత్వంలో ఉన్నట్లే. నీవు అపరిపూర్ణుడవే.

ఎక్కడ రెండవది చూడబడుతుందో, వినబడుతుందో, జ్ఞాతమవుతున్నదో అది ఖండత్వం. మృతాత్మలను చూడడము, ఆకాశ ఘంటికలు వినడం లేక అదృశ్య దూరవిషయాలను చూచేశక్తి— ఇలాంటి వన్నీ ఖండత్వమే. బ్రహ్మజ్ఞాన పథంలో మీరు ఉన్నారు మాత్రమే. కాని, మీరు పరమ గమ్యమును ఇంకా చేరుకోలేదు. అద్వితీయమైనది, రెండవది వినరాని కనరానిదైన అఖండత్వమే, పరిపూర్ణత్వమే ఆ పరమగమ్యం. అఖండత్వం శాశ్వతమైనది. ఖండత్వం అశాశ్వతమైనది.

శిష్యుడు : అఖండత్వం ఎక్కడ ఉంటుంది? ఏ రకంగా ఉంటుంది?

గురువు : అఖండత్వం, దాని అఖండత్వఘనతలోనే ఉంటుంది. కాదు, అది దాని ఘనతలోకూడ పరిమితమైంది కాదు.

అంటే, అఖండత్వం స్థలకాలాతీతమైంది. అలాంటప్పుడు, అఖండత్వమును, పరిపూర్ణత్వమును, దేశకాలాల్లో ఎలా బంధించగలం? 'అఖండత్వం ఎక్కడ ఉంటుంది'-అని అడగడం, "నా కొరకు అర ఔన్సు సముద్ర తరంగాలు తీసుకురా"—అని అడిగినమాదిరి ఉంటుంది. సముద్రతరంగాలను ఔన్సులలో పౌనుల్లో కొలువలేము.

అదే మాదిరి అఖండత్వం, పరిపూర్ణత్వం ఎప్పుడూ, ఎక్కడ, ఎందు చేత అనేవాటిచేత కొలువబడదు. పరిపూర్ణత్వము అలా కొలువ బడే టట్లయితే, అది పరిపూర్ణత్వం కాదు. అది పరిమితత్వమే. ఖండత్వమే.

రాముని అడిగిన ప్రశ్న—వేదాంతము వైరాగ్యాన్నిగూర్చి, సమస్త వాంఛారాగ పరిత్యాగాన్నిగూర్చి బోధించడంలో అసూయను పురికొల్పుతున్న దని. కాని, వేదాంతము అసూయను పురికొల్పడము లేనేలేదు. వేదాంతము ఏమి ప్రబోధిస్తున్నదో బాగా గ్రహించండి. "అనురాగ వ్యామోహ సంబంధాలను పరిత్యజించు"—అని వేదాంత బోధ. ఈ బోధలకు మీరు "ఓహో! మేము ప్రేమను వదిలితే, అనురాగాన్ని వదలితే, ప్రేమ భగవంతుడే కదా, భగవంతుణ్ణి వదలమనేగదా"—అని సంశయిస్తున్నారు. ఓ ప్రజలారా! ప్రేమ అంటే ఈ దేశములో కామముగా అవివేకముగా అర్థం తీసుకున్నారు.

భారత దేశములో ఈ కామమును ప్రేమ అని పిలువరు. దానికి ఇంకో పేరు వున్నది. "ఓహో! అతడు ప్రేమలో పడ్డాడు"—అని ప్రజలంటారు. కాని, ఇది ప్రేమ కాదుసుమా. ఒకరకమైన పైశాచికమైన దుష్టచేష్ట యిది. అన్నిటికంటె రాముడు పరమసత్యమునకు గౌరవాధిక్యత మిస్తాడు. సమస్త శారీరకవ్యామోహము నిన్ను ఖండదృష్టిలో కట్టివేస్తుంది. ప్రేమిత వస్తువునుకూడా పరిమితం చేస్తుంది. అప్పుడు నీవూ, నీ వాంఛావస్తువూ ఇరువురూ పతనమవుతున్నారు. కామకత్వాన్ని, సమస్తరాగవ్యామోహాలను, దేహభ్రాంతిని పరిత్యజించమని వేదాంతబోధ. అంతేగాని నిజమైన ప్రేమను వదల మని కాదు. నిజమైన విశుద్ధప్రేమను నీవు పరిత్యజించ నవసరంలేదు.

ఒక శిశువు విషయము తీసుకోండి. శిశువు ప్రేమిస్తున్నాడా? లేదు. లేదు. శిశువు ప్రేమికుడు గాడు. శిశువు ప్రేమే. "ప్రేమికుడవు కావద్దు. ప్రేమే నీవు కా"—అని వేదాంతం నిర్వచిస్తున్నది. శిశువు ఇతరులచేత ఆకర్షింపబడడానికి కారణ మేమిటి? శిశువు ప్రేమించడం

లేదు. ప్రేమే తానుగా ఉన్నది. శిశువులో ఏ మోహబంధమూ లేదు. ఏ రాగమూ లేదు. ఏ వ్యక్తిగత స్వార్థమూ లేదు. శిశువు ప్రేమే తానై యున్నది. అందుచేతనే వేదాంతం "ప్రేమే నీవు కా! అప్పుడు నీవు సర్వమును ఆకర్షించగలవు! పరిపూర్ణుడవు కాగలవు" — అని ప్రబోధిస్తున్నది.

తమ్ము బాగుచేసుకోవడాన్ని గూర్చి, ఇతరులను బాగుచేయు డాన్ని గురించి, ప్రజలు ఎన్నెన్నో దీర్ఘప్రసంగాలు చేస్తున్నారు. కాని, మిమ్ములను ఖండత్వంలో బంధించే స్వార్థాశయాలను, స్వార్థవిధానా లను ప్రక్కకు గెంటివేయండి. సర్వవాంఛాసముదయం రాగమే. సర్వ కామమూ దేహరాగమే. సమస్తవాంఛాసంఘము మోహబంధమే. ఈ రాగబంధాన్ని, ఈ మోహపాశాన్ని త్రెంపివెయ్యి. అప్పుడు నీవే పవిత్రతవై ప్రకాశించ గలవు! ఈ పవిత్రతను పొందు. నీ శరీరం స్వస్థత పొంది తీరుతుంది. వేదాంతప్రబోధితమైన ఈ పవిత్రతను పొందు. నీ బుద్ధి వికసించి, పరిపక్వమై తీరుతుంది. ఈ పవిత్రత, నిజమైన వైరాగ్యమే (సర్వసంగ పరిత్యాగం) నని వేదాంతం సర్వదా ఉద్ఘోషిస్తున్నది.

ఈ పవిత్రతను ఆర్జించండి! శిశువు పవిత్రుడు కాడా? శిశువుకు భేదదృష్టి లేదు. పసికందుగా కనపడే ఆ మహాశక్తిశాలిని చూడండి. అతడు (శిశువు) ఎంతటి బలశాలి. బుజానైనా ఎక్కి స్వారిచేస్తున్నాడు. ఎంతటివాని వెంట్రుకలైనా పట్టి లాగుతున్నాడు. ఎంతబలమైన, సర్వ జనాకర్షణకరమైన అయస్కాంత మతడు? కారణ మేమిటి? పవిత్రత. ఈ పవిత్రతే, ఈ పరిశుద్ధతే శిశువును సర్వాకర్షణీయంగా, మహా సౌందర్యనిధిగా చేస్తున్నది. అందుకనే వేదాంత మీ విధంగా ప్రబోధి స్తున్నది:— "ఈ వైరాగ్యానుభవం పొందు. ఈ సర్వసంగపరిత్యాగ దృష్టి పొందు. ప్రేమే నీవై ప్రకాశిస్తావు. అప్రయత్నంగా, సహ జంగా నీలోనుంచి సమస్తమానవలోక కల్యాణప్రదమైన మంచి ప్రవ హిస్తుంది." ప్రపంచానికి మనం శుభం చేకూర్చాలంటే, మనమే సంపూర్ణ శుభస్వరూపులం కావాలి. శుభమే, కల్యాణత్వమే, మంచే మనము కావాలి. వెలిగేదీపంనుంచి ప్రకాశంలాగా, అప్రయత్నంగా,

సహజంగా మనలోనుంచి తేజస్సు ప్రవహిస్తుంటేనేగాని, మనం లోక కల్యాణం చేయలేము.

సర్పముయొక్క నేత్రాలు పరికించండి. అవి ఆకర్షణీయములై, అతి సమ్మోహనకరంగా కనబడుతుంటవి. చిన్న చిన్న పిట్టలు ఆకర్షింపబడి దానినోట్లో పడుతున్నవి. ఆ సర్ప నేత్రాల్లో ఉన్న సౌందర్యమేమిటి! ఆ చూపుల్లో ఒక అభేద దృష్టి ఉన్నది. దాని దృష్టిలో ఏ వస్తురాగమూ లేదు అందుచేతనే, "పాములాగా తెలివి కలిగి ఉండు"— అనే జనోక్తి మీరు వినియుంటారు.

ఈ నిస్సంగదృష్టిలోనే ఆకర్షణయొక్క, సమస్తశక్తియొక్క, స్వస్థతయొక్క సర్వరహస్యమూ ఇమిడియున్నది. ఒక్కొక్కప్పుడు పాము తన పిల్లలను రక్షించడానికి నోట్లోపెట్టుకోవడం కనబడుతుంది. తరచు తన పిల్లలను పాము మింగుతుందికూడా. పాము వందల కొలది పిల్లలను కంటుంది. ఇవన్నీ కనుక బ్రతికితే ప్రపంచంలో ఉండడానికే వీలులేదు. అందుచేతనే ప్రకృతి ప్రపంచరక్షణకు యీవిధానం ఏర్పరచింది. పాము తన పిల్లలనే తింటుంది. పాము రాగబంధంలేని జంతువు. పాము తన చర్మాన్ని (కుబుసము) విడుస్తుంది. తనచర్మంతో దానికి సంబంధం లేదు. అదేమాదిరి రాముడు మీకుచెబుతున్నాడు: మీరు వైదాంతికమైన జ్ఞానాన్ని మనస్సులో తెలుసుకోగలిగినట్లయితే శరీరమనేది లేనే లేదన్నంత దేహబంధ విముక్తులై "అహం బ్రహ్మాఽస్మి, నేను సర్వస్వరూపుడనైన పరమాత్మను"—అని తెలుసుకోగలిగినట్లయితే దేహేంద్రియాలకు నీవు బద్ధుడవుకావు. నీవు అఖండ పరిపూర్ణ పరబ్రహ్మవై ప్రకాశిస్తావు. నీవు సమస్తాన్ని ఆకర్షించగల దివ్య అయస్కాంతం కాగలవు. వేదాంత సందేశమిది: "నీ విది తెలుసుకున్నట్లయితే, నీవు పరిపూర్ణ పరిశుద్ధుడవైనట్లయితే నీవు దివ్య అయస్కాంతమవుతావు. ఈ అయస్కాంత మేమిటి? నీవు ఏకీకృతప్రేమసారమై ప్రకాశిస్తావు. దానంతట అదే సత్కర్మ నీలోనుంచి ప్రవహిస్తుంది". వ్యామోహాబంధితులై మీరు సంబంధ బాంధవ్య ప్రేమలను అపార్థం చేస్తున్నారు. "నేను అనురాగం చూపిస్తున్నాను"— అని నీవంటే నిజానికి నీవు అసూయ చూపిస్తున్నా వన్నమాట. "రాగాన్ని విడిచి

పెట్టు" అన్న వేదాంతబోధను, "అసూయను విడిచిపెట్టు" అనే మాటల్లో పెట్టుకోవాలి. ఈ రకంగా అర్థం చేసుకోవాలి. నీ వొక వస్తువుమీద అనురాగం చూపిస్తున్నప్పుడు, నీవొక వస్తువుచేత మోహబద్ధుడవైనప్పుడు సమస్త ప్రపంచంతోటి విడిబడడం కాదా ? శిశువు ప్రేమించడం నేర్చుకోకముందు శిశువు పరిపూర్ణప్రేమయే తానై యున్నది సమస్త విశ్వంతో ఒకటైయున్నది. శిశువు ఒక మాసము ఈడులో ఉన్నప్పుడు ఎవరైనా వచ్చి ఎత్తుకోవచ్చు ఎవరైనా ఆడించవచ్చు. అప్పుడు శిశువు పూర్ణప్రేమస్వరూపి. కాని, కొంచెం పెరిగినతర్వాత శిశువుకు ఎవరిమీదో అనురాగం బయలుదేరుతుంది. అప్పుడు ఏమి జరుగుతున్నది ? తల్లిదండ్రులు భారమవుతున్నారు. అక్కచెల్లెళ్లూ, స్నేహితులూ, ప్రియంగొల్పడం లేదు. పూర్వస్నేహితులు విడిపడుతున్నారు. సమస్త ప్రపంచము విడిబడిపోతున్నది. శిశువు పెరిగి బాహ్యవ్యవహారంలో పడుతున్నది. అప్పుడు విచారాలు అతనిని వెంటాడుతున్నవి. పెరిగి పెద్దవాడై సముద్రతీర విహారానికి పోతాడు. కాని ఆ మందసుగంధానిలంలో అతనికి సుఖం కనబడదు. కారణం ? ప్రియురాలిమీద అనురాగం అతన్ని ఇతర ప్రపంచంతో విడివడ చేసింది. నీవొక ప్రత్యేకవస్తువుమీద అనురాగం పెట్టుకుంటున్నప్పుడు నీవు సమస్త ప్రపంచంతో విడివడుతున్నావు. అందుచేతనే వేదాంతం సమస్త దేహానురాగం, సమస్త దేహసంబంధం నిజానికి వియోగమేనని, విడివడడమేనని నిర్వచిస్తున్నది. దైహికానురాగమంటే, వ్యక్తిగత వ్యామోహమంటే, నిర్జీవత్వమే, స్తంభించిపోవడమే. అందుచేత ఆత్మహత్యచేసుకోబోకు.

శిశువులోని ప్రాథమికదశ ప్రేమైక్యస్థితి. తరువాత దశ కామవికారం. "నీ వాంఛలకు అతీతుడవు కా" - అన్న వేదాంతవచనానికి అర్థం, మానవలోకానికి నిన్నొక వరప్రదానంగా చేయడమే సుమా. వేదాంతం నీ శక్తులను ఉచితోన్నతస్థానంలో నిలిపి, సర్వమానవులతో నీకు ఐక్యసిద్ధి కలిగిస్తుంది.

జగద్ధితవర్తనులైన మహాత్ములందరు, వ్యక్తిగతరాగానుబంధవిముక్తులై, పరిశుద్ధజీవనులై జీవించలేదా ? క్రీస్తు పెండ్లిచేసు

కున్నాడా? లేదు. భక్తులూ, ప్రవక్తలూ వివాహం చేసుకున్నారా? లేదు. రాముడు వివాహానికి వ్యతిరేకంగా మాట్లాడడం లేదు. రాముని అభిప్రాయం, భగవంతునితో మనస్సును ఏకం చేయడమని. సమస్తజగత్తులో మనస్సును ఏకం చేయుడమని. కొంతమంది భక్తులు వివాహం చేసుకున్నారు. అయితే వారి సంబంధం గుర్తించండి. కుటుంబమధ్యంలో వసించినా, సంతానం కన్నా, వారి మనస్సు పరిపూర్ణ విరాగంతో మోహబంధ రహితమై పూర్ణ పరిశుద్ధమై ప్రకాశించింది. మన శరీరాలు ఉండేచోట, మనం నివసించడం లేదు. మన మనస్సు ఎక్కడ నివసిస్తున్నదో, మన మక్కడనే నివసిస్తున్నాము. నిజానికి మనమనస్సు నివసించేచోటే, మనం నివసిస్తున్నాము. బాహ్యానికి గృహస్థ జీవితంలో ఉన్నా, మన మహాభక్తులందరూ సంపూర్ణంగా, హృదయపూర్వకంగా సత్యంతో ఏకమై జీవించారు. 'నేను విశ్వేస్వరూడనైన పరమాత్మను, అనే జ్ఞానతేజస్సులో జీవించారు.

క్రమంగా మీ రాగబంధాలను విసర్జించి అతి సహజంగా, అప్రయత్నంగా సమస్త మానవలోక హితకారులుగా ప్రకాశించండని వేదాంతం ప్రబోధిస్తున్నది.

అమెరికా సారస్వతంలోని చాలాభాగం ఆకర్షణ విద్యను గురించి, వశీకరణవిద్యనుగురించి, (Magnetism and Mesmerism) అదృశ్యవస్తు దర్శనాదులనుగూర్చి (Clairvoyance) ఇంకా ఇలాంటి వివిధవిషయాలనుగూర్చి ఉంటుంది. ఈ సారస్వతంలో ముప్పాతిక పాళ్ళు, శరీరాన్ని ఆరోగ్యంగా బలంగాఉంచే వివిధవిధానాలనుగూర్చిన ప్రసంగాలతో, రోగనివారణమార్గాలతో కూడి ఉంటుంది. ఇది చాలామంచి విషయమే. వారి ఆశయం చాలా మెచ్చుకోదగిందే. కొన్ని మంచి విషయాలున్నా, ఈ రచయితల్లోని చాలామంది పరమసత్యానికి వ్యతిరేకమైన, స్వార్థయుక్తమైన, కామ్యదృష్టిగల, కర్తృత్వాహంకారరూపకమైన మార్గం తొక్కారు. ఈ రచయిత లందరూ తమశక్తికొలది మంచిపనే చేస్తున్నారు. కాని- వారిలో ఉన్న బలహీనతను నీవు పోగొట్టాలంటే నిజమైన బలమును, సత్యమైన శక్తిని మీరు పొంది మనోనియంతలై విజయకిరీటమును ధరించాలంటే,

సత్యం బాహ్యాదృష్టికి వ్యతిరేకమైందని మీరు గ్రహించాలి. ఒక వస్తువును పొందే మార్గం ఆ వస్తువును వర్జించడమే. ఇది దైవ నిర్ణయం. మన మేం చేయగలం? రాముడు మీముందు శుద్ధసత్యాన్ని పెడుతున్నాడు. మీరు దీన్ని స్వానుభవంతో రుజువు తేల్చుకోవచ్చు. ఇతరమార్గాలన్నీ మీరు గాలించండి. తరువాతనే రాముని సందేశాలు స్వీకరించండి. సమయం తటస్థించినప్పుడు ప్రయత్నించి రాముని వాక్యాలు అనుభవంలో పెట్టిచూడండి.

ఒక వస్తువును పొందాలంటే ఆ వస్తువును పరిత్యజించాలి. తన జీవితాన్ని పొందదలచిన మానవుడు తన జీవితాన్ని పోగొట్టుకోవాలి. అనేకమంది రచయితలు యీ సత్యమును చూడలేకపోయారు. నీకు విజయం కావాలా! నీవు ఆకర్షించే అయస్కాంతం కావాలి. అయస్కాంతసన్నిధికి ఇనుపముక్కలు ఆకర్షితమైనవిధంగా వాంఛలు నిన్ను ఆశ్రయించగలవు.

ఒక మానవుడు విజయం పొందుతున్నాడంటే అతడు అయస్కాంత మైనాడు. నీవు అయస్కాంతం కావాలనుకుంటే నిన్ను నీవు అయస్కాంతంగా చేయడానికి ఏవే సాధనలు చేయాలో ఆ సాధనలు చెయ్యాలి. ఏమి టాసాధన ?

ఇక్కడొక వస్తు వున్నది. ఇందులో ఒక ధనాత్మక ప్రకృతి (Positive element) ఒక ఋణాత్మక ప్రకృతి (Negative element) రెండూ ఉన్నవి. మరి అయస్కాంతంలో ఈ రెండు ప్రకృతులు ఏ విధంగా వున్నవి? రెండు ప్రకృతులు విభాగితం కానప్పుడు ఆకర్షణశక్తి వుండదు. కాని, అయస్కాంతముయొక్క ధనాత్మక ప్రకృతికీ, ఋణాత్మక ప్రకృతికీ సంబంధం లేదు. అయస్కాంతములో ధనాత్మక ప్రకృతి ఒక చివర, ఋణాత్మక ప్రకృతి మరొకచివర కూడియుంటవి. అప్పుడు అయస్కాంత శక్తి ఎర్రసముద్రమును స్పృశించి జలమును రెండుగా విభజించిన మోసెస్ యోగదండంవలె పరిపూర్ణత పొందుతుంది.

ఇక్కడ అయస్కాంతం గావడానికి విభజన కావలసి యున్నది. అదేప్రకారం నీలో విభజన కావాలి. అప్పుడు నీవు అయస్కాం

తత్వాం పొందుతావు. వేదాంతం ఏమని చెబుతున్నది? వేదాంతము, వైరాగ్య (సర్వసంగ పరిత్యాగ) ప్రబోధంచేత సుందరమైన మోసెస్ యోగదండంమాదిరి విత్తునుంచి పొట్టును విడదీస్తున్నది. దివ్యప్రకృతి నుంచి అసుర ప్రకృతిని విభజిస్తున్నది. నీలోని పశుప్రకృతినుంచి నీ దైవ ప్రకృతిని విభజన చేస్తున్నది. జాగ్రత్తగా గ్రహించండి. ఈ సమస్త రాగవ్యామోహాలన్నీ నీలోని ఖండప్రకృతి సంబంధమైనవి. అఖండత్వంలో ఏవాంఛ నిలువగలుతుంది? వాంఛలన్నీ ఖండత్వానికి, పరిమితత్వానికి సంబంధించినవి. అఖండత్వం, పరిపూర్ణత్వం కోరలేదు. అఖండ పరిపూర్ణత్వానికి వేరుగా ఇంకొకటి లేదు. సర్వమూ అదే. మరి ఇక అఖండ పరిపూర్ణత్వం ఏరకంగా వాంఛించగలదు? పరిమిత జీవిమాత్రమే వాంఛింపగలదు. మీ సమస్తవాంఛలు, మీ సమస్త రాగవ్యామోహాలు, మీలోని ఖండప్రకృతినుంచి, మీలోని మాయా ప్రకృతినుంచి బయలుదేరుతున్నవి. నీలోని అఖండపరిపూర్ణాత్మ వాంఛాతీతమైనది. నీలోని కామప్రకృతి- ఈ మిథ్యాహంకృతి నీలోని పశుప్రకృతియై యున్నది. నీలోని బ్రహ్మత్వం, నీలోని అఖండ పరిపూర్ణత్వం సమస్త కామవాసనాతీతమైయున్నది. వేదాంతం ఏమి చేస్తున్న దిప్పుడు? వేదాంతం మీ రెండు ప్రకృతులను విభజించమని ప్రబోధిస్తున్నది. ఈ రెండు తారుమారుగా కలుపబడినవి. నీ వీస్వార్థమయమైన అనిత్యమైన- ఖండమైన, దేహాన్ని నేను—అని సంభావిస్తున్నావు. సత్యాత్మయైన రాముని, భగవంతుని, మిథ్యయైన ఈ దృశ్యమానమైన అనిత్యమైన, మాయారూపకమైన ఖండప్రకృతితో కలిపివేస్తున్నావు.

సీజరు వస్తువులు సీజరుకివ్వండి. రాముని వస్తువులు, లేక భగవంతుని వస్తువులు భగవంతుని కివ్వండి – అని వేదాంతం ప్రబోధిస్తున్నది. ఈ వాంఛా ప్రకృతిని, ఈ మిథ్యాహంకృతిని, దాని విలువతో దాన్ని చూచి, అసత్యమైనదానిగా, లేనిదానిగా తెలుసుకోండి. నీ బ్రహ్మత్వాన్ని ఉద్ధరించు! నీవు దేవాదిదేవుడవని, జగన్నాథుడవని, అనంతాద్వితీయపరబ్రహ్మ వని సంభావించు! ఈ బ్రహ్మానుభవం పొందు. అత డింక దేనిని కోరగలడు? అతడే సర్వమైయున్నాడుగదా!

సర్వకాలసర్వావస్థలలో లేనివాడే వాంఛించగలడు. సత్యాత్మకు వాంఛ లేదు. ఎందుకంటే సత్యాత్మే సర్వమై యున్నది. సర్వమూ నీలో ఉన్నది. సమస్త వస్తువులు, సమస్తసుఖాలు, సమస్తైశ్వర్యమూ, మానవుడు వాంఛించగల సర్వస్వమూ నేనే ఐయున్నానని తెలుసుకో. సర్వమూ నేనే అని సంభావించు. ఓంకారస్మరణ చెయ్యి. ఈ దివ్యాను భూతికి సాధన చెయ్యి. నీ నీసత్యమును సందర్శించవలసి యున్నది. 'నేను దేహాన్ని — అని నిరంతరము సంభావించావు. దేహమైపోయి నావు. దేహభ్రాంతిలో పడ్డావు. భగవత్సంభావన చెయ్యి. భగవ ద్ధ్యానం చెయ్యి. భగవంతునిలో జీవించు. అప్పుడు వాంఛకు తా వెక్కడ దొరుకుతుంది? ఈ వేదాంతము నిన్ను అయస్కాంతముగా చేస్తుంది. ఉత్తర దక్షిణ ధృవాలు విభజింపబడుతవి. శరీరము అయ స్కాంతత్వము పొందుతుంది.

ఇక్కడ ఒక అతి ముఖ్యవిషయం చెప్పబడుతున్నది. ఫలానా ఫలానా వక్తకు గొప్ప వ్యక్తిత్వాకర్షణ ఉంది,' అని జను లంటారు. ఈ ఒక్క ఆకర్షణే నీవు కోరడంలేదు. భావాన్ని ఆకర్షించే అయ స్కాంతం కావాలని ఒక మానవుడు వాంఛిస్తాడు. ధనాన్ని ఆకర్షించే అయస్కాంతంగా తాను మారాలని ఇంకొకడు కోరుకుంటాడు. ఇం కొకడు దేహసౌందర్య సంబంధమైన అయస్కాంతముగా తాను మారాలని అనుకుంటాడు. పలువురు పలురకాల అయస్కాంతా లుగా మారాలని వాంఛిస్తారు. కాని, ఈ సమస్త ఆకర్షణలయొక్క రహస్యం వైరాగ్యం. సర్వసంగపరిత్యాగం. ఈ మాటలు గుర్తుంచు కోండి! సమస్త ఆకర్షణరహస్యము నిష్కల్మషవైరాగ్యము తప్ప వే రొకటి లేదు. పూర్ణమైన స్వస్థతనుగూర్చి బోధించడానికి మీరు గ్రంథాలు ముద్రించడంలో కాలం వృథాపుచ్చ నవసరం లేదు. మీా రీ వాక్యాలు గుర్తుంచుకొని తత్ప్రకారం వర్తించండి. మీారు మహా అయస్కాంతాలుగా మారుతారు. రాముడు అనుభవపూర్వకంగా ఈవిషయాలు మాట్లాడుతున్నాడు. మీారుకూడా అనుభవంలో పెట్టి వీటిని తెలుసుకోవచ్చు. అన్నిరకాల విజ్ఞానాన్ని ఆకర్షించడానికి మనం భగవంతునికి మొరపెట్టుకోవాలనా? "సర్వశక్తిమయుడవైన ఓ భగ

వంతుడా! నాకు జ్ఞానం దయచెయ్యి. జ్ఞానస్వరూపా! ప్రభూ! నాకు జ్ఞాన తేజం ప్రసాదించు.''– అని ప్రార్థించాలనా? ఓహో! ఈ దైన్యత మీకు జ్ఞాన మిస్తుందా? ఇవ్వదు. నాకు జ్ఞానం కావాలి,''అని మొఱ పెట్టుకో మతి ఎంతో గతి అంత– అని మరువకండి! ''నాకు జ్ఞానం కావాలి.'' అని నీవు సంభావిస్తే ఫలితం ఏమి కలుగుతుంది? ఈ భావన నిరంతరం నిన్ను జ్ఞానదూరుని చేస్తుంది. ఈ జ్ఞానంకోసమైన యాచన, ఈ జ్ఞానదూరభావన, నిరంతరం నిన్ను జ్ఞానానికి అతిదూర స్థానంలో ఉంచుతుంది.

ఒక భాగ్యవంతునికి ఒకకుమారు డుంటాడు. అతని జన్మహక్కు పదిలక్షల రూపాయ లనుకోండి. ఆ జన్మహక్కు అతనికెప్పుడు లభిస్తుంది? ఓహో? అతడు ఎంతోకాలము వేచియుండాలి. ఆ ఆస్తి తనకు రావాలంటే,అతడు తన తండ్రి చావుకోసం కోరుతూ నిరంతరం నిరీక్షిస్తుండాలి. అదేమాదిరి నీవు. ''ఓ ప్రభూ! నేను నీభక్తుడను, నీభక్తుడనుగనుక, ఓప్రభూ! నాకది దయచెయ్యి? నాకిది దయచెయ్యి''అని ప్రార్థించేయెడల నీవు భగవంతుడు మరణించేవరకు వేచి యుండాలి. భగవంతు డెన్నటికీ మరణించడు. నీ జన్మహక్కూరాదు. జ్ఞాన తేజమును పొందేమార్గం ఇది కాదు. యాచించడమువల్ల, భిక్షించడమువల్ల, దేబిరించడమువల్ల మానవుడు దేన్నీపొందలేడు,

ఇది ఒకఅద్భుతమైన సిద్ధాంతం. తత్త్వశాస్త్రం దీన్ని రుజువు చేస్తుంది. బలమంటే ఏమిటి? జ్ఞానముకోసమైన వాంఛకూడా వదలడమే బలమై యున్నది. ఎంతవరకైతే నీవు జ్ఞాన తేజం వాంఛిస్తుంటావో, అంతదనుక అది నీకు చిక్కక దూరంగా పరుగిడుతుంటుంది. యాచనచేత, దైవముచేత, భిక్షాకర్మచేత, జ్ఞానమును నీవు కప్పివేస్తున్నావు. యాచన, దైన్యము, భిక్షావృత్తే. జ్ఞానకాంతి నీమీద ప్రసరించడానికి అడ్డుతగులుతుంది.

రాముడు మీ కొకచమత్కారకథ చెపుతాడు. పూర్వం భారతదేశంలో ఒక మనిషి ఉన్నాడు. అతడు ఒక స్త్రీయొక్క అనురాగాన్ని సంపాదించడానికి మంత్రజపం చేస్తున్నాడు. అతనికి

మంత్రోపదేశం చేసినయోగి మంత్రపునశ్చరణంచేసే సమయంలో ఒక విషయాన్ని గురించి జాగ్రత్తపడాలెనని చెప్పాడు. ఆ విషయమేమిటి? యోగి ఆ మనిషిని మంత్రపునశ్చరణసమయంలో కోతినిగురించిన భావం మనస్సులోకి రాకూడదని చెప్పాడు. అతడు మంత్ర పునశ్చరణకు ప్రారంభించాడు. కోతిని గురించిన భావము మనస్సులోకి రాకుండా ఉండడానికి ఎంతో శ్రమించాడు. ఎప్పుడూ ఆ భావమే వస్తుండేది. ఒక్క నిమిషమైనా మంత్రజపం చేయలేక పోయినాడు. యోగిదగ్గరకు పోయి ఇట్లా చెప్పాడు:- "అయ్యా! మీరు నన్ను కోతివిషయమై ఆలోచించవద్దని చెప్పారు. ఆ విషయం చెప్పకపోతే, నాకు మంత్రి జపానికి వీలుండేది. మీరు కోతిభావం తెచ్చుకోబోకని చెప్పినందువల్ల ఆ భావమే వస్తున్నది." అదేప్రకారం అజ్ఞానమును అణుచుదామని చేసే ప్రయత్నంచేతనే బలహీనతను పోగొడుదామని చేసే ప్రయత్నము చేతనే, నీవు అజ్ఞానబలహీనతలకు స్థానం ఇస్తున్నావు.

సూర్య చంద్ర నక్షత్రాలనుంచి తేజస్సు వెలువడిన మాదిరి, జ్ఞానకాంతి నీలోనుంచి దానంతట అదే వెలువడుతుంది. జ్ఞానవాంఛను కూడ వదలు. జ్ఞానవాంఛనుకూడ హృదయములోనుంచి క్షాళనం చెయ్యి. ఈ జ్ఞానయాచనను, పరిత్యజించు" అని వేదాంత ముపదేశిస్తున్నది. ఓహో! ఏమి ఆనందం! సత్యమును అనుభవించు! "జ్ఞానము రానీ, రాక పోని, జ్ఞానముతో నాకు అవసరం లేదు. ఓహో! నేను జగత్సర్వస్వ సూర్యుడను! నేను సమస్త విశ్వజ్ఞానజ్యోతిని"- అని సంభావించు. ధ్యానించు. ఇక్కడ నీవు ప్రేమికుడవు. కావు. ప్రేమే నీవు. నీవే జ్ఞానతేజం! అందుచేత నీవు జ్ఞానమును యాచించడం లేదు. నేను దేహాన్ని కాదు. మనస్సును కాదు. జ్ఞానవాంఛ క్షుద్రాహంకృతిది. నీవు దేహానివి కాదు. నీవు నిజంగా పరమజ్ఞానతేజమే. దీన్ని సంభావించు. దీన్ని తెలుసుకో! నీవు వాంఛావలయాలను అధిగమిస్తావు.

హిందూస్తానీభాషలో ఒక మనోజ్ఞగీతం ఉన్నది. దాని అర్థమిది:- "నీవు మధురసానివి. నీకు వాంఛ లేదు. నీవు వాంఛాతీతుడవై యున్నావు." స్వానుభవ మిది :- రాముడు ఎప్పుడైనా సరే

ఒక సమస్యనుగూర్చి ఆలోచించేటప్పుడు, ఎంత ఆలోచించినా, ఎంత అవస్థపడ్డా, చివరకు అప్రయత్నంగా మనస్సులో విసుగుపుట్టి "ఈ సమస్యతో నా కేంపని? దీనికి సమాధానం దొరికితేనేం దొరకకపోతే నాకేం!" అని సిర్లిప్తుడై, వాంఛాతీతు డయ్యేవాడు. అప్పుడు చిత్రం! అప్రయత్నంగా పరిష్కారభావం తట్టేది. "జ్ఞానంకోసం ఎందుకు వాంఛాతపన? వాంఛను పరిత్యజించు. వాంఛను తృణీకరించు. వాంఛను విడిచిపెట్టు." జ్ఞానకాంతి వెలువడుతుంది:

విశ్వవిద్యాలయంలో పెద్ద తరగతి చదివేటప్పుడు రాము ఓక ప్రతిజ్ఞ పూనాడు. ఉపాధ్యాయుల సహాయం లేకుండా ప్రతికార్యము నిర్వహించా లని. ఇది చాలా కష్టకార్యం. క్లిష్టమైన గణితశాస్త్ర సమస్య లన్నీ, ఉపాధ్యాయుల సహాయం రవ్వంతకూడా తీసుకోకుండా పరిష్కరించడానికి రాముడు తనకు తానే నిర్ణయించుకొన్నాడు. మహా క్లిష్ట సమస్యలు పరిష్కరించవలసి వచ్చేవి. మహా పరిశ్రమించేవాడు. కొన్నికొన్నిటిలో విజయం వచ్చేది. అనేక సమస్యలలో జయం లభించేదికాదు. సాయంకాలం 5 గంటలు మొదలు మరునాడు ఉదయం 4, 5 గంటలవరకు రాముడు పరిశ్రమించేవాడు. కాని, సమస్యలు పరష్కారం అయ్యేవి కావు. విసుగుబుట్టి కొంచెం మంచిగాలి తగిలితే మనస్సు నిర్మలంగా ఉంటుందని ఇంటికప్పుపైకి వెళ్ళాడు. కొంతసేపటికి లాభంలేక ఆత్మహత్య చేసుకోవడానికి కత్తికోసం వెతుకు తున్నాడు. ఆ సమయాల్లో రాముని శరీరభావం వదలిపోయేది. రాముడు శరీరాతీతస్థితికి అధిగమించేవాడు. సమస్య తత్‌క్షణమే పరిష్కృతమై మెరుపులాగా మెరిసేది. క్లిష్టవిషయాల్లో ఎప్పుడైనాసరే మనం భావాన్ని ఆకర్షించే అయస్కాంతంగా మారినప్పుడు మనం భావ (ఆలోచన) అతీతుల మౌతున్నాము. రాము డిప్పుడు చేసేపని ఏమిటో నీకు తెలుసా? ఇది చేద్దామనే భావాలన్నీ మనస్సులోనుంచి దూరంగా త్రోసివేయడం ప్రథమ కార్యం. "నాకు ఏదైనా రచించా లని వాంఛ లేదు. వీటితో నా కేంపని. వాంఛల్లారా! దూరం! దూరం! నేను జ్ఞానజ్యోతిని! నా ఆత్మప్రతిభలో నేను ఆనందిస్తాను. ఆత్మానందానుభవమే విజయలాభం. నిజమైన విజయప్రాప్తికి తక్కిన

వన్నీ కేవల మిథ్యాస్వప్నాలు! ప్రపంచవిజయం నాకు లభించినా నాకు దానితో అవసరంలేదు. నా ఆనంద సర్వస్వమూ భగవంతుడే." ఇదీ విధానం. బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి ప్రయత్నించు. సర్వమూ నీ అడుగుల వెంట వస్తుంది. నీలోని రహస్యమును తెలుసుకో. తరువాత సర్వ వస్తువులూ నిన్ను ఆశ్రయించడానికి పరుగిడి రాగలవు. "వీటితో వాటితో నాకేంపనిలేదు. నాకే బాధ్యతాభయాలూ లేవు. నాకే సంబంధం లేదు. నే నెవరికీ ఋణపడిలేను. నేను నేనే! నేను పరంజ్యోతిని! సర్వాంతర్యామిని!" అనే విముక్తభావంలో మగ్నుడవు కా!

ప్రపంచం నీకేమి ఆనందమివ్వగలదు? సమస్తసుఖమూ సమస్తానందమూ నీలోనుంచే వస్తున్నది. సత్యాత్మ అఖండ పూర్ణానంద స్వరూపమై యున్నది. సమస్త ప్రతిభ, సమస్త సుఖమూ సత్యాత్మలో ఉన్నది. ఆ బ్రహ్మానంద రసామృతాన్ని నేను నిరంతరం పానం జేస్తాను. ఈ ప్రపంచ వస్తువులు నాకు లభించినా వీనితో నాకు పనిలేదు. అప్పుడు ఏం జరుగుతుంది? సమస్తభావాలు, సమస్త వస్తుజాలం నిన్నాశ్రయిస్తాయి. ఇదీ ధర్మ నియతి. జ్ఞానసిద్ధి పొందాలంటే, జ్ఞానవాంఛా తపనకు నీవు అతీతుడవు కావాలి. ఈ జ్ఞానవాంఛాతపనకు అతీతుడవు కావడం సమస్యయొక్క వ్యతిరేక భావం. "నేను జ్ఞానజ్యోతిని. ఆత్మానందమే నా మహానందం". అనే ధ్యానం సమస్యయొక్క సవ్యభావం.

ఇంకో రహస్యం. నీ కొక మిత్రుడో, ధనమో ఇంకేమైనా కావాలనుకుంటావు. ఏమి చేయాలి నీవు? వాంఛారాగమును వదలి పెట్టు. ఈ విధంగా సమస్యయొక్క వ్యతిరేక భావన నిర్వర్తించిన పిదప, సమస్యయొక్క అనుకూలభావమైన "నేను పరబ్రహ్మను. నేను జగన్నాథుడను. నేను జ్ఞానజ్యోతిని! సర్వసౌందర్యనిధియైన, సర్వానంద సాగరమైన పరమాత్మను నేను! నేను విశ్వేశ్వరుడను. మహాదేవుడను. శివోఽహం! శివోఽహం!" అనే విశ్వాసదీప్తమైన ధ్యానమును స్వీకరించు. నీ బ్రహ్మత్వసంభావన చెయ్యి. బ్రహ్మత్వ ధ్యానం చెయ్యి. సంకల్ప వికల్పాదులను పూర్ణంగా పరిత్యజించు. వాంఛలు వదులు. వస్తువులు సంప్రాప్తించినపుడు, వాటిని జ్ఞానదృష్టితో చూడు. బ్రహ్మత్వంలోమాత్రమే ఆనందించు. అట్టిస్థితిలో లోకుల దృష్టిలో నీవు

విజయం పొందినవాడవైనా నీ సత్యదృష్టిలోమాత్రం, విజయమే నీవుగా ప్రకాశిస్తుంటావు.

వాతావరణంలో ఒకచోట గాలి వ్యాకోచముపొంది, సూర్యుని వేడిమిచేత పైకి పోతుందనీ, ఆ స్థానంలో ఖాళీ ఏర్పడుతుందనీ గత దినం చెప్పబడింది. అప్పుడు ఏమి జరుగుతున్నది? ప్రక్కనగల వాయువు, ఆ ఖాళీని నింపడానికి రయ్యిమని వీచి, ఆ ఖాళీలో ప్రవేశిస్తుంది. అదేమాదిరి, నీవు వాంఛాతీతుడ వవడముద్వారా ఖాళీని కల్పించాలి. నీ శరీర మప్పుడు ఖాళీగా మారుతుంది. నీవు బ్రహ్మాత్మస్థితుడవై యున్నప్పుడు, నీకు శరీర దృష్టి—అహంకారము—నశించిపోతున్నది. అహంకారం, దేహబుద్ధి తన స్థానాన్ని ఖాళీ చేస్తున్నది. అప్పుడేమి జరుగుతుంది? సమస్త ఆశయాలు, సమస్త వాంఛా ఫలితాలు పరుగెత్తుకుంటూ వచ్చి నీ చుట్టూ చేరక తప్పదు.

కొన్ని విషయాలనుబట్టి చూస్తే, అయస్కాంతము యొక్క ప్రకృతి, ఒక ఖాళీస్థలములాంటిది కాక వేరు గాదు. వాంఛలను—నీ మనస్సును వ్యాకులపరుస్తున్న స్వార్థవాంఛలను పరిత్యజించడం చేత ఇక్కడ ఖాళీ ఏర్పడుతున్నది. ఈ సమస్త వాంఛావికారాలను నీలోనుంచి తరిమివెయ్యి. నీవు సర్వజగన్మోహనాకారమైన ఒక దివ్య అయస్కాంతమై ప్రకాశిస్తావు.

ప్రశ్న :—రోగనివారణ చేయడానికి భౌతికదృష్టి వదలాలా?

ఉత్తరం:—రోగనివారణకు నీ వఖండ సంపూర్ణానంద స్వరూపుడవని గ్రహించి తదేకసంభావనచెయ్యి. సర్వపదార్థముల్లో బ్రహ్మస్వరూపం తప్ప నీవు వేరు చూడకూడదు. భగవంతుని ధ్యానం చెయ్యి. బ్రహ్మాత్మామును సంభావించు. ఇంక వ్యాధి అనేది వుండదు. ఈ దేహ వాసనలకు అతీతుడవుకా. ఉత్తరక్షణమే ఆరోగ్యమూ, బలమూ, సర్వశుభములూ అనుకోనివిధంగా వచ్చి నీచుట్టూ గుమిగూడి నిన్నాశ్రయిస్తాయి. దేవుని చూడాలనీ, దేవుని వినాలని వాంఛా తపన ఎందుకు? స్వతస్సిద్ధంగా నీవే దేవుడవై యున్నావు. దేవుని కోసం నీవు వాంఛించడంవల్ల దేవుని నీకు దూరంగా ఉంచుతున్నావు.

నీవు మానవలోకానికి సహాయంచేయాలని కోరుతున్నావా? నీ సహాయంమీద ఆధారపడేటంత దౌర్భాగ్యం ప్రపంచానికి ఎందుకు పట్టాలి?

న్యూటను మహాశయుని విషయం చూడండి. అతడు ధ్యానంలో మగ్నుడైనాడు. ధ్యానమంటే వాంఛాతీతుడు కావడమే. అతని అహంకృతి అతని ముందున్న ఆశయంలో లీనమైంది. దానివల్ల ఏమి జరిగింది? అతడు మానవహితకారిగా ప్రకాశించాడు. "మానవ లోకానికి మేలు చేయాలి. లేక మానవలోకాన్ని అప్పులో పడవేసి దీనులను చేయాలి" అనే ఆశయంతో అతడు సమస్యాపరిష్కారం చేయలేదు. అతని కలాంటి ఆలోచనే లేదు. అతడు నిష్కామకర్మచేశాడు. అతని కర్మే అతని కానందం. నేను మేలు చేయాలి అని అనుకోకుండానే, అతడు మానవలోక హితంకరుడైనాడు!

నిన్ను మానవులు పొగడకపోతేనేం, కీర్తించకపోతేనేం? పరవాలేదు. ఈ ప్రపంచ సంబంధమైన విజయం కేవలం ఇంద్రియ విభ్రమమే సుమా! "సమస్త విశ్వమూ నా స్వరూపమే! నేను పరబ్రహ్మలో ఏకమై యున్నాను. నేనే విజయాన్ని!" — అని తదేక ధ్యానం చెయ్యి. నీకు విజయం లభించి తీరుతుంది.

అయితే, భౌతికదృష్టిని త్యజించాలా? తప్పక. నీవు పరబ్రహ్మవని మరువకు. బ్రహ్మానుభూతి పొందిన తత్క్షణమె, భౌతికత విసర్జించు, బ్రహ్మత్వాన్ని నిలుపుకో. రెండు రకాల మార్గాలు లేవు. ఒకే మార్గం ఉన్నది. నీ సత్యాత్మ పరమాత్మ. ఈ సమస్త దేహాదులను పరిపాలించే ప్రభువు. ఈ సూర్య చంద్ర నక్షత్రాదులు, ఈవృక్షములు మొదలైన వాటి శరీరాలన్నిటినీ పాలిస్తున్నది నీ ఆత్మే అని నీవు తెలుసుకోగలవు. ఈ భావానుభూతితో పైకి అధిగమించు. నీకొక ఉన్నతానుభూతి కలుగుతుంది. ఏమిటా అనుభూతి? రాముడు సంచారం చేసేటప్పుడు ఇలా భావిస్తాడు:— "ఆకాశంలో సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఆ సూర్యుడు ఈ మేఘాలనూ మంచునూ సృష్టిస్తున్నాడు. కొందరీ మేఘాలు మొదలైనవి భూమినుంచీ జలమునుంచీ

కలుగుతున్నవని తలుస్తారు. ఇది నిజముకాదు. జలమూ, మేఘాలూ, మంచూ ఇవన్నీ సూర్యునిలోనుంచి ఉద్గత మవుతున్నవి. వీటిని సూర్యుడే సృజిస్తున్నాడు. అయితే సూర్యుడు వాటివైపు తీక్ష్ణముగా చూపు సారించాడా యీ మేఘాలూ, మంచు తెరలూ అదృశ్యమైపోతవి." ఇది ఒకవిధమైన సాక్షాత్కారం. నీవు విశ్వపాలకాత్మవని అనుభూతి పొందినప్పుడు సూర్యునివలె నీవు అనాత్మకత అనే మంచును పారద్రోలుతున్నావు.

ప్రజలు, "నేను పరమేశ్వర ప్రతిబింబాన్ని." అని అంటుంటారు. "ప్రతిబింబాలు గాండి. మీకు నిరంతరం దుఃఖం తప్పదు."— అని రాముడు చెపుతున్నాడు. నీవు పరబ్రహ్మ ప్రతిబింబానివి కాదు. నీవు సాక్షాత్ పరబ్రహ్మవే.

నీళ్ళల్లో ప్రతిఫలించిన బింబాన్ని చూడండి. పైన ప్రకాశించే సూర్యుడు, నీటిలోని ప్రతిబింబదృష్ట్యా 'పాలకాత్మగా' పిలువబడుతున్నాడు.

ఈ ప్రాథమిక సాక్షాత్కారదశలో మానవుడు సూర్యునివలె ప్రత్యగాత్మానుభూతి పొందుతున్నాడు.

కండ్లు మూసుకున్నా, తెరుచుకున్నా రాముడు సర్వసాధారణంగా ఈ అనుభూతిలో ఉంటాడు:— "ఈ సూర్య చంద్ర నక్షత్రాదులను నేను పరిపాలిస్తున్నాను. నేనే వాటికి, జీవశక్తిప్రదానం చేస్తున్నాను. నే నీసమస్తబ్రహ్మాండానికి మూలాధారమైయున్నాను. ఇదొక స్థితి. ఈ విధమైన సాక్షాత్కారస్థితిని నీవు పొందినట్లయితే, సమస్త అసూయాక్రోధభయాలు నీకు దూరమై పోగలవు. నీ కే స్వార్థభయాందోళనలు ఉండవు.

శిశువు ఏదైనా పుస్తకం తీసుకుపోతాడనుకోండి. తల్లి ఆందోళనపడుతుందదా? పడదు. ఎందుకంటే, శిశువూ ఆమెవాడే. పుస్తకమూ ఆమెదే. ఇక ఆమె ఎందుకు ఆందోళనన పడుతుంది. ఎవరైనా నీదగ్గిరున్న వస్తువు దొంగిలిస్తారనుకో. అతడూ నీవూ ఒకటే

దొంగిలింపబడిన వస్తువు నీదీ అతనిదీ అయివున్నది. ఇక ఎందుకుభయం? విజయమూ లేక ఆనందము యాచనవల్ల, దైవమువల్ల నీవుపొందలేవు. ప్రజలు పిలిచే విజయం విజయం కాదు. నీ గమ్యం పరమ సత్యమై యున్నది. ఈ ఇతర ప్రపంచ సుఖాలూ, భోగభాగ్యాది వస్తుసంపద నిన్ను భ్రమపెట్టడానికి వచ్చినప్పుడు "ఓ సైతానా! వెనక్కు వెళ్ళు. నీ విచ్చేది నా కక్కరలేదు."– అని గర్జించు! అప్పుడు నీ వెంత బ్రహ్మానందసుఖ మనుభవిస్తావు! స్వర్గమే నీ వవుతావు. నీ జీవితం ఒక విజయయాత్రగా నీవు చేయగలవు.

ఆరోగ్యం పొందడానికి, రోగనివృత్తి చేసుకోడానికి భౌతికతను త్యజించాల్నా? అక్కర్లేదు. నీసత్యాత్మను దర్శించు. రెండవరకపు సాక్షాత్కారానుభవం పొందు. సూర్యుడు మంచుబిందువులను చూస్తాడు. మంచుబిందువులు తత్క్షణమే అదృశ్యమవుతున్నవి. ఇదే ద్వితీయ సాక్షాత్కారదశ. ఈ రకమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొందు. సహజాద్వైతస్థితికి నీ వధిగమిస్తావు.

ప్రాణాయామ మంటే ఏమిటి? ఈ సాధనకు ప్రజలు ఎక్కువ ప్రాధాన్య మిస్తుంటారు. కాని, రాముని ప్రబోధ మిది. నీ మనస్సు సత్యంలో మగ్నమైనప్పుడు ప్రాణాయామం దానంతట అదే వస్తుంది. ఆ దివ్యానుభూతిలో మనం లీనమైన తత్క్షణమందే మనం ఓంకారో చ్చారణ చేసేటప్పుడు అతి సక్రమ విధానంలో ప్రాణాయామం దానం తటదే జరుగుతుంది. తదేక సమయంలో వాయువు హృదయకోశాల్లో నిండుతుంది. గర్భకోశంలోగూడా ప్రవేశించి నిండిపోతుంది. ప్రధాన విషయమేమిటంటే, పరమ సత్యధ్యానము; సత్యానుభూతి. ఇది ఉంటే సర్వమూ సమకూరుతుంది.

ఈ దేశంలో చక్కనికళ్లు కావాలని, అందమైన ముక్కులు కావాలని, మనోహరమైన గడ్డాలు కావాలని కోరే ప్రజలున్నారు.

ఆధ్యాత్మికశక్తులు పొందికూడా మీ రింకా ఖండదృష్టిలో, భౌతికదృష్టిలో, దుఃఖమయస్థితిలో నున్నారని రాముడు చెబుతున్నాడు.

మానసికశక్తిని ధనార్జనకు ఉపయోగించడానికి ప్రజలు కోరుతున్నారు; మీరు ఖండదృష్టిచేత బాధామయులై కుమిలిపోతున్నారు.

ఈ విషయం గుర్తుంచుకోండి. మీరు వాంఛావస్తువులను, సౌందర్యమును, భోగభాగ్యాలనూ ఆరోగ్యసౌఖ్యాలనూ పొందాలని కోరుతారా, మీరు వైదాంతిక పరిత్యాగమును పూర్ణంగా కాకుండా కొంతభాగంగా మాత్రమే అనుష్ఠించాలి. ఇట్టి ఒక భాగసాధనచేత మీరు లాభంకూడా పూర్ణంగా కాక, ఒక భాగమే పొందుతున్నారు. సంపూర్ణంకాని అర్ధలాభంచేత విషయాలు చక్కబడవు. అయితే అలాంటప్పుడు ఆనందమూలస్రవంతినే ఎందుకు మీరు పొందకూడదు? ఇందువలన వాంఛితవస్తువేకాక సమస్తవస్తువులూ మీరు పొందవచ్చు కదా? ప్రత్యేకవాంఛిత వస్తువులచేత బంధితులు కాకండి. రాజమార్గం త్రొక్కండి. మోక్షపదవికి–ఆనందానికి–దగ్గరదారి–మీరు మోక్షస్వరూపులని, ఆనంద స్వరూపులని తత్‌క్షణం గ్రహించడమే.

సాక్షాత్కారం పొందడానికి రెండు మార్గాలున్నవి. విశ్వాసము–లేక జ్ఞానము. వేదాంతసారస్వత పఠనంచేత మీ సంశయాలన్నీ నివృత్తి చేసుకోవచ్చు. త్వరలో విస్పష్టమైన సమగ్రమైన ఈ వేదాంత దర్శన వివరణం రాముడు * మీ కీయబోతున్నాడు. వేదాంత సారస్వత పఠనంచేత మీరు సాక్షాత్కారం పొందలేకపోతే విశ్వాసంకలిగి యుండండి.

క్రైస్తవులు, సాక్షాత్కారానుభవ వేళమును పొందగానే క్రీస్తుయొక్క దృష్టి కలిగియుండరు. కాని, వారు విశ్వాసాన్ని కలిగియుంటారు. అందుచేత మీకు తగిన వ్యవధిఉంటే, తగిన శ్రద్ధఉంటే,

*అమెరికాలో శ్రీరామతీర్థస్వామివారిచ్చిన ఉపన్యాసప్రసంగ సముదాయం. శ్రీవారి వేదాంత దర్శన మనోజ్ఞ వివరణం. స్వామీజీ తాను పొందిన ఆత్మసాక్షాత్కారమనే సూత్రమునకు ఈ ప్రసంగాలన్నీ పూవులుగా గ్రుచ్చారు. సంపూర్ణంగా, ఈ ప్రసంగాలన్నీ పఠిస్తే, వీనిలో భాసిస్తున్న జ్ఞానతేజపు వెలుగులలో ప్రతిమానవుడు తన జీవనయాత్ర చేసుకోవడంలో సంశయంలేదు.

వేధాంత సారస్వతపఠనం చెయ్యండి. లేదా రామునిలో-భగవంతునిలో-మీ ఆత్మలో-విశ్వాసాన్ని కలిగి యుండండి. మీరు రక్షింపబడుతారు. మీ మోక్షపదవిని మీరు గ్రహించండి! ఇంకొకమార్గం లేదు.

ఓమ్! ఓమ్! ఓమ్!

# శ్రీ రామతీర్థ వేదాంతభాష్యము

## శ్రీ రామతీర్థ సంపూర్ణసారస్వతము



తృతీయ సంపుటము



శ్రీ రామతీర్థ సేవాశ్రమం

పిడుగురాల (పోస్టు) గుంటూరు జిల్లా - ఆంధ్ర

# ఆత్మానుభవము

అనువాదకులు :

శ్రీ కేశవ తీర్థ స్వామి

# శ్రీ రామతీర్థస్వామి



"జర్మనీ, ఇంగ్లాండు, అమెరికా, ఇండియా మొదలైన సమస్త దేశాలను — సమస్త ప్రపంచమును — సంచలింపజేసి, రాముడు విశ్వమునకు విముక్తిశ్రీని ప్రసాదించి తీరుతాడు. పాత ఆటలతో రామునకు విసుగెత్తింది. ఓ స్వప్నపాంథుడా! హిమాలయ సందేశం నీకు వినబడడం లేదా? ప్రభాతభేరీ వెలువడడం లేదా? స్వేచ్ఛ! స్వాతంత్ర్యం! విముక్తి!."

SRI RAMA TIRTHA SEVASHRAM, PIDUGURALLA (P. O.) GUNTUR DT., A. P.

## శ్రీ రామతీర్థ పరమహంస

## శ్రీ చంద్రికాప్రసాద్ జిజ్ఞాస్

పరమహంస స్వామి రామతీర్థుల జీవితము పరిపూర్ణమైనది. సరళతకన్న సుకోమలము, సజ్జనత్వముకన్న పరిమళము సాధుత్వము కన్న ధవళము, ప్రేమకన్న స్నిగ్ధము, భక్తికన్న మధురము, తపస్సు కన్న పవిత్రము, సత్యముకన్న ప్రఖరము, జ్ఞానముకన్న ప్రకాశవంతము, స్వ-స్వరూపానందభరితమునై వెలుగొందుచున్నది.

భక్తి, శ్రద్ధ, ప్రేమ, విశ్వాస, వివేక, సంయమకర్మనిష్ఠ, పరిశ్రమ, సహనశీలత, సాధుత్వ, సత్య-సంధత, విద్య, జ్ఞాన, కవిత్వ, త్యాగ, దేశభక్తి, పరోపకారాది గుణములకాలవాలము.

తాను సత్యమని తెలిసికొనినదానిని శ్రీ రామతీర్థస్వామి, విశ్వసించెను. ఆ మూసయందు తన జీవితమును కరగించి పోతపోసి ప్రపంచమునకు ఉత్తమ-ఆదర్శమును చూపించెను. ఆయన నిజమైన జిజ్ఞాసువు కావున వాస్తవిక జ్ఞానమును బడసెను. సత్యాన్వేషికాన చరమసత్యమును దర్శించెను. నిజమైన ఈశ్వరభక్తుడు గాన సాక్షాత్ బ్రహ్మమందు రమించెను. సత్యసాధువుగాన అల్పవయస్సునందే పరమహంస పదవి నధిష్ఠించెను. నిజమైనత్యాగిగాన కామనలజయించి పరమానందమును బడసెను. బ్రహ్మచర్య, పురుషార్థబలముల రాగ, ద్వేష, దంభ, కామ, క్రోధ లోభ, మోహ మద, మాత్సర్య, అహంకార మమకారాది బలవత్తర శత్రువులనెదుర్కొని ఆత్మ సామ్రాజ్యమున కధిపతి యయ్యెను.

ఆ గద్దె నధిష్ఠించినచాలును. అగ్ని. వరుణ, మరుత్, కుబేర సూర్య, చంద్ర, దిక్పాల, ఇంద్రాది దేవతాగణములు దాసులై ప్రభువు యొ దేశముల (అట్టి తత్వదర్శి యాజ్ఞల) కెదురుచూడ నారంభింతురు.

మాయ (ప్రకృతి) సమస్త భోగ భాగ్యముల కానుకగ గైకొని దాసివలె ఆయన ముందు నిలచి ఆ మహాపురుషుని దృష్టి ప్రసరించిన కృతార్థురాలనగుదు గదాయని యువ్విళ్ళూరుచుండును.

రామతీర్థుల జీవితము ప్రాపంచిక మానవులకు సుమధురప్రసాదము. రామునివంటి మహాపురుషులు చాల అరుదుగ ప్రపంచమున ఉద్భవించుచుందురు. అట్టి వారిని ప్రపంచము దీర్ఘకాలమునకుగాని గుర్తింపదు.

రామతీర్థస్వామి వర్తమానయుగపు మానవులలో గొప్పవిద్వాంసుడు, జ్ఞాని, మేధావి, తత్వ దర్శియనుట అత్యుక్తికానేరదు. ఉర్దూ, ఫారసీ, ఆంగ్లభాషలం దపార పాండిత్యముఁగలవాడు. యమ్. ఏ. ప్యాసయి కాలేజియందు ప్రొఫెసరుగ నుండియు వ్యాస, వసిష్ఠ, భరద్వాజ, యాజ్ఞవల్క్య నారద, జాబాలి, శుక్ర సనకాది ప్రాచీన బ్రహ్మజ్ఞానులవలె ప్రపంచమును త్యజించి వనవాసమున తపస్వియై బ్రహ్మ సాక్షాత్కారమునుబడసెను. ఎల్ల వేళల అధ్యయన, మనన, తత్వచింతనలయందుమగ్నుడై ఆత్మానందమున ఓలలాడెను. ఆయన పాశ్చాత్య భౌతిక, విజ్ఞాన, పాశ్చాత్య తాత్త్విక సిద్ధాంతముల క్షుణ్ణముగ పరిశీలించి వేదాంత తత్త్వమును గంభీరముగ విచారించెను. భారతీయ బ్రహ్మ విద్యను చక్కగా గ్రహించి వ్యావహారిక వేదాంతమును గురించి మహోపదేశములొసంగెను. దేశ దేశాంతరముల వేదాంత భేరి మ్రోగించెను. హిందూ వేదాంతములోకలసిన కల్మషమును క్షాళన మొనరించెను. జడత్వమును, సంకీర్ణతను, మూర్ఖత్వముల నిర్మూలించెను. శుష్కోపన్యాసము లొసంగక చెప్పినట్లు చేసి చూపించెను.

గీతలందు వర్ణింపబడిన స్థితప్రజ్ఞుని సజీవమూర్తియై వెలుగొందెను. స్వల్పకాలిక వయస్సునందే బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమముల శాస్త్రవిధి ననుసరించి జీవితముగడపెను.

ఆయన జీవితము ఆదర్శజీవితము! ఆయన పవిత్ర చరిత్ర సాధకులకు, జిజ్ఞాసులకు వెలుగుబాట!

ఓమ్

# శ్రీరామతీర్థ వేదాంత భాష్యము

## శ్రీరామతీర్థ సంపూర్ణ సారస్వతము

## నిత్యజీవన నియతి

[ఈ క్రింది సందేశం శ్రీ రామతీర్థస్వామివారు, స్వయంగా నారాయణ స్వామివారికి వ్రాసిన కొన్ని లేఖల సమీకరణమై యున్నది. రామతీర్థులవారే ఆ లేఖలను సమీకరించి విపులీకరించారు.]

ప్రియులైనవారెల్ల వీడిపోయెదరు;
శత్రువుల్ సైతము సమసిపోయెదరు;
బాంధవుల్ తనువులు బాయుట నిజము;
సర్వబంధముల విసర్జింపవోయి!
ఒకనాడు హితమగు విధానంబులెల్ల
నేడెంత చిత్రంబుగా మారిపోయె!
చెట్లు చేమలుకూడ క్షీణంబు నొందు;
హాయిగా నాడు విహంగంబులెల్ల
ఏ జంతువులకో యాహారమై పోవు.
ప్రసవగుచ్ఛంబులు వాడి నశించు
వెలుగు నీడగ మారి మలిగిపోయెడిని;
మన మోహములు చంచలంబులై విరుగు;
దేహసౌందర్యాదు లన్నియు చెడును;
కీర్తిప్రతిష్ఠలు ఖిలములు ఖిలము;
లీ శోభలెల్లను జలబుద్బుదములె;
క్షణిక మీదృశ్యజగత్తెల్ల కనిన.
మధురవస్తువులెల్ల మాయలు సుమ్మి
నిన్ను ఆకర్షించి మోసంబు చేయు;
అవి నిన్ను చల్లగా ఓడించి గెలుచు.

2

దేనినైనను సరే మంచి దటంచు
మనము సుఖంబుకై వాంఛ చేసెదము;
ఎప్పుడు మనకు విశ్వాసంబు ముదురు,
కటకటా! మన కాలిచప్పుడు వినును
వెంటనే అది చిక్కకుండగా బోవు;
ఏ క్షణంబున రాగ ముదయించు మనకు
అప్పుడే వస్తువుల్ చిక్కక చనును,
మనము శోకాబ్ధిలో మునిగిపోయెదము.

3

అయినచో ఇదియెల్ల చివరకు కలయ ?
అతడును, నేనును, నీవు నైతెంబు
ఏదియు సత్యము కాద చూడగను ?
పుత్రమిత్రాదులు రక్తబాంధవులు–
ఇవియెల్ల మిథ్యయా ఏమి చిత్రంబు ?
అయినచో నింకెల్లు ? నాకేది దిక్కు ?
ఈ తప్తహృదయంబు కింకేది దారి ?
ఓ నిష్కలప్రేమ ! ఓ బాంధవహిత !
ఓ అమాయిక పావురంబ ! కన్గొనుమ !

4

ఈ చంచలంబగు దృశ్యజగాన
మారక వెలుగొందుచున్నది ఒకటి !
మృత్యురూపంబున, బాధలయందు
ఆ పరమాత్మ వస్త్రంబులే మార్చు.
మరల వచ్చుచునుండు, తామార్పులేక.
ఆ పరమాత్మను ప్రేమింపవోయి !
వస్త్రాల ప్రేమింపవలదోయి వలదు !
ఆ పరబ్రహ్మను ప్రేమింపవోయి !
దృశ్యవస్తువులపై మోహంబు వలదు;

ఆతడు మాసిన వస్త్రాల మార్చు;
పాత భూషణముల పారగావైచు;
క్రొత్తవేషంబుల ధరియించి వెలుగు;
ఆత డనుక్షణంబును పెండ్లి కొడుకె!
తన యిష్టమైనట్టి వేషముల్ వేయు
ఇవి పారవైచును, అవ్వి ధరించు,
అవి పారవైచును ఇవి దాల్చుచుండు
ఎన్ని మారినగాని పరమాత్మ యొకడె!
ఎంత మాధుర్య మీలేమి, నష్టంబు!
తన వేషములు తానె వలుచు నాతండు,
ఇది తన రూపనిరూపణం బహాహా!
అతని దిగంబరశోభ చూచుటకు
ఎంత మాధుర్యాతిమధురతరంబు!
అంతకన్నను వేయిరెట్లు మనోజ్ఞ
మాతని నవ్యముఖారవిందంబు!
ఆకాశవాయునదీపుష్పములను
వలలచొక్కాల నాతడు వేయుచుండు.
దాగుము నీ యిష్టమైనట్టి రీతి,
నీ స్వరూపంబును గ్రహియింతు నేను.
ముసుగులు ని న్నందు దాచగా లేవు-
మరి నిన్ను ప్రకటించుచున్న వేగాని.
రూపముల్ ఒకదాని వెంట నింకొకటి
కూర్పగాబడు టెందులకొ నాకు తెలుసు ;
ఈ బహులాచ్ఛాదనములకు క్రింద
ఆ ఏకమూర్తిని కనుగొందు మనియె!

**5**

ఓహో! చిత్రము! ఎట్టి యద్భుతమాల!
ఈ జగం బొకఘాస అది రాలిపోవు.
వచ్చు నింకొక్కటి అది పోవునేని

వచ్చు నింకొక్కటి; వచ్చు నింకొకటి;
కాని పూసలలోని దారము పోదు !
ఆ దివ్యసూత్రము నేనేను, నేనె !
ఆ మహాకాంచనసూత్రంబు నేనె !
రూపముల్ పోనిమ్ము నశియింపనిమ్ము.

6

ఈ చంచలములగు రూపంబులెల్ల
ఉదయకాలాకాశవివిధవర్ణములు !
పుట్టును గిట్టును పుట్టును గిట్టు
మాయావి పలుకుల మాదిరిగాను !
అవికల్పు డాద్యేకమూర్తియైనట్టి
ఆ మహాశాశ్వతిసూర్యుడు కనెడి
వట్టి స్వప్నమె సుమా ఈ దృశ్యమెల్ల.

7

శత్రులమీదను మిత్రులమీద
ఆధారపడను నే నాధారపడను.
ఈ లీలలను చూచి నే భ్రాంతిపడను.
ఈ జగద్భోగంబు లేను వాంఛింప.
ఈ శరీరారోగ్య మేను దలంప-
నా కేమి ? నా కేమి ? నా కేమి కొదువ ?
నా ప్రేమయును నేను కలసియుండెదము !
దృశ్యవస్తువులపై ఆధారపడను
ఈ స్వరూపములను వేషజాలములు
పచ్చిసుబొమ్మలవంటివి కనగ !
వానికై నేను చలింపగాబోను,
సాక్షినై కనుగొందు సర్వంబు నేను !
నా ప్రేమ సర్వంబునందున నిండె.
పరమాత్మనే నేను విశ్వసించెదను,
పరమేశ్వరుని నేను ప్రేమింతు నెపుడు.

ఈ మహాబహుళస్వరూపంబులందు
ఏకమై వెలుగొందు పరమసత్యంబు !
వానినే నేను గొంతెత్తి ఘోషింతు !
నిజముగా నా ప్రియమిత్రు డాతండె !
నా గురుదేవుడు, నా శిష్యు డతడె !
నా తండ్రి, నా కుమారుడు, నాదు భార్య
నా భర్త, నా ఆత్మ, నా జీవితంబు
నా యేకహక్కును, నా పరంజ్యోతి
నా గాలివానయు, నా శాంతిమయత,
సంబును, నా రాముడతడె !

రామున కప్రత్యేకసంకల్పం లేదు. సర్వకర్త పరమాత్మయే. బుద్ధుడు-మొదలైనవాండ్ల ఉదాహరణలతో మనకేం పని? ధర్మదేవత యొక్క ముఖతఃవచ్చిన ఆదేశాలనే మన మనస్సులు గౌరవిస్తాయి గాక! బుద్ధుడూ, క్రీస్తుకూడా స్నేహితులచేత శిష్యులచేత పరిత్యజింపబడ్డారు. బుద్ధుకు ఏడుసంవత్సరాల తన అరణ్యజీవితంలో చివరి రెండు సంవత్సరాలు పూర్తిగా ఏకాంతంలో గడిపాడు. అప్పుడే, జ్ఞానప్రకాశోదయ మయింది. తర్వాత శిష్యసమూహాలు క్రమ్ముకోసాగాయి. ఆయనా స్వాగతమిచ్చాడు. వాండ్లు గొప్పవాండ్లని, వీండ్లుగొప్పవాండ్లని వారివారి భావాలకు వ్యామోహితులు కాకండి. వాండ్లు గౌరవనీయులేకావచ్చు. ఉపదేశాలు బాగానే ఉండవచ్చు. వాండ్లభావాలే కనుక ధర్మబద్ధములై యున్నట్లయితే, ఇప్పటికల్లా వారిచేత కోటానుకోట్ల బుద్ధుల్లు సృష్టింపబడియుండేవాళ్ళు.

తుమ్మెద, తేనెలో ఇరుక్కున్న తనకాళ్లను నెమ్మదిగా పట్టుదలతో విదల్చి వదల్చుకొన్నమాదిరి, మనం బాహిరరూపాలమీది వ్యక్తిత్వాలమీది మోహబంధాలను విదిల్చి వదల్చుకోవాలె. సర్వసంగపరిత్యాగం చెయ్యాలె. మృత్యురూపిణియైన అంతిమత్యాగం, అనభిమతత్యాగములను నిశ్శేషంగాచేసి తీరేటంతవరకు, ఒకదాని తర్వాత ఒకటి సర్వబంధాలను త్రెంచివెయ్యాలి.

ధర్మచక్రము దయావిరహితమై పరిభ్రమిస్తున్నది. ధర్మమునకు ఎవడు లోబడతాడో, అతడే ధర్మాన్ని పరిపాలిస్తాడు. ఎవడు భగవదిచ్ఛకు (ధర్మానికి) వ్యతిరేకిస్తాడో, అతడు ధర్మచక్రప్రళయపాదం క్రింద చిత్రవధపొందుతాడు. వాడు ఘోరహింస అనుభవించితీర వలసిందే.

ధర్మం, త్రిశూలం (శిలువ)! అది తుచ్ఛమైన అహంకారాన్ని పొడిచివేస్తుంది. ఇచ్ఛాపూర్వకమైన పరిత్యాగవేదన, ఎవరు అనుభవిస్తారో, వారికి ప్రపంచం స్వర్గమవుతుంది. ఇతర్లందరికీ నరకమవుతుంది. ధర్మం ఒక మహాగ్ని! ఆ మహాగ్ని ప్రాపంచిక మోహాబంధారణ్యాలను భస్మీపటలం చేస్తుంది. ఆ మహాగ్ని అజ్ఞానచిత్తమును మలమల మాడ్చివేస్తుంది. ఆ ధర్మానలజ్వాల, ఆధ్యాత్మిక ఆరోగ్యానికి భంగముకలిగించే విషయవాసనలనే ప్లేగుక్రిములను నాశనంచేసి, మానవుణ్ణి పునీతంచేస్తుంది.

ధర్మం విశ్వాత్మకమైంది. బ్రదకడానికి ఆహారం ఎంతఅవశ్యకమైందో, ధర్మం జీవితానికి అంతప్రాణప్రదమైంది. నాస్తికుడు, తనగర్భకోశంలోజరిగే అన్నజీర్ణకర్మనుగురించి తెలియని మనిషివంటివాడు. ధర్మం మనలనుపొడిచి ఆధ్యాత్మికపథగాములనుచేస్తుంది. ధర్మము, మనలను కొరడాతో జబిరి నిద్రలేపుతుంది. ధర్మం అనుల్లంఘనీయమైంది. ధర్మముఒక్కటే సత్యమైంది. తక్కినదంతామిథ్య. మహాధర్మసాగరంలో సమస్తరూపాలు, సమస్తవ్యక్తిత్వాలుగా బుడగలు మాత్రమే. పరమసత్యము సుస్థిరమైందని రుజువుచేయబడింది. ఈ త్రిశూల (శిలువ) ధర్మమువలె, అప్రతిహతమై ఏ ప్రాపంచికరూపాలూ, ఏ బాంధవ్యాలూ, ఏ శరీరాలూ, ఏ సంఘనిర్మాణాలూ, ఏ సంస్థలూ ఎప్పటికీ సుస్థిరంగా నిలువలేవు.

విభ్రాంతులైన, దూరదృష్టిరహితులైన అల్పజీవులు, పరమార్థమైన ధర్మానికంటె, దృశ్యవస్తువులను (వ్యక్తిత్వాలను) ఎక్కువ ప్రేమించడం దేనికి? దేనికంటే – అజ్ఞానంచేత వ్యక్తులూ, బాహ్య

రూపాలూ సుస్థిర సత్యాలుగా కనబడుతవి. పరమధర్మమేమో తరళ మేఘంగా కనపడుతుంది.

త్రిశూలం (శిలువ) లేక శివుడుమాత్రమే పరమసత్యం. ఇతరము లైన వ్యక్తిత్వాలు, మోహవస్తువులన్నీ చంచల మాయారూపాలు, పట్టి నీడలు, విచిత్రభూతాలుమాత్రమే అని బోధిస్తున్న కర్కశు రాలైన ప్రకృతిమాత పాఠం మానవులు గ్రహించగలిగితే పిడిగుద్దులూ మొట్టికాయలు తినడం తప్పుతుంది. ఈ సుఖదుఃఖ దృశ్యపదార్థాలు, ఈ సౌందర్యాలు ఈ కురూపాలు, ఆ లీలావినోదమూర్తి వేసుకొనే వేషాలుమాత్రమే. ఆయన ప్రభావమన్నా చూడడానికి, మనకండ్లు తెరవాలనే ఈ వినోద మంతా.

శత్రురూపాల్లోగానీ, మిత్రరూపాల్లోగానీ మనం నిజమని నమ్మామా, అవి మనలను మోసంచేసి ద్రోహంచేస్తాయి. అప్పుడు వాటిమీద కసిదీర్చుకోవాలె; అవి చాల చెడ్డవి–అని నిందించడంచేత, మనం పరిస్థితులనింకా విషమంగా మారుస్తున్నాము. అసలు మొదటి తప్పు–భగవంతునియందుమాత్రమే ఉంచదగిన సత్యవిశ్వాసాన్ని, యీ దృశ్యరూపాలమీద ఉంచి వాటిని ప్రేమించడమే. రెండో దిప్పుడు– వాటిమీద అసూయపెంచుకొని ఆ రూపాలకు సత్యత్వాన్ని మరింత ఆరోపించి మరింత తీవ్రబాధను పరిస్తున్నాము. జాగ్రత! ఈ సర్వసంగ పరిత్యాగమనే శివుడే జీవితంలో మనం పొందదగిన ఆదర్శశిఖరం! ఇది సజీవసత్యం ! ఇది రాయికంటె స్థిరమైనది! ఈ సత్యాన్ని మనం శిలా లింగంగా ప్రతిపాదించవచ్చు. అజ్ఞానబుద్ధిని సరిగా మార్చడానికి ఈ సత్యం రాయికంటె కఠినంగా తగులుతుంది. దీన్ని నిరంతరం జ్ఞాపకంలో ఉంచుకోవడం అత్యవసరం.

మహమ్మదీయులు, క్రైస్తవులు, ధర్మాన్ని–దేవుని–అసహనుడు (Ghayyur) భయంకరుడు (Gahhar) అని పేర్కొన్నారు. ఇందులో తప్పేమీ లేదు. నిజంగా, పరమసత్యం మానవులను గౌరవించేదికాదు. ఎవరైనాసరే ప్రాపంచిక వస్తువులపై హృదయాన్ని కేంద్రీకరిస్తే ప్రకృతికోపానికి ఆహుతికావలసిందే. అయితే ప్రజలు, ఈ సత్యాన్ని

త్వరగా గ్రహించలేకపోవటానికి కారణం సరియైన సమీక్షణ లేక పోవడమే. సాధారణంగా మానవులు అహంకారబద్ధులై ప్రకృతిగమనాన్ని అవలోకించరు. తమ స్వయంకృతాపరాధాలకు, ఇతరులను నిందించటానికి వెనుకాడరు. నిష్పాక్షిక సాక్షిలాగా తమ తమ మనఃప్రవృత్తులను, తత్ఫలితాలను కొంచెం వెనకకు తిరిగి సింహావలోకనం చేసుకోరు.

బాహ్యరూపాలను మనం నమ్మినామా, ఏక సత్యానికిమాత్రమే అర్హమైనగౌరవాన్ని ఈ మిథ్యావస్తువులపైన, వ్యక్తిత్వాలపైన, అంతరాంతరాల్లో పెట్టుకొన్నామా, భగవంతుడు పరివేష్టించడానికి తగిన మన హృదయ సింహాసనంపైన వ్యక్తిత్వవిగ్రహాలను పెట్టుకొన్నామా, మనం మోసపోకతప్పదు. బాహ్యరూపసంబంధమైన మిత్రత్వశత్రుత్వదృష్టి తప్పక అనాత్మత్వముయొక్క మిథ్యాత్వమును ప్రతిపాదిస్తుంది.

ఎన్నిసార్లు మనం నిజమైన బుద్ధిమంతులను వాండ్ల వాగ్దానాల మీద హృదయం నిలిపి, భగవంతునికంటే వాండ్లమీదనే ఎక్కువ నమ్మకముంచి, అన్నమాటలుతప్పిన అబద్ధీకుల చెయ్యలేదు ? ఎన్నిసార్లు మనం ధర్మరహితమైన శరీరప్రేమచేత మన పిల్లల పతనానికి, నాశనానికి దారితియ్యలేదు? ఎన్నిసార్లు మనం భగవంతునికి మాత్రమే, ఆ అసహన ధర్మానికిమాత్రమే వినియోగింపదగిన, హృదయ విశ్వాశాన్ని, ఆకారాలమీదా వ్యక్తిత్వాలమీదా వినియోగించి స్నేహితులను విశ్వాసద్రోహులుగా మార్చలేదు ? ఎన్నిసార్లు మనం, ఉత్తమ గురువులము,— వారు మనలనూ, మనల్ని వారూ నమ్మేటట్లు చేసి ఆధ్యాత్మిక శిఖరాలనుంచి క్రిందికి లాగలేదు ? ధర్మనియతిచేత, *కోడికూసేలోపల మూడుసార్లు కుమించి గురువులను మరచేలాగు మారలేదా మనం ? ఎన్నిసార్లు, భార్యలమీద మన హృదయార్పణం. కుటుంబ కలహాలకు, చెప్పరాని భయంకరవిషయాలకు కారణం కాలేదు ? భగవంతునికంటే దేనినైనా నీవు ఎక్కువగా ప్రేమించు — 'దివ్యప్రేమ' నిన్ను త్రిశూలంతో పొడిచి తీరుతుంది.

* సెయింటు లూకానువార్త, 22 అ. చూడండి.

నీచప్రేమలమాట అలా ఉంచండి. గోపికల ప్రేమను తీసుకుందాము. భగవంతుని అవతారసంబంధమైన మోహనరూపంమీద వాండ్లు హృదయాలు నిలిపారు. తమ పొరపాటుకు గోపికలు ఎంత విలపించారు! కన్నీళ్ళకు బదులు రక్తమే వర్షించారు. ఆ మహామధుర ప్రేమావతారిణియైన సీతామహాదేవి భగవంతుడైన శ్రీరామచంద్రుని మనోజ్ఞ స్వరూప సత్యత్వంలో విశ్వసించింది. ఆమెకూడ- ఓహో ఆమెకూడ- పొరపాటుకు ఫలితంగా (నిరాకారుడైన) సత్యారాముని చేత- తన ప్రభువుచేత- సర్వజగత్ప్రభువుచేత- కారడవులకు నెడలగొట్టబడింది.

బ్రహ్మ తం పరా దాద్యోఽన్య త్రాత్మనో బ్రహ్మవేద ।
క్షత్రంతం పరా దాద్యోఽన్య త్రాత్మనో క్షత్రం వేద ।
లోకా స్తం పరా దుర్యోఽన్య త్రాత్మనో లోకాన్వేద ।
దేవా స్తం పరా దుర్యోఽన్య త్రాత్మనో దేవాన్వేద ।
భూతాని తం పరా దుర్యోఽన్య త్రాత్మనో భూతానివేద ।
సర్వం తం పరాదాద్యోఽన్య త్రాత్మన సర్వం వేద ।
ఇదం బ్రహ్మ, ఇదంక్షత్రం, ఇమేలోకా, ఇమే దేవా ।
ఇమాని భూతాని ఇదం సర్వం యదయ మాత్మా॥

(బృహదారణ్యకోపనిషత్)

అనువాదం:

పరమాత్మలో బ్రాహ్మణుని చూడనివాణ్ణి, బ్రాహ్మణుడువిడిచి వేస్తాడు. పరమాత్మకు భిన్నంగా క్షత్రియుణ్ణి చూచినవాణ్ణి, క్షత్రియుడు పరిత్యజిస్తాడు. ఆత్మకంటె వేరుగా లోకాలను (ప్రజలను) చూచినవాణ్ణి ప్రజలు (లోకాలు) వెళ్ళగొట్టితీరుతారు. దేవతలను ఆత్మకంటె భిన్నంగా చూచినవాణ్ణి దేవతలు బహిష్కరిస్తారు. ఆత్మలో కాక వేరుగా వస్తువులను చూచినవాణ్ణి వస్తువులు విడిచితీరుతవి. ఏ వస్తువునైనా సరే సర్వవస్తువులను, పరమాత్మగా గ్రహించకపోతే సర్వవస్తువులూ వాణ్ణి వదలితీరుతవి. బ్రాహ్మణుడు ఆ పరమాత్మే. ఆ ఆత్మే క్షత్రియుడు. ఆ ఆత్మే సమస్తమానవులు. ఆ ఆత్మే సమస్త

దేవతలు. ఆ ఆత్మే సమస్తవస్తువులు. సర్వమూ, ఆ పరమాత్మ స్వరూపమే.

—వేదం

ఆకర్షించే యీ దృశ్యవస్తువులన్నీ శ్రీకృష్ణుని బాలరూపం లాంటివి. వాటినిచూచి మనస్సర్పం గ్రసిస్తుంది. అవి లోపలికిపోయి మింగుడుపడవు. ఆ సర్పగర్భాన్ని చీల్చివేస్తవి. "అయ్యయ్యో! నా గుండె పగిలిపోతున్నది! నేను చచ్చాను! చచ్చాను!" అని ప్రజలప్పుడు మొత్తుకుంటారు. ఎందుకు పేర్లకూ, రూపాలకూ భ్రమించి మోసపోతారు? పరమసత్యాన్నిమాత్రమే ప్రేమించండి, భగవంతుణ్ణి మాత్రమె ఆశ్రయించండి. భగవంతుణ్ణిమాత్రమే ఆరాధించండి. భగవంతునిలో ఐక్యంకాండి! భగవంతునితో స్నేహించండి! భగవద్రూపులుగాండి! బ్రహ్మస్వరూపులై జీవించండి! ఇదే జీవితమంటే. ప్రాపంచికవస్తువులను పరిత్యాగంచేసినప్పుడే మీరు అనంత విశ్వాసప్రేమలను భగవంతునిలో చూడగలుగుతారు.

ప్రియులారా! భగవంతుడొక్కడే సత్యం! తక్కినదంతామిథ్య. "లాయిల్లా–ఇల్లి–ల్లాహ్."

మహమ్మదు అపార్థవశుడై, తరచు అపమార్గంతొక్కినమాట నిజమే. "భగవంతుడుతప్ప వేరే సత్యంలేదు," అన్న ఏకైక పరమసత్యంలో అనుభవవిశ్వాసం లేక అడుగడుక్కూ తూయిస్తూ నిమిష నిమిషం మరణిస్తున్నవాళ్ళ, అంతులేని చిత్రహింసలు, ఒకేసారి (ఖడ్గంతో) తక్షణం తుదముట్టించడంలో వేగిరపడినా, ఈ భావానికి సత్యాన్ని గ్రహించగల ఎవరైనాసరే జోహారుచేయకతప్పదు. క్రీస్తు అనుభవపూర్వకంగా దీన్ని చెప్పాడు. బుద్ధుడిదే బోధించాడు. సర్వసాధారణంగా, మన ఆర్యమహర్షులందరూ, కొందరు కొంచెం రూపాలు మార్చినా, ఈ సత్యాన్నే ప్రబోధించారు. శ్రోతలు వారివారి ఏకాంత తీవ్రసాధనాశోధనలతో హృదయానుభూతి పొందకపోతే, కాలగమనంలో తిరిగి నిజమైన జ్ఞానపిపాసగల ముముక్షువులు, అన్నియుగాల్లో మననంచేసి, సాక్షాత్కారానుభవంపొందకపోతే, ఈ ఋషిప్రబోధ మహోపదేశాలు నిలిచి ఉండేవికావు.

పరిత్యాగ మహాధర్మమే సుస్థిరసత్యం. ఇది ఉఫ్ అంటే పోయే వగడాకుకాదు! ప్రవక్తలయొక్క, నాయకులయొక్క కేవల ఊహాభ్రమల్లో జాతులన్నీ వంచితమై కొట్టుకపోవు. వట్టి వెర్రిఊహాలతో, శతాబ్దాలు శతాబ్దాలు పరుగెత్తలేవు.

మానవులు ధర్మశ్రుతిలోనుంచి తప్పిపోవడంచేత కలిగిన తమ దుఃఖకారణం తెలుసుకోకుండా, తమకు దుఃఖదములుగా కనబడే బాహ్యపరిస్థితులమీద నిందలు మోప మొదలుబెడుతారు. మనుష్యులనుగురించిన చెడువిషయంగానీ, మంచివిషయంగానీ స్వప్నచ్ఛాయగా ఎంచి మనస్సులోనుంచి తుడిచివెయ్యాలి. కలలు పీడకలలు కావచ్చు. మంచి కలలు కావచ్చు. వాటిని మనం లక్ష్యం చెయ్యం. మనదగ్గరికి మంచి వాండ్లు రానీ, చెడువాండ్లు రానీ, వాండ్లను మనం పూర్ణంగా మరచిపోవాలి. మన ఆధ్యాత్మికస్థితి అభివృద్ధి పరచుకోవాలి. నీకూ భగవంతుడికీ మధ్య ఈ దృశ్యమానములైన దురదృష్టాలను, అదృష్టాలను నిలవనివ్వబోకు. నా క్షమాబుద్ధిని తృప్తిపరచడానికి తగినన్ని దోషాపనిందలు నాకు కనబడ్డంలేదు.

భగవంతునికంటే దేనికీ ఎక్కువ విలువ ఇవ్వబోకు. భగవంతునితో సమానంగా దేనికీ ఆధిక్యమీయవద్దు. ఈగౌరవాలు విమర్శలు, రోగాలు. వీటిని ఆత్మవత్ గౌరవించామా మనలను నాశనంచేస్తాయి. నీవు పరబ్రహ్మ వని తెలుసుకో! దివ్యత్వంతో బ్రహ్మానంద గీతాలాలాపించు. రామునివలె యీ గౌరవా గౌరవ విమర్శలను తృణీకరించు. భగవదాస్థాన సింహాసనముపైన ఉన్న రాముడు దేహవాసనా వ్యాధులనే సేవకులను చూచి, "ఇక్కడనుంచి తక్షణం, వెళ్ళండి" అని సర్వాధికార బలంతో ఆజ్ఞాపిస్తున్నాడు! నేను సభామండప సింహాసనం పైన ఉన్నప్పుడు, ఈ సేవకులు నా ఆజ్ఞలు శిరసావహిస్తారు. సింహాసనము దిగి దేహదృష్టి అనే పూరిగుడిసెలో కూర్చున్నప్పుడు నన్ను ఈ సేవకులు కొరడాలతో జబురుతారు.

త్రిశూల దైవధర్మానికి దాసోహ మనని భౌతికరాజ్య ప్రభుత్వాలు సైతం వాటిగోతిని అవి త్రవ్వుకుంటవి. పైలాకులాగా, వ్యక్తి

గత స్వామ్యాలమీద గాఢాభిమానం పెంచుకొని "ఇది నాది. అది నాది" అని భావిస్తూ, స్వార్థపలయూ లల్లుకుంటూ, "రాజ ధర్మం ఇలా ఉన్నది" అని సాకులు చెప్పడం సత్యధర్మాన్ని అగౌరవించడమై యున్నది. ఎందుకంటే మనకున్న ఏకైకహక్కు, 'హక్కు' (పారశీక భాషలో భగవంతుడని అర్థం) మాత్రమే! తక్కిన హక్కులన్నీ తప్పుడు హక్కులే. ఇతర్లు ఎవరూ ఈ సూత్రాన్ని గ్రహించరా, సన్న్యాసి అనవాడు ఎలాగైనా జీవితములో ఈ ధర్మాన్ని ఆచరించి చూపవలసి ఉన్నది.

ధర్మము సర్వవ్యాప్తమయింది. అది సమస్త జగదంతరాత్మ. రాముడా జగదంతరాత్మయే. ధర్మం అహంకారాన్ని తన్ని సంహారము చేస్తుంది. ఆ పరమధర్మం మహోఉగ్రమైంది. అయితే ఆ ధర్మ క్రోధము ప్రేమయొక్క సారమే! ఎందుకంటే, ఈ అహంకార మరణముతో, సత్యాత్మోదయ మవుతుంది. శాశ్వత జీవితము, అమరత్వము ప్రారంభ మవుతుంది. అహంకృతి లోపల దాచుకొని పరమాత్మ రాజ్యాధికారాన్ని ఆశించిన వాడిని, గర్వపర్వత శిఖరముపైన దురాశావాసలనే గ్రద్దలుపొడిచి చీల్చిచెండాడుతాయి. వైదాంతికమైన స్వాతంత్రమంటే అహంకృతికోసం, శరీర వ్యక్తిత్వాలకోసం, ధర్మాన్ని విడవడముకాదు. ఈ అపార్థస్వాతంత్ర్యం God అనే పదాన్ని Dog అని తల్లక్రిందులుగా మార్చడమే. ఈ పొరపాటుచేతనే, ధర్మాదేశాన్ని తలక్రిందులుచేసిన అజ్ఞానముచేతనే, వేనకువేల మేధస్సులు నిరాశా తమస్సుల్లో మునిగిపోతున్నవి. లక్షలాది హృదయాలు అనుక్షణం వ్రయ్యలై పోతున్నవి. ధర్మస్వరూపులం గావడమే ధర్మబంధాలనుంచి విముక్తి పొందడం. ఇదే 'శివోహం' అన్న పరమ సత్యాన్ని సందర్శించడం.

ఇంద్రియవికారాలను ఆధారం చేసుకొని, రూపాలు వ్యక్తిత్వాలనే పునాదులు వేయడం, సముద్రపునురుగుమీద సౌధం గట్టడమే.

భగవంతు డొక్కడే పరమసత్యంబు,

జగమెల్ల మిథ్య, సత్యంబు గా దెపుడు!

ధర్మమే, సుస్థిరమౌ జీవశక్తి !-

అని హృదయాంతరాళంలో గ్రహించినవాడు తన సౌధమును సుస్థిరమైన కొండమీాద కట్టినవాడు.

ఈ దేహాన్ని స్వతంత్రంగా తిట్టండి. మోసగాడనండి. స్వార్థమయుమనండి. గర్వి అనండి. తృణీకరించండి. తన్నండి. చంపండి. దాని వల్ల నేను చలించను నేను సర్వవ్యాపకమైన పరమాత్మను! నా కేం?

అనివార్యమగు మహాసత్యంబు నేను,

కఠినకర్కశమైన ధర్మంబు నేను,

న న్నెరుంగుట యగు నాకు లోబడుట,

నాకు లోబడుటయే విజయంబు గనుట,

న న్నాదరించుము, బాధ నే పడను,

కాని నన్ను తిరస్కరించినవాని

చల్లగా మడియించి మట్టుబెట్టెదను.

ఈ ధర్మస్వరూపుడైన భగవంతుని త్రిశూలాఘాతం సామాన్యం కాదు. అది ప్రచండమైంది.

సత్యస్వరూపుడైన, ధర్మస్వరూపుడైన భగవంతుని యందు మనం, కనీసం బాహ్యవ్యక్తిత్వాలమీాద ఉంచే గౌరవాన్నైనా ఉంచుతాము గాక. మన అచంచలమైన, నిర్మలమైన పరమధర్మ భక్తిచేత ఇతరప్రజల గుండెలు పగిలితే పగలవచ్చు. దానితో మన కేమీా సంబంధంలేదు. ఏవి భంగమైనాసరే మనం అత్యంతశ్రద్ధతో చూడవలసింది ధర్మభంగం కాకుండా చూడ్డమే. ప్రియులని, దగ్గరవాండ్లని మనం పిలుచుకొనే వారి విపరీతభావాలకు లోబడి, ధర్మానికి వ్యతిరేకించామా వాండ్ల నెత్తిమీాదికీ, మన నెత్తిమీాదికీ విపత్తును చేతులారా తెచ్చుకున్నట్లే. భగవంతునికంటె బంధు వెవడు? భగవంతునికంటె ప్రియు డెవడు? ఆ పరమసత్యానికంటె సన్నిహితు డెవడు?

వయంగ్ం సోమవ్రతే తవ మన స్తనూషు బిభ్రతః

— యజుర్వేదం

అనువాదం:

నీకొరకే, నీకొరకే, ఓ ప్రభూ! ఓ ధర్మమా! నేను దేహంలో మనస్సును ఉంచుకున్నాను.

వేదకాలంలో, కొన్ని కొన్ని సందర్భాల్లో, కన్యలు అగ్ని చుట్టూ చేరి, నమస్కరించి, అగ్నిప్రదక్షిణంచేస్తూ ఈ పాటపాడేవారు:

త్ర్యంబకం యజామహే సుగంధిం పతివేదనమ్

ఉర్వారుక మివ బంధనా దితో ముక్షీయ మాముతః

అనువాదం:

ఆ సుగంధమును విరజిమ్మే వానిపూజలో-ఆ సర్వసాక్షియైన వానిపూజలో-ఆ పతిని తెలిసిన వానిపూజలో, మనం కలిసిపోదాం. పరి పొట్టునుంచి విడివడే గింజలాగా, మన మిక్కడి బంధాలనుంచి (మాతృ గృహం) విముక్తులమౌదాముగాక. కాని, అక్కడనుంచి (భర్తగృహం నుంచి) ఎన్నటికీ విముక్తులం కాకుండా ఉంటాముగాక.

బి ఘడ్‌తీ దుల్హాన్ వతన్‌సే హై జబ్
ఖడీహైం రోమ్ ఔర్ గలా రుకీహై
కిఫిర్ న అనేక హై కోఈ ధబ్;
ఖడీహైం రోమ్ ఔర్ గలా రుకీహై॥

ఆ సనాతన ఆర్యకన్యలు గానంచేసిన ఈ ప్రార్థన రాముని హృదయపు లోతులనుంచి ఉద్గత మవుతున్నది! ఓహో! ఆనందపరవశతో వ్యక్త బాష్పాలు కుంభవృష్టిగాకురుస్తున్నవి!

హే భగవన్! హే ధర్మస్వరూప! హే పరమసత్యస్వరూప! నీవు తప్ప ఇతరసంబంధమేదైనా ఉన్నట్లయితే, ఈ శిరస్సునూ, ఈ హృదయాన్నీ చీల్చివెయ్యి. నీవుకాక, ఏ యితర భావమైనాసరే, ఈ రక్తనాళాల్లో, నరాల్లో ప్రవహిస్తుంటే ఈ రక్తమును ఘనీభూతం చెయ్యి!

ఇంకొకశ్రుతి:

అహం జాని గర్భధమా త్వం జాసి గర్భధమ్!

అనువాదం:

ఒక పురుషుని భార్యలాగా నేను నిన్ను తెలుసుకుంటాను. నిన్ను గాఢంగా కౌగలించుకుంటాను. నీ అధరాలను, నీ తనువులో ఉండే రహస్యరసాలను ఆస్వాదిస్తాను. ఓ ధర్మమా! విముక్తీ! నిన్ను గర్భంలో ధరిస్తాను.

రాముడు త్రిశూలాన్ని పెండ్లి చేసుకోలేదా? పరమసత్యాన్ని-మహాధర్మాన్ని-భగవంతుణ్ణి-వివాహం చేసుకోలేదా? జారిణికిలాగా ఇంక రామునకితరసంబంధా లెందుకు?

(మేరేతో గిరిధర్ గోపాల్ దూసరా న కోఈ)

ఇది అంధ్రోద్రేకంగాదు, పరహింసాకరమైన స్వార్థంకాదు. అమాయకుడైన రాముడు ఏమిచేశాడు? సంకుచితమైన వ్యక్తిగత సంబంధ వలయాల్లోకి ఎందు కతణ్ణి మీరు గుంజడం? అతణ్ణి వదలండి. దయచేసి అతణ్ణివదలండి. మీ స్వక్షేమంకోసమే అతణ్ణి వదలండి. అతణ్ణి ఏకాకిగా వదలండి. దేశముయొక్క, మానవులయొక్క మంచి ఇందులోనే ఉన్నది. రాముడు ఏకాంతములో స్వార్థపరుడై మరణిస్తాడని మీరనుకుంటాన్నారా? అట్లు మరణించడు సుమా! దేవుడు సత్యం. దైవమయమైన జీవితం అశుభాన్ని పొందదు. భగవంతుని సేవాకర్మ చేయనిదే ఈ దేహం రాలిపోదు.

ఒకమానవునియొక్క పవిత్రభావాలకు అడ్డంరాకూడదు. అతడు తన ఆదర్శానికీ, అతనికీ మధ్య దేన్నీ నిల్చోనీయడు. చివరకు మృత్యువును కూడా నిల్చోనీయడు. ఎవరుకూడా అతనిప్రవర్తనను, నాస్తిక చరిత్రపఠనముద్వారా అప్పు దెచ్చుకొన్న భావాలతో మార్చడానికి ప్రయత్నించకుండారుగాక. మీ అనురాగాలకు, ఆతిథ్యాలకు దృశ్యమానరాముడు చాలదూరంగా ఉన్నాడు. సర్వాత్మమైన సత్యరాముని కివి నిందలే! ఇంద్రియ వ్యామోహాలను ఆత్మజ్వాలాశిఖలలో దహించండి. హృదయంలో ప్రాపంచిక భావాలకు చోటీయవద్దు. హృదయపాత్రను నిరంతరం సత్యరామధ్యానామృతంతో నింపండి.

War harchih jur dilbar buwad
As Shahr -i-dil berun kunam.

అనువాదం :

ప్రియుడైన భగవంతుడికి ఇతరమైన ఏభావాన్నైనాసరే నా హృదయనగరంలోనుంచి వెడలగొడతాను.

చివరకు విషయవస్తుల్లో వున్న తీపైనా భగవంతునిలో లేదా !

మానవులు భగవంతుని ప్రేమించరు. ఎందుకంటే, ఈ మిథ్యా ప్రపంచవస్తువుల్ల కలిగే లాభం ఆయనవల్ల కలగదనుకుంటారు. ఘోర మైన అవివేకంచేతనే ప్రజ లిలా మోసపోతున్నారు. ఓ ప్రియుడా! నీ హృదయస్పందనతో, తత్ క్షణం తదేశకాలంలో భగవంతుని హృద యంకూడా తాళంవేస్తుంది.

శత్రుమిత్రభ్రాంతి వద్దు. సత్యకారణం నీ సత్యాత్మలోమాత్రమే ఉన్నది. దీన్ని అవలోకించు!

ఎగరటం బాగారాని చిన్నపిట్ట, ఒకేసారి ఆకాశంలోకి ఎగిరి పోలేదు. ఒక చిన్నరాయిమీదనుంచి, ఇంకో చిన్నకొమ్మమీదికి, ఆ కొమ్మమీదనుంచి ఇంకోదానిమీదికి, దానిమీదనుంచి ఇంకోదాని మీదికి మెల్లగా ఎగురుతుంటుంది. కాని, పూర్ణంగా భూసంబంధమైన ఆధారాలు వదలలేదు. నిరాధారంగా, ఆకాశపథాల్లోకి విహరించ లేదు. అదేమాదిరి బ్రహ్మజ్ఞాన సాధకుని హృదయం, ఒక వస్తువును త్యజిస్తుంది. కొన్నాళ్ళు ఎవరితోనో సాంగత్యం చేస్తుంది. విరక్తిపుట్టి అక్కడనుంచి ఇంకో పదార్థంమీదికి ప్రాలుతుంది. అక్కడనుంచి ఇంకో మిథ్యావస్తువును ఆశ్రయిస్తుంది. అంతేగాని ఆధారపడడం వద లదు. అతని హృదయములోనుంచి భూవాసన పూర్ణనివృత్తిగాదు. పూర్ణానుభవజ్ఞాని అలా కాదు. ఏదో ఒక అనిత్య ప్రపంచ వస్తువును మెట్టుగాచేసుకొని, చివాలున లేచి అనంతబ్రహ్మాకాశ మండలంలో స్వేచ్ఛావిహారం చేస్తాడు. జీవితంలోవచ్చే ప్రతి చిన్న అనుభవాన్ని, ఆ నిత్యత్వశిఖరానికి ఒక మెట్టుగా మార్చడమే మతకళ. దృశ్యమాన పదార్థాలన్నీ ఒకేరకమైనవి. అందుచేత అతడు ఏదో

ఒక్క బాహ్యవస్తు పరిత్యాగాన్ని, ఆంతర్యమందలి సర్వసంగ పరిత్యాగమునకు చిహ్నంగా చేస్తున్నాడు.

అతి నిశాతమైన పరమసత్య త్రిశూలాన్ని-అహంకృతియొక్క చావే జీవితధర్మం అన్న సత్యాన్ని-గ్రహించనివాడు శోచింపదగిన మూర్ఖశిఖామణి. ధర్మత్రిశూలం అహంకార పర్వతాలను తునాతునకలు చేస్తుంది. స్వార్థ దేహ భావ మరణమే అమరజీవనపునరుత్థానం. చిరంజీవ! సెలవు!

## బ్ర తు కు లో చా వు

రాముడు లాహోరును వదలిన రోజుల్లో మహోన్నత అద్వైత వేదాన్త శ్రీమంతమైన విష్ణుపురాణముయొక్క పర్షియన్ అనువాదం చదువుతున్నాడు. ఈ పర్షియన్ అనువాదముయొక్క లాటిను అనువాదానికే ఎమర్సన్, థోరో మొదలైనవాండ్లు పొంగిపోయి తమతమ రచనల్లో ఉదాహరించారు. ఈ పర్షియన్ రచనకు ప్రతి రచనే పంజాబీ విష్ణుపురాణంకూడా. కాలీ కమ్లీవాలా బాబా రచితమైన 'అనుభవ ప్రకాశిక' అనే గ్రంథం పంజాబీ విష్ణుపురాణానికి విపులీకరణం. ఆ మానవుడు ఎంత ఉన్నతదృష్టితో జీవించాడో చూపించే గ్రంథమిదే. ఆయన ఆత్మజీవితం మన మీ గ్రంథపుటల్లో కొంత దర్శించవచ్చు. కోటాను కోట్లమంది చేయదగ్గ ఒక మహోన్నతకర్మ ప్రశాంతంగా, నిరాడంబరంగా ఒక్కని పేరుతో జరిగిపోతున్న దిక్కడ. ఆయనకు ఉన్న ఆస్తి, యిల్లూ సర్వస్వం ఒక నల్లని కంబళి. ఆయన అంత పెద్దవండితుడూ కాడు. కరతల భిక్షా, తరుతల శయనమే ఆయన జీవనం. ఎవరికీ భారంలేని మధుకరవృత్తి ఆయనది. అగాధ ప్రవాహాలమీద వంతెనలు కట్టబడుతున్నాయి. మార్గాలు నిర్మితాలవుతున్నాయి. ధర్మశాలలు కట్టబడుతున్నాయి. అన్నవస్త్రాలు ప్రదానం చేయబడుతున్నాయి. విద్యాబుద్ధులు కరపబడుతున్నాయి. మలమలమండే ఎడారుల్లో, శూన్య హిమ శిఖరాగ్రాలమీద ఇంత మహత్తరకర్మ సాగిపోతున్నది. ఇదంతా ఆ కాలీకమ్లీబాబా పేరుమీదనే అఖండమై సాగిపోతున్నది.

ఊహాలూ, పన్నాగాలూ, దస్తావేజులూ వృథా! వృథా! ప్రాపంచిక భావాలతో సత్యకర్మ జరుగదు. దైవమయజీవనంవల్లనే మహాకర్మ సాగుతుంది. కొందరికి జనసంకుల నివాసజీవనం దివ్యస్థితికి అవ్యక్తసహాయం చేస్తుంది. కొందరికి ఏకాంతజీవనం వ్యక్తసహాయం చేస్తుంది; దివ్యస్థితి కథగమించడానికి వరప్రసాదంగా ఉపకరిస్తుంది.

కొందరికి గ్రంథరచనల్లో, హృదయం భగవంతుని లేఖినిని స్పృశిస్తుంది. కొందరికి ఉపన్యాసాల్లో అహంకృతి మణిగి, వాటిద్వారా భగవత్తేజం ప్రజ్వలిస్తుంది. మరికొందరు యుద్ధాగ్నివర్షాలమధ్య తుపాకిగుండ్ల తాకిడికి, తమగుండెలు డాళ్లుగా చేసి దేహభావనా దూరులై. జగద్రంగంమీద వీరులుగా కీర్తిలాతారు. ఇంక కొంత మంది కళాభిముఖులైనప్పుడు ఆ నిత్యసౌందర్యానికి అధిగమిస్తారు. చివరకు దొంగకూడా - విజయం పొందడానికి కారణం చూడండి! అతని ఇంటికి కన్నంవేసి పొందిన విజయానికి కారణం ఆ తరళమైన, వర్ణనాతీతమైన, ప్రపంచం మరిచిపోయిన అవ్యక్తస్థితిలో - ఆ పరిత్యాగంలో - ఆ అజ్ఞాతమైన, అనంతత్వంమీద వేసిన భారంలో - ఉన్నది. తర్వాత అతడు చేసిన పనికి - దృశ్యసంపదను సత్యంగా భ్రాంతిపడినందుకు, ధర్మాఘాతాన్ని నెత్తిమీదికి తెచ్చుకుంటాడు.

మనం ఎంత సజీవంగా ఉన్నామో అంత మహాకర్మజరుగుతుంది. సజీవత్వ మంటే సర్వంలో మరణం. ఈ బ్రతుకు లేక ఈ అహంకారపు చావు మహాకర్మ చేస్తుంది. అంతేకాని ఏకాంతవనం, సంఘం, యిలాంటి వేవీ చేయడం లేదు. అజ్ఞానులైన చరిత్రకారులు బాహ్య పరిస్థితులుమాత్రం చూస్తారు. అభ్యున్నతిని వాండ్ల రచనాధోరణికో, అనుచరుల సంఖ్యాధిక్యతకో అంటగడతారు. విజయకారణమైన సత్యాత్మను మరుస్తారు. నే నేదైనా గ్రంథం వ్రాస్తే, ఆ గ్రంథానికి మూలం వాండ్లు నేను కూర్చున్న చెట్టో, ఆ చెట్టుకొమ్మమీద కూర్చున్న ఏ పిట్టో అనుకుంటారు. మన పరిస్థితులూ, అవకాశాలూ నిర్జీవాలు. సనాతన ఋషి, ఒక యోధుని విజయాన్ని సక్రమసమీక్షణతో, లోపలా, వెలుపలా ఉన్న భగవంతునికి (ఇంద్రుడూ, వరుణుడు) చెందినదని నిర్వచిస్తున్నాడు.

సదా సమింద్రా వరుణావం సావతమ్.

సప్తమమండలం - ఋగ్వేదం.

'బుల్లాపా' చెప్పిన - "పిట్టలు గద్దలను ఓడిస్తున్నవి" - అన్న విషయం, మనము ప్రతిరోజూ కండ్లముందర చూస్తున్నాము. మన మనుకున్న అనుకూలతలూ, భద్రతలూ బుడగల్లాగా పగిలిపోతున్నవి. మనము పనికిరా వనుకున్న చిన్నరాళ్ళు మహోన్నత మందిరాలకు పునాదిరాళ్లుగా పనికివస్తున్నవి - అని క్రీస్తువచనాలు. ఈ బాహ్యా పరిస్థితులమీద, ఈ ప్రపంచజ్ఞానంమీద, మనవిజయాలు రవ్వంతకూడా ఆధారపడి లేవు. మన సర్వసంబంధాలూ, స్నేహితులూ, భోగభాగ్యాలూ, ఆశలూ, వాగ్దానాలూ ఒక్కమాటలో మన ప్రపంచమంతా వట్టి మిధ్య. కేవలనాటకం. ఈ ప్రపంచ అసత్యత్వాన్ని చూపడానికి సురేశ్వరుడూ, శంకరుడూ వారి మేధాబలంచూప నగత్యంలేదు. కండ్లున్న వాండ్లకు తమ అనుభవంలోని అణువణువూ ఈ వేదాంతాన్ని భయంకరమైన అశనిపాతంలాగా గర్జిస్తుంది!

తత్వమస్యాది వాక్యానాం స్వతః సిద్ధార్థబోధనాత్
అర్థాంతరం న సంద్రష్టుం శక్యతే త్రిదశైరపి॥

మన మహాత్మ బిరుదాలూ, సంస్కృతత్వాలూ, గౌరవాలూ, ఉద్యోగశాలలూ, బాంధవ్యాలూ, గతరాత్రి కలల్లాంటివి. గతించిన రూపాల్లాంటివి. మబ్బుల బొమ్మల్లాంటివి. సంధ్యా పిశాచాల్లాంటివి. అవి విభ్రమభూతాలు! మనము రామునితో శ్రుతిదప్పినప్పుడు మనకు మార్గం కనపడదు. ధర్మపథాన్ని తప్పి మనం బాధపడవలసి వస్తుంది. మనం భగవంతునితో కలిసి ఉన్నప్పుడు మంచి మార్గాలూ మంచి భావాలూ, సర్వశుభాలూ అప్రయత్నంగా మన హృదయాల్లో నుంచి బయలుదేరి శాంతిశ్రీ కలిత క్షేత్రాల్లోకి విజ్ఞానపర్వతశిఖరాల మీదికి పవిత్రతా నవనవ జలాశయతీరాలకు మనలను తీసుకపోతాయి. మనలోని పరంజ్యోతి అవ్యాజంగా మనకు జీవప్రేమల ప్రసాదిస్తుంది.

ఈ అహంకార-బలి పాఠమే వేదకాలాల్లోని వివిధ కలాపసంకీర్ణములై మహాద్భుతములై గంభీరములైన యజ్ఞకర్మల అంతర్యమై

యున్నది. "చావులో బ్రతుకు" అనే మహాధర్మాన్ని నేను, సనాతన ఋషులు రుద్రుని నమ్మినట్లు సుస్థిర సత్యంగా నమ్ముతాను. దీన్ని అగౌరవించండి- బాణపరంపరలు మీ గుండెలపై వీగా నలుదిక్కులా విజృంభిస్తాయి.

నమస్తే రుద్ర మన్యవ ఉతో త ఇషవే నమః
బాహుభ్యాం ఉత తే నమః

అనువాదం :

ఓ రుద్రా! (ఓ ధర్మమా!) నీ క్రోధానికి నమస్కరిస్తున్నాను. గురితప్పని నీ బాణాలకు ప్రణతిచేస్తున్నాను. అలుపు ఎరుగని నీ బాహువులకు సాష్టాంగపడుతున్నాను.

జీవితంలో వచ్చే ప్రతిచిన్న అనుభవంలో కూడా సంపూర్ణ చరిత్ర గర్భితమై ఉంది. కాని, మనము దాన్ని పఠించం. బుద్ధుడుగావడం, క్రీస్తుగావడం కష్టమైనపనిగాదు. అయితే మనము తగిన విలువచెల్లించాలి. లోనుంచి స్వార్థాహంకృతిని వెళ్ళగొట్టి మనద్వారా భగవంతుని పనిచెయ్యనియ్యాలి. ఒక్క ఒరలో రెండుకత్తులు ఇముడవు. మన నెత్తిమీదకి వచ్చే ఈ నిందాపనిందల గాలిదుమారాలను మనము నమ్మకూడదు. ఫలాసక్తి మనకుండకూడదు. జయకాంక్ష మన ఆశయం కాకూడదు. సత్యప్రచారంకంటె సత్యమే తానై జీవించాలి. సూర్యునిలాగ కర్తవ్యాహంకార శూన్యులమై శక్తిసామర్థ్యాలు వినియోగించి పనిచెయ్యాలి. ఇట్టిశక్తిని మనం ప్రబుద్ధంచేస్తే మనము సమస్తలోకాలేలే మహా ప్రభువుల మవుతాము. సాక్షాత్ దేవునిగా మారుతాము! ఏ క్షణములో మనలనుగురించి ప్రజలు అనుకొనేమాటలు నమ్ముతామో అప్పుడే మన దారికి ఒక మహా వింధ్యం అడ్డుపడుతుంది. ప్రపంచం మిథ్య. సర్వప్రపంచం మిథ్య! ఈ ప్రజాప్రసంగాలుసైతం మిథ్య! మిథ్య! పరమాత్మ ఒక్కడే పరమసత్యం!

సువర్ణశుద్ధికి అగ్ని ఏవిధముగా అవసరమో ప్రవర్తనాభివృద్ధికి 'బాధ' అవసరమని కొందరంటారు. అవస్థపెట్టకుండా ప్రకృతి మానవుణ్ణి ముందుకు పోనివ్వదు. ఈనాటివరకు ఈ భావమే ఉన్నది. నిరంత

రము ఇది ఇలాగే జరిగిపోతుందనడానికి కారణము అదేనా? ఏ రసాయనమైనా ఒకపరిణామస్థితికరాంది పనిచేయనిమాట నిజమే. బీజం భూమిలోపల చివికిన తర్వాతనే మొలుస్తున్నది. ఖనిజాలు ఒకస్థితి దాకా కాలడంచేతనే కరుగుతున్నవి. ప్రాపంచికమానవుడు ఈ బాహ్యా అదృష్టాలూ, ఐశ్వర్యాలూ, పదవులూ మొదలైనవిచూచి వ్యామోహితుడై అనాయరూపాత్మకదృశ్యాలకు బద్ధుడౌతాడు. వాటిని నిజమని నమ్ముతాడు. అతడట్లు ముందుకు పోవాలనుకుంటాడు. వెంటనే తల మీదనో, ముఖంమీదనో దెబ్బతగులుతుంది. ఆ దెబ్బ అతణ్ణి కరిగించి పతనస్థితిలోకి తెస్తుంది. జీవితస్థితి సమగ్రం కావడంచేత ఇక విజయం అతణ్ణి వెతుక్కుంటూవచ్చి వరిస్తుంది. ప్రజలేవిధంగా వ్యాఖ్యానించినా సరే. ధర్మము ధర్మమే. ఏదోవిధంగా ద్వైవాదర్శాన్ని మరువకపోతే 'బ్రతుకులో చావు" అనే పథంలో దారితప్పకపోతే క్రీస్తు బాధపడక పోయేవాడే. ఎలాగైతే నేమి బాధ వెంటనే అతనిని స్వస్థతలోకి దెచ్చింది. ప్రజలు ఏసుక్రీస్తును శిలువవేయడానికి ముందు ఏసుక్రీస్తు తనలోని అహంకార భావాన్ని శిలువ వేసుకున్నాడు. అందుచేతనే అతనికి నిత్యమైన జీవితం లభించింది. కాని, హింసా, బాధా ఎప్పుడూ విజయంతో, ఆనందంతో అంతమవుతాయని అనుకోనవసరంలేదు. సామాన్యంగా ఒక బాధ వెనుక అనేక బాధలు వస్తుంటాయి. బాధలు ఒకటిగారావని అంటుంటారు. ఒక బాధవల్ల మనం ఉన్నతస్థితిని పొందినట్లయితే జీవితంలోని జ్ఞానసూర్యుని కాంతి తత్క్షణమే మనపై పడుతుంది. కాని, బాధవల్ల మనం ధర్మాన్ని భేదించినట్లయితే మరీ విపరీతబాధలను మనం ఆహ్వానించినవాండ్ల మవుతాము, ఈ ధర్మం మనం అర్థం చేసుకోలే నటువంటిది. ఈ ధర్మాన్ని మనం అర్థం చేసుకోకపోతే బాధ నాగిపోవలసిందే. మన శిరస్సులపై దెబ్బలు తగలవలసిందే! అనిర్వచనీయమైన అస్తిత్వానికి మూలస్థితియైన ప్రాథమికస్థితిని గడిచినవారికే నివాసయోగ్యత ఉంటుంది. యంత్రాన్ని నడిపేవాండ్లు లేకుండా యంత్రాలు గనుక ఉంటే ఆవిరివల్ల కలిగేబాధ అట్లాగే ఉంటుంది. యంత్రాలు నడిపేవాండ్లు కనిపెట్టబడ్డారు కాబట్టి యంత్రశక్తినష్టం ఇపుడు అవసరం లేదు. జీవిత ధర్మం, జీవిత శాసనశక్తి యిపుడు సంపాదింపబడడంచేత

యిప్పటికీ మానవులను బోధ పరిపాలించాలని చెప్పడంలో సక్రమ కారణం కనిపించదు.

బాహ్య దేహాభిమానంతో కర్మ చెయ్యడం ఈ పరిమిత ప్రాపంచిక ప్రభుత్వముల దృష్టిలో తప్పుకాదు. కానీ, విశ్వాన్ని పరిపాలిస్తున్న ఆ పరమధర్మ ప్రభుత్వదృష్టిలో అదే ఘోరాపరాధం. దేని కంటూరా ఇతరమైన సమస్తదోషాలు ఈ అహంకారవృక్షానికి శాఖలే కనుక. ఒకటే రోగం. ఒకటే మందున్నది. "బ్రహ్మ సత్యం- జగన్మిథ్య" అన్న వేదాంతధర్మాన్ని ఉల్లంఘించడమే సమస్త దుఃఖాలకు మూల కారణమైయున్నది. ఈ ధర్మోల్లంఘనమే- రకరకాల కష్టాలరూపం దాలుస్తున్నది. దీనికి మందు- మనం సత్యమైన బ్రహ్మత్వాన్ని గ్రహించి ప్రబుద్ధులం కావడమే! ఆత్మవంచనకు ఎప్పుడు అవకాశ మిస్తామో అప్పుడే దాని వెనువెంటనే తక్కిన అన్ని వంచనలు ఒకదానివెంట ఒకటి ఇంకా ఇంకా బయలుదేరుతాయి.

"రామునిమాటలు కేవలం అడవిలో ముక్కుమూసుకొనే సన్న్యాసుల ఊహాలు; అవి సంఘానికి పనికిరా"వంటారా? జలాశయంలో స్వయంగా వ్యవసాయం లేదు. అందుచేత పొలాలు పంటలు పండడానికి దానిజలము ఉపయోగించుకోకపోవడం సమంజసమేనా? ప్రతిమానవుని స్వ జీవితమైన ధర్మాన్నిమాత్రమే రాముడు చెబుతున్నాడు. ప్రపంచము లోని సర్వధర్మాలు రసాయనిక జీవసంబంధ, ఆధ్యాత్మిక సంబంధ సర్వ ధర్మాలూ- పైన చెప్పిన ఆ ధర్మాతిధర్మమైన ఆ ఏకైకధర్మము యొక్క వివిధవైఖరీవిన్యాసాలే. నైమిత్తికధర్మము, ప్రాపంచిక బాంధవ్యాలు, ఆశలు, విధులు యివన్నీ మార్గంలో ప్రక్కనఉండే సత్రాల్లాంటివి మాత్రమే. ఒక్కసారి సత్యసూర్యుడు మన బుద్ధి అనే ఆకాశ మండలంలో ప్రకాశించినప్పుడు, ఒక్కసారి మనము వస్తువులయొక్క సత్యప్రకృతిలోకి ప్రబుద్ధులమై నప్పుడు సమస్తనిమిత్తాలు, ధర్మాలు మనచుట్టూ గ్రహగోళాల్లాగా పరిభ్రమిస్తవి. అంతేకాదు. చలిదిఅన్నం తినడానికి తల్లిదగ్గరచేరిన పసిపిల్లలాగా అవన్నీ మనదగ్గరకుచేరుతాయి.

యథేవ క్షుధితా బాలా మాతరం పర్యుపాస్తే

సామవేదం

శిశువు ఏవిధముగా నిరాడంబరంగా, సైజంగా నడవడం నేర్చుకోవలసి ఉందో అదేమాదిరి మానవుడు సంపూర్ణముగా మరణించడము నేర్చుకోవలసి ఉంది. ఈ మరణానికి అర్థము – ఎక్కడ సేవకుడు సేవకుడు కాడో, శిష్యుడు శిష్యుడు కాడో, రాజు రాజు కాడో, స్నేహితుడు స్నేహితుడు కాడో, విరోధి విరోధి కాడో, ప్రజల వాగ్దానాలు వాగ్దానాలు కావో, బాధలు బాధలు కావో, సంపదలు సంపదలు కావో, హక్కులు హక్కులు కావో, సమస్తము భగవంతుడై యున్నదో–ఆమహాస్థితి అని. ఒకే పరమ సత్యమున్నది. ఆ పరమ సత్యముతో హృదయము శ్రుతికలిపినప్పుడు ఆ హృదయముతో సమస్త ప్రపంచం శ్రుతి కలుపుతుంది. మనస్సు ఆ పరమ సత్యముతో శ్రుతి తప్పినప్పుడు (అంటే బాహ్య దృశ్యాలమీద ఆధార పడినప్పుడు) సమస్త ప్రపంచము మనస్సుతో శ్రుతి తప్పుతుంది. వ్యతిరేకిస్తుంది. ఎంతవరకు మనము దేహాభిమాన గ్రస్తులమై అహంకార ప్రేరితులమై ప్రత్యపకారానికి తలపడతామో, దెబ్బకు దెబ్బ కొడతామో అంతవరకు మనము మృతులమే! వ్యతిరేకములైన నిందాప నిందలను ఆత్మస్థితులమై నిర్లక్ష్యంచిపోయే ఆ దివ్యసామర్థ్యము కంటె గొప్పతనానికి వేరే భద్రకరమైన పరీక్ష లేదు.

ఒకడు న్యాయవాది పదవిలోనుంచి న్యాయాధికారి పదవిలోకి వచ్చినప్పుడు సభాస్తారు లందరూ అతనిమీద ఉన్న అభిప్రాయాన్ని మార్చుకుంటారు. ఆ విధంగానే మనం ఒక పాక్షికవాది పదవిలోనుంచి నిష్పాక్షికమైన, నిర్మోహమైన భగవజ్జ్యోతి అనే పదవికి అధిగమించినప్పుడు ఈ సమస్త ప్రపంచం మనతో ఉన్న సంబంధాలను సంస్కరించుకుంటుంది. నావ ఎటు తిరిగితే దానిలోని దిక్సూచియంత్రములోని ముల్లు అటు తిరిగినట్లు వాండ్లు అంతకుముందు మనతోగల వ్యవహార విధానాలు మార్చుకొని తీరుతారు. వాండ్లు నిన్ను మోసగిస్తారా? నీలోనుంచి భగవంతుణ్ణి మోసగించి బహిష్కరించావు కనుక నిన్ను జనం వంచిస్తారు. ప్రొఫెసర్ జేమ్సు సక్రమంగా ఇట్లు సమీక్షిస్తున్నాడు: "ప్రత్యక్షంగా కనబడే భౌతికమైన ఇంద్రియ వికారాలు గుప్తముగా కనపడే సత్యసంబంధమైన సూక్ష్మములైన భావములంత మన కర్మ

మీద బలముగా పనిచేయలేవు - అనే సత్యవిషయముమీద జీవితము ఆధారపడి యున్నది." జంతువులు భౌతికమైన ఇంద్రియ వికారాల చేతనే నడుపబడుతున్నవి. అదృశ్యములైన ధర్మాలు అంటే పశుదశ లోని మానవుడికి అంధకారావృతంగా కనబడే ఆ ధర్మము సుస్థిరమైన సత్యాతిసత్యముగా దర్శించగలిగినప్పుడు మాత్రమే, మానవునిలోని దివ్యత్వము ప్రబుద్ధమవుతుంది. అంతేకాదు. ఈ దృశ్యమానములైన తరళస్వరూపాలు, అచ్చం రొక్కమూ వట్టిబంగారము అని పిలువబడే యీస్థూలపదార్థాలు మొదలైనవి అజ్ఞానులకు వాండ్ల తమోజీవితాలకు మార్గంచూపించే తారలు. ఈ తారలు దైవసాన్నిధ్యమనే పగటిలో ఉన్న మానవుడికి అదృశ్యమై కనపడవు.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః.

—భగవద్గీత

## మహాసౌశీల్యం — పరమధర్మం

అబ్రహాము ప్రాణంతో తగులబెట్టబడే సమయంలో అగ్నిని యీ విధంగా అడిగాడు: "ఈ సమయంలోకూడా నాలో దేహాభిమానం లవలేశమైనా ఉన్నట్లయితే ఓ అగ్నీ! దాన్ని దహించు! దహించు! దయయుంచి విసువక దహించు!" ఈ మాటలు విని అగ్ని "నా ప్రభూ! నీవు జీవించు! నన్నే నీ పాదాలమీద పడి చావనియ్యి" అనే ప్రత్యుత్తరాన్ని వ్యంగ్యంగా ధ్వనిస్తూ ఆరిపోయింది.

దైవధర్మ మంత బలీయమైంది. భగవంతుడు బాహ్యాగౌరవాలకు వశుడు కాడు.

ఋచం బ్రాహ్మం జనయంతః దేవా అగ్రే తదబ్రువన్।
యస్త్వైవం బ్రాహ్మణో విద్యాత్తస్య దేవా అసన్ వశే॥

—యజుర్వేదసంహిత

సర్వాం య ఏనం భూతా న్యభిక్షరంతి॥

—బృహదారణ్యకోపనిషత్

సర్వేఽస్మై దేవా బలి మావహంతి॥

—తైత్తిరీయోపనిషత్

అనువాదం:

దేవతలు ప్రప్రథమంలో బ్రహ్మయొక్క ప్రియురాలితో యీ రకంగా ప్రసంగించారు:

ఓ బ్రహ్మతో ఏకమై యున్నదానా! బ్రహ్మవేత్తలకు దేవతలమైన మేము భృత్యాను భృత్యులమై ఉండవలసియున్నది. అతని సింహాసనానికి సర్వులుకూడా కానుకలు చెల్లిస్తారు. సర్వధర్మాలూ అతని బలిపీఠంమీద ఆహుతి సమర్పిస్తాయి.

## వేదాంతానికి ఒక పెద్దనిరోధం

"వేదాంతం ఆర్ద్రభావాలను చంపుతుంది. రసజ్ఞదృష్టిని చెడగొడుతుంది. మనస్సును గట్టిపరిచి కఠినంగా చేస్తుంది. ప్రవర్తనను ప్రకృతివంటి ఒక చలించని సరళరేఖలాంటి దానినిగా చేస్తుంది. సంబంధాలను త్రెంపుతుంది" అని అంటారు.

అవును నిజమే. వేదాంతం అలాంటిదే. వేదాంతానికి నివేదితుడైన మానవుడికి పరమసత్యం తప్పక అలాంటి అతీతస్థితిని ప్రసాదిస్తుంది. సమస్త వస్తువులు, వ్యక్తులు, నైమిత్తికాలు, అభిప్రాయాలు వేదాంతిదృష్టికి నీటిమీద వ్రాతల్లాంటి వౌతవి. అయితే మానుష్యమైన లేక పశుభావాలు హృదయంలోనుంచి క్షాళితమై వాటికి బదులుగా దివ్యభావాలు పొంగిపొరలి ప్రవహిస్తాయి. సూర్యస్మిత కాంతిచేత కృత్రిమదీపాలు తీసివేయబడుతాయి. నిస్సంగమైనదైనా సూర్యతేజం యావత్పరిసరాలను ఆనందంతో ముంచెత్తుతున్నది.

ఒక గొప్ప ఆధ్యాత్మికానుభవముగల ఆంగ్లేయ డొకడు ఊరకముగా నిర్వచించాడు :– "నా కిప్పుడు పూర్ణముగా అర్థమైంది. అహంకారభావమును పూర్ణముగా వదలడమువంటి పరమసుఖము ఇంకొకటి లేదు. కానీ, అహంకృతి సగముపోయినా లాభము లేదు. ఏ రవ్వంత అహంకృతి నీలో మిగిలియున్నా అది సర్వమును పాడు చేస్తుంది. అహంకారమును పూర్ణముగా వదలివెయ్యాలి. వ్యక్తిత్వ

మును పూర్ణముగా మరువాలి. నీ దేహభ్రాంతికి ఒక అతి అపరిచయుడికి ఇచ్చినంత ఆస్కారమన్నా యివ్వకూడదు."

సంవత్సరాల పొడుగునా సాగిపోతున్న మీ వాంఛాజాలమును వదలండి! పేరుకీర్తులను, జనాభిప్రాయాలను, బాహ్యాభూషణాలను వదలండి. మిమ్ములను కట్టివేసే బాహుపంజరాలలో చిక్కుకోకండి. మీరు ముద్దుగా పెంచుకున్న స్వార్థాన్ని కాలరాయండి. కాలిమేజోళ్లు తీసివేసినమాదిరి రోగభయ వికారాలను అవతలికి నెట్టండి. పరుల భూషణాలను వెడలగొట్టండి. దేహభ్రాంతి కతీతులై గమించండి. పైపొట్టు వదలండి. ఎన్నెన్నో యుగాలనుంచి అల్లుకొన్న యీ పంజరమును పటాపంచలు చేయండి. అభేదత్వ మనే ద్వారమునుంచి సర్వాధిపత్యమనే రాజసౌధములో నడువండి! జ్ఞానద్వారము (బ్రహ్మజ్ఞానము) లోనుంచి విముక్తి (మోక్షము) అనే మహాస్వర్గములో నడువండి! సర్వసంగపరిత్యాగం చెయ్యండి. సర్వమును వదలండి. నాది అనేది లేకుండా యీ లోకములో దరిద్రులు కాండి. అప్పుడు చూడండి. మీ రప్పుడు సాక్షాత్ జగదీశ్వరులౌతారు, సమస్త బ్రహ్మాండాధిపతులౌతారు!

శ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యా వహోరాత్రేపార్శ్వే
నక్షత్రాణి రూప మశ్వినౌ వ్యాత్తమ్ ।
ఇష్టం మనిషాణ

—యజుర్వేదం

అర్థము :—

విజయశ్రీలు నీ సేవకకన్యలు. అహోరాత్రాలు నీ కుడి ఎడమ భాగాలు. నక్షత్రకాంతులు నీ చూపులు. చిరునవ్వు నవ్వేటప్పుడు విడివడిన నీ పెదవులే స్వర్గమూ, భూతలమూ! నీ కేమన్నా కావాలంటే కోరుకో

-రాముడు

ఓమ్! ఓమ్! ఓమ్!

# సమత్వ బుద్ధి

[1903 ఫిబ్రవరి 15 న శాన్‌ఫ్రాన్సిస్కోలో చెప్పిన అధ్యయనోపన్యాసము.]

"ఈ యుగంలో మానవుడు వేదాంతాన్ని తెలుసుకోగలడా?"– అని నిన్న ప్రశ్నించారు. దీనికి ప్రత్యుత్తరంగా ఇంకెవరో ఒకరు వేదాంతము తెలుసుకోడానికి అది వదలాలి యిది వదలాలనీ, హిమాలయారణ్యాలకు పోవాలనీ, సలహా యిచ్చారు. కాని రాముడు "అక్కరలేదు. మీరు అరణ్యాలకు పోనక్కరలేదు" అని చెప్పుతున్నాడు.

ఈ రోజుల్లో సామాన్యంగా జనులు మాకు కాలవ్యవధి లేదని సాకు చెప్పుతుంటారు. "మాకు తీరిక లేదండీ. మాకు ఎన్నో పనులుంటవి. మా బంధువులతో, స్నేహితులతో కాలమంతా గడిచి పోతుంది"—అని ప్రజలంటుంటారు. "ఓ భగవంతుడా! నా శత్రువుల నుంచి నన్ను కాపాడు" అని ఒక ప్రార్థన ఉన్నది. కాని, నేటి నాగరిక మానవు డిలా ప్రార్థిస్తే సరిగా ఉంటుంది – "ఓ భగవంతుడా! నన్ను నా స్నేహితులనుంచి కాపాడు. మా కాలమంతా స్నేహితులు దోపిడీ చేస్తారు. ఇంకా రకరకాలయావలు, విచారాలు, కష్టనష్టాలు మా కాలాన్ని అపహరిస్తున్నవి. అంతేనా? తర్వాత మా పిల్లలను, కుటుంబాన్ని చూచుకోవాలె. ఎవరో ఒకరు మనకోసము వస్తూ పోతుంటారు. వాండ్లను మర్యాదగా స్వాగతాలిచ్చి వీడ్కోల్పాలె. మనం పోవలసినవారి దగ్గరకు మనం పోతుండాలి. వార్తా పత్రికలు చదువుకోవాల్నా? ఇంక ఆధ్యాత్మిక అభ్యుదయానికి తీరికెక్కడ? ఓహో! ఎన్ని విధులు! కర్తవ్యాలు! ఇవన్నీ మన కాలాన్ని హరించి వేస్తున్నవి. అసలు తిన్నగా తిండి తినడానికి మాకు తీరిక ఉందా?" – అని ప్రజ లంటుంటారు. విధులు అనేవి మీ జీవితాన్ని పీల్చి పిప్పి చేసినవి. అయితే ఈ విధులు ఎక్కడనుంచి వచ్చినవో చెప్పతారా? ఈ విధులను మీమీద పెట్టిన దెవరు? మీరే! మీకు మీరేకదా! నిజానికి మీరే మీ విధులను సృష్టించుకున్నది. విధులు మిమ్ముల బానిసలుగా చేసి పరిపాలించే మహా క్రూరుడైన యజమాని కాగూడదు.

ఉద్యోగ కర్మకు తప్పక హాజరుకావడం నీవు విధిగా ఎంచుకున్నావు. కాని ఆ ఉద్యోగకర్మ నీమీద విధించింది ఎవరు ? నీవే! నీవే! అందు చేత విధులయొక్క తత్వాన్ని మీరు సంపూర్ణముగా తెలుసు కున్నట్లైతే మీ విధులకు మీరే కర్తలని తెలుసుకుంటారు. మిమ్ము లను బానిసలజేసి పరిపాలిస్తున్న యీ విధులన్నీ మీవల్లే సృష్టింపబడిన వని తెలుసుకుంటారు. ఒక్కసారి నీ వీ సత్యానుభూతి పొందు! ఈ ప్రపంచములో నిన్ను బంధించేది ఏదీ ఉండదు. ప్రతిదీ నీలోనుంచే సృష్టింపబడుతున్నది. నీవు మహానందాన్ని పొందవచ్చు. నిన్ను నీవు స్వస్థపరచుకోవచ్చు.

ఒకసారి ఒకమనిషి డాక్టర్ జాన్సన్ దగ్గరకు వచ్చి ఇట్లన్నాడు : "అయ్యా! నా జీవితం వృధావృధా! ఏపని చేయడానికీ నేను తగను. నే నే పనీ చేయలేను. ఈ ప్రపంచంలో మానవు డేం చేయగలడు ?" జాన్సన్, ఆ మనిషి మాటలు విని, "నీ విషయమేమి?"టని ప్రశ్నిం చాడు. ఆమనిషి తన విషయ మిట్లు చెప్పసాగాడు:

"మహాబ్రతికితే మానవుడు ఒక నూరుసంవత్సరాలు బ్రతుకు తాడు. అయితే అనంతత్వముతో, శాశ్వతత్వముతో పోల్చినప్పుడు యీ నూరేండ్లు ఏ లెక్కలోకి వస్తవి? సగముకాలం నిద్రలో గడచి పోతున్నది. మీకు తెలుసు! మనం ప్రతిరోజూ నిద్రపోతాము. ఇక మనబాల్యావస్థ...అదంతా ఒక దీర్ఘనిద్ర అని చెప్పవచ్చు. ఇక ముసలితనము విషయం చూద్దాము. శక్తిసామర్థ్యాలు ఉడిగిపోయి నిస్సహాయస్థితిలో గడిచిపోయ్యే కాల మది. అప్పుడు మూడుకాళ్ళ ముద్దలం. ఏంచేయగలం? సరే యింక యౌవనదశవిషయం చూద్దాము ఆ దశలో కాలమంతా యౌవనోద్వేగంతో, దుష్టభావాలతో, రకరకాల వ్యామోహాలతో వృధా అయిపోతున్నది. ఇంక కొంత వ్యవధి ఆటలలో, పాటలలో గడచిపోతున్నది. ఎంతో కాల మిట్లా ఆటలలో గడచిపోతున్నది. ఇది పోగా మిగిలేకాలం కాలకృత్యాలలో వృధా అయిపోతున్నది. తిండీ తీర్థాలకూ మరికొంతకాలం వృధా అయిపోతున్నది. ఇక వీటన్నిటికీ పోగా మిగిలనకాలం కోపంలో శత్రుత్వంలో. ఆందోళనలో, కష్టాల్లో, కడగండ్లలో, గడచిపోతున్నది.

ఇవ్వన్నీ మనుష్యుడికి ప్రకృతిసిద్ధమేగదా! వీటన్నిటికీపోగా మిగిలిన కాలం ఇంట్లో పిల్లలతోటో, స్నేహితులతోటో, బంధువులతోటో గడచిపోతున్నది. మానవమాత్రుడు ఈ ప్రపంచంలో ఏమిచేయగల డండీ? అంతేనా?......చచ్చేవాండ్లకోసం ఏడవాలి. కొత్తగా పుట్టే వాండ్లకోసం ఆనందపడాలి. ఈ రకముగా మనకాలమంతా వృథా కాకతప్పదుగదా! ఇంక యే రకముగా మానవుడు యేదైనా నిజమైన పని, స్థిరమైన పని చేయగలడు? ఏ రకంగా మానవుడు తనబ్రహ్మాత్వాన్ని తెలుసుకోడానికి కాలం వినియోగించగలడు? ఇది మావల్ల కానిపని అయ్యా! ఈ దేవాలయాలు మాకు వద్దు. ఈ గురువులూ మాకు వద్దు. ఈ మతబోధలూ మాకు వద్దు ఈ ప్రపంచములో బ్రతుకవలసిన మనుష్యులు మతంకోసం కాలం వినియోగించలేరని, యీ దైవికసాధన లకు వాండ్లకు తీరిక ఉండదని మీ మత ప్రబోధకులకు చెప్పండి. ఈ ప్రపంచం చాలు మాకు మునిగి తేలటానికి."

జాన్సన్ ఈ మాటలువిని నవ్వలేదు. అతని మాటలు ఏమాత్రం ఖండించలేదు. ఆక్షేపణ చేయలేదు. ఊరక ఏడుస్తూ, అతి క్షీణరకంగా ఓదార్చడం మొదలుపెట్టాడు. "అయ్యో! మనుష్యులు చేతులారా ఆత్మహత్య చేసుకోవలసి వచ్చింది. ఎందుకంటే దైవసాధనలకు వాండ్లకు తీరికేది? తమ్ముడా! నీసంగతి యిట్లా ఉన్నది. ఇక నాసంగతి చెప్పమంటావా? ఏమని చెప్పేది? నాసంగతి మరీ అధ్వాన్నం." జాన్సన్ మాటలు విని ఆ మనిషి "ఏమిటి మీ విషయం?" అని అడిగాడు. జాన్సన్ దీనంగాఏడుస్తూ ఇలా చెప్పాడు: "ఇటుచూడు! నాకు చేరెడు భూమికూడా లేదు. పిడికెడుమట్టిగూడా లేదు. నా ఆకలితీర్చడానికి పిడికెడు గింజలు పండేస్థలం కనపడడంలేదు." ఆ మనిషి ఆశ్చర్యపడి "బాగుంది! ఇది అసంభవం. మీరు బాగా భోజనం చేసేవారని నాకు తెలుసు. పదిమంది మనుష్యులు తిన్నంత మీరు తింటారు. అయినప్పటికీ మీ పొట్టకు కావలసినంత ఆహారం సృష్టించటానికి ప్రపంచంమీద కావలసి నంత భూమి ఉన్నది. ఎందుకు మీ రిలా చెబుతారు?" ఆమాటలువిని జాన్సన్ యీరకంగా జవాబు చెప్పాడు. "ఇటు చూడు. ప్రపంచ మెంతది? ఈ భూమండలం శూన్యమని చెప్పవచ్చు. ఈ భూమి గ్రహ

గణితంలో ఒక గణితబిందువుగా ఎంచబడుతుంది. నక్షత్రాలయొక్క, సూర్యులయొక్క దూరాలను గణించేటప్పుడు భూమి లేనిదానినిగా, ఒక సున్నాగా ఎంచబడుతుంది. ఈ భూమండలంలో ముప్పాతిక భాగం జలంచేత ఆవరించబడియున్నది. ఇంక మిగిలిందేమిటి ? చూడు. చాలా భాగం ఎడారి. కొంత పర్వతాలూ రాళ్ళు, కొంత నదులూ సరస్సులు. కొంతభాగం లండనులాంటి పెద్దపెద్ద నగరాలు. ఇంకా రహదార్లు, రైళ్ళు, మార్గాలు. ఇక మానవుడికి యీభూమిలో స్థానమేముంది ? వీటన్నిటికీ పోగా మానవుడికి కొంత ప్రదేశం వున్నదని మన మనుకుంటాము. కాని మిగిలిన యీకించిద్భూమిని ఉపయోగించుకోను ఆశించే జీవులు అనేకం వున్నాయి. కోటానుకోట్ల పక్షులు, చీమలు, గుఱ్ఱాలు, గుంపులుగుంపులు ఏనుగులు ఇవన్నీ భూమిమీద ఉండనే కాంక్షిస్తాయి. ఇక మానవుడికి మిగిలింది ఏ అల్పాంశమో. ఈ ప్రపంచంలో ఎంతమంది మానవులున్నారు? లండనులోచూడు కోటానకోట్ల జనం. ఈ లెక్కపెట్టలేని జనసంఖ్య చూడు! వీరందరూ ఈ భూమండలంలో మిగిలిన ఈ రవ్వంతభూమిమీదనే జీవించకోరుతున్నారు. అలాంటప్పుడు నాకు తగినంత ఆహారం యీభూమి ఎట్లా సమకూర్చగలదు? నాతర్కం, నన్నీనిరాశాదుఃఖదశకు యీడ్చుకపోతున్నది. ఈ ప్రపంచంలో నాకు తగినంత ఆహారం దొరికే ప్రదేశం కనపడనందున నేను చావక తప్పదు.'' ఈమాటలు విని ఆమనిషి అన్నాడు : "పండితోత్తమ! నీతర్కం యుక్తంగా లేదు. నీతర్కం పైకి వినడానికి సహేతుకంగానే ఉన్నది. నీతర్కం ఇట్లా ఉన్నప్పటికీ ఈభూమి నిన్ను భరించగలదు,'' జాన్సన్ పండితుడు ఈ రకంగా ప్రత్యుత్తర మిచ్చాడు: ''అయ్యా ఈ నావాదన సహేతుకంగా లేకపోతే ఆధ్యాత్మికాహారం సమకూర్చడానికి తగినకాలం లేదని చెప్పే నీవాదంగూడా సహేతుకంగా లేదు. ఈ భౌతికమయిన ఆహారం సమకూర్చడానికి చాలినంత భూమి నా కున్నట్లయితే, నీకుగూడా కాలం చాలినంత ఉన్నది. నీకు గూడా కాలం చాలినంత ఆధ్యాత్మికాహారం సమకూర్చగలదు.''

ఏరకమైన ఆధ్యాత్మికాహారాన్ని సమకూర్చడానికైనా నేటి నాగరికత అవకాశమివ్వదనే ఈ ప్రశ్నకు ఈ సమాధానమే రాముడు

చెబుతున్నాడు. అనేక సంవత్సరాలక్రితం జాన్సన్ పండితుడు ఏవిధంగా సమాధానం చెప్పాడో అదేమాదిరి రాము డీ ప్రశ్నకు సమాధానం చెబుతున్నాడు. ఆధ్యాత్మికమైన అభ్యున్నతి పొందడానికి ఈ పరిస్థితుల్లో కూడా మీకు చాలినంత వ్యవధి ఉన్నది. మీరు సరిగా ఉపయోగించుకో గలిగితే మీకు చాలినంత కాలవ్యవధి ఉన్నది.

ఒకసారి ఒకమనిషి గుఱ్ఱంమీద ఏదో దూర ప్రదేశానికి వెళ్ళు తున్నాడు. అతడు దారిలో 'మోట' ప్రక్కగా పోవలసి వచ్చింది హిందూదేశంలో బావిలోనుంచి నీరు తోడడానికి ఒకవిధమైన పని ముట్టు ఉంటుంది. దాన్ని 'మోటగిలక' అంటారు. ఆ మోటగిలకతో నీరు తోడే టప్పుడు ఒకవిధమైన శబ్దం కలుగుతుంది. ఈ మనిషి మోటచే తోడబడుతున్న నీటిని త్రాగించడానికి తను గుఱ్ఱాన్ని తెచ్చాడు. ఆ మోటగిలక చప్పుడు ఇంతకుముందు వినడానికి అలవాటు పడని గుర్రం బెదిరి నీరు త్రాగ లేదు. ఆశ్వికుడు మోటతోలుతున్న రైతును చప్పుడు 'ఆపి వెయ్యండి' అని అడిగాడు. శబ్దం ఆగిపోయింది. శబ్దం ఆగటంతోటే నీరు రావడంగూడా ఆగిపోయింది. గుర్రానికి త్రాగడానికి నీరు లేకపోయింది. ఆ ఆశ్వికు డప్పుడు "ఓ వింత రైతు ల్లారా! నేను మిమ్ములను అడిగింది శబ్దమునాపి వెయ్యమని. నీటి రాకను ఆపివెయ్యమని అడగ లేదు. మీరు చాలా తమాషా మనుష్యుల్లా గున్నారే! ఎవరో బాటసారి వచ్చి కాసిని గుఱ్ఱానికి నీళ్ళడిగితే సహాయం చేయలేరా?" అని విసుక్కున్నాడు. ఆ వ్యవసాయదారు లన్నారు: "అయ్యా! మాకు హృదయపూర్వకముగా మీకు సహాయం చేయాలని ఉన్నది. మీకూ, మీ గుఱ్ఱానికీ దాహం తీర్చాలని ఉన్నది. కాని, మీ కోరిక మాశక్తికిమించిన పని. మీకోరిక మేము తీర్చలేం. మీకు నీరు గావాలంటే, మీ గుఱ్ఱాన్ని నీళ్ళు త్రాగించా లనుకుంటే శబ్దంలోనే త్రాగించాలి. ఎందుకంటారా, చప్పుడాగిపోతే నీళ్ళురావు. గిలక తిరిగితేనేగదా నీళ్ళువచ్చేది." అదేవిధంగా రాముడు చెబుతున్నాడు... "మీరు వేదాంతమును తెలుసుకోవాలంటే రక రకాల కోలాహలాలమధ్య, అన్నిరకాల అవస్థలమధ్యనైతం తెలుసు కోండి. చప్పుడులేని, బాహ్యమైన అవస్థలులేనిపరిస్థితి ఈప్రపంచములో

మీా కెవ్వడూ దొరకదు. దొరకదు. హిమాలయశిఖరాలెక్కి కూర్చోండి. అక్కడా మీాచుట్టూ ఏవో అవస్థలు క్రమ్ముకొంటాయి. అరణ్యవాసులుకాండి. అక్కడా మీాచుట్టూ బాధలు తప్పవు. మీా యిష్టము వచ్చినచోటికి ఎక్కడకన్నాపోండి. మిమ్ములను బాధలు వదలనే వదలవు. అవి మీా వెనువెంటనే వుంటవి. మీారు వేదాంతివిజ్ఞానులు కాదల్చుకుంటారా మీాచుట్టూ ప్రాపంచికసంరంభ మనే మోటగిలకచప్పుడు సాగిపోతున్నప్పుడే తెలుసుకోండి. బాధామయపరిస్థితుల మధ్యనే మహాపురుషు లందరూ ఆవిర్భవించారు. నిజానికి ఈపరిస్థితులు ఎంతెంత విషమంగా ఉంటాయో, పరిసరాలు ఎంతంత దుస్తరంగా ఉంటాయో వాటిల్లోంచి ముందుకువచ్చే మానవులు అంతంత ధీరులయి ఉంటారు. అందుచేత ఈ కష్టాలను బాధలను సంతోషంగా రాసీయండి. ఈ అననుకూల పరిసరాలమధ్య సహితం వేదాంతాన్ని అనుష్ఠించండి. మీారు వేదాంతాన్ని అనుష్ఠించినప్పుడు ఈ పరిస్థితులూ, పరిసరాలూ మీాకు లొంగిపోవడం జరుగుతుంది. అవి మీాకు అనుకూలపడతాయి. అవి మీాకు సేవ చేస్తాయి. మీారు వాటికి అధిపతులౌతారు. మనలను క్రిందికి అణగతొక్కుతున్నది సంఘమా? మనలను అణిచివేస్తున్నది ప్రపంచమా? మీారీ ప్రపంచంలో జీవించడంలేదు. ప్రతివ్యక్తీ తాను స్వయముగా సృష్టించుకున్న ఏదో ఒక చిన్నద్వీపంలో బ్రతుకుతున్నాడు. నిజంగా ఈ ప్రపంచంలోనే జీవించేవాళ్లు ఎంత కొద్దిమంది! ఈ విశాల ప్రపంచంలో జీవించేవాండ్లు చాలా కొద్దిమంది. నిజంగా మీాకు మీారు సృష్టించుకున్న ఏవో ఇరుకు లోకాల్లో మీారు జీవిస్తున్నారు. మీా అహంకారాలకు చుట్టూ గిరలుగా మీారు ప్రపంచాలను సృష్టించుకున్నారు. సంకుచితమైన కుటుంబపరిధిని దాటిచూడడ మెరుగని ప్రజలున్నారు. తమకుల మనే ఒకచిన్న ప్రపంచాన్నితప్ప ఇంకొకదాన్ని ఎరుగని ప్రజలున్నారు. తమపెళ్ళాలూ భర్తలూ పిల్లలూ అనే రూపంతో ఉన్న ఏదో ఒక చిన్న చీకటిప్రపంచాన్నితప్ప రెండో విషయమే ఎరుగని ప్రజ లున్నారు. కనీసము ఈ విశాలప్రపంచములోనైనా జీవించండి! మీామీా సంకుచిత మోహ ప్రపంచాలకు అతీతులు కాండి. మిమ్ములను క్రిందికి తొక్కుతున్నది, ఈ విశాల ప్రపంచం కాదు. మీారు సృష్టించుకున్న సంకుచిత ప్రపంచాలే మిమ్ములను అణగద్రొక్కు

తున్నవి. మీమీ సంకుచితకూపాలనుంచి పైకి రాండి. ఈ సమస్త ప్రపంచమూ మీకు అనుకూలపడుతుంది.

నిజమైన కర్మ ఏదో తెలియ జేయడం ద్వారా మనం స్వయముగా సృష్టించుకున్న ఈ సంకుచిత ప్రపంచాన్ని గురించి ఇప్పుడు నిర్వచిస్తాను. మేము పనిలో మునిగి తేలుతున్నామని చెబుతారు మీరు. ఈ దేశంలో ప్రజలు కాలవ్యవధి చాలడం లేదని చెప్పడం రాము డెక్కువగా విన్నాడు. కాలహరణంకోసం తమ జీవితాలన్నీ ఉపయోగిస్తూ కాలవ్యవధి చాలడం లేదని చెప్పడం చూచి రాము డాశ్చర్యపడుతున్నాడు. తమ తలమీదా, భుజాలమీదా చాలినంత కొండలకొండల బరువులు మోయడానికి నేటి ప్రజలకు సరిపొయ్యే కాలమున్నది. అయినప్పటికీ ''మాకు తీరిక లేదు; కాలం చాలదు'' అని చెపుతున్నారు. మీ కోరికలతో కాలాన్ని మీరు తరిమివేస్తున్నారు. కాలాన్ని మీరు హరణం చేస్తున్నారు. కానీ, పాపం మీకు కాలం చాలడం లేదు. ఇదేమిటి? నీ వాదనయొక్క మూలం కర్మముయొక్క తత్వాన్ని అపార్థం చేసుకోవడమైయున్నది. నిజంగా పని కానటువంటి దాన్ని నీవు పని అని పిలుస్తున్నావు. కర్మ అనే విషయం అనేకమంది చేత అనేక రకాలుగా అభిరూపితమైంది. విజ్ఞానశాస్త్రజ్ఞులు కర్మను ఒకవిధంగా నిర్వచిస్తారు. మన మొకవిధంగా నిర్వచిస్తాము. నీవు నడచిపోతున్నప్పుడు విజ్ఞానశాస్త్రజ్ఞులదృష్ట్యా అది కర్మ కాదు. ఒక నున్నని సమప్రదేశంమీద ఒకబంతి దొల్లిపోతుంటుంది. అప్పుడది పని చేయనట్లే. నీ వొక కొండపై కెక్కుతుంటావు. అప్పుడది పని. కాని, నీవు సమతలచలనం చేస్తున్నప్పుడు అది కర్మకాదు. కర్మతత్వ నిర్వచనంలో ఇది ఒక మార్గం. మానసికతత్వశాస్త్రము కర్మను ఇంకొకరకంగా నిర్వచిస్తున్నది: మానసికతత్వ శాస్త్రానుసారం నీ మనస్సు అందులో పనిచేస్తున్నప్పుడే అది పని అని. నీ వొకపని చేస్తూ నీ మనస్సు అందులో లగ్నం కాకుండా ఉన్నట్లయితే అది కర్మ కానే కాదన్నమాట. నీవు గాలి పీలుస్తున్నావు. కాని, మానసికతత్వ శాస్త్రము ఇది కర్మకాదంటుంది. నీ నాళాల్లో రక్తముప్రవహిస్తున్నది. ఒకదృష్ట్యా ఇదికూడా పనే. కానీ, మానసికతత్వశాస్త్రానుసార మిది

పనికాదు. నిజంగా కర్మ అంటే ఏమిటో మానసిక శాస్త్రజ్ఞులు ఒక చక్కని ఉదాహరణం చెబుతున్నారు.

ఒకఊళ్ళో ఒకడున్నాడు. అతడు కొన్నిరోజులు సిపాయీలలో ఉండి విరతిపొందినవాడు. అతనికి సైనికవ్యాయామ విధానమెంత బలీయంగా అలవాటయిందంటే అతడాపని మానుకున్న తర్వాతకూడా అప్రయత్నంగా అతని దైనికచర్యల్లో ఆ వ్యాయామం కనపడుతుండేది. ఒకనాడు చేతులో ఒక బరువైన పాలకుండ పెట్టుకొనో, తినే పదార్థం పెట్టుకొనో వీధిలో నడుస్తున్నా డతడు. ఆ వీధిలోనే పోతున్న ఒక చమత్కారి ఆ పాలన్నీ క్రిందపోగొట్టాలనే ఉద్దేశ్యంతో ప్రక్కన నిలిచి, ఊరకనే, 'ఎటెన్‌షన్' అన్నాడు. ఎటెన్‌షన్ అన్నప్పుడు చేతులు క్రిందికి దించవలసి ఉండడం మీకు తెలుసు. ఆ పూర్వసిపాయి చెవిలో ఈ మాటలుపడ్డాయి. అప్రయత్నంగా అతనిచేతులు క్రిందికి జారాయి, పాలకుండ ప్రక్క మురికికాలవలో పడిపోయింది. ఆ దారిన పొయ్యే వాండ్లందరూ, ప్రక్కదుకాణదార్లందరూ కడుపుబ్బనవ్వారు. ఎటెన్‌షన్ అనేమాట అతను విన్నప్పుడు, అతనిచేతులు క్రిందకు జారవిడిచాడు. కానీ, మానసిక తత్వశాస్త్రము, అతడు పనిచేయలేదంటున్నది. ఇది ప్రతిచలనకర్మ (Reflex action) అనబడుతుంది. ప్రతిచలనకర్మ కర్మ కాదు. ఎందుకంటే, మన స్సందులో పనిచెయ్యడం లేదు కాబట్టి.

ఇప్పుడు రాము డొకటి అడుగుతున్నాడు. "ఇరవైనాలుగు గంటల్లో ఎంతపని మీరు చేస్తారో చెబుతారా ?" మీరు భోజనము చేస్తున్నప్పుడు అది కర్మేనా ? కాదు. ఇలాంటి అనేక పనులు మీరు చేస్తున్నప్పుడు మానసిక తత్వశాస్త్రం చెప్పిన కర్మతత్వానుసారం, మీరు పనిచేస్తున్నారా ? మీరు నడుస్తున్నప్పుడు పనిచేస్తున్నారా ? మీ రనేకరకాల పనులు చేస్తున్నప్పుడు – ఆ పనులన్నీ రాముడు చెప్పనవసరములేదు – మీరు పనిచేస్తున్నారా ? లేదు. మీ మనస్సు ఇందులో పనిచెయ్యడంలేదు. మీరు చేసేపనుల్లో మీ మనస్సు మగ్నం కాకపోతే మీ రప్పుడు కర్మచెయ్యడంలేదు. అప్పుడు మీరు కాలాన్ని వృథాపుచ్చుతున్నారు. ఇలాంటికాలాన్ని మిగుల్చుకోలేరా?

ఇలాంటి కాలాన్ని సరిగా ఉపయోగించుకోలేరా? ఒక పనిలో మన మనస్సు పూర్ణంగా మగ్నమై ఉంటుంది. ఇంకొకపని చేస్తున్నప్పుడు మన మనస్సు అర్థమగ్నమైఉంటుంది. సగముమనస్సుతో పనిచేసే టట్లయితే సగము పనేచేసినట్లు. మిగతాసగము ఏకాగ్రత నీవు సక్రమంగా ఉపయోగించుకోవాలి. నీ ఏకాగ్రత పూర్ణంగా నిష్ప్రయోజనమైనట్లయితే నీ పూర్ణ ఏకాగ్రతను నీవు ప్రయోజనకారిగా చేయాలి. ఈ రకముగా మీ మానసిక ఏకాగ్రతను సక్రమోపయోగంలో పెట్టడంవల్ల మీ జీవితాలను మీరు వృద్ధిచేసుకుంటారు. మనో ఏకాగ్రతను సక్రమవిధానంలో ఉపయోగించుకోకుండా నీవు చేయగలిగిన పనికంటే ఒకరోజులో నీవు ఎంతోపని చేయగలవు.

ఈ విషయాన్ని ఒక కథతో సువ్యక్తపరుస్తాను. ఇద్దరు బాలురు ఒకరినొకరు వీధిలో కలుసుకున్నారు! వాండ్లిద్దరూ స్నేహితులు. అందులో ఒకడు రెండవవాణ్ణి దేవాలయానికిపోయి అక్కడ భగవత్సంకీర్తనమో, ప్రబోధాలో విందామని బ్రతిమిలాడాడు. రెండవ వాడు ఆడుకోడానికి పోదామన్నాడు. ఎందుకిప్పుడు దేవాలయానికి పోయి, ఆ విసుగుపుట్టే బోధలు వినడంలో కాలం వృధాచేయడమన్నాడు రెండవవాడు. ఇద్దరికీ శ్రుతి కుదరలేదు. ఒకడు గుడికి వెళ్లాడు. రెండవవాడు ఆటకు వెళ్లాడు. కాని దేవాలయానికి వెళ్లిన పిల్లవాడు తీరా వెళ్లాడేగాని అక్కడి బోధ లతనికి అర్థంకాలేదు. గుడికి వృధాగా పోయి. కాలం వ్యయంచేసుకున్నందుకు విచారపడ్డాడు. ఇంక, మనస్సులో ఆడుకొనే స్థలంమీద ధ్యానం బయలుదేరింది. ఆటకుపోయి స్నేహితులను కలుసుకున్న తన మిత్రుని విషయమై అతడు చింతించ మొదలుపెట్టాడు. రెండుగంటలు ఈ పిల్లవాడు గుళ్లో ఉన్నాడు. కాని అతనిమనస్సు క్రీడాస్థలాన్నే ధ్యానంచేస్తున్నది. ఇక ఆటకుపోయిన రెండో పిల్లవానికి, అతనికి తగిన తోటి ఆటగాండ్రెవరూ కనపడలేదు. అతడు ఒక్కడే అయినాడు. అతని మనస్సులో గుడి గుర్తువొచ్చింది. గుడికి పోదామనుకున్నాడు. కాని ప్రార్థనాకాలం దాటిపోయింది. క్రీడాస్థలంలోనే కూర్చున్నాడు. కాని, అతని మనస్సు గుడిలో కూర్చున్నది. రెండు గంట లయినతర్వాత ఆ ఇద్దరుపిల్లలూ

తిరిగి వీధుల్లో కలుసుకున్నారు. ఒకడు గుడికి రాలేనందుకు విచార పడ్డాడు. రెండవవాడు ఆటకు రాలేకపోయినందుకు విచారపడ్డాడు. ఇదే మానవుల్లో ఎక్కడబట్టినా జరుగుతున్న పని. మీ శరీరా లెక్క డున్నవో మనస్సు లక్కడ లేవు. ఇవ్వాళ్ళ ఉపన్యాసం ఎంతమంది విని ఉంటారు ? ఈ ఉపన్యాసశాలలో ఉండగలిగిన వాండ్లు చాలా కొద్దిమంది. మనస్సు ఎగిరిపోతుంది ఉయ్యాల్లో పిల్లవాడి దగ్గరకో, వీధుల్లో స్నేహితుల దగ్గరకో పోతుంది. మనస్సు అక్కడనుంచి ఇక్కడికి, ఇక్కడనుంచి అక్కడికి ఒక విషయంమీాదనుంచి మరొక విషయంమీాదికి కోతిలాగా గంతులు వేస్తుంటుంది. మానసికతత్వ శాస్త్రానుసారం మనస్సు ఒక పని చేసినప్పుడే ఆపని నీవు చేసినట్లు. ఒక్కొకసారి నీ శరీరం ఒక పనిచేస్తున్నప్పుడు నీ వాపని చేయడం లేదు. నీశరీరం గుడిలో ఉన్నప్పుడు, నీవు ప్రార్థనలు చేసేటప్పుడు, నీవు ఉపన్యాసాలకు హాజరైనప్పుడు నీవు బోధలు వినటంలేదు. కాని, కొన్ని సందర్భాల్లో నీ శరీరం వీధుల్లో ఉన్నప్పుడు, నీ శరీరం ఎక్కడో నడిచిపోతున్నప్పుడు, నిజానికి నీవు భగవంతునితో ఐక్యమై ఉండడం జరుగుతున్నది. శరీరం ఎక్కడున్నా నీమనస్సు భగవంతునితో కలిసి వుంటుంది. తరచు నేరస్థులుగా పరిగణించబడే ప్రజలు నిజానికి దివ్యులుగా, భక్తులుగా ఉన్నారు. వాండ్ల మనస్సులు భగవంతునితో కలిసి వుంటవి. కొన్ని సందర్భాల్లో భక్తులుగా, పవిత్రులుగా కనపడే మనుష్యులు లోపల కల్మషచిత్తం కలిగి ఉంటారు. ఒక్కొక్కప్పుడు ఘోర దుర్మార్గులు బాగుపడడం మనం చూస్తాము. ఆ బాగుపడటానికి వాండ్ల దుర్మార్గం కాదుకారణం—అని వేదాంతం చెపుతున్నది. వాండ్లు వాండ్ల హృదయాలలో భగవంతుణ్ణి జీవిస్తున్నారు. అందుచేత మానవుల ఉపరిభాగ కార్యరూపాలనుండి ఎలాంటి ఊహలూ అల్లకోకు. ఒక మానవుడు హత్యకానీ, దొంగతనంకానీ చేసినప్పుడు నీ వతిణ్ణి నీచుడుగా పరిగణించటానికి అవకాశంలేదు.

రాము డిప్పుడు భారతదేశంలో ప్రసిద్ధిపొందిన ఒకానొక దొంగచెప్పిన కథ ఒకటి చెప్పబోతున్నాడు. రాము డప్పుడు పసిపిల్ల వాడు. అతనిస్నేహితునితో ఆ పెద్దదొంగ ఈ కథ చెబుతున్నప్పుడు

రాముడు విన్నాడు. ఆ రోజుల్లో రాముడు గ్రామసమీపారణ్యానికి పోవడం తటస్థించింది. అప్పుడు రాముడు చిన్నపిల్లవాడు. పసిపిల్లవానికి ఏమీ తెలియదని ఆ దొంగ తన స్నేహితులతో ఈ రహస్యకథను నిర్భయంగా చెప్తున్నాడు. ఇప్పు డాకథ మీకు ఉన్నరహస్యమంతా వివరిస్తుంది. ఆ దొంగ ఒకసారి ఒక భాగ్యవంతుని ఇంటికి కన్నంవేసి ఆ యింటిలోని నగలు ఏ రకంగా దొంగిలించాడో ఆ విధానం ఈ రకంగా చెప్పాడు. ఆ భాగ్యవంతుడు ఏదో ఒక రకంగా క్రొత్తగా సంపాదించిన ధనవిషయం ఈ దొంగకు తెలిసిందట. ఇంటికి కన్నం వెయ్యడానికి వెళ్ళాడు కాని ఆ పనిచేయడానికి ఏమీ సందుదొరక లేదు. ఆలోచించగా ఆలోచించగా ఒక ఉపాయం స్ఫురించింది. ఆ ఇంటి గోడకు దగ్గరగా అతని కొక పెద్దచెట్టు కనపడింది. ఆ చెట్టు ఆ ఇంటి మూడవఅంతస్థు కిటికీకి ఎదురుగ్గా ఉన్నదట. ఆ రాత్రి చెట్టుపైకొమ్మకు త్రాడుగట్టి ఆ త్రాడునుప్రాకుతూ పైకివెళ్ళాడు. అది ఎండాకాలం. ఇంట్లో మనుష్యులు మూడో అంతస్థులో లేరని గాలికొరకు ఐదవఅంతస్థు పైన నిద్రపోతున్నారని తెలుసుకున్నాడు. త్రాడుపట్టుకొని కిటికీదగ్గరకు చేరాడు. కిటికీతలుపు తన్నాడు. రెండోసారి తన్నాడు. మూడో తన్నుకు తలుపు తెరుచుకొన్నది. ఇంతకష్టపడి అతడు ఇంట్లో ప్రవేశించాడు. అతనిదగ్గర కొన్ని త్రాళ్ళుకూడా ఉంచుకున్నాడు. ఆ త్రాళ్ళు క్రిందికి విసరి ఇంకా ఒక రిద్దరు అనుచరులనుకూడా పైకి గుంజుకున్నాడు. పైకి చేరినతర్వాత సొమ్ము ఏ స్థలములో దాచబడ్డదో ఆలోచింపసాగాడు. మనస్సు ఏకాగ్రపరిచాడు. అతనిమనస్సంతా తదేకధ్యానంలో మగ్నమై పోయింది. దొంగలు సామాన్యంగా అనుమానించే ప్రదేశంలో ప్రజలు సొమ్ములు దాచరని అత డప్పుడు చెప్పాడు. వెతకటానికి అనుమాన పడని ప్రదేశాల్లోనే సొమ్ముదాచుతారని అతడు తెలుసుకున్నాడు. ఒకచోట త్రవ్వాడు. ఆ సొమ్మక్కడ పూడ్చబడిఉన్నది. ఆ రోజుల్లో ప్రజలు సొమ్ములుదాచుకునే పద్ధతి ఇది. ఇండియాలో ఇప్పటికీ కొంద రిలా చేస్తారు. కాని ఇప్పుడు బ్యాంకీలల్లో డబ్బుదాచి పెట్టడానికి మొదలుపెట్టారు. అప్పుడు ప్రజలు భూమిలో డబ్బు దాచిపెట్టేవారు. సరే దొంగ చేత్తో డబ్బు తీసుకొన్నాడు. మేడమీద హఠాత్తుగా చప్పుడువినపడింది. అప్పుడా దొంగ వర్ణించిన ఆతనిమానసికస్థితి రాముడు

మఱచిపోలేదు. అతడు,అతని అనుచరులు ఆ డబ్బుతీసుకున్నారు. వెంటనే ఆ చప్పుడువినబడిందట. ఆ చప్పుడుచేత వాండ్లశరీరాల్లో ఏదోఒక మహా ప్రకంపనం పుట్టింది. వాండ్లశరీరాలు గడగడ వణికిపోతున్నవి. ముచ్చెమటపోసింది. నఖశిఖ పర్యంతమూ వణికిపోతున్నారు. అది మరణ సమయమేనని ఆ దొంగ వర్ణించాడు. వాండ్లు చచ్చినట్లే భావించారు. ఒక చిన్న యెలుకపిల్లకూడా పైనబడి చంపుతుందన్నంతభయము పుట్టిందట వాండ్లకు. ఆ చప్పుడు నిజానికి యెలుకలచప్పుడే. ఆ సమయంలో ఆదొంగ పశ్చాత్తాపపడ్డాడట. భగవంతుణ్ణి ప్రార్థించాడట. ఒడలు మఱచి సర్వమూ మఱచి భగవంతునికి పూర్ణంగా శరణాగతుడయినాడట. ఆత్మార్పణంచేసి పశ్చాత్తాపపడుతూ క్షమించమని భగవంతుణ్ణి ప్రార్థించాడు. అప్పుడా దొంగ ఒకరకమైన సమాధిస్థితిలో ఉండిపోయినాడు. అలాంటిస్థితిలో మనస్సు మనస్సు కాదు. దైహిక భావాలన్నీ పలాయనమైనవి. అతడూ, అతని అనుచరులూ ఒక మహా విచిత్రమైన, అత్యద్భుతమైన మానసికస్థితిలో ఉన్నారు. ఆ స్థితిలో "ఓ భగవంతుడా రక్షించు నన్ను! నేను మునీశ్వరుణ్ణవుతాను. సన్న్యాసినైపోతాను. సాధువునైపోతాను. నాయావజ్జీవితం నీ సేవలో వెళ్లబుచ్చుతాను. ఓ పరమేశ్వరా! నన్ను కాపాడు. నన్ను కాపాడు" అని దొంగ ప్రార్థించాడు. ఇప్పుడు బయలుదేరిన ఆ ప్రార్థన హృదయపూర్వకమైంది. త్రికరణపూర్వమైనది. అంతరాంతరాల్లో నుంచి వచ్చింది. ఈ ప్రార్థన అతని లోలోపలి లోతుల్లోనుంచి నినదించింది. ఆ సమయంలో ఆ దొంగ భగవంతునిలో ఐక్యమైనాడు. దానివల్ల ఏమి జరిగింది ? చప్పుడంతా ఆగిపోయింది. అతడూ అతని అనుచరులూ క్షేమంగా బయటపడ్డారు. నిరపాయంగా ఇల్లు చేరారు. ఇప్పుడు చూడండి. బాహ్యకర్మలచేత వస్తువులను విమర్శించబోకండి. కేవలం ఒకని బాహ్యకర్మలవల్ల ఆ మానవుని నిర్ణయించలేము. అతః భావాలనుబట్టి నిర్ణయించాలి. ఒక అపకీర్తిపాలయిన కుటుంబంలో పుట్టిన మానవుడు ఒక మహాత్ముడు కావచ్చు. బుద్ధదేవుడు ఒక వేశ్యయింటికి వెళ్ళిన సంగతి మనకు తెలుసు. ఐనా బుద్ధుడు పవిత్రుడే. మనకు తెలుసు. క్రీస్తు భగవానుడు మేరీ మాగ్దనాల్లు గృహంలో – జనం బహిష్కరించి రాళ్ళు రువ్విన ఆమె గృహంలో – నివసించాడు.

అయినా క్రీస్తు భగవత్స్వరూపుడే. భారతదేశములో సైతము క్రీస్తు వంటి మహాత్ములున్నారు. ఆ మహాత్ములు దుష్కీర్తిపాలయిన జనుల మధ్య నివసించారు. వాండ్లు నిజంగా భగవత్స్వరూపులై ఉన్నారు. ఒకరి స్నేహితులనుబట్టి ఆ మానవుని విమర్శించబోకు. ఒకరి బాహ్య విధానాల చూచి ఆ మానవుని విమర్శించబోకు. ఎవర్నీ విమర్శించ వద్దు! ఒకరి భావములబట్టే ఆ మానవుని మనం నిర్ణయించాలి. చెర సాలలో నివసించే ప్రజలు తరచుగా స్వర్గంలో నివసిస్తారు. బనియన్ మహాశయుడు తన "పిల్‌గ్రిమ్సు ప్రోగ్రెస్" ఒక జయిలులో రచించాడు. మిల్టన్ యొక్క మహారచన అతను జయిలులో ఉన్నప్పుడు, పైగా అంధుడై ఉన్నప్పుడు వెలువడింది. దానియల్ డే ఫోతాను జయిలులో ఉన్నప్పుడు "రాబిన్ సన్ క్రూసో" అనే గ్రంథాన్ని వ్రాశాడు. సర్ వాల్టర్ రావే తన "హిస్టరి ఆఫ్ ది వరల్డ్" అనేదాన్ని ఒక జయిలులో వ్రాశాడు.* మనం మనపరిసరాలు యిలా ఉండాలనీ, అలా ఉండాలనీ కోరుకుంటాము. మనభావాలు ఎక్కడజీవిస్తున్నవో మన మక్కడజీవిస్తున్నాము. ఇప్పుడు మనం ఆ 'చావు' యొక్క అంటే 'బ్రతుకులో చావు' యొక్క కథను వ్యాఖ్యానిద్దాం. కొంచెం చూడండి ఎప్పుడైనా సరే సర్వాత్మమైన భగవంతునితో ఐక్యతా ఫలితంగా విజయం లభిస్తుందని రాముడు నిర్వచిస్తున్నాడు. నీలోని దివ్యత్వముయొక్క ఫలితమే ఎప్పుడైనా విజయానికికారణం. భగవదైక్యతే ఎప్పుడూ విజయానికికారణం. ఎప్పుడైనా ఇదే జరిగేది. ఇప్పుడా దొంగ విషయం చెప్పుకున్నాము. అతడు విజయంపొందాడు. మీరందరూ విజయంపొందవచ్చు. దొంగయొక్క విజయానికికారణం ఆ సత్యమైన శ్రద్ధాన్వితమైన, హృదయపూర్వకమైన అతడున్న ప్రార్థనామయుస్థితే. సర్వాత్మలో, దివ్యత్వంలో, మగ్నుడై ఆ దొంగపూడ్చిన నగలను కనుగొన్నాడు. అతడు విజయంపొందాడు. అనుష్ఠానవేదాంత ఫలితమే దొంగయొక్క విజయానికికూడా కారణమైయున్నది. ఇప్పుడు ఎవరైనాసరే వేదాంతాన్ని అనుష్ఠానంలో పెట్టడముచేత ఎప్పుడైనాసరే

* ఈ విషయంతో ఈ విషయంకూడా కలుపవచ్చు. లోకమాన్యతిలక్ గీతా రహస్యమును, పండిత జవహర్‌లాల్ తనచరిత్రను, గాంధీజీ తన ఉత్కృష్ట రచనలనూ జయిలులోనే రచించారు. —సంపాదకుడు.

విజయంపొందుతారని తెలుసుకోవచ్చు. అతడు దొంగ. దొంగతనం చేశాడు. అది తప్పు. ఇతరులసొమ్ము అపహరించడం పాపమే. ఇతరుల సొమ్ము నపహరించినపాపానికి ఫలితంగా, తగినకాలంవచ్చినప్పుడు దైవధర్మంచేత శిక్షితు డవుతాడు. అతడుచేసిన ఈ నేరం, ఈ ధర్మో ల్లంఘనం అతనిమీదికి దుఃఖాన్ని, తెచ్చిపెట్టవచ్చు. కానీ ఆ దొంగ యొక్క విజయము-ఐక్యతానుభూతివల్ల, సర్వైక్యతవల్ల, దైవత్వములో మగ్నంకావడమువల్ల, శారీరకభావన వదలిపెట్టడంచేత, ఆ క్షణ మాత్రమైనా శరీరస్థితికి అతీతుడుకావడంచేత, దేహభ్రాంతిని బలి చేయడంచేత-కలిగినమాట నిజం. ఆ దొంగకు విజయం తెచ్చింది అతడు చేసిన శారీరకాభిమానవిజయమే. కానీ, అతనికి శిక్షాభయాన్ని, ఆందోళననూ తెచ్చింది-చేసిన దొంగతనమూ, మోసమూ, అయి ఉన్నది. ఒక మానవుణ్ణి మనము పూర్ణంగా చెడ్డవాడు అని భావించి నప్పుడు పొరపాటుపడినట్లే. చివరకు దొంగలోసైతము ఒక విధమయిన భక్తి బుద్ధి, దివ్యత్వము ఉన్నవి. క్రీస్తులో, మతబోధకుల్లో, స్వాములలో ప్రబోధకులలోకూడా ఏదో కొంత చెడ్డ ఉంటుంది. ప్రతిమానవునిలో ఒక విచిత్రమైన సమ్మేళనమున్నది. ఒకమానవునిలోని మంచివైపు మాత్రమేచూచి చెడువైపుచూడకుండా వ్యక్తిత్వాన్ని ఆరాధించడంలో మనం తప్పుచేస్తున్నాము. అందుచేత ఎప్పుడైనాసరే చెడునుంచే సత్యాన్ని గాలించి వెలికితీయడానికి ప్రయత్నించండి.

నేటి పరిస్థితులలో మానవుడు బ్రహ్మజ్ఞాని ఏవిధంగా కాగలడు?- దీని ప్రత్యుత్తరం ఆ మానవునియొక్క నైజప్రకృతిమీద ఆధారపడి ఉంటుంది. ఈ ప్రపంచంలో మానవులను మూడు రకాలుగా- మూడురకాల మనః ప్రవృత్తులు కలవారినిగా మనం విభాగించ వచ్చు. అసమమైన చంచలమైన మనః ప్రవృత్తిగల మానవులు కొంద రున్నారు. రెండవరకపు మానవులు నిరంతర సమాన మనః ప్రవృత్తిగలవారు కొందరున్నారు. మరికొందరు నిరంతర చంచ లత్వముగల- అంటే- సమత్వస్థితిలేని మనః ప్రవృత్తిగలవా రున్నారు. చంచలమైన, అసమమైన మనఃప్రవృత్తి అంటే ఏమిటి? ఇదిగో ఈ పెన్సిలును అరచేతిలో సిలువుగా నిలబెట్టండి. ఇది ఎల్లప్పుడూ ఈ

రకంగా నిలబడి ఉండదు. (ఇక్కడ స్వామివారు అరచేతులో ఒక పెన్సిలును నిలువుగా నిలబెట్టి చూపించారు.) ఈరకంగా మనస్సు ఒక సెకండు నిలబడుతుంది. ఇలాంటి మనస్సుయొక్క ప్రతి చిన్న సంచలనమూ ఆ మానవుణ్ణి అస్వస్థుణ్ణి చేస్తుంది. దీన్నే 'అసమమైన చంచల మనఃప్రవృత్తి' అని అంటున్నాము. పెన్సిలు ఒకచివర పట్టుకోండి. (స్వామివారు పెన్సిలును వ్రేళ్లతో పెండ్యులమువలె వ్రేళ్లాడ పట్టుకున్నారు). ఇది నిశ్చలంగా ఉన్నది. కాని, పెండ్యులముగా వుండడము చేత కొంతసేపది అటూ ఇటూ ఊగుతుంది. కాని, కొంతసేపటికి తిరిగీ ఆగి నిశ్చలంగా ఉంటుంది. అంటే సమస్థితి భంగమవుతుంది. కాని, ఆ సమత్వం తిరిగీ పొందవచ్చు. పైన చెప్పిన పెన్సిలుయొక్క మొదటి స్థితిలో సమత్వస్థితి తిరిగీ పొందడానికి అవకాశం లేదని చెప్పవచ్చు. ఇక మూడవరకపు సమాన మనఃప్రవృత్తిఉన్నది. పెన్సిలును అడ్డముగా ఉంచండి. (ఇక్కడ స్వామివారు పెన్సిలును బల్లమీద సమానంగా పండుకోబెట్టారు). ఇది నిశ్చలంగా వున్నది. ఈరకంగా దీనినుంచితే ఇది నిశ్చలంగా వున్నది. ఇప్పుడిది నిరంతరం సమత్వస్థితిలో నిశ్చలంగా ఉంటుంది. ఈస్థితిలో దీన్ని ఎక్కడన్నా ఉంచండి. నిశ్చలంగానే ఉంటుంది. ఇదేరకంగా ఎప్పుడూ మనఃస్థిమితంలేని నిరంతర అశాంతియుతులైన మానవులు కొందరున్నారు. అలాంటివారు నిరంతరం అస్థిమితంగా ఉంటారు. ఏవో బాహ్యపరిస్థితులు వాండ్లకు కొంచెము స్థిమితమిచ్చిన ట్లిస్తవి. కాని, తిరిగి వాండ్లు అస్థిమితత్వంలో, అశాంతిలో పడిపోతారు. మరికొందరు మానవులున్నారు. వారి మనస్సులు సహజంగా శాంతిగనే ఉంటుంటవి. నైజంగా నిశ్చలంగానే ఉంటవి. అయితే ఒక్కసారి వారి మనస్సు చలించిందా యిక వారి మనస్సు అలాగే ఎంతోకాలం సంచరిస్తూ అస్థిమితంగానే ఉంటుంది. సామాన్యంగా ప్రపంచలోని ఎక్కువభాగం ప్రజానీకం ఇలాంటి ప్రవృత్తిగలవారే. నీవు బజారులో నడచిపోతుంటా వనుకో ఎవరోవచ్చి కరస్పర్శచేసి ఏదో నీకు వ్యతిరేకమయిన విషయం చెబుతారు. ఇక అప్పుడు మనస్సులో కలిగిన వికలత గంటలు గంటలు, ఒకొక్కప్పుడు రోజులకు రోజులే, వారాలకు వారాలే నెలలకు నెలలే, కొన్ని సందర్భాల్లో సంవత్సరాలకు పొడుగూతా సాగిపోతుంది. నాడు అతని మాటలవల్ల కలిగిన విక

లత ఆతని మనస్సులో పీఠం పెట్టుకుంటుంది. ఆ మనస్సు స్వస్థతలో ఉండ దిక. గాలికి రెపరెపలాడే ఆకులాగా అతని మనస్సు అటూ ఇటూ ఊగుతూంటుంది. ఇలాంటి చంచల మనఃప్రవృత్తి నీ జీవితాన్ని భగ్నం చేస్తుంది. నీకాలాన్ని వృథాచేస్తుంది. ఇప్పుడు చూడండి. చేసిన పనులకు ఎక్కువకాలము పట్టలేదు. పని ప్రథమసంచలనం మాత్రమే. ఆ కర్మఫలిత మేమిటంటే నీ మానసిక చాంచల్యము, జీవితం పొడుగూతా సాగిపోతుంది. లోపల గలిగే ఈ సంచలనాలను మీరు శాసించగలిగితే, ఈ అంతర్వికలతను మీరు జయించగలిగితే, ఈ నిరంతర మానసిక అసమత్వాన్ని మీరు నిర్జించగలిగితే, మీ జీవితం సమస్త విశ్వమయజీవితంగా మారుతుంది. నీ ముప్పయియేండ్ల జీవితమయినా సరే వందలకొలద్ది సంవత్సరాల జీవితంతో సమానమౌతుంది. నీ మనోరోగాన్ని గుర్తించు. నిన్ను పీడిస్తున్న మానసిక జాడ్యాన్ని గుర్తించు. ఆ వ్యాధిని గుర్తించి నయంచేసుకో నీ మనస్సుయొక్క రోగం చాంచల్యప్రవృత్తి. ఏదైనాపని జరిగినప్పుడు మనస్సు ఏడుపుకూ, నవ్వుకూ మధ్య ఊగుతూంటుంది. వీండ్లే వికలచిత్తులు. ఇక మూడోరకం మానవులు- ధీరులు, ముక్తాత్ములు. ఎలాంటి పరిస్థితులచేతకూడా మనోవికలత పొందని మానవులు వీండ్లు. ఏదైనా జరుగనీ వాండ్లు చలించరు. వాండ్ల శాంతికి భంగం లేదు. ఆ ధీరులను గర్జిస్తూ ఉప్పొంగి పొయ్యే సముద్రమధ్యంలో వేయండి. వాండ్లు చలించరు. యుద్ధరంగములో నిలుపండి. చలించరు. మీరు స్నేహితంతో తీసుకపోయి వాండ్లను ఎన్నో మర్యాదలు చేయండి. వాండ్ల మనస్సు చలించదు. మీరు వెళ్ళిన తరువాతకూడా వారి మనస్సు పరిశుద్ధంగా, వినిర్మలంగా సునిశ్చలంగా ఉంటుంది. ఎవరైనా ముక్తపురుషునితో కలిసి ఒక వెయ్యి సంవత్సరా లుండండి. తరువాత వెళ్ళండి. ఆ మహాత్ముల మనస్సులో మీరేవికలతనూ విడిచిపోలేరు. అద్దంలో చూచినప్పుడు మీ ముఖం కనపడుతుంది. కాని, అద్దం మీ ముఖాన్ని నిజంగా పరిగ్రహించటం లేదు. నీ ఎడమచెవుకు పోగుంటే అద్దంలో సవ్యమైన (కుడి) చెవుకు ఆ పోగున్నట్లు కనబడుతుంది. అదేరకంగా కుడి ఎడమ అవుతుంది, ఎడమ కుడి అవుతుంది. ఒక వంద సంవత్సరాలు నీవు అద్దంముందర నిలుచో ఆ వందసంవత్సరాలు అద్దం నీకు ఆ రకంగానే జవాబు చెబుతూంటుంది.

అద్దాన్ని వదిలివెయ్యి. అద్దంమళ్ళీ యథాప్రకారం పరిశుద్ధంగాఉంటుంది. ముక్తాత్మునియొక్క, జ్ఞానియొక్క విషయంకూడా ఇంతే. ముక్త పురుషునిలో ఎలాంటి బాహ్యారూపాలయొక్క ముద్రలు పడవు. అతడు దేనికీ వికారం పొందడు. అతడు సముడు. అతడు నిరంతరమూ స్వేచ్ఛాస్వరూపుడై వుంటాడు. ఎంతో భూషించండి. జ్ఞాని చలించడు. అతణ్ణి దూషించండి. చలించడు. సముడు, మహాసముడతడు. స్వస్వరూపమైన పరమాత్మయందే అతడు విశ్వాసముంచుతాడు.

ఇప్పుడు రాముడు చెప్పేదేమిటంటే-మీరు నిజంగా వేదాంత సమాలోకనం చేసినట్లయితే, నిరంతరం మీ ముందు వేదాంత ప్రబోధాలను ఉంచుకున్నట్లయితే, ఓంకారనామోపాసన చేసినట్లయితే, సత్పథంలో నడచినట్లయితే మీ బ్రహ్మత్వాన్ని మీరు గుర్తిస్తారు. మీకండ్లకు సత్యం నిరంతరం సాక్షాత్కరిస్తుంటుంది. తరళప్రవృత్తిగల మీ మనస్సు క్రమక్రమంగా స్థిరపడి మేరువువలె అచంచలమవుతుంది. ఈ వేదాంతమును, ఈ సత్యమును నిరంతరమూ మీరు మరిచిపోకూడదు. రాముడిప్పుడు మీకు కొన్ని బాహ్యసహాయసంపత్తులను చెబుతున్నాడు. వీటి సహాయంతో మీ మనస్సును పరిపక్వం చేసుకోవచ్చు. ఈ విషయం మీ కిదివరలో ఎవరూ బోధించి ఉండకపోయినా ఇది మహాద్భుతసందేశ మని మీరే తెలుసుకోగలరు. వినండి. ప్రజలు వచ్చి ఎప్పుడయినా రామునితో ప్రసంగిస్తూ ఒక్కొక్కప్పుడు ఏమేమిటో రకరకాల మాటలు మాట్లాడుతారు. వారి మాటలు వ్యతిరేకమైన విరుద్ధమైన విమర్శలే అయినా రాము డేవిధంగా వారి వారి రకరకాల విషయాలకు అతీతుడై అంటక ఉంటాడో మీకు తెలుసా? అనేక విధానాలున్నవి. ఇదొక విధానం. ఈ చిన్నపుస్తకం మీరు చూస్తున్నారు. ఇది అసమానగ్రంథం. ఒక అద్వితీయ మహాజ్ఞానియైన ఒక మహాపురుషునిచేత యీగ్రంథం రచింపబడింది. ఈ మహాపురుషుడు సుప్రసిద్ధుడుకాడు. భారతవర్షంలో ఈయనను జను లంతగా గుర్తించలేదు. *భగవద్గీతలాంటి ప్రసిద్ధగ్రంథం కా దది. ఇది కృష్ణరచితం కాదు. పేరు కీర్తులులేని ఒకనిచేత ఈ గ్రంథం రచింపబడింది. కాని, ఈయన క్రీస్తులయొక్క బుద్ధులయొక్క సమస్త

* దత్తాత్రేయకృతమైన అవధూతగీతను గూర్చి శ్రీ స్వామివారిక్కడ సూచిస్తున్నారు.

తత్త్వాలను మీకీగ్రంథములో ప్రసాదిస్తున్నాడు. రాము ఢీగ్రంథాన్ని స్వీకరించాడు. ఇది సంస్కృతగ్రంథం. ఈ పుస్తకములోనుంచి రాము డొక శ్లోకం చదువుకుంటాడు. చాలు-జన్మ జన్మాల మనఃశాలుష్యాన్ని క్షాళనంచేస్తుంది. ఆ ఒక్క శ్లోకం రాముణ్ణి బ్రహ్మానందపారవశ్యంలో ముంచివేస్తుంది. ఈ చిన్నపుస్తకములోని ఒక్క శ్లోకం హృదయంలోకి చొచ్చి రామునిలోని బ్రహ్మత్వాన్ని ప్రబుద్ధంచేసి ప్రదీపింపజేస్తుంది. ఆ ఒక్క శ్లోకం అధఃప్రకృతిని వినాశనంచేసి ఒక్కత్రుటిలో మాయా యవనికను పటాపంచలు చేస్తుంది. అందువల్ల ఇలాంటి పుస్తకాన్ని ఏదయినా ఒకటి మీదగ్గర ఉంచుకోండని రాముడు చెబుతున్నాడు. మిమ్ములను ఉన్నతదృష్టికితిప్పే ఏవైనా భక్తిగీతాలను మీరు దగ్గర ఉంచుకోవచ్చు. తత్క్షణం మిమ్ము పరవశులనుజేసే దైవస్తోత్రా లేవైనా మీరు దగ్గర ఉంచుకోవచ్చు. బైబిలులో పర్వత ప్రసంగా ల్లాంటి ఘట్టాలు మీరు ఉంచుకోవచ్చు. మిమ్ములను దివ్యభావంలో మగ్నంచేసే మీ క్రిష్టమయిన ఏ సద్గ్రంథాలలోని విషయాలైనా మీరు దగ్గర ఉంచుకోవచ్చు. మీ హృదయాలకు వికాసంకలిగించే, మీలో భక్తిపొంగించే ఏవైనాసరే మహాత్ముల ఉపదేశాలను సమీకరించి ఒక నోటుపుస్తకంలో వ్రాసుకొని మీదగ్గర ఉంచుకో వచ్చు. ఈ పుస్తకమే మీరు ఉంచుకోవచ్చు. ఈ గ్రంథాంతములో వ్రాయబడిన ఈశ్లోకాన్ని మీరు స్వీకరించవచ్చు. ఈశ్లోకంగానీ, ఇంకా మిమ్ములనుసముత్సాహపరిచే ఏభగవద్రచనలేగానీ మీదగ్గర ఉంచుకో వచ్చు. ఎప్పుడూ ఇలాంటి గ్రంథమొకటి మీ దగ్గర ఉంచుకోండి. మిత్రులనుగానీ, శత్రులను కానీ కలసివచ్చిన తర్వాత మీ మనస్సును వ్యాకుల పెట్టుకోడానికి బదులు, నిరంతరం అస్థిమితత్వంలో ఉంచుకోవ డానికి బదులు ఒక్కసారి ఈ మనోజ్ఞమైన ఘట్టం తెరచి చదువుకో! నీ మనస్సు కుదుటబడుతుంది. ఇప్పుడు మీకు రాముడు మనోవ్యాధిని, దాని కారణాన్ని విశదీకరించాడు. మానవ మనః ప్రవృత్తిలోని సర్వ సాధారణమైన రోగాన్నిగురించి రాముడు మీకు విశదీకరించాడు. ఈ సాధారణరోగం మనశ్చాంచల్యమే. చాంచల్య చిత్తమును ఏవిధంగా మీరు సమతవహింపచేయగలరో రాము డిప్పుడు నిర్వచించాడు.

ఈ విషయాన్ని మీరు ఇంకొకసారి విపులంగా వినవచ్చు.

ఓమ్! ఓమ్ ఓమ్!

# దుఃఖనివృత్తి - పరమాత్మ ప్రాప్తి

[శాన్‌ఫ్రాన్‌సిస్కోలో ఫిబ్రవరి 8, 1903న చెప్పిన ఉపన్యాసం]

ఈ నాటి మధ్యాహ్నం "ప్రజలు ఎందుకు దుఃఖపడుతున్నారు? ప్రపంచంలోని దుఃఖానికి కారణ మేమిటి?" అనే ప్రశ్నను తీసుకొని విచారిద్దాం.

రాము డీ విషయాన్ని చారిత్రకదృష్టితోగానీ, ఋషులయొక్క, బుద్ధిశాలురయొక్క అభిప్రాయానుసారంగాగానీ తీసుకొనడంలేదు. ఈ మహారచయితలు, ఈ విచారకర్తలందరూ సత్యాన్ని చెప్పినమాట నిజమే. తమకు ఏది పరిపూర్ణ సత్యమని అనుభవానికి వచ్చిందో దాన్ని వారు నిర్వచించారు. కాని నీ స్వానుభవంద్వారా యీ విష యాలను గ్రహించలేకపోతే యీ యావత్ప్రపంచరచయితల గ్రంథా లన్నికూడా నీకు తగినంతమేలు చేయలేవు. స్వానుభవంద్వారా దర్శించినదాన్నే రాముడు ప్రవచిస్తున్నాడు. దీన్ని ప్రతిమానవుడూ స్వానుభవంద్వారా దర్శించవచ్చు.

ఈ రోజుల్లో ఒక పెద్ద అలవాటున్నది. అది ఉపన్యాసకులు ఏదో ఒక శాస్త్రప్రమాణాన్ని చూపడం. ఒక పెద్ద పేరుగలవానిని తార్కాణంగా చెప్పడం. లేదా ఒక పెద్ద చరిత్రకారుణ్ణి ప్రమాణంగా చెప్పడం. లేక ఒక గొప్ప శాస్త్రవేత్తను ప్రమాణంగా చూపడం. ఈ రకంగా పెద్దపెద్ద పేర్లు ఉపయోగించిన వక్త ఎక్కువగా గౌరవింప బడతాడు. ఇది ఆత్మహత్యా విధానం! స్వానుభవంతో రాముడు మీకు చెపుతాడు. అంతేకాక మీ స్వానుభవంద్వారా కూడ మీరు తెలుసుకోగలదాన్ని రాముడు చెపుతాడు.

"మనకు అంతర్దృష్టి లేదు. మన అభిప్రాయాలను మనం నిరూ పించుకోలేము. ఎంతసేపటికీ మరీ ఎక్కువగా మనం అంధవిశ్వాసంమీద ఆధారపడతాము. స్వయం విచారణకు స్వస్తిచెప్పి మనం బాహ్యాశక్తుల మీద ఆధారపడుతాము"- ఇదే ప్రపంచదుఃఖానికిగల మహాకారణం

ఇతర్లు ఏమిచెపితే అది మనం నమ్ముతాము. లోపలికి మనము కొంచెంకూడా చూపుపోనివ్వం. స్వానుభూతిమీద మనం ఆధారపడం. మహమ్మదుపైనో బుద్ధునిపైనో కృష్ణునిపైనో నమ్మకంతోపాటు, మనం సర్వవిధ క్షుద్ర విశ్వాసాలను కల్పించుకొని వాటికి మనము దాసోహ మంటున్నాము. ఒక్క ఏమీ తెలీని శిశువు, మన ప్రవర్తనను విమర్శి స్తుందనుకోండి. ఇది చాలు మన మానసిక సమతను భంగముచేసి విచారంలో పడవేయడానికి. ఇతర్ల విమర్శనలనూ, అభిప్రాయాలను ఎక్కువగా మనం పరిగణిస్తాము. ఇతరుల మన్ననకు పాత్రులం కావడా నికి మనమెంతో కాలం వినియోగిస్తాము. మన సత్యాత్మను చూచుకో కుండా ఇతరుల కండ్లతో మనలను చూచుకొనే భావమే- మనలను మనం చూచుకోకుండా ఇతరుల కండ్లతో చూడడమే- దుఃఖకారణం. ఇతరుల కండ్లతో మనలను చూచుకొనే అలవాటుకు డంబమని, అహం కార మనిపేరు ఇతరుల దృష్టికి ఎంతో మంచిగా కనపడాలని మనం కోరుతాము ఇదే సంఘంలోని దోషం ! సమస్తమతాలలోని అనర్థం!

పూర్వం, హిందూదేశంలో ఒక తిక్కల మనిషి ఉండేవాడు. అమెరికాలో మీరు 'ఏప్రియల్ ఫూల్స్' అనే వినోదం చేసినట్లు, యిండియాలో ప్రజలు మార్చినెలలో తమ స్నేహితులతో వింత వింత వినోదాలు చేస్తారు. ఆ గ్రామములో ఉండే వినోదప్రియులైన యువకులు కొంతమంది, ఆ మనిషిని కొంచెము తమాషాపట్టిద్దా మను కున్నారు కొంచెము సారాయి త్రాగించారు. తిక్క తలకెక్కిన తరు వాత, అతని దగ్గరికి అతని సన్నిహితమిత్రుణ్ణి అతినమ్మకముగల స్నేహి తుణ్ణి పంపించారు. ఆ ముఖ్యమిత్రుడువచ్చి భోరునఏడుస్తూ మొసలి కన్నీళ్ళుకారుస్తూ "అయ్యో! ఇప్పుడే నీ యింటి దగ్గరనుంచి నేను వస్తున్నాను. నీభార్య విధవఅయింది, నీభార్య విధవ అవడం నేనుచూచి వచ్చాను" అని చెప్పాడు. ఆ మాటలు విని ఆ తిక్కల మనిషికూడా ఏడవడం మొదలుపెట్టాడు. "అయ్యో నా భార్య విధవ అయిపో యిందా?" అని ఏడవసాగాడు. చివరకు వాండ్లూ వీండ్లూ కూడారు. "ఎందుకు నీవు ఏడుస్తున్నావు?" అని అడిగారు. "అయ్యో! నా భార్య విధవ అయిందని ఏడుస్తున్నాను" అని తిక్కమనిషి ఏడుస్తున్నాడు జను

లన్నారు: 'ఇది అసంభవం! నీ భార్య విధవఅయిందని నీవు చెవుతున్నావు మరి నీవు చావలేదుకదా! భర్త అయిన నీవుచనిపోంది, నీభార్య ఎలా విధవఅవుతుంది? నీవు చావలేదు కానీ నీభార్య విధవ అయిందని ఏడుస్తున్నావు. ఇది ఆత్మ విరుద్ధంకాదా?'' ఆ తిక్కల మనిషి "మీకు తెలేదు, వెళ్లండి. అయ్యో! నాకు అతి నమ్మకంగల స్నేహితుడు చెప్పా డీ విషయం. అతడిప్పుడే మా యింటినుంచి వచ్చాడు. నా భార్య విధవ గావడం కండ్లార చూస్తేనే!" అని చెపుతూ తన భార్య విధవ అయినందుకు ఏడవడం మొదలుపెట్టాడు. కూడిన జనమంతా "చూడండి! ఎంత మూఢత్వమో!" అనుకున్నారు. (సభలో నవ్వు) తన భార్య విధవ అయింది అని ఏడిచిన వాని మౌఢ్యానికి, తాను బ్రతికిఉన్నప్పుడే, తన భార్య విధవకావడమసంభవము అనే విషయ మెరుగని ఆ తిక్కతనానికి మీరు నవ్వుతున్నారు. కాని ఈ ప్రపంచంలోని సర్వసంఘాల్లో సర్వమతాల్లో డాంబికతతో గర్వముతో కూడిన ఈ ప్రాపంచకనాగరిక ప్రజానీకములో, యీ మౌఢ్యం జీవిస్తున్న దని మీరు మరువకండి. తమ స్వంతకండ్లతో ప్రజలు చూడరు. తమ స్వంత మనస్సులతో ప్రజలు ఆలోచించరు. మీలో పరమాత్మ ఉన్నాడు! మీలో సత్యాత్మ - పరంజ్యోతి - ఆ అఖండచైతన్యము - స్వర్గాలకు స్వర్గమైన ఆ దివ్య వైకుంఠ - మున్నది. మీ సత్యాత్మ - మీ స్వాత్మ-అవినాశమైనది, నిత్యమైనది, శాశ్వతమైనది. అయినా మీరు "అయ్యో! ఎప్పుడు మాకు సుఖం?'' అని గుండెలు బాదుకుంటూ రోదిస్తున్నారు. ఈ కష్టాల్లోనుంచి కడతేర్చండని ముక్కోటి దేవతలకు మ్రొక్కుతున్నారు. ఈ రకంగా మీకు మీరే వంగిపోతున్నారు. నీచమైన అలవాట్లకు లోనై మిమ్ముల మీరే పతనం చేసుకొంటున్నారు. అంతటి రచయిత. అంతటి మహాత్ముడు, తనను తాను పాపిగా ఎంచుకున్నాడు కాబట్టి, అతడు మిమ్ములను పురుగు లని పిలుస్తున్నాడు కాబట్టి. మీరలాగే ఎంచుకోవాలనీ, మీ మోక్షం మిమ్ములను మీరు శవప్రాయులనుగా ఎంచుకోవడంలో ఉందని మీ విశ్వాసం. ప్రపంచ ప్రజల విషయ - సమావలోకన మిలాగే ఉంటుంది. కానీ దీనివల్ల ఏమీ ప్రయోజనం లేదు. నీ జీవితాన్ని నీవు తెలుసుకో! నీ ఆత్మను నీవు సంభావించు!

నీ మృతినిగూర్చి నీవు ఏడిచేలాగుచేసే యీ ఉన్మత్తస్థితికి స్వస్తిచెప్పు. నీవు గొప్పవాడవైనా, తక్కువవాడవైనా నీ పాదాలమీద నీవు నిలువబడు! నీవు ఎక్కువస్థితిలో ఉంచబడినా, తక్కువస్థితులో ఉంచ బడినా నీవు గడ్డిపోచంతకూడా లెక్కచెయ్యవాకు. నీ దివ్యత్వాన్ని నీ బ్రహ్మత్వాన్ని గ్రహించు! ఏ విషయాన్నైనాసరే ముఖాముఖిగా చూడు! భయపడవాకు! ఇతరుల కండ్లతో నిన్ను నీవు చూచుకో వాకు! నీ లోకి నీవు చూడు! నీ లోని ఆత్మ సర్వప్రపంచములోకల్లా నీవే మహాత్మ వని నిరంతరం నీకు చెపుతున్నది.

వేదాంతం బౌద్ధమతం మొదలైనవి తమ నిట్లు భావించ మని, చెపుతున్నవని జనులంటారు. కానీ మీలోని స్వర్గం మిమ్ముల మీరు భ్రష్టులనుగా, పతితులనుగా, పాపులనుగా ఎప్పుడైనాసరే, ఎంచుకో వద్దని ప్రబోధిస్తున్న దని రాముడు చెపుతున్నాడు. మీలోని దైవ త్వాన్ని తెలుసుకోండి!

"ఒకసారి ఒక పెద్దపర్వతంబునకు
ఒక చిన్న ఉడుతకు తగవు ఏర్పడియె;
ఆ 'పెద్దకొండ' ఆ యుడుతను చూచి
"ఓ అల్పజంతువా" అని దెప్పిపొడిచె.
ఉడుత ఆ మాటకు బదు లిట్లు చెప్పె:
నిజము-నీ వెంతయో పెద్ద వస్తువువె;
ఒక పెద్దవత్సర మగుటకు కనుము—
ఎన్ని దినంబులు, ఎన్ని ఋతువులు
ఎన్ని మాసంబులు, కలిసిన యగును!
కావున నా స్థాన మే నాక్రమింప
నే లజ్జ నొంద నో పెద్దపర్వతమ!
నీ వంటి పెద్దదానిని నేను గాను,
నా వంటి చిన్నదానివి నీవుగావు;
నా అంత ఉత్సాహ మున్నదా నీకు!
సామర్థ్యములు వేరు వేరు గావచ్చు-
ఎవరి స్థానములలో వారలే గొప్ప.

అట్టి యేర్పాటు లీశ్వరుడు గావించె
నతిబుద్ధిబలముతో - లోటు లేకుండ
నా వీపుపై నేను నీమాదిరిగను
అడవుల మోయగా లేకున్నయెడల
మఱి నీవు నా రీతి గట్టికాయఁలను,
పట పట పండ్లతో కొఱకగా గలవె?"

ఈ మాదిరి మీరు ఆ చిన్నఉడుతలాగా, స్వల్పులుగా ఉండవచ్చు. నీ ప్రక్కవాడు ఆ పెద్దపర్వతంలాగా పెద్దగా ఉండవచ్చు అయినా నీవు 'నేను అల్పుడను' అని అనుకోవాకు. ఆ చిన్న ఉడుతలాగా తెలివికలిగి ఉండు. నీ శరీరం అత్యల్పమయిందైనా, ఘనశరీరంచేయఁజాలని పని ఒకటి యీ ప్రపంచంలో నీవు చేయవలసివున్నదని మరువకు. అలాంటప్పుడు ఎందుకు నిన్ను నీవు నీచపరచుకోవడం? ఉత్సాహంతో ఆనందంతో జీవించు!

ఒకసారి ఒక పెద్దమనిషివచ్చి తన పై అధికారి తన నెప్పుడూ అగౌరవముగా చూస్తున్నాడని రామునితో చెప్పాడు. నిన్ను నీవు అగౌరవంగా చూచుకోవడంచేతనే నీ పై అధికారి నిన్ను అగౌరవంగా చూచాడని రాముడతనితో చెప్పాడు మన ఆత్మను మనము గౌరవించినట్లయితే. ప్రతివ్యక్తి మనలను గౌరవించితీరుతాడు ఈ చిన్నపుస్తకంమీద ఒకరూపాయి విలువవేస్తే, రెండురూపాయ లిచ్చి ఎవరూ కొనరు. కానీ పాతికరూపాయ లని వెల వెయ్యండి ఆ వెల చెల్లించడానికి ఎవరూ సంశయించరు

అదేమాదిరి మీకు మీరు తక్కువ విలువిస్తే ఎవరూ మీకు ఎక్కువ విలువీయరు. మీకు మీరు ఎక్కువ విలువీయండి. మీ ఆత్మను మీరు గౌరవించండి మీలోని దివ్యత్వాన్ని సంభావించండి! మీలోని బ్రహ్మత్వాన్ని విస్మరించకండి! అప్పుడు ప్రతివ్యక్తీ మిమ్ము లను అదేవిలువతో చూస్తాడు. విశ్వాసము రక్షిస్తుందని జనవ్యవహారం. కానీ బాహ్యాధారాల్లోని విశ్వాసం మిమ్ములను రక్షించదు. మీ బ్రహ్మత్వంలోని విశ్వాసమే మిమ్ము రక్షిస్తుంది. నీలోని బ్రహ్మ

త్వాన్ని నమ్ము! నీలోని దేవత్వములో సజీవ విశ్వాసముంచు! నిన్ను నీ వే రకంగా గౌరవించు! ప్రతివ్యక్తీ నిన్ను గౌరవిస్తాడు.

సరే తన పై అధికారియొక్క దౌష్ట్యాన్ని చెప్పిన పెద్దమనిషి రాముని సలహావిన్నాడు. అదేప్రకారం అతడు తన బ్రహ్మత్వాన్ని తెలుసుకోడానికి కాలం వినియోగింపసాగాడు. క్రమక్రమంగా అతడు నిరంతరం ప్రార్థనచేయడం మొదలుపెట్టాడు. ప్రార్థన అంటే యిక్కడ ఏవో మాటలు కొన్ని వల్లించడంకాదు. ప్రార్థన అంటే బ్రహ్మానుభవం; దివ్యత్వాన్ని తెలుసుకోవడం. ఈవిధంగా అతడు నిత్యప్రార్థన చేయ సాగాడు. తన యజమాని తనను తప్పక గౌరవించడానికి, తనను సరిగా చూడడానికి, బద్ధుడైయున్నట్లు అతడు గ్రహించాడు. ఒకనాడు ఆ పై అధికారి అతనిమీద అసహ్యంగా చిరచిరలాడ మొదలుపెట్టాడు. అప్పుడితడు మెల్లగా అతిమృదుమనోజ్ఞ కంఠంతో యజమానికి ఇలా ప్రత్యుత్తరమిచ్చాడు.

"అయ్యా! నాకంటె మీరు ఎక్కువజీతం గడిస్తున్నమాట నిజమే. నేను చేయని పని మీరు చేస్తున్నారు. మీతో నాకు అవసర మున్నమాట నిజమే. నా స్థానంలో ఇం కెవరినైనా ఉంచుకోకుండా మీరు పనిచేసుకోగలరా? మీరు చెయ్యలేరు. అందుచేత మీతో నా కెంత అవసరమో నాతో మీకంత అవసరమై యున్నది నిజానికి మొదట మీరే నన్ను కోరుకున్నది. ఈ స్థానంలో ఒక ఉద్యోగి మీకు కావలసివచ్చి నాకోసం కబురంపారు. నేను మిమ్ములను సేవించడం లేదు. నా అవసరాలను నా కోరికలను నేనే సేవించుకొంటున్నాను. నేను మీకు సేవకుణ్ణిగాదు. నేను నాసేవకుణ్ణే. నేను ఎవరికీ సేవకుడను గాదు. సేవ అనేది సరియైన అర్థంలో మంచిదే."

కాబట్టి ఈ ప్రపంచములో నీవు ఎవరిమీదా ఆధారపడియుండ లేదు. తన స్వవాంఛలమీద ఆధారపడియున్నప్పుడు ఏ సేవకుడూ, ఏ యజమానిమీద ఆధారపడడంలేదు. బాహ్య ఆధారం భ్రమ. నిజమైన ఆధారం మనస్సాత్మే. అందుచేత మీస్వాతంత్ర్యాన్ని అనుభ వించండి! తెలుసుకోండి! మీరు భగవంతునిమీద, క్రీస్తుమీద,

మహమ్మదుమీద, బుద్ధునిమీద, ఇంకా యితర మహాత్ములమీద ఆధారపడియున్నట్లు తలపవలసిన అవసరమేమిటి? మీ రందరూ విముక్తులు! ఈముక్తిభావన మీకు ప్రసన్నత చేకూరుస్తుంది.

ఒకప్పుడు ఒక ఏషియా దేశపు రాజుదగ్గరకు ఒకమనిషి నేరస్థుడుగా తీసుకరాబడ్డాడు. ఎందుకంటే, అతడు రాజుకు వినయంగా నమస్కరించలేదట. ప్రజలు తనకు నమస్కరించ నప్పుడు, ఆ వృద్ధరాజుకు ఆగ్రహము వస్తుంది. నేరస్థుణ్ణి చూచి రాజు "నేనెంత పరాక్రమశాలినో ఎంత పట్టుదలగల చక్రవర్తినో నీకు తెలియదా? నేను నిన్ను చంపుతానని తెలియదా? ఎంత సాహసమున్నది నీకు!" అని గర్జించాడు. ఆ మనిషి రాజు ముఖాన ఉమ్మివేసి ప్రతిక్రుద్ధుడై నిప్పులు క్రక్కే చూపుతో యిలా అన్నాడు. "నీవు పసి పిల్లలు ఆడుకొనే బుద్ధిహీనమైన బొమ్మవు. నన్ను చంపడానికి నీకు శక్తిగానీ, అధికారంగానీ లేదు. నాకు నేనే ప్రభువును. నీ ముఖంపై ఈ రకంగా ఉమ్మివేయాలంటే, ఈ పని నాశక్తిలో ఉన్నది. నిన్ను నిందించడం నా శక్తిలోని పని. కొరతకు ఈ శరీర మర్పించడం నా శక్తిలోనిపని, నా దేహానికి నేను ప్రభువును. నీ అధికారం నా అధికారము తరువాతది. నా అధికారమే ప్రధానమైంది." అదే మాదిరి నిరంతరం నీకు నీవే ప్రభువు వని సంభావించి తెలుసుకో! నీ ఆత్మ కేంద్రము నుంచి వస్తువులను చూడు. వస్తువులను ఇతరుల కండ్లతో చూడవాకు! నీ స్వాతంత్ర్యాన్ని సంభావించు! దేవాది దేవుడవు నీ వని, విశ్వనాథుడవు నీవని సంభావించు! తత్త్వమసి!

ప్రజలెందుకు దుఃఖపడుతున్నారు? స్వాత్మజ్ఞానము లేకపోవడం చేత మానవులు బాధపడుతున్నారు. తమలో ఉన్న పరమాత్మను మరిపింపజేసే అజ్ఞానంచేత ఇతరుల అభిప్రాయానుసారం తమ్ము సంభావించుకొనేలాగు చేసే అజ్ఞానంచేత మానవులు దుఃఖపడుతున్నారు. ఎంతవరకైతే, ఈ అజ్ఞానం ఉంటుందో, ఎంతవరకైతే మానవుడు తనలోని బ్రహ్మత్వాన్ని తెలుసుకోడో అంతవరకూ అక్కడ నిరంతరం బాధ కాపురం చేస్తుంటుంది.

అజ్ఞాన మనేది చీకటి. దట్టమైన చీకటి అలముకొన్న గదిలోకి నీవు వెళ్ళితే గోడకు తగలడమో లేకుంట దేనికో తల తగిలి గాయం కావడమో తప్పదు: హిందూదేశంలో దీపాలు పెట్టుకోడానికికూడా శక్తిలేని పేదజనులు కొందరున్నారు. వారి నివాసము గుడిసెల్లో. రాముడు కొన్నిసార్లు చూచాడు : ఇంటి యజమాని చీకటిపడి రాత్రికి యింటికి వస్తాడు. ఆ యజమానికి భార్యమీదనో, కొడుకులమీదనో ఎప్పుడు కోపము వస్తుంటుంది. ఈ బల్ల ఇక్కడ ఎందుకు పెట్టావు? నా మోకాలును తగిలి గాయంపడింది. ఈ కుర్చీ ఎందుకు పెట్టావిక్కడ ? నా మోచేయి విరిగేటంత అయింది'' అని యజమాని అరుస్తుంటాడు. మన అవస్థ ఈ మాదిరిగానే ఉన్నది. ఈ బాధానివృత్తికి ఏదైనా మార్గంలేదా ? లేదు. ఎవరూ ఈ బాధ పోగొట్టలేరు. ఆ బల్లగానీ, కుర్చీగానీ భార్యతీసి ఇంకోమూలను సర్దుతుంది. కానీ చీకటిలో భర్త తిరిగీ దానికి కొట్టుకుంటాడు. చీకటి ఎంతవరకైతే ఉంటుందో, అంత వరకూ మోకాలో, మోచెయ్యో, తలో, మెడో దేనికో దానికి తగిలి అవస్థపడక తప్పదు. ఒక దీపం వెలిగించు; అదిచాలు. ఎక్కడ వస్తువులక్కడే ఉండనియ్యి. నీకేమీ బాధ ఉండదు. యథేచ్ఛగా నిరపాయంగా నీవు నడువవచ్చు.

ఈ ప్రపంచంలోకూడా అంతే. నీ బాధ నివృత్తికావాలంటే నీ పరిసరాలను సర్దడంలో నీవు ఆధారపడకూడదు. జీవితంలోని నీ బాహ్యా పరిస్థితి మీద ఆధారపడకూడదు. దుఃఖనివృత్తికావా లంటే నీలో ఉన్న ఆత్మసూర్యుని ప్రకాశింపజేయడంమీద ఆధారపడు. సమస్త మానవులు చీకటి గదిలో వస్తువులు సర్దినమాదిరి, ప్రపంచంలోని వస్తువులను అక్కడివి ఇక్కడికి, ఇక్కడివి అక్కడికి మార్చడంచేత, లేదా ధనమార్జించో, పెద్ద పెద్ద గృహాలు కట్టుకొనో, ఎవరి పాలా లైనా సంపాదించుకొనో దుఃఖ నివృత్తిచేసుకోను ప్రయత్నిస్తున్నారు. మీ గదిలోకి దీపము తేవడంవల్లమీలో దీప ప్రకాశం ప్రసరింప చేయడంచేత, మీ హృదయాంతరాల్లో జ్ఞానజ్యోతిని వెలిగించడంచేత మాత్రమే మీరు దుఃఖనివృత్తి చేసుకోగలరు. చీకటిని పారద్రోలండి. మీకింక ఏ అపాయం రాకదు.

హిమాలయారణ్యాలలో, పూర్వం ఒకజాతి ఆటవికులున్నారు. వారికి అగ్ని చేయడం తెలియదు. ప్రపంచములోని అతిప్రాచీనకాలపు ఆరణ్యకులు నిప్పు వెలిగించరు. నిప్పుచేసే విధానంకూడా వాండ్లకు తెలియదు. ఎండిన చేపలు తినేవాండ్లు. వాళ్లుతినే ఆహారం ఎండవేడిమిలో తప్ప, వండుకునేవాండ్లుకారు. సూర్యుడు అస్తమించగానే పండుకునే వాండ్లు. సూర్యోదయంకాగానే లేచేవాండ్లు. అందుచేత భౌతికమైన తమస్సుతో వారికి అవసరం లేకుండాపోయింది. వారు నివసించే ప్రదేశానికి దగ్గరగా ఒక పెద్దగుహావుంది. ఈ గుహాలో అతి పూజనీయులైన తమ పూర్వీకులు కొందరున్నారని ఆ అరణ్యవాసుల నమ్మకం. నిజానికి వారి పూర్వీకులలో కొందరు ఆ చీకటిగుహాలోకి వెళ్ళి చనిపోయారు. గుహాలో దట్టమైనచీకటి వుండడంచేత, ఆ పోయిన వ్యక్తులు బురదలో దిగబడో గుహాలోని ఎగుడుదిగుడు బండలకు తలకాయలుతగిలో చచ్చిపోయారు. ఆ వనవాసులకు ఈ గుహా చాలా పవిత్రమయిందనినమ్మకం. కానీ వారికి చీకటితో ఎక్కువ పరిచయం లేకపోవడంచేత, ఆ గుహాలోని చీకటిని ఒకపెద్ద భూతనాయకునిగా తలచేవారు. ఎలాగైనాసరే ఆ పెనుభూతాన్ని అక్కడనుంచి వెడలగొట్టాలని వారి కోరిక. (సభలో నవ్వు)

ఈ మౌఢ్యానికి మీరు నవ్వుతున్నారు. కాని నేటి నాగరికపు ప్రజలు యింతకంటె ఎక్కువ మౌఢ్యంలో వున్నారు. సరే మంచిది. ఎవరో ఒకరువచ్చి, ప్రార్థిస్తూ గుహాదగ్గరకు పోయినట్లైతే రాక్షసి పోతుందని చెప్పారు. అందుచేత వాండ్లందరు గుహావద్దకుపోయి కొన్ని సంవత్సరాల కాలము గుహాముందు సాష్టాంగదండప్రణామము చేస్తూ వండుకున్నారు. కాని ఈ వినయానికి రాక్షసిపోలేదు. తరువాత కొంత కాలానికి ఒకగురువచ్చి ఆ భూతంతో యుద్ధంచేస్తే పోతుందని చెప్పారు. ఆమాట విని, ఆ ఆటవికులందరూ రకరకాల బాణాలు తీసుకున్నారు. కఱ్ఱలూ, రాళ్ళూ ఏవేవేమిటో వాళ్ళకున్న ఆయుధాలన్నీ తీసుకున్నారు. గుహాముందు నిలుచోని గుహాలోకి బాణాలు విసిరారు. కఱ్ఱలు విసిరారు, రాళ్ళు విసిరారు. ఈ రకంగా యుద్ధంచేశారు. కాని చీకటి కదలలేదు. పోలేదు. అప్పుడు ఇంకొకడువచ్చి "ఇదికాదు

మార్గం. ఉపవాసంచేయాలి. మీరు ఉపవాసాలుచేస్తే ఆ చీకటి పోతుంది. ఇన్నాళ్ళనుంచి, మీరు సరియైన పనిచేయలేదు. ఇప్పుడు చేయవలసిన పని ఉపవాసం.” పాపమా పిచ్చివాండ్లు ఉపవాసాలు చేశారు, చేశారు. కాని చీకటిపోలేదు. ఆ రాక్షసి గుహను వదలలేదు. తరువాత ఇంకొకడువచ్చి, దానధర్మములు చేయండన్నాడు. అదే ప్రకారం వాండ్లకున్నవన్నీ పంచిపెట్టారు. అయినా భూతం గుహను వదలలేదు. చిట్టచివరకు ఒకమనిషివచ్చి తన సలహాప్రకారంచేస్తే భూతం గుహను వదలిపోతుందని చెప్పాడు. ఆ సలహా ఏమిటో అడిగారు. ఆ మనిషి “మంచి లావులావుబొంగులు కొన్ని తీసుకరండి. కాస్త యెండుగడ్డి, కొంచెము చేపనూనె తీసుకురాం” డన్నాడు. తరువాత ఆ మనిషి ఒక పొడుగాటిబొంగుకు యెండుగడ్డి మొదలయినవి చుట్టాడు. చెకుముకురాళ్ళుకొట్టి మంటచేశాడు. మంటమండింది. ఆ ఆటవికులకు ఈ దృశ్యం అతివిచిత్రంగా ఉన్నది. నిప్పు అనేది చూడడ మిదే వాండ్లకు మొదటిసారి. ఆ మనిషి, ఈ మండుతున్న యెదురు కఱ్ఱలు తీసుకొని గుహలోకి పరుగెత్తండి. లోపలకుపోయి ఆ చీకటి రాక్షసుని చెవులుపట్టుకొని బయటికిగుంజి తీసుకురాండి” అని ఆదే శించాడు. కాని వాండ్లు అతనిమాటలు మొదటనమ్మలేదు. నమ్మక ఈ విధంగా అనుకున్నారు: “ఇతడు మనకు క్రొత్తవాడు. గట్టిగా ఇతనిమాటలు నిజంకావు. ఇతని సలహా కొంచెంకూడా సరియైనది కాదు. మన మీ మాటలు వినకూడదు. మన తాత ముత్తాతలు ఏమని చెప్పారు? వాండ్లమాటలే నిజంకాలేదు. ఇతని మాటలు నిజమేం?” అని ఆ నిప్పు ఆర్పివేశారు. కాని అంతగా అసూయలేని కొందరు ఆ సలహాప్రకారం కాగడాతీసుకొని గుహలోనికివెళ్ళారు. చిత్రం! రాక్షసుడు లేడు. ఆ గుహలోకి యెంతోదూరంపోయారు. అది చాల పొడవైన గుహ. ఎంతదూరంపోయినా, రాక్షసుని పొళుకువ కనపడలేదు. భయపడి ఒకవేళ సన్నటి సొరెల్లో దాక్కున్నాడేమో నని కన్నాలలోకి కాగడాలుదోపారు. కాని రాక్షసుని పొళుకువలేదు.

ఇదేమాదిరి అజ్ఞానమనే చీకటి, పెనుభూతం మీ హృదయ గుహలో ప్రవేశించి, దాన్ని పాడుచేసి నరకంగా చేస్తున్నది. సమస్త

మైన ఆందోళన, సమస్తమైన దుఃఖం, సమస్తమైన బాధ నీలోనే ఉన్నది. వెలుపల లేదు. ఒకడు మిమ్ములను దూషిస్తాడనుకోండి. నిందిస్తాడనుకోండి. అలాంటి మానవుడు నీకొక అపాయకరమైన విష మిళిత భోజనపదార్థాన్ని తయారుచేస్తున్నాడన్నమాట. అది లోపలికి భుజించినట్లయితే నీ కపాయంచేస్తుంది. కానీ దాన్ని స్పృశించకపోతే, దాన్ని లోపలికితీసుకోకపోతే నీకేమీ అపాయంచేయలేదు. రాముడీ బాహ్యావిషయాలను ఎప్పుడూ లోపలికితీసుకోడు. రాముడు వీధుల్లో వెళ్ళేటప్పుడు తరచు ప్రజలు అననుకూలవాక్యాలుమాట్లాడుతుంటారు. కానీ వాటిని నిజమని నమ్మి స్వీకరించనప్పుడు అలాంటివాక్యాలు ఏమీ చేయలేవు.

వేదాంతదృష్ట్యా బ్రహ్మవేత్త అయిన మానవుడుమాత్రమే ఇట్టి ప్రాపంచిక నిందాపనిందలనే విషమిళిత భోజనపు విందులలో ఎన్నటికీ పాల్గొనని వాడు! అలాంటి మానవుడుఎన్నడూ బాధపడడు. అత డెన్నడూ చలించడు. సత్యాత్మస్వరూపులుకాండి! మీలోనిదివ్యత్వంలో ఐక్యం కాండి! పరులను నిందించే జనులపైన దయకలిగి ఉండండి. అయ్యో! మేము పతితులం, భ్రష్టులం, పడిపోయినామని - మీరు విచారపడకండి! మీలోనిదివ్యత్వాన్ని సంభావించండి! సంభావించండి! మీలోని దివ్యత్వంలో జీవించండి! తదితరమైనదంతా చీకటి. తదితర మైనదంతా అజ్ఞానం. మీలోని చీకటే మీ శోకనరకగహ్వరాన్ని సృష్టిస్తున్నది. ఆ చీకటినుండి విముక్తిపొందడానికి మీరు ఎన్నో ప్రయత్నాలు చేయవచ్చు. కానీ వాటివల్ల ఏమీ ప్రయోజనం లేదు.

మూడువందల ముప్పైమూడుకోట్ల క్రీస్తులు ప్రపంచంలో పుట్టి నప్పటికీ, ఏమీ ప్రయోజనముండదు. నీలోనికి చీకటిని నీవు పారద్రోల డానికి ఉద్యుక్తుడివి కాకపోతే, ఎవరివల్లా ఏమీ లాభముండదు. ఇత రులమీాద ఆధారపడవాకు. ఈ చర్చిలో (గుడి) చేరడం, ఆ చర్చిలో చేరడం ఈ సంఘంలో చేరడం, ఆ సంఘంలో చేరడం, ఈ క్రీస్తును కొలవడం, ఆ కృష్ణుణ్ణి కొలవడం, అదనీ యిదనీ భ్రాంతిపడడం నిష్ప్రయోజనం. మీారేమైనా చెయ్యండి. ఏమీ లాభముండదు. విముక్తిపథ మొక్కటే! అది జ్ఞానజ్యోతి! సజీవజ్ఞానమే జ్యోతి! ఆ

మహాజ్యోతి మీలోఉన్న బ్రహ్మాత్మమే! ఇదే శోకమోహనివృత్తి కరమైంది! ఇదివినా ఇంకొకటిలేదు.

స్త్రీ పురుష మహాజనరూపంతో ఉన్న ఓ దివ్యాత్మా! సర్వుల రూపంతో ఉన్న ఓ నా సత్యాత్మా! ఈ సమస్త శరీరాల రూపాల్లో ఉన్న ఓ నా ప్రియమైన సత్యాత్మా! ఈ సమస్త దేహరూపాల్లోఉన్న ఓ నా దివ్యమాతా!! ఈ సమస్త శరీరరూపాల్లోఉన్న ఓనా దివ్యాత్మా! దృశ్యమానములైన ఈ సమస్త వివిధ దేహరూపాలు శూన్యసాగ రంలో మిళితమైపోయేటంతగా పరమసత్యమును సందర్శించడమే జ్ఞాన జ్యోతి.

జ్ఞానతేజం, సత్యజ్ఞానం ఈ సమస్త దేహరూపాలను చంచల మైనవానిగా క్షణభంగురాలుగా చేస్తుంది. బ్రహ్మవేత్తమైన వాని దృష్టిలో వివిధ దేహరూపాలు కనపడవు. అతడు అహంకృతిని, ఈ దృశ్యదేహాన్ని ఎవనిలో చూడడు. ఎవనిలో చూచినా, ఒక్క భగ వంతునే సందర్శిస్తాడు. బ్రహ్మవిదునికి ఈ దృశ్యమానస్వరూపా లన్నీ వట్టి మాయ. చీకటి. అజ్ఞానం.

అజ్ఞాననివృత్తి అంటే భగవంతుని దర్శించడం, సత్యాత్మను సందర్శించడము, పరమసత్యాన్ని మాత్రమే సందర్శించడము, ఏకైక బ్రహ్మాత్మాన్ని తెలుసుకోవడం, సమస్త భయాందోళనలకు అతీతులు కావడమైయున్నది.

ఓ దివ్యాత్మమా! బ్రహ్మాత్మమా! ఈ సమస్త శరీరాల్లో వెలుగు తున్న ఓ నా ప్రియతమా! ప్రియాతిప్రియా! పరమేశ్వరా! ఇతరుల దృష్టిలో శత్రువులుగా కనబడుతున్న వారందరూ, నా సత్యమైన పరమా త్మయే. బాహ్యదేహ వికారాలుచూడవద్దు. అహంకృతిని చూడవద్దు. సమస్తదేహాల్లో సర్వేశ్వరుని దర్శించు. నీ దేహంలోకూడా దివ్య తేజం ఉన్నది. ఆ దివ్యతేజం నిన్నూ, సమస్తజగత్తులనుకూడా నీ స్వస్వరూపంగా చూచేలాగు, భగవంతునిగా చూచేలాగు దివ్యదృష్టిని ప్రసాదిస్తుంది. భగవంతుడు అనేది నా సత్యాత్మకు నామాంతరం. ఆ 'నేను' ఆ సత్యాత్మ సర్వాంతర్యామి. దీన్ని తెలుసుకోండి, దీన్ని

సంభావించండి. దీన్ని జీవించండి. సమస్త కారాగారకుడ్యాలు, సమస్త కష్టాలు, సమస్త బంధాలు సమస్త అవరోధాలు తునాతునకలై వినాశమై అదృశ్యమైపోతాయి. ఎట్టి దివ్యదర్శనం! ఎట్టి సత్యం! ఎట్టి అద్భుతమైన సత్యం!!! ఇది వర్ణనాతీతమైనది. వాక్కు ఈ సత్యం దగ్గరకు చేరలేవు. దీనిని వర్ణించే వాఙ్మయంలేదు. ఇది నిజం. అయితే మీకు కావాలంటే మీరు దానికోసమై అన్వేషించినట్లైతే, అది మీకు లభించితీరుతుంది!

మనం గ్రహశాస్త్రం చదివేటప్పుడు, గ్రహగణితం వేస్తాము. నక్షత్రాలకు నక్షత్రాలకు మధ్యఉన్న దూరాన్ని, గ్రహాలకూ నక్షత్రాలకూ మధ్యఉన్న దూరాన్ని గణించేటప్పుడు ఈ భూమి ఒక గణితబిందువుగా, ఒక శూన్యంగా పరిగణించబడే కొన్ని మహాసంఖ్యలు మనకు వస్తాయి.

అదే ప్రకారం నీవు సత్యసందర్శనం చేయడానికి ప్రారంభించినప్పుడు పరంజ్యోతివి నీ వని సూర్యులకు సూర్యుడవు నీ వని, దేవాది దేవుడవు నీ వని, ప్రభువులకు ప్రభువు నీ వని ధ్యానం చేస్తున్నప్పుడు ఈ గ్రహనక్షత్రా లన్నీ, ఈ మహాగంభీరమైన నక్షత్రపథాలన్నీ అసలు లేనివానిగా అదృశ్యమవుతాయి. ఈ మహాసత్యాన్ని నీవు తెలుసుకొన్నప్పుడు, ఈ మహాసత్యాన్ని అనుభవించినప్పుడు సంభావించునప్పుడు - ఓహో, ఈ ప్రాపంచికమైన 'బూచులు' మనలను ఏ రకంగా భయపెట్టగలవు?

ఆ మహానక్షత్రాలముందు ఈ భూమండలం శూన్యంగా మారినట్లయితే, ఇక యీ సూర్య సూర్యుని ముందు ఈ పరంజ్యోతిముందు, నా సత్యాత్మముందు ఈ ప్రాపంచకదుఃఖాలు, ఆందోళనలు ఏ రకంగా కనపడగలవు?

సత్య సందర్శనం చెయ్యి. సత్యాన్ని జీవించు. పూర్ణశ్రద్ధతో సత్యాన్ని సంభావించు. ని న్నేదీ సంచలింపచేయ లేదు. కోటానుకోట్ల సూర్యగోళాలు, ఆరి బొగ్గులై రాలిపోనీ! ఆ గణితచంద్రగోళాలు కరిగి శూన్యంలో కలిసిపోనీ! బ్రహ్మవేత్త-జ్ఞానజ్యోతిర్మయుడైన మానవుడు-

మేరుస్థిరుడై సంచలించడు. అతని కే అపాయం అంటుతుంది ? అతన్ని వ్యధపెట్టగల శోక మే మున్నది ?

ఓహో మహాద్భుతం! అలాంటి గంభీరమైన, అలాంటి అనంతమైన, అలాంటి అఖండమైన దివ్యప్రతిభ !! ఆ శక్తే నీ సత్యాత్మయై యున్నది. అది ప్రజలచేత మఱచిపోబడింది.

ఆ సూర్యుడు ఆ అనంతసూర్యుడు ఒక చిన్న మేఘాచ్ఛాదనము చేత మూయబడ్డాడు. అలాంటి మహత్ప్రతిభగల అద్భుతసత్యం ఇలాంటి చిన్న, అత్యల్పమైన అజ్ఞానమేఘముచేత కప్పబడింది. ఓహో! అలాంటి యీ బలహీనకరమైన అజ్ఞానయవనికను పటాపంచలు చేయండి. "త్రిలోకాధిపతినైన విశ్వనాథుడను నేను! అఖండమైన, అనిర్వాచ్యమైన పరంజ్యోతిని నేను!" అని తెలుసుకో. తత్త్వమసి! తత్త్వమసి! ఆ పరబ్రహ్మావు నీవు. ఓహో! ఆ సత్యానుభవం నీవు పొందినప్పుడు సర్వమూ ఎంత విస్పష్టంగా, ఎంత పరిశుద్ధంగా కనపడుతుంది !

రాముడు చరిత్రనుంచిగానీ, గొప్పవారి జీవితాలనుంచిగానీ మీ కేమీ చెప్పడంలేదు. స్వానుభవమునుంచి గ్రహించిన దానిని రాముడు మీకు చెపుతున్నాడు. ఈ సత్యాన్ని మీ స్వానుభవం ద్వారాకూడా తెలుసుకోవచ్చు.

రాముడు చెపుతున్నాడు :- మనము సత్యసందర్శనము చేసినప్పుడు, మనము సత్యానుభూతి పొందినప్పుడు, ఈ ప్రపంచమంతా మన కొక మనోహరవైకుంఠంగా మారుతుంది. అప్పుడు మనకు శత్రువులు లేరు. భయాలు లేవు. బాధలు లేవు. ఆందోళనలు లేవు. అపాయాలు లేవు. నిజం! నిజ మిది !

మన మొక ఉన్నతప్రదేశముమీద ఉన్నప్పుడు క్రింది ప్రదేశములో ఉన్న ఎత్తు పల్లముల భేదాలు కనుపించకుండా పోతాయి. క్రిందఉన్నప్పుడు ఒక యిల్లు పెద్దదిగా, ఒక యిల్లు చిన్నదిగా, ఒక వీధి ఎత్తుగా, ఒకవీధి పల్లంగా కనబడుతాయి. కాని మహోన్నతమైన

పర్వతశిఖర మెక్కిచూస్తే, భేదాలు మనకు కనబడవు. అదేమాదిరి, దైవప్రతిభాశిఖరాలకు మనము అధిగమించినప్పుడు, మనము సత్యాత్మ యొక్క అనుభూతిపొందినప్పుడు, మనలోని పరమసత్యమును తెలుసు కొన్నప్పుడు, శత్రుమిత్రత్వా లనే భేదాలు, లాభా లాభాలనే భేదాలు, సర్వవైరుధ్యాలు అదృశ్యమౌతవి. ద్వంద్వ భ్రాంతివల్లనే మనకు అశాంతి కలుగుతున్నది. దుఃఖం కలుగుతున్నది. ద్వంద్వ భ్రాంతికి అతీతులుకాండి! పరమసత్యం సత్య మవుతుంది. సర్వవిభేదాలు అదృశ్యమైపోతవి. ఈ అభేదత్వమునే వేదాంతము, "ఏకత్వం" అని పేర్కొన్నది. "బ్రహ్మసత్యం; జగన్మిథ్య". పరమాత్మయే, పరమ సత్యం; ప్రపంచమంతా మాయ.

నీ సత్యాత్మను తెలుసుకో. ఈ సమస్తప్రపంచమూ అదృశ్యమై, అసత్యమై, పరమాత్మయొక్కడే సత్యంగా కనబడేటంత మహోత్తమ స్థితికి అధిగమించగలిగేవరకు, పరమాత్మను తెలుసుకో! నీ సోదరుని, అతనిలోని దివ్యత్వాన్ని తెలుసుకోకుండా, మానవుడా అని సంబో ధించడంవల్ల ఎంతనేరము చేస్తున్నారు మీరు! ఇది అతనిలోని దైవత్వాన్ని హత్యచేయుడమై యున్నది.

నేరాలు అనేకమున్నాయి - నరహత్య అనీ, శిశుహత్య అనీ స్త్రీహత్య అనీ. కానీ సర్వంలోని, సర్వులలోని బ్రహ్మత్వాన్ని సంభా వించకపోవడంచేత, బ్రహ్మహత్యా నేరం దైవహత్యా నేరం మీరు చేస్తున్నారు. నీ వొకమానవుని తండ్రి అని, తల్లి అని, కుమారుడని, స్నేహితుడని, శత్రువని అతనిలోని దైవత్వాన్ని సంభావించకుండా పిలుస్తున్నప్పుడు నీవు దైవత్వాన్ని చంపేటంతగా మాటలు ఉప యోగిస్తున్నా వని గ్రహించు. శరీరం - బాహ్యరూపం - లేక బాహ్యమాయారూపం - లోపలఉన్న భగవంతుడు మరువుకు వచ్చే టంతగా అతి ప్రాముఖ్యమైనప్పుడు, నీవు పతనమవుతావు. నీలో నున్న దైవత్వాన్ని ఎప్పుడైతే నీవు చంపడానికి ప్రయత్నిస్తావో, నీవు వినాశనం పొందుతావు. ఈ బ్రహ్మహత్యే, భగవంతుని చంప డమే అజ్ఞానమైయున్నది. ఈ అజ్ఞానమే ఈ ప్రపంచశోకానికి మూలకారణం. ప్రజలు దీన్ని సాధనలో చూడకపోతే ఈ సత్యము

వారి కొలకలగానే ఉండిపోతుంది. ఇదినిజం. దీన్ని తెలుసుకోండి. మిమ్ముల మీరు శాంతిలో ఉంచుకుంటారు. ఈ సత్యాన్ని సంభావించండి. దీన్ని జీవించండి. మీ రొకవిచిత్ర మహాద్భుత ప్రపంచంలో జీవించడం చూస్తారు. సమస్త శక్తులు మిమ్ముల సేవించడం చూస్తారు. ఈ సత్యాన్ని సంభావించండి! అనుభవించండి! సమస్త సూర్యులు, నక్షత్రాలు సమస్త చంద్రగోళాలు మీ ఆజ్ఞలను శిరసా వహిస్తాయి. దీన్ని మీరు తీవ్రంగా పరీక్షించి చూడవచ్చు.

సమస్తవిశ్వంతో తన ఏకత్వాన్ని నిరంతరం అనుభవించగల మానవుడే, నిరంతరం తన సత్యమైన బ్రహ్మత్వాన్ని ఉపాసించగల మానవుడే శాంతిగల ధన్యుడు.

సంస్కృతంలో ఒక శ్లోకమున్నది. దాని అర్థమిది: "ఎన్నో శతాబ్దాలనుంచి గుహల్లోకూడిన చీకటి, దీపం తెచ్చినట్లయితే తత్క్షణమే పోయినట్లు జన్మాది అంధకారం కూడుకపోయిన మానవుని హృదయంలోకూడ ఈ పరమసత్య మనే ఈ బ్రహ్మజ్ఞాన మనే దివ్యదీపంచేత తృటిలో సమస్త తమస్సు ప్రీలిపోతుంది."

రామునికిది నిత్యమూ స్వానుభవంలో ఉన్నది. ఏ మానవునిలో నైనాసరే, ఏ వస్తువులో నైనాసరే, అతడు భగవంతుని దర్శించినప్పుడు అంటే మానవస్వరూపమును దైవస్వరూపంగా చూచినప్పుడు, ఇంకొకరకంగా చెప్పవలెనంటే వ్యక్తిత్వాన్ని చూడక, వ్యక్తిలోని పరమసత్యాన్ని చూచినప్పుడు, అతడు బాధపడడు. కానీ, శరీరాన్ని మాత్రమే చూచినప్పుడు, వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని మాత్రమే చూచినప్పుడు రాముడు బాధపడతాడు. గతించిన యిలాంటి జయాపజయ సాధనాలచేత రాము డిప్పుడు కలలోనైనాసరే సమస్త జీవులను, సమస్తపదార్థాలను భగవద్రూపంగాతప్ప వేరుగా చూడడానికి లవలేశంకూడా అవకాశం లేనంత వివేకశిఖరాల కధిగమించాడు. మిమ్ములను సతాత్మగా చూడడంచేత, తన స్వాత్మగా మిమ్ములను సంభావించడముచేత, సర్వభూతాలను తనరూపాలుగా సంభావించడముచేత, సర్వదేహాలను తనవిగా అనుభూతి పొందడంచేత, మహాత్మా సర్వ

భూతాని అన్న దివ్యానుభూతి పొందడంచేత, సమస్త భూతాలు అదే మాదిరి రాముని సంభావించవలసి వున్నవి.

పూర్వము మజ్నూ అనే పేరుగల ఒక మానవుడున్నాడు. అతనికి ప్రేమిక చక్రవర్తి అని బిరుదు. అతను ప్రేమించినట్లు ఎవరూ ప్రేమించలేదు. కానీ అతని ప్రేమ వ్యక్తిత్వసంబంధమైంది. తన ప్రియురాలైన ఒక స్త్రీ సంబంధమైంది. అందుచేత అత డామెను చూడలేక పోయాడు.

మీకు కోరికలున్నట్లయితే, మీరు కోరికలు ఫలించాలనుకున్నట్లయితే మీరా కోరికలను వదలాలి. మీరా వాంఛలకు అతీతులు కావాలని రాముని నిర్వచనం. పాప మీ పిచ్చివానికి ఈ రహస్యం తెలేదు. అయినా ప్రపంచంలో ఆదర్శప్రేమికు డతడు. తన ప్రియురాలి మీది ప్రేమచేత అతడు వికలుడై నైరాశ్యంచేత పిచ్చివాడై పోయాడు. పాప మా పిచ్చిరాజకుమారుడు తనతండ్రి యిల్లువదలి అడవికి వెళ్లి పోయినాడు. ఒక గులాబీకనపడితే, అది తన ప్రియురాలని పరుగెత్తేవాడు. దేవదారువృక్షాన్ని చూచి, తన ప్రియురాలనిపోయి కౌగిలించుకొనేవాడు. ఒక లేడిదగ్గరకు పరుగెత్తి తన ప్రియురాలని సంభావించేవాడు. ఇదీ అతని భావన. ఈ దేహాలన్నిటినీ తనప్రియురాలి దేహంగా మార్చుకొన్నా డతడు. తన ప్రియురాలిరూపమే అతనికి సర్వత్రా గోచరించింది. అయితే అతని ప్రేమితవస్తువు భౌతికమైంది. అందుచేత అతడు బాధపడ్డాడు.

రాముని సందేశ మిది:- "అతనిలాగానే ప్రేమించండి. కానీ మీ ప్రేమవిధానం సత్యాత్మమై ఉండాలె. భగవంతుడై యుండాలె" సమస్తప్రపంచం ఆనందాన్వేషణలో కాదా ఉన్మత్తమైంది? ఆ ఆనందం భగవంతుని నామాంతరంకాదా? ఈ పిచ్చివాడు పాపం నిజమైన ఆనందం-అంటే-భగవంతుడు - ఎక్కడ ఉంటాడో తెలుసుకోలేక పోయాడు. చెట్లల్లో, మృగాల్లో, పూలల్లో తన ప్రియురాలిపైన ప్రేమను దర్శించిన మజ్నూలాగా ఎవడు పరమసత్యాన్ని దర్శించగలడో అతడు ధన్యుడు. ఇట్లు ఉన్మత్తుడై అడవిలో తిరిగి తిరిగి పాప

మా పిచ్చివాడు ఒకచోట స్మృతివిహీనుడై పడిపోయాడు. అతనితండ్రి అతణ్ణి వెతుక్కుంటూ చివరకు అతడు పడిపోయినచోటికి వచ్చాడు. తన నిర్భాగ్యకుమారుని లేవనెత్తి, ముఖముతుడిచి, తండ్రీ కన్నీళ్లు కారుస్తూ యిలా అన్నాడు. "ప్రియకుమారా! నన్ను గుర్తించావా?" మజ్నూ ఆ మాటలు విని వెర్రి వెర్రి చూపులతో పారచూచాడు. అలాగే చూచాడు చూచాడు. అతనికి ప్రపంచంలో ఇంకొకవస్తువే లేదు. మజ్నూ శరీరంలో రోమ రోమమూ "తండ్రి ఏమిటి? తండ్రి ఏమిటి?" అని నినదిస్తున్నది. తండ్రి అప్పు డన్నాడు:- "నాప్రియ కుమారా! నేను నీ తండ్రిని. నన్ను నీవు గుర్తించలేదా?" మజ్నూ అన్నాడు: "తండ్రి అంటే ఏమిటి?" అంటే అర్థం–నా ప్రియురాలు తప్ప ప్రపంచంలో ఇంకొకటి ఉన్నాదా అని.

బ్రహ్మజ్ఞానమంటే – ఈ మజ్నూ తన భౌతికవస్తువుమీద రక్త మాంసాస్థికావికారమైన ఒక శరీరంపైన చూపించిన ఆ ప్రేమనే పరమసత్యముమీద చూపడం. నీ వా మహాభక్తి '(దివ్యప్రేమ)' శిఖరానికి అధిరోహించినప్పుడు నీ తండ్రిలో, నీ తల్లిలో, సర్వుల్లో భగవంతునితప్ప వేరే నీ వితరమును చూడలేని ఆ మహాస్థితికి నీవధిగమించినప్పుడు, నీ భార్యలో భార్యనుగాక, దేవుని నీవు చూడగలిగినప్పుడు, నీవు తప్పక దేవుడవే అవుతున్నావు. అప్పుడు, నీవు నిజంగా భగవంతుని సాన్నిధ్యమందే ఉంటున్నావు

మజ్నూ బ్రతికియున్నంతకాలం, తన ప్రియురాలినిచూడలేకపోయాడు. కవి కథాసందర్భంలో ఇట్లు చెపుతున్నాడు: మజ్నూ, పరలోకంలో భగవత్సన్నిధికి తేబడ్డాడు. భగవంతు డతన్నిచూచి యిలా అన్నాడు. "ఓ అవివేకీ! ఎందుకంత నీవు భౌతికమైన అస్థిరపదార్థాన్ని ప్రేమించావు? ఒక స్త్రీని ప్రేమించడంలో వృథాచేసిన నీ ప్రేమలో ఒక లవలేశమయినా, నామీద చూపియున్నట్లయితే, నిన్ను స్వర్గంలో "ఆర్కేన్ జెల్‌గా చేసేవాడిని," భగవంతునితో మజ్నూ ఈవిధంగా ప్రత్యుత్తర మిచ్చాడట: "ఓ భగవంతుడా! దీనికి నిన్ను క్షమిస్తున్నాను. నిజంగా నీకు నావలన ప్రేమింపబడవలెననిఉంటే, ఎందుకు నీవు నా ప్రియురాలిగా మారలేదు? నీవు నాచేత సంభావింపబడదలిస్తే, నీవు

నా ప్రేయసివిగా!" మజ్నూ తన ప్రేమను తల్లక్రిందుగా ఉపయోగించాడు. కానీ రాముని సందేశ మిది: పరమసత్యముపైన నీకంత ప్రేమ ఉండాలె. నీలోని పరమాత్మయందు నీకంత గాఢప్రేమకుండాలె. ఆ పరమాత్మనే నీవు ప్రియాతిప్రియునిగా సంభావించాలె. మజ్నూవలె సత్యాన్ని ప్రేమించు. మజ్నూవలె సత్యాన్ని సంభావించు. పరమ సత్యమే సర్వత్రా నీకు సాక్షాత్కరిస్తుంది. సర్వత్రా నీకు భగవంతుడే సాక్షాత్కరించినీరుతాడు. ద్వైతేతరమయినది కనబడదు.

అయితే మీా రిప్పు డడుగుతారు: "ఏమిటి మా కుపయోగం? మే మా సత్యాన్ని తెలుసుకోనవసరం లేదు. మా యీా నరకంలో మాకు హాయిగానే యున్నది." రాముడు చెపుతున్నాడు: "మీా కలాగే హాయిగా యుండవచ్చు. కానీ మీా గమ్యస్థాన మది. దారిలో అక్కడా, యిక్కడా కాలం వృథాచేయడంవల్ల ఏమి లాభం? మీారీ పరమస్థితికి రావాలె. కానీ మార్గమధ్యమందు బురదలో దిగబడవాకండి. రైల్లో యెక్కిపోండి. కాదా! యెలక్ట్రిక్ కార్లల్లో యెక్కిపోండి. కాదు, రెక్కలుకట్టుకొని బయలుదేరండి. దారిప్రక్కన కాలం వృథా చేయకండి."

నిత్యం జరిగిపోతున్న మీా పరిసరవిషయాలు అవలోకించండి. ఏం జరుగుతున్నది? నీ వా గమ్యస్థానాన్ని తప్పక చేరవలసియుండడమే ప్రకృతియొక్క వుద్దేశ్యమని నీవుచూడగలవు. ఇదే ప్రకృతిలో జరుగుతున్నది. ఇది సహజదృశ్యం. ఒక మానవుడు ప్రశాంతమైన, అవికలమయిన ఆనందస్థితిలో వున్నప్పుడు. ఆ ప్రశాంతమయిన, అవికలమయిన ఆనందస్థితిలో కొంతకాలమువరకు జీవిస్తూయున్నప్పుడు, యేదోఒక మంచివార్త, యేదోయొక మంచిపరివర్తనం, యేదోయొక శుభం, దాని అనుసరణంగా రావడం జరుగుతున్నది. మంచిని మంచి తప్పక అనుసరిస్తుంది.

అలాంటి ఐక్యశ్రుతిలో జీవించు. అలాంటి ప్రశాంత నిశ్చల స్థితిలో జీవించు. ఏ స్నేహితులో రావడమో, యే ప్రేమితవస్తువో ప్రాప్తించడమో లేక యే అభినుతో నీకు ప్రాప్తించడమో జరగడం

నీవు చూడగలవు. అప్పుడు సామాన్యప్రజలా యదృష్టానికి ఆకర్షింపబడి, నీకు లభించిన యీ ప్రియపదార్థానికి మితిమించిన ప్రాముఖ్యమిస్తారు. వాళ్ళ వ్యామోహాలకువశుడవై, నీ వా భౌతికవస్తువును హృదయంలో సుస్థాపితం చేయటానికి ప్రారంభిస్తావు. దాన్ని కౌగలించుకొని, దాన్ని గట్టిగాపట్టుకొని, దాన్ని అతిగా ప్రేమిస్తావా?- తప్పక యేదో ఒక అనిర్వచనీయ సంఘటనచేత నీ ప్రేమితవస్తువు అపహృతి మాతుంది. ఏదో ఒక మార్పు కలుగుతుంది ఇది అనుల్లంఘనీయమైన ధర్మ శాసనం.

దీన్ని గురించి గ్రంథాలు రచింపబడకపోవచ్చు. కానీ యీధర్మం అభేద్యమైంది. ఏ వస్తువుమీదనైనాసరే నీవు వ్యామోహం పెట్టుకొన్నప్పుడు, నీ వా వస్తువును అతిప్రియంగా పట్టుకొన్నప్పుడు, దాన్ని అపహరించడానికి యేదో ఒకటి బయలుదేరుతుంది. అప్పుడు నీవు విచారమగ్నుడవౌతావు. వికలుడవౌతావు. అప్పుడు రెండురకాల దృశ్యాలు కనబడతవి. కొందరు మానవులు వికలత పొందినతరువాత, యిక పరిస్థితులమీద దోషారోపణంచేత పరిస్థితులను విమర్శిస్తూ వానితో యుద్ధానికి తలబడుతారు. అలాంటి మానవులకు యింకా యింకా కష్టాలు వచ్చిపడుతవి. "అయ్యో! కష్టాలు ఒంటరిగా రావు" అని వాండ్లు అంటుంటారు. ఒక కష్టం వచ్చిన తరువాత తమ మనస్సును తను తిరిగి పొందలేని మానవులు పక్కవాండ్లమీద దోషాలు వెదుకుతూ, ఒకదానివెంబడి ఒకటి వచ్చిపడుతున్న కష్టాలతో సమరం సాగిస్తూయుంటారు. అయితే కొంతకాల మిలా బాధపడినతరువాత ఆ అదృశ్య శక్తితో తిరిగే మిళితమైన ఒక మానసికస్థితి వారికి లభిస్తుంది. అప్పుడు ఒక ఐక్యస్థితి, ఒక నిస్సంగస్థితి, యొక వాంఛా విముక్తి స్థితి, ఒక విశ్వమయశాంతస్థితి వస్తుంది. అప్పుడు తిరిగి క్రమ్మిన మేఘాలు విడివడి సుఖకాంతులు ప్రసరిస్తాయి. తిరిగి అపమార్గం త్రొక్కి యీ బాహ్యరూపాలమీద ఆధారపడటంచేత వారికి మళ్ళీ కష్టాలు ప్రాప్త మాతవి. ఈ అనుభవాలతో కొంతకాలానికి మానవులు ఆధ్యాత్మిక పథంలో ప్రవేశిస్తారు. కష్టాలు ఆధ్యాత్మికతకు దారితీస్తవి అనిచెప్పడం దీనికే.

నీ ప్రాపంచిక జీవితంలో పగలు రాత్రి, రెండూ యున్నవి. బాధ అనే ప్రతి పగటని సుఖ మనే ఒక రాత్రి అనుసరిస్తునేయున్నది. సుఖ మనే ప్రతిరాత్రిని బాధ అనే ఒక పగలు అనుసరిస్తునేయున్నది. ఎంతకాల మైతే నీవు యీ నామరూపాలకు వ్రేలాడుతూ యుంటావో, యీ పడటం లేవటం సాగిపోతూనేవుంటుంది. ఒకదాన్ని ఒకటి జయిస్తూ ఈ కష్టసుఖాలు తమ సంకులము సాగిస్తునేయుంటవి. అయితే యిప్పుడు యీ ఆంతరంగికమైన పతనోన్నతులయొక్క ఆశయ మేమిటి ? ఈ ఆంతరంగిక పతనోన్నతులయొక్క ఆశయం నీలోని దివ్యసూర్యుని నీవు సందర్శించేలాగు చేయడమే. భూమిమీద రాత్రింబగళ్ళున్నవి. సూర్యునిలో యెప్పుడూ పగలే. సూర్యునిచుట్టూ పరిభ్రమిస్తున్న భూమే రాత్రింబగళ్ళను సృష్టిస్తున్నది. కానీ సూర్యునిలో రాత్రిలేదు, అక్కడ నిరంతరం బ్రహ్మతేజమే. నిరంతరం పగలే.

కష్టాలయొక్క అందోళనలయొక్క బాధలయొక్క వుద్దేశ్యం- నీ లోని ఆ దివ్యవైకుంఠాన్ని నీవు తెలుసుకునేటట్లు చేయడమే. ఆ సూర్యాతి సూర్యుని నీ లోని పరంజ్యోతిని నీవు దర్శించితీరా లనే బాధల ఆశయం. నీ నా పరమసత్యసాక్షాత్కారం పొందినట్లైతే అప్పుడు నీవు యీ సర్వప్రాపంచిక సుఖదుఃఖాలకు, ద్వంద్వాలకు అతీతుడ వౌతావు. సమస్తాన్ని అప్పుడు నీ వధిగమిస్తావు.

అయితే యీ సుఖదుఃఖాల ఆశయం - మనల నుద్ధరించడమని ఎట్లు చెప్పగలం ? - మనలోని దివ్యత్వంలో మనం కలిసి యున్నప్పుడు మాత్రమే - మనము విశ్వైక్యత పొందినప్పుడు మాత్రమే - సుఖం యెప్పుడుకూడా వస్తుంటుం దని - సుఖాగమనం మనకు చూపుతున్నది. మనము విశ్వైక్యస్థితిలో యున్నప్పుడే, సమస్త శుభాలు మన వని - యీ సుఖప్రారంభం మనకు బోధిస్తున్నది. విశ్వైక్యస్థితిలో సర్వ సుఖాలు మనవే. ఇది దైవధర్మం. ఇక భౌతికవస్తువులమీద మాయా వస్తువులమీద వ్యామోహంచేత ఆధారపడినప్పుడు, బాధ వెనుతగిలి వస్తుందని బాధాదృశ్యం మనకు చెవుతున్నది. మనం భౌతికవస్తు వ్యామోహితులమై వాటిని నిజంగా నమ్మినప్పుడు బాధాందోళనలు మనల వేటాడుతవని ఈ బాధలు మనకు ప్రబోధిస్తున్నవి. అందుచేత

ఈ భౌతికవస్తుజాల మంతా అసత్యం. ఈ బాహ్య ప్రపంచవస్తువులకై మనం కాలాన్ని, శక్తిసామర్థ్యాలను దుర్వినియోగం చేయకూడదు - అని బాధ మనకు బోధిస్తున్నది. సమస్తబాధలూ మనకీ పాఠాన్ని బోధిస్తున్నవి. రాముడు ప్రపంచచరిత్రనుకూడా తీసుకొని ఈ ధర్మ సూత్రానుసారం వ్యాఖ్యానించగలడు. షేక్స్పియర్ నాటకమైన 'మర్చెంటు ఆఫ్ వెన్నిస్' (Merchant of Venice) లో కూడ 'బాసానియో' (Bassanio), పోర్షియా (Portia) దేహానికి అంటుకొని యున్నంతవరకూ, అతడు బాధపడక తప్పలేదు. అతడు సుఖము పొందలేకపోయాడు. కానీ, 'పేటికలను' ఏరుకోవడంలో అతడు ఒక అనిర్వచనీయస్థితిలో - దేహస్మృతి లేని ఒక స్థితిలో - ఉన్నాడు. అప్పుడతను ఒక అద్భుతస్థితిలో ఉన్నాడు. అయితే అక్కడ మనకు భగవంతుని విషయంగానీ, దివ్యత్వవిషయంగానీ గోచరించదు. కానీ జాగ్రత్తగా పరిశీలిస్తే, అతని హృదయం ఏకత్వంలో నున్నప్పుడు, అతడు దివ్యత్వంతో ఏకీభవించియున్నప్పుడు, అతడు విజయం పొందినట్లు మీరు కనుగొనగలరు. షేక్స్పియర్, యీ విషయాన్ని విస్పష్టం చేయకపోవచ్చు. కవులీలాంటి విషయాన్ని విశదీకరించరు. కానీ నిత్యము అనుభవంలో కనపడే సత్యమిది. సమస్తసుఖాలు, మీకు ఏకత్వాన్ని సంభావించమని బోధిస్తున్నవి. సర్వంతో, సమస్త ప్రకృతితో మీరు శ్రుతికలపాలని ప్రబోధిస్తున్నవి. బాధలు, ఈ బోధనే త్రిప్పిబోధిస్తున్నవి. ప్రపంచవస్తువులను నిజమని నమ్మి వాటికి వ్యామోహితులు కావాకండని బోధిస్తున్నవి. సర్వంలోని పరమాత్మను హత్య చేయవద్దని, బాహ్యస్వరూపాలకు వ్యామోహితులై భగవంతుని మరచిపోగూడదని బాధలు మీకు ప్రబోధిస్తున్నవి. సమస్తసుఖాలూ వేదాంతాన్నే బోధిస్తున్నవి. సమస్తబాధలూ, వేదాంతాన్నే బోధిస్తున్నవి ఈ సత్యాన్ని సర్వమానవులు విశ్వసించనందున ఈ సత్యం వాండ్లకు గోచరించడంలేదు. ఈ సత్యాన్ని తెలుసుకోనందున, ప్రపంచం బాధపడుతున్నది. సత్యజ్ఞానులుకాండి! మీరు ఆనందస్వరూపులవుతారు!

మీ దేశంలోలాగా, భారతదేశంలో ప్రజలకు యాంత్రిక సాధనాలు లేవు. రేగడిమట్టిని త్రొక్కి కాళ్ళతో మట్టికుండలుచేస్తారు.

ఒక లోతైన పళ్ళెంలో రేగడిమట్టిని బాగా కాళ్ళతో త్రొక్కుతారు లోపల ఒక ఆధారముపెట్టి, కుండ పైభాగంమీద ఒకపలకతో చరుస్తుంటారు. ఈ రకమయిన రెండురకాలపని చేస్తారు.

అదేప్రకారం బాహ్యతాడనం నిన్ను అభివృద్ధిపరచడం; నిన్ను దేవునిచేయడం. నిన్ను భగవత్స్వరూపునిగా చేయడం ద్వివిధకర్మలతో కూడిఉన్నది. బాధలు పైన కొట్టేదెబ్బలు. సుఖాలు లోపల దెబ్బల క్రింద పట్టుకొనే ఆధారసాధనం. ఈ రకంగా, సుఖదుఃఖాలచేత శీలం నిర్మితమవుతుంది. కుండచేయడానికి పైనకొట్టే దెబ్బలవంటి బాధా, ఆ కుండకు లోపలదెబ్బ తగిలేటప్పుడు ఆధారంగా పట్టుకొనేసాధనంలాంటి సుఖాలూ, ఈ రెండూ నీలోనిదివ్యత్వాన్ని, నీలోని భగవత్తత్వాన్నీ, నీలోని దివ్యప్రకృతిని బహిరంగపరచడానికే. ఈ బాధకొనపోటులతో నీవు నీ బ్రహ్మత్వానికి ప్రబుద్ధుడవు కావలసియున్నది. ఇదే ప్రకృతి ధర్మం. ఆ రకంగా నీవు ప్రబుద్ధుడవు కాకపోతే దెబ్బమీద దెబ్బ, బాధమీదబాధ, నీవంతుకాకతప్పదు. ఈ దెబ్బలూ, ఈ బాధాందోళనలు తప్పించుకోవాలనుకుంటే నీ స్వస్వరూపమయిన పరమాత్మను తెలుసుకో! సత్యాత్మను తెలుసుకో! ఇదే నీ పరమగమ్యం!

పరమదివ్యానంద పరవశుం డగుచు
శాంతుడై నిర్మల నిశ్చలుండగుచు
రాము డున్నాడు దివ్యానందమూర్తి!
ఆనంద మానంద మహహా!
అస్మదీయానంద మప్రతిహతము.
అడ్డమే లేదు నా గమనంబు కెపుడు.
నర దేవ మృగపక్షి సంఘంబు లెల్ల
నే వేయు వేషాలె నిజముగా కనిన
నా మహానందము జగమునం దాకె.
అఖిలంబు నేనె, యీ సర్వంబు నేనె!
నే నెక్క డున్నా ననే ప్రశ్న లేదు.
ఎవుడు నే నున్నా ననే ప్రశ్న లేదు.
అహా! తత్త్వమసి! నేను అనునది యేమి

అను ప్రశ్నయే లేదు; బ్రహ్మను నేను!
ప్రశ్నకతీత మా బ్రహ్మను నేను!
అద్వితీయుడ నేను! ఆదిని నేను!
అఖిలంబు నేనె, యీ సర్వంబు నేనె!
ఎక్కువ నేనె! ఆ తక్కువ నేనె!
నేనె సంఖ్యావళి! నేనే క్రమముగ
ముందుకేగెడి సాంఖ్యపుంజంబు నౌదు!
ప్రశ్నకతీతమై భాసిల్లునట్టి
ఏకసత్యంబు, త్రికాలముల్ నేనె!
సర్వకాలము నేనె! సర్వంబు నేనె!
జ్ఞాతయు, జ్ఞేయంబు, జ్ఞానంబు నేనె!
మధురాతి మధురమా ఆత్మను నేనె!
నేను నీవును లేదు. వాడును లేదు-
ఏకసత్యం బగు నేనె సర్వంబు!

అదే సత్యాత్మ! అదే సర్వమూ! అదే వర్ణనాతీత పరబ్రహ్మ! ఆ పరబ్రహ్మ! ఆ పరమాత్మవు నీవై యున్నావు!!

ఈ సత్యాన్ని తెలుసుకో. రాముని దేహాన్ని పూజించడానికి ప్రజలు వచ్చినప్పుడు రాముని కదియిష్టముండదు. రామునిలో కావలసినంత మహానందం, పరమసౌఖ్యం, సమస్త శుభాలున్నవి. ధనధాన్య సంపదచేతనో, ఇతరులు చేసే భూషణాదులచేతనో కలిగే ఆనందంపై ఆధారపడిలేదు రాముని మహానందం.

నా ఆనందము అనంతమైంది. వర్ణనాతీతమైంది. పేరు కీర్తుల యొక్క, ధనధాన్య సంపదలయొక్క వాకిళ్ళవద్ద ఆనందంకోసం చేయి జాచే అవసరానికి రాముని అతీతునిగా చేయడానికి రామునిలో చాలినంత బ్రహ్మానందమున్నది. నాలో అపారానందసాగరం పొంగిపొరలుతున్నది.

ఓహో! ధ్యానం చెయ్యండి! సంభావించండి! సత్యసందర్శనం చెయ్యండి! ప్రాపంచిక కీర్తి వాంఛాద్వారములకడ కుక్కను చేసే భైక్షుకదశనుంచి మీకు ఈ సత్యజ్ఞానం విముక్తి కలిగిస్తుంది:

పూర్వకాలంలో భారతవర్షంలో తొమ్మిదిమంది సంతానానికి తల్లైన ఒక గృహిణి ఉన్నది. ఒకరోజు ఒక సన్న్యాసి ఆమెయింటికి భిక్షకు వచ్చాడు. ఆమెభిక్ష చేసింది. ఆమెభక్తికి సన్న్యాసి మహానందపడి ఈ రకంగా దీవించాడు : "పరమేశ్వరా! ఈ ఉత్తమ స్త్రీకి ఏడుగురు సంతానమును ప్రసాదించు!" బుద్ధిమంతుడైన ఆ సన్న్యాసి ఈ రకంగా ఆమెకు ఏడుగురు కుమారులను దయచేయవలసిం దని భగవంతుని ప్రార్థించినప్పుడు, ఆమెకు కోపం వచ్చింది. ఎందుకంటే ఆమెకు ఇదివరకే తొమ్మిదిమంది కుమారులున్నారు. ఈ వరంప్రకారం అందులో యిద్దరు చనిపోవాలెకదా! అందుచేత ఆమె ఆ సన్న్యాసిని ఇంకొకసారి దీవించ మన ర్థించింది. ఆ సన్న్యాసి తిరిగి భగవంతుని ఆమెకు ఏడుగురు కుమారులను దయచేయమని వేడుకున్నాడు. ఆమెకు కోపం వచ్చింది. జనంగూడి జరిగినవిషయమడిగారు. ఈ సన్న్యాసి నాకు వరమీయలేదు. వరరూపంలో శాపమే యిచ్చాడన్న ఆమె వాక్యాలు విని జను లాశ్చర్యపోయారు. అదేప్రకారం రామునిలో వర్ణనాతీతమైన ఆనందమహాసాగర మున్నది. ఆ బ్రహ్మానందాన్ని సర్వులూ పంచు కుంటారుగాక! ఆ బ్రహ్మానందం మనలను సర్వప్రాపంచక వస్తు వ్యామోహబంధాలనుండి విముక్తులను చేస్తుంది.

ఈ శరీరం, ఈ వ్యక్తిత్వం హిమాలయశిఖరాలపైన కలువ పూవులాగా అజ్ఞాతంగా వికసించనీయండి. ఈ శరీరం చెరసాలలో కొరతలపైన మ్రగ్గితే మ్రగ్గనీయండి. ఈ శరీరాన్ని సముద్రతరంగాలు మ్రింగితే మ్రింగనీయండి. ఈ శరీరాన్ని ప్రచండ ప్రళయదావాగ్ని కీలల్లో బూది అయితే కానీయండి! అది ఏమైనాసరే ఆ బ్రహ్మానందం అక్షీణమైంది! ఆ బ్రహ్మానందానుభూతిపొందు! ఆ ఆత్మానందాన్ని అనుభవించు! సమస్తప్రాపంచక దంభపలయాలను, సమస్తప్రాపంచిక మాయావలయాలను, సమస్తప్రాపంచక భావతమస్సులను అతిక్రమించు! అతీతుడవుగా!

దేవాదిదేవుడవై ప్రకాశించు! విశ్వనాథుడవై వెలుగొందు! తత్త్వమసి! తత్త్వమసి!! తత్త్వమసి!!!

ఓమ్! ఓమ్! ఓమ్!

# వివిధ ప్రసంగాలు

[ 1903 జనవరి 22 శాన్‌ఫ్రాన్సిస్కోలో గోల్డెన్‌గేట్ హాల్లో ఇచ్చిన ఉపన్యాసం ]

ప్రశ్న :- "మనం విముక్తి పొందగలం" - అనడంలో స్వామి వారి అభిప్రాయ మేమిటి ?

ఉత్తరం :- మనం విముక్తి పొందగలం అనేమాట నిజానికి శుద్ధతప్పు. దీనిఅర్థం మనం ఎప్పుడో విముక్తి పొందగల మని కాదు. ఈ నిముషమందే మనం ముక్తులమై యున్నాము. మనం అనాదినుంచి విముక్తులమే. మనకు ఎప్పుడూ బంధంలేదు. అనాదిసిద్ధంగా మనం విముక్తులమే. అందుచేత-మనం విముక్తి పొందగలం-అనడం నిజంగా శుద్ధతప్పు. కేవలం పొరపాటే. అయితే వ్యావహారికంగా ఇట్లు పలికినా, దీని సత్యార్థం - జ్ఞానంపొందడ మని. ఏ బంధమునుండి యీ ప్రపంచమానవులు విముక్తి పొందుతున్నారో, ఆ బంధం నిజమైన బంధంకాదు. ఈ బంధం వక్రభావనచేత, అజ్ఞానంచేత, అవిద్యచేత కలుగుతున్నది. బంధ మనేది నిజంగా లేదు. నిజమైన జ్ఞానం, సత్యాత్మ సాక్షాత్కారం, తత్‌క్షణమే నిన్ను నిత్యముక్తుని చేస్తుంది. ఈ స్వాతంత్ర్యం అవినాశనమైంది. అందుచేత నీ విముక్తి (స్వేచ్ఛ) అనేది ఎప్పుడో పొందబడేది కాదని తెలుసుకో. ఈ స్వాతంత్ర్యం నీ స్వతస్సిద్ధమైంది. నీ జన్మహక్కు. నీ సహజలక్షణం. నీ నైజప్రకృతి.

ఒక మనిషి మెడలో ఒక రత్నాలహార మున్నది. ఒకసారతడు, తన మెడలో ఆ హారము ఉన్నవిషయమే మరిచిపోయాడు. ఆ హారము కనపడక దిగులుపడి ఇల్లంతా వెతకడం మొదలు పెట్టాడు. ఎంత వెతికినా కనబడలేదు. ఎవరో అప్పుడువచ్చి, "ఇదిగో హారం నీ మెడలోనే యున్నది -" అని గుర్తుచేసి చూపించారు. అప్పు డతని విచారము పోయింది. చూడండి - ఇప్పుడు హారము దొరికింది అనడము నిజమైన అర్థంలో తప్పు. ఎందుకంటే నిజానికి ఆ హారము అతని మెళ్ళోనే ఎప్పుడూ ప్రకాశిస్తున్నది. అది మరి పోయిందా ? పోలేదు. మరిచిపోబడింది. అదేప్రకారము, నీ సత్యాత్మ ఆ "నేను"- సర్వకాలసర్వావస్థలలో అవికల్పమై, అవినాశమై ప్రకాశిస్తున్నది.

అయితే మనస్సు, బుద్ధి, అజ్ఞానమును అతిక్రమించవలసియున్నది. మనస్సు, ఆ అమూల్యఆత్మ హారమును పొందినట్లు విశ్వసించినప్పుడు, ఈ అర్థంలో నీవు విముక్తిని పొందావని చెప్పవచ్చు. నిజానికి నీ హారము (ఆత్మ) ఎన్నడూ పోలేదు. దానిని నీవు మాయాభ్రాంతిచేత మరిచి, తిరిగి కనుగొన్నావు మాత్రమే. దీనినే విముక్తి అని పిలుస్తాం.

ప్రశ్న :- ఆత్మకు పునరావృత్తి ఉంటుందా ?

ఉత్తరం :- ఈ ప్రశ్నకు జవాబు ఆత్మ - అన్న పదముయొక్క అర్థంమీద ఆధారపడి యుంటుంది. ఆత్మను పరమాత్మగా అర్థంతీసుకుంటే, ఆత్మకు జననమరణాలు లేవు. ఆత్మకు చావు పుట్టకలు లేవు. అందుచేత ఆత్మ పునరావృత్తిరహితమైంది. మరి-ఆత్మ అన్న పదాన్ని జీవునిగా సూక్ష్మదేహంగా అర్థంచేసుకున్నప్పుడు, పునరావృత్తి వున్నది. ఆ ఆత్మ జననమరణపరంపరాచక్రంలో పరిభ్రమిస్తుంది.

యాజ్ఞవల్క్య మహర్షికి ఇద్దరు భార్యలు. పెద్దభార్య మైత్రేయి. చిన్నభార్య కాత్యాయని. యాజ్ఞవల్క్యుడు మహా శ్రీమంతుడు. భారతవర్షంలోని మహైశ్వర్యనిధియైన ఒక మహారాజు ఆయన శిష్యుడు. ఆయన తన సంపదను భార్యాద్వయానికి పంచి అరణ్యానికి సిద్ధమిద్దామనుకున్నాడు. మైత్రేయి భర్తయిచ్చే సంపద యొక్క భాగమును తీసుకోవడానికి ఇష్టపడలేదు. శాశ్వతత్వమునకు దారితీసేయెడల, తన భర్త ఎందుకీ సర్వసంపదను వర్జిస్తాడు ? - అని ఆమె విచారణచేసి సంపదను నిరాకరించింది.

"సమస్త భారతవర్ష మహైశ్వర్యవంతులలో ఒకడైన నా ప్రియుడు, ఈ సమస్త సంపదలనూ విసర్జించి ఇంకొక నవ్యజీవితమును స్వీకరించడానికి కారణ మేమయి యుంటుంది ? నిజానికి ఎవరుకూడా ఒక జీవితమును వదలి, ఇంకో జీవితమును ఏదో ఎక్కువ ఆనందం లేకపోతే స్వీకరించరు. ఇతఃపూర్వ జీవితంకంటే, స్వీకరించబోయే నూతన జీవితములో ఏదో ఉన్నత సుఖం ఉండబట్టే, నా భర్త నేడీ సంపదను పరిత్యాగం చేస్తున్నాడు" అని ఆమె విచారించి భర్తను ఈ రకంగా ప్రశ్నించింది. "ప్రాపంచకసంపదలోకంటే, ఆధ్యాత్మిక సంప

దలో ఎక్కువ ఆనంద మున్నదా? లేక ఆ ఆనందము ఇంకొక రకమయిందా?"

యాజ్ఞవల్క్యుడు ఈ రకముగా ప్రత్యుత్తర మిచ్చారు- "భాగ్యవంతుల జీవితము ఎంత గొప్పదైనా ఈ జీవితంలో నిజమైన ఆనందం లేదు. నిజమైన సౌఖ్యంలేదు. నిజమైన స్వాతంత్ర్యంలేదు". "అయితే, విముక్తి సత్యస్వాతంత్ర్యం మోక్షం ఎలాకలుగుతుంది? ఈ ప్రాపంచక రాగవ్యామోహాలనుండి, ఆశాపాశమునుంచి విముక్తి దేనివల్ల కలుగుతుంది? జీవితామృతమును నాకు విశదపరచండి. నా కది కావాలె"- అని మైత్రేయి ప్రార్థించింది.

యాజ్ఞవల్క్యుని భౌతికసంపదను కాత్యాయని స్వీకరించింది. కానీ మైత్రేయి మాత్రము యాజ్ఞవల్క్య మహర్షుల జ్ఞానసంపదనే కోరుకున్నది. ఆమె పొందిన ఆధ్యాత్మికమైన ఆ యైశ్వర్యం ఏమిటి?

నవా అరే పత్యుః కామాయపతిః ప్రియోభవ
త్యాత్మనస్తు కామాయ పతిః ప్రియోభవతి
నవా అరే జాయాయై కామాయ జాయాప్రియా
భవ త్యాత్మనస్తు కామాయ జాయాప్రియా భవతి.

— బృహదారణ్యకోపనిషత్

దీనికి అనేకఅర్థా లున్నాయి. మాక్సుముల్లర్ ఒక రకంగా అనువదించాడు. హిందువులు అనేకులు ఇంకోరకంగా అనువదించారు. రెండూ సరియైనవే.

ఒక వ్యాఖ్యాన ప్రకారము అర్థమిది: "భార్య భర్తను ప్రేమించడానికి కారణము, భర్తయొక్క విశేషగుణగణాలు లేక ఏ ప్రత్యేక సౌందర్యవిశిష్టతా కాదు. భర్త భార్యకు అద్దంవంటివాడు. అద్దములో ప్రతిబింబాన్ని దర్శించినట్లు, ఆమె అతనిలో తన ఆత్మను దర్శిస్తుంది. ఈ కారణముచేతనే ఆమె భర్తను ప్రేమించడం. అందుచేతనే ఆమె కతడు ప్రియుడు."

రెండవ అర్థం యిది : "భార్య, భర్తకోసం భర్తను ప్రేమించడములేదు. భర్తలో ఆమె పరమసత్యమును, భగవంతుని నిజమైన దివ్యత్వమును దర్శిస్తుంది. అప్పుడే ఆమె ప్రేమించగలుగుతుంది"

ప్రేమ పరస్పరము ప్రసరితము కాకపోతే, ఎవడూ ప్రేమించడని మీకు తెలుసు. దీనివల్ల మనకేం కనబడుతున్నది? ఇతరులలో ప్రతిబింబించిన మనలనే మనం ప్రేమిస్తున్నాము. మన సత్యాత్మను, పరమాత్మను, ఇతరులలో మనంచూచి ప్రేమిస్తాము. అంతేగాని వస్తువును వస్తువుకోసము మన మెప్పుడూ ప్రేమించము.

ఈ విషయం బాగా విచారించండి. ప్రేమకు కారణము సత్యాత్మ. సత్యాత్మ కొరకే వస్తువులు ప్రియంగా కనిపిస్తున్నవి. నీలోని సత్యాత్మలోనే మాధుర్యమంతా ఉన్నది. నీ ప్రేమభావాలను దుర్వినియోగము చెయ్యవాకు. నీవు పైకి ఎక్కడానికై ఉద్దేశింపబడిన నిచ్చెనను క్రిందపడడానికి దుఃఖంలోఅజ్ఞానంలో అధోదృష్టిలో పడడానికి దుర్వినియోగము చెయ్యవాకు. ఈవిషయమును గాఢంగా విచారించు. నిజమయిన మాధుర్యము, నిజమయిన ఆనందము, నిజమయిన సుఖము ఎక్కడవుందో నీవు చూడగలవు. నిజమైన ఆనందము, నీ ఆత్మలో మాత్రమే, నీ సత్యాత్మలో, భగవంతునిలోమాత్రమే ఉన్నదని నీవు కనుగొంటావు. ఇది గ్రహించి, సర్వప్రాపంచకవాంఛాసముదాయానికి అతీతుడవుగా! ఈ విషయవాసనలకు, ఈ నీచవాంఛలకు నిన్ను నీవు అతీతునిగా చేసుకో. పరబ్రహ్మలో ఐక్యంగా.

నవా అరే పుత్రాణాం కామాయ పుత్రాః ప్రియా
భవంత్యాత్మనస్తు కామాయ పుత్రాః ప్రియాభవంతి.

—బృహదారణ్యకోపనిషత్

"అదేప్రకారం పుత్రులకొఱకే పుత్రులు ప్రియంగా లేరు. ఆత్మకొఱకే పుత్రులు ప్రియంగా ఉన్నారు."

'సత్యాత్మకొఱకు కుమారులు ప్రియంగా ఉన్నారు.' చూడండి. నీకుమారులు నీమాటవినక ఎదురుతిరుగుతారనుకో అప్పుడు నీవు కష్ట

పడుతున్నావు. వాండ్లను ఇంట్లోనుంచి తరిమివేస్తావు. ఓహో! చెప్పండి- ఎవరికోసం పుత్రులు ప్రియంగా ఉన్నారో!

ఉదాహరణకు—నీ కుమారునికి గుడ్డలు కావాలనుకుంటావు. గుడ్డలమీద నీకతి ప్రీతి ఉన్నది. అయితే నీవు కేవలం ఆ గుడ్డలకొఱకే గుడ్డలను ప్రియంగా కోరుతున్నావా? లేక నీకుమారునికొఱకా? గుడ్డల కంటే నీ కుమారునిమీద నీ కెక్కువప్రేమ. ఇక్కడ మన కేం అర్థమవుతున్నది? - తండ్రియొక్క సత్యాత్మకొరకే కుమారుడు ప్రియంగా ఉన్నాడు. ఆత్మలో పుత్రునిలోకన్నా ఎక్కువ ఆనందం ఉన్నదన్న మాట.

నవా అరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యా
త్మనస్తు కామాయ విత్తం భవతి.

—బృహదారణ్యక ii అధ్యా, 4 బ్రాహ్మ

"అదేప్రకారం సంపద సంపదకోసం ప్రియంగాలేదు. సంపద ఆత్మకొరకే ప్రియంగా ఉన్నది."

నీవు ఆ దేవతనూ, యీ దేవతనూ ప్రార్థించుతావు "దేవుడా! నీవు దయాసాగరుడవు. నీవు ప్రేమనిధివి. సర్వకర్తవునీవే" అని యీ రకంగా ప్రార్థిస్తావు. ఎందుకు ప్రార్థిస్తున్నావో తెలుసా? ఎందుకంటే దేవుడు నీకోరికలు నెరవేరుస్తాడు కాబట్టి. నీలోని సత్యాత్మను సేవిస్తాడు. గనుక దేవుడు దేవుడుకోసం ప్రియంగాలేడు. సత్యాత్మకొరకే దేవుడు ప్రియంగావున్నాడు. దీన్ని బాగా గ్రహించండి. దీనివల్ల తేలుతున్న దేమిటి? సత్యాత్మే సమస్తసుఖమునకు మూలం. సత్యాత్మే నిజమైన ఆనందనిధి! దీన్ని తెలుసుకో! దీన్ని గ్రహించు!

భారతదేశంలో బొమ్మలాట వేస్తారు. అందులో తెరవెనుక ఒకమనిషివుండి, తోలుబొమ్మలయొక్క స్థూలదేహాలకు కట్టిన సన్నని దారాలు పట్టుకొని లాగుతూ బొమ్మలను ఆడిస్తుంటాడు. బొమ్మలాటను చూడడానికి వచ్చిన జనం బొమ్మలకుకట్టిన దారాలుచూడరు ఆ దారాలు పట్టుకొని ఆడించే మనిషినికూడా చూడరు. ఆడేబొమ్మలు మాత్రమే చూస్తారు. అదేప్రకారం ఈ ప్రపంచంలో యీ స్థూల

శరీరాలన్నీ బొమ్మలాటలోని తోలుబొమ్మల స్థూలశరీరాల విధంగా వున్నవి. సామాన్యమానవులు ఈ స్థూలశరీరాలనే నిజమైన కర్తలుగా చూస్తారు. వీటికి స్వేచ్ఛాకర్తృత్వం ఆపాదిస్తారు. వస్తువులను ఈ కనబడే బాహ్యస్వరూపదృష్టితో అవగాహన చేసుకుంటారు. శరీరమును కర్తగా తలుస్తారు. స్నేహితులుగానీ, బంధువులుగానీ తమకు అనుకూలంగా సేవించినప్పుడు సంతోషపడతారు. అసూయపడతారు. ఆక్రోశించూపుతారు. కష్టపడతారు. నిరుత్సాహపడతారు. అప్పుడు నీవు బంధుమిత్రులను ఏవగించుకుంటావు. ఇలాంటివాండ్లు ఒకరకమైన మనుష్యులు. ఇంకొకరకమైన మనుష్యులున్నారు: ఈరకపు మనుష్యులు కొంచెం ఉన్నతదృష్టి గలవారు. పైనపేర్కొన్నవారికంటే, వీరు కొంచెం వివేకవంతులు. కొంచెం ఎక్కువ తాత్వికదృష్టిలవారు. ఎక్కువ ఆధ్యాత్మికదృష్టి ఉన్నవాండ్లు. ఈరకపుమానవులు బొమ్మలకు ప్రధానమివ్వకుండా బొమ్మలకు కట్టిన ఆ సన్నని అందమయిన దారానికే ప్రాధాన్యతయిస్తారు. అంటే పరలోకసంబంధమయిన సూక్ష్మశరీరాలకే ప్రాధాన్యమిస్తారు. పరలోకమందలి ఆత్మలకే కారణత్వ మిస్తారు. ఇక్కడ ఆత్మ అంటే సత్యాత్మకాదు. ఇట్టి మానవులు కొంతవరకు సరియైనదృష్టిగలవారే. ఇట్టిప్రజలు ఒక కారణమును. కార్యమునూ చూస్తున్నారు. దారమునూ, స్థూలశరీరంపైన దాని కార్యఫలితమునూ చూస్తున్నారు. కానీ మానవునికి సంబంధించి తెరవెనుక దివ్యశక్తి' సత్యము ప్రకాశిస్తున్నది. ఆ సత్యశక్తే తెరవెనుక ఈ దారములను, ఈ త్రాళ్లను లాగుతున్నది. స్థల కాల నిమిత్తాలకు అతీతమయిన పరమాత్మచేతనే, వర్ణనాతీతమయిన ఆ దివ్యశక్తిచేతనే దేహా మనో బుద్ధ్యాదిశక్తులన్నీ పాలింపబడుతున్నవి. ఆ ఆత్మే నిజమయిన అమృతతత్వం. నిజమయిన ఆనందం. నిజమయిన పరమసుఖం. ఆ ఆత్మే సర్వమూ.

ఈ ప్రాపంచికమయిన సర్వసంబంధ బాంధవ్యాలు, మానవులకు చెప్పే గుణపాఠాలని, మానవులను బ్రహ్మదృష్టికిత్రిప్పే ఒక శిక్షణావిధాన మని – ఈ అవరోధాలన్నీ మనకు తెలియజేస్తున్నాయి. ఈ ప్రాపంచికసంబంధము లన్నీ, తెరలవెనుక ఉన్నటువంటి బొమ్మలాట

లోని ప్రాళ్ళను గుంజుతున్నటువంటి ఆ సత్యాత్మయొక్క సాక్షా త్కారమునకే! ఈ అవరోధాలన్నీ నీకు చూపించేదేమిటి? నీవు నీ సత్యాత్మను తెలుసుకోవాలె. సమస్తవిశ్వాంతర్గతమై యున్న, శరీర మనో బుద్ధ్యాదులను నియమించి పరిపాలిస్తున్న సత్యాత్మయొక్క సత్యత్వమును నీవు అనుభవపూర్వకంగా గ్రహించాలె - ఇదే సర్వావరోధాల ఆశయం. మానవశరీరమనోబుద్ధ్యాదులన్నీ ఈ పరమ చిచ్ఛక్తిచేత, ఈ సత్యమయిన దివ్యప్రేమచేత, ఈ పరమసత్యముచేత పరిపాలింపబడుతున్నవి.

నీ పొకస్నేహితుని చూచినప్పుడు, అతనిలోపల ప్రకాశిస్తున్న సత్యాత్మను చూచినట్లు నీవు గ్రహించాలె. నీ వతనిమాటలు వింటు న్నప్పుడు అతని వెనుక నున్న సత్యాత్మచేత ఆమాటలు పరిపాలించబడి నట్లు నీవు తెలుసుకోవాలె. నీ పొక మిత్రుని శక్తిని గ్రహించినప్పుడు, వెనుక ప్రకాశించే దివ్యత్వమును గ్రహించాలె. ఇట్టి జ్ఞాననేత్రం నీలో వికసిస్తే, నీవు మాయకు అంటవు. నీకు శోకభయాలుండవు. నీకు వికలత కలుగదు. తెలిసిన బుద్ధిమంతులు తెరమీది బొమ్మలను చూచి వాటికి వెనుక ఉన్న మనిషిని గ్రహించినట్లు వివేకవంతులు సర్వవస్తుప్రపంచమునకు వెనుక ప్రకాశిస్తున్నది సత్యాత్మే అని గ్రహిస్తారు.

మానవుల కర్మలకు వెనుక ప్రకాశించే పరమశక్తిని కనుక్కో! ఆ పరమశక్తిని తెలుసుకో. ఆ శక్తిని నీవే అని గ్రహించు. బాహ్య రూపనామాలను ఎంత శ్రద్ధతో చూస్తున్నావో, తదేకశ్రద్ధతో ఆ పరమశక్తిని గ్రహించు.

బ్రహ్మతం పరాదాద్, యోఽన్యత్రాత్మనో బ్రహ్మ వేద ।
క్షత్రం తం పరాదాద్, యోఽన్యత్రాత్మనః క్షత్రం వేద ।
లోకాస్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో లోకాన్ వేద ।
దేవాస్తం పరాదుర్యోఽన్యత్రాత్మనో దేవాన్ వేద ।
భూతాని తం పరాదుర్యోఽన్యత్రాత్మనో భూతాని వేద ।
సర్వంతం పరాదాద్, యోఽన్యత్రాత్మనః సర్వం వేద ।

**ఇదం బ్రహ్మ, ఇదం క్షత్రం, ఇమే లోకాః, ఇమే దేవాః ।**
**ఇమాని భూతాని, ఇదం సర్వం, యదయ మాత్మా॥**

**—బృహదారణ్య 2 అ. 4 బ్రహ్మ.**

"పరమాత్మలో బ్రాహ్మణుని చూడనివాణ్ణి, బ్రాహ్మణుడు వదలివేస్తాడు. పరమాత్మకు భిన్నంగా క్షత్రియుని చూచినవాణ్ణి క్షత్రియుడు పరిత్యజిస్తాడు. ఆత్మకంటే వేరుగా లోకాలను (ప్రజలను) చూచినవాణ్ణి, ప్రజలు (లోకాలు) వెళ్ళగొట్టితీరుతారు. దేవతలను ఆత్మకంటే భిన్నంగా చూచిన వాణ్ణి, దేవతలు బహిష్కరిస్తారు. ఆత్మలో కాక వేరుగా వస్తువులను చూచినవాణ్ణి వస్తువులు విడిచి తీరుతవి. ఏ వస్తువునైనాసరే సర్వవస్తువులను ఆత్మగా గ్రహించక పోతే, సర్వవస్తువులు వాణ్ణి వదిలితీరుతవి. బ్రాహ్మణుడు ఆ ఆత్మే. ఆ ఆత్మే క్షత్రియుడు. ఆ ఆత్మే సమస్తమానవులు. ఆ ఆత్మే సమస్త దేవతలు. ఆ ఆత్మే సమస్త వస్తువులు, సర్వమూ, సమస్తమూ ఆ పరమాత్మస్వరూపమే".

ఈ వాక్యాలలో, దివ్యత్వము తేటతెల్లంగా, సుస్పష్టంగా వ్యాఖ్యానింపబడింది.

దీనిని మీ హృదయాలలో గాఢంగా నాటండి. నీవు ముక్తుడవని తెలుసుకోగలవు. నీ జన్మహక్కు నీకు పునస్సంప్రాప్తమవుతుంది.

"బ్రాహ్మణజాతి, వేదములూ-సర్వమూ ఆ ఆత్మే"

ఒక దైవధర్మం ఉన్నది. నీ వొక భౌతికవస్తువుమీద ఆ వస్తు దృష్టితోటే ఆధారపడితే, నీవు భంగపడక తప్పదని ధర్మముయొక్క, వేదములయొక్క శాసనం! ఈ వాంఛా వస్తువు లన్నింటికీ నీవు అతీతుడవుగావాలె. ఇది ధర్మమైయున్నది. నీ వొక గొప్పవానిని చూచి, లేక ఒక మహారాజును చూచి అతని శరీరంమీద, ఆ వ్యక్తిత్వంమీద ఆధారపడడం మొదలుపెడతావనుకో వేదము లేమిచెప్పుతున్నవో వినండి : అపమార్గగాములై మీరు పతనంకావడం తథ్యమని చెబుతున్నవి. అతని సత్యాత్మ లేక అతని బ్రహ్మత్వమునందు నీవు విశ్వాసముంచక, ఎక్కువ అతని దేహంమీదనే విశ్వా

సము చూపుతున్నందున ఒక ఘోరపాపం చేస్తున్నావన్న మాట. సత్య స్వరూపముమీద నీవు మాయా రూపాచ్ఛాదనం చేస్తున్నావు. అంత ర్బ్రహ్మత్వమును అంతర్గత సత్యమును నీవు అసత్యపరుస్తున్నావు. ఇది విగ్రహారాధన. శరీరస్వరూపమును నీవారాధిస్తున్నావు. నీ అర్చన విగ్రహార్చన మాత్రమే. అంతర్గతమైన భగవంతుని నీవారాధించడము లేదు. దీనికి ఫలితము బాధ- అశాంతిపడక తప్పదు. ఇది ధర్మనియతి. వ్యవహారికప్రపంచంలో నీవు సంచరించేటప్పుడు ప్రపంచవ్యవహారమును నిర్వర్తించేటప్పుడు అంతర్గతమయిన పరమాత్మనే, బ్రహ్మజ్యోతినే దర్శించు- అని వేదం నిర్వచిస్తున్నది. మానవునితో కూడిన ప్రాపంచక కర్మను అప్రధానంగా పరిగణించాలె. అంతర్గతమయిన పరమసత్యము నకు ప్రాధాన్యస్థాన మివ్వాలె. ప్రాపంచకవ్యవహారాన్ని స్వప్నప్రా యంగా చూడాలె. బాహ్యస్వరూపానికంటే సత్యమును ఎక్కువగా సంభావించాలె. మన మొక స్నేహితుని రూపచిత్రాన్ని ప్రేమిస్తున్నా మంటే, ఆ రూపపటదృష్టితో టే ప్రేమించడము లేదు. అది స్నేహితుని గురించి గౌరవింపబడు తున్నది, అంటే చిత్రపటముకంటే స్నేహితుడే మనకు ప్రేమపాత్రుడు. వస్తుబంధములో, మనం వస్తువులకంటే పరమ సత్యమునకే ప్రధానత్వ మివ్వాలె. దేహదృష్టి వదలి సత్యదృష్టిని మనము గ్రహించాలె. అప్పుడు ప్రాపంచక సంబంధాలు మనలను బాధ పెట్టలేవు. అవి మన గుండెలను నలగగొట్టకుండా పూవులులాగా మారి, మనకు భారముగావు. ముండ్ల బాటలు పూవుల బాట లవుతవి. కాక సత్యదృష్టివదలి దేహరూపాలకే ప్రాధాన్యత యిస్తావా, యిక బాధాశాంతులు, దుఃఖాందోళనలు వేటాడి చంపుతాయి. ఇది ధర్మమైయున్నది.

ఒకకథ వినండి :

ఒక పల్లెటూళ్ళో ఒక తిక్కలముసలమ్మ ఉన్నది. ఆ ముస లమ్మకు ఒక కోడిపుంజు ఉన్నది. ఆ వూరిజనం ఎప్పుడూ, ఆ ముసల మ్మను తమాషాలు బట్టిస్తూ హాస్యం బట్టిస్తుండేవారు. ఆ పోరు పడలేక పోయింది. ఒకరోజు ఆ యూరిజనంతో యిలా అన్నది. "మీ రందరూ నన్ను అవస్థపెడుతున్నారు. చూడండి, మీమీద నేను కచ్చతీర్చుకోక

పోతే, అప్పుడు, ఛీ అనండి". ఆ ముసలమ్మమాటలు జనం మొదట లెక్క-బెట్టలేదు. "జాగ్రత్త ఇంకచూడండి. ఓ గ్రామస్థులారా! నేను రవ్వంతకూడా మీ కింక సహాయంచేస్తానేమో చూడండి" అని ముసలమ్మ ఆక్రోశం వెళ్ళబోసింది. "ఏంచేస్తావు ముసలమ్మా?" అని జనం అడిగారు. "ఈ గ్రామంలో సూర్యుణ్ణి పొడవనివ్వను నూచు కోండి" అన్నది ముసలమ్మ. "ఆ పని ఎలాచేయగలవు"-అని అడిగారు జనం. ముసలమ్మ చెప్పింది : "నాకోడి కూసినప్పుడు సూర్యుడు పొడు స్తున్నాడు. మీరుగనుక నన్ను యిలాగే బాధపెడతారా, నా కోడిని తీసుకొని ఇంకో గ్రామానికి పోతాను. ఇంక యీగ్రామంలో సూర్యుడు ఉదయించడు."

కోడి కూసినప్పుడు సూర్యుడు ఉదయించడం నిజమే. కానీ సూర్యోదయానికి కోడికూత కారణంకాదు. సరే - ఆ ముసలమ్మ ఆ వూరివిడిచి ఇంకొకవూరు వెళ్ళింది. పాపం చాలా అవస్థపడి వెళ్ళింది. ఏ వూరు వెళ్ళిందో ఆ వూళ్ళోగూడ కోడికూసింది. ఆ వూళ్ళో సూర్యుడు ఉదయించాడు. ఆమె వదలిన గ్రామంలోకూడా సూర్యుడు ఉదయించాడు అదేప్రకారం నీ వాంఛలయొక్క తృష్ణా ప్రకృతి కోడి కూతలాంటిది, నీ వాంఛలు కోడికూతను పోలియున్నవి. వాంఛావస్తు సంప్రాప్తి సూర్యోదయమును పోలియున్నది. వస్తుతృష్ణ, వస్తువాంఛ అఖండపరిపూర్ణమైన పరమాత్మ అనే ఆ ఏకైక సూర్యునిచేత నియ మితమై పరిపాలింపబడుతున్నది. సత్యాత్మ అనే సూర్యభగవానుడే, సంధ్యాదివారాత్రాలను సృజిస్తున్నాడు. సమస్తప్రపంచకర్మలు ఈ అనంతాద్వితీయ సత్యాత్మచేతనే నియమితమై, శాశ్వతమై పాలింప బడుతున్నాయి. ఇంద్రియాలకు అధినేత ఆత్మే. బొమ్మలనాడించే త్రాళ్ళను గుంజేది ఆ సూర్యసూర్యుడే. ఆ పరంజ్యోతే! ఆ పరబ్రహ్మ! ఈ విషయం గుర్తుంచుకోండి.

సామాన్యముగా మానవులు ఈ కర్తృత్వమంతా ఈ వాంఛా దాహంగల స్వార్థాహంకృతికి ఆపాదిస్తారు. అహంకృతికి కర్తృత్వం ఆపాదించవద్దు. అహంకార విముక్తులుగాండి! వివేచన చేయండి. ఒకే సూర్యుడు ఉదయారుణ కాంతులను ప్రసరిస్తున్నాడు. అతడే కోడిపుంజు

కన్నులు విస్ఫారజేస్తున్నాడు. దాని గొంతుక సవరణ చేస్తున్నాడు. దాని కంఠంలో కూతను పుట్టిస్తున్నాడు. కోడి కూతగానీ, ఉదయ సంధ్యాకాంతిగానీ సూర్యుని దివ్యకాంతిచేత, దివ్యశక్తిచేత పరిపాలిత మవుతున్నది. ఈ సమస్త జీవప్రపంచము ఈ నీ సమస్తభావాలు సూర్యసూర్యుడైన, పరంజ్యోతియైన సత్యాత్మచేత నీలోని పరమాత్మ చేత శాసింపబడుతున్నవి. పరిపాలింపబడు తున్నాయి. ఈ సత్యరహస్య మును తెలుసుకో! విముక్తుడవుగా! అసత్యాపాదనలు చేయవద్దు. అప వ్యాఖ్యానాలు చేయకండి; వస్తువులను వస్తుదృష్టితో సత్యములనే భ్రాంతితో చూడవద్దు. వస్తువులను వస్తుదృష్టితో సత్యములని భ్రాంతి పడడమే, ఈ అపవిశ్వాసమే బాధాశోకాలకు కారణం. ఈ పరమ రహస్యమును తెలుసుకోండి! ఈ సత్యమును సాక్షాత్కరించుకోండి! ఈ సమస్త ప్రపంచ వస్తుజాలమును ఒక మహావినోదక్రీడగా గారడీగా నాటకప్రదర్శనంగా చూడండి. ఒకడు 'క్లియోపాత్రా' వేషం వేయవచ్చు. ఇంకొకడు మేకబెత్ వేషం వేయవచ్చు. కానీ నిజానికి అతడు హంత కుడూ కాడు. అతడు రాజూ కాడు, రాణీ కాదు. అతడు కేవలము ఒక నటుడు మాత్రమే. వేషధారణమే గాని, ఆ నటుడు నిజానికి బుద్ధి మంతుడు. అదే ప్రకారము నీవు విహితకర్మ చెయ్యి. కానీ నీ సత్యాత్మ పరబ్రహ్మ అని మాత్రము మరువకూడదు.. నీ లోని "నేను" అనే పరబ్రహ్మ అవికల్పుడు, ఆనంద స్వరూపుడు, సర్వాతీతుడు అని తెలుసుకో! ఇది మాత్రం మరువకు. దీన్ని ఆచరణాత్మకంగా సంభా వించు! విముక్తుడవుగా!

స యథా దుందు భేర్హన్యమానస్య న బాహ్యాన్
శబ్దాన్ శక్నుయాద్ గ్రహణాయ దుందుభేస్తు
గ్రహణేన దుందుభ్యా ఘాతస్య వా శబ్దోగృహీతః.

—బృహదారణ్యకోపనిషత్

"ప్రయోగింపబడిన భేరీనుండి బహిర్గతమవుతున్న శబ్దం బాహ్య మున, తనకు తానుగా పట్టుకోబడదు. కానీ, భేరీ లేక భేరీనికొట్టువుల్ల పట్టుకోబడినప్పుడు శబ్దం పట్టుకోబడుతుంది."

సమస్త ప్రాపంచకవాంఛావస్తువులు, అవి ఎవరివల్ల పుట్టినవో, ఎవరిలోనుంచిపుట్టినవో అతనిని పట్టుకున్నప్పుడే పట్టుబడుతున్నవి.

స యథా శంఖస్య ధ్మాయమానస్య న బాహ్యాన్
శబ్దాన్ శక్నుయాద్ గ్రహణాయ,
శంఖస్యతు గ్రహణేన శంఖధ్మస్య వా శబ్దోగృహీతః ॥

"ఊదబడుచున్న శంఖమునుండి వెలువడే ధ్వని తనకు తానుగా బాహ్యమున పట్టుకోబడదు. కానీ శంఖము లేక శంఖం ఊదేవాడు పట్టుకోబడినప్పుడు శబ్దం పట్టుకోబడుతుంది."

ఏమానవుడు బ్రహ్మైక్యం పొందుతాడో ఆ మానవునివాంఛలు సఫలమవుతవి. అట్టి బ్రహ్మైక్యమానవుని ఎవరూ మోసంచేయలేరు. అట్టి ముక్తపురుషుని ఏ బాధలు, ఏ శోకభయాలు తాకనైన తాక లేవు.

స యథా సర్వాసా మపాం సముద్ర ఏకాయనమ్
ఏవం సర్వేషాం స్పర్శానాం త్వగేకాయనమ్
ఏవం సర్వేషాం గంధానాం నాసికై కాయనమ్
ఏవం సర్వేషాం రసానాం జిహ్వైకాయనమ్
ఏవం సర్వేషాం రూపాణాం చక్షు రేకాయనమ్
ఏవం సర్వేషాం శబ్దానాం శ్రోత్ర మేకాయనమ్
ఏవం సర్వేషాం సంకల్పానాం మన ఏకాయనమ్
ఏవం సర్వేషాం విద్యానాం హృదయ మేకాయనమ్
ఏవం సర్వేషాం కర్మణాం హస్తా వేకాయనమ్
ఏవం సర్వేషా మానందానా ముపస్థ ఏకాయనమ్
ఏవం సర్వేషాం విసర్గాణాం పాయు రేకాయనమ్
ఏవం సర్వేషా మధ్వనాం పాదా వేకాయనమ్
ఏవం సర్వేషాం వేదానాం వాగేకాయనమ్ ౧౧

సమస్తనదులకు సముద్రం కేంద్రస్థానం. సమస్త స్పర్శలకు త్వగింద్రియం (చర్మం) కేంద్రస్థానం. సమస్త వాసనలకు నాశిక కేంద్ర స్థానం. సమస్త రుచులకు జిహ్వ కేంద్రస్థానం. సమస్త రూపాలకు

నేత్రం కేంద్రస్థానం. సమస్తశబ్దాలకు కేంద్రస్థానం శ్రవణేంద్రియం. సమస్త సంకల్పాలకు కేంద్రస్థానం మనస్సు. సమస్త విద్యలకు కేంద్ర స్థానం హృదయం. సమస్త కర్మలకు హస్తాలు కేంద్రస్థానం. సమస్త భోగమునకు కేంద్రస్థానం జననేంద్రియం. సమస్తవిసర్గములకు పాయువు కేంద్రస్థానం. సమస్తసంచలనాలకు పాదాలు కేంద్రస్థానం. సమస్త వేదాలకు వాక్కు కేంద్రస్థానం."

అదేప్రకారం సమస్తప్రపంచములకు సమస్త ప్రపంచవస్తు జాలమునకు ఆత్మ కేంద్రస్థానం. సమస్త శబ్దములకు సత్యాత్మ కేంద్ర స్థానం. సమస్తరూపాలకు ఆత్మ కేంద్రస్థానం. ఇంద్రియములద్వారా పనిచేయుచున్న సమస్తశబ్దరూపరసాదులు ఆత్మనే కేంద్రముగా కలిగి యున్నవి. అద్వితీయమైన ఈ ఆత్మనుండే సర్వమూ బయలుదేరుచున్నది.

స యథా సైంధవఖిల్య ఉదకే ప్రాప్త ఉదక

మేవాను విలీయేత, నహాస్యో ద్గ్రహణా యేవ

స్యాత్ యతోయత స్త్వా దదీతలవణ మేవ

ఏవం వా అరఇదం మహద్భూత మనంత మపారం విజ్ఞానఘన ఏవ, ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తా న్యేవాను వినశ్యతి నప్రేత్య సంజ్ఞాస్తీ త్యరే బ్రవీమి, ఇతిహోవాచయాజ్ఞ వల్క్యః. ౧౨.

"ఉదకములో లవణం వేసినప్పుడు అది కరిగిపోతుంది. ఉదక ములోనుంచి తిరిగి ఉప్పును తీయడానికి వీలులేదు, కానీ మనం ఏ జలకణం రుచిచూచినా ఉదకం ఉప్పగా ఉంటుంది – అదేవిధంగా ఓ మైత్రేయీ! అనంతమై అపారమై శుద్ధజ్ఞానైక స్వరూపమై ఈ మహ ద్భూతం (పరమాత్మ) ఈ సమస్త భూతములద్వారా వ్యక్తమై తిరిగి వానిలోనే అదృశ్య మవుతున్నది. అదృశ్యానంతరం నామరూపాలు (సంజ్ఞ) నశిస్తున్నాయి"—అని యాజ్ఞవల్క్యుడు బోధించాడు.

ఈ సత్యములను తెలుసుకున్న మానవుడు ఈ సత్యములను సందర్శించిన మానవుడు, పరమసత్యంతో ఐక్యమైపోతాడు. ఇంక అతడు నామరూపాలమీద ఆధారపడడు.

సహోవాచ మైత్రేయీ, అత్రైవమా
భగవాన్ మూముహత్, న ప్రేత్యసంజ్ఞాస్తి, ఇతి -

అప్పుడు మైత్రేయి వచించింది:- "భగవాన్! అదృశ్యానంతరం నామరూపాలు (సంజ్ఞ) ఉండవు - అని మీరు చెప్పారు. ఇది నాకు గందరగోళంగా ఉన్నది."

ఈ ఆత్మే సర్వ అభావానికి కారణమైతే, సర్వదుఃఖాలకు, సర్వబాధలకు, సర్వఅవరోధాలకు కారణమైతే, మనస్సనేది లేకుండా పోతే, మన వ్యక్తిత్వమేపోతే, ఇక మనము సర్వశూన్యంలో కలిసి పోవడమేకదా - అనే సంశయము మైత్రేయి మనస్సులో బయలు దేరింది. భర్తతో ఇలా అన్నది :- "ఇట్టి శూన్యస్థితి నాకు అవసరం లేదు. శూన్యస్థితికి, మృత్యువుకు, నాశనానికి కారణమైన ఈ మీరు చెప్పే ఈ ఆత్మ ఏమిటి? ఇలాంటి ఆత్మ నాకక్కరలేదు, సర్వమును వదలి శూన్యంలో కలిసిపోవలసివస్తే ఈ ఆత్మ నాకవసరంలేదు."

సహోవాచ, నవా అరేఽహం మోహం బ్రవీమ్యలంవా,
అరే ఇదం విజ్ఞానాయ ॥ 13 ॥
యత్ర హిద్వైత మివ భవతి, తదితర ఇతరం
జిఘ్రతి, తదితర ఇతరం పశ్యతి, తదితర ఇతరం
శృణోతి, తదితర ఇతర మభివదతి,
తదితర ఇతరం మనుతే, తదితర ఇతరం
విజానాతి, యత్రవా అస్య సర్వ మాత్మైవాభూత్
తత్ కేన కం జిఘ్రేత్, తత్ కేన కం పశ్యేత్,
తత కేన కం శృణుయాత్, తత కేన క మభి
వదేత, తత కేన క మన్వీత, తత కేన కం విజా-
నీయాత్? యే నేదం సర్వం విజానాతి తం కేన
విజానీయాత్? విజ్ఞాతార మరే కేన
విజానీయాత్? ॥౧౪॥

యాజ్ఞవల్క్యుడీరకంగా ప్రత్యుత్తరమిచ్చాడు: "ఓ మైత్రేయి! నిన్ను కలవరపెట్టే విషయము నే నేమీ చెప్పలేదు. ఓ ప్రియా! జ్ఞానమునకు ఇది అవధి.

"తనకు భిన్నంగా ఇంకొకటి ఉన్నప్పుడే ఒకడు ఇంకొకదాన్ని వాసనచూడగలడు. ఇంకొకదానిని చూడగలడు. ఇంకొకదానిని పొంద గలడు. వేరొకనికి నమస్కరించగలడు. ఇంకొకణ్ణి తెలుసుకోగలడు. ఈ సమస్తమూ ఆత్మే అయినప్పుడు అతడింక దానిని ఏ విధంగా వాసనచూడగలడు? ఏ విధంగా ఇంకొకదానిని చూడగలడు? ఏవిధంగా ఇంకొకదానిని వినగలడు? ఏ విధంగా ఇంకొకదానికి నమస్కరించ గలడు? ఏ విధంగా ఇంకొకదానిని పొందగలడు? ఏ విధంగా ఇంకొక దానిని తెలుసుకోగలడు? ఎవనిచేత ఈ సమస్తమూ తెలియబడు తున్నదో, అతనిని అతడెట్లు తెలుసుకోగలడు? ఓ ప్రియా! సర్వమును తెలుసుకొనే ఆ ఆత్మను మనస్సెట్లు తెలుసుకుంటుంది?"

వినకపోవడం అనేది రెండు కారణాలచేత జరుగుతుంది. ఒక కారణం చెవిటితనం. రెండవకారణం తన ఆత్మకు ఇతరంగా వెలుపల ఏ శబ్దమూ లేకుండాఉండడం. చూడకపోవడం రెండు కారణాలు. ఒకటి- గుడ్డితనం. రెండోకారణం- నీవు చూడడానికి నీకు వేరుగా ఇంకొకటి లేకపోవడం. వాసన చూడకపోవడానికి రెండు కారణాలుం టాయి. ఒకటి ముక్కు లేకపోవడం. రెండోది వాసనచూడడానికి నీకు వేరుగా ఇంకొకటి లేకపోవడం. ఇక్కడే మైత్రేయి వ్యతిరేకించింది. సత్యాత్మలో ఐక్యంగావడంచేత మనము వినేదిలేదు. కనేదిలేదు. వాసన చూచేదిలేదు. రుచి చూచేదిలేదుకదా! ఇక మనం నిజానికి గ్రుడ్డితనం, మూగతనం, చెవిటితనం పొందవలసిందేకదా? దీనికి మహర్షి ప్రత్యు త్తర మీ ప్రకారం విశదీకరించాడు. సత్యమైన ఆత్మతప్ప ద్వితీయ మైంది ఏదీలేదు. అనంతాద్వితీయమైన ఆత్మకు వేరుగా ఒకటిలేదు. గాబట్టి నీవు చూడలేవు. చెవుడువల్ల కాదు నీవు వినలేకపోవడం. విన డానికి ఆత్మేతరమైంది లేదుకాబట్టి వినలేవు. ద్వైతము, పరిమితత్వం ఆత్మకులేదు. అందుచేత నీవు పొందదగిన వస్తువు వేరుగాలేదు. ఆలో చనాశక్తి పోవడంచేతకాదు- నీవు ఆలోచించకపోవడం ఆత్మేతరమైంది ఇంకొకటిలేదు కాబట్టి, ఆత్మ అనంతాద్వితీయమైంది. ఆత్మకు వేరొకటి లేదు. అనంతాత్మే శ్రవణకారణం, అఘ్రాణకారం. ఆత్మశక్తే సర్వ శక్తులు. ఆత్మ ప్రభావంచేతనే నేత్రాలు చూడగలుగుతున్నవి. ఏకమై

యున్న అనంతమైయున్న ఆత్మచేతనే సమస్తేంద్రియాలు కర్మచేస్తున్నాయి.

మనస్సు అలాంటి అనంతస్థితికిఅలాంటి వర్ణనాతీతస్థితికి అధిగమించినప్పుడు అది ఇక తెలుసుకోలేదు. ఎందుకంటే అక్కడ అట్టి స్థితిలో సంకల్ప సంచలనమే కలుగజాలదు. మనస్సు ఏ విధంగా తనను పరిపాలిస్తున్న ఆత్మను గ్రహించగలదు ?

మన దగ్గర ఒక పట్టకారు ఉందనుకోండి. ఈ పట్టకారు నీ చేతి వ్రేళ్ళచేత పట్టుకోబడి యున్నది. నీ చేతులు, ఆ పట్టకారును గట్టిగా పట్టుకొన్నవి. ఆ పట్టకారు ఇంక ఏ వస్తువునైనా పట్టుకోగలదు. కానీ ఆ పట్టకారు వెనుకకు తిరిగి తనను పట్టుకున్న వ్రేళ్ళనే పట్టుకోలేదు.

అదే ప్రకారం నీ బుద్ధి, నీ మనస్సు ఒక పట్టకారును పోలి యున్నది. అయితే ఇది ఒక చిత్రమైన పట్టకారు. మామూలు పట్టకారుకు రెండు మొనలే ఉంటాయి. కానీ యీ మనస్సనే పట్టకారుకు మూడు మొనలు. ఒక మొన 'ఎందుకు' (అంటే నిమిత్తం), ఇంకొక మొన 'ఎప్పుడు' (కాలం,) మూడో మొన 'ఎక్కడ' (స్థలము) నిమిత్త స్థల కాలాలు అనేవి యీ మనస్సుయొక్క మూడు మొనలు.

ఒక విషయమునుగానీ, ఒకవస్తువునుగానీ పూర్ణంగా గ్రహించడమంటే అర్థ మేమిటి ?

ఒక వస్తువును పూర్ణంగా గ్రహించమంటే ఈ మనస్సనే కారు మొనలతో ఆ వస్తువును గట్టిగా పట్టుకోవడ మన్నమాట. ఒక వస్తువు యొక్క నిమిత్త స్థలకాలాలను నీవు తెలుసుకున్నట్లయితే ఆ వస్తువును నీవు గ్రహించినట్లు. అంటే ఆ వస్తువు నీ మనస్సుక్రింద చిక్కుతుంది. ఆ వస్తువులో నీ మనస్సు చొచ్చుతుంది. దానిలోగుండా నీ మనస్సు దూరుతుంది. నీ మనోపాత్రలో ఆ వస్తువు పడుతుంది.

మనస్సు గ్రహణశక్తి, మూడు మొనల వింతరకపు పట్టుకారు లాంటిది. సమస్త విషయములను మనస్సు గ్రహించగలుగుతుంది.

కానీ ఈ నీ మనస్సు పట్టకారు చేతులలో చిక్కియున్నమాదిరి, ఆ చిచ్ఛక్తిచేత పరిపాలింపబడుచున్నది.

మనస్సుకు బుద్ధికి స్వాతంత్ర్యం ఉన్నదా? అయితే గాఢ నిద్రావస్థలో మరి ఎందుకు మనస్సుకు శక్తి లేదు? దానికి స్వాతంత్ర్యమే ఉంటే, అది సర్వావస్థలలో స్వేచ్ఛగా ఉండాలెగదా! దానికి స్వాతంత్ర్యంలేదు. మనస్సు, బుద్ధి, ఒక అతీతపరమశక్తిచేత పరిపాలింప బడుచున్నది. బుద్ధి వెనుకకు తిరిగి తనను పట్టుకొనియున్న సత్యాత్మను పట్టుకోలేదు. మనస్సు ఆత్మను "ఎందుకు, ఎప్పుడు, ఎక్కడ" నీ వున్నావనే ప్రశ్న వేయలేదు. సత్యాత్మను ప్రశ్నించే శక్తి మనస్సుకు లేదు. బుద్ధి ఆత్మను పట్టుకోలేదు. పరమాత్మను గ్రహించలేదు. ఆత్మ మనస్సుకు అతీతమై ప్రకాశిస్తున్నది.

బుద్ధి, ఆత్మను గ్రహించలేదు. కానీ ఆత్మలో సముద్రములో బుడగలాగా కలిసిపోగలదు. బుడగ సముద్రము నుంచి విడవడలేదు. కానీ పగిలి, సముద్రంలో కలిసిపోగలదు. అదేప్రకారం, బుద్ధి ఆత్మ నుంచి విడవడలేదు. కానీ ఆత్మలో లీనం కాగలదు. ఇదే మాయా తత్త్వం. బుద్ధి "ఎందుకు ఎప్పుడు, ఎక్కడ, ఈ ప్రపంచమును సృష్టించావు?" - అని ఆత్మను భగవంతుని ప్రశ్న వేయలేదు. మనస్సీ ప్రశ్నను భగవంతునికి వేయ సాహసించలేదు.

అనంతత్వంలో ఏకంకావాలంటే, ఈ ఆత్మను, ఈ నిజమయిన సత్యసాగరమును, ఈ సర్వపాలకాత్మను తెలుసుకోవాలె - ఏతత్ సాక్షాత్కారంపొందాలె. ఈ దివ్యాత్మానుభవంపొందాలె. ఈ సత్యాత్మ 'నేను' అని పేర్కొనబడుచున్నది. ఈ సత్యాత్మ, ఈ పరి శుద్ధమయిన "నేను" - నిమిత్తకాల స్థలాలకు అతీతమయింది. ఈ పరి శుద్ధమయిన, ఈ పరిపూర్ణమయిన సత్యాత్మ ఓం కృతిచేత వ్యవ హృతమై యున్నది. ఓం ఇత్యేకాక్షరం బ్రహ్మ! ఓం-అంటే 'అహం'- అని. ఓంకార ఉచ్చారణచేసేటప్పుడు, ఆత్మధ్యానం చెయ్యి. ఓంకార సంస్మరణచేసేటప్పుడు నీ స్వస్వరూపధ్యానమే చెయ్యి. ఓంకారసంకీర్తన చేసేటప్పుడు, సర్వాంతర్గతమై భాసిస్తున్న ఆ సత్యమైన నేను 'నేను'-

నీవే నని హృత్పూర్వకసంభావనచెయ్యి. ఇట్టి గాఢధ్యానంచేత, మనస్సు పరమసత్యంలో ఐక్యమవుతుంది. ఇట్టి గాఢభక్తిచేత, ఇట్టి సజీవజ్ఞానం చేత, మనస్సు అనే బుడగ పగిలి పరమసత్యమనే మహాసాగరంలో ఏకమవుతుంది. ఇదే సాక్షాత్కారపథం. ఈ గాఢధ్యాననిష్ఠ, ఈ సజీవ జ్ఞానం, ఈ మిథ్యాహంకార నిగ్రహాతే పరమసత్యప్రాప్తికి మార్గం! విముక్తిపథం!

సత్యమయిన "నేను" సర్వశరీరాల్లో ప్రకాశిస్తున్నది. సత్య మయిన ఈ 'నేను' సమస్తమునూ పరిపాలిస్తున్నది, అనంతమయిన ఈ సత్యాత్మ ఒక చిన్న అణువులోనూ, ఒక బ్రహ్మాండసాగరంలోనూ ఏకరీతిగా దేశ కాల నిమిత్తాలకతీతమై ప్రకాశిస్తున్నది. ఆ సత్యమయిన 'నేను' నీవే నని సంభావించు. సందర్శించు. ఆ అనంతాఖండ పర మాత్మవు నీ వనే దివ్యానుభూతిపొందు. ఓహో! నీలో ఎంత దివ్య పరిణామం! ఎంత మహత్తరమయిన పరివర్తన కలుగుతుందనుకున్నావు! సర్వస్థలవ్యాపకుడను నేను. సమస్తకాలగతుడను నేను. సమస్తస్థల జగదాధారమయిన పరమాత్మను నేను - అని సంభావించు. అనంత స్థలకాలనిమిత్తాలు, అనంతశక్తి, అనంతబలం, అనంతప్రతిభ నేనే అని సంభావించు. ఇది ఏదో అజ్ఞానప్రాగల్భ్యంకాదు. యద్భావం తద్భవతి. ఈ దివ్యత్వసంభావనచెయ్యి. నీవు ప్రబుద్ధుడవై ప్రకాశిస్తావు. సమస్త స్వార్థవాసనాపాశములనుంచి నీవు విముక్తిపొందుతావు. ఆత్మను విశ్వసించు సమస్త బాధాందోళనలు పటాపంచలై పారి పోతవి. నీవు సమస్తమయిన అసూయాక్రోశాలకు, బాధావరోధాలకు అతీతుడవౌతావు. "అహం బ్రహ్మాఽస్మి" అని సంభావించు. తత్త్వమసి.

మనస్సుకు తన కార్యకారణమునుగూర్చి ప్రశ్నించ నధికారం లేదు. తనఫలితమయిన దేహంతో ఏకీభవించడానికి మనస్సుకు అధికారంలేదు.

ఉదాహరణకు ఈ రుమాలను తీసుకోండి. ఇది దేనితోనైన ఏకీభావం పొందాలంటే ఇది అసలు దేనితో నేయబడిందో ఆ సిలుకు

తోటే ఏకీభావంపొందాలె. అంతేగాని ఈ రుమాల తన పొడుగుతో వెడల్పుతో మందముతో ఏకీభవించడానికి అధికారంలేదు.

అదేప్రకారం మనస్సు దేనితోనైనా ఏకీభావంపొందాలంటే, అది తన స్వవస్తువుతోటే, తన నైజప్రకృతితోటే ఏకీభావంపొందాలె. మనస్సు బుడగై మహాగంభీరసాగరమయిన ఆత్మలో, ఆ 'నేను'లో పగిలి కలిసిపోవాలె. అంతే కాని, అది దేహంతో ఏకీభవించడానికి వీలులేదు. శరీరముతో ఏకీభవించడానికి అధికారం లేదు.

ఓహో! నిజమయిన బ్రహ్మత్వం సత్యాత్మ, ఈ చిచ్ఛక్తి ప్రాపంచికసంబంధాలతో, ప్రాపంచికవ్యవహారాలతో ఏకీభవింపబడటానికి అధికారంలేదు. నీ వీ మహనీయబ్రహ్మత్వానివి! పరమసత్యమవు! నీ స్వస్వరూపమైన బ్రహ్మతేజమును తెలుసుకో! దానిని ధ్యానించు! ఈ దివ్యబ్రహ్మానుభవం పొందు! శోక భయాకుల వ్యధలకు అతీతుడవై ప్రకాశించు!

ఓమ్! ఓమ్! ఓమ్!

# ఏ గృహాలలో శాంతి లభించే మార్గం ?

శాన్‌ఫ్రాన్సిస్కో ఎకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో 1902 డిశంబరు 30 తేదీ

ఇచ్చిన ఉపన్యాసం]

నా ఆత్మస్వరూపు లైన మహాజనులారా !

ఈ దినం, విచారింపవలసిన పత్రములు చాలా ఉన్నవి. న్యాయాధికారి సభకు వస్తూ పత్రా లన్నీ తెస్తాడు. కానీ తెచ్చిన పత్రము లన్నీ ఆ నాడే విచారించడు. అవసరమైనవి కొన్నిమాత్రమే విచారిస్తాడు. అదేప్రకారం నే డున్న ఈ పత్రాలలో చాలావరకు యీ నాడు విచారణకు రావు. వీటన్నిటిని ఈనాడు విచారించకపోవ డానికి కారణం వేరుగా ఉన్నది. కారణం ఏమిటంటే-ఈ ఉన్న ప్రశ్నాపత్రములన్నీ నూటికి 99 పరలోకమును గురించి, ఇతర లోకా లను గురించి అడిగినవి. ప్రస్తుతం మీరు నివసిస్తున్నది ఈ ప్రపంచంలో కదా ! ప్రస్తుతం మీకు సంబంధం లేని పరలోక విషయములకంటే మీ ప్రస్తుతవ్యవహార జీవితాలకు ఎక్కువ అవసరమైన విషయమునుగూర్చి కొంచెం ప్రసంగించడం మంచిది.

క్రిందటి సాయంకాలం తీసుకున్న ప్రసంగవిషయమునే నేడు తీసుకున్నాము. ఇది చాల ముఖ్యమైన విషయం. "వివాహం చేసు కున్న మానవుడు భగవత్సాక్షాత్కారం న్యాయరీత్యా పొందగలడా?" ఇది చాలా దీర్ఘమైన విషయము. దీనిని గురించి విపులీకరించడానికి ఈ రాత్రి చాలదు. అవకాశం మున్నంతవరకు ఈ రాత్రికి ప్రసంగిద్దాము.

భారతదేశంలో, ఒక పూర్వ్కో క్రూరుడైన, చమత్కారియైన ఒక యజమాని ఉన్నాడు. అతడు సేవకులను చమత్కారంగా బాధించేవాడు. ఒకనాడు అతని సేవకుడు మంచి విలువగల రుచ్యా హారమును వండాడు. ఈ పదార్థం తా నొక్కడే తినాలననీ, సేవకుడు తినకుండాచేయాలనీ ఆ నిర్దయుడైన యజమాని ఉద్దేశ్యం. ఈ పదా ర్థము వండబడింది రాత్రిపూట. యజమాని సేవకుని పిలిచి యిలా అన్నాడు .- "ఇప్పుడు మనము తినవద్దు. రేపు ప్రొద్దున తిందాము-

వెళ్ళి పండుకో." యజమానియొక్క అసలు ఉద్దేశం గ్రహించారా? ఈ రాత్రికి ఏమీ తినకుండా పండుకుంటే, ప్రొద్దున తనకు తీవ్రమయిన ఆకలి వేస్తుందికదా! అప్పుడు ఆ మొత్తం తనే తినివేయవచ్చు. మిగిలితే కదా సేవకుడు తినేది. ఈ రకంగా, సేవకునికి మిగులకుండా, తానొక్కడే తినవలె నని వాని అసలు ఉద్దేశ్యం. సేవకుడు, గంజో గటకో త్రాగాలనీ, ఈ రుచ్యాహారము తినకుండా ఉండాలనీ వాని లోపలి ఉద్దేశ్యం. కానీ ముఖమెదుట ఇది విప్పిచెప్పలేక ఈ పన్నాగం పన్నాడు. "వెళ్ళి పండుకో. ఈ రాత్రికి మనలో ఎవరికి మంచి కల వస్తుందో! అతడు ప్రొద్దున ఈ ఆహారము తినాలి. మంచి కల నీకు వస్తే, ఈ మొత్తం నీవే తిందువుగాని. నాకు వస్తుందా, ఇదంతా నేనే తింటాను. నీవు ఏదో రాగిసంకటి తినవలసివస్తుంది" - అని యజమాని సేవకునికి చెప్పి పంపాడు. తెల్లవారింది. యజమానీ, సేవకుడూ ఒకరి ఎదురుగా ఒకరు కూర్చున్నారు. యజమాని సేవకుని, నీ కేం కల వచ్చిందో చెప్పమన్నాడు. సేవకుడన్నాడు :- "అయ్యా మీరు యజమానులు. మీరే ముందు తమ కేం కలవచ్చిందో సెలవియ్యాలి తరువాత నేను విన్నవించుకుంటాను." ఈ సేవకుడు కూటికిలేని దరిద్రుడు. వీనికి పొట్టపొడిచినా అక్షరవు ముక్క లేదు. ఈ మొద్దుకు మంచి కలలంటే ఏమిటో తెలుస్తుందా? - అని యజమాని అనుకున్నాడు. తన కల చెప్పాడు :-" కలలో నేను ఈ యావత్ భారత వర్షముకూ ఏకైక సమ్రాట్టునైనాను. నా కలలో సర్వరాజ్యాలు హిందూదేశ చక్రవర్తిక్రిందికి వచ్చినవి. హిందూదేశ ప్రభువునై సర్వ ప్రపంచ పరిపాలనము చేశాను". విన్నారా ఇదీ - ఈ క్రూరుడయిన యజమాని కల. నిజమయిన భారతీయులు నీటి బుడగలవంటి ఈ తుచ్ఛమయిన ఐశ్వర్య వికారాలను ఆరాధించబోరు. శిశుదశలోని అజ్ఞులే ఇట్టివాటికి పరితపిస్తారు: సరే ఆ యజమాని కల యిది తాను భారతవర్షమునకు చక్రవర్తియై సమస్త ప్రపంచమును పరిపాలించినట్లూ, సమస్త దేశాధీశులు, సామంతరాజులై తనముందు కానుకలు చెల్లిస్తూ వినమ్రులై నిలుచున్నట్లూ, సమస్త దేవతలూ, సమస్త ఋషులూ, తన సభకువచ్చి, తన కుడిప్రక్కో ఎడమప్రక్కో ఆసీనులై నట్లు ఆ యజమాని తలపోశాడు. (కుడిప్రక్కో, యెడమప్రక్కో

రాముడికి జ్ఞప్తి లేదు). తన కలంతా చెప్పి, నీ కల ఏమిటో చెప్పమని సేవకుని అడిగాడు.

పాపం, ఆ సేవకుడు ఏమిచేశాడనుకున్నారు. గడగడ వణకుతూ "అయ్యా! అయ్యా! నా కలాంటి కల రాలేదండీ" అని చెప్పాడు. యజమానికి మనస్సులో సంతోషమైంది. తన మంత్రం పారిందను కున్నాడు. ఇంకేం – ఆ కమ్మటిపదార్థమంతా తనొక్కడే తినవచ్చు నని శాంతిపడ్డాడు. సేవకుడు తన కలవిషయం ఈ విధంగా చెప్పు తున్నాడు, "అయ్యా! కలలో ఒక పెనుభూతం కనబడింది. భయంకర మయిన ఆకారంతో ఒక తళతళలాడే కత్తి ఝళిపిస్తూ నామీదికి ఉరికి వచ్చింది." "ఆ–తరువాత ఏమి జరిగింది ?" అని యజమాని అడి గాడు. సేవకుడు తన కలలో తరువాత విషయం ఈ విధంగా చెప్పాడు. "అయ్యా! ఆ భూతం చంపడానికి నా వెంటబడింది." ఈ మాట విని యజమాని కథ దారికి వస్తున్నదని లోలోపల సంతోషంతో చిరునవ్వు నవ్వాడు. "ఆ భూతం నన్ను చంపబోయింది. కత్తితో నరుక బోయింది" అని చెప్పాడు సేవకుడు. "నీ వేంచేశావప్పుడు ? ఎందు కా భూతం నిన్ను చంపబోవడం ?" అని ప్రశ్నించాడు యజమాని. సేవకు డన్నాడు. "అయ్యా! చంపమంటావా లేకపోతే నీవుదాచిన ఆ రుచ్యాహారమును తింటావా ? అన్నది భూతం." "తరువాత ఏమి చేశావు మరి ?" అని అన్నాడు యజమాని. "ఏంజేస్తాను. వంటగది లోకి వెళ్ళి ఆ పదార్థమంతా రవ్వకూడా విడువకుండా తిన్నాను" అని సేవకుడు ప్రత్యుత్తర మిచ్చాడు. "ఎందుకు నన్ను లేపలేదు ?" అని యజమాని అడిగాడు. "అయ్యా! మీరు ఈ సమస్త ప్రపంచ చక్రవర్తులుగా ఉన్నారు. మీ పేరోలగంలో మహామహు లందరు పరివేష్టించియున్నారు. పహరావారు విచ్చు కత్తులతో ద్వార ప్రదేశంలో పచారుచేస్తున్నారు. దేవరవారి సన్నిధికి రావాలంటే, ద్వారపాలకులు నన్ను చంపేస్తారు. తమ సన్నిధికి వచ్చి నా అవస్థ విన్నవించడానికి వీలు లేకపోయింది. ఇక ఏంచేస్తాను ? బలవంతమున, తప్పక ఆ రుచిగల పదార్థమంతా నేనొక్కడనే తినవలసివచ్చింది"– అని సేవకుడు ప్రసంగించాడు.

మీరు ఎప్పటిస్వర్గాలకో, ఎప్పటిలోకాలకో కలలుకంటున్నారు. ఈ కలలు మధురమయినవే. మంచివే. ఈ మధురస్వప్నాలలో మీరు ఆకాశసౌధాలు కడుతూ, మనం అది చెయాలె, ఇది చెయ్యాలని అనుకుంటున్నారు. సైతాను మనలను ఏంచేస్తాడో, భగవంతుడు దండిస్తాడేమో అని భయపడక మీకు తప్పడంలేదు. మన మీ రకంగా ఉండాలె, లేకపోతే ఫలానా దేవదూత మనలను నరకబిలంలోని భగభగమండే అగ్నికుండంలోనుంచి స్వర్గమునకు పోనియ్యదు. ఇలా మీరు కలలుకంటున్నారు. కానీ భూతభీతులై ఆ రుచ్యాహారమంతా తిని వేసిన సేవకునివలె చరించడమే శ్రేయస్కరమని రాముని అభిప్రాయం. సేవకుడు తన ముందున్న ప్రస్తుతస్థితిని చక్కచేసుకున్నాడు. ఈ ప్రపంచంలో మీరు బాగుపడదగిన ఈ ప్రస్తుతజీవితంలో మీరు అనుష్ఠింపదగిన విషయములనే మొదట చూచుకోవడం శ్రేయస్కరము. స్వాప్నికప్రపంచాలు, పరలోకాలు మొదలైనవాటిని గురించి తరువాత విచారించుకోవచ్చు.

ధర్మదృష్టి మొదట గృహంలోనే పుడుతుంది. ధర్మమును మొదట గృహంలో ఉండగానే ఆరంభించు.

మీ అందరికీ సంబంధించిన సమస్యలోకి రాముడు వస్తున్నాడు. "పెండ్లి చేసుకున్న దంపతులు శోకాందోళనా బాధలకు దూరులై శాంతిజీవితమును గడిపే మార్గం ఏమిటి"? ఇదీ ప్రశ్న. "ఓ దేవుడా! మా దుఃఖాలు పోగొట్టు. ఓ క్రీస్తూ మా దుఃఖాలను నివారణ చెయ్యి ఓ కృష్ణా! ఓ బుద్ధుడా! మా దుఃఖాలను పోగొట్టు!" – అని ప్రజలు ప్రార్థిస్తారు. మరణానంతరం మీ బాధలు వాండ్లు తొలిగించవచ్చు, లేకపోవచ్చు. కానీ ఈ ప్రస్తుత జీవితంలో మీ బాధలు ఎవరు తొలగిస్తారు? ఈ జీవితంలో భర్త భార్యకు క్రీస్తు కావాలె. భార్య భర్తకు క్రీస్తు కావాలె. కానీ ఇప్పుడేమి జరుగుతున్నది? ప్రతిభార్య భర్తకు క్రీస్తు కావడానికి బదులు జూడస్ ఇస్కారియేటు*గా మారిపోయింది.

* జూడస్ ఇస్కారియేట్ క్రీస్తు 12 మంది శిష్యులలో ఒకడు. ఇతడే 16 వెండి నాణెముల కాశించి తన గురువైన క్రీస్తును శత్రువులకు పట్టించి క్రీస్తుయొక్క చేతనకు కారణమైనాడు.

ప్రతిభర్త తనభార్యకు క్రీస్తుకావడానికి బదులు జూడస్ ఇస్కారియే టుగా మారిపోయింది. ఇట్టి వైపరీత్యవిషయాలను సక్రమపథంలో పెట్టే మార్గంఏమిటి ? ప్రతి భర్తా, ప్రతి భార్యా సర్వసంగ పరిత్యాగం చెయ్యాలె. క్రైస్తవ ప్రపంచదృష్ట్యా క్రీస్తు సర్వసంగపరిత్యాగ స్వరూపం. అదే ప్రకారం ప్రతిభార్య సర్వసంగపరిత్యాగస్వరూపంగా మారినట్లైతే, ఆమె తన భర్తను రక్షించ గలుగుతుంది. పరిత్యాగం అన్నమాట ఎత్తగానే ప్రతిమానవుడూ గడగడ వణకిపోతాడు. ఈ మాట ఎత్తితే ప్రతివ్యక్తీ భయపడతాడు. కానీ సంగపరిత్యాగం లేకుండా మీ గృహాలలోకి స్వర్గకిరణం రవ్వంతకూడా ప్రవేశించ డానికి అవకాశం లేదు. ఈ సర్వసంగపరిత్యాగ మన్న పదం విపరీత మయిన అపార్థదశ పొందింది. పూర్వోపన్యాసాలలో ఈ పదం పలు చోట్ల వాడబడింది. దీని నిజమయిన అర్థమును విశదపరచడాని కిది తగినసమయం. సర్వసంగ పరిత్యాగం నిన్ను మహారణ్యాలకు పొమ్మని చెప్పదు. సర్వసంగపరిత్యాగం, నిన్ను గుడ్డ లన్నీ విడచి దిగంబరుడవై సంచరించాలని శాసించదు. సర్వసంగపరిత్యాగము, దిసితలతో, దిసి కాళ్ళతో తిరగాలని ఆదేశించదు. ఇది సంగపరిత్యాగం. ఇదే గనుక సంగపరిత్యాగార్థమైతే వివాహితులైన దంపతులు సంగపరిత్యాగం ఏ రకంగా చేయగలరు ? మరి భార్యాభర్తలుగా జీవించాలి. మరి ఇల్లున్నది. ఆస్తి ఉండె. అలాంటప్పుడు భార్యాభర్తలు సర్వసంగ పరిత్యాగులు కావడ మే విధంగా ? హైందవ వేదప్రపంచములో సంగ పరిత్యాగ రూపచిత్రమును మన మొకటి చూస్తాం. శివదేవుడు, పార్వతీదేవి కుటుంబసహితులై కైలాస శిఖరాలమీద కలసి ఆశీనులై ఉంటారు. సతీపతులైన గౌరీ శివు లుభయులు కుటుంబసమేతంగా తమ ధర్మాచరణం చేస్తున్నారు. వారు గృహస్థులు. హిందూశాస్త్రములు వారిని సర్వసంగ పరిత్యాగ స్వరూపంగా అభివర్ణిస్తున్నాయి. సర్వ సంగపరిత్యాగ మంటే హిందువుల అభిప్రాయము అరణ్యాలకు నిర్గ మించడమనీ, సంఘమునకుదూరము కావడమని, సర్వప్రపంచమును అస హ్యించుకోవడ మని మీరనుకుంటున్నారు. హైందవుల అభిప్రాయము ఇది కానేకాదు. గృహస్థ జీవితంలోకూడా, హైందవులు సర్వసంగ పరిత్యాగమును, సన్న్యాసత్వమును అవలంబించవలసియున్నది.

ఈ వేదాంతం, ఈ సత్యతత్త్వం అరణ్యాలకు నిర్గమించిన కొద్ది మంది కోసరమే కాదు. అట్లయితే, ఈ వేదాంతప్రయోజన మేమిటి ? మన కా వేదాంతం అనవసరం. తీసి గంగలో పారెయ్యండి. మన కా వేదాంతం నిష్ప్రయోజనం. హైందవ ప్రబోధితమైన ఈ సంగ పరిత్యాగం, సర్వప్రపంచానికి కోరదగింది. హిందువులు ప్రబోధించిన ఈ పరిత్యాగవిధానం విజయరహస్యమునకు ఏకైకసూత్రం. పరిత్యాగి కాని మానవుడు వీరుడు కాలేడు. పరిత్యాగి కాంది ఏ కవీ కవిత్వం వెలువఱచలేడు. అవినీతి కలవాడనే నెపంమీద ఇంగ్లాండునుంచి వెడలగొట్టబడిన బైరన్ విషయం మీరు ఎత్తవచ్చు. బైరన్ సైతము, కవితాప్రతిభను పరిత్యాగంచేతనే పొందగలిగాడని వేదాంతం వ్యాఖ్యానిస్తుంది. రాముడు పరిత్యాగమును గురించి విచిత్రమైన నిర్వచన మిస్తున్నాడు. వాషింగ్టన్‌లో పరిత్యాగతత్వ మున్నది. అతనిలో పరిత్యాగం లేకపోతే, అతడు యుద్ధంలో విజయం పొందేవాడుకాదు. ఈమాట మీకు ఆశ్చర్యం కలిగించవచ్చు. నెపోలియన్ బోనోపార్టిగానీ, వాషింగ్‌టన్‌గానీ, విల్లింగ్‌టన్‌గానీ, అలెగ్జాండర్‌గానీ, సీజర్‌గానీ, ఎవరైనాగానీ, ప్రతివీరుడైన వ్యక్తి విజయం పొందడానికి, జాతీయ నాయకుడు కావడానికి సమస్త సేనా సముద్రములను ఆజ్ఞప్రాజ్ఞలలో నడిపించడానికి ప్రపంచాతీతుడై, నిస్సంగుడై చరించి తీరాలె. వాని మనస్సు అవికల్పమై ఉండాలె. వాని మనస్సు ప్రశాంతి వహించి, స్వస్థతవహించి ఉండితీరాలె. వాని సమస్త శక్తులు కేంద్రీకృతమై ప్రకాశించి తీరాలె. బాహ్య పరిస్థితులచేత అతడు చలితుడు కాకూడదు. దీని అర్థ మేమిటి ? దీనిని సర్వసంగపరిత్యాగమని చెప్పవచ్చు. ఒకనిలో ఈ పరిత్యాగం ఎంత ఉద్దీపిస్తుందో, అంత ఎక్కువగా అతడు ప్రకాశిస్తాడు. నెపోలియన్ యుద్ధరంగంలోకి వచ్చి 'ఆగండి ! అనే ఒక మాటతో శత్రుసేనా సముద్రమును స్తంభింపజేసాడు. ఎక్కడిదాశక్తి ? ఆ శక్తి ఎక్కడనుంచి వస్తున్నది ? ఆ శక్తి నెపోలియను యొక్క సత్యాత్మ నిమగ్నతచేత, అంతర్బ్రహ్మాత్మ విలీనతచేత, ఆత్మస్థితిచేత ఉద్గత మవుతున్నది. అతని ఆత్మలోనుంచి ఈ శక్తి బయలుదేరుతున్నది. ఈ సంగతి అతనికి తెలియవచ్చు తెలియకపోవచ్చు అతడు శరీరాతీతుడై, మనోతీతుడై, సర్వాతీతుడై, యుద్ధక్షేత్రంలో

ఉన్నాడు. అతనికి ప్రపంచమే కనపడడంలేదు. ఈ విధంగానే మహా మేధావి అయిన సర్ ఐజాక్ న్యూటను తన విజ్ఞానశాస్త్ర తాత్త్విక భాగ్యమును ప్రపంచమునకు ప్రసాదింపను, తన జీవితాచరణలో ఈ పరిత్యాగ సాక్షాత్కారం పొందవలసి వచ్చింది. అతడు దేహాతీతుడైనాడు. మనస్సుకు అతీతుడైనాడు. ప్రపంచానికి అతీతుడైనాడు. అతడు ఇంట్లో కూర్చున్నా, అతనికి ఇల్లు కనపడడంలేదు. ఇల్లు ఇల్లుగా లేదు. మిత్రులు మిత్రులుగా కనపడడంలే దతనికి. ఓహో! ఎట్టి సమాధిస్థితి! అతడు ఏమిచేయడంలేదని జనులంటారు. అతడు ఏమీ చేయనట్లు నీకు కనపడుతున్న తదేకసమయంలో అతడు మహా కర్మ చేస్తున్నాడు. బాహ్యమున కతడు ఏమీ చేయనట్లు కనబడుతున్నాడు. అతడు సర్వసంగపరిత్యాగము చేశాడు. అందుచేతనే మహాకర్మ చేస్తున్నాడు. ఈ మహాపురుషు లందరు, ఈ వీరులందరూ, ఈ ప్రతిభాశాలు లందరూ, వారికి తెలియకుండానే, ఏదో ఒకరకంగా పరిత్యాగానుభూతి పొందినవారే. సమస్త మహావీరులు, సమస్త మేధావులు అవ్యక్తంగా ఏ సత్యమును ఆచరణలో పెట్టారో, దేనిచేత ప్రబుద్ధశక్తి దీపితులైనారో, దానిని సక్రమంగా మీకు సుగతం చేయడమే హైందవతత్త్వ దర్శనాశయం. సక్రమవిధానములో అట్టి ఆత్మప్రాప్తికి తగు విజ్ఞానోదయమును కలిగించి, దానిని పొందడానికి తగిన ధర్మములను విహితపథాలనుచూపి, తదాత్మనిష్ఠులను చేయడమే హైందవతత్త్వదర్శనాశయం.

హిందువులు ఈ సర్వసంగపరిత్యాగమును జ్ఞానంగా వర్ణించారు. అంటే పరిత్యాగమునకూ, జ్ఞానమునకూ భేదములేదు. రెండూ ఒకటే. పరిత్యాగము అన్నపదము జ్ఞానము అన్నపదము ఒకటే. జ్ఞానమంటే ఈ లౌకికజ్ఞానముకాదు. ఈ భౌతికవిజ్ఞానముకాదు. అయితే, భౌతిక జ్ఞానము నిరుపయోగమనికాదు. అది మీకు చాలా ఉపయోగకరమయిందే. కానీ ఈ జ్ఞానము సత్యజ్ఞానము కాదు. ఈ లౌకికజ్ఞానము చేతనే మీకు ఎన్నటికీ శాంతిలభించదు. పరిత్యాగరూపకమయిన జ్ఞానమే సత్యజ్ఞానం; సత్యాత్మజ్ఞానం; నీ స్వస్వరూపజ్ఞానం. నీ స్వస్వరూపజ్ఞానం మానసికంగా నీ విప్పుడు పొందగలవు. అది చాలా?

మానసికజ్ఞానము పూర్ణంగాచాలదు. కొంతవరకుమాత్రమే ఉపయోగ కరం. నీవు జ్ఞానివికావాలంటే. ఈ జీవితంలోనే నీవు విముక్తుడవు కావాలంటే, ఈ సమస్తవిశాలప్రపంచము నీకు స్వర్గంగా మారిపోవా లంటే, నీ వీ బ్రహ్మజ్ఞానము పొందాలి. నేను పరబ్రహ్మను. నేనే దివ్యసూత్రమును. నేనే సాక్షిమాత్రమయిన పరమచిచ్ఛక్తిని. నేనే పరమాత్మను. సమస్తనామరూపాలతో ప్రకాశించే పరమసత్యమును నేనే-అన్న జ్ఞానసాక్షాత్కారం నీవు పొందాలి. ఈ జ్ఞానం మానసి కంగా మాత్రమే చాలదు. ఈ జ్ఞానం అనుభవరూపకంగా ప్రకా శించాలి. ఈ జ్ఞానం ఆచరణాత్మకం కావాలి. ఈ జ్ఞానం నీ నరనరంలో నీ ప్రతి రక్తనాళంలో, నీ హృదయంలో ప్రతిస్పందించాలి. ఇట్టి అనుభవజ్ఞానంచేత జీవన్ముక్తుడవై నీవు ప్రకాశించగలవు. ఈ అనుభవ జ్ఞానమే సర్వసంగపరిత్యాగం. ఇట్టిజ్ఞానమునుపొందు నీవు సర్వసంగ పరిత్యాగివై ప్రకాశించగలవు.

అరణ్యనిర్గమనం సాధనమాత్రమే. అరణ్యాగమనం విశ్వవిద్యా లయానికి పోవడంలాంటిది. విశ్వవిద్యాలయంలో మనం జ్ఞానమును ఆర్జిస్తాము. అయితే మన జీవితపర్యంతం అక్కడే ఉండిపోవాలని అర్థ మెక్కడ ఉన్నది? అదేమాదిరి జ్ఞానార్జమునకు కొంతకాలం నీవు ఏకాంతారణ్యములకు వెళ్ళి ఉండవచ్చు. అంతేకాని వేదాంతతత్త్వం అరణ్యవాసం పరిత్యాగమని ఎప్పుడూ ప్రబోధించడంలేదు. మీా నివా సంతో, మీా స్థితితో, మీా శరీరకర్మతో పరిత్యాగమునకు ఏమీా సంబంధంలేదు. పరిత్యాగం నిన్ను ఉత్తమస్థితిలో మహోన్నతోచిత స్థానంలో నిలుపుతుందిమాత్రమే. పరిత్యాగం నీ శక్తుల ఉద్దీపింప జేస్తుందిమాత్రమే. పరిత్యాగం నీ బలమును ధృవీకరించి నిన్ను భగ వంతునిగా జేస్తుందిమాత్రమే. పరిత్యాగం నీ దుఃఖమును పోగొడు తుంది. నీ భయాందోళనామేఘాలను తుత్తుమురుజేసి పారద్రోలు తుంది. నీవు అభయమూర్తివై ఆనందస్వరూపుడవై ప్రకాశించగలవు.

వివాహితుడు, ఈ పరిత్యాగదివ్యానుభవం పొందడ మేవిధంగా? భార్యాభర్తలకు పరస్పరం సహాయంచేసుకోవాలని అభిమతండుంటే, ఈ నాటి కీవిషయములు చక్కబడగలవు. భార్యాభర్తలు ఒకరి

కాకదు రత్నఋలు, క్రీస్తులుకాకపోతే ఈ బైబిలు గ్రంథాలన్నీ మీకు ఎక్కువ మేలుచేయలేవు. చూడండి. ప్రజలు మతోపన్యాసాలకువచ్చి "సర్వమును పరిత్యజించండి, మీ ఆస్తిపాసులను, మీ శరీరమును భగవంతునిగా చూడండి. మీరు శరీరదృష్టివదలి బ్రహ్మదృష్టి పొందండి"-అనే ప్రబోధాలను వింటారు. ఇట్టి ధర్మబోధలు వింటారు. కొంతజ్ఞానం మనస్సులోకి ఎక్కుతుంది. తరువాత ఇంటికి వెళ్ళుతారు. ఏమి కలుగుతుంది? భార్యవచ్చి "ఏమండీ! నాకొక సిలుకుచీరెకావాలె" అని అంటుంది. నా దగ్గర డబ్బులేదని భర్తచెబుతాడు. ఒకబిడ్డవచ్చి "నాన్నా! నాన్నా! రా లోపలికి" అంటుంది. ఓహో! ఇంకేమున్నది. మా అబ్బాయి, నా భార్య, నా కుమార్తె, నా చెల్లెలు అనేమోహం నెత్తికెక్కి కూర్చుంటుంది.

దేవాలయంలో ఈ కుమార్తే, ఈ చెల్లెలే, ఈ ఆస్తే, ఈ గృహమే, ఈ కుటుంబమే, ఈ సర్వస్వం భగవదర్పణం చేయబడింది. చూడండి! ఇల్లుచేరేసరికి భగవంతుని కర్పించినవాటి నన్నిటినీ, మళ్ళీ తిరిగి గుంజుకుంటున్నాడు. భగవంతునియొక్క - అనేదిపోయి 'నా', 'నా'గా మారింది. ఇంట్లో అన్నీ తనవే. దేవాలయంలో "ఓభగవంతుడా! నేను నీవాడను. నేను నీవాడను. సమస్తమూ నీదే. నా సర్వస్వమును నీకు సమర్పిస్తున్నాను" - అని ప్రార్థనలోని క్షణిక వైరాగ్యం. ఇంట్లో అడుగుబెట్టి భార్యాపుత్రులముఖం చూచేసరికి నిముషంలో మటుమాయమయిపోతున్నది.

గృహస్థాశ్రమంలో ఆధ్యాత్మికాభివృద్ధి ఈ రోజున ఈ రకంగా ఉన్నది. దేవాలయంలోని బుద్ధి ఇంట్లో నిలవడంలేదు. ఈ విషయం పెనీలోపెస్ (Penelopese) అనే స్త్రీ విషయముమాదిరిగా ఉన్నది. ఆమె పగలల్లా రెక్కలూడేటట్లు దారపుంపె చుట్టేది. రాత్రింతా దాన్ని విప్పదీస్తూ కూర్చుండేది. అదేప్రకారం దేవాలయల్లో మీరు ఆధ్యాత్మికవృద్ధి అనే ఉండను చుట్టుతారు. ప్రార్థనల్లో ప్రసంగాలలో చుట్టుతారు. ఇంట్లో అదంతా విడదీస్తుంటారు. పరిస్థితులు ఈ విధముగానే సాగిపోతుంటే, ఆశ లేదు. మీ ప్రార్థనలు భగవంతుని హాస్యం పట్టించడంకావా! మీ ప్రార్థనలు బూటకాలుగావా! మీ ప్రవర్తనలు

సక్రమంగా ఉండాలె. మీ ఆధ్యాత్మిక అభివృద్ధికి అడ్డంవస్తున్న కారణమును మీరు నివృత్తిచేసుకోవాలె. గృహములోనే మీరు విషయములను సంస్కరించుకోవాలె. ప్రతిభార్య తన భర్తకు క్రీస్తు కావాలె. ప్రతిభర్త తన భార్యకు రక్షకుడుకావాలె. "ఓహో! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నేను నిన్ను ప్రేమిస్తున్నాను"-అని ప్రజలంటుంటారు. ఎంతమోసం! నిజంగా నీవు నీ భార్యను ప్రేమిస్తే, నీ భర్తను ప్రేమిస్తే ఆమెకొఱకుగానీ, అతనికొఱకుగానీ కొంతైనా నీవు త్యాగము చేయగలగాలె. నిజముగా నీవు నీ భార్యనుగానీ, భర్తనుగానీ ప్రేమిస్తే ఆమెకొఱకుగానీ, అతనికొఱకుగానీ నీవు కొంచెమయినా త్యాగముచెయ్యాలె. నీవు మఱిచేస్తున్నావా? లేదు. లేదు. భార్య భర్తను స్వాధీనంచేసుకోవాలనీ, భర్త భార్యను ఏదో ఒక పనిముట్టులాగనో, ఆస్తిలాగనో తనస్వాధీనపరచుకొని అధికారమును చెలాయించాలని కోరుతుంటారు. ఒకరి నొకరు పరిపాలించాలని వాంఛిస్తుంటారు. నిజంగా మీరు పరస్పరం ప్రేమించుకొనేటట్లయితే, మీరు ఒకరి శ్రేయోభివృద్ధికొఱకు పాటుపడాలె. నిజంగా మీ రీ పనిని చేస్తున్నారా? చేస్తున్నామని మీ రనుకుంటారుకానీ, మీరు పొరపాటుభావంలో ఉన్నారు. ఓయీ! భర్తయొక్కగానీ, భార్యయొక్కగానీ విషయవాంఛలు తీర్చడం భర్తకుగానీ, భార్యకుగానీ నిజమయినశ్రేయస్సు నిజమయినసుఖం కూర్చడం కానేకాదుసుమా! సుఖమునకు ఇదే మార్గమయినట్లయితే సమస్తకుటుంబాలు మరి సుఖంగా ఉండాలెకదా! సుఖంగా ఉన్నాయా? కుటుంబాలు సుఖపడుతున్నాయా? నూటికి కోటికి ఒక్కటికూడా సుఖపడే గృహంలేదు. కారణమేమిటి? కుటుంబాలు ఎందుకు సుఖవంతంగాలేవు? ఒకరి కొకరు ఆనందప్రాప్తి కలిగించుకొనే విధానమేమిటో, ఒకరి కొకరు పరస్పర శ్రేయస్సును అభివృద్ధిపఱచుకొనే విధానమేమిటో వారికి తెలేదు. పశువాంఛలను సంతుష్టిపఱచుకోవడమే ఆనందమని, అభ్యుదయమని వారితలంపు. ఒకరికొకరు డాంబికతలను పెంచుకోవడం నిజమయిన శ్రేయస్సుకాదు. "ప్రేమచేత వేదన తెచ్చుకుంటాము"-అని కొందరంటారు. చాలమంది నవలాకారులయొక్క, చరిత్రకారులయొక్క ఈ ప్రపంచజనులయొక్క అభిప్రాయంకూడా ఇదే. "ప్రేమ దుఃఖం

తెస్తుంది." మరి దుఃఖం తెస్తుందనే ప్రేమలో ఏమయినా చెడు ఉన్నదా? లేదు. ప్రేమచేత దుఃఖపరంపరలు రావడానికి కారణం ప్రేమను నీ వుపయోగించే విధానంలో ఏదో దోష మున్నది.

హిందూమతగ్రంథాలలో ఒకదానిలో భారతవర్షపు ఇష్టదైవ మయిన భారతదేశపు క్రీస్తయిన శ్రీకృష్ణదేవుని ఒక భయంకరసర్పం మ్రింగినకథ ఉన్నది. ఆ సర్పం శ్రీకృష్ణుని మ్రింగబోయింది. కృష్ణుడు చేతిలో ఖడ్గంధరించాడు. ఆ సర్పం నోరు తెరచి కృష్ణుని కబళించింది. కృష్ణుడా సర్పగర్భమును చీల్చి వెలువడ్డాడు. ఆ సర్పహృదయం పగిలి పోయింది. రక్తంక్రక్కి మరణించింది. ఈ ప్రేమవిషయం సరిగ్గా ఇలాగే ఉన్నది. ప్రేమ అంటే ఏమిటి? ప్రేమ కృష్ణుడు. అంటే ప్రేమే భగ వంతుడన్నమాట. ప్రేమస్వరూపియైన భగవంతుడు హృదయంలో ప్రవేశిస్తాడు. విషయవాంఛాపీడితుడైన మానవునియొక్క అంత రంగంలో ప్రవేశిస్తాడు. ప్రేమహృదయంలో ప్రవేశించి సుప్రతిష్ఠితం కాగానే హృదయంలో ఒకతృష్ణ బయలుదేరుతుంది. తత్ఫలితం? హృదయం పగిలిపోతుంది. హృదయాలు పగిలిపోతాయి. ఫలితం ఆవేదనా, దుఃఖం, సమస్తమయిన ప్రాపంచకసంబంధ ప్రేమయొక్క ఫలితం, ఆక్రందన, పండ్లుకొరుక్కోవడం! ఇదే జరిగే విషయం. ఇది ధర్మం, ఏ ప్రాపంచకవస్తువునైనా ఆశించు. మోహించు. ఏ ప్రపంచ వస్తువునైనాసరే వస్తుదృష్టితో ప్రేమించు. కృష్ణభగవానుడు నీలో ప్రవేశించి నీగుండె పగులగొడతాడు. హృదయం పగులుతుంది. దుఃఖ గ్రస్తుడవౌతావు "ఓయి తండ్రీ! ప్రేమ మహాక్రూరమయింది. నన్ను నాశనంచేసింది" అని గొణుగుతూ మొత్తుకుంటావు.

ఈ ప్రపంచంలో ఎవరైనాసరే, ఏ వ్యక్తిమీదనైనాసరే, ఏ వస్తువుమీదనైనాసరే వ్యామోహాబద్ధుడు - కానీ అతడు బాధ పడక తప్పడు. ఆ స్నేహితుడుగానీ, ఆ వస్తువుగానీ, అతనినుంచి విడ దీయబడుతుంది. లేదా ఎవరో ఒకరు మరణిస్తారు కాదా, వారిరువురి మధ్య వైరుధ్యం బయలుదేరుతుంది. ఇది అనివార్యమైన ధర్మం, జాగ్రత్తగా వినండి. ఈ విషయమును మీ హృదయాలలో గాఢంగా నాటండి. ఏకాగ్రచిత్తులై వినండి. ఎప్పుడైతే మానవుడు ఏ ప్రపంచ

వస్తువుమీదనైనా వ్యామోహము పెట్టుకుంటాడో, ఎప్పుడైతే మానవుడు ఒకవస్తువును వస్తుదృష్టిలో ప్రేమించడానికి మొదలుపెడతాడో, ఎప్పుడైతే ఈ భౌతికవస్తువులో ఆనందమును అన్వేషించడానికి ప్రారంభిస్తాడో అప్పుడతడు మోసం చేయబడతాడు. ఇంద్రియ విభ్రమలో బంధింపబడుతాడు. ప్రపంచవస్తు వ్యామోహముచేత మీకు ఆనందము లభ్యముకాదు ఇది ధర్మం. ఈ మీ సమస్త ప్రాపంచక వ్యామోహ సంబంధాలు వేదనతో అంత్యమౌతాయి. ఈ ఐశ్వర్య భోగభాగ్యాలలో నమ్మకం ఉంచవద్దు. భగవంతునిలో విశ్వాసముంచండి. ఏ వస్తువుపైన వ్యామోహమువద్దు. భగవంతుని మాత్రమే విశ్వసించు. ఆత్మలో, పరమాత్మలో విశ్వాసముంచు. ప్రాపంచకవస్తుసంబంధాలన్నీ మిమ్ములను కష్టపరంపరలకుగురిచేస్తాయి. ఎందుకంటే ప్రాపంచక మోహసంబంధమంతా విగ్రహారాధన. మన మనేక అందమైన విగ్రహాలను చూస్తున్నాము. ఈ శరీరాలన్నీ అలాంటి విగ్రహాలే. అందమయిన చిత్రపటాలే. నీ వొక విగ్రహమును లేక రూపపటమును, ఆ విగ్రహదృష్టితోటే (వస్తుదృష్టితోటే) ప్రేమింపసాగి, ఆ రూపపటం ఎవరిదైయున్నదో, అతనిని మరిచినప్పుడు నీవుచేసేది విగ్రహారాధనకాదా? నీ దగ్గర, నీ స్నేహితుని రూపపటమొకటి ఉంటుందనుకో! దగ్గరఉంచుకొని, ఆ పటమును నీవు ప్రేమిస్తావు. దానిని భద్రంగా ఉంచుతావు. ఎంతో ప్రేమతో చూచుకుంటావు. ఆ రూపపట మెవరిదైయున్నదో, ఆ మిత్రుడు నీ యింటికి వస్తాడు. అప్పుడుకూడా అతని విషయము పట్టించుకోక, ఆ పటమునే చూచుకుంటావు. అతనివైపే చూపుపెట్టవు. ఇది సమంజసంగా ఉన్నదా? ఇది విహితంగా ఉన్నదా? నీ స్నేహితుడు నీకు తన పటము నిచ్చింది దేనికి? తనను గుర్తుంచుకోవడానికి. అతనిని మఱిచిపోవడానికి, నీ కతడు పటమివ్వలేదు. ఆరాధనవస్తువు ఆ పటంకాదు. పటము ఎవరిదో అతడు ఆరాధ్యవస్తువు. పటమును పటముకోసం ప్రేమించడం విగ్రహారాధన. నీవు భగవంతుని ప్రేమించవలసియున్నది. నీ నీ అధిపతిని ప్రేమించవలసియున్నది. ఆ పటంయొక్క మూలపురుషుని ప్రేమింపవలసియున్నది. అదేప్రకారం ప్రపంచంలోని సమస్తవస్తువులు రూపపటాలుమాత్రమే, భగవంతునిచిహ్నాలుమాత్రమే. భార్యా

భర్తలు పటములమీద వ్యామోహపడతారు. విగ్రహారాధనలో బలి అవుతున్నారు. విగ్రహానికి బానిసలవుతున్నారు. బైబిలు విగ్రహారాధన పనికిరాదని భగవంతునికి బదులు విగ్రహామును పెట్టవాకండని విగ్రహారాధనచేయవాకండని ప్రబోధిస్తున్నది. ఈ "విగ్రహారాధన" అనేపదానికి అర్థం నీ పీ విగ్రహాలను ఆరాధించకూడదని కాదు. దాని అర్థం – ఈ సజీవ విగ్రహాలని. విగ్రహామూలమును మఱచి బాహ్యారూపాలను ఆరాధించవద్దని దీని అర్థం.

హిందూదేశములో ఒకసమాధిపైన వ్రాయుబడిన శిలాశాసనం ఈరకంగా ఉన్నది.

"గతించిన శిశువు ఇక్కడ ఉన్నాడు.
నా హృదయానికి విగ్రహ మతడు.
అందుచేత, మహామేధావియైన భగవంతుడు
ధర్మమే ఆచరించాడు.
"మేము విడిపోవడం వాంఛనీయమే".

ఇది ఒక స్త్రీ వ్రాసింది. ఆమె శిశువును నిగ్రహదృష్టితో ప్రేమించింది. ఏమూల వస్తువుకు ఏసత్యమునకు శిశువు రూపపటం మాత్రమో, ఆ శిశువును, బాహ్యారూపమును మాత్రమే ఆమె ఎక్కువగా పరిగణించింది. శిశువు విడదీయబడకతప్పదుకదామరి. ఇది ధర్మం. ఇది ఈశ్వరశాసనం. బాహ్యారూపపటములను సక్రమపథంలో ఉపయోగించుకుంటావా. నిన్నవి వీడిపోవు. అపమార్గంలో వానిని ఉపయోగించు. అవి నిన్ను వదిలితీరుతవి. శోకభయాందోళనలు నిన్ను ఎదుర్కొనకతప్పదు. సక్రమంగా ఉపయోగించుకుంటే మనం విడిపోలేము. మూలమును దానిరూపంకంటే ఎక్కువగా ప్రేమించినప్పుడే మనం రూపపటమునుకోలుపోము. లేదా విడదీయబడక తప్పదు. ఇది దైవధర్మం. ఇదే సర్వసంగపరిత్యాగఅర్థం.

ప్రతిగృహంలో, సర్వసంగపరిత్యాగమును ఆచరించే మార్గమిదే.

ఈ విషయమును ఇంకా సంపూర్ణంగా విశదీకరించవలసి యున్నది. చూడండి.

నీవు పురుషుడవుగా, స్త్రీవిగా, దేవతవుగా, మరి ఎవరివైనాగా, నీ వున్నావనుకో, నీవు ఒకరిని ప్రేమిస్తున్నావనుకో, అయితే నిన్ను ఆకర్షిస్తున్నది, నిన్ను వాంఛింపచేస్తున్న దేమిటి? అతనిశరీరమా? అతని చర్మమా? అతని కండా? ముక్కా? చెవులా? అవేవీ కావు. అవేవీ కావు. కవులకంటే వివేకంగలిగి సకారణులై యుండండి. ఈ శరీరంకాదు. నిన్నాకర్షిస్తున్నది. నీ ప్రేమకుకారణం ఈ శరీరాలే అయితే, ఈశరీరాలలో నిజానికి ఏదైనా సౌందర్యం ఉన్నట్లయితే ప్రాణంపోయిన తర్వాతకూడా ఈ శరీరం ఆకర్షణీయంగా ఉండాలెకదా! మనిషి చని పోయినతర్వాత అప్పుడుకూడా నీవా దేహమును ప్రేమించాలె. నీవు ప్రేమించడంలేదుకదా! అయితే మరి ఆ సౌందర్యం ఎందులో ఉన్నది? ఈ ఆకర్షణకు, ఈ సౌందర్యానికి ఏది కారణం? కారణంలోని ఆత్మ లోని జీవంలోని దివ్యశక్తి అంతర్గతమయిన పరమాత్మ ఇదేకారణం. ఇంకో కారణంలేదు. ప్రతివానినేత్రాలద్వారా ప్రకాశిస్తున్నది భగవంతుడే. ఈ శరీరవేషధారి, ఈ రూపధారి ఆ పరమాత్మే. పరమాత్మ కంటే ఎక్కువగ వేషమును ప్రేమించవాకు. రూపమునుధరించి, ఈ వేషమునుధరించి, ఈ అలంకారములనువేసుకొనియున్న అంతర్గతపరమ సత్యముకంటే, ఎక్కువగా ఈ అలంకారవస్త్రరూపాలను ప్రేమించవాకు. విచారించండి. మీాకు అవగతమవుతుంది.

ఇతరులకంటే కొందఱు ఎక్కువ ఆకర్షణీయంగా ఉంటారు. ఇతరులకంటే కొందరికి ఎక్కువ సౌందర్యముంటుంది. ఈ విషయాలను రాముడు చర్చించినందుకు క్షమించండి. అత్యావసరమయినందున, రాముడు ఈ విషయమునుగూర్చి మాట్లాడుతాడు. ఇతరు లీ విషయాలనుగూర్చి మాట్లాడరు.

ఆ సౌందర్యం, ఆ ఆకర్షణం ఎక్కడనుంచి పుట్టుతున్నది? ఆ సౌందర్యం, ఆ తేజం, ఆ శక్తి ఎక్కడనుంచి వస్తున్నది? ఏమిటది? కండ్లా, చెవులా, ముక్కు, ఈ సౌందర్యకారణం? కాదు. ఆ సౌందర్య

తేజం నేత్రాలద్వారా దేహంద్వారా దర్శితమవుతున్నది. ఈజిప్టు దేశపుస్త్రీ అయిన 'క్లియోపాత్రా'ను (Cleopatra) ను గురించి మీరు వినియుండవచ్చు. ఆమె ఆఫ్రికాదేశపు నీగ్రోజాతిది. ఆమె మార్కు ఆంటోనీ ప్రభువును (Mark Antony) ఆకర్షించి స్తంభితుని చేసి వశంచేసుకొన్నది. సౌందర్యంచేత అతడు ఆకర్షితుడైనాడు. ఈ ప్రతిభ నీలోని పరబ్రహ్మజ్యోతినుంచి వెలువడుతున్నది. ఇంక ఎక్కడ నుంచీ వెలువడడంలేదు. నీలోని చైతన్యములోనుంచి ఈ ప్రతిభ వెలువడుతున్నది. ఈ చైతన్య మేమిటి? ఈ శక్తి ఏమిటి? నీవు పర్వతాలు ఎక్కగలవు. కొండశిఖరాలకుప్రాకగలవు. నీవు ఒకప్రదేశం నుంచి, ఒకప్రదేశానికి నడవగలవు. నీయిష్టమువచ్చినచోటికి నీవు పోగలవు అయితే చనిపోయినతరువాత ఈ శరీరం ఎందుకు నడవడం లేదు? చనిపోయినప్పుడు ఆ చైతన్యశక్తి నీలోని భగవంతుడు నిన్నా పర్వతశిఖరాలకు ఎత్తగల ఆ దివ్యశక్తి పూర్వంవలె శరీరమునకు సహాయంచెయడంలేదు. నీ శరీరములోని కండరాలను కదిలించేదెవరు? నీ కేశములను అభివృద్ధిపరుస్తున్న దెవరు? నీ రక్తనాళాలోని రక్తమును ప్రవహింపచేసే దేమిటి? ఏమిటది? శరీరావయవములన్నిటికి చైతన్యతను చలనమును, సజీవత్వమును ప్రసాదిస్తున్న దేమిటి? అది విశ్వాత్మమైన దివ్యశక్తి. ఏకైకసర్వవ్యాప్త దివ్యత్వం. నీ స్వస్వరూపమయిన విశ్వ వ్యాప్తకాద్వితీయ పరబ్రహ్మ. ఏకైక విశ్వమయశక్తి. ఏకైక విరాట్భగవంతుడు. నీ స్వస్వరూపమయిన ఆత్మ. ఒకమనిషి చనిపోయి నప్పుడు ఆ శవమును మనుష్యులు శ్మశానానికో, సమాధిచెంతకో మోసుకపోవాలె. అతను బ్రతికిఉన్నప్పుడు అంతబరువుగల దేహాన్ని కొండశిఖరాలకు సైతం పైకెత్తినట్టి ఆ శక్తి ఏమిటి? అది అదృశ్య మానమయినది. వర్ణనాతీతమయినది. అది అవాఙ్మానసగోచరమైనదై యున్నది. ఆ శక్తి నీలోని బ్రహ్మత్వం. ఆ శక్తి సర్వులయందు ప్రకాశిస్తున్న భగవంతుడు. సర్వప్రపంచమును నడిపిస్తున్న దా చిచ్ఛక్తి. సమస్తమానవుల తేజస్సుకు ఆ అంతర్గతప్రభాసమయిన బ్రహ్మతేజమే కారణం. ఒకమనిషి నిద్రపోతుంటాడు. అప్పుడతని కండ్లు చూడలేవు. అతని చెవులు వినలేవు. ఒకమనిషి మరణించినప్పుడు అతనికండ్లుఉన్నా, చూడలేవు. చెవులున్నవి. కానీ వినలేదు. ఎందుచేత? పూర్వంమాదిరి

అంతర్గతమయిన దివ్యచిచ్ఛక్తి లేక పరమాత్మ ఇంద్రియాలకు సహాయం చేయడం లేదు. నేత్రములద్వారా చూచేది భగవంతుడే. చెవులద్వారా వినేది అంతర్భగవానుడే. ముక్కును ఆఘ్రాణింపచేసేది అంతర్భగవానుడే. కండరములకు శక్తినిస్తున్నది, అంతర్భగవంతుడే. బాహ్యసౌందర్యప్రతిభ లన్నింటికీమూలం లోపలప్రకాశిస్తున్న ఆ పరమాత్మే. సమస్త జగచ్చైతన్యమూలం నీలో ప్రకాశిస్తున్న భగవంతుడే. ఈ విషయం మఱచిపోకండి. ఈ విషయమును గుర్తించండి. నీవైపు చూస్తున్న దేమిటి? నీవొక మనిషివైపుచూస్తున్నప్పుడు, నీముఖంవైపు సూటిగా చూస్తున్న దేమిటి? అంతర్భగవానుడే. బాహ్యనేత్రాలు, చర్మం, చెవులు ఇవన్నీ పైన వేయబడిన ముసుగుమాత్రమే. పైన వేయబడిన ఉడుపుమాత్రమే.

ప్రపంచమానవులు వస్తువులను ప్రేమిస్తారు. బాహ్యమయిన వేషం (వస్త్రం) ద్వారా ఏది ప్రకాశిస్తున్నదో ఆ అంతర్గతసత్యముకంటె అధికంగా పై వుడుపునే, పై వేషమునే ప్రేమించసాగుతారు. ఈ విధంగా మానవులు పరమసత్యముకంటే, అంతర్గతమయిన మూల సత్యముకంటే ఎక్కువగా బాహ్యవేషమును, బాహ్యవస్త్రాలంకారమును, విగ్రహమును ఆరాధిస్తున్నారు. భగవంతుని విగహీకరిస్తున్నారు. అందుచేతనే మహా పాపఫలితంగా ఘోరవేదనతో, శోకాందోళనలతో అవస్థపడుతున్నారు. బాహ్యదృష్టికి అతీతులుకాండి. ఈ బాహ్యవిగ్రహదృష్టిని అధిగమించండి. ప్రతిభార్యా, ప్రతిభర్తాఒకరిలో ఒకరు భగవంతుని దర్శింపప్రయత్నిస్తారుగాక! ఒకరిలో ఒకరు అంతర్గతుడైన భగవంతుని దర్శించి ఆ అంతర్బ్రహ్మత్వమును ఆరాధిస్తారుగాక!

ప్రతిపదార్థంలో నీవు భగవంతునిదర్శించాలె. భార్య భయంకరమయిన విష్ఫతిసరిక ద్వారం కావడానికిబదులు భర్త భగవంతుని తనలోని పరమాత్మను చూచుకొనే అద్దంగావాలె. భార్యకు భర్త భయంకరమయిన విష్ఫతనరక ద్వారం కావడానికిబదులు భగవంతుని దర్శించుకొనే అద్దంగావాలె.

భార్య తనభర్తను, భర్త తనభార్యను ఈ సాక్షాత్కార శిఖరానికి, ఈ బ్రహ్మత్వమునకు, ఈ వైదాంతికమయిన సర్వశక్తుల కేంద్రీకరణానికి అధిగమింపజేయడమెలా?

భార్య భర్తకు రక్షకురాలుకావాలంటే, మొదట ఆమె తన భర్తను సర్వబాహ్యాకర్షణలపాలనుంచి రక్షించాలి. అతడు వివాహితుడు కాకపోయినట్లయితే, సమస్త విషయాకర్షణలకు బలిఅవుతాడు. తుపానులో దిక్కు తెలియక కొట్టుకపోయే నావలాగా అతడు వికలుడవుతాడు. బ్రహ్మజ్ఞానములేని అవివాహితుడు సర్వవ్యసనాలకు ఎఱ అవుతాడు. అందుచేత ఇటువంటి వాటినుంచి తప్పించడమే భార్య మొదట చేయవలసినపని. కాని ఇప్పుడు ప్రపంచంలో జరుగుతున్న దేమిటి? సామాన్యంగా భార్యలు తమ భర్తలను ఈ వ్యసనాలనుంచి రక్షించకపోగా, వాండ్లే భర్తలగుండెలమీద వ్యసనపర్వతాలను ఉంచుతున్నారు. ఇది - తనదగ్గరఉన్న చిల్లరంతా మార్చి ఒకటే పెద్ద నోటుతీసుకున్న విధంగా ఉన్నది. ఇంతకుపూర్వం ఉన్న ఇతరవ్యసన భారమంతా తొలగించుకొన్నాడతడు. కానీ వాటన్నిటినీ మించిన భార్యాబానిసత్వము ఒక్కటే అతనికిప్పుడుచాలు.

ఒక గుఱ్ఱం ఒక మానవుని రక్షణకోసం ఆశ్రయించిన కథలాగా ఉందీవిషయం. ఒకప్పుడు మనుష్యులుకూడా ఆటవికులుగాఉన్న విషయం మీకు తెలుసు. గుఱ్ఱాలు, లేళ్ళూ, దుప్పులుకూడా అరణ్యవాసం చేస్తవికదా! ఒకదుప్పికి, ఒకగుఱ్ఱానికి పోట్లాటవచ్చింది. గుఱ్ఱం ఓడిపోయింది. దుప్పి కొమ్ములుపెట్టి గుఱ్ఱమునుపొడిచి తరిమింది. గుఱ్ఱం పారివచ్చి ఒకమనిషిని సహాయంకొరకు ఆశ్రయించింది. "సరే మంచిది. నీకు నేను సహాయంచేస్తాను. నా దగ్గర విల్లూ, బాణాలున్నాయి. ఆ దుప్పిఉన్నచోటికి నీవు నన్ను మోసుకుపో! నీ శత్రువును నేను సంహరిస్తాను."' అని ఆ మనిషి అన్నాడు. సరే. ఆ మనిషి ఆ గుఱ్ఱంవీపుపైన ఎక్కి అడవిలోకివెళ్ళి దుప్పినిసంహరించాడు, విజయంతో తిరిగి ఆ గుఱ్ఱమూ, మనిషీ యింటికివచ్చారు. గుఱ్ఱం శాంతిపడింది. తన సహాయకారిని దింపి తిరిగి వెళ్ళబోతూ అతనికి నమస్కరించి యిలా

అన్నది:- "అయ్యా! కృతజ్ఞతాపూర్వకంగా నీకు నమస్కరిస్తున్నాను. ఇక నేను వెళ్ళుతున్నాను." ఆమాటలువిని ఆమనిషి ఇలా అన్నాడు:-

"ఓ గుఱ్ఱమా! ఎక్కడికి నీవుపోయేది? నీవల్ల ఎంత ఉపయోగమున్నదో నాకీనాడు తెలిసింది. నేను నిన్ను పోసివ్వను. నీవు నా సేవకుడుగా ఉండు. నీవు నా బానిసవుకావాలె." పాపం గుఱ్ఱం దుప్పుల బారినుంచి సమస్తవనమృగాల బారినుంచి రక్షింపబడింది. కానీ తన స్వాతంత్ర్యమును కోలుపోయింది. మృగబాధను జయించినా అది అంతకంటే బాధాకరమైన బానిసత్వమును కొని తెచ్చుకున్నది.

మానవునివిషయం ఇలాగేవున్నది. వివాహానంతరం అతడు అనేక వ్యసనాలనుంచి రక్షితుడైనాడు. కానీ ఒక మహావ్యసనానికి- భార్యాబంధం అనే వ్యసనానికి, గుఱ్ఱం మానవునిచేతబడినట్లు గురియైనాడు.

అయితే, ఇప్పుడు భార్యా భర్తకు రక్షకురాలుగావడం ఏవిధంగా? కొన్నివ్యసనములనుంచి భర్తనురక్షించుచుంది. ఇంతవరకు మంచిదే. కానీ తరువాతవిషయ మేమిటంటే, భర్త స్వాతంత్ర్యమును ఆమెఅపహరించకూడదు. (అమెరికనులు, ఫిలిప్పియనులు (Philipions) జయించామని చెపుతారు. కానీ జాగ్రత్తగాఉండకపోయినట్లయితే, వాండ్లకు బానిసలుఅయ్యేవారే. భార్య భర్తను బానిసగాచేసుకోను వాంఛించకూడదు. భర్త భార్యను బానిసగాచేసుకోను ప్రయత్నించకూడదు. ఇది తరువాతమెట్టు. ఈ మార్గమున నడిస్తేనే ఆశ. లేదా ఇంక ఆశలేదు. నరెవ్వడూ వినని సూత్రమిది. కానీ ఇదిసత్యసూత్రం. క్రీస్తు మానవలోకరక్షకుడుగా పరిగణించబడిన విషయం మీకు తెలుసు. క్రీస్తు జగద్రక్షకుడు. ఆయన సమస్తపాపప్రక్షాళనంచేసి. భూమిమీద స్వర్గరాజ్యప్రతిష్ఠాపనచేస్తాడని చెప్పబడింది. కానీ మీ బైబిళ్లు, ఖురానులు, వేదాలు ఎన్నిఉన్నా ప్రపంచం పూర్వం ఎంత మతరహితంగా ఉన్నదో, ఇప్పుడూ ఆ రకంగానేయున్నది. కారణ మేమిటి? కారణమేమిటంటే చెడుయొక్క నిజమైనకారణం నిర్మూలనం కాలేదు. మీ సంసారవలయాలలోనే నిజమైన కష్టం పాతుకొని

యున్నది. భార్య తన భర్తకు నిజమైన శ్రేయస్సు చేయడానికి ప్రయత్నించినది; భర్త తనభార్యకు నిజమయిన శ్రేయస్సును చేకూర్చపాటు పడింది. భార్యయొక్క మంచికోటకు పూనుకోంది, మతం ఎప్పటికీ వృద్ధికాదు. మతాభ్యుదయానికి ఆశ లేదు!

ఇవి యాంత్రికదినాలని మీకు తెలుసు. మతానికి ఉద్వాసయామి అని చెప్పవలసిన పరిస్థితివచ్చింది. ఓ క్రైస్తవులారా, ఓ హిందువులారా! ఓ మహమ్మదీయులారా! మీరు నిజంగా ప్రపంచాన్ని మానవజాతిని దుఃఖవిముక్తం చెయ్యాలనుకుంటే, మీరు దాంపత్యసంబంధాలను పునీతంచేసి గృహస్థాశ్రమధర్మప్రతిష్ఠాపన చెయ్యాలె. ప్రతిస్త్రీ తనభర్తకు క్రీస్తుగా, ప్రతిపురుషుకు తన భార్యకు క్రీస్తుగా నిరూపించుకోవడం స్వధర్మమని సమస్త స్త్రీ పురుషుల హృదయాలలో ఈ ధర్మప్రబోధమును నాటవలసియున్నది. క్రీస్తును నిరూపించడం మీ విహితధర్మం. ఈపని ఏవిధంగా చేయగలం? భార్య భర్తనూ, భర్త భార్యనూ పరస్పరం బానిసలుగా చేసుకోవాలనుకోక పోతే, ఒకరి అభ్యుదయాన్నొకరు నిరోధించుకోకపోతే ఈపని జరుగుతుంది. ఒకరుకొకరు బంధాలుకాకండి. ఇతరుల స్వాతంత్రతనుకాపాడు. నీవు స్వతంత్రుడవౌతావు. ఇది ధర్మం. "చలనం, ప్రతిచలనం రెండు సమానమైనవీ, వ్యతిరిక్తమయినవీ అయి వున్నవి." నీ భార్యను నీ మీద ఆధారపడేలాగుచెయ్యి. ఆమెను నీకు బానిసచేసుకో. నీవుకూడా ఆమెకు బానిసకావలసిందే. ఓహో! ఇది అతిఘోరప్రసంగం. సత్యం ఎప్పుడూ అహితమైందే ఘోరమైందే. క్రీస్తు ఈ ఘోరసత్యమును ప్రబోధించాడు, అతడుబహిష్కృతుడై శిలువవేయబడ్డాడు. సోక్రటీస్ ఘోరసత్యబోధచేత హింసింపబడ్డాడు. మానవులు సత్యమును ఆనందముతో స్వీకరించరు. ఈ సిద్ధాంతం కఠినమైందిగా కనబడుతుంది. కానీ మరి ఉన్నవిషయు మిది వినండి.

ఒకడు ఒక ఎద్దుకొమ్ములకు త్రాడుకట్టి ఆ పగ్గపు రెండవకొసను తనచేతితో గట్టిగా పట్టుకున్నాడు. వాడు ఈ ఎద్దు నా అధికారంలో ఉన్న సేవకుడనుకొంటాడు, తన బానిస అనుకొంటాడు. కానీ అతనికి ఆ ఎద్దెంతబానిసో, ఆ ఎద్దుకు అతడుకూడా అంత బానిసే. ఈ ఎద్దు

నాది, నా బానిస అనడానికి అతనికున్న అధికార మేమిటి? కారణం-ఎద్దు అతనిని వదలిపోలేదుకాబట్టి. ఇక్కడ గ్రహించండి-ఎద్దు అతనిని వదలిపోలేకపోవడమే కారణమైతే మరి అతనుకూడా ఎద్దును వదలిపోలేదుకదా! ఎద్దు అతనిని ఎందుకువదలిపోలేదంటే, అతడు ఎద్దును వదలిపోలేదుకాబట్టి. అతడు ఎద్దును వదలిపెట్టగలిగితే, అతడు స్వతంత్రుడు కాగలిగితే, అతడు ఎద్దుకు బానిసకాకుండా ఉండగలిగితే ఎద్దు అతనికి బానిసగా ఉండదు. ఇది ధర్మం.

కుటుంబాలన్నీ బాధపడుతున్నాయి. మీరు చూడడంలేదా? ఇది నిజమైన విషయంకాదా? యోరప్‌లో, అమెరికాలో, భారతదేశంలో, జపానులో, సమస్తప్రపంచంలోని గృహాలు నూటికి నూరు బాధలలో కుమిలిపోతున్న సంగతి నిజంకాదా? తమఇండ్లవిలాసం "ఆనంద గృహం ఆనందగృహం" అని పేర్కొంటారు. ఎంతమోసం! ఎంత అబద్ధం! నేతిబీరకాయ పేర్లు! మీకు ఆనందంకావాలా? ప్రజాదుఃఖానికి గృహచ్ఛిద్రాలకు కారణంఏమిటి? గృహశాంతికావాలని మీ అందరికీ అంతరాంతరాల్లో లేదా? మీకు ఆనందం కావాలంటే పట్టుదల వహించండి. శ్రద్ధవహించండి. హృత్పూర్వకప్రయత్నంచేయండి. గృహజీవితమును వినోదిప్రాయంచేయవాకండి. శ్రద్ధవహించండి. పట్టుదల వహించండి. దుఃఖకారణమును శోధించండి. శోకకారణాలన్నీ పరిశోధించండి. అన్వేషించండి. పరీక్షించండి. గృహచ్ఛిద్రాలకు, గృహదుఃఖానికి కారణం దంపతులకు ప్రకృతిధర్మాలు తెలియవు. అజ్ఞానావృతులై యున్నారు. అజ్ఞానభూతగ్రస్తులై యున్నారు. ప్రకృతి ఆశయమేమిటో, పరిణామప్రవాహం ఏముఖంగా పరుగెత్తుతున్నదో ప్రజలకు తెలియదు. పరిణామక్రమ గతియొక్క ఆశయం ఈ సమస్తప్రకృతి యొక్క కర్మరహస్యం - సమస్తమానవులను నెమ్మది నెమ్మదిగా, క్రమక్రమంగా తమలోని బ్రహ్మాత్మసాక్షాత్కారానికి అంతకంతకు దగ్గరకావాలనే ప్రకృతియొక్క రహస్య మిదే. ఈ సమస్త ప్రపంచపు నడకలోని సందించేపరమాశయమిదే. ప్రతివ్యక్తీ తనలోనిభగవంతుని తప్పక తెలుసుకోవలసియున్నది. ప్రతివ్యక్తి తనలోని పరిశుద్ధబ్రహ్మతేజమును గుర్తించి తనలోని బ్రహ్మాత్మమును సందర్శించి పరిపూర్ణ

పరమాత్మస్వరూపి తప్పక కావలసియున్నది. ఈ జీవితసంగ్రామ మంతటికీ కారణం ఆత్మసాక్షాత్కారం పొందకపోవడమే. సక్రమ పథంలో అభ్యుదయంకలిగేటట్లు ప్రకృతిధర్మానుగుణ్యంగా, నీవు చరించగలిగేలాగు మీ భార్యాభర్తృత్వ సంబంధాలనుమార్చుకోండి. ప్రకృతిధర్మం, ప్రకృతిఆశయం, స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యం; నీభార్యను నీవు బంధించవాకు. నీభార్య నిన్ను బంధించదు. అంటే అర్థ మేమిటి? అంటే సర్వసంబంధాలు ఒక్కసారి త్రెంపివేసి విచ్చలవిడిగా తిరగడమనా? ఇదేనా అర్థం? ఎవరికివారు తెగతెంపులు చేసుకోని యథేచ్ఛాప్రకారం తిరగడమనా దీని అర్థం? ఇదేనా బంధవిముక్తి. ఇది విముక్తికాదు, కాదు. స్వాతంత్ర్యం, విముక్తిపొందే మార్గం. ఇదికాదు. ఇదిబంధం. ఇది బానిసత్వం. ఇది ఇంద్రియలాలసత్వం. నీ తోటివ్యక్తికి 'విముక్తి' కలిగించడమంటే, స్వాతంత్ర్యంకలిగించడమంటే ఆ వ్యక్తికి నీదేహంలో విశ్వాసం ఉంచకుండా నీలోని పరమాత్మయందు విశ్వాసం ఉంచేలాగుచేయడమే. ఆమె నిన్ను ప్రేమిస్తున్నదంటే ఆమె నీలో భగవంతుని ప్రేమిస్తున్నది. నీ వామెను ప్రేమిస్తున్నావంటే, నీ వామెలో భగవంతుని ప్రేమిస్తున్నావు. ఇట్టి నిస్సంగదృష్టి, స్వాతంత్ర్యం మేమందరము క్రీస్తులో నమ్ముతున్నామని జను లంటారు. మీ భార్యాభర్తలలో ఉన్న క్రీస్తును నమ్మండని రామునిసందేశం. "నీ తోటివ్యక్తియొక్క మాంసాస్థిపంజరంలో విశ్వాసం ఉంచవాకండి. అంతర్గతమైయున్న దైవత్వమునందు విశ్వాసముంచండి''-అని రాముడు చెప్పుతున్నాడు. ఈ మాంసవికార దేహాలను మాయతెరలుగా చూడండి. వెనక మారక వెలుగుతున్న అంతర్గత పరబ్రహ్మాను సందర్శించండి.

కొమ్మమీద స్వేచ్ఛగాకూర్చున్న పక్షిలాగా మనముండాలె. పక్షి కొమ్మమీద కూర్చుంటుంది. కొమ్మ ఊగుతుంటుంది. క్రిందికివంగి కొమ్మ కదులుతుంటుంది. కానీ తనకురెక్కలున్నాయని దానికి తెలుసు. అందుచేత అది భయపడదు, కొమ్మ క్రిందికీ పైకి ఊగుతుంటున్నా, పక్షి భయపడదు. అది పైనకొమ్మమీద కూర్చున్నా, లోపల తన రెక్కలమీదనే ఆధారపడియున్నది. ఈ కొమ్మమీద నేను ఆధారపడి

లేను. నేను నా రెక్కలమీద ఆధారపడియున్నానని ఆ పక్షికి తెలుసు; ఇదీ విధానం. పక్షి కొమ్మమీద ఆధారపడిలేదు. అది తన రెక్కల మీదనే ఆధారపడియున్నది.

అదే ప్రకారం నీ వెక్కడఉన్నా, నీవు ఎంత భార్యాపుత్ర మిత్రాదులతో కలిసియున్నా, వాండ్లమీద ఆధారపడవాకు. భగవంతుని మీద నీ హృదయం ఉంచు. నీలోని పరబ్రహ్మత్వమునందు విశ్వాస ముంచు. ఇదీ మార్గం. ఈ మార్గంలో నీవు నడువు. నీ భార్యాపుత్రు లను ఈ మార్గంలో నడిపించు. వాండ్లవల్ల నీకు బంధం లేదు. నీవల్ల వాండ్లకు బంధంఉండదు. ఒకరిపైన ఒకరు ఆధారపడడం లేదు. స్వాతంత్ర్యం! స్వాతంత్రస్వేచ్ఛ!! ఈ విధంగా ప్రతి అమెరికా దేశీయుడు స్వతంత్రుడు కాగలడు.

ఉపన్యాసంలో అభిరుచిగలభాగం ఇప్పుడు వస్తున్నది.

ఒకచోట ఒక అతిసుందరమైన చిత్రపటమున్నది. ఆ చిత్రపటంలో ఒక అతిమనోహరమయిన రథమున్నది. ఆ రథము రత్నఖచిత స్తంభా లతో, వివిధాలంకారాలతో మనోహరంగా ఉన్నది. ఒక చక్కని మహారాణి ఆ రథంమీద శయనించియున్నది. ఆమెపిల్లలు ఒకప్రక్క కూర్చొనియున్నారు. ఒకప్రక్క ఆసనంపైన రాజు కూర్చొని యున్నారు. ఆ చిత్రపటం అద్భుతంగా ఉన్నది. దాని సౌందర్యం చెప్ప డానికి వీలులేదు. ఆ పటంలో రాణి వ్యాధిగ్రస్థురాలుగాఉన్నది. ఆమె మరణశయ్యపైయున్నది. ప్రక్కనకూర్చున్నరాజు దుఃఖపడుతున్నాడు కొడుకూ, కుమార్తె ఏడుస్తున్నారు. ఎంత అందమయిన పటమును కున్నారు. నీకా పటము కావాలనిపించదూ? ఓ! ప్రతివ్యక్తి ఆ పటము కోరకుండాపోడు. నీవా పటం చూచావా నీవు తప్పక కొంటావు. అది అంత అందమయినచిత్రపటము. ఆ బొమ్మకావాలని నీవు కోరడం దేనికి? నిన్ను ముగ్ధపరచే ఆకర్షణ దానిలోఉన్నది. కానీ పటములో చావనున్న రాణిగా మీరు మారడానికి యిష్టపడతారా? చెప్పండి! ఆ మరణోన్ముఖమైనరాణిగా మీరు కావడానికి యిష్టపడతారా? ఆమె మహారాణి శ్రీమంతురాలు. కానీ చావనున్నది. కాదు ఆ దుఃఖ

పడుతున్న రాజుగాగాని, ఆ యేడుస్తున్న ఆమె సంతానముగా గాని, మీరు కావడానికియిష్టపడతారా ? ఇష్టపడరు.

నీవు సంసారములో, గృహములో, కుటుంబమధ్యంలో బ్రహ్మదృష్టితో సాక్షీమాత్రుడవై, నిస్సంగపరమాత్మవై నిర్మోహివై, నిర్లిప్తుడవై దేనికీ అంటక సంచరించవలసినదిగా వేదాంతము ప్రబోధిస్తున్నది. నిరంతరం నీ మనస్సు నిర్మోహంగా నిశ్చలంగా ఉంచు. నీ హృదయమును, నీ మనస్సును, నిరంతరము అంతర్గత బ్రహ్మత్వమునందు ఏకాగ్రపఱచు. గృహవ్యవహారములన్నీ ఆ చిత్రపటమును చూచినట్లు చూడు. సాక్షీమాత్రుడివై నీవాపటమును చూచినప్పుడు నీ కా పటం ఆనందము గొలుపుతున్నది. నీవు దానిలో మగ్నుడవైనప్పుడు నీ కా పటము దుఃఖప్రద మవుతున్నది. ఈ ప్రపంచదృశ్యమునందు మనము మగ్నులమైనప్పుడు మనకు దుఃఖం కలుగుతున్నది. మనము నిస్సంగదృష్టితో సాక్షిలాగా ప్రపంచమును చూస్తే, మన కది ఆనందప్రదమై ప్రియంగొలుపుతుంది. మీలోని బ్రహ్మత్వమును సందర్శించండి. రాముని సందేశాలన్నీ వినండి. క్రమక్రమంగా సందేహనివృత్తి కలుగుతుంది. ఈ ప్రపంచంలో ఎవరైనాసరే, రాముని సర్వప్రసంగాలను శ్రవణం చేసినవారికి సర్వసంశయ నివృత్తి కలిగి తన స్వస్వరూపబ్రహ్మమునందు విశ్వాసము కలిగితీరుతుం దని రాముడు అభయమిస్తున్నాడు. నీ బ్రహ్మత్వమునందు మొదట గాఢవిశ్వాస ముంచు. ఈ విశ్వాసమును మొదట సంపాదించు. రాముడు చెప్పిన ప్రకారము ఆ బ్రహ్మత్వమునందు మనస్సును ఏకాగ్రపరుచు. తదేకధ్యానము చెయ్యి. తదైక్యంపొందు. శాశ్వతమైన సర్వశక్తిమంతమైన పరబ్రహ్మను నేను అని తెలుసుకో. "తత్త్వమసి తత్త్వమసి" ఈ పరమసత్యమును తెలుసుకో. ఏతత్ సాక్షాత్కారంపొందు. నీ సాంసారికకృత్యము లన్నిటినీ, గృహకృత్యాలన్నిటినీ నిస్సంగదృష్టితో ఆ పటమును చూచినట్లుచూడు. ఈ విషయం మీకు అసంగతంగా విరుద్ధంగా కనపడువచ్చు. ఈ ప్రపంచ కృత్యాలలో దిగకపోతే, మేము వృద్ధికాలేం కదా- అంటారు ప్రజలు. మీరు పొరపడుతున్నారు. ఏ క్షణంలో మీరు ఈ విషయాల్లో బంధింపబడతారో, ఆ క్షణమే మీ బాగు ఆగిపోతున్నది. నీవు వ్రాస్తు

న్నప్పుడు దేహభావన లేకుండగానే నీ రచన సాగిపోతున్నది. ఆ సమయంలో నీ అహంకృతి నీ దేహదృష్టి ఉండటంలేదు. అప్రయత్నంగా, అవ్యక్తంగా దానంతట అదే అదేపని అప్పుడు సాగిపోతున్నది. ఇది ఒకరకమైన ప్రతిచలనకర్మ (Reflex action). చేయిదానంతట అదే వ్రాసుకొని పోతుంటుంది. ఎందుచేత? నీ అహంకృతిని, నీ స్వార్థదృష్టిని పనిలో జొనపడంలేదుకాబట్టి. "ఓ! నేను మహాద్భుతంగా వ్రాస్తున్నాను. నేను మహాఘనంగా పనిచేస్తున్నాను-" అని నీలో అహంకృతి బయలుదేరిన తత్ క్షణమే నీవు జారిపోతున్నావు. నీ కలం జారిపోతున్నది. రచన ఆగిపోతున్నది.

అహంకృతి నశించినప్పుడే కర్మ విజయం పొందుతున్నది. ఏ నిమిషంలో అహంకారం తలయెత్తుతుందో, ఆ నిమిషంలో నీపని చెడిపోతున్నది. నిష్కామంగా చేసిన కర్మే ఉత్తమకర్మ. ఈ అహంకృతిని ఈ క్షుద్రస్వార్థదృష్టిని, ఈ అనాత్మభ్రాంతిని, ఈ శరీరదృష్టిని వదలడమే సర్వసంగపరిత్యాగమంటే. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. తాను పని చేస్తున్నాననే భావమే సూర్యునికిలేదు. సూర్యుడు నిస్సంగుడు, నిష్కామి కాబట్టి ఆ యనంతప్రియత్వం గొలువుతున్నాడు. సర్వమును ఆకర్షిస్తున్నాడు. నదులు ప్రవహిస్తున్నాయి. ఆ ప్రవాహంలో అహంకృతిలేదు. అందుచేత పనిసాగిపోతున్నది. దీపం వెలుగుతున్నది. "నేను గొప్పదానిని. నేను వెలుగుతున్నాను. నేను ప్రకాశిస్తున్నాను"-అనే అహంకృతి దానికిలేదు అందుకే అది ప్రకాశిస్తున్నది. పుష్పములు వికసించి మధురసుగంధాలను విరజిమ్ముతున్నాయి. కానీ వాటికి "మే మీపనిచేస్తున్నాము. మేము మంచిచేస్తున్నాము"- అనేభావం లేదు.

అదేప్రకారం నిస్సంగివై పనిచెయ్యి. స్వార్థాహంకృతివిముక్తుడవై నీవు పనిచెయ్యి. సూర్య తారాకర్మల విధంగా నీకర్మఉండాలె. చంద్రకర్మవిధంగా నీకర్మఉండాలె. అప్పుడుమాత్రమే నీకర్మ విజయం పొందుతుంది. అప్పుడుమాత్రమే ఈ ప్రపంచంలో నీ వేదైన నిజమైన మేలుచేయగలుగుతావు. వీరులైనవారందరూ, మహామేధావులైన వారందరు ఈ రహస్యమును పొందారు. ఈ కీలకమును పొందారు.

అహంకారాతీతులై మహాపురుషులందరూ ప్రసిద్ధకర్మలు చేయ గలిగారు. ఇది దైవధర్మం. సంగదృష్టిలేనిది మనం పనులుచేయలేము; మనం అభివృద్ధిపొందలేము-అన్న దురభిప్రాయమును వర్జించు. మానవుడు ఆత్మలో నిశ్చలుడై ప్రశాంతుడై, నిర్వికల్పుడై ఉండాలె. శరీరం నిరంతరం కర్మసంచలనంలో ఉండాలె-ఇది ధర్మం. మనస్సు స్థావరంగా, శరీరం జంగమంగాఉండాలె. శరీరంలో పనిలో అంతః కరణం నిశ్చలతలో ఉండాలె. ఇది ధర్మం. విముక్తుడవుగా! సమస్త భూప్రకృతి నీ నేత్రాలలో ప్రతిబింబిస్తున్నది. దాని సంపూర్ణ విశాలస్వరూపంతో నీ చూపునందు పడుతున్నది. కానీ నీకండ్లకేమైనా భారంకలుగుతున్నదా? సమస్త భూప్రకృతి నీ కన్నులలో ప్రతి బింబిస్తున్నా, నీ కన్నులకు బాధకలగడంలేదు. ఎంతో మృదువుగా కనపడుతున్నది. నీ కన్నులు స్వేచ్ఛగాచూస్తున్నవి. అదేప్రకారం గృహకృత్యాలలో సాంసారికజీవనంలో నీవు నిస్సంగదృష్టివహించాలె. నీ వీ సమస్తదృశ్యప్రపంచమును అవలోకిస్తున్నా, నీవు నిస్సంగుడవై అంటక స్వతంత్రుడవై ఉండగలవు. ఈ విముక్తి, ఈ స్వాతంత్ర్యం, సత్యాత్మజ్ఞానంచేతమాత్రమే, పూర్ణ సత్యసాక్షాత్కారనామాంతర మైన వేదాంతదర్శనముచేతమాత్రమే లభిస్తుంది. సత్యబ్రహ్మాత్మ్యమును తెలుసుకో. ఆత్మసాక్షాత్కారంపొందు. సమస్తతారలు సమస్తగ్రహ రాసులు నీ ఆజ్ఞలు శిరసావహిస్తాయి.

తిరుగండి సూర్యతారావళులార!
ఆ పరంజ్యోతిలో మిణుగురుల్ మీరు!
సూర్యాధి సూర్యుడు నాలోన దిరుగు
ఓ మండలములార! ఓ గోళరాశి!
నా లోని అతివిశాలాంబుధులందు
బుడగలై తరగలై లేచుచు పడుచు
పెరుగుచు విరుగుచు పొరలుచున్నారు
ఓ లోకవితతి! ఓ గ్రహరాసులార!
కదురులై మీరు పరిభ్రమించండి
చైతన్యతేజంబు నందున మునిగి

నృత్యంబు సేయుచు నభినయమందు
మీ వివిధాంగము లెల్ల చూపండి.
నాస్వప్నపున్నీడ లైనట్టి సూర్య
నక్షత్ర భూ సాగరముల తిరుగునవి?
సంచలించుట, నేనె తిరుగుట నేనె
వచ్చుట పోవుట నేనె, చేయునది
కర్త కర్మ క్రియల్ మూడును నేనె
లేదు విశ్రాంతియు, చలనంబు లేదు.
నీది నా దనునది మందుకు లేదు.
వాక్కులకందని బ్రహ్మను నేను!
మిలమిల మెరసెడి ఓ చుక్కలార!
మిణుకు మిణుకు మటంచు కనుగీటి నన్ను
పిలుచుచున్నార లో ప్రియతారలార!
ముందొక మాటకు బదులు చెప్పండి
ఎచటికి నను మీరు పిలుచుట చెపుడు?
మీ కండ్లలోగల మెఱుపును నేనె!
మీలోని జీవచ్చైతన్యంబు నేనె!

ఇది నీ సత్యాత్మ. ఇదే నీ స్వస్వరూపం. స్వస్వరూపసందర్శనం చేసి విముక్తిపొందు. సమస్త విశ్వనాథుడవు నీవని తెలుసుకో. బ్రహ్మ సాక్షాత్కారంపొందు. నీ సమస్తకర్మలు నీ సమస్తవ్యవహారాలు వాటంతటవే సుముఖంగా పరిణమిస్తాయి. విజయం నిన్ను వెతుకు కొంటూ వస్తుంది. విజయమును నీవు అన్వేషింప నవసరంలేదు. నీ అంతర్బ్రహ్మత్వ విశ్వాసంచేత, నీ అంతర్భగవత్సాక్షాత్కారంచేత సమస్తజనం నీకు సేవచేస్తుంది. ఈ సమస్తప్రపంచం నీపాదచ్ఛాయలను అనుసరిస్తుంది. విజయప్రతిష్ఠలు నిన్ను వెతుక్కుంటూవస్తాయి. నీవు వాటిని వెదుక నవసరంలేదు. "పర్వతం మహమ్మదు దగ్గరకురాక పోతే, మహమ్మదే పర్వతందగ్గరకు పోతాడు". ఈ ప్రపంచవస్తు సుఖాన్వేషణ నీ వే నిమిషంలో పరిత్యజించి విముక్తుడవై, నీలోని బ్రహ్మత్వమును కనుగొంటావో, ఆ నిముషంలో నీవు మహమ్మదు

చెంతకు పోనవసరంలేదు. మహాత్ముడు నీచెంతకు నడిచివస్తాడు. ఇది ధర్మనియతి. ఇదేరహస్యం. ప్రపంచమును పరిపాలిస్తున్న గుప్తరహస్య మిదే. నీ వీ సత్యసూత్రముతో యున్నావు. సత్యమును సందర్శించు. సత్యసాక్షాత్కారంపొందు. నీ భార్యాపుత్రులనుకూడా సత్యసాక్షాత్కారంపొందేలాగేచెయ్యి. నీవు విముక్తుడవై వాండ్లనుకూడా విముక్తులనుచెయ్యి. ఈ విధంగా భయంకరనరకమును స్వర్గంగా మార్చగలుగుతావు. నీ గృహములో స్వర్గమును సృష్టిస్తావు. కల్లోల సంకులమయిన మీ గృహాలన్నీ ఆనందమందిరాలై ప్రకాశిస్తాయి. ఇది తప్ప వేరొకమార్గంలేదు. అనివార్యమయిన, అప్రతిహతమయిన దైవధర్మమిది. దీనిని అతిక్రమించడానికి ఎవరిచేతా కాదు. ఇదేమార్గం. ఇదే ఏకైకకీలకం. ఈ ప్రపంచంలోని సమస్త భాగ్యకోశాగార ద్వారములను తెరిచే తాళపుచెవి యిదే. మీలోని బ్రహ్మత్వమును తెలుసుకో[illegible]త్మసాక్షాత్కారమునకు ఇతరులకు తోడు పడండి!

ఓమ్! ఓమ్!! ఓమ్!!!

# గృహస్థ జీవన – భగవత్సాక్షాత్కారం

(శాన్‌ఫ్రాన్సిస్కోలో 1903, ఫిబ్రవరి 1 న ఇచ్చిన ఉపన్యాసం)

వివాహితుడైన మానవుడు ఆత్మసాక్షాత్కారం పొందగలడా?

పూర్వము ఒకసారి ఈ ప్రశ్న వేయబడింది. ఆ సమయములో ఈ ప్రశ్నకు సమాధానముకూడా సంపూర్ణముగా వివరింపబడింది.

ఈ దినము రాముడీ విషయమును తీసుకోవడములేదు. కానీ యించు మించు దీనిలాంటి విషయమును ప్రసంగిస్తాడు.

"వాంఛ అంటే ఏమిటి? మానవప్రకృతిలో వాంఛలెలా బయలుదేరుతున్నాయి? వాంఛాసఫలతవల్ల ఆనందం ఎలా కలుగుతున్నది? వాంఛావిఫలతవల్ల దుఃఖం ఎలా కలుగుతున్నది?" మొదలైన విషయాలను గురించిన వాంఛాప్రకృతినిగూర్చి అప్పుడు ప్రసంగవశమున చెప్పబడింది. ఈ విషయము చాల దీర్ఘమైన చిక్కైన విషయము. రాముడీ విషయమునుగూర్చి దీర్ఘవిచారణ చేశాడు. ఈ రాముని పరిశోధితవిషయములు *మానసిక శక్తులు అనే పేరుతో ఒక గ్రంథరూపములో వెలువడుతాయి,

గృహస్థుడు – భార్యాపుత్రాదులతో కూడియున్న సామాన్య మానవుడు సత్యమును, సత్యాత్మను సందర్శించగలడా? ఇదీ ప్రశ్న.

ఈ ప్రశ్నయొక్క ఒక భాగమును మనము తీసుకుంటాము. "నీ చేతిలో ఉన్న ఖడ్గం. నీ విరోధులను చంపగలదా?" అని వేదాంతము ప్రశ్నిస్తున్నది.

నీ చేతిలో ఖడ్గం నీ శత్రువులను సంహరించగలిగితే, నీ గృహస్థ జీవనంకూడా నీ సత్యాదర్శనానికి దోహదమవుతుంది. ఖడ్గమునుగానీ,

---

*ఈ పరిశోధన స్వామివారు మొదటిదశాలలో "సూత్రరూపాలలో చిత్తుగ తయారు చేశారు మాత్రమే. శ్రీ వారిది విపులీకరించి యున్నట్లయితే ఈ మహోత్కృష్టమైన, అతిసుందరమైన తత్త్వదర్శనమును మనం చూడగలిగేవారము. శ్రీ వారి మహానిర్యాణం, మనకీ భాగ్యమును కలిగించలేదు."

సంసార సంబంధాలనుగాని, మనము ఉపయోగించుకొనే విధానంలో ఉన్నది. ఆ కత్తితో మనలను మనం చంపుకోవచ్చు. లేదా శత్రువులను చంపవచ్చు. అదేప్రకారం కుటుంబసంబంధాలను, సంసారసంబంధాలను దుర్వినియోగముచేసి మానవుడు తనచావు తను తెచ్చుకుంటాడు. తన ఆధ్యాత్మిక అభ్యుదయానికి పతనం కలిగించుకుంటాడు. సంసార సంబంధాలను, గృహసంబంధాలను సద్వినియోగంచేసి, మానవుడు, తనను తాను ఉద్ధరించుకోవచ్చు. తనలోని పరబ్రహ్మను సందర్శించవచ్చు. ప్రశ్నకు సమాధానమిది.

మన విహారములు, మనమైనందిన కృత్యాలు మనకు సుఖప్రదం చేసుకోవచ్చు. సక్రమపథంలో తీసుకుంటే మనం వాటివల్ల మంచిని పొందగలం. కాక వానిని దుర్వినియోగంచేస్తే, మన కవి వ్యాధిబాధలను చేకూర్చగలవు.

ఇదేమాదిరి మన గృహసంబంధాలు మనలను బాగుచేయగలవు, పాడుచేయగలవు. ఉపయోగవిధానంలో ఉన్నది.

ఒక గ్రామంలో ఒక బుద్ధిమంతుడున్నాడు. అతని సేవకుడు దుష్టుడూ, దుర్మార్గుడు. అయినా అతనినే తనవద్ద పోషిస్తున్నాడా యజమాని. ఆ సేవకుడు ఏపనిచేసినా సరిగాచేయడు. యజమాని ఆజ్ఞలు ఏ ఒక్కటికూడా అతడు సరిగా నిర్వహించడు. ప్రతిపనీ పాడే. ఎంత మంచివాడికైనా అతని పనిచూస్తే కోపంరాకుండాపోదు. కానీ అతివిశ్వసనీయుడైన ఈ యజమాని ఒక్కనాడూ కోపపడడు. ఎప్పుడూ సేవకుని ప్రేమతో చూస్తుంటాడు. ఒకనాడు ఆయింటికి ఏదో పనిమీదవచ్చిన ఒక అతిథి, ఆ సేవకునిమీద కినిసి, యజమానితో ఫిర్యాదుచెప్పడం తటస్థించింది. అతిథి కోపం అపుకోలేక పోయినాడు. ఆ సేవకుడు పెద్దమనుష్యులవద్ద ఉంచతగనివాడు. అతనిని వెళ్ళగొట్టండని యజమానికి చెప్పాడు. ఆ అతిథిమాటలు విని యజమాని యిలా అన్నాడు: "మీ సలహా చాలామంచిదే. మీరు మంచి అభిప్రాయంతో నాకు చెప్పారు. నామంచికే మీరు చెప్పారు– నాకు తెలుసు. మా పని అభివృద్ధి పొందాలనే మీరు చెప్పుతున్నారు. కానీ– నేనీ

సేవకుని ఉంచుకొన్నది- వీడు అత్యంత అవిశ్వాసి అన్న కారణం చేతనే. ఇతడు దుర్మార్గుడు, దుష్టుడు కాబట్టే యితనిని ప్రేమించవలసి వచ్చింది. ఇతడు పాపి, దుర్జనుడు, కృతఘ్నుడు కనుకనే నే నితనిని ఎక్కువగా ప్రేమిస్తున్నాను." మీ మాటలు వింతగా ఉన్నా యన్నాడు అతిథి.

యజమాని సమాధాన మిది:- "నాదగ్గరకువచ్చిన సేవకులలో ఎవడూ ఇంత అవిధేయుడు నాకు కనపడలేదు. నే నెంతోమందిని చూచాను. ఇతనంత అవిధేయుడు, ప్రతిపనీ వ్యతిరేకంగా భంగంచేసే వాడు, అసంతృప్తికలిగించేవాడు, ఈ సేవకుడుతప్ప నా కింకొకడు దొరుకలేదు. పూర్వంవచ్చిన సేవకులందరూ నామాట గడిదాటరు. నన్ను ఎంతో భయభక్తులుతో చూచేవాండ్లు. ఇతడు వాండ్లవంటి వాడు కాదు. ఇతనే నాకు అవసరం. దేహవ్యాయామానికి లోడీలు మొదలైన బరువైన వ్యాయామసాధనాలలాగా, నా ఆధ్యాత్మిక వ్యాయామానికి ఇతడు నాకు చక్కనిసాధనంగా ఉపయోగిస్తున్నాడు. లోడీలు మొదలైన బరువైన సాధనాలు దేహంలోని కండరాలకు బలమిచ్చినట్లు ఇతనితో సాధనం చేయడంచేత నాకు ఆధ్యాత్మికబలం చేకూరుతున్నది. ఈ సేవకునితో నిత్యం నేను కుస్తీపట్టవలసియుండడం చేత నాకు బలం చేకూరుతున్నది."

మీ సంసారసంబంధాలన్నీ మీకు అవరోధాలని ఆటంకములని విసుగుచెంద నవసరంలేదు. ఈ యజమానిలాగ మీ అవరోధశిలలను మీ సోపనాలుగా చేసుకోండి. అవి మీ బలమునకూ, శక్తికీ దోహదం కాగలవు.

సోక్రటీస్ అనే తత్త్వవేత్తకు మిక్కిలి గయ్యాలిపెళ్లాముండెది. ఒకనా డతడు తత్వవిచారణలో మునిగియున్నాడు. ఆ గయ్యాలి త్వరత్వరగా వచ్చి, పెద్దకేకలువేస్తూ, తన నిత్యజీవితమును విప్పి అతనిని తిట్టడము ప్రారంభించింది. అదికావాలె, ఇదికావాలె అని వేధించి అతని ఏకాగ్రత భంగంచేయడము మొదలుపెట్టింది. ఆమె ఎంత పనుదృష్టితో గందరగోళముచేస్తున్నా, సోక్రటీస్ నిశ్చలుడై

తత్వవిచారణలో మునిగియున్నాడు. ఏదైన సమస్యను అదిపరిష్కారం అయిందాకా అతను వదలేవాడుకాడు.

ఆ గయ్యాలి తుపానులాగా రేగి గర్జించింది. గర్జించింది. కానీ సోక్రటీస్ చెవినిబెట్టలేదు. కోపము ఆపుకోలేక అప్పు డామె జాలాది గుంటలోని మురికినీళ్లు పెద్దగిన్నెనిండా ముంచి అతనినెత్తినపోసింది. సోక్రటీసేమాత్రం చలించలేదు. వికలుడుకాలేదు. పకపకానవ్వి 'తఱచు ఉఱుముఉరుముడంతోటే వర్షాలుకురుస్తాయి, అనేమాట నేడు నిజ మయింది" అన్నాడు.

ఆమె ఎప్పుడుగర్జించినా, వర్షం కురవలేదు. ఇవ్వాళగర్జించింది. పైగా వర్షంకూడాకురిసింది. అని తిరిగి తన తత్త్వవిచారణలో మగ్నుడైనాడు సోక్రటీస్. చూచారా! మన మెంత దురాగ్రహమునైనా నిగ్రహించవచ్చు. సోక్రటీసు ఒక మనిషి-అట్టిపూర్ణ నిగ్రహామునుకూడా చూపగలిగితే మనందరంకూడా ఆ విధంగా ఎందుకుచేయలేం? మనం చేయగలం. నేడుమాత్ర మిట్టి నిగ్రహాపరులు ఇంద్రియనిగ్రహాపరులు లేరాకిముఖ్యాటికి ఉన్నారు. నీవుకూడ ఈ నిగ్రహాశక్తిని సాధించ గలవు.

నీవు సంకల్పిస్తే, నీ సంసారసంబంధాలద్వారాకూడ సత్యసాక్షాత్కారపథాన్ని నీ స్వస్వరూప బ్రహ్మానుసంధాన పథాన్ని, విశ్వైక్యజ్ఞానపథాన్ని, సమస్తప్రపంచైక్యతాపథాన్ని, ఆత్మజ్ఞానపథాన్ని సుకరం చేసుకోవచ్చు.

ఈ ప్రపంచంలోని సమస్త మానవ జీవితాశయము ప్రపంచంలోని పరిణామాంత్యం ప్రతివ్యక్తి అంతర్బ్రహ్మాత్మ సాక్షాత్కారం పొందడమై యున్నది. భగవదైక్య జ్ఞానము కలిగేటంతవరకు, బ్రహ్మానుసంధానదివ్యానుభవం కలిగేటంతవరకు మనస్సు అనుభవార్జనం చేయక తప్పదు. ఆత్మానుసంధానమే పరమ గమ్యము. కత్తికోనముందైనా, నీ వీ పరమ గమ్యమును తెలుసుకోవలసి యున్నది. సామాన్యమానవుడు ఈ సాంసారికబంధాలు ప్రతిబంధకాలుగా చూస్తాడు. ధృవప్రథము మార్చుకుంటే భార్యాపిల్లలు నీ సాధనకు ఉపకరణాలు కాగలరని రాముని నిర్వచనము.

భూమి సూర్యునిచుట్టూ తిరుగుతున్నది. భూమి తప్పక తిరగాలి. చంద్రుడు భూమిని ఆశ్రయించి ఉన్నాడు. భూమి ఏమిచేయాలి. మరి? చంద్రగ్రహ గోళాలనుకూడా వెంటతీసికొని, వాటితో కలసి, భూమి సూర్యునిచుట్టూ పరిభ్రమించ గలుగుతున్నది.

ఓ మానవుడా! ఓ మానినీ! నీవు సూర్యసూర్యుడైన పరబ్రహ్మసన్నిధికి చేసే యాత్రా పరిభ్రమణంలో చంద్రగ్రహ గోళాలతో కూడిన భూమిలాగా, నీతో నీ భార్యాపుత్రాదులనుకూడా తీసుకపో. చంద్రునితోకూడిన భూమివలె సూర్యసూర్యుడైన, తేజస్తేజమైన పరబ్రహ్మచుట్టూ నీ తోటివ్యక్తితోకూడి ప్రదక్షిణించు. ఆ సూర్యభగవానుని పరమతేజమును ఈ ఒక్క శరీరంలోనే అనుభవించడానికి బదులు, నీ సహధర్మచారిణిని, నీ అనూయాయులనుగూడ పంచుకోనివ్వు. ఒక ఆత్మనేకాక (మనసు) ఇతరాత్మలనుకూడా నీవు ఆకర్షించ గలుగుతావు. ఒక్కశరీరంతోనేగాక, అనేక శరీరాలతో నీవు పనిచేయ గలుగుతావు. సమస్తశరీరములు నీవే. నీ ఒక్కశరీరమేకాక, సమస్త శరీరాలు భగవంతునికి చెందగలుగుతాయి. భగవదంకితాలై ప్రకాశించ గలుగుతాయి. ఒక మానవుడు ఎక్కడికన్నా పోయేటప్పుడు తన శరీరమంతటితో వెళ్ళుతాడు. కానీ తల, చేతులు, కండ్లూ, ముక్కు, చెవులు మొదలైనవి వదలి పోతాడా? సర్వావయవాలు కలిసిపోతాయి.

అట్లే నీవు బ్రహ్మజ్ఞానసన్నిధికి వెళ్లేటప్పుడు, సత్యసాక్షాత్కారం పొందేటప్పుడు నీ అర్థశరీరభాగంతో వెళ్లేబదులు మిగతా అర్థశరీరాలైన నీ భార్యాపుత్రాదులనుకూడా తీసుకపో! ఈ ప్రకారం బ్రహ్మైక్యజ్ఞానం పొందడానికిముందు మొదట నీ భార్యాపుత్రులతో ఐక్యతను పొందు. తన భార్యాపుత్రులతో ఐక్యతను గుర్తించలేనివాడు విశ్వైక్యతను ఎలా పొందగలడు?

మొదట నీ సంబంధీకులతో ఐక్యతనుపొందు. మొదట నీ ఆప్తులతో ఏకీభావంపొందడం నేర్చుకో. నీ శ్రేయస్సే వారి శ్రేయస్సుగా, వారి శ్రేయస్సే నీ శ్రేయస్సుగా చూడు. అన్ని దేహాలు ఒకేపోతగా

పోయబడిన నీ దేహంగా చూడు. ఈ రకంగా క్రమానుభవంపొందు. తరువాత నీ ఐక్యత పరకుటుంబాల పరిధికికూడా అతిక్రమించనియ్యి. క్రమక్రమంగా ఈ రీతి వికాసదృష్టిబూని సమస్తకుటుంబాలను నీ స్వశరీరంగా చేసుకో! సమస్తశరీరాలు నీ శరీరంగా చూచుకోగలిగిన తర్వాత, నీ బ్రహ్మైక్యత్వమును సాక్షాత్కరించుకోగలుగుతావు. అందరినీ నీతోగూడ తీసుకపోగలుగుతావు.

బైబిలులో క్రీస్తుప్రేమించిన సెయింటుజానును గురించి మనము చదువుతాము. క్రీస్తు సమస్తప్రపంచమును ప్రేమించాడు. "క్రీస్తు ప్రేమించిన శిష్యుడు"-అన్న ఈ పదాన్ని కొంచెము సవరణచేస్తే, "క్రీస్తును ప్రేమించిన శిష్యుడు"-అవుతుంది. ఇది క్రీస్తుద్వారా మోక్షం కలుగుతుంది అనే క్రైస్తవమతసిద్ధాంతమునకు దారితీస్తున్నది.

"క్రియ, ప్రతిక్రియలు సమానములు, పరస్పరవిరుద్ధములు." క్రీస్తు, శిష్యుని ప్రేమించినప్పుడు ఆ శిష్యుడుకూడా క్రీస్తును తప్పక ప్రేమించాడన్నమాట. "క్రియ, ప్రతిక్రియలు సమానములు. పరస్పర విరుద్ధములు"-అనే అనివార్యమైన ప్రకృతిన్యాయం నిజంకాకపోతే, క్రీస్తు అతనిని ప్రేమించేవాడుకాదు. క్రీస్తు బ్రహ్మజ్ఞాని. ఆయన విశ్వ పితతో, సర్వేశ్వరునితో ఐక్యతగన్నాడు. తన వ్యక్తిత్వమును, తన మనస్సును, తన బుద్ధిని తన సర్వస్వమును భగవంతునిలో విలీనంచేశాడు.

జాన్ పేతురు పాల్ మొదలైన శిష్యులు అట్టివానిని ప్రేమించడంచేత అట్టివానితో సహచర్యజీవనం గడపడంచేత అతనితో ఐక్యత్వానుభూతిపొందడంచేత క్రీస్తుయొక్క దివ్యత్వమును వాండ్లు కూడా పంచుకున్నారు.

ఇక్కడ ఒక విద్యుచ్ఛక్తిగల వస్తువున్నదనుకోండి. విద్యుచ్ఛక్తిలేని మరొక వస్తువును దీనితోకలిపితే, ఈ విద్యుచ్ఛక్తిగల వస్తువునుండి ఈ రెండోవస్తువుకూడా విద్యుచ్ఛక్తిని పొందుతుంది.

అదేప్రకారం క్రీస్తు ప్రేమమూర్తి. అట్టివాని సంపర్కంచేత, సాంగత్యంచేత ఆయనశిష్యులకూ ఆ దివ్యత్వం సంక్రమించింది. క్రీస్తు ప్రేమచేత తనను తాను రక్షించుకున్నాడు. ఆ ప్రేమను ఆకర్షించి

శిష్యులుకూడా రక్షితులైనారు. ఏ మానవుడైనాసరే తాను సంపూర్ణంగా, విశ్వప్రేమగా మారిపోతేతప్ప సమస్తవిశ్వమును తన తనశరీరంగా చూడగలిగితేనేతప్ప, అన్యథా భగవత్సాక్షాత్కారం పొందలేడని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది. తానే సమస్తప్రపంచంగా మారిపోవడం, సత్యం లేక ఆత్మసాక్షాత్కారానికి ప్రథమసోపానం. తరువాత మెట్టు దానికి అతీతుడుగావడం.

క్రిందటిదినం ఒక ఉపన్యాసంలో అంతర్మాయ, బాహ్యమాయ అనే ద్వివిధమాయలనుగూర్చి చెప్పిన విషయం మీకు తెలుసు.

అంతర్మాయ అంటే ప్రపంచమును భేదదృష్టితో చూడడం. ఒకరికొకరం విభిన్నుల మనుకోవడం. ఈ అంతర్మాయాంధత్వంచేత మానవులు సమస్తపదార్థములందు, సమస్తమానవులందు భగవంతుని చూడలేరు. సమస్తవస్తుజాలంతో మన ఐక్యతను గుర్తింపనియ్యని మనోవ్యాధికి ఈ అంతర్మాయే కారణం. బాహ్యమాయ అంటే నామరూపభ్రమ. బాహ్యస్వరూపదృష్టి.

మానవుడు ఈ రెండుమాయలను అతిక్రమించాలి. ప్రథమంలో సమస్తదేహరూపాలలోని అభిన్నతను (ఏకత్వమును) గ్రహించడం అత్యావసరం. ఈ మాయాద్వయమును నిర్జించనిచ్ఛించిన, మానవుడు తాను సమస్తమానవులయొక్క, సమస్తజగత్తుయొక్క సత్యాత్మనని సంభావించాలి. మమాత్మా సర్వభూతాసి. సమస్తమానవులయొక్క, సమస్తవృక్షరాశియొక్క, సమస్తనదులయొక్క, సమస్తక్రిమికీటకాదుల యొక్క, సమస్తజగముయొక్క ఆత్మ నా ఆత్మే అని అట్టిమానవుడు సాక్షాత్కారం పొందుతాడు. సాక్షాత్కారముయొక్క ఒక స్థితియిది. ప్రాథమికస్థితిలో తన భార్యాపుత్రాదులతో ఐక్యతనుగుర్తించి, క్రమక్రమంగా ఆ ఐక్యదృష్టిని విశాలపరచడంచేత ఈ స్థితికి మానవుడు అధిగమింపగలడు. సమస్తప్రపంచంతో ఐక్యతను సాక్షాత్కరించుకోవడం ఇది ఒక స్థితి. తరువాతస్థితి నామరూపస్వరూపా లన్నీ అదృశ్యమై ఈ మాయ సంపూర్ణంగా అదృశ్యమై నీ శరీరంగా చూడబడుతున్న ఈ సమస్తప్రపంచం ఆత్మలో లీనమై అదృశ్యమవుతుంది.

మొదట మనము ఈ సమస్తప్రపంచం నా శరీరం అన్న సాక్షాత్కారముపొందాలె. తదుపరి నీ శరీరంగా దర్శితమయిన యావత్ప్రపంచం అదృశ్యమై పరమసత్యంలో నీ స్వస్వరూపాత్మలో విలీనమవుతుంది.

ఆత్మజ్ఞానియైన మానవుడు మొదట సమస్తప్రపంచైక్యతపొందుతాడు. ఈ ప్రకార మతడు సమస్తప్రపంచరక్షకుడవుతున్నాడు. ఈ విధంగా నీకు నీవే రక్షకుడవుతున్నావని వేదాంతార్థము.

"క్రీస్తుద్వారా మనము భగవత్సాక్షాత్కారం పొందుతాము" అన్న వాక్యానికి అర్థం-ఈ స్థితిద్వారా, ఈ సమస్తప్రపంచైక్యస్థితి ద్వారా, ఈ క్రీస్తుయొక్క స్థితిద్వారా నీవు అఖండమైన అనిర్వాచనీయమైన ఆత్మలో దుముకుతావు. ఇట్టి సత్యసాక్షాత్కారానికి ముందు ఇట్టి అఖండమైన మనోవాచామగోచరమైన - నామరూపాది సమస్త వికార రహితమయిన కేవలాత్మ సాక్షాత్కారస్థితికిముందు, ఈ బ్రహ్మస్థితినిచేరడానికిముందు నీ సత్యాత్మ సమస్తనామరూపాదులందు పరివ్యాప్తమైయున్న దానినిగా సాక్షాత్కారం పొందవలసియున్నది. ఈ స్థితి క్రీస్తుస్థితి. ఈ క్రీస్తుస్థితిద్వారా, ఈ దివ్యానుభూతిద్వారా, నీవు కేవల బ్రహ్మైక్యతనుపొందగలవు. క్రమక్రమంగా సమస్తభూతజాలంతో నీ ఏకత్వమును పరివ్యాపనచేస్తే, ఈ పరమస్థితి లభిస్తుంది. నీ జీవిత ప్రాథమికపాఠాలు అనుభవరూపంగా ప్రబోధిస్తున్న దీ విషయమునే. తల్లిదండ్రులతో మొదట నీ ఏకత్వమును ఉపాసించు. తరువాత నీ భార్యా పుత్రమిత్రాదులతో నీ ఏకత్వమును సందర్శించు. నెమ్మది నెమ్మదిగా నీ దేశమంతటితో ఏకత్వసిద్ధిపొందు. తరువాత సమస్తప్రపంచంతో అభేదత్వమును పొందుతావు. తరువాత కేవలబ్రహ్మస్థితి. ఇది అత్యంత దుర్ఘట కార్యంగా కనపడుతుంది. కానీ అంతకష్టకార్యంకాదు. ప్రారంభంలోనే కొంచెము కష్టం. తరువాత తరువాత, నీ వికాసము తీవ్రగమనంతో సాగుతుంది. మానవుడు ఒక్కసారి ఒక మానవునితో ఐక్యతను గుర్తించి, అతనిలో విలీనుడు కాగలిగినప్పుడు, క్రమక్రమంగా సర్వులతో అతడు ఏకత్వానుభూతి పొందగలుగుతాడు. ఈ ప్రపంచంలోని ప్రేమంతా, ఒక అనివార్యమైన

ప్రకృతిధర్మముచేత, బహిర్ముఖత లేని, బాహ్యానామరూప వికారముల పాశకువలేని అంతర్గర్భిత పరమసత్యంలోనికి, అంతరాత్మలోనికి అంత కంత కెక్కువగ మనలను ముందుకు తరుమడము అనుభవములో మనము సందర్శించగలం.

ప్రతివ్యక్తియొక్క అనుభవము ఈవిషయముయొక్క నిజమును కొద్దిగానో, గొప్పగానో గుర్తింపగలదు. మన వయస్సు పెరిగినకొద్దీ, మన ప్రేమాశయం అంతకంతకు సంస్కరింపబడుతున్నది. మన ప్రేమ యొక్క మూలము అంతకంతకు మృదులమై, మంజులమై సునిశిత మవు తున్నది. ఇది మనము చూస్తున్నాము.

కొద్దిగానో గొప్పగానో, సమస్త మానవులు జీవితంలో చూస్తున్న విషయమేకదా యిది! శరీరం జరాజర్ఘరితమై ముఖం ముడుతలుబడి, అందచందాలు అడుగంటిన ముదుసలితనంలో మనము మన ప్రేమితవ్యక్తిలో ఈరూపవికారాలను చూడని ఒకదశవస్తున్నది. అప్పుడు మనము లోపలి ఆత్మనే ప్రేమిస్తున్నాం. మనం హృదయమునే ప్రేమిస్తున్నాం. లోపలి పవిత్రతనే, లోపలి ప్రేమనే మనము చూస్తున్నాం. ఇది మీా అందఱకీ అనుభవమేకద! ఈ విషయము మీారందరూ చూస్తున్నదేకదా! మన మొక వ్యక్తిని ప్రేమించినప్పుడు తఱచు మనమా వ్యక్తియొక్క బాహ్యదోషాలను శరీరకమైన లోపాలను చూడము. ఇది మీారందరూచూస్తున్న విషయమే. మనము సౌందర్యమునే చూస్తాం. పై చెడు మనకు కనపడనే కనపడదు. మనం ప్రేమించినవ్యక్తిలో మనకు నిజమైన ప్రేమఉన్నప్పుడు, మన హృదయం కరగి, ఆ వ్యక్తిలో కలిసిపోతుంది. ఈ దశలో మన ప్రేమమూలము ఎక్కువ సూక్ష్మమై స్థూల బాహ్యరూప వికారాలయొక్క స్పర్శను వదలుతున్నది. ఇప్పుడు కొంచెము పై మెట్టు ఎక్కామన్నమాట. బాహ్యవికారాలనుంచి, స్థూలశరీరాలనుంచే సూక్ష్మానుభూతుల మీాదికి నీ విప్పుడు అధిగమించావు. దీనికంటే పై మెట్టు ఉన్నతస్థితికి అధిగమించాలి. ఇక్కడ మన ప్రేమ కేంద్రం, ఉద్దేశం కాదు. భావం కాదు. మానసిక పవిత్రతకాదు. వస్తుస్వరూపంకాదు. ఈ దశలో ప్రేమ కేంద్ర అంతర్గత బ్రహ్మత్వమే. సత్యాత్మనే, అంతరాత్మనే మన

మిక్కడ చూస్తాము. ఈ స్థితికి ఒకసారి అధిగమించిన తరువాత, ఈ ప్రపంచ వస్తుజాలములన్నీ కేవలం చిత్రపటములుగా ఒక విచిత్ర సాంకేతిక లిపిగా మారుతాయి. వస్తువులను చూడక, వస్తువుల వెనుక నున్న అఖండ పరబ్రహ్మమును మనం చూచినప్పుడు మనం వస్తుదృష్టి వదలి వానిలోని బ్రహ్మమును, వానిలోని సత్యాత్మను దర్శించినప్పుడు ఈస్థితికి చేరుకొన్నప్పుడు సమస్త ప్రపంచైక్యత్వ సాక్షాత్కారం పొందడం సులభం. ఇదే క్రైస్తుస్థితి. ఈ క్రైస్తుస్థితిని కొంతకాలం అనుభవించినతరువాత, తరువాత మహాస్థితి పూర్ణబ్రహ్మైక్యమే. ఈ పరవశస్థితే, యీ అద్వైతస్థితే, యీనిమగ్నస్థితే కేవలబ్రహ్మస్థితి. ప్రవృత్తిరహితమయిన, వికల్పవిహీనమైన ఈ మహాస్థితినే మనం సమాధియని, నిర్వాణమని పేర్కొంటాము.

క్రమక్రమంగా ఈ మహాస్థితికి, ఈ ప్రాపంచకసంబంధబాంధవ్యాలు ఎలా మనకు సహాయం చేయగలవు?

హిందూదేశంలో భగవంతుని రోమన్ కాథలిక్కులవలె ఆరాధించే ప్రజలు కొందరున్నారు. అట్టిప్రజలు భగవంతుని విగ్రహస్వరూపాలద్వారా ఆరాధిస్తారు. భగవద్విగ్రహములను, రామకృష్ణాదుల విగ్రహాలను ఆరాధిస్తారు. రామకృష్ణులు భారతదేశపు క్రీస్తులన్నమాట.

హిందూదేశంలో ఒక ఊళ్ళో ఒక ముసలమ్మ ఒకమహాత్ముని దగ్గరకు వెళ్ళి, తాను ఇల్లూ వాకిలీ, సమస్తకుటుంబమునూ వదలి శ్రీకృష్ణజన్మక్షేత్రమయిన బృందావనానికి వెళ్ళడానికి సలహాఅడిగింది. తన కుటుంబసంబంధములన్నీ త్రెంపివేసి, సమస్తజనులతోటిగల సంబంధబాంధవ్యాలన్ని త్రెంచుకొని భారతవర్షపు జెరుసలేమయిన మనోహర బృందావనక్షేత్రానికి తాను వెళ్ళవచ్చా అని ఆ ముసలమ్మ అభిప్రాయము!

ఈ ముసలమ్మతో ఆమె మనుమడుకూడ ఉన్నాడు. ఆ ఋషి ఈ ప్రత్యుత్తరమిచ్చాడు: "అమ్మా! ఈ నీ మనుమని నేత్రాలలో నుంచి, నీ నేత్రాలలోకి తొంగిచూస్తున్న దెవరు? ఈ బాలుని శరీరము

లోని అణువణువణువునుంచి ఏ శక్తి, ఏ దివ్యత్వం నీపై అవలోకి స్తున్నది?" ఆ మాటలకు ముసలమ్మ ఇలా అన్నది: "భగవంతుడే! ఈ నోరెరుగని పసికందులో ఏ మోహమూ, ఏ పాపమూ లేదు. ఈ శిశువు అమాయకుడు. ఏ చెడూ లేని పరిశుద్ధుడు. ఈ శిశువు ఏడుస్తు న్నప్పుడు ఈతని ఆక్రందనంలో భగవంతుని కంఠారావమే వినదిస్తుం టుంది". ఆ మహాత్ముడు ముసలమ్మతో ఇలా అన్నాడు: బృందావనం వెళ్ళి అక్కడ నీవు ఏదో ఒక కృష్ణవిగ్రహామునుకదా పూజించేది. ఆ భగవద్విగ్రహాంలో నీవు భగవంతుని ఆరాధిస్తావు. అంతేకదూ! బృందావనంలో నీ వారాధించబోయే విగ్రహామంత ఈ బాలుని విగ్రహంమాత్రం శ్రీకృష్ణారాధనకు బాగుండదా?" ముసలమ్మ కొంచెం ఆశ్చర్యపడింది. మనస్సులో ఆలోచించుకొన్నది. అర్థమైంది. ఈ బాలుని శ్రీకృష్ణుని అవతారంగా సంభావించి, శ్రీకృష్ణోపాసన ఈ బాలుని విగ్రహారూపకముగా చేయవచ్చు నని గ్రహించింది. ఎందు కంటే శిశువు నేత్రాలద్వారా వీక్షిస్తున్నది భగవంతుడే కదా! ఈ బాలుని శరీరానికి చైతన్యమిస్తున్నది భగవంతుడేకదా! ఈ శిశువు కర్ణములగుండా పనిచేస్తున్నది భగవంతుడేకదా! శిశువు తలమీది మనోజ్ఞ కేశాలను పెరిగిస్తున్నది భగవంతుడేకదా! ఈ బాలుని ప్రత్యణువులో దీపిస్తున్నది భగవంతుడేకదా! పరబ్రహ్మకదా బాలుని రూపములో ప్రకాశిస్తున్నది!

ఆ మహాత్ముడు చెప్పిన ప్రబోధానుసారం ముసలమ్మ యిక నుంచి ఆ శిశువును తన మనుమడుగా, శరీరసంబంధీకుడుగా చూడ కూడదు. సాక్షాత్ పరబ్రహ్మగా పరిగణించాలి. ఈ బ్రహ్మదృష్టి చేత సమస్త సాంసారికమైన, ప్రాపంచకమయిన మాయాసంబంధాలు తెగి పోతున్నాయి. అన్నిబంధాలుపోయి మిగలవలసిన ఏకైకసంబంధం బ్రహ్మత్వసంబంధమే. భాగవతసంబంధమే. ఇదే సర్వసంగపరి త్యాగమునకు మార్గం.

సర్వసంగపరిత్యాగమంటే అర్థం అడవిలో నివసించడంగాదు. సర్వసంగపరిత్యాగమంటే, సన్యాసమంటే అర్థం ప్రతివస్తువును పావనం చేయడం. శిశువును పరిత్యాగంచేయడమంటే శిశువుతోనున్న సంబంధ

మంతావదలి వానిని నూతిలో వేయడంకాదు. శిశువును మనుమడనే భావమును పరిత్యజించి భగవంతుడనే దృష్టితో చూడడమే సర్వసంగ పరిత్యాగం. సమస్తమానవులలో, సమస్తపదార్థములలో బ్రహ్మత్వ మును సందర్శించడమే వేదాంతదృక్పథానుసారం పరిత్యాగమై యున్నది. వేదాంతం నీ భార్యా పుత్ర మిత్ర బాంధవులను బరిత్యజింప మని ప్రబోధిస్తున్నది. వేదాంత సందేశ మిది:- "భార్యయందలి భార్యాదృష్టిని పరిత్యజించు. ఆమెయందలి సత్యాత్మను బ్రహ్మత్వ మును సందర్శించు. శత్రువునందు శత్రుభావమును పరిత్యజించు. శత్రువులో భగవంతునిమాత్రమే సందర్శించు. మిత్రునియందు మిత్ర దృష్టిని పరిత్యజించు. మిత్రునియందు బ్రహ్మత్వమును దివ్యత్వమును సందర్శించు."

స్వార్థవ్యక్తిగతబంధాలను పరిత్యజించి, సమస్త మానవులలో పరబ్రహ్మత్వమును సందర్శించు. సమస్తపదార్థాలలో భగవంతుని సందర్శించు. హైందవ వేదశాస్త్రములు, భార్యాభర్తలు గృహస్థా శ్రమాన్ని ఇట్టి ధర్మదృష్టితో నడపాలని ఉపదేశిస్తున్నాయి. వేద శాస్త్ర నిర్దేశానుసారం రాముని గృహస్థాశ్రమం నిర్వహింపబడింది. ప్రతిరోజు ప్రాతఃకాలసమయంలో రాముని సహధర్మచారిణి నిద్ర లేచేది. రాముడు ధ్యాననిమగ్నుడై బ్రహ్మానుసంధానం చేస్తూ, బ్రహ్మ భావవిలీనుడై, దేహాతీతుడై, నిత్యానంద మధురసపాన పరవశుడై యున్నప్పుడు అతని భార్యవచ్చి రోమనుకాథలిక్కులు భగవద్విగ్రహా రాధన చేసినట్లు శరీరమును విస్మరించి రాముని తదేకావలోకనం చేస్తూ కూర్చుండేది. ఇక్కడ రాముడు శరీరభావాతీతుడై, బ్రహ్మైక్య భావ పరవశుడై యుండేవాడు. ఆమెకూడా శరీరమును విస్మరించి బ్రహ్మభావంలో నిలచిపోయేది. రామునిశరీరానికి కొంచెముదూరంగా కూర్చొని, ఆమె తన దృష్టినంతా రాముని ఫాలభాగమందు నిలిపేది. ఆమె యింకా అంత ఉన్నతదృష్టిపొందకపోవడంచేత, ఈ శరీరమును లక్ష్యంగా పెట్టుకొన్నది. ఓంకారోచ్చారణచేస్తూ, రాముని స్వరూప మును ఆమె ధ్యానంచేసేది. ఆ ధ్యాననిష్ఠలో ఆమె తన దేహమునూ ఇతర భావాలన్నిటినీ విస్మరించేది. రాముని రూపంలో ఆమె

తాదాత్మ్యంపొందేది. తన శరీరమే రామునిశరీరంగా, రామునిఆత్మే తన ఆత్మగా ఆమె సంభావించి, ఏతత్సాక్షాత్కారం పొందింది. ధ్యానంచేస్తున్నది. భగవద్ధ్యానంలో నిమగ్నుడైనది రాముడుకాదు. ఆమే తద్ధ్యాననిమగ్నయైనది. రామునిధ్యానం ఆమె ధ్యానమే. ఇట్టి రామైక్యధ్యాననిష్ఠతో, సమస్తజగదైక్యసంభావనచేసేదామె. ఇట్టి సంభావనతో సమస్తప్రపంచముయొక్క ఆత్మ తానని సాక్షాత్కారం పొందగలిగింది. ఈ విధానంగా రాముడామెకు, ఆమెకు రాముడు దోహదమయినారు. ఆమె ఏరకంగా సహాయంచేయగలిగింది? భార్య, తన పతిని భగవంతునిగా సంభావించినప్పుడు, తన దివ్యభావాలతో భర్తయొక్క బ్రహ్మాకారసాధనకు దోహదపడుతున్నప్పుడు, ఆమె మానసికశక్తి, ఆమెధ్యానశక్తి, భర్తను భగవంతునిగా మార్చదా? భార్యయొక్క ఈ ధ్యానశక్తి భర్తయొక్క ఆత్మసాక్షాత్కారానికి సహాయకారికాదా? తప్పక సహాయకారి అవుతుంది.

మనము ఏవిధంగా సంభావిస్తే ఇంకొక ఏ వ్యక్తినైనా అదే ప్రకారము సంభావింపజేయగల మని క్రైస్తవ విజ్ఞానశాస్త్రవేత్త లందరికీ అనుభవములో ఉన్న విషయమే.

తనభర్త భగవంతుడు అనే దివ్యభావములను భార్య ప్రసరింప జేస్తున్నప్పుడు ఆ దివ్యభావము భర్తయొక్క భగవదైక్యసాక్షాత్కారానికి సహాయపడుతున్నది. అదేప్రకారం భర్త బ్రహ్మాను సంధాన సాక్షాత్కారం పొందినప్పుడు భార్యకూడా సహాయంపొందు తున్నది. ఓహో! ఇది ఎట్టి ఆధ్యాత్మిక సంయోగం! ఎంత మహాద్భుత మయిన ఐక్యత! పరస్పరసహాయం చేసుకొంటున్నారు. ఉభయులూ రక్షితులౌతున్నారు. ఇట్టి ఆధ్యాత్మిక ఐక్యతమీద ఆధారపడిన వివాహం, లేక ప్రేమ ప్రపంచంలో మహానందమును చేకూరుస్తుంది. బాహ్యరూపలావణ్యాలకు, ముఖసౌందర్యాలకు, శరీర విన్యాసాలకు, విమోహితులై చేసుకున్న వివాహసంబంధాలన్నీ వియోగాలతో, అశాంతితో అంతమవుతాయి. ఈ వివాహాలయొక్క ఫలితం హృదయ వేదన, బాధాందోళన, తీరని వ్యాకులత!

బాహ్యరూపలావణ్య విశేషాలనుచూడక, అంతర్బ్రహ్మతేజ స్సౌందర్యమునుమాత్రమేచూచి, ఆధ్యాత్మిక ఐక్యతమీద ఆధారపడిన వివాహంమాత్రమే క్షేమప్రదం. ఇట్టి వివాహంమాత్రమే శాంత్యానందముల ప్రసాదించగలదు.

ఒకస్త్రీ ఒక మహాత్మునిదగ్గరకువచ్చి ఇలా ప్రశ్నించింది: "అయ్యా! కొన్నిమాసాలక్రితమే నా భర్త మరణించాడు. అతనిని రక్షించడానికి నే నేం చెయ్యాలె?" ఇంకొక వ్యక్తివచ్చి తన ఏకైక పుత్రుడు చనిపోయినాడని దుఃఖమును భరించలేక, తాను ఆత్మహత్య చేసుకోవాలనుకుంటున్నానని చెప్పుకున్నాడు. మరొకడువచ్చి తన భార్య చచ్చిపోయిందనీ, ఇంక బ్రదుకుపై రోతపుట్టిందని, విన్నవించాడు. ఆ ఋషి ఏమి ప్రత్యుత్తరమిచ్చాడు?

ఆ స్త్రీ విచారగ్రస్థురాలై యున్నది. తన భర్తను రక్షించుకొనడానికి ఆతురతపడుతున్నది. ఆ ఋషి ఆమె కిలా ప్రత్యుత్తర మిచ్చాడు: "నీవు నీ భర్తను రక్షించుకోగలవు. నీవు విచారపడ నవసరములేదు. అయితే, నీవు నా సలహాను అనుసరించాలె. ప్రతినిత్యము నీకు విచారం వచ్చినప్పుడు, భర్త జ్ఞాపకమునకు వచ్చినప్పుడు ఒక చోటకూర్చో. కండ్లుమూసుకో. నీ భర్తయొక్క స్వరూపమును ధ్యానించు. వెంటనే నీ భర్త స్వరూపం నీ కండ్లలో గోచరిస్తుంది. ఈచిత్రము నీ మనస్సులో గోచరించినప్పుడు నీ భర్తయొక్క స్వరూపము నీ మనోరంగములో కనపడినప్పుడు విచారపడవాకు. దుఃఖపడవాకు. ఏడ్వవాకు. ఏడవడము చేత, ఆక్రందనము చేత, కన్నీళ్ళు కార్చడము చేత నీ భర్తను పతితుణ్ణి చేస్తావుసుమా! అతనిని తిరిగీ ప్రపంచ బద్ధుని చేస్తావుసుమా! నీ పనంతా తలక్రిందులవుతుంది. నీ పతినిని పతితునిచేయడానికి ప్రయత్నించకూడదు. అతని అభ్యుదయానికి నీవు అడ్డుతగుల గూడదు. నీ పతినిని ఏ పుణ్యలోకములోనో ఉన్నట్లు తలువవచ్చు. లేదా అతను మృతుడు కాకుండా సజీవుడైయున్నట్లే భావించవచ్చు (ఎందుకంటే— నీవు కండ్లుమూసికున్నప్పుడు నీ భర్తయొక్క ఆకృతినీకు స్పష్టముగా కనపడుతున్నదికదా) అతని స్వరూపము నీ కన్నులఎదుట నున్నప్పుడు అతడు భగవంతుడని సంభావించు,

ధ్యానించు, ప్రబోధించు. "నీవు భగవంతుడవు. పరబ్రహ్మవు. నీవు పరమేశ్వరుడవు. నీ రూపంలో, నీ శరీరంలో, నీ ఆకృతిలో నాకు గోచరిస్తున్నది భగవంతుడే" అనే భావమును నిరంతరము అతనిపై వర్షించు. నీవు టెలిఫోనువద్ద చెవిపెట్టి ఒకవార్త వింటావు. ఆ వార్త ఆ తీగలలో తయారుకావడము లేదు. వాటివెనుకనున్న ఒకస్నేహితుడే నీ కావార్త పంపుతున్నాడు. అదేవిధముగా గతించిన నీ భర్తయొక్క స్వరూపము నీకు కనిపించినప్పుడు ఆ రూపమునకు వెనుక ప్రకాశిస్తున్నది పరబ్రహ్మ అని తెలుసుకో. "నీవు పరబ్రహ్మవు, నీవు భగవంతుడవు" అని నీ భర్తను సంకీర్తించు. ఈవిధంగా గతించిన నీ భర్తను సముద్ధరించగలవు.

ఈ విధంగా మనము మృతినొందిన వారినే సముద్ధరించ గలిగినప్పుడు, ఇదే విధానముగా బ్రతికియున్న మన స్నేహితులను సముద్ధరించగల మనడములో సంశయము లేదు.

భార్యాభర్త లిరువురూ ఇట్టి ధర్మపథంలో జీవించినట్లయితే వారి అన్యోన్య సంయోగం ఆత్మజ్ఞానాభివృద్ధికీ, పరస్పరశాంతికీ దోహదంగాక మరేమవుతుంది. ప్రతివాడూ తన భార్యకు ఆనందం చేకూర్చాలనే ఆశిస్తాడు. ఆమె కేది సంతోషప్రదమో ఆ వస్తువల్లా శ్రమపడి ఏదో ఒకరకంగా తెచ్చి ఇస్తున్నాడు- అని మీరంటారు. అజ్ఞానవశులై ప్రజలు ఇతరుల అభిరుచులప్రకారం వర్తించి వారికి మనం ఆనందం చేకూరుస్తున్నామని భ్రాంతిపడుతున్నారు. ఇది ఆనందంచేకూర్చే మార్గంకాదు. ఇట్టి విపరీతదృష్టిచేత మిమ్మలను మీరు పతనం చేసుకోవడమేగాక ఇతరులనుకూడ పతితులను చేస్తారు మాత్రమే. ప్రకృతియొక్క ధర్మం- నాకు ఏది ఆనందప్రదమో, నీకూ అది ఆనందప్రదమై తీరాలి. నాకు ఏది మంచిని చేకూరుస్తుందో నీకూ, అది మంచిని చేకూరుస్తుంది. నేను అభివృద్ధిని పొందితే, నీవూ అభివృద్ధిపొందుతావు. నా అభివృద్ధే నీ అభివృద్ధి. నేను రోగినైతే, సమస్త ప్రపంచమును రోగభూయిష్ఠము చేస్తున్నాను. నా శరీరమును ఆరోగ్యంగా ఉంచడంచేత, ఇతరులందరినీ ఆరోగ్యంగా ఉంచుతున్నాను. క్రియ ప్రతిక్రియ పరస్పర విరుద్ధములైనవి. సమానమైనవి.

నీకు నేను నిజమైన ఆనందమును చేకూరుస్తున్నట్లైతే, నాకూ ఆనందము కలిగితీరాలె. అట్లుకాక వారిని వీరూ, వీరిని వారూ సంతోషపరచడానికి, సుఖప్రీతికి చేసేపనులు ఆనందము చేకూర్చగలవని ప్రజల తలంపు. వీటివల్ల కలిగే ఫలితం అసూయ, దుఃఖతాపం.

ఈ కృత్రిమప్రేమచేత ఉభయులూ శోకగ్రస్థులుగాక తప్పదు. భయాందోళనలతో వారు సంకులపడక తప్పదు. ఒకరి నొకరు ఆనంద పఱచుకునే మార్గం ఏమిటో తెలియని అజ్ఞానంచేతనే, ఈ బాధా భయాలు కలుగుతున్నాయి. ఒకరి కొకరు ఆనందము చేకూర్చుకోవడానికి మీ రీ స్వార్థాహంకృతిని త్యాగం చెయ్యాలె. నీ స్నేహితుని లోని యథార్థ తత్త్వమును మాత్రమే నీవు గ్రహించాలె. నీభార్యలో సుస్థిర మనోబలమును చేకూర్చవలసియున్నది. నీ ఆత్మబలము నీ భార్యలో ప్రతిబింబించాలె. మీరు పరస్పరం జ్ఞానదాతలు కావాలె. ఈవిధంగా నీవు నీ తోటివ్యక్తులకు ఆనందము చేకూర్చడమేకాక, నీవు కూడ నిత్యానందము పొందగలవు. నిజంగా నీవు శ్రేయోభిలాషివయి నట్లయితే, నిజమయిన ఆనందము కలిగించే వస్తువులనే నీవు నీ తోటి వ్యక్తులకు ఇవ్వవలసియున్నది. ఆ వస్తువులు జ్ఞానము ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం. ఇవి నీ స్నేహితులకు పంచిపెట్టు భర్త భార్యకు, భార్య భర్తకు విద్యనేర్పడం విధియైయున్నది. ఇదే ఒకరికొకరు ఆనందము చేకూర్చుకునే నిజమైన మార్గం. తన భార్యకు గురువుకాలేని భర్త, తన భర్తకు జ్ఞానప్రదానం చేయలేనిభార్య తమ జీవితాల్లో ఆనందాన్ని పొందలేరు. తన భర్తకు ఆధ్యాత్మిక స్వేచ్ఛను, జ్ఞానమును ఇవ్వజాలనిభార్య మహాపాపి. అదేప్రకారం తనభార్యకు తన గృహమును ఒక గురుకులాశ్రమంగా చేయలేని భర్త మహాపాపి.

క్రీస్తుయొక్క పవిత్రగర్భధారణమునుగూర్చి రామునియొక్క వాఖ్యాన మిది : క్రీస్తుయొక్కతల్లి మరియ పవిత్రురాలు. భగవద్భక్తురాలు, భగవత్ సాక్షాత్కారమును ఒక స్థితివరకు పొందిన పవిత్రురాలు. ఆమె భగవదైక్యహృదయ. జోసెఫ్‌కూడా మహాపవిత్రుడు. సమస్తవిశ్వంలో భగవద్దర్శనంపొందిన జ్ఞాని. ఉభయులకూ యుక్త వయస్సు వచ్చింది. మేరీ గర్భం ధరించిన సమయంలో ఆ భార్యా

భర్తలు ఇద్దరు ఒక భగవద్దైక్యపరవశస్థితిలో ఉన్నారు. ఆ విషయం తరువాత ఆమె పరిపూర్ణంగా మరచిపోయింది. అది జరిగిన విషయమే ఆమెకు తెలియదు.

చూడండి; శిశువును తల్లిదండ్రులు అర్థరాత్రిపూట లేపి పాలో, చెరుకురసమో త్రాగింప చేస్తారనుకోండి. మరునాడు క్రిందటరాత్రి నీవు పాలు త్రాగలేదటరా అని నీవడిగితే "నేనేమీ త్రాగలేదు. నాకేమిచ్చారమ్మా? అన్నీ అక్కయ్యకే ఇచ్చారు" అని అంటాడు. శిశువు పాలుత్రాగినమాటనిజమే. కాని ఉదయాన్నే అతడు పూర్ణముగా మరచిపోయినాడు. ఆ అర్థరాత్రిపూట ఆతడు పాలుత్రాగే సమయములో ఒళ్ళుతెలియని ఒకరకపు మైకపుస్థితిలో ఉన్నాడు మనస్సు యెక్కడో ఉన్నది. స్వప్నాలలో మీ రెక్కడెక్కడికో నడుస్తారు. ఉదయమున ఆ స్వప్నవిషయము మీ కొక్కటీ గుర్తుండదు. అదే ప్రకారం రాముడు చెబుతున్నాడు. ఉభయులు ఒక దైవనిమగ్నతలో ఉన్నప్పుడు, ఒకపరమస్థితిలో ఉన్నప్పుడు జోసఫ్ వలన మేరీ క్రీస్తును గర్భంలో ధరించింది. ఇట్టిస్థితిలో మీకు అహంకార శరీరస్మృతి ఉండదు. కానీ మీరు భగవద్రూపములో నగ్నులై ఉంటారు. అట్టి స్థితిలో వారు కలిశారు. ఆమె గర్భం ధరించింది. శిశువు జనించిన తరువాత ఆమెను జనులు కారణమడిగారు. ఆ మేమీ చెప్పలేకపోయింది. ఆమె పవిత్రాత్మచేత (భగవంతునిచేత) గర్భం ధరించిం దని క్రైస్తవులు చెబుతారు. అంటే అర్థమేమిటి? బ్రహ్మజ్ఞాన ప్రపూర్ణయై, పవిత్రాత్మలో నిమగ్నయై, భగవత్పారవశ్యయై గర్భం ధరించిం దన్నమాట. ఈ రకంగా క్రీస్తు పవిత్రాత్మకు లేక హోలీఘోస్టుకు జనించాడు. ప్రకృతి ధర్మాలు ఇప్పుడెంతో అప్పుడంతే. అయినా క్రీస్తు పవిత్రాత్మకు జనించాడని మనము చెప్పగలము. సమస్త ప్రపంచము ఈ రకంగా నడుచుకోవాలని రాముని సందేశము. అప్పుడు క్రీస్తులకు కరువుండదు. మీ హృదయాలను పవిత్రం చేసుకోండి. మీ సంతానము మిల్టనులు, షేక్స్పియర్ లు, క్రీస్తులు లేక మహాపురుషులు కావాలనుకుంటారా, మీ సంతానము వంశోద్ధారకులు జగదుద్ధారకులు కావాలనుకుంటారా, మీ హృదయాలను కలుషవికీర్ణం చేయవాకండి. ఈ క్షుద్రస్వార్థ

వ్యామోహాలకు అతీతమైన ఇట్టి జీవితాన్ని భగవంతునిలో బ్రహ్మ త్వమునందు సర్వస్వరూపునియందు సమస్తవిశ్వంలో ఐక్యానుసంధానం కలిగించే జీవితాన్ని మీ భార్యాపుత్ర మిత్రాదులతో జీవించండని రాముడు ఉపదేశిస్తున్నాడు. సతీపతులు పవిత్రభావాలతో ఇట్టి జ్ఞాన బలంతో ఇట్టి మహోదాత్త ఆశయాలతో ప్రపూర్ణహృదయులైనట్లయితే అట్టి తలిదండ్రుల సంతానము క్రీస్తులవుతారు. మీరు సంకల్పిస్తే నేడుకూడ క్రీస్తులను మీరు సృష్టించవచ్చు.

నీ గృహం ప్రేమకు కేంద్రం కావాలేకాని, ప్రేమకు సరిహద్దు కాకూడదు. మానవులు తమ గృహాలను ప్రేమకు సరిహద్దుచేసి, ప్రేమ వెలుపలకు పోకుండా అణచివేస్తున్నారు. గృహమూ, భార్యా ప్రేమకు కేంద్రమై ప్రేమకిరణాలు అక్కడనుంచి సమస్త విశ్వవ్యాప్తం కావాలె. నీ ప్రేమ గృహంలోనే పాతుకొని గిటకపారిపోకూడదు. నీ భార్యనీ నీ ప్రేమను గడ్డకట్టించకూడదు. స్వార్థభావాలచేత నీభార్యను పతనంచేసి, నీవూ పతితుడవవుతావు ఉభయులు భ్రష్టులవుతున్నారు. భార్య నీకు ప్రేమను బోధిస్తుంది. నీవా ప్రేమను పునీతంచేసి నిజమయిన ప్రేమగాచేయాలె. నీవా ప్రేమను విశ్వప్రేమగామార్చి, ఈ బాహ్యానామరూపసంబంధమైన లౌకికప్రేమను అఖండప్రేమగా, దైవప్రేమగా నీవు పరివర్తనంచెయ్యాలె. నీవీ పరమప్రేమతో సర్వాలనూ, సమస్తమునూ దర్శించు. ఈ మహాప్రేమతో గడ్డిపోచలను చూడు, పుష్పాలను చూడు. ఈ నదులను చూడు. పర్వతాలను చూడు. లోయలను చూడు. ఇట్టి మహాప్రేమచేత నీకు సర్వవిశ్వైక్యానందము లభిస్తుంది.

నీ భార్య నీకు విశ్వసామరస్యమార్గమును చూపించాలి. అంతే కాని ప్రపంచసామరస్యదృష్టికి నీకు అడ్డుగోడ కాకూడదు. రాముడు మీ కిప్పుడు కొన్ని ఆధ్యాత్మికధర్మాలను నిర్వచిస్తాడు. ఈ ఆధ్యాత్మిక ధర్మాలు ఈ సమస్తప్రపంచప్రేమలను పరిపాలిస్తున్నవి. రాముడు మీకు వాటిని గురించి చెప్పకపోయినా, ఈ ధర్మాలు మీ అనుభవాల్లో చూస్తున్నవే. అయితే రాముడు చెప్పటదేనికంటే, మీరు ముందుజాగ్రత్తను పూనుటకొరకే. సారథి రథమును తోలుతుంటా

డనుకోండి. దారిలో రథచక్రము ఒకపెద్దరాతికి తగిలి బోర్లపడుతుంది. ముందేమున్నదో తెలుసుకోక పోవడమువల్ల ఈ వుపద్రవము కలిగింది. మనము గనుక ముందుగానే ఫలానాచోట రాయి ఉన్నది, జాగ్రత్త అని చెప్పినట్లయితే అతడీ దెబ్బతినకుండ జాగ్రత్తపడతాడు. అదే ప్రకారము, ఈ నీ ప్రాపంచకవ్యవహారాలలో అడ్డురాళ్ళువస్తాయి. ఒడుదుడుకులు తగులుతాయి. అపజయాలు, శోకాందోళనలు, నిరాశా పరిస్థితులు కలుగుతాయి. ఈ విచారాందోళనలు, ఈ అపజయాలు ఈ నిస్పృహాలు ఎప్పుడు కలుగుతున్నాయి? ఇవి యెప్పుడు కలుగు తున్నాయో రాముడు మీకు విశదముచేస్తాడు. మీ రివి తెలుసుకొని ముందుగానే జాగ్రత్తపడండి. దెబ్బతినరు. ఏతన్నివారణోపాయము సులభమయిందే. మీ రీ మార్గానునడిస్తే, సాధ్యమయినంతవరకు మీరు బాధలకు గురికారు. ఈ ధర్మము గణితసూత్రన్యాయ మెంత ధృవమయిందో, అంతధృవమయింది. మీరు చూచే భౌతికవిషయాలు ఎంతసత్యంగా కనబడుతున్నవో, వాటివిధంగా నే చెప్పబోతున్న ఈ ధర్మము అంత సత్యమైనదిగా నమ్మండి. ఒక పురుషుడుగాని, స్త్రీ గాని ఎవరైనాసరే, యేరూపమునైనా, ఏ దేహమునైనా, భౌతికవస్తువునైనా ప్రేమింపమొదలుపెట్టినప్పుడు ఆ వస్తువు కొంతకాలమే అంటే హృదయములో బాగా స్థాపితమగువరకు మాత్రమే ఉండి దానిమీది విశ్వాసము ముందరిగానే, ఆ వస్తువు ఆకస్మికముగా విడదీయబడుతుంది. ఇది అనతిక్రమమైన ధర్మం. ఏ శక్తీ ఈ ధర్మాన్ని నిరోధించలేదు. అతిపురాతన కాలంనుంచి నేటివరకూ ఈ దైవధర్మం దురతిక్రమమై సాగుతున్నది.

ఏ భౌతికవస్తువుమీదనైనా వ్యామోహంపెట్టుకో! ఏ నామ రూపాలకైనా సక్తుడవుగా! ఏ మహావ్యక్తిమీదనైనా ఆధారపడు. అతనిపై విశ్వాసపడు. వెంటనే ఆ వస్తువు నీకు దూరంకాకతప్పదు. నీ వొకబల్లపై అనుకుంటే, ఆ బల్ల లాగివేసినప్పుడు నీవు క్రిందపడి పోతావు. దెబ్బతింటున్నావు. దీని అర్థమేమిటి? ఇది యేమి బోధిస్తున్నది? మన మెప్పుడు ఈ స్థూలబాహ్యావిషయవస్తువులపై మన ప్రేమానురాగాలను, చూపకూడదు. మన ప్రేమలక్ష్యం ఈ బాహ్యా

దృశ్యవస్తువులు, కాకూడదు. అయినా ఈ బాహ్యస్థూలవస్తువుల ద్వారా కాక, మనహృదయాలలో ఏ ప్రేమా జనించజాలదు, ఈ భౌతిక స్వరూపాలద్వారానే మనం ప్రేమోపాసనకు అక్షరాభ్యాసం చేస్తున్నాము. అయితే ఒక్కసారి ఈ ప్రేమ మనకు నేర్పబడిన తరువాత ఈ ప్రేమ విషయవస్తువులకు కట్టుబడజాలదని ప్రకృతి మనకు చెబుతున్నది. విషయవాసనల నతిక్రమించి ముందుకుసాగాలి. ఈ ప్రేమ, వస్తువు వెనుకాల భాసిస్తున్న బ్రహ్మత్వమును అందుకోవాలె. తన భార్యాసన్నిధిలో నేర్చుకున్న ప్రేమను, వెనుకనున్న పరబ్రహ్మత్వమునకు వినియోగించనిమానవుడు దౌర్భాగ్యుడు. నీ ప్రేమ, లోకబ్రహ్మత్వమును అందుకోలేకపోయినట్లయితే, నీవు శిక్షింపబడకతప్పదు. బాధపడకతప్పదు. భార్యాభర్తలు ఇరువురుకలిసి జ్ఞానాభ్యున్నతిపొందాలె. ఆమె నీకు ప్రేమించడము బోధిస్తుంది. ఆ ప్రేమను ఈ శరీరంలో మాత్రమే దాచిపెట్టక, సమస్త విశ్వవ్యాప్తంచేయాలె.

భౌతికభోగ క్షేత్రంలో నాటబడిన బీజంలో ఆధ్యాత్మిక అభ్యున్నతి మొలకెత్తదు. అందుచేత భార్య లేక భర్తయొక్క భౌతిక దేహ క్షేత్రంలో నీ ప్రేమబీజం నాటబడినప్పుడు, భౌతిక దేహంలో నాటబడిన ఆ ప్రేమబీజం అక్కడే ఆ క్షేత్రగర్భంలోనే కప్పబడివుండాలె. ఆ అనురాగబీజం అచ్చటనే చిలికినాశనమై క్రొత్తమొలకదాల్చి ప్రపంచోపరిభాగానికి వచ్చి ఫలించాలి. అప్పుడా ప్రేమ పునీతమౌతుంది. ఈ ప్రకారం భార్యలోగానీ, భర్తలోగానీ లేక యే భౌతికవస్తువులోగానీ నాటబడిన ప్రేమబీజం చచ్చి, క్రొత్తమొలకగా భూతలోపరిభాగానికి వచ్చి ఫలించవలసియున్నది. ఎంతవరకైతే, విషయవస్తు ప్రేమయున్నదో అంతవరకు అక్కడ అపజయాలు తప్పవు. ఆ విషయప్రేమబీజం నశించి తర్వాత, ప్రకృతిధర్మం యేమిటంటే ఆ బీజమే ఒకప్పుడు నీకు బ్రహ్మసాక్షాత్కారము కలిగిస్తుంది. ప్రేమ అనేది ఎరుగని మానవుడు భగవంతుని ఎన్నటికీ తెలుసుకోలేడు. ఇది నిజము.

ప్రపంచప్రేమతో మతానికి సంబంధము లేదు అని సామాన్యముగా చెబుతుంటారు. కాని సంబంధము ఉన్నదని రాముడు చెబుతున్నాడు. విషయాభిముఖమైన ప్రేమను సక్రమోపయోగములో

పెట్టినట్లయితే నీకు భగవత్ సాక్షాత్కారము కలుగుతుంది. "ఇతర సుఖాలన్నీ దుఃఖప్రదాలే." నిజముగా ఈ పవిత్రప్రేమే నీకు భగవత్ సాక్షాత్కారము కలిగిస్తుంది. ఈ ప్రేమే భగవంతునికి ప్రత్యామ్నాయపదం.

భర్తయొక్క ఆశయము వివాహసంబంధాలను ఉత్తేజితము చేయడముమాత్రమే అయివుండాలె అంతేకాని డబ్బుకూడబెట్టడము, కుటుంబబాంధవ్యాలను దుర్వినియోగము చేయడము కాకూడదు. ఆనందానికి ఏ వస్తువులు ప్రథమంలో సాధనామాత్రాలయినవో, అవే పరమావధిగా చూడడము దుఃఖహేతువు. నిమిత్తసాధనాలను పరమావధిగా చూడవాకండి. ధనం దేనికి? కొంచెము ఎండవానలనుంచీ, ఆకలిదప్పికలనుంచీ నిన్ను రక్షించుకొనుటకేకదా! ఇతరుల గందరగోళమునుంచి తప్పించుకోను, కొంచెము తలదాచుకోను ఒకయిల్లు చాలుగదా! నిరాడంబరమయిన జీవనానికి, కొంచెము ఆకలిదప్పికలు తీర్చుకోవడానికి, కొంచెము దేహరక్షణకు ఏవో రెండువస్త్రాలకు మనకు నిజానికి ఎంతడబ్బు కావలసివస్తుంది? స్వల్పధనముచాలు.

'పడిశెంపట్టింది' అని ప్రజలంటుంటారు. పడిశెము నిన్నుపట్టడం లేదు. నీవే పడిశెమును పట్టుకున్నావు. రోగం నిన్నుపట్టుకోవడములేదు. నీవే రోగమువెంట వేటాడుతున్నావు. చలి మొదలైనవాటినుండి బాధపడకుండా ఉండడానికి నీవు గుడ్డలుకట్టుకోవాలె. వస్త్రధారణోద్దేశ్యం దేహరక్షణ మాత్రమే. అలాంటప్పుడు చౌకరకవు ఏ ముదుకగుడ్డో చాలు. ఖరీదుకలగుడ్డలు అనవసరము. మనము నిరాడంబరమైన చిన్నచిన్న యిండ్లలో నివసించగలము. ఈ నేటికాలములో కట్టబడుతున్న ఈ ఏడంతస్థులమేడలు, ఈ పెద్ద పెద్ద డాంబికగృహాలు దేనికి? తలదాచుకోవడమునకు ఆరోగ్యమైన నిరాడంబరములైన ప్రశాంతములైన ఏవో చిన్న కుటీరాలు చాలవా మనకు? మనకీ అందచందాల సౌధాలు అనవసరం.

ఆకాశమెత్తు మేడలు గట్టడమే, పెద్దపెద్ద విలువకల వస్త్రాలంకారాలు సంపాదించడమే, రకరకాల రుచ్యాహారములు భుజించడమే, మానవకోటికి ఏకైక పరమాశయమై పోయిందికదా!

ప్రపంచచరిత్రలో కొందరుమానవులు చిన్నచిన్న పూరిగుడిసెలలో చిన్నచిన్నయిండ్లలో నివసించారు. వంటినిండ గుడ్డ, కడుపునిండ కమ్మని తిండి వారెరుగరు. అయినా వారే ప్రపంచవీరులై యున్నారు.

ప్లేటోసంగతి మీకు తెలుసు. ప్లేటోయొక్క పేరు రాకం (Racom) అని పారశీక భాషలో పిలుస్తారు. దీని అర్థం "ఒకతొట్టిలో నివసించేవాడు" అని. తొట్టి అతని నివాసగృహం. ప్రపంచకోలాహలం నుండి విడివడి అతడు విశ్రాంతితీసుకొనే గృహ మూ తొట్టె.

విచారించండి. ఇట్టి పేదరికంలో జీవించిన మానవులే ప్రపంచకమునకు అనుపమానసేవ చేసియున్నారు. ఎంతో మేలుచేసియున్నారు.

షేక్స్పియర్ గృహం అంతగొప్పదికాదు. ఆతనిజీవితంలోని ప్రథమభాగమంతా పేదరికంలో గడిచింది. చరమజీవితంలో కొంచెం భాగ్యంపొందగలిగాడు.

అతడు మొదట నాటకశాలకువచ్చిన జనులయొక్క గుఱ్ఱాలను కాపలా కాస్తుండేవాడు.

న్యూటనుకూడా పేదవాడే. బీదలకివ్వడానికి పుస్తకాలుకొనడానికి డబ్బులేనప్పుడు అతడు విచారపడేవాడు. మరెప్పుడూ అతడు దారిద్ర్యానికి విచారపడేవాడుకాదు.

కూటికీ, గుడ్డకూ కఱువైనమానవులే ప్రపంచానికి ఎంతో సేవ చేశారు. భారతవర్షంలోని హిందువులు పూర్వకాలంలో అరణ్యాలలో కందమూలఫలాదులు తిని జీవయాత్రలు సాగించారు. ఈ నిరాడంబర మానవులే ప్రపంచానికి మహోన్నత తత్త్వభాగ్యమును, వేదాంత శ్రీని, ప్రేమస్వాతంత్ర్యమునుప్రసాదించారు.

మిమ్ములమీరు సముద్ధరించుకోండి. పెద్ద అందమైన ఆకాశమెత్తు మేడలు కట్టడంలో మీ శక్తులను, మీ మనస్సును వ్యయం చేయవాకండి. మీ గృహాలన్నీ ఆకాశమెత్తు పెరిగిఉన్నాయి. కానీ అందులో నివసించే మనుష్యులు నేలకంటుకొని యున్నారు. భారతదేశంలో పెద్దపెద్ద గోరీలున్నాయి. వాటిలో ఏముంటాయి? చివికి

పోయిన శవాలు, లుకలుకలాడే పురుగులు, క్రూరసర్పా లుంటాయి; అంతే.

పెద్దపెద్ద మేడలుకట్టి, అందమైన సామానులు సంపాదించి నీ భార్యా పుత్ర బాంధవ్యులను సంతృప్తిపరచడానికి నీ శక్తిని వృధా చేయవాకు. నీ వీ భావమును గుర్తించు. జీవిత ఏకైకపరమాశయం పరమగమ్యం శక్తిని వృధాపరచి భాగ్యభోగ్యాలను సమకూర్చడం కాదు. అంతశ్శక్తులను ప్రబుద్ధపరచి ఆత్మస్వాతంత్ర్యానికి తగిన సంస్కృతిని పొంది బ్రహ్మస్వరూపుడవు కావడమే నీ గమ్యం. నీ వీ విషయములను తెలుసుకొని ఈ పథంలో నీ శక్తులను వినియోగించేసి నట్లయితే సంసారబంధాలు నీకు అడ్డుతగలవుసుమా!

కొందరు ప్రజలు అంటారు: "కాదు-కాదు మేము నిరాడంబర పద్ధతిలో జీవించగలం. మరి మా అతిథి అభ్యాగతులు, బంధుకోటి వస్తుంటారు కాదా? వారికీ మర్యాదలు చేయకపోతే ఏ మన్నా అనుకోరా?"

ఓ ప్రియతమా! నీవు నీకోసం జీవిస్తున్నావా? ఇతరుల కొఱకు జీవిస్తున్నావా? నీ కొఱకే నీవు జీవించు. నీ జీవితంలో జోక్యం కలిగించుకోవడానికి వారికి పనిలేదు. నీవు అన్నం తింటున్నప్పుడు నీవే తింటున్నావు. వారు తింటున్నారా? నీ ఆహారం నీవు జీర్ణం చేసుకుంటున్నావా? నీకొఱకు ఎవరైనా చేసిపెడుతున్నారా? నీవు చూస్తున్నప్పుడు నీ కండ్లలోని కండరాలా దర్శనశక్తి కలిగిస్తున్నది? మరి వాండ్ల కండ్లలోని కండరాలా? నీ కేంద్రంలో నీ వుండు. ఆత్మవిశ్వాసం కలిగివుండు. కొంచెం వెన్నెముక కలిగి వుండు. నీ బంధుమిత్రుల నీ ప్రకృప్రజల, అభిప్రాయాలను పట్టించుకోవాకు. నీ ఆతిథ్య సేవా రహస్యం పరమాన్నంలో, పట్టెమంచంలో లేదు. మంచి విందు, మంచి శయ్య అమర్చకపోతే, ఆతిథ్యంకాదని జనుల తలంపు. ఇట్టి దుర్భ్రాంతి గృహమేధిని ఆస్తిపాస్తులకు దాసునిచేస్తుంది. కానీ ఆస్తిపాస్తులు మీకుదాస్యం చేయనియ్యండి. కాటికి మీరు దాసులుకాకండి. నీ ఆత్మ శక్తిని గుర్తించు.

ఒక అతిథి నీ యింటికి వచ్చినప్పుడు నీ వతనికి గంజియిచ్చినా, అతనిని జ్ఞానోత్తేజితునిగా వికాసహృదయునిగా వచ్చినప్పుడుకంటే ఎక్కువ వివేకదీపితునిగా ప్రేమప్రధాన సపర్యతో పంపించు. నీ తోడి ప్రజలకు నీవు చేయవలసిన నీ ప్రధానధర్మమిదే. నీ గృహస్థజీవనం ఆనందమయంగా దీపించే మార్గమిదే. గృహస్థుడు తనగృహమును ఒక పెద్ద అడ్డుశిలగా చేసుకోవడానికి బదులు పైకిపోయే మెట్టుగా చేసుకోవడానికి ఇదేమార్గం. నీ అతిథికి నీకున్న జావయిచ్చినా, నీ వతనికి జ్ఞానామృతమును త్రాగించు. నీ అతిథికి నీకున్న చింపిరిచాప శయనించడానికి యిచ్చినా, నీ వతనిని ప్రేమశయ్యపై సుఖపెట్టు. అతనిని వచ్చినప్పుడుకంటె జ్ఞానదీపితునిగా, జ్ఞానతృప్తునిగాచేసి పంపు. ఇదిచాలు. తిండి, ప్రక్కవిషయంలో నీకున్నదిచాలు. అతనికి ఉన్నత జ్ఞానమును ప్రసాదించు. నీ ప్రేమ అతనికి పంచుకోనియ్యి. నేను మీకు ఒకదమ్మిడీ యివ్వలేకపోయినా, నేను మీకే దైహికసేవ చేయలేకపోయినా, నేను మీకొక ప్రేమదీపితమైన, హృత్పూర్వకమైన చిరునవ్వును ప్రసాదించగలను. మీరు నాయీ ప్రేమవీక్షణచే ఉత్తేజితులు ఉత్సాహితులుకాకుండా ఉండలేరు. చూచారా! మహాసేవ జరిగిపోతున్నది. ధనంతో తృప్తిపెట్టచూడడం నిష్ప్రయోజనం. ఈపని భర్త తనభార్యకు కొంతధనమిచ్చి వెడలగొట్టడంలాగా ఉంటుంది. ఆమెకు కావలసింది ప్రేమగాని ధనంకాదు. ఏదో ధనంతో మనిషినితృప్తిపరచాలనుకోవడం ఒక నేరంచేయడమే. దీనితో అతనిని మభ్యపెట్టి తప్పించుకొంటున్నావన్నమాట. నీ అతిథి అభ్యాగతులకు ప్రేమజ్ఞానప్రదానం చెయ్యి. వారిని ఉత్తేజితులనుచెయ్యి. ఉద్ధరించు. నీకున్న ఏ గంజో, గటకో పెట్టు. ఇది మహోన్నతమైన అతిథిసేవ. గృహమేధియొక్క ధర్మాచరణమిదే. నీ భార్యాపుత్రులయందుసైతం నీవు చూపవలసిన ప్రధానప్రేమ యిదే!

ఓమ్! ఓమ్!! ఓమ్!!

ఓం

# మాంసాహారమునుగూర్చి వేదాంతాభిప్రాయము

ప్రశ్న:- మాంసాహారమును గూర్చిన వేదాంతాభిప్రాయ మేమిటి?

ప్రత్యుత్తరం:-జంతువులమీద కారుణ్యదృష్టి చేత, భారతీయులు మాంసాహారమును వర్జిస్తారని పరిజలతలంపు. కొన్ని శాఖలు ఈ దృష్టి తోడనే మాంసాహారమును వర్జించవచ్చును. కాని వేదాంతులదృష్టి ఇదికాదు.

వేదాంతం ఈ కారణంచేత మాంసాహారమును నిషేధించదు. వేదాంతులు, స్వాములు సర్వసాధారణంగా మాంసభోజనం చెయ్యరు. దీనికి కారణము జంతుహింసయనికాదు. ఈ వాదన సరియైనదికాదు.

వేదాంతదృక్పథంలో దయ అనేదంతా బలహీనత. ఈ మాటలు మీకు విస్మయం కల్పించవచ్చు, కాని ఇదినిజం. ఇతరులను సంతోషపెట్టాలనే ఈ దయావిధానము, ఇతరులయొక్క వాంఛలకు, అభిప్రాయాలకు చేసే దాస్యం. వేదాంతులు డాంబికతయొక్క ఒక రూప మని, ఇది ఒకరకమయిన విగ్రహారాధనస్వరూపమని దౌర్బల్య మని తలుస్తారు. ఈ జాలి లేక ఈ డాంబికత, ఈ ఇతరులను సంతోష పెట్టాలనే వాంఛ సంఘానికి మేలుచేస్తుందా? చెయ్యదు. ఇవన్నీ అజ్ఞానలక్షణాలుమాత్రమే.

దయ అనే పేరట యెన్నిపాపాలు, యెన్ని దోషాలుచేయ బడినవి? సంఘాన్ని సంతోషపెట్టాలనే వాంఛచేత ఎన్ని నేరాలు చేయ బడినవి?

ఒక మనిషిఉన్నాడనుకోండి. అతడు కొంతమంది తిని, త్రాగి విలాసంగా విహరించే పెద్దమనుష్యులసంఘంతో స్నేహంచేయాలిసి వస్తుంది. ఆ యువకులలో ఒకడు ఇవ్వాళ్ళ మనము పానశాలకుపోదా మని నిర్ణయంచేస్తాడు. అందరూ సంసిద్ధులైనారు. అందరూ వినోదంగా త్రాగుతున్నారు. కాని ఈ నూతనవ్యక్తి తనకు అంతముందు

అలవాటు లేకపోయినను తన మిత్రసంఘమును సంతోషపెడదామనే బలహీనతచేత తానుకూడా త్రాగుతున్నాడు. తనకు స్వయంగా త్రాగుదామనేకోరిక లేకపోయినా తనప్రక్కవ్యక్తుల ముఖప్రీతికి వాండ్లతోపాటు త్రాగుడులోపడ్డాడు. ఇంకొకసారి ఇలాగే ఇంకొక విందులో తనస్నేహితుల ముఖప్రీతికి ఇంక కొంచెం త్రాగడం నేర్చు కుంటాడు. క్రమక్రమంగా అతడు త్రాగుడు అలవాటుకు నికృష్టబానిస అయిపోతాడు.

ఇదేప్రకారము స్త్రీలుకూడా ఇతరులను సంతోషపెడదామనే ఆశయంచేత నెమ్మది నెమ్మదిగా కొన్ని దురలవాటులకు లొంగిపోవడం జరుగుతుంది. అందుచేత ఇతరులను సంతోషపెడదామనే ఈ వాంఛ యొక్క అడుగున అజ్ఞానము, బలహీనత, డాంబికత కలసి ఉన్నాయి, అని వేదాంతం నిర్వచిస్తుంది. ఇతరులను సంతోషపెడదామనే ఉద్దేశ్యంతో యేదీ చేయవాకు. ఇతరుల అభిరుచులకు మోమోట పడక "కాదు" అని చెప్పగలినవాడే ధీరుడు! ఈ 'కాదు' అని చెప్పే సామర్థ్యంలోనే నీ సౌశీల్యబలం ఉన్నది.

ఇక దయనుగురించి, కేవలం ఇతరుల అభిప్రాయాలమీాద ఉన్న మొఖమాటపు గౌరవంచేత ఎందరు మానవులు తమకుతామై నరక కూపాలలో కమిలిపోతున్నారు. రాముడు చెప్పిన ఈ ధర్మమును మీారు క్రూరధర్మ మని పేర్కొనవచ్చు. కాని ఒకనాటికి మీారీ ధర్మమును సత్యంగా తెలుసుకోగలరు.

కేవలం దయచేత సత్యమును అనుసరించడము క్రూరత్వమని తలవడంచేత లేక సత్యమునకు లోబడడంవలన సత్యప్రకారం నడవడం వల్ల, తమబంధువులు తమస్నేహితులు వ్యతిరేకిస్తారనో లేక ఎవరైనా బాధపడతారనో అనుకోవడంచేత ఎందరు మానవులు నరకవేదన పడుతున్నారో కొంచెం చూడండి. వేదాంతసందేశ మిది: నీవు సత్యమును అనుసరించినప్పుడు ఆ కారణమున ఎవరయినా గుండె పగులుతారా? సత్యమును హత్యచేయడంకంటే, ఆ ఒక్కశరీరము నాశనంకావడం శ్రేష్ఠమే. "వ్యక్తుల భావాలమీాదకంటే సత్యముపై

ఎక్కువ గౌరవముంచు" అని వేదాంతం ప్రబోధిస్తున్నది. ఎందుకంటే నీవు సత్యమును గౌరవించినట్లయితే నీవు నిజముగా మిత్రుని గౌరవిస్తున్నట్లే, నీవు ఒకని అహంకృతికి ఒకరివాంఛలకు ఎంత ప్రాధాన్యము ఎంత ఎక్కువ గౌరవం, ఇస్తావో అంత యెక్కువగా పరమసత్యమైన అతని సత్యాత్మను హత్యచెయ్య ప్రయత్నిస్తున్నావన్నమాట. "ఒకని బాహ్యశరీరంమీదకంటే సత్యమునందు ఎక్కువ గౌరవముంచు." ఇదికాక ఆత్మగౌరవం అనే వుద్దేశ్యంలో ఎంతమంది మానవులు తమకు తాము నరకాలను సృష్టించుకుంటున్నారు? ఈ ఆత్మగౌరవం అనేపదం అతిభయంకర మయిన అపార్థదశపొందిన పదములలో ఒకటి. ఆత్మగౌరవం అన్నమాటకు ఈ క్షుద్రశరీరగౌరవ మని ప్రజలు అర్థం చేసుకుంటున్నారు. ఆత్మగౌరవమంటే ఈ క్షుద్రవ్యక్తిత్వ మని ప్రజలు పొరపాటు పడుతున్నారు.

ఓ బ్రహ్మాత్మమా! మాతాపితృ సోదరసోదరీ పుత్ర మిత్ర రూపంలో ప్రకాశిస్తున్న ఓ పరమాత్మా! ఆత్మగౌరవమంటే, ఈ క్షుద్రశరీరాలను, ఈ వ్యక్తిత్వాలను గౌరవించడంకాదు. ఆత్మగౌరవమంటే, పరమసత్యమును గౌరవించడం. సత్యాత్మను గౌరవించడం. ఆత్మగౌరవ మనే పేరుతో సత్యాత్మను మీరు అగౌరవిస్తున్నారు. నీవు బ్రహ్మజ్ఞాన ప్రపూర్ణుడవై యున్నప్పుడు నీ ఆత్మను గౌరవిస్తున్నావు. నీలోని పరబ్రహ్మనుగూర్చిన ధ్యానముతో నీ హృదయము నిండిపోయినప్పుడు, నీవు ఆత్మగౌరవసంపూర్ణుడ వౌతున్నావు. దేహారాధనచేత, అహంకృతిచేత, నీవు ఆత్మహత్య చేసుకుంటున్నావు. నీ గోతిని నీవే త్రవ్వుకుంటున్నావు.

మాంసాహారమునుగూర్చి వేదాంత మిలా చెబుతున్నది: 'మీ దేహాలపై వ్యామోహంవద్దు. నీ దేహం ఉన్నా, పోయినా లక్ష్య పెట్టవద్దు. నీదేహంపై పూలుచల్లినా, రాళ్లురువ్వినా లెక్కచెయ్య వాకు. దేహాతీతుడవుగా."

ఒకడు నిన్ను భూషించనీ, మరొకడు నిన్ను దూషించనీ లెక్కచెయ్యవాకు.

"భూషించేవాడు, భూషింపబడేవాడు, దూషించేవాడు, దూషింపబడేవాడు ఒక్కటే అయినప్పుడు, భూషణాలేదు. ఇంక దూషణాలేదు."

అందుచేత, నీ సత్యాత్మను నీవు తెలుసుకున్నట్లయితే, నీ పీ అల్పదేహభావమును అసత్యంగా తెలుసుకున్నట్లయితే, నీ దేహం మీదవలె, ఇతరుల బాహ్యారక్తమాంసాస్థి పంజరాలమీది అభిమానం కూడ అదృశ్యమవుతుంది.

రాము డీనాడు మీ కతిప్రియమయిన అంధభ్రాంతులను బ్రద్దలు చేయనున్నాడు.

వేదాంత మీ రకంగా నిర్వచిస్తున్నది. "ఇది దైవధర్మం; నీ దేహమెంత నిజమయిందిగా తలుస్తావో, ఇతరదేహాలుగూడా అంత నిజమైనవిగా తలుపు." ఇదీ ధర్మం. నీ వ్యక్తిత్వమును, నీ దేహమును ఎంత నిజముగాపరిగణిస్తావో, ఇతరుల శరీరాలను వ్యక్తిత్వాలను నీవంత నిజముగా పరిగణించగలవు–ఇదీ ధర్మం.

నీవు శరీర భావనకు, వ్యక్తిత్వమునకు అతీతుడవైనప్పుడు ఇతరుల యొక్క శరీరవ్యక్తిత్వాలు నీకు అదృశ్య మవుతాయి. అప్పు డవి ఆధ్యాత్మిక తేజోవిలీనము లవుతవి. వాటి పూర్వస్థూలరూపమింక ఉండదు. అందుచేత కోటానుకోట్ల సూర్యతారాగ్రహగోళాలు గిరగిర తిరిగి రాలి శూన్యతలో కలిసిపోయినా, ఉన్నా సత్యజ్ఞానానికి ఒకటే. మేకలు చచ్చినా, గొర్రెలుచచ్చినా, ఎద్దులుచచ్చినా, అతనికి లెక్క లేదు. ఈ మాయాదృశ్యాల కతడు అతీతుడు.

ప్రచండమై చెలరేగుతున్న భారత మహాసంగ్రామరంగంలో శ్రీకృష్ణుడు అర్జునునికి రథసారథ్యంచేస్తున్నాడు. ఆ సమయంలో అర్జునుడు ధైర్యమును కోలుపోయినాడు. జాలి, దయ అతనిని ఆవేశించింది. వీరుడైన అతడు గడగడ వణకసాగినాడు. దయ అతనిని వశంచేసుకున్నది. భగవదవతారమూర్తియైన శ్రీకృష్ణదేవుడు, లోకోత్తరపురుషుడైన శ్రీకృష్ణుడు సమస్తజగత్తుకు క్రీస్తయిన

శ్రీకృష్ణుడు అర్జునునిచూచి ఈ రకంగా బోధించాడు : "నీ వీ శరీరానివికాదు. నీవే వ్యక్తిత్వానివికాదు. నీ శరీరంద్వారా పని చేస్తున్నది పరబ్రహ్మమే" అని శ్రీకృష్ణుడు అతని దేహం ద్వారా పనిచేస్తున్నది పరబ్రహ్మమే నని ఉద్బోధించాడు. ఆ యుద్ధక్షేత్రంలో శ్రీకృష్ణపరమాత్మ అర్జునునకు జ్ఞానప్రబోధచేసి అతనిలో నిద్రాణమై యున్న బ్రహ్మశక్తిని ప్రబుద్ధంచేసి అతని సత్యస్వరూపమును విశదీక రించి అర్జునుని భయవిచారమునుండి విముక్తినిచేశాడు. శ్రీకృష్ణుడు "ఓ అర్జునా! నీ సత్యాత్మ అవినాశనమైనది. అది సర్వకాలసర్వావస్థల యందు అవికల్పమయినది. శాశ్వతమయినది. అఖండమయినది. అపరి చ్ఛిన్నమయినది. సనాతనమయినది. ఓ అర్జునా! నీవు అమృతుడవు. ఈ శరీరములు ఎన్నినశించినా వాటిలో ప్రకాశిస్తున్న సత్యాత్మ నిత్య మయింది. అది మరణించదు. అందుచే నీ వమృతుడవు. నీ దేహరూపం వారి దేహరూపాలు సత్యంకాదు. నిత్యసత్యమయిన మరణరహితమైన పరబ్రహ్మమైన నీ సత్యాత్మను తెలుసుకో. ఎందుకు నీవు విషాద వశుడవై కంపించడం? నీ ప్రస్తుతకర్తవ్యమేమిటో చూడు. నీ ప్రస్తుత ప్రాపంచకధర్మం ఈ వ్యక్తుల నందఱినీ సంహరించడమయినట్లయితే సంహరించు" అని ప్రబోధించాడు. ఇంకా కృష్ణు డీవిధంగా ఉపదేశి స్తున్నాడు: "నేనే దేవాదిదేవుడను, పరంజ్యోతిని. నేను అనుక్షణం కోటానుకోట్ల పశుపక్షిక్రిమికీటక మనుష్యదేహాలను లయంచేయడం లేదా? నేను లేక ప్రకృతి లేక భగవంతుడు నిరంతర మీ మహాకర్మ చేస్తున్నాడు. అయినా, నేను నిరంతరం పరిశుద్ధుడనై, నిష్కళంకుడనై నిస్సంగుడనై యున్నాను. భగవంతుడు సంహారకేళి చేస్తున్నాడు అయినా, భగవంతుడు నిందార్హుడా? లేదు. భగవంతుడు నిత్య పవిత్రుడుగా ఉన్నాడు." ఇంకా కృష్ణు డీవిధంగా ప్రబోధిస్తున్నాడు "నీవు సత్యమును సందర్శించినట్లయితే, నీవు బ్రహ్మైక్యానుసంధానం పొందినట్లయితే, నీ సత్యాత్మను నీవు తెలుసుకున్నట్లయితే, నీ శరీర మప్పుడు భగవంతుని సాధనామాత్రమే అవుతుంది. ధర్మప్రతిష్ఠాపనకై సత్యప్రతిష్ఠాపనకై నీ శరీరం కోటానుకోట్లమందిని సంహరించినప్పటికీ నీకు పాపమంటదు. నీవు పరిశుద్ధుడవే. నీవు నిష్కళంకుడవే."

ఇట్టిసత్యమును ప్రజలు తెలుసుకోవలసియున్నది. వీరు తెలుసుకున్నా, తెలుసుకోలేకపోయినా, రాముడు సత్యమును తెలుపడం మానడు.

ఏదైతే అర్జునునిచేత మానవసంహారమునకు అతని రక్త బాంధవులను, సన్నిహితులను, గురువులను, మేనమామలను, సోదరులను మొదలయిన వారిని సైతం సంహరింపజేయుటకు వెనుకంజవేయింప లేదో, అదే వేదాంతము. సంహారకర్మచేత అర్జునుడు కళంకితుడు కాలేదని వేదాంతము నిర్వచిస్తున్నది. అలాంటప్పుడు మేకలనూ, గొర్రెలనూ, ఎద్దులనూ, జంతువులనూ చంపడానికి వేదాంతము ఎలా సంశయించగలదు? అయినా, ఇతరకారణాలచేత వేదాంతము మాంస భోజనమును సంపూర్ణంగా నిషేధిస్తున్నది.

మాంసాహారముచేత మనస్సు శులభంగా పరిశుద్ధముకాలేదు. ఏకాగ్రతపొందలేదు. ధ్యానశుద్ధి కలుగదు. మనస్సు నిగ్రహింపబడదు. నీవు మాంసాహారమును వదలలేకపోతే, ఈ అలవాటు మానలేకపోతే, వేదాంతము "సరే తిను. మాన నవసరంలేదు" అని చెపుతున్నది. వివిధ రకాల ఆహారాలు, వివిధఫలితాలు కలిగిస్తాయి. సారా త్రాగితే, మత్తు కలుగుతున్నది. నల్లమందువల్ల ఇంకోరకమైన గుణం కనిపిస్తున్నది. విషపాషాణం తిన్నట్లయితే తత్ఫలితం ఇంకొకటి కలుగుతున్నది. ఇదేప్రకారం ఒక్కొక్క ఆహారము ఒక్కొక్క ఫలితము కలిగిస్తున్నాయి. మాంసాహారముకూడా అంతే. మాంసాహారము, భగవత్తత్త్వాన్వేషకులకు, జ్ఞానసాధకులకు, బ్రహ్మవిద్యార్థులకు పనికిరాదు. వారి శరీరాల కది తగదు.

నీవు క్షత్రియకర్మ లేక యోధకర్మ చేస్తున్నట్లయితే, నీ కది అవసరమైనందున మాంసభోజనము చేయవలె; నీవు కేవలము శాకాహారము తీసుకోరాదని వేదాంతము చెబుతున్నది. ఇతరవృత్తులలో యీ మాంసాహారము తీసుకోవచ్చా, తీసుకోకూడదా అనే విషయమునుగూర్చి రాముడు మీ మీ స్వకీయపరిస్థితులనుబట్టి నిర్ణయించుకోండని చెబుతున్నాడు. కొందరు మాంసము మానడంచేత మంచివని

చేయుగలరు. కొందరిది లేకపోవడంచేత మంచివని చేయులేరు. "బలము చేత బలహీనత జయింపబడుతుంది"- ఇది ప్రకృతి విధానం. పెద్ద పెద్ద తిమింగిలాలు జీవించవలసి యున్నది. అవి చిన్న చిన్న చేపలమీద జీవించాలె. ఈ పెద్దపెద్ద తిమింగిలాలు బ్రతకటంకొఱకు వేనకువేలు చిన్నచిన్న చేపలు వినాశన మవుతున్నాయి. ఇది ప్రకృతివిధానం. ఖనిజ రాజ్యంలో భూమి లేక మట్టి నశించి శాకరాజ్యం బ్రతుకవలసి యున్నది. శాకములు భూమిమీద బ్రతుకుతున్నాయి. ఇక జంతువులు బ్రతుకడానికై శాకజాతి నశించాలి. జంతువులు శాకములమీద జీవించాలె. ఇది ప్రకృతి విధానం. మానవుడు జంతువులను ఉపయోగించుకోవాలె. అంటే జంతువులను తినుమని రాముని ఆశయముకాదు. వానిని ఉపయోగించడమని రాముని ఆశయం. జంతువులు మానవుని సేవించాలె. సామాన్య ప్రపంచమానవులలో బలవంతుడే వృద్ధిపొందుతున్నాడు. యుద్ధములు క్రమ్మినప్పుడు, రోగాలు వచ్చినప్పుడు దుర్బల ప్రకృతులు సబలప్రకృతి నిమిత్తం నశిస్తున్నాయి. ఇదే ప్రకృతి విధానం. ఈ సూత్రం జగత్తును పరిపాలిస్తున్నది.

నీవు మాంసము తిన్నందువల్ల ప్రపంచమునకెక్కువ మేలు చేయగలిగినట్లయితే మాంసముతిను. శాక మాంసమును తినడం, విసర్జించడంచేత పరమసత్యమును సేవించడానికి ఎక్కువ అవకాశం గలిగినట్లయితే మాంసమును వర్జించు

ప్రతివాడు తన శరీరమును భగవచ్ఛరీరంగా చూడవలసి యున్నది. వేదాంతప్రకారం సర్వమానవులు నిరహంకారంగా, నిస్వార్థంగా తమకర్మలను నిర్వర్తించాలి. ఏ పనిచేసినా, నీవు నేను చూస్తున్నాననే అహంకృతి లేకుండా చెయ్యాలి. నిష్కామంగా కర్మచెయ్యాలి. అహంకారదృష్టి, కామ్యదృష్టిని, పరిత్యజించాలి. లోకసంగ్రహార్థం నిష్కామంగా, నిరహంకారంగా కర్మచెయ్యాలి. సమస్త ప్రపంచ హితార్థం యంత్రాగారంలోని కొన్నిచక్రాలకు ఒకరకమైన నూనె వేయవలసివచ్చినట్లు నీ శరీరయంత్రానికి మాంసభోజనం అవసరమైనట్లయితే. నీవు మాంసంతినడానికి సంశయపడ నవసరంలేదు. కానీ

రుచిని ఆనందించడానికి మాంసమును భుజించినట్లయితే మహాపాపం. వాంఛావశుడవై నీవు మాంసమును తినడం పాపం.

హిందూదేశంలో కొందరు దారినపోతూ విక్రయశాలలో వ్రేళ్ళాడగట్టబడిన జంతువుల మృతకళేబరాలనుచూచి విచారపడతారు. ఆ దృశ్యంచూడలేరు కాని యింట్లో ఒంటరిగా మాత్రం మాంసం తింటారు.

నీ స్వార్థాభిరుచిని తీర్చుకోవాలనే అభిలాషతో నీవు మాంసం తింటే అది పాపం. కానీ ఒక ఉత్తమకర్మ చేయడానికై, జగద్విహిత కర్మను చేసేనిమిత్తం కేవల నీ శరీరధారణానికై ఔషధ ప్రాయంగా నీవు అవసరమైతే మాంసం తినవచ్చు. ఇది పాపంకాదు.

రుచిని వాంఛింపకూడదు. భోజనపదార్థం సత్యసాధనకొరకై ఉపయోగిస్తున్నదా లేదా అనే విషయమే ప్రధానం. కొన్ని పదార్థాలలో రుచీ, సాత్వికత రెండూ ఉండవచ్చు. అన్నిటిలో అట్లా ఉండదు.

వేదశాస్త్రాది ఉద్గ్రంథాలు తరచు ఎన్నిపర్యాయాలు అపార్థవశాలైనవి? ఎన్నిసార్లు అపవ్యాఖ్యానింపబడినవి? వేద శాస్త్రాది భగవద్గ్రంథాలను పవిత్రదైవగ్రంథాలను అపార్థవశం చేయడమే, వాటికి దురర్థాలు తీయడమే సంఘముయొక్క మహానర్థానికి కారణం.

మిల్టన్ మహాశయుని అర్థంచేసుకోవాలంటే మిల్టనే కావాలని ఒక సామెత ఉన్నది. అదేవిధంగా ఒక ప్రవక్తను అర్థంచేసుకోవడానికి ఒక ప్రవక్తే కావాలె. క్రీస్తును అర్థం చేసుకోవడానికి నీవు క్రీస్తువే కావాలి వేదములను అర్థంచేసుకోవడానికి మీరు వేదఋషులు కావాలి. ఈ భావమును వేదాంతరచయితలు ఎంతో సుందరంగా వ్యక్తీకరించారు. వారి రచనలలో వారు తమపేర్లను ఉపయోగించలేదు. పాఠకుని శరీరమూ, తమ శరీరమూ ఒకటే అన్నంత వారు జ్ఞాన సాక్షాత్కారశిఖరాలకు అధిగమించారు. వేదములలో మన మిలాంటి భావాలను అవలోకిస్తాము : "ఓ మానవులారా! వేదాతీతులుగాండి. ప్రబోధములను ఉపయోగించుకొని వానివల్లవచ్చే లాభమును పొందండి. దేవతలకు అతీతులుగాండి. మీ స్వస్వరూపమును

అవలోకించండి. సర్వమూ నీవే.” క్రీస్తుకూడా ఇట్టిబోధచేశాడు. ఈ అర్థమువచ్చే విషయములను బైబిలులో మనం ఏరుకోవచ్చు-“స్వర్గ రాజ్యం నీలోనేయున్నది.” ప్రజలు సంపూర్ణంగా దీనిని దుర్వినియోగం చేస్తున్నారు. ఈ ప్రబోధాలకు అపవ్యాఖ్యానం చేస్తున్నారు. రాము నికి ఒక కథ గుర్తుకువచ్చింది.

పూర్వం ఒకవూళ్ళో ఒకగురువున్నాడు. అతడు ఒకనాడు అలసి పోయి శరీరంలో సరిగాలేక ఒక సోఫామీద పండుకొని శిష్యుని పిలిచి కాళ్ళు తీపులుగా ఉన్నవి, కొంచెము ఎక్కి తొక్కమని అడిగాడు. భారత దేశములో మామూలుగా ఇది ఒక అలవాటు. ఆ మాటలు విని ఆ పిల్లవాడు “గురూ! నే నా పనిచెయ్యను. నీదేహం పవిత్ర మయింది. నేను నాకాళ్ళుపెట్టి త్రొక్కి మీ దేహమును అగౌరవించ లేను. ప్రాణంపోయినా చెయ్యను”-అన్నాడు. గురువు నాయనా చాలా అలసివున్నాను. త్వరగావచ్చి ఒడలుపట్టు” మన్నాడు. పిల్లవాడు ఏడవడం మొదలుపెట్టాడు. అప్పుడు గురువు కోపించి యీవిధంగా అన్నాడు: “ఓ మూఢబాలుడా! నా దేహమును అవమానించడానికి యిష్టపడవుగాని, నాపెదవులను అవమానిస్తావు. నా పాదములు త్రొక్కవుకాని, నాముఖమును త్రొక్కుతావు దేహమునుత్రొక్కడం కన్నా గురువుమాటను త్రొక్కడం తప్పుకాదా?”

క్రీస్తుయొక్క. మహమ్మదుయొక్క, వేదాలయొక్క పవిత్ర ప్రబోధాలను మానవులు కాళ్ళక్రింద త్రొక్కడంలో వెనుకంజ వెయ్యరు. కానీ వారి రక్తమాంసాలను, దేహాలను పవిత్రమని, పరమ పావనములని గౌరవిస్తారు. ఈ తన రక్తమాంసాలనే క్రీస్తు ప్రజలను తినండని అడిగాడు. ఆఖరివిందులో క్రీస్తు తన మాంసము తినండని, తన రక్తము త్రాగండని చెప్పలేదా? రొట్టెవిరిగినప్పుడు “ఇది నామాంసం ఇది నా రక్తం” అని క్రీస్తువచించాడు. సమస్తప్రవక్తలు సందర్శిం చిందే సమస్తవ్యక్తిత్వాలలో, సమస్తదేహాలలో వారు బ్రహ్మాత్మ మును సందర్శిస్తారు. దేహాలను మహాత్ములు కాలిక్రింద త్రొక్కి వేస్తారు. వారు తమ శరీరాలకు అతీతులుకండని కోరుతారు. కానీ

మానవులు మహాత్ములయొక్క తత్వాలను కాళ్ళక్రిందత్రొక్కి వారి దేహాలను పూజిస్తారు.

శరీరానికి అతీతులుకండి. లోపలప్రకాశిస్తున్న భగవంతుని అన్వేషించండి. క్రీస్తు ఈ ప్రపంచంలో సర్వదా ఉన్నట్లయితే, ఆయన మీ శరీరాలలో వసిస్తున్నాడు. క్రీస్తు మీమతముయొక్క ప్రారంభ స్థానంకావచ్చు. మీ వికాస ప్రారంభస్థానం కావచ్చు, ఆయన మీకు సరిహద్దురేఖకావచ్చు. కానీ మీ చుట్టూ ఒక ముండ్లకంచెగా క్రీస్తును చేసుకోవాకండి. క్రీస్తును మీరు మీ మతమూలంగా చేసుకుంటారు గాక! మీ వికాస ప్రారంభస్థానంగా చేసికొంటారుగాక! నీవే క్రీస్తువై క్రీస్తుయొక్క హృదయాన్ని అర్థంచేసుకో!

అయితే ఇప్పుడు ప్రపంచంలో జరుగుతున్న దేమిటి ? ఈ క్షుద్రాహంకార స్వరూపుడైన సైతానును వదలజాలని ప్రజలు క్రీస్తును భౌతికం చేయాలనుకుంటారు. భగవంతునికూడ ఒక తెరక్రింద దాచాలనుకుంటారు. భగవంతుని ఒక భౌతికాకారబద్ధుని చేయాలనుకుంటారు. భగవత్పదమునకు తా మధిగమించడానికి బదులు తమ స్థానంలోనికి భగవంతుని పతితునిచేయాలనుకుంటారు. ఈవిషయమును గూర్చి బైబిలులో రెండు చమత్కారమైన మాటలున్నాయి. "ది స్పిరిట్ ఆఫ్ గాడ్ బ్రూడెడ్ ఓవర్ ది వాటర్స్," (The spirit of God brooded over the waters).

హిందూదేశంలో ఒక పూళ్లో ఒక సారావర్తకునికి ఒక కొడుకున్నాడు. ఆ పిల్లవాణ్ణి బళ్ళోవేశారు. అతడు ఇంగ్లీషు చదవడానికి ప్రారంభించాడు.

హిందూదేశంలో ముఖ్యంగా క్రైస్తవ పాఠశాలల్లో, ప్రథమంలో బైబిలు గ్రంథం చెప్పబడుతుంది. ఆ పిల్లవాడు బైబిలులోని, "ది స్పిరిట్ ఆఫ్ గాడ్ బ్రూడెడ్ ఓవర్ ది వాటర్స్" అన్న వాక్యము చదివి ఆందోళన పడ్డాడు. అతనికి స్పిరిట్ అన్నపదానికి అర్థం తెలుసు. బ్రూడెడ్ అన్నపదానికి వాటర్ అన్న పదానికి అర్థం తెలిసింది. కాని గాడ్ అన్నపదానికి అర్థం కాలేదు. అతడు ఈవిధంగా

అనుకున్నాడు. "గాడ్ అంటే బార్లీయా, లేక ద్రాక్షపండ్లా? స్పిరిట్, బార్లీ ద్రాక్షపండ్లు మొదలైన వాటినుంచి రావడం నాకు తెలుసు" అని ఆలోచించి, ఆ బాలుడు ఇది ఒక విచిత్రమైన నీటిలో కలుపబడిన సారా అనుకున్నాడు. ఆతని తండ్రి స్పిరిట్‌ను నీటిలో కలిపేవాడు. అతనికి తనతండ్రిచేసే స్పిరిట్‌ల విషయం తెలుసు. ఇది ఒక విచిత్రమైన స్పిరిట్ అనుకున్నాడు.

ఓహో! ఈ విధంగానే మానవులు పవిత్రగ్రంథాలకు తప్పుడు వ్యాఖ్యానం చేస్తుంటారు. ఎందుకంటే, వాండ్లు ఎక్కువగా నివసించేది సారాషాపులలో. వాండ్ల నిరంతరవ్యవహారం భౌతికత్వంలో. అందుచేత గంభీరమైన, పవిత్రములైన దైవగ్రంథాలను (వేదశాస్త్రాలను) స్థూల దృష్టితో, భౌతికదృష్టితో అపార్థం చేసుకుంటున్నారు.

ఒక సైనికుడు ఉన్నాడు. అతడు ఒక స్త్రీని ప్రేమించాడు. ఆ సైనికుని పై అధికారికూడా ఆ స్త్రీనే ప్రేమించాడు. ఆ స్త్రీ ఈ తక్కువ ఉద్యోగినే ప్రేమించింది. ఈ ఉద్యోగి సెలవు తీసికొని ఇంటికి పోయినాడు. ఆ స్త్రీ కూడా అక్కడికి వెళ్ళింది. వారిద్దరికి పెండ్లి చేసుకోవడానికి లగ్నం కుదిరింది. అందుచేత ఆ వుద్యోగి ఇంక కొన్ని రోజులు సెలవు తీసుకోవలసివచ్చింది. అతడు పై అధికారికి తంతి నిచ్చాడు. పై అధికారి ఈ విషయం తెలిసి అసూయచేత సెలవును ప్రసాదించక, తిరిగి తంతినిచ్చాడు. ఆ తంతి, "వెంటనే చేరుము." పెండ్లి చేసుకోదలచుకొన్న మనిషి ఈ తంతివార్త విని చాల నిరాశపడ్డాడు. వెంటనే వచ్చి ఉద్యోగములో చేరుము అని తంతియొక్క అర్థము. వివాహానికి ఇంక కొన్నాళ్ళు సెలవు పొడిగించుకోవాలని ఆ ఉద్యోగి ఉద్దేశ్యము. కానీ ఏంచేస్తాడు? ఎంతో ఆకులతపడ్డాడు. అతనికి వెనుకా, ముందు తోచలేదు. ఆ సమయంలో అతని ప్రియురాలు వచ్చింది. అతని చిన్నబుచ్చుకున్న ముఖమును చూచింది. విచారకారణ మడిగింది. అతడు టెలిగ్రాము చూపించాడు. సమయోచితయుక్తి చేత ఆ స్త్రీ ఆ తంతివార్తకు, తనకు అనుకూలంగా వ్యాఖ్యానించింది. వ్యతిరేకమయిన ఆ తంతివార్తకు, అతి విహితకరమయిన అర్థం తీసుకున్నది. ఆనందముతో ఆమె నాట్యముచేయడం మొదలుపెట్టింది.

ఈ ఆనందసమయములో విచారపడడం దేనికని, ఆమె సంతో షంతో త్వరత్వరగా గదినుండి వెళ్ళబోతున్నది. ఎందుకంత త్వరగా వెళ్ళడమని అతడు ప్రశ్నించాడు. "శీఘ్రంగా పెండ్లికి సర్వ వస్తువులూ ఆయత్తంచేయడానికి" అని ఆమె జవాబిచ్చింది. తంతి వార్త "వెంటనే చేరుము" అన్నదానికి, ఉద్యోగములో చేరమని కాదు. "వెంటనే నీ ప్రియురాలితో చేరుము" అని ఆ స్త్రీ వ్యాఖ్యా నించింది. ఈ విధంగానే మానవులు పవిత్ర భగవత్సంబంధ శాస్త్రాలకు, తమ స్వంత అర్థాలు అంటగడతారు. అట్లా స్వంత అర్థములను అంట గట్టడం వివాహాసక్తయైన ఆ స్త్రీకి సహాయం చేసియుండవచ్చు. శాస్త్రాలకు అపవ్యాఖ్యానాలివ్వడం తప్పు.

"దేహం దేవాలయ"మని శాస్త్రాలు చెప్పుతున్నవి. ఈ వాక్యం ఎంతో అగౌరవింపబడింది. నిజమే-దేహం దేవాలయమే. కానీ, దేవాలయానికే ప్రాధాన్యత నిచ్చి లోనగల భగవంతుని మఱచి పోవాలనా దీని అర్థం? దేవాలయములయొక్క ఉద్దేశ్యం నేటి రోమన్ కాథలిక్కు దేవాలయములవంటిదికాదు. లోపలఉన్న భగవంతుని మఱిచి ప్రజలు బాహ్య ఆలయానికే అర్చన చేస్తున్నారు.

"దేహం దేవాలయం" అన్నదానికి అర్థం ఈ ఆలయంద్వారా లోపలఉన్న భగవంతుని ఆరాధించవలెనని గాని, ఆలయమును ఆరాధించవలెనని కాదు.

మానవులు ఆలయమువరకు వెళ్ళుతున్నారు. లోనగల భగవంతుని మరిచిపోతారు. "దేహం దేవాలయం" అన్న వాక్యానికి జనులు అపార్థంతీసి ఈ వాక్యమును దుర్వినియోగంచేసి శరీరదృష్టిని పెంచుకుంటున్నారు. మానవులు ఐహిక భ్రాంతిహేతులై దేహవాంఛ లనుతీర్చుకుంటూ వారిపనులు ధర్మమే అని మోసగించడానికి దేహం దేవాలయంకదా అని చెపుతారు. దేహం దేవాలయం అన్నవాక్యం మానవులు డంబమును, అహంకృతిని, దౌర్బల్యమును, అజ్ఞానమును కాపాడే కోటగోడ అయిపోయింది.

ఇది శాస్త్రనింద. ఇంకానయం—ఈ ఆలయ మన్న పదాన్ని ఇంకా ఎక్కువ స్థూలవికారం చేయలేదు. దేహం దేవాలయంనుంచి అని చదివే విద్యార్థి "దేవుని చెవులెక్కడ ఉన్నాయని" అడగలేదు. ఇదివరకు అసలువిషయంమీద పడిన అపార్థభ్రాంతే చాలు.

దేహం దేవాలయమయితే, నీవు దానిని మరిచిపోవాలె. నీవు గుర్తుంచుకోవలసింది దేవాలయమును కాదు. నీవు భూషింపవలసినది దేవాలయాన్ని కాదు. లోపలఉన్న భగవంతుని సందర్శించు. దేవాలయం దాని భద్రత అది చూచుకుంటుంది.

భగవంతుడు సర్వవ్యాపి కాదా? దేవుని ఆలయం ప్రతిచోట లేదా? సూర్యుడు భగవంతుని ఆలయం. సమస్త తారలు భగవంతుని ఆలయాలే. సమస్తపదార్థాలు భగవంతుని ఆలయాలే. సమస్త పదార్థాలు భగవంతుని ఆలయాలే అని రాముడు చెపుతున్నాడు. మరి దేహమే భగవంతుని ఆలయం అనడమునకు కారణం దేహం నీకు అన్నిటికంటే సమీపంగా ఉన్నది. ప్రతిపదార్థం నీకు బ్రహ్మాత్వమునే ప్రబోధిస్తున్నది. ప్రతిపదార్థముయొక్క మూలతత్త్వం భగవంతుడే. ఈ విషయమునుగూర్చి రాముడు మీ కొకసంగతి చెపుతాడు. హృదయవేదనా భారవశమయిన అంతర్బాధాహతమయిన మానవ లోకానికి రాము డొక స్వర్గసందేశము నిస్తున్నాడు.

సమస్తజగత్తుయొక్క గతచరిత్రద్వారా భగవంతు డీసందేశమును పంపుచున్నాడు. భగవంతు డీసందేశమును ప్రతిగృహంలో, ప్రతిసంసారంలో ప్రబోధిస్తున్నాడు. భగవంతు డీసందేశమును మీ రక్తనాళాలలోకి, మీ నరనరాలలోనికి మీ మనస్సులోనికి పంపుతున్నాడు. ఈ సందేశమును వినండి. ఈ సందేశమును గ్రహించండి. మిమ్ములను మీరు రక్షించుకోండి! ఈ సందేశమును అగౌరవిస్తారా? ఈ సందేశమును తృణీకరిస్తారా? మీ కంఠాలకు మీరు ఉరివేసుకోగలరు. మీ చావును మీరు కొనితెచ్చుకోగలరు.

మానవుడు రోజుకు ఎన్నిసార్లు మరణిస్తున్నాడు. నీలో భయం పుట్టినప్పుడల్లా, నీలో దుఃఖం తలయెత్తినప్పుడల్లా నీవు భయవశుడ వవు

తున్నావు. నీ వప్పుడు మరణిస్తున్నావు. నీలో ఉన్న భగవంతుని మఱచిపోతున్నావు. ఈ సందేశము వినండి. మిమ్ములను మీరు రక్షించు కుంటారు. కాక ఈ సందేశమునకు పెడచెవి పెడతారా, ఉత్తరక్షణ మందే మీరు వినాశమును చేతులార కొని తెచ్చుకుంటున్నారు.

ఇది కఠినకర్కశమైన, అనుల్లంఘనీయమయిన మహాధర్మం. ఏమి టా సందేశం? వినండి. "ఎవరైతే పూజితులు కాదలనుకుంటారో వారు మొదట పరిత్యాగ వేదన అనుభవించవలసి యున్నది. క్రీస్తు మొదట పరిత్యాగ వేదన అనుభవించాడు. తరువాత పూజింపబడ్డాడు. బుద్ధుడు మొదట పరిత్యాగ వేదన అనుభవించాడు. తరువాత పూజింప బడ్డాడు. సోక్రటీస్ మొదట పరిత్యాగ వేదన అనుభవించాడు. తరు వాత అతసి దేహం నేడు పూజింపబడుతున్నది. బ్రునో మొదట మర ణించాడు. తరువాత గౌరవింపబడ్డాడు. హిందూదేశంలో సహస్రాధిక ప్రవక్తలు పరిత్యాగ వేదన అనుభవించారు. తరువాత పూజింపబడ్డారు. ఈ మహాత్ములందరూ, మొదట విలువ చెల్లించి తరువాత బహూకృతి పొందారు.

ఈ ప్రవక్తలందరూ మొదట విలువచెల్లించి, తరువాత బహు మానం పొందినమాట నిజం. కానీ ఇతర ప్రపంచ మానవుల సంగ తేమిటి? ఈ ప్రపంచంలోని జనుల సంగతేమిటి? ఈ ప్రపంచ మాన వులు మొదట వస్తువును పొందాలనుకుంటారు. తరువాత విలువ చెల్లించకుండా తప్పించుకోవా లనుకుంటారు. కానీ విలువ చెల్లించక తప్పదు. ప్రతివ్యక్తి పూజింపబడవలె ననే కోరుతాడు. పూజ అంటే ప్రేమ, గౌరవం, మర్యాద. ప్రతిమానవుడు ప్రేమింపబడవలె ననే, గౌరవింపబడవలెననే సమస్తప్రపంచం తనను ఆరాధించాలనే వాంఛి స్తాడు. ప్రపంచమంతా తనను కీర్తించా లనే వాంఛిస్తాడు. ఈ ప్రపం చంలోని ప్రతిమానవుడు ఈ ప్రాపంచిక వాసనారోగంచేత ఈ డాంబిక వ్యాధిచేత, ఈ స్వశరీరాభిమానరోగంచేత, పరశరీరాభిమానరోగం చేత, ఈ గాఢంగా నాటుకొనిపోయిన అజ్ఞానంచేత, ఈ దేహాత్మ భ్రాంతి అనే జాడ్యంచేత, నీలో ప్రకాశించే పరమసత్యమును విడిచి బాహ్యశరీరభ్రాంతికి వశంచేసే ఈ అజ్ఞానంచేత, జనభూషణాభిలాషా

రూపకమైన ఈ అజ్ఞానమహావ్యాధిచేత పీడింపబడుతున్నాడు. ఈ రోగ తపన, ప్రపంచం తనను పూజించాలనే ఈ అభిలాష, తగిన విలువ చెల్లించనిది తీరదు. భగవంతునియొక్క ఈ దివ్యధర్మం ఎవరినీ వదలి పెట్టదు. క్రీస్తునైనా, కృష్ణునైనా వదలిపెట్టదు. క్రీస్తు పరిత్యాగ వేదన అనే విలువ మొదట చెల్లింపవలసివచ్చినది. తరువాత పూజితుడైనాడు. ఈ మహాధర్మానుసారం సోక్రటీస్ మొదట క్రయం చెల్లించి తరువాత జగదారాధ్యుడైనాడు.

సమస్తప్రవక్తలు మొదట విలువచెల్లించి తరువాత జగదారాధితులైనారు. మీ నెపోలియన్, వాషింగుటన్ మొదలైనవారుకూడా మొదట విలువను చెల్లించి తదుపరి పూజితులైనారు. న్యూటను మొదలైనవారు సమాధులలో జీవిస్తున్నారు. అంతకుముందు పరిత్యజించిన జీవితమును సమాధులలో వారిప్పుడు జీవిస్తున్నారు. వారు దేహాతీతులైనారు. ఆకలి దప్పికల గుప్పిటలకు వారు అతీతులై జీవించారు.

న్యూటను జీవితం చదవండి. అతడెన్నిసారులు భోజనంచేయుటం మరిచిపోయినాడో మీరు కనుగొంటారు. ఇట్టి లోకోత్తర మానవు లందరు మొదట విలువచెల్లించి తరువాత జగదారాధ్యులైనారు.

ఈ మహాధర్మం ఎవరినీ వదలదు. ఈ ధర్మం మానవులను గౌరవించేది కాదు. ఈ మహాధర్మం మీ పాపులనుగానీ, మీ మహాత్ములనుగానీ, మీ ప్రవక్తలనుగానీ, మీ తత్వవేత్తలనుగానీ మరి ఎవరైనాగానీ గౌరవించదు. ఇది కఠిన కర్కశమైన, అనుల్లంఘనీయమైన దైవధర్మం. మీరు పూజింపబడవలెనని వాంఛిస్తారా, ప్రపంచం మిమ్ములను ప్రేమించాలని గౌరవించాలని కోరుకుంటారా, మీరు విలువ చెల్లించక తప్పదు.

'ది జ్యూయస్' (The Jeweas) అనే నాటకంలో జ్యూయస్ జోసెఫ్‌చేత పూజింపబడడానికి వాంఛించింది. మొదట ఆమె పూజింపబడింది. కానీ ఆమె విలువచెల్లించవలసియున్నది. ఒకవేళ ప్రకృతి లేక భగవంతుడు నీమీద ప్రత్యేక గౌరవముండి నీకు ముందుగానే పూజ్యతనిచ్చినా తరువాతనైనా ఆయన నీదగ్గర విలువ వసూలుచేసి

తీరుతాడు. మనము ముందుగానే విలువ చెల్లించామా–సరే మంచిదే. కాక మొదటనే పూజ్యతనిచ్చాడా, ఇక తర్వాత ఆయన బాకీపుస్తకం పంపుతాడు. చెల్లించవలసినదానిని ఆయన కడుజాగ్రత్తగా వసూలు చేసి తీరుతాడు.

జ్యూయస్ జోసెఫ్‌చేత పూజింపబడింది. కానీ ఆమె విలువ చెల్లించవలసియున్నది. ఐదుసంవత్సరాలామె ప్రేమోన్మాదినియై, వికలచిత్తయై జీవించింది. అజ్ఞానం పెచ్చు అపరాధమును, అసలు విలువను చెల్లించుకోక తప్పదు.

ఏ నవలలోగానీ, నాటకములోగానీ అందులోని వీరునికి ఏమి జరుగుతున్నది? యావత్ప్రపంచ చరిత్రలో ఏమిజరుగుతున్నది? ఈ అహంకారమును, ఈ శరీరదృష్టిని నివృత్తిచేయడమే దైవధర్మం. అప్పుడు మాత్రమే మీరు ప్రపంచంచేత సక్రమంగా ప్రేమింపబడతారు. వేరొకమార్గంలేదు.

వాంఛాసంపూర్ణతకు మార్గం ఈ వాంఛలను పరిత్యజించడమే. పర్షియన్ భాషలో 'మత్‌లబ్' అనే మనోహరమయిన ఒక పద మున్నది. ఈ పదానికి ఒక అర్థం 'కోరు' అని. రెండవఅర్థం 'కోరవద్దు' అని. ఇది విచిత్రమయిన పదం. వాంఛాసంపూర్ణతకు మార్గం వాంఛలను పరిత్యజించడమే. వాంఛాతీతుడవుగా, వ్యక్తిత్వమునకు అతీతుడవుగా, క్షుద్రాహంకృతిని అధిగమించు. శరీరభ్రాంతిని పరిత్యజించు.

ఒక దీపం ఉన్నది. మిడుతలకు దీపమంటే యిష్టం. దీపప్రేమ చేత ఆ దీపశిఖలో అవి తమ దేహమును కాల్చివేస్తాయి. ఆయా ఖండంలో కాలడం ప్రేమయొక్క చిహ్నం. "పురుగులు దీపమును వాటి నవి దహించుకోనేటంతగా ప్రేమిస్తున్నవి" జనులంటారు.

"అదికాదు. దీపంముందు తనను తాను దహించుకుంటున్నది. తరువాత ప్రేమింపబడుతున్నది"–అని వేదాంతం నిర్వచిస్తున్నది.

అదేవిధంగా శరీరానికి అతీతుడవుగా శరీరభ్రాంతిని దగ్ధం చెయ్యి, దహనంచెయ్యి, కాల్చివెయ్యి. అప్పుడుమాత్రమే, అప్పుడు

మాత్రమే నీ వాంఛలు సఫలమవుతాయి. అప్పుడుమాత్రమే నీవు జగదారాధ్యుడవౌతావు. అప్పుడుమాత్రమే నీ వాంఛావస్తువులు నీ పాదాలు ఆరాధిస్తాయి. "నిన్ను నీవు పరిత్యజించు"-అని చెప్పడం సులభమే. దాన్ని ఆచరణలో పెట్టాలె.

చర్చిలకు వెళ్ళడంమాత్రంచేతనే మీ భగవాదారాధన ముగియలేదు. ఆలయాలకు వెళ్ళడం కర్మకలాపాలుచేయడంతోటి మాత్రమే, నోటిమాటల ప్రార్థనలు చెల్లించినమాత్రంచేతనే మీకు భగవద్దర్శనం కలుగదు; మీకు విముక్తి కలుగదు. నీ సత్యజీవితంలో నిన్ను నీవు పరిత్యాగంచేసికొనితీరాలె. నీ స్నేహితులతోకూడిన సామాన్య వ్యవహారాలలో వస్తువిక్రేతశాలల్లో నీ బంధుజనమధ్యంలో నీ వీ పరిత్యాగతత్వమును అనుష్ఠించాలె.

ఎక్కాలు నేర్చుకొనే బాలునికి గుణనసూత్రాలు చెప్పతారు. అతడా సూత్రమును మనస్సుతో తెలుసుకొన్నంతమాత్రాన సంపూర్ణ సిద్ధి లభించదు. ఆ సూత్రమును అతడు మనస్సుతో నేర్చుకొన్నాడు మాత్రమే. ఆ సూత్రము నతడు ఋజువుచెయ్యాలె. ఆ సూత్రం అతనిలో జీర్ణించిపోయేటంతవరకు అతడు దానిని సాధనలోపెట్టాలె. అంటే ఆ సూత్రం నిరంతరం అతని కొనగోళ్ళమీద ఉండాలన్న మాట. నీవొక సూత్రాన్ని బట్టీపెడతావనుకో అంటే సూత్రం కేవలం నీ మనస్సులోమాత్రమే ఉన్నదన్నమాట. అందుచేత తప్పులులేకుండా గణితం చేయలేవు. తప్పులు పడుతునేఉంటాయి. ఆ సూత్రాన్ని ఆచరణలోబెట్టి వందలువందలు లెక్కలువేసి చూచి సాధనచేసినట్లయితే, ఆ సూత్రాలు నీకు కరతలామలకంగా మారిపోతాయి. అప్పుడుమాత్రమే ప్రతిలెక్క అవలీలగా, తప్పులేకుండా వేయగలుగుతావు. సూత్రాలను సాధనలోపెట్టి చూడాలన్నమాట.

అదేప్రకారం బైబిల్లో "నిన్ను నీవు పరిత్యాగంచెయ్యి" అనే వాక్యం నీవు చదువుతావు. పిల్లవాడు గణితసూత్రమును నేర్చుకున్నట్లు నేర్చుకుంటావు. కేవలం మనస్సుతో తెలుసుకొన్నందున ప్రయోజనం లేదు. నిత్యజీవితాచరణలో నీ వీ సూత్రమును పిలీనంచెయ్యాలి. నీ

మనస్సును ఈ సూత్రమునందు మగ్నంచెయ్యాలి. సాధనలో పెట్టాలి. నిత్యానుష్ఠానంలో ఈ సూత్రమును మధించాలి. మళ్ళీమళ్ళీ పరిశ్ర మించాలి. అప్పుడు విజయం లభిస్తుంది.

శిశువులతోటి ప్రసంగాలలోనైతం ఈ సూత్రమును సమాచ రించు. వీధులలో నడిచేటప్పుడునైతం నిన్ను నీవు పరిత్యాగంచెయ్యి. వినోదములందునైతం ఈ సూత్రము నుపయోగించు. నీ వీ సూత్రముమ సమాచరించాలి. ఈ సూత్రమును నీవు పరిశోధించాలి వేదాంతమును నేర్చుకోవడం, బ్రహ్మవిద్యను సాధించడం సులభం కాదు. వేదాంతమును నోటితో చెప్పడం సులభమే. కానీ వేదాంత మును నీకు నీవే నేర్చుకోవలసియున్నది.

నిత్యసాధనచేత, వివేకంచేత అంటే వేదాంతమును జీర్ణించు కోవడంచేత మనకార్యం విజయమవుతుంది.

రాముడు గణితశాస్త్ర ఉపన్యాసకుడుగా ఉన్నప్పుడు గణిత సమస్యలను చెరచెర వ్రాస్తున్నాడా అన్నంత తొందరగా వెనుక ముందు తడవుకోకుండా పరిష్కరించేవాడు. ఎందుచేత? రాముడు వివిధసూత్రాలను తన కొనగోటిలో ఉంచుకొనేటంత గాఢంగా నేర్చు కొన్నాడు. రామునికి గణితంలో ఎంత అనుభవం ఉందంటే-18 అంకెలను గుణ్యంగాతీసికొని 17 అంకెలను గుణకంగా తీసుకున్నట్లయితే ఎంత గుణనఫలితం వస్తుందో ఒక్క క్షణంలో చెప్పేసేవాడు. ఎట్లా? సాధనచేత. ఈ ప్రకారం నీయొక్క దేవాలయం నీ హృదయంలో ఉండవలసి యున్నది. వేదాంతముయొక్క ఆలయం వస్తువ్యాపార శాలలోకూడ ఉన్నది. వీధిలోవున్నది. నీ శయ్యయందున్నది. నీ పఠనామందిరంలో వున్నది. నీ భోజనశాలలో వున్నది. నీ చిత్రలేఖనా మందిరంలో ఉన్నది. నీ సల్లాపగృహంలో ఉన్నది. పరమసత్యమును సందర్శించి నీ వాచరణలో పెట్టుకోవలసిన దేవాలయము లివే. నీ సూత్రమును పరిష్కరించుకోవలసిన దిక్కడే. సమస్తకార్యములందు నీవు వేదాంతసాధన చేయువలసి యున్నది.

రాముడు బాలుడుగా ఉన్నప్పుడు పుస్తకం చదువుకుంటూనే వీధిలో నడుస్తున్నాడు. ఒక పెద్దమనిషి దగ్గరకువచ్చి "ఏమిటి నీవు చేస్తున్నది? ఇది స్కూలు కాదబ్బాయి! ఇక్కడా చదువేనా? పుస్తకం పారెయ్యి" అని చమత్కారంగా ఎగతాళి చేశాడు. "ఈ ప్రపంచమంతా నాపాఠశాలే" అని రాముడతనికి జవాబిచ్చాడు. మన పాఠశాల యేదిగా ఉండాలనో రాము డిప్పుడు తెలుసుకున్నాడు.

మన దైనందిన నిత్యజీవితంలో వేదాంతమును మనం జీవించక (ఆచరింపక) పోయినట్లయితే, వేదాంతం వల్ల ఇక ప్రయోజన మేమిటి? పుస్తకాలలోని వేదాంతం, బీరువాలలోని వేదాంతం పురుగులు తినడానికే. అది నిరర్థకం. మీరు వేదాంతమును నిత్యజీవితంలో ఆచరించవలసియున్నది.

వేదాంత మగ్నియని ప్రతీతి. వేదాంతం మన బాధా శోకారణ్యాలను భస్మీపటలం చేయలేక పోయినట్లయితే, ఈ దివ్యాగ్ని మన ప్రొయ్యిలో వంటకు ఉపయోగించే మన ఆకలిదీర్చే, మనచలిపోగొట్టే భౌతికాగ్నికంటె తక్కువే. ఈవేదాంత దివ్యాగ్ని మీచలిని పోగొట్టలేకపోతే, మీకు ఆనందమును చేకూర్చలేకపోతే, మీ శిరోభారమును నివృత్తిచేయలేకపోతే, ఈ నిర్వీర్య వేదాంతమును కాలితో తన్నివేయండి. ఆచరణలో పెట్టినప్పుడు మాత్రమే నీవు వేదాంత సాక్షాత్కారమును నేర్చుకోగలుగుతావు. ఆచరణలో పెట్టినప్పుడుమాత్రమే నీవు వేదాంత ప్రయోజనమును పొందగలుగుతావు.

పూర్వం యుధిష్ఠిరుడనే ఒక మానవుడున్నాడు. ఆతడు భారతవర్ష సింహాసనమునకు యువరాజు. ఆతని బాల్యమునుగూర్చిన ఒక కథ ఉన్నది. అతడు తన తమ్ములతో పాఠశాలలో విద్యాభ్యాసం చేస్తున్న రోజు లవి. ఆతనికి చాలామంది సోదరులున్నారు. అందరూ కలిసి ఒక గురుకులంలో చదువుకుంటున్నారు. ఒక రోజున పాఠశాల ప్రధానాచార్యులు (పరీక్షకుడు) పిల్లలను పరీక్షించటానికివచ్చి అందరినీ ఎన్నియెన్ని పాఠాలు వచ్చినవో అడిగాడు. యుధిష్ఠిరుని తమ్ములందరూ తమకు వచ్చిన పాఠాలన్నీ గడగడా వప్పచెప్పారు. పెద్దవా

డైన యుధిష్ఠిరునికూడా నీ కెంతవరకు వచ్చినవి అని సామాన్యంగా అడిగాడు. ఆ పిల్లవాడు తన ప్రాథమిక వాచకమును తెఱచి సంతోషంతో రవ్వంతకూడా సిగ్గులేకుండగా "అయ్యా! మొదటి వాక్యం నేర్చుకున్నాను" అని ప్రత్యుత్తరమిచ్చాడు. గురువు ఆ వాక్యంచూచి "ఇదేనా నీవు నేర్చుకున్నది. ఇంకేమీ రావా?" అని గద్దించాడు. సంశయంతో బాలుడు "రెండోవాక్యం కూడా వచ్చింది" అన్నాడు. ఆ రాజకుమారుడు ఆ ముద్దుకట్టుకు చిరునగవుతో, ఆనందంతో ఈ రకంగా ప్రత్యుత్తరమిచ్చాడు. కానీ గురువు కోపం ఆవుకోలేకపోయినాడు. ఎందుకంటే ఇతడు యువరాజు; బాగా అందరికంటె మిన్నగాచదువునేర్పి మెప్పించాలని అనుకున్నాడు. కన్నులవెంట నిప్పులుకక్కుతూ పిల్లవాని ముందు నిలబడియున్నాడు. ఆ క్రూరుడు 'బెత్తమును ఉపయోగించకపోతే వీడు చెడిపోతా'' డను కున్నాడు. పిల్లల వీపులపైన బెత్తములను విరుగగొట్టడం పిల్లలను బాగుచేస్తుందని పంతుళ్ళు తలుస్తారని మీకు తెలుసు. ఎన్ని బెత్తాలు విరుగగొడితే, అంత పిల్లలు బాగుపడతారని మన పంతుళ్ళ అభిప్రాయము. ఈ భావంతో అతడు మహాక్రూరుడై బాలుని, చేతిలోని బెత్తం తునాతునక లయ్యేలాగు కొట్టాడు. యుధిష్ఠిరుడు చలించ లేదు. శాంతుడై నిలబడ్డాడు. పూర్వంవలె అతడు సంతోషంగా ఉన్నాడు. చేయి రక్తమండలమయినా అతని ముఖారవిందంలో విచారసూచనే లేదు. బెత్తం విరిగిందాక కొట్టికూర్చున్నాడు గురువు. పిల్లావానిముఖం చూచాడు; అతని ముఖపద్మంమీద రవ్వంతకోపం గానీ, చీమంతవిచారంగానీ, అణుమాత్రం భయంకాని లేదు. ఆ రాజ కుమారుని ముఖంచూస్తే రాళ్లుకూడా కరుగుతాయన్నట్లు ఆ గురువు పాషాణహృదయంకూడా కరిగింది. ఆ ఆచార్యునికి పశ్చాత్తాపం కలిగింది. "నే నెంతపనిచేశాను! మాటమాత్రాన నన్ను ఉద్యోగ చ్యుతుణ్ణిగా చేయడానికి అధికారం ఉన్న ఈ భావిచక్రవర్తి ఇంత ప్రశాంతంగా ఉన్నాడే! ఇతర పిల్లలను కొట్టినప్పుడు వారీరకంగా లేరు. నేను కొట్టానో, కొట్టలేదో వారిలో ఒకడు బెత్తం లాక్కొని నన్ను తిరిగి కొట్టాడు. కానీ ఈ బాలుడు గంభీరుడైయున్నాడు.

ప్రశాంతుడై యున్నాడు-" అని అతడు తనలోతాను చింతించాడు. అతనిదృష్టి ఆ బాలుడు నేర్చుకున్న మొదటివాక్యంమీాదపడింది.

హిందూదేశంలో బోధనాపుస్తకాలు కుక్కలతో పిల్లులతో మొదలుపెట్టరని మీాకు తెలుసు. భారత దేశంలో వాచకాలు భగవంతునితో ధర్మవాక్యాలతో ప్రారంభమవుతాయి. ఆ సంస్కృత వాచకంలోని మొదటిమాట 'కోపంవద్దు'. రెండోవాక్యం 'సర్వదా సత్యమే పలుకుము బాలుడు మొదటవాక్యమును నేర్చుకొన్నానని చెప్పాడు. రెండోవాక్యమును నేర్చుకొన్నానని కొంచెము నక్కుతూ చెప్పాడు. ఆ అధ్యాపకునిదృష్టి 'కోపంవలదు' అన్న ఈ ప్రథమవాక్యం మీాదపడింది. ఆ వాక్యం చూచి పిల్లవాని ముఖంవైపు చూచాడు. అతని ఒక కన్ను ప్రథమవాక్యంమీాదా, రెండోకన్ను పిల్లవానిముఖం మీాదా ఉన్నది. అప్పుడు ఆ వాక్యార్థం అతని మనస్సులో మెఱపు లాగా మెఱిసింది.

ఆ రాజకుమారుని ముఖారవిందం ఆ వాక్యముయొక్క అర్థ మును విశదీకరించింది. "కోపము వద్దు" అన్న వాక్యముయొక్క అవతారమువలె ఆ రాజకుమారుని ముఖం ఉన్నది. ప్రశాంతమైన, వికాసవంతమైన, పరమ సౌమ్యమైన ఆనందచంద్రికలు విరజిమ్మే ఆ రాజకుమారుని సుందరముఖారవిందం గురువుయొక్క హృదయంలో 'కోపం వద్దు' అన్న వాక్యార్థమును విశదీకరించింది.

ఇంతకు ముందు గురువు ఆ వాక్య తాత్పర్యమును కేవలం నాలుకతోటే నేర్చుకున్నాడు. ఇప్పు డతడు, ఈ చిలుక పలుకుల విద్య విద్యకాదు. ఇది చదువుకాదు. ఆచరణలోపెట్టడం, వాక్య తాత్పర్య మును జీవించడం, నిజమైన నేర్చుకోవడం అని తెలుసుకున్నాడు. తన జ్ఞానం ఎంత అల్పమైందో అతడు తెలుసుకున్నాడు. ఒక పిల్లవాడు, నిజంగా నేర్చుకున్నాడు. నే నీ మొదట వాక్యమైనా నేర్చుకోలేక పోయినానని అతడు సిగ్గుతో తలవంచుకున్నాడు. నోటితో వాక్యమును వల్లెవేయడం నేర్చుకోవడం కాదు. ఆ వాక్యతాత్పర్యమును ఆచరణలో

పెట్టడం, సాధించడం, తదనుభూతి పొందడం తద్భావైక్యత పొందడం నిజంగా విద్యనేర్చుకోవడ మని రాజకుమారుని ఆశయం.

విద్యనేర్చుకోవడం అన్నదాని అర్థము గ్రహించాడు గురువు. అతని చేతిలోనుంచి బెత్తం క్రిందపడిపోయింది. ఆతని హృదయంలో పశ్చాత్తాపానికి అంతులేదు. బాలునియెత్తి కౌగలించుకున్నాడు. నొసలు ముద్దుపెట్టుకున్నాడు. తన అజ్ఞానమును తన అనుభవజ్ఞాన విహీనతను గ్రహించి లజ్జపడ్డాడు. బాలునివీపుపై నిమిరి గురు వీ రకంగా అన్నాడు: "కుమారా! ప్రియమైన రాజకుమారా! నీవు ఒక్క వాక్యమైనా తెలుసుకో గలిగినందుకు నీకు నేను అభివందనము లర్పిస్తున్నాను. శాస్త్రములలోని ఒకవాక్యమునైన సరిగా నీవు తెలుసుకో గలిగినందుకు నీకు నేను అభివందనము లర్పిస్తున్నాను. ఆహా! నేను ఒక్క వాక్యంకూడా తెలుసుకోలేదు. ఒక్క వాక్యమైనా నేర్చుకో లేదు. అందుకనే నాలో కోపం చావలేదు. ఏ విషయమయినాసరే నాకు కోపం కలిగిస్తుంది. ఓ కుమారా! నామీద దయవుంచు. నాకన్నా నీవే జ్ఞానివి." ఈ రకంగా గురు వా బాలుని కీర్తించాడు. పిల్లవా డామాటలు విని ఇలా అన్నాడు: "తండ్రీ! తండ్రీ! మొదటి వాక్యమయినా నా కింకా సరిగారాలేదు. ఎందుకంటారా, నా కింకా అంతరాంతరాల్లో కోపవికారచిహ్నాలు పోనట్లు కనపడుతున్నయి. మీరు అయిదునిమిషములు కొట్టినందుకు నా హృదయాంతరాల్లో కోపచ్ఛాయ ఎక్కడో దాగియున్నట్లు నాకు కనబడుతున్నది" ఈ రకంగా రాజకుమారుడు రెండవ వాక్యార్థమును ఆచరణలో నిరూపించాడు. ఈ రకంగా అతడు సత్యమును వచిస్తున్నాడు. తనలో లోపల దాగియున్న బలహీనతను ధైర్యంగా దాచక చెప్పడంలో ఆ బాలుడు "సత్యము పలుకుము" అన్న రెండవ వాక్యార్థమును ఆచరణాత్మకంగా తెలుసుకున్నాడు.

విషయములను తెలుసుకునేమార్గ మిదే. వేదాంతమును తెలుసుకోవడానికి, వేదాంతమును జీవించడానికి, వేదాంతమును ఆచరించడానికి ఇదే మార్గం.

మిమ్ములను ఇతరు లెవ్వరూ రక్షించలేరు. మిమ్ములను మీరే రక్షించుకోవాలని రాముడు చెపుతున్నాడు. ప్రాతఃకాలమందు నీవు ఓంకారజపం చేసుకొనేటప్పుడు వేదాంతమును జీవించడానికి ఆచరణాత్మకం చేయడానికి సుస్థిరప్రతిజ్ఞ బూను. నీవు చేయబోయే ప్రతి పనిలో ముందుగా జాగ్రత్తవహించు. నదికి స్నానానికి పోయేముందు ఈతకు తగిన విధానంలో సంసిద్ధుడవైన మాదిరి ఒకపని చేయబోయే ముందు, ఎవరినైనా కలువబోయేముందు వేదాంతదృష్టిలోనుంచి తప్పిపోకుండా నీ మార్గనిర్మాణమును నీవు చూసుకో నదిలో స్నానానికి దిగేముందు నీపైనయున్న వస్త్రాచ్ఛాదనాలన్నీ విడిచిన మాదిరి నీ ఈ మిథ్యాహంకృతిని, ఈ దేహవాసనను, ఈ బాహ్యదేవాలయమోహమును విడిచిపెట్టాలె. ఈ అహంభావమంతా పరిత్యజించి భగవంతుని సంభావించు. సత్యాత్మను సందర్శించు. సమస్త భూతాలలో భగవంతుని సందర్శించడానికి పట్టుదలపూను. నీ వొక స్నేహితుని దగ్గరకు వెళ్ళేటప్పుడు లేక ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు ముందుగా చిత్తమును వేదాంతదీపితంచేసుకో. వినిర్మలంచేసుకో. నీ జీవిత నిత్యకార్యాలలో నీవు వేదాంతపథమును తప్పిపోకూడదు. మనస్సును సమస్థితిలో ఉంచుకోవాలె. నీకే నష్టముకలుగదు. ఒకపని చేసినపిదప లేక నీ మిత్రుని గృహమునుండి పని అయి తిరిగివచ్చిన తరువాత లేక ఎవరితోనైనాసరే వ్యవహరించివచ్చిన పిదప, తిరిగి మనస్సును పరిశుద్ధంచేసుకో. సమదృష్టిని భద్రపరుచుకో. నిరంతరం ఎక్కుపెట్టిన ధనుస్సువలె వేదాంతజ్ఞానముతో భద్రపడు.

నీ చేతులకు మట్టి అయినప్పుడు, నీవు వాటిని కడిగి పరిశుభ్రం చేసుకుంటావు. ఎవరైనాసరే తాముధరించిన వస్త్రంమీద మురికి మఱక తగిలినప్పుడు, వెంటనే పరిశుభ్రంచేసుకుంటారు. అదేప్రకారం ప్రాపంచిక జనసంపర్కంచేతకలిగిన అహంకారవికారాన్ని వెంటనే నీ గృహానికివచ్చి ప్రక్షాళనంచేసుకో. తిరిగి నీ బ్రహ్మాత్వమునందు ఉపవిష్టుడవుగా.

నీవు శోకాతురుడవైనప్పుడు నీ మనస్సమత భంగమైనప్పుడు నీ కశాంతి కలిగినప్పుడు నీ వేమిచెయ్యాలె? పైనచెప్పిన మనస్సమత్వ సాధననే అనుసరించు.

వైద్యునియొక్క త్రాసుసిబ్బులు గాలికి క్రిందికి, పైకి కదలుతుంటాయి. ఆ చలనమును ఆపడానికి అతడేమిచేస్తాడు? ఆ త్రాసును ఒకగాలి తగులని గదిలో ఉంచుతారు. కొంతిసేపటికి ఆ త్రాసు సమత వహిస్తుంది. అదేప్రకారం నీ మనస్సు ప్రాపంచకవాసనాచలితమయినప్పుడు నీ మిత్రజనసంపర్కమును వదలి ఏకాంతమునకు నిర్గమించు. కాలము, ఏకాంతము, నీకు బలమునుచేకూరుస్తాయి. ఓంకారమును జపించు. సంస్మరించు. వేదాంతమును విచారించు. నీ బ్రహ్మత్వమును సంభావించు. నీ ఉదాత్త్వమును తెలుసుకో త్వరలో తిరిగి నీలోశక్తి ప్రదీపిస్తుంది. తిరిగి నీవు సమత్వమును పొందగలుగుతావు. శాంతి లభిస్తుంది

నీ మనస్సు వికలతపొందినప్పుడు క్రోధాందోళనా భయాదులు నీ మనస్సులో క్రమ్మినప్పుడు నీ వేమి చేయాలి? నీ ముఖమును ఎవరికీ చూపించడానికి నీ కధకారం లేదు. స్ఫోటకంపోసిన ముఖమును ఎవరికీ చూపించకూడదు. సంసర్గరహిత స్థలంలో నీవు ఉండాలి. ఒక మనిషికి కలరా తగులుతుంది. ప్లేగు తగులుతుంది. అప్పుడతనికి సంఘంలో తిరగడానికి అధికారంలేదు. ముందర నీ రోగమును నయంచేసుకో తరువాత బైటకిరా.

చూడండి. స్త్రీగానీ, పురుషుడుగానీ తన ముఖానికిగానీ వస్త్రానికిగానీ మసి అయినప్పుడు, ఆ మసి కడిగి పరిశుభ్రం చేసుకోనిది సంఘంలో తిరుగరు. అదేప్రకారం నీ మనస్సు కలుషితమైనప్పుడు, నీకు ప్రాపంచకవాసన అనే అంటురోగం తగిలినప్పుడు, నీ సత్యప్రకృతి అజ్ఞాన మనే కలరాజాడ్యం తటస్థించినప్పుడు సంఘంలోకి రావాకు. రావాకు. ఏకాంతంగా కూర్చో. ఓంకార సంస్మరణం చెయ్యి. భగవధ్యానంచెయ్యి. భగవత్సంభావన చెయ్యి. ఆత్మానుసంధానం చెయ్యి పునఃప్రాప్తజ్ఞానారోగ్యంతో బైట అడుగుపెట్టు.

మీ రీ దివ్యశక్తిని ఉపాసించ మొదలుపెట్టండి. మీ జీవితంలో ఒక ఉన్నత పరివర్తనం కలగటం మీరే చూడగలరు.

మానవులందరికీ పండు తినాలని కోరిక ఉన్నది. కానీ పండ్లను ఫలించే చెట్టును నఱికివేయాలని ప్రయత్నిస్తున్నారు. ప్రతి మానవుడు ఆనందము అనుభవించాలని, సుఖపడాలని వాంఛిస్తున్నాడు. కానీ సత్యమునందు జీవించడానికి యిష్టపడరు. తన బ్రహ్మత్వమునందు, దైవత్వమునందు ఏమానవుడు జీవిస్తాడో, ఏ మానవుడు అంతర్ముఖుడై జీవించగలడో అతడు మాత్రమే ఆనందపడగలడు. సుఖపడగలడు. శాంతిని పొందగలడు.

మానవులందరికీ తమ దేహాలు పూజింపబడవలెనని యున్నది. మానవు లీ క్షుద్ర దేహానికి సమస్తసుఖాలు రావాలని ఆశిస్తున్నారు- కానీ విలువచెల్లించరు. దీనివల్ల ప్రయోజనంలేదు. మీరు పట్టణాల్లో ఉండండి. ఎక్కడైనా ఉండండి. భగీరథులవలె, మీలో మీరీ ప్రబల సాధన చేయవచ్చు ఇది మీకు అసాధ్యంకాదు. ఇది మీ స్వశక్తి మీద ఆధారపడి యున్నది.

రాముడు నిజంగా భయాతీతుడు, శోకాందోళనాతీతుడు, రాముడానందస్వరూపుడు, అయితే ఇట్టి స్థితికి అధిగమించడానికి కారణం నిరంతర సాధనే. దౌర్బల్యముయొక్క, అజ్ఞానముయొక్క పాతాళపు టడుగులనుంచి రాముడీ అతీతస్థితికి అధిగమించాడు. ఒకప్పుడు రాముడు అతి విభ్రమవశుడు. ఉఫ్ అంటే అతని మనస్సమత వికలతపొందేది. ఒక మానవు డీ దివ్యస్థితికి చేరగలిగినప్పుడు మీరుకూడా చేరగలరు.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

# నేను పరిపూర్ణ జ్ఞానజ్యోతిని

(1904 జనవరి 13న డెన్వర్‌లో యిచ్చిన ఉపన్యాసము)

ఏది సత్యాత్మ? శరీరం సత్యాత్మ కాదు. మనస్సు సత్యాత్మ కాదు. ప్రాణం సత్యమైన ఆత్మకాదు. ప్రపంచం ఉన్నదని నీ వెలా తెలుసుకుంటున్నావు? నీ అంతఃకరణచేత (తెలివి) తెలుసుకుంటున్నావు తెలివికూడ త్రివిధపరిణామాలకు లోనవుతున్నది. జాగ్రదవస్థలోని తెలివి - స్వప్నావస్థలోని తెలివి - గాఢనిద్రావస్థలోని తెలివి. ఈ తెలివి, థర్మామీటర్ (తాపమాపకయంత్రము) లాగా లేక బరామీటర్ (వాయుభారమాపకము) లాగా ప్రపంచపు శీతోష్ణస్థితిని లేక ఒత్తిడిని కొలుస్తుంటుంది.

జాగ్రత్ స్థితిలోని తెలివి ప్రపంచం స్థూలస్వరూపంతో యథోచిత నియమపరిపాలితమై యున్నట్లు సూచిస్తుంది. స్వప్నావస్థలోని తెలివి చెప్పే తీర్పు దీనికి పూర్ణవ్యతిరేకం. కానీ స్వాప్నికావస్థలోని పరిస్థితులు, జాగ్రదవస్థలోని పరిస్థితులంత బలియమైనవే. అదిగాక జాగ్రదనుభవకాలం ఎంతో, నిద్రానుభవ కాలంకూడా అంతే. నీ జీవితంలో ఎంతకాలం జాగ్రదనుభవనంలో ఉంటావో, అంతకాలం నిద్రానుభవనంలో నీ వుంటున్నావు. శిశువు నిరంతరనిద్రావస్థలో ఉంటుంన్నదని చెప్పవచ్చు. సమస్తప్రపంచమానవులు ఈ అనుభవమును పొందుతున్నారు. జాగ్రత్ స్థితిలోని తెలివియొక్క అనుభవం గాఢనిద్రావస్థలోని తెలివియొక్క అనుభవానికీ, స్వప్నావస్థలోని అనుభవానికీ పూర్ణవ్యతిరేకం.

సర్వకాల సర్వావస్థలయందు అవికల్పమై, అవినాశనమై ఏది ఉంటుందో అదే సత్యమైనది. సర్వులు ఆమోదించిన సత్యలక్షణ మిది ఏది అచంచలమై, నిత్యమై యున్నదో అదే సత్యము. ఈ తెలివి ద్రష్టస్థానమున మూడు భిన్నరూపాలను ధరిస్తున్నది. జాగ్రదవస్థలో ఈ తెలివి శరీరంతో ఏకమవుతున్నది. నీవు 'నేను' అని అంటున్నప్పుడు శరీరమే నీ వనితలుస్తున్నావు. కానీ స్వప్నావస్థలో ఇది వేరొక భిన్నరూపం ధరిస్తున్నది. నీవు మారిపోతున్నావు. స్వాప్నికద్రష్ట జాగ్రదవస్థ

లోని ద్రష్టకు భిన్నంగా ఉన్నది. స్వప్నావస్థలో నీవు భాగ్యవంతుడవైనా, కటికి నిరుపేదవైనట్లు నీవు చూస్తున్నావు. నీ ఇల్లు తగులబడినట్లు, నీవు ప్రాణాలతో పారిపోయినట్లు కంటున్నావు. స్వప్నంలో నీవు నీరు త్రాగవచ్చు. కానీ జాగ్రత్ స్థితికి వచ్చిచూస్తే, నీవు దాహపీడితుడవై యుంటావు. కాబట్టి స్వప్నద్రష్టకూ, జాగ్రదవస్థలోని ద్రష్టకు తేడా ఉన్నది. స్వప్నావస్థలో నీ తెలివి ఒక రకంగా ఉంటున్నది. జాగ్రదవస్థలో ఇంకొకరూపం ధరిస్తున్నది. గాఢనిద్రావస్థలో మరొకరూపం ధరిస్తున్నది. గాఢనిద్రావస్థలోని నీ బుద్ధి శూన్యతలో మిళితమవుతున్నది. "ఒక్క కలకూడ నాకు రాలేదు. నేనుహాయిగా గాఢనిద్రపోయాను"— అని నీవు చెపుతావు. కానీ చూచావా — గాఢనిద్రావస్థలో నిరంతర ప్రబుద్ధమైన నిద్ర ఎరుగనిదొకటి నీలో ఉన్నది. అదే నీ సత్యాత్మ. ఈ సత్యాత్మ దృశ్యమైన తెలివికి వేరుగాఉన్నది, ఇది పరిశుద్ధ జ్ఞానస్వరూపమై యున్నది. ఇదే నీ ఆత్మ.

"క్రిందటిరాత్రి 12 గంటల సమయంలో నేను పెద్దబజారులో చూచాను. ఎవ్వరూ లేరు. ఒక్కమనిషి పొలకువకూడా లేదు" —అని ఒకడు చెబుతాడు. మన మది ఒక కాగితంమీద వ్రాయమని అడుగుతాము. ఆ మనిషి తాను కండ్లారా చూచినవిషయ మిది. అని చెబుతాడు. "అయితే నీవు మనిషివేకదా ? నీ వొక్కడవైనా ఉన్నట్లే కదా ?" అని మనం ప్రశ్నిస్తాము. "నీ మాటల్లోనే తప్పుఉన్నది. ఎవరూ లేరంటావు. నీ వు న్నావుకదా" అని మనం అతని స్వవచనాఘాతమును నిరూపించగలం.

ఒకడు గాఢనిద్రనుండి లేచి నా కొక్క కలకూడా రాలేదు. అని చెపుతాడు. మన మంటాము — తమ్ముడా ? గాఢనిద్రావస్థలో ఏమీలేదు. నిరామయత అని నీవు చెబుతున్నావు. కానీ నీ వా నిరామయస్థితికి సాక్షివై యుండాలెకదా ! నీవు లేకపోతె మరి ఎవరు దీనికి సాక్ష్యం ? నీలో గాఢనిద్రావస్థలోసైతం నిరంతరం ప్రబుద్ధమైనది, నిరంతరా ప్రమత్తమైనది ఒకటి ఉన్నది. అది నీ సత్యాత్మ. ఇదే శుద్ధ జ్ఞానశక్తి.

దానిలోనుంచి సమస్తప్రపంచం ఏరకంగా ఉదయిస్తున్నదో చూడండి. నదులను చూడండి. వాటికి మూడు అవస్థలున్నవి. మొదటి అవస్థ హిమఖండస్థితి. రెండవస్థితి పర్వత సానువులలోని సెలయేటిస్థితి. గడ్డకట్టిన మంచుకరిగి సెలయేరు రూపంధరించింది. ఆ సెలయేరు మైదానాలలోకి దిగి కల్మషజల యుక్తమై విశాలరూపం ధరించింది. ఇది నది యొక్క మూడవ అవస్థ. ఇది నదియొక్క అవస్థాత్రయం.

పర్వతశృంగాలపైన మంచుగడ్డలమీాద సూర్యబింబం ద్యోతకం కాలేదు. రెండవ సెలయేటిస్థితిలో మూడవ నదీస్థితిలో అందులో చంద్రబింబం ప్రతిబింబితమైంది. రెండవ అవస్థయైన సెలయేటిస్థితి స్థూలంగా అనుభవయోగ్యం కాక పోయినా, మనోజ్ఞంగానే ఉన్నది. మూడవస్థితిలో నదీజలం ఉపయోగకరమైంది. నావాయానం, వ్యవసాయకర్మ చేయదగిన రూపంధరించింది. ఇప్పుడు మనకు రెండువస్తువులు కనబడు తున్నాయి. ఒకటి సూర్యుడు, రెండోది నది.

ఒకటి నీటిలోని సూర్యసూర్యుడు. నీలోని భగవంతుడు; పరమాత్మ. గాఢనిద్రావస్థలో ఆ పరమాత్మే ప్రకాశిస్తున్నాడు. జడీభూత హిమశృంగాలమీాది సూర్యునివలె గాఢనిద్రావస్థలో పరమాత్మే సాక్షిమాత్రుడై ప్రకాశిస్తున్నాడు. ఆత్మసూర్యుడు కొంతకాల మావిధంగా గాఢనిద్రావస్థ అనే హిమఖండాలపై ప్రకాశిస్తాడు. తత్ప్రకాశోష్ణత చేత కారణశరీరం ద్రవించి, అ గాఢసుషుప్త్యవస్థలో నుంచి, ఆ శూన్యావస్థలోనుంచి స్వప్నావస్థ వెలువడుతుంది. ఈ విషయమునే బైబిలు "శూన్యతలోనుంచి భగవంతుడు ప్రపంచమును సృజించాడు" — అని వర్ణిస్తున్నది. శూన్యము అని పేర్కొనబడిన ఆ స్థితిలో భగవంతుడు ఉన్నాడు. మంచునుంచి సూర్యుడు నదులను సృజించిన విధంగా నీలోని సూర్యసూర్యుడైన భగవంతుడు శూన్యతమీాద (దీనినే హిందువులు మాయా అని వర్ణించారు) ప్రకాశిస్తున్నాడు.ఆ శూన్యతలోనుంచి ద్రష్ట దృశ్యములు రెండూ ఆవిర్భవిస్తున్నాయి. ద్రష్టఅంటే చూచేది. దృశ్యమంటే చూడబడేది.

స్వప్నావస్థానుభవం జాగ్రదనుభవంగా, సెలయేరునదిగా మారి నట్లు పరిణితి పొందు తున్నది. మానవుడు భగవంతుని ప్రతిబింబ మని జనప్రతీతి. గాఢనిద్రావస్థలో నీలో అహంకృతి లేదు. స్వాప్నికజాగ్రదవ స్థలలో నీలో అహంకృతి ఉన్నది. స్వప్నజాగ్రదవస్థలలో నీలో భగవం తుని ప్రతిబింబం కనబడుతున్నది. సత్యాత్మ భగవంతుడు. సత్యాత్మ సూర్యుడు. అంతేగాని ఈ ప్రతిబింబంకాదు. స్వప్నాలలో మీాకు అనేక రకాల వస్తువులు కనబడుతున్నవి. ఏకాంతిచేత మీారు వస్తువులను చూడగలుగుతున్నారు ? చంద్రకాంతిచేతనా ? లేక తారా సూర్య తేజంచేతనా ? కాదు. అయితే స్వప్నాలలో ఏ తేజస్సుచేత మీారు వస్తువులను చూడగలుగుతున్నారు ? మీాలోని పరంజ్యోతిచేత చూడ గలుగుతున్నారు! సమస్త వస్తువులను చూపించేది ఆ పరంజ్యోతే. స్వప్నాలలోని వస్తుప్రపంచమును చూపిస్తున్న ఈ పరమతేజం గాఢ నిద్రావస్థలో ఏకమాత్రమై ప్రకాశిస్తున్నది. స్వప్నస్థితిలో ఈ పరం జ్యోతే వస్తుదర్శనం చేయిస్తున్నది. కాబట్టి, సుషుప్తిలో జాగ్రత్ స్థితిలోకూడ నిరంతరం ఈ పరమతేజం మారక వెలుగుచున్నది. స్వప్నంలో నీవు చంద్రుని చూస్తున్నావు. ఆ చంద్రుడూ, ఆ చంద్ర తేజమూ నీలోని పరమతేజముచేత ప్రకాశించినవే.

ఈ రోజు నీవు పరిపూర్ణజ్ఞానజ్యోతి వని ఋజువుచేయబడింది. పరమతేజము నీవే. హిమశిఖరాలమీాద కొండవాగులో మైదాన నదీ గర్భంమీాద ప్రకాశించేది ఒకే సూర్యుడు. అదేప్రకారంగా నీ గాఢ నిద్రావస్థలో స్వప్నావస్థలో, జాగ్రదవస్థలో ఒకే సత్యాత్మ ప్రకాశిస్తు న్నది. ఆ సత్యాత్మవు నీవు- తత్త్వమసి. నీలోని ఆ పరమసత్యముతో ఏకీభవించు. అఖండబలశక్తిప్రపూర్ణుడ వౌతావు. చంచలమైన ఈ అస్థిరవస్తువులతో ఏకీభవిస్తావా, నీజీవితం వృథా! సూర్యుడు నదీ ప్రారంభంలో, మధ్యలో, చివరలో ఒకడే ప్రకాశిస్తున్నాడు. ఈ ఒక్క నదియొక్క మూడు అవస్థలయందేకాదు. సమస్తనదులయొక్క అవ స్థాత్రయంలో ఒకేసూర్యుడు ప్రకాశిస్తున్నాడు. అన్నినదులలో ఒకే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు.

నీలో ప్రకాశిస్తున్న ఆ పరమతేజమే ఈ ప్రపంచంలోని సమస్త మానవులయొక్క గాఢనిద్రాస్వప్న జాగ్రదవస్థలయందు ప్రకాశిస్తున్న ఆత్మయై యున్నది. ఆ పరంజ్యోతి తాను వేనిమీద ప్రకాశిస్తున్నదో ఆ వస్తుజాలమునకు వేరుగా లేదు. ఆ పరమతేజముయొక్క ప్రతిబింబమే సమస్తజగము. నీవు పరంజ్యోతివి. నీవు పరంజ్యోతి వని గాఢ సంభావన చెయ్యి. అహంబ్రహ్మోఽస్మి; నేను పరంజ్యోతిని. పరంజ్యోతిలో ఐక్యంగా! ఇదే నీ జీవితసారాంశం! ఇక బాధలు లేవు. భయాలు లేవు. శత్రువులు లేరు. దుఃఖం లేదు. సమస్తం బ్రహ్మమయం! నిత్యమైన, అవికల్పమైన సర్వకాలసర్వావస్థలయందు మారక వెలుగుతున్న పరంజ్యోతిని నేను. నేను తేజస్తేజమును. ఈ సమస్త ప్రపంచం నేననే మహాసాగరంలో తరంగాలవలె, బుడగలవలె, నురుగువలె కనబడుతున్నది.

అహంకారవనికను తొలగించడానికి ఈ క్రింద విధానం మహోపకృతి చేస్తుంది. :—

"ఎక్కడికన్నా పోయేటప్పుడు ఒంటరిగా పోవాకు" అని జనులోకసామెత చెబుతుంటారు. ఈ క్రిందకారణాలచేత ఇది కేవలం భ్రాంతి అని తేలుతుంది :—

మొదటిది : మనం ఒంటరిగా నడిచేటప్పుడు మనఉచ్ఛ్వాసనిశ్వాసాలు క్రమబద్ధంగా, ఆరోగ్యవిహితంగా నియమానుసారంగా ఉంటాయి. అందుకనే కాంటు తన తుదిజీవితంలో ప్రాణనియమ విధానానికి ఏకాకిగా నడిచేవాడు. అందుకనే పూర్ణాయువుగా జీవించాడు. మనం ఒంటరిగా, నడిస్తే గాలి ముక్కులగుండా పీలువగలం. కాక మాట్లాడుతూ నడిస్తే నోటిగుండా పీలుస్తాము. ముక్కులగుండా గాలి పీల్చడం చాల మంచిది. దానివల్ల శ్వాసకోశాలకు దార్ఢ్యము కలుగుతుంది. భగవన్నియామకం ముక్కులగుండా గాలి పీల్చమని; నోటిగుండా పీల్చమనికాదు. నోటిగుండా మనం గాలి వదలవచ్చు. కానీ పీల్చడంమాత్రం ఎప్పుడూ నాశికారంధ్రాల ద్వారానే చెయ్యాలె. శ్వాసకోశాలలో ప్రవేశించేగాలి నాశికా రంధ్రాలలోని వెండ్రుకల చేత పరిశుభ్రపడుతుంది.

రెండవది. మనం ఒంటరిగా నడిచేటప్పుడు మన మనస్సు ఏకాగ్రతగా ఉంటుంది. మంచిభావాలు వస్తాయి. లార్డుక్లైవు ఎలాగో ఈ రహస్యం పట్టుకున్నాడు. భారత రాజ్యాంగ విషయకమైన ఏవో తీవ్ర సమస్యలు వచ్చినప్పుడు ఏకాకిగా, ఏకాంతంలో అటూయిటూ తిరిగే వాడట. మానసిక సంస్కృతిలో ఒంటరిగా నడవడం అత్యంత శ్రేయో దాయకం. మనం ఏకాంతంగా కాకుండా ఎవరితోనైనా కలసిపోతు న్నప్పుడు ఏకాగ్రత లభించదు. ప్రక్కవారి భావాలు మన మనస్సులో ఆక్రమిస్తాయి. మన స్వంత ఉత్కృష్టలు, భావాలు అణగిపోతాయి.

మూడవది: ఆధ్యాత్మికదృష్ట్యా ఏకాకిగా నడుస్తునప్పుడు మనస్సు విభిన్నశక్తులను విషయవాసనలను నిర్జించి ఏకాగ్రత వహిస్తుంది. మనశ్శాంతికరమైన ఉన్నతభావం దానంతటదే వెలువడుతుంది. అప్పుడు నీ శరీరమంతా దివ్యశక్తితో ప్రదీపిస్తుంది.

'నేను ఆనందస్వరూపుడను' అని నీకు నీవు బోధించుకో. "నేనే పరంజ్యోతిని !" అనే భావమును సుస్థిరంగా నీలో నాటుకోవడమే మహోత్తరశక్తులు దీపించాలంటే చేయదగినపని. వెన్నెలలో ఏకాంత సంచారంగానీ, ఉషఃకాల ఏకాంతసంచారంగానీ వర్ణనకు మించిన శ్రేయస్సును కలుగజేస్తాయి. ఉదయ సూర్యాభిముఖంగాగానీ, అస్త మయ సూర్యాభి ముఖంగాగానీ సంచారంచెయ్యి. నదీకూల రమణీయ స్థలాలలో సంచారంచెయ్యి. మలయానిల ప్రసారంజరిగే ప్రదేశాలలో సంచరించు. ప్రకృతితన్మయత నీకు లభిస్తుంది. జగత్తుతో శ్రుతిగలు స్తుంది. బ్రహ్మైక్యత కలుగుతుంది.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

ఓం

# అంతర్ముఖత వదలకు

(కాజిల్ స్ప్రింగ్సులో 1903 జూన్ 9 వ తేదీ ఇచ్చిన ఉపన్యాసం)

ఇక్కడి ప్రజలకు భోజనసమయంలో మాట్లాడుకోవడం అలవాటు. భారతవర్షంలో ఈ విధానం వేరు. భారతవర్షంలో భోజన సమయంలో మాట్లాడకూడదు. భోజనంకూడా భారతీయులకు మత కర్మే. భోజనకర్మనుకూడా భారతప్రజలు పవిత్రకర్మగా పరిగణిస్తారు. నీవు తినే ప్రతి అన్నకబళమూ ఈ బాహ్యప్రపంచమునకు ప్రత్యామ్నాయంగా పరిగణించి, ఈ సమస్త జగన్మండలమును నాలో లీనం చేసుకుంటున్నాను, అని నీవు సంభావించాలె. ఇది హైందవుల పథం. వారు భోజనసమయంలో ఈ భావమును సుస్థిరంగా మనస్సులో భావిస్తూ, ఈ సమస్తప్రపంచం నాలో లయమవుతున్నదని మానసికంగా దివ్యానుభూతి పొందుతూ ఓంకారమంత్రోచ్చారణ చేస్తారు. ఓం! ఓం!! సమస్తజగం నాలో ఉన్నది. ఈ సమస్తప్రపంచం నా శరీరం. ఇట్టి సంభావనతో కూడిన ప్రతికబళభక్షణతో భారతీయులు ఆధ్యాత్మిక బలోపేతులౌతారు. ఆధ్యాత్మికబలమూ, శారీరకబలమూ ఈ విధంగా రెండూ ఏకమవుతున్నాయి. ఈ సమస్తప్రపంచం నా రక్తమాంసమే. నా శరీరమే. అన్నం సమస్త ప్రపంచంయొక్క ప్రత్యామ్నాయం. నా స్వశరీరం. ఇట్టి దృష్టి హైందవ మానసములకు మొదటి నుంచి సుపరిచితం. అందుచేత ఇట్టి ఉన్నత భావాలు సహజంగా వారి హృదయాలలో రేగుతుంటాయి. ఇట్టి అనుభూతులు ఇట్టి పరవశ ప్రకృతి, ఇట్టి సంకల్పశక్తి సుస్థిరమై తత్క్షణం వారికి సాక్షాత్కార ప్రాప్తి కలిగిస్తుంది. పశుకర్మగా పరిగణించబడే భోజనకార్యం సాక్షాత్కార సాధనగా చేసికోబడింది.

స్నానసమయంలో, భారతీయులు ఉదక సంబంధమైన మంత్రం పఠిస్తారు. జలం ఘనావస్థలో నున్న భూమియొక్క సాగరరూపమే. వివస్త్రులమై మనం నీటిలో మునిగినప్పుడు, శరీరం జలైక్యమౌతున్నది. శరీరములోని ప్రతి రోమకూపములో జలం మిళిత మౌతున్నది. మనం

ప్రకృతితో ఐక్యత పొందుతున్నాము. జలచరాలతో అనుసంధానం పొందుతున్నాము. సర్వజగజ్జలంతో మనకు గల సహోదర బాంధవ్యమును పొందుతున్నాము. ఇట్టిభావంతో చేసే స్నానంచేత- శరీరపు పై మురికి పోవడమేకాక, హృదయ కాలుష్యంకూడా క్షాళిత మవుతున్నది. సమస్తజగత్తు నా ఆహారం. సమస్తవాయువును నేను ఆస్వాదిస్తున్నాను. నాకూ, ఈ సమస్త జగత్తుకు భేదం లేదు. ఈ ప్రకారం ప్రతికర్మ నీ జీవితంలోని అడుగడుగూ వేదాంత దృష్టితో, భగవత్కార్మగా, మతాచరణగా పరివర్తనం చేయవచ్చు. వ్యాధులనుకూడా మనం దైవీకరించవచ్చు.

భారతదేశంలో స్ఫోటకంపోసినప్పుడు, అమ్మవారుపోసిందంటారు. ఈ వ్యాధి వచ్చినప్పుడు ప్రజలు ఆందోళనపడరు. గందరగోళపడరు. పైగా సంతోషంగానే ఉంటారు! ఇది ఆశ్చర్యకరంగాలేదా? రకరకాల వాద్య విశేషాలతో మహోత్సవంచేస్తారు. ఆ యింటిలోని వాండ్లందరూ దైవశక్తిని ఆరాధిస్తారు. విచారపడరు. ఆందోళన పడరు. రోగికి నయమయిన తరువాత భగవచ్ఛక్తిని కొలుస్తారు. దాన ధర్మాలతో మేళతాళాలతో రకరకాల వాద్యాలతో పెద్దసంబరం చేస్తారు ప్రకృతిగతమైన భగవచ్ఛక్తికి, తమ కృతజ్ఞతా ప్రేమలను వేయివిధాల వెల్లడిస్తారు... నేడు సామాన్య ప్రజానీకం, ఈ కర్మకలాపాల ఆంతర్యమును కోలుపోయినారు. ప్రజలు వీటిని అర్థంచేసుకున్నా, చేసుకోకపోయినా రాముడు వీటి అర్థమును గ్రహించి, వీటి ఆంతర్యమును అవగాహనచేసికొని సర్వమోపయోగంలో పెట్టుకుంటాడు.

రాముడు, మీా అందరికీ ఒకసలహా చెపుతున్నాడు. ప్రతిదినం తెల్లవారుజామున లే. పచారుచేస్తున్నా, లేక ఏ పనిచేస్తున్నా, మనస్సును ఆత్మయందు నిలుపు. అంతర్ముఖతను వదలకు. నిరంతరం బహిర్ముఖత వదలి మనస్సును అంతర్ముఖంచెయ్యి. మనస్సును బహిర్ముఖం చెయ్యవాకు. చేపలు, సముద్రజలంలో జీవించినట్లు, పక్షులు వాయుమండలంలో చరించినట్లు నీవు జ్ఞాన తేజోమండలంలో జీవించు. జ్ఞానంలో జీవించు. జ్ఞానంలో సంచరించు. జ్ఞానస్వరూపుడవై జీవించు. విజ్ఞానశాస్త్రరీత్యా, చీకటిగా ఉన్నప్పుడుసైతం వెలుతురుఉన్నది.

అంతర్జ్యోతి నిరంతరం ప్రకాశిస్తున్నది. గాఢనిద్రావస్థలోకూడ ఆత్మ జ్యోతి ప్రకాశిస్తున్నది. ధ్యాననిష్ఠ కుదరడానికి మహోన్నతదైవ సాక్షాత్కార శిఖరాలకు అధిగమించడానికి ప్రారంభకులు తేజస్సుతో ఏకీభావం పొందడం అత్యవసరం.

రోమన్ కాథలిక్కులు వెలుగులు ఒక భౌతికపదార్థంగా ఆరాధించినట్లు మే మారాధించము. హైందవజ్ఞాననిధులైన వేద శాస్త్రములు ఆత్మసాక్షాత్కారమునకు నీవు పరంజ్యోతిని నిరంతరం ధ్యానంచేయడం అత్యవసరమని ఉద్ఘోషిస్తున్నాయి. ఓంకారోచ్చారణ చేస్తూ నేను పరంజ్యోతిని. సత్యప్రకాశమును - అని ధ్యానం చెయ్యి. నీవు పరంజ్యోతివి. హైందవవేదవాఙ్మయంలో అత్యంతసశాస్త్రీయంగా నిరూపితమైన ఈ భావమును సమస్తప్రవక్తలు ఎప్పుడో ఒకప్పుడైనా వ్యక్తీకరించారు. క్రీస్తు "నేనే ప్రపంచజ్యోతిని" అని నిర్వచించాడు. మహమ్మదు సమస్తమహాత్ములూ ఇలాగే నిర్వచించారు. వెలుగువలె నీవు సమస్తవిశ్వంలో పరివ్యాప్తమై యున్నావు. మానవు డిట్టి దివ్య భావాలను హృదయంలో సుస్థిరంచేసుకోవాలె. ఇట్టి దివ్యభావధ్యానం చేత నీవు నిరంతరం భగవదైక్య మాధుర్యమును అనుభవించగలవు. ఈ విధంగా హైందవుని జీవితంలోని అడుగడుగూ పునీతమై దైవ పథంలో దైవశృతిలో అనుగమిస్తుంది.

మనకు యిష్టంగానీ, కాకపోనీ ప్రకృతిశక్తులన్నీ మానవునికి ఆత్మ సాక్షాత్కారప్రాప్తి కలిగించడానికే బద్ధమైయున్నాయి. అనుకూలపరిస్థితులుగానీ, అననుకూలపరిస్థితులుగానీ రెండూ ఒకటే. మనం నడుస్తున్నప్పుడు ఒక అడుగుపైకివేసి, ఒక అడుగుక్రిందికివేస్తున్నట్లు ఈ కష్టసుఖాలు ఒకదాన్ని మరొకటి అనుగమిస్తున్నై. ఈ జగతి నడతలో మనకు ప్రదర్శితమవుతున్న సత్యవిషయమిది. ప్రాపంచిక సుఖదుఃఖాలకు అతీతులైన మానవులే నిజమయిన ఆనందంకలవారు. సుఖదుఃఖములను రెండిటినీ అతిక్రమించాలె. అప్పుడు నిజమయిన ఆనందంకలుగుతుంది. సుఖానికి స్వాగతమివ్వడమంటే దుఃఖమును ఆహ్వానించడమే. సుఖదుఃఖాతీతుడైన మానవునికి సుఖదుఃఖాలు రెండూ సమానమే. అతడు రెండిటినీసమదృష్టితో అవలోకిస్తాడు. ప్రతి

సుఖంలో ఒక దుఃఖంగర్భితమైయున్నది. ప్రతిదుఃఖంలో ఒక సుఖంగర్భితమైయున్నది. ఎవడైతే ఈ సుఖములను ఆశిస్తాడో అతడు దుఃఖముల కూడా స్వీకరించాలె. ఈసుఖదుఃఖాలు విడదీయరానివి సుఖదుఃఖాలకు అతీతుడుగావడమే సత్యానందమునకు మార్గం. నిరంతరం ఆత్మానందమగ్నుడవుగా. సుఖదుఃఖ సమదృష్టిగల మానవుడే స్వతంత్రుడు. నిరంతరం సత్యాత్మలో జీవించు. ఇంక ఏదీ నీ ఆనందమును భంగం చేయలేదు. ముక్తపురుషునకు సమస్తప్రకృతి ఆతిథ్యమిస్తుంది. అట్టి బ్రహ్మవేత్తకు సమస్తజగము మోకరిల్లుతుంది. అహంబ్రహ్మాఽస్మి సోహం!-ఇట్టి అనుభూతిపొందు. నీవు విముక్తుడవుకాగలవు. ఈనాడు ఈ విషయం అభినందింపబడినా, పడకపోయినా ఇది అచంచలసత్యమై నిలువగలదు. నేను కాకపోతే రేపైనాసరే సమస్తమానవులు ఈ సత్యమును గుర్తింపక తప్పదు. ''సోహం''-మంత్రసంస్మరణ, ఓంకారోచ్చారణ మీరు సత్యనిష్ఠులు కావడానికే. కారణత్వరంగంలోనికి దిగజారడమే మహాపతనానికి దారితీస్తుంది. ప్రపంచదృశ్యకారణాలకు చలితుడైన తత్‌క్షణమందే పతనం సంప్రాప్తిస్తుంది. శిశువు కారణత్వమునకు అతీతుడుగా ఉంటాడు. అతనికి సమస్తమూ ఆనందమయమే. అతనికి కారణం అక్కరలేదు. అతడు విశ్వాసపూర్ణుడు. అందుకనే శిశువంత మహోత్సానందాలలో తేలిపోతుంటాడు. శిశువు కార్యకారణత్వములకు అతీతుడు. కార్యకారణరంగంలోకి దిగక బ్రహ్మాత్మాకాశంలోకి నీ వధిగమించవలసియున్నది. ఈ దృశ్యజగత్తుకు నేను సాక్షీమాత్రుడను. నాకు దీనితో సంబంధం లేనేలేదు. నిరంతరం నేను ఈ దృశ్యజగత్తుకు అతీతుడనై యున్నాను. ఈ జగద్దృశ్యాలన్నీ కేవలం ఒక సంగీతంలోని ప్రకంపనాలుమాత్రమే. చక్రముయొక్క-పరిభ్రమణక్రమంమాత్రమే. అడుగు క్రిందబెట్టి పైకితిరిగి ఎత్తుచు గమించడంలాంటిదిమాత్రమే. నిన్ను కార్యకారణత్వముల నధిగమింప జేయడమే జీవితాశయం. దీనికి నిరంతరసాధన అవసరం. నీలోని బ్రహ్మతేజంలో జీవించు. నీవు విముక్తుడవై, స్వయంప్రభువై, సమస్తవిశ్వంభరుడవై ప్రకాశిస్తావు.

ఓమ్! ఓమ్!! ఓమ్!!!

ఓం

# సాక్షాత్కారసాధనాలు - ప్రాణాయామం

(1903 మార్చి 8 న ఇచ్చిన ఉపన్యాసం)

నేడు రాముడు కొన్నివిషయములను గురించి ప్రసంగిస్తాడు. రాముని పూర్వోపన్యాసములను వినినవారి కీ విషయాలు మహోప కారం చేస్తాయి. మనం మొదట ప్రాణాయామమును తీసికుందాము. ప్రాణాయామ మంటే శబ్దార్థం 'ప్రాణనిగ్రహత' అని. హైందవ యోగ గ్రంథాలు ప్రాణనియమమునకు ఎనిమిది ప్రధానవిధానాలు చూపిం చాయి. కాని రాముడు మీాకు ప్రాణనియమమునకు ఒక అతిముఖ్య విధానమైన ప్రాణయామ మనే సాధననుగూర్చి ప్రసంగిస్తాడు. ప్రాణ మును నియమించడంచేత ఏమి ప్రయోజన మని మీారడగవచ్చు. రాముడు ఈ సమాధానం మాత్రమే చెపుతున్నాడు, 'ఈ ప్రాణా యామసాధన నేర్చుకోండి అనుభవంలో పెట్టండి. మీా స్వానుభవమే దీని మహోపయోగమును నిరూపిస్తుంది." మీాకు నిరుత్సాహం పుట్టి నప్పుడు, మాంద్యంగా ఉన్నప్పుడు, విచారంగా వున్నప్పుడు, మనస్సు వికలతగా ఉన్నప్పుడు రాముడు చెప్ప నున్న ఈ ప్రాణయామం చెయ్యండి. తత్క్షణమే మీారు స్వస్థులౌతారు. ఈ రకమైన శ్వాసా నియమ సాధనయొక్క సద్యఃకాలప్రయోజనమును మీారు కనుగొన గలరు. ఏదైనా విషయమునుగూర్చి మీారు వ్రాద్దా మనుకుంటారు. కానీ, ఏకాగ్రత కుదరదు. రచన సాగదు. అప్పుడు ఈ ప్రాణాయామ సాధన చేయండి. వెంటనే శక్తి నీలో ఉద్దీపిస్తుంది. సర్వం కుదుట పడు తుంది. ఇవీ ప్రాణాయామ ప్రయోజనాలు. ఈ ప్రాణాయామము చేత అనేక శారీరక వ్యాధులు నివారణ మవుతాయి. కడుపునొప్పి, హృద యబాధ, తలనొప్పి ఈ ప్రాణాయామంచేత నయమవుతాయి. అయితే ఆ ప్రాణాయామంచేయుట మెలా ? ఈ దేశంలో ప్రాణనియ మానికి ఏ వేవో పంథా లున్నాయి. కానీ రాముడు మీాకు కాలపరీక్ష నెగ్గిన ఒక సాధనాక్రమమును విశదీకరించనున్నాడు. భారతవర్షంలో అతి ప్రాచీన కాలమునుండి నేటివరకు ఈ సాధన ఆచరణలో ఉన్నది. అతి

ప్రాచీనకాలమునుంచి నేటివరకు ఈ సాధనచేసే వ్యక్తులు మహోత్తమ ప్రయోజనమును పొందిన విషయం నిర్వివాదసత్యం.

ఈ ప్రాణాయామసాధనకు నీవు సుఖాసనా సీనుడవుకావాలి. దీనికి పద్మాసనం మంచిది. పాశ్చాత్య భారతీయుల కీ ఆసనం ప్రాణాంతకం. మీరు ఏదైనా ఈజీచైయిర్ లో కూర్చోవచ్చు. నీ శరీరమును నిట్రనిలువుగా ఉంచు. వెన్నెముకను నిలువుగ సరిగ నిలబెట్టు. తలను పైకి నెత్తి నిలుపు. వక్షస్థలమును ముందుకు విరిచి నిలుపు, చూపులను అభిముఖంగా నిలుపుము. కుడిచేతి బొటనవ్రేలిని కుడినాశికపైన ఉంచి, ఎడమ నాశికతో నెమ్మదిగా గాలి లోనికి పీల్చు. నెమ్మదిగా అలాగే పీల్చు. నీవు ఎంతవరకు పీల్చగలవో ఎంతదనుక నీకు కష్టంగా ఉండదో అంతదనుక నెమ్మదిగ గాలి పీల్చు గాలి పీల్చేటప్పుడు మనస్సును ఖాళీగా ఉంచవాకు. గాలిని పీల్చేటప్పుడు సర్వశక్తిమంతమైన, సర్వజ్ఞత్వమైన సర్వవ్యాప్తమైన పరబ్రహ్మత్వమును లోనికి పీలుస్తున్నాను. నేను దివ్యత్వమును ఆస్వాదిస్తున్నాను. బ్రహ్మత్వమును పానం చేస్తున్నాను. సమస్తజగత్తును నాలో లీనంచేసుకొంటున్నాను - అనే భావనమీద మనస్సును ఏకాగ్రపఱచు. నీ శక్తికొలది బాగా లోనికి గాలి పీల్చినతర్వాత దేనితో గాలి పీలుస్తున్నావో, ఆ యెడను నాశికను వ్రేలితో మూసివెయ్యి. రెండు నాశికలను మూసినతర్వాత, గాలి నోటిగుండా బైటికిపోకుండ చూడు. పీల్చినగాలిని నీలో నీశ్వాసకోశాలలో, నీ గర్భకోశంలో, పొత్తికడుపులో బాగా నింపివెయ్యి. నీవు పీల్చిన గాలిచేత సమస్తకోశములూ నింపబడినతర్వాత మనస్సును ఖాళీగా ఉంచవద్దు. నేను పరబ్రహ్మను. సమస్తపదార్థములయందు సమస్తజగత్తులో అణువణువునా నిండి పరివ్యాప్తమైయున్న సర్వశక్తి ప్రతిభావంతుడైన భగవంతుడను నేను అనే సత్యభావమునందు మనస్సును ఏకాగ్రపరచు. బ్రహ్మైక్య సంభావనచెయ్యి. ఈ భావానుభూతికై నీ సర్వశక్తులను వినియోగించు. నీ బ్రహ్మత్వదివ్యానుభవమునకై నీ సర్వబలమును వినియోగించు. నీ శరీరంలో వాయువు నిండిన విధంగా, సమస్త జగత్పూర్ణమైన దివ్యశక్తిని నీ వని, పరమసత్యమవు నీవని సంభావించు. తెలుసుకో ఈ దివ్యానుభూతి పొందు. ఆ పరమసత్య

మును నీవు ధ్యానముచేయాలనుకుంటావు. కానీ నీ వింక ఎక్కువ సేపు ఊపిరి బిగబట్టలేవనుకో అప్పుడు ఎడమముక్కు మూసి, కుడి ముక్కు తెరచి ఈ కుడిముక్కుగుండా నెమ్మదిగా క్రమక్రమంగా ఊపిరివదలిపెట్టు. ఊపిరి విడిచేసమయంలో మనస్సును ఖాళీగా ఉంచవాకు. గాలి బైటకుపోతున్నమాదిరి నీ లోపలఉన్న సమస్తకల్మషం, సమస్త అజ్ఞానం బైటికి తరుమగొట్టబడుతున్నదని నీలోనుంచిబహిష్కరింపబడుతున్నది. పరిత్యజింపబడుతున్నదని మనస్సును సంభావించనియ్యి. సమస్తదుర్బలత నశించింది. ఇంక నాలో అజ్ఞానంలేదు. భయంలేదు. ఆందోళనలేదు. దుఃఖంలేదు. విచారంలేదు. బాధలు లేవు. సమస్తమైన అజ్ఞానం నాలోనుంచి పారిపోయింది అని సంభావించు. ఇట్టిభావనతో నీకు చేతనైనంతవరకు, నీకు అనుకూలమయినంతవరకు గాలిని విడిచిపెట్టు. తరువాత రెండుముక్కులూ తెరచియే వెలుపలిగాలిని లోపలికి పీలువకుండా ఆపివెయ్యి. ముక్కునుండి చేతిని తీసివెయ్యి. కొంతసేపు ఆవిధంగా గాలిని లోనికిరానియ్యవాకు. నీ చేతనైనంతవరకు ఆ విధంగాఉండు. నీ వీరకంగా నాశికలద్వారా గాలి శ్వాసకోశాలలోనికి ప్రవేశింపకుండా నిలిపినప్పుడు మనస్సును దాని పరిపూర్ణ శక్తితో "నేను అనంతపరబ్రహ్మాను" - అనే భావనలో ఏకాగ్రపరచు. ఇట్టి సత్యసాక్షాత్కారమునకు మనస్సును శక్తికొలది సంపూర్ణంగా మగ్నంచెయ్యి. సర్వకాలమూ సర్వస్థలమూ నాచేత సంభావితం. నా సత్యాత్మ స్థల కాల నిమిత్తాతీతమయినది. నా స్వస్వరూపమయిన పరబ్రహ్మాత్మ దేశ కాల నిమిత్తాదులకు, సర్వ ప్రపంచానికి అతీతమయినది. అవాఙ్మానసగోచరమయినది. సమస్తాతీతమయినది. నా ఆత్మ దేనివల్ల పరిమితిమైలేదు. సమస్తము దానిచేత ఆవృతమయియున్నది. నేను సర్వవ్యాపక పరబ్రహ్మాను అని గాఢ సంభావనచెయ్యి. ఏతద్దివ్యానుభూతిపొందు.

ఇప్పుడు మీకు చెప్పినంతవరకు ఈ ప్రాణాయామంలో శారీరకమయిన మానసికమయిన నాలుగు సాధనాలున్నాయి. మొదటిపని గాలినిపీల్చడం. గాలిపీల్చడం శారీరకసాధన. దీనితోగూడిన ధ్యానం నేను పరబ్రహ్మాను, నేను బ్రహ్మాత్మమును అని ఏకాగ్రధ్యానంచేయడం

మానసికసాధన. తరువాత శ్వాసకోశములలో గాలిని స్తంభనచేసి నప్పుడు దీనితో యింకొకసాధనకూడ కలిసియున్నది. నేను సమస్త జగమునందు నిండియున్నాను - అనే ధ్యానం మానసికకర్మ. ఇక మూడవసాధనలో నీ కుడిముక్కుద్వారా గాలి వదలుతూ, మానసిక ధ్యానంతో సమస్తకల్మషమును వెలికిద్రోలుతున్నావు. ఇక నాలగవ సాధన వెలుపలిగాలిని లోనికిరాకుండానిలుపడం. దీనితోపాటు సమస్త బలహీనతలను, సమస్తవ్యామోహాలను సమస్తవిషయవాసనలను పార ద్రోలి వాటి కతీతుడవై బ్రహ్మాత్వమునందు సుస్థిరుడవుగానిలవడము. ఈ నాల్గవసాధనలో ఈ ప్రకారం ప్రాణాయామంయొక్క ప్రథమభాగం చాలవరకు పూర్తి అయింది. ఒక భాగం పూర్తి అయింది. ఈనాల్గవ సాధనచేసిన తరువాత నీవు కొంచెం విశ్రాంతి తీసుకోవచ్చు. తరువాత మామూలుప్రకారం గాలిని నీ రెండునాశికలగుండా స్వేచ్ఛగా పీల్చు. దూరం నడిచినప్పుడు నీ వెలా ఉచ్ఛ్వాస నిశ్వాసలుచేస్తావో ఆ ప్రకారం శీఘ్రంగాగాలిపీల్చు. వదలు. అతివేగంగాచేసే ఈ సహజో చ్ఛ్వాసనిశ్వాసాక్రమం ప్రాణాయామమే. ఇది సహజప్రాణాయామం. ఈ ప్రకారం విశ్రాంతి తీసుకున్నతరువాత ఈ ప్రకారం శ్వాసకోశము లను ఉచ్ఛ్వాసనిశ్వాసములను చేయనిచ్చినతరువాత, తిరిగి ప్రాణా యామం ప్రారంభించు. ఇప్పుడు ఎడమముక్కుతోగాదు; కుడి ముక్కుతోచేయాలి. మానసికసాధన వెనుకటిలాగే. ముక్కురంధ్రమే మార్చవలసింది. కుడినాశికనుంచి గాలిపీల్చవలసినది. గాలిపీల్చేటప్పుడు "నేను బ్రహ్మాత్వమును పీలుస్తున్నాను" అని సంభావించు. నీ శక్తి కొలది నీచేతనైనంతవరకు గాలిపీల్చిన తరువాత, గాలిని నీలో కుంభకముచేయి. గాలిని నీలోకుంభించి నేనే సమస్తజగత్తుయొక్క ప్రాణమును, నేనే జగజ్జీవమును. నే నీసమస్తజగత్తును నిండి యున్నాను. ఈ విశాలప్రపంచము నాచేతనే సజీవమైయున్నది అని ధ్యానంచెయ్యి. తరువాత ఎడమముక్కుద్వారా గాలిని వెలికివదలు. ప్రాణాయామ ప్రథమభాగంలో ఏ ముక్కుగుండా నీవు గాలిపీల్చావో ఆ ముక్కుగుండా గాలి వెలికివదలు. గాలివదలుతూ, సూర్యుడు చీకటినీ, మంచుతెరలనూ, చలినీ పారద్రోలినమాదిరి నీవు సమస్త దౌర్బల్యమును, అజ్ఞానమును నీ మనస్సునుండి పారద్రోలినట్లు

సంభావించు. అజ్ఞానమనే చీకటి, మంచు వీలిపోయింది. తదుపరిగాలిని ముక్కులోనికి రానివ్వకుండా వెలుపలనే నిలుపు. ఈ రకంగా క్రమ క్రమంగా ఈ ప్రతిసాధనాంగమునకు కాలవ్యవధిని శక్తికొలది పెంచు. ఈ ప్రాణాయామంలో ఎనిమిది సాధనాంగాలు మన మిప్పుడు తెలుసుకున్నాము. మొదటి నాలుగు సాధనాంగములు ప్రాణాయామప్రథమ భాగం. చివరి నాలుగు సాధనాంగములు ప్రాణాయామ ద్వితీయ భాగం. ఈ ప్రతి సాధనాంగమును నీకెంత దీర్ఘకాలం చేతనైతే అంత కాలం, నీ కెంతవరకు చేతనవుతుందో అంతవరకు క్రమక్రమంగా దీర్ఘం చెయ్యడానికి యత్నించు. ఈ సాధనలో పరస్పరానుగుణమయిన సంచలనం ఉన్నది. పెండ్యులం సంచలనద్వయంతో కూడియున్న మాదిరి, నీ శ్వాసను పెండ్యులంలాగా చేయాలె. సమశృతితో కూడిన సంచలనంతో నీ శ్వాస నడవాలె. ఈ ప్రాణాయామసాధనచేత అపార శక్తి కలుగుతుందని నీ అనుభవంద్వారా నీవు తెలుసుకోగలవు. ఈ ప్రాణాయామంచేత అనేకరోగాలు నివారణకాగలవు. క్షయ, గర్భ రోగాలు, రక్తవ్యాధులు దీనిచేత నివృత్తి కాగలవు. ఈ రోగాలే కాదు, చాలావరకు సమస్తవ్యాధులు నివారణకాగల వని చెప్పవచ్చు. సాధన చేసి చూడండి.

ప్రాణాయామం చేయడంచేత అనేకమంది రోగగ్రస్థులు కావడం రాముడు చూచాడు. కారణం సహజమయిన సాధన చేయకపోవడమే. జబ్బుపడేటంత దీర్ఘకాలం ఈ ఉచ్ఛ్వాసనిశ్వాస వ్యాయామం ప్రారంభంలోనే చేస్తారు. సహజపద్ధతిలో ఈ వ్యాయామం చెయ్యి. నీ శక్తికొలది ఈ సాధనను దీర్ఘంచేయడానికి క్రమంగా ప్రయత్నించు. కానీ మితిమించి అలసట పడవాకు. బలవంతమున పరిశ్రమించవాకు. మొదటి సాధనలైన గాలి పీల్చడం, ఆ గాలిని శ్వాసకోశములలో నిలవడం అనే ఈ రెండుపనులు చేసినతర్వాత అలసటగాఉంటే చాలు, ఆపివేసెయ్యి. బలవంతం వద్దు. ఆపివేసెయ్యి. మరునాడు ఎక్కువ సావధానత వహించు. మొదటిసాధనగానీ, రెండవసాధనగానీ చేసేటప్పుడు మిగతా సాధనలు చెయ్యడానికి నీవు తగియుండేలాగు నీశక్తిసామర్థ్యాలనుకూడ తీసుకో. వివేకము కలిగియుండు.

ప్రాణమును నియమించడానికి అనుకూలమార్గ మిదే. ఇది ఒక రకమయిన శారీరక వ్యాయామం. కానీ ప్రాణాయామంలో ఇంకేదో నిగూఢత ఉన్నది. దానిలో ఏదో దైవికమయిన అర్థంఉన్నది అని తలపడం భ్రమ. ఈ ప్రాణాయామంలో మహోన్నత సాక్షాత్కారం కలుగుతుంది అనీ, ఇంతకంటె గొప్పదిలేదని తలవడం కేవలం పొరపాటు. ప్రాణాయామ సాధనలో ఏ లోకాతీతవిషయమూ లేదు. ప్రాణాయామం ఒక సామాన్య వ్యాయామంమాత్రమే. నీవు బహిరంగ స్థలమునకు వెళ్ళి శరీరవ్యాయామం చేసినట్లు ఇదికూడా ఒక విధమైన శ్వాసకోశవ్యాయామం. ఇందులో పెద్ద పారమార్థికరహస్య మేమీ లేదు.

ఈ ప్రాణాయామమునకు సంబంధించి మరొక్క విషయం చెప్ప వలసియున్నది. నీవు గాలి లోపలికి పీల్చేటప్పుడుగానీ, వెలుపలికి వదిలే టప్పుడుగానీ నీ పొత్తికడుపును, నీ శరీరముయొక్క అధోభాగమును లోనికి బిగబట్టు. దీనివల్ల నీకు మంచి ఉపయోగంకలుగుతుంది. నీవు గాలి పీల్చేటప్పుడు, వదలేటప్పుడు గాలి నీగర్భకోశంలో నిండిపోనివ్వు. గాలి హృదయమువరకేపోయి ఆగకూడదు. ఇంకా లోతుకుప్రవేశించాలె. ఇంకా క్రిందికివ్యాపించాలె. నీ శరీరంలోని ప్రతికోశమూ నీ శరీరం లోని పై భాగమంతా వాయువుతో పూరితంకావాలె. ఇది ప్రాణా యామానికి దోహదమవుతుంది. వైరాంతికవిధానాలలో మనస్సులను ధ్యానాయత్తంచేయతలచినవారికి, ఈ ప్రాణాయామం అద్భుతమైన సహాయం చేస్తుంది. ఓంకారోచ్చారణ చేయడానికిముందు, లేక వేదాంతవాఙ్మయంలో చదువబడిన ఏ విధానంలోనైనా సరే మనస్సును ఏకాగ్రపరుపబోయేముందు, ఈ ప్రాణాయామసాధన మహోపకారంచేస్తుంది.

ఇప్పుడు రాముడు మనస్సును నిగ్రహించే ఒక విధానమును మీకు చెప్పుతున్నాడు. ఈ పత్రమును మీరిప్పుడు చదువ నవసరం లేదు. దానిని ఎలా పఠించాలనో రాముడు మీకు విశదీకరిస్తాడు. రాముని ఉపన్యాసాలను నిత్యశ్రవణం చేసేవారికే ఈ విషయం అర్థ మవుతుంది. రాముని ఉపన్యాసాలకు రానివారికి విషయాలు అంత

ఆప్యాయంగా ఉండవు. ఇందులోని మంచిని వారు గ్రహించలేరు. అయినా పఠించడంచేత కొంతమంచి కలుగవచ్చు. అలాంటివారు తమ స్వంతప్రార్థనలందు ఈ విధానమును అన్వయించుకోగలరు. వారికీ పత్రాలు అవసరంలేదు. విధానమును తెలుసుకొని తమ స్వప్రార్థనలందు ఈ పథమును ఉపయోగించవచ్చు. ఈటైపు గొట్టబడిన పత్రములు మీకు ఏ విధముగానైనా ఉపయోగకరములని తోచినట్లైతే, మీ స్వోపయోగానికి వీటిని ముద్రణ చేయించుకోవచ్చు. ఇది ఒక ప్రార్థనావిధానం. భగవంతుని ఏదో యాచించే, భిక్షించే ప్రార్థనకాదీ ప్రార్థన. నీ బ్రహ్మత్వమును నీవు తెలుసుకో గలిగేటట్లు చేసే ప్రార్థన, యీ ప్రార్థన. మీలో చాలామంది రాముని "సాక్షాత్కారం" అనే ఎఱ్ఱటి గ్రంథమును చూచియుంటారను కుంటాను. ఆ గ్రంథములాంటిదే ఈ కరపత్రంకూడా. ఈ పత్రముయొక్క చివర సోహమును గూర్చిన విషయ మున్నది. ఈ పత్రమును నిరంతరం మీ జేబులలో ఉంచుకోండి. మీ జీవిత పరిస్థితులు ఎప్పుడైతే భావవంతంగా కనుపిస్తాయో, బాధ్యతాభారాలు, ఆందోళనలు కష్టనిష్ఠూరాలు నీ మనస్సులో ఎప్పుడైతే క్రమ్ముకుంటాయో ఈ కాగితం తీసుకొని ఏకాంతంలో కూర్చో. ఈరాత్రి రాముడు ప్రబోధించే విధానంగా ఈ పత్రమును పఠించు.

సుఖాసనమున కూర్చో. ప్రాణాయామం చేసేటప్పుడు కూర్చొమనిన విధంగానే కూర్చో. కనులు మూసికోవచ్చు. ప్రార్థనావిధానమున ప్రారంభించవచ్చు. లేదా అర్థనిమీలిత నేత్రుడవుగా! నీ అనుకూల విధానంలో కూర్చో.

'ఏక మేవాఽద్వితీయం బ్రహ్మ. ఒకే పరమసత్యం ఉన్నది. ఓం! ఓం!! ఓం!!!' ఈ వాక్యం పఠించి కాగితం అవతలపెట్టు. 'ఒకే పరమసత్యం ఉన్నది.' ఈ విషయం మీకు తెలుసు. కనీసం రాముని ప్రసంగాలయందు శ్రద్ధగలవారికైనా, ఇదేసత్యమని తెలుసు. ఇదేసత్యమని మీరు గ్రహించినప్పుడు, ఈ సత్యమును ధ్యానముచేయుండి. ఏకైక పరమసత్యంమాత్రమే ఉన్నది. అనుభూతి అనేభావముతో హృదయపూర్వకంగా పతిద్వాభావైక్యంపొంది 'ఏకైక పరమసత్యం

మాత్రమే యున్నది. ఓం! ఓం!! ఓం!!!' అని ఉచ్చరించు. ఇక్కడ చూడండి-'ఏకైక పరమసత్యంమాత్రమే ఉన్నది' అనే వాక్యానికి ఎదురుగా ఓం! ఓం!! ఓం!!! అని వ్రాయబడియున్నది. దీని అర్థమేమిటి? ఏకైక పరమసత్యం మాత్రమేయున్నది అనే భావంతో నీ హృదయం నిండిపోయినప్పుడు, నీ మనస్సీ భావంతో లీనమయినప్పుడు ఈ ఒకటి, రెండూ, మూడూ, నాలుగూ, ఐదుమాటలు పఠించేబదులు, ఈ వాక్యార్థమంతా నిక్షిప్తమయియున్న ఈ ఒక్క ఓంకారమును ఉచ్చరిస్తేచాలు, ఈ వాక్యార్థమంతా ఈ ఓంకృతిలో ఉన్నది. ఆ వాక్యమునకు ఈ ఓంకారం ప్రత్యామ్నాయం. ఆల్జీబ్రాలో పెద్ద పెద్ద సంఖ్యలను 'ఎక్స్' 'వై' 'ఎ' అని అక్షరరూపకంగా వ్యక్తీకరిస్తాము. అదేప్రకారం 'ఏకైక పరమసత్యంమాత్రమే యున్నది' అనే ఈ వాక్యమును పఠించేటప్పుడు, పరమపావనమయిన ఈ ఓంకారమును మహాద్భుత దైవశక్తిప్రపూర్ణమయిన ఈ ఓంకారమును ఉచ్చరించాలె. ఈ ఓంకారోచ్చారణ చేసేటప్పుడు ఏకైకపరమసత్యం మాత్రమే యున్నది అనే భావమును ధ్యానించు. సంభావించు. నోటితో ఓంకారోచ్చారణ చేస్తున్నప్పుడు ఏకైకపరమసత్యంమాత్రమే యున్నది అనే భావమును నీ యావద్హృదయంతో సంభావించవలసి యున్నది. ఈ 'ఏకైక పరమసత్యంమాత్రమే ఉన్నది' - అనేమాటలు ప్రస్తుతం మీకు అర్థరహితంగా కనుపించవచ్చు. రాముని ఉపన్యాసములు మీరు వినియున్నట్లయితే, ఏకైకపరమసత్యంమాత్రమేయున్నది అని మీరు తెలుసుకోగలరు. ఈ వాక్యం సుస్థిరమయిన అర్థం కలదని మీరు గ్రహించగలరు. ఈ వాక్యముయొక్క అర్థం ఇది: మన ఉత్సాహమును అణగద్రొక్కుచున్న, మన ఆనందమును వినాశనంచేస్తున్న, ఈ వివిధవైరుధ్యపూరితమయిన దృశ్యజగత్తంతా అసత్యం. పరబ్రహ్మ ఒక్కటిమాత్రమె సత్యం. ఈ పరిస్థితులన్నీ అసత్యం. ఇదీ అర్థం. పరమసత్యం ఒక్కటిమాత్రమేయున్నది. మనకు అవరోధములుగా కనపడుతున్న ఈ పరిస్థితులన్నీ అసత్యం. పరిశోధన చేసిచూడనివారు మాత్రమే తమ శక్తులను వృధాపుచ్చినవారుమాత్రమే ఈ సత్యము యొక్క ఏకైకత్వమును వ్యతిరేకిస్తారు. విజ్ఞానశాస్త్ర పరిశోధన శాలలలో ప్రయోగరూపకముగ తేల్చబడిన ఒకపరిశోధనవలె ఇది

అనుభవైకవేద్యమయిన విషయం. ఇది సుస్థిరమయినసత్యం. భగవంతు
నిలో నీ మనస్సును లయంచెయ్యి. బ్రహ్మత్వంలో నీ అహంకృతిని
లయంచెయ్యి. దీనివల్ల ఫలితం ఏమిటి? ఫలిత మిది (నజరత్‌లోని
క్రీస్తుయొక్క ఈ వచనాలు గ్రహించండి). ఆవగింజంత విశ్వాసం నీలో
ఉన్నట్లయితే, పర్వతమును రమ్మని ఆజ్ఞాపించు. అది నీచెంతకు నడిచి
వస్తుంది. ఆ పరమసత్యమును జీవించు. ఆ పరమసత్యమును సంభా
వించు. ఆ సత్యాత్మానుభూతిపొందు. నీ సమస్తపరిస్థితులు సమస్తమైన
మహోత్పాతములు సమస్తశోకాందోళనలు నిన్నెదుర్కొనే సమస్త
బాధాపిశాచాలు క్షణంలో అదృశ్యమైతీరాలె. భగవంతునిలోకంటే
బాహ్యాదృశ్యప్రపంచంలో మీరు ఎక్కువ విశ్వాసముంచుతున్నారు.
పరమసత్యమయిన భగవంతునికంటే ప్రపంచమే మీకు ఎక్కువసత్య
మయినదిగా కనుపిస్తున్నది. మీకు మీరు బాహ్యప్రాపంచక
వ్యామోహబద్ధులై సమస్త శోక వ్యాధిబాధాచక్రంలో తగుల్కొని
గింగిరాలు తిరుగుచున్నారు. విచారగ్రస్తులైనప్పుడు, నిరాశాపూర్ణు
లైనప్పుడు ఈ పత్రము తీసుకోండి. ఏకైకపరమసత్యంమాత్రమే ఉన్న
దని సంభావించండి. గ్రంథములద్వారా నీ వనేక సత్యాలు తెలుసు
కొనియుండవచ్చు. కానీ వాటన్నిటికంటే ఈ సత్యం, ఈ మహావాక్యం
మహోత్కృష్టమయింది. నిజమని నీవు నమ్మే సమస్తవిషయాలూ
కేవలం మాయ. పట్టి భ్రమ. ఇంద్రియాలభ్రమమాత్రమే. ఇంద్రియ
వంచితులు కాకండి. ఒకడువచ్చి నీలో తప్పుపడతాడు. ఇంకొకడువచ్చి
నిన్ను విమర్శిస్తాడు. మరొకడువచ్చి నిన్ను నిందిస్తాడు. వేరొకడువచ్చి
నిన్ను పొగడుతాడు. ఇవన్నీ నిజంకాదు. ఇవన్నీ సత్యంకాదు. సుస్థిర
సత్యమును మాత్రమే నీవుసంభావించాలె. ఈ దివ్యమంత్రోచ్చారణ
చేస్తూ, బాహ్యాదృశ్యజగత్తుమీద నీవు సృష్టించుకొన్న విశ్వాసమును
వెలికిపారద్రోలు. నీ శక్తిసామర్థ్యములన్నీ వినియోగించి, ఈసత్య
మును నీలో బలపరచు. "ఏకైకసత్యంమాత్రమే యున్నది" అని
సంభావించు. ధ్యానించు. "ఏకైకపరమసత్యంమాత్రమే యున్నది".
ఓం! ఓం!! ఓం!!! ఈభావమును ఒక్కసారి పఠించినమాత్రంచేత, తరచు
నీవు సమస్తశోకాశాంతులకు అతీతుడవై, ఆనందోత్సాహయుతుడవు
కాగలవు. ఈ వాక్యం తరువాతగల వాక్యాలుకూడా చదువాలని

సముత్సాహముంటే, తరువాతవాక్యాలుకూడా చదువవచ్చు. కాదా, నీ జేబులోదాచుకొన్న పత్రములోని ఒక్కవాక్యం ఆచరణలోపెడితే చాలు. ఇతోధికశక్తిదీపితుడవు కావాలంటే, తరువాతవాక్యంకూడా పఠించు. 'ఆ పరమసత్యం నేనే' అనే తరువాత వాక్యమునుపఠించు. ఈ వాక్యం నీ గమ్యమును సమీపతరంచేసింది. ఓహో! నా తోటి మానవుడూ, నేనూ వేరుగాదు. నేనే నా తోటిమానవునిలోకూడ ప్రకాశిస్తున్నాను. ఆ పరమసత్యం నేనే. ఓం! ఓం!! ఓం!!! చూడండి- కొందరు, ఓంకారోచ్చారణచేసేటప్పుడు, చేతులు ముడుచుకోవాలని ఈ రకంగా ఉండాలని, ఆ రకంగా ఉండాలని చెపుతారు. అలాంటి నిబంధనలు ఏమీ లేవు. భావానుభూతిమాత్రంపొందు. ధ్యాన సమయంలో ఏ ప్రత్యేకనిబంధనలకు శ్రమపడవలసిన అవసరంలేదు. ఏ నిబంధనలూ అవసరంలేదు. ఆ సత్యభావమును నీవు సంభావించే టప్పుడు ఆ భావమును నీలోకి ఆస్వాదించేటప్పుడు, శరీరమునుగురించి నీవు పట్టించుకోనవసరంలేదు. ప్రజాభిప్రాయాలకు నీవు లొంగనవసరం లేదు. గానంచేసుకోవాలని బుద్ధిపుడితే, హాయిగా కంఠమెత్తి గానం చెయ్యి. పండుకోవడం అనువుగాతోస్తే, హాయిగా నేలమీదపండుకొ పండుకొనే ధ్యానంచెయ్యి. చేతులు చప్పటలుచరుచుకోవాలనితోస్తే అలాగేచెయ్యి. శరీరనిబంధనలతో నీకంతగా పనిలేదు. భావధ్యానం చెయ్యి. ఇక సర్వశక్తిమయభావనను ధ్యానంచెయ్యవలె. ఉపన్యాస శ్రవణంచేస్తున్నవారికే యీ కరపత్రాలు పంచబడుతాయి. ఉపన్యాసాలకు రానివారికి బహుశః యీ కరపత్రం రుచించకపోవచ్చు. ఎవరైతే రామునిప్రసంగశ్రవణం చేస్తున్నారో, వారికి సత్యాత్మ సమస్త శక్తిమయం, పరమాత్మ సర్వశక్తిమయం అని తెలుసు. సూర్యునిచేత యావత్ప్రపంచ కర్మజరుగుతున్నమాదిరి ఆత్మచేతనే యావజ్జగత్కార్మ జరుగుతున్నది. సూర్యునిచేతనే గాలివీస్తున్నది. సూర్యునిచేతనే సస్యములు ఫలిస్తున్నాయి. సూర్యునిచేతనే నదులుప్రవహిస్తున్నాయి. సూర్యునిచేతనే మానవులు నిద్రాప్రబుద్ధు లవుతున్నారు. సూర్యుని చేతనే పుష్పములు వికసిస్తున్నాయి. అదేప్రకారం ఆత్మచేతనే సర్వశక్తివంతమయిన పరమాత్మచేతనే జగత్తులోని సర్వదృశ్య ప్రపంచం ఆవిర్భూతమవుతున్నది. సర్వశక్తిమయుడను నేను. "సర్వశక్తిమయు

-డను నేను” ఓం! ఓం!! ఓం!!! అని సంభావించు. ఇట్టిధ్యానంచేత నిన్ను బలహీనపరచి పీడించే సర్వసంశయాలు నిన్ను పిరికిపందనుచేసే సర్వ అజ్ఞత్వం నీ పవిత్రసాన్నిధ్యంలో నిలువడానికి తమ అధికారమును కోలుపోతాయి. నీవు సర్వశక్తిమయుడ వని దివ్యానుభూతిపొందు. ధ్యానించు. మతి ఎంతో గతి అంత. నేను పాపిని అనుకో, నీవు తప్పక పాపివౌతావు. నేను బుద్ధిహీనుడను అనుకో, తప్పక బుద్ధిహీనుడవు అయితీరుతావు. నేను బలహీనుడను అనుకో, నీకు బలముచేకూర్చే శక్తి యీ ప్రపంచంలో పుట్టనే పుట్టదు. సర్వశక్తిమయు పరబ్రహ్మాను ధ్యానించు, నీవు సర్వశక్తిమయ పరబ్రహ్మవై ప్రకాశిస్తావు.

తరువాత విషయం ‘సర్వజ్ఞత్వం’. ఈ భావమును తీసుకో. దీని మీాద మనస్సును ఏకాగ్రపరచు. ఓంకారగానంచెయ్యి. సర్వజ్ఞత్వము నకు ప్రత్యామ్నాయం ఓంకారం. ఇట్టి భావనతో ఓంకారమును స్మరించు. నేను ‘సర్వజ్ఞత్వమును’ ఓం! ఓం! ఇట్టి దివ్యభావములతో ధ్యానపథమున గమించు. మిమ్ములను వ్యామోహబద్ధులనుచేసి మూఢత్వకూపములందుత్రోసే అసత్యభావాలను పరిత్యజించండి. పరమగమ్యమైన బ్రహ్మత్వమునకు ఇదే రాజమార్గం.

‘సర్వ వ్యాపకత్వ’ భావనమును స్వీకరించండి. నేను పరిచ్ఛేద మయిన ఈ క్షుద్ర దేహామునుగాను. నేను జీవుడనుగాను. నే నీ అహం కృతినిగాను. పిపీలిక బ్రహ్మపర్యంతం పరివ్యాప్తమై ప్రకాశిస్తున్నది నా ఆత్మే. నా స్వస్వరూపం సర్వవ్యాపకమయిన పరమాత్మ - అని సంభావించు. ధ్యానించు. దృఢవిశ్వాస సంపన్నుడవుగా. మనస్సులో కించిత్ సంశయంకూడావలదు. నేను సర్వవ్యాపిని, సర్వవ్యాపిని, సర్వ వ్యాపిని, సర్వశరీరములునావే. ఓమ్! ఓమ్!! ఓమ్!!! అని ధ్యానంచెయ్యి.

మిగతా వాక్యములనుగూర్చి రాముడు విశదీకరించనవసరం లేదు. ఊరక ఒకసారిచదివి వినిపిస్తాను. ఈ మార్గమున సాధన చెయ్యండి. ఒక వారంలో మీారు బ్రహ్మజ్ఞానంపొందకపోతే, సత్య మును సందర్శించలేకపోతే రాముని ఉపదేశాలు అసత్యములని మీారు తృణీకరించవచ్చు.

"నేను సంపూర్ణ ఆరోగ్యమును." నాది అని పిలిచే యీ దేహం రోగగ్రస్థ మయినట్లయితే, దాని విషయం మథనపడవాకు. దానిని గురించి విచారించవాకు. నేనే ఆరోగ్యమును. పూర్ణమైన ఆరోగ్యం నాదే అని సంభావించు. శరీరం దానంతట అదే వెంటనే ఆరోగ్యం పొందుతుంది. ఇదీ రహస్యం. ప్రయత్నించిచూడు. నిజమో, అబద్ధమో నీకే తెలుస్తుంది. నిన్ను నీవు మరువు. శరీరం స్వస్థపడు తుంది. ఈ శరీరమును నీవు లక్ష్యపెట్టకూడదు. "ఓ భగవంతుడా! నా రోగం నయంచెయ్యి" అనే ఈ దేబరింపు వద్దు. వేదాలలో ఒక మనోజ్ఞమైన మంత్రం ఉన్నది. "నాయమాత్మా బలహీనేన లభ్యః." ఈ సత్యం దుర్బలులచేత పొందబడేదికాదు. ఒక మహారాజు దగ్గరకు పోయేటప్పుడు బిచ్చగాని వేషంతో పోతే మీరు తృణీకరింపబడరా? రాజసన్నిధిలో ప్రవేశానికి అవకాశముంటుందా? అదే ప్రకారం వాంఛాభైక్షుకస్థితిలో నీవు భగవంతుని ఆశ్రయించినట్లయితే, నీవు బహిష్కరింపబడుతావు. నేను ఆరోగ్యమును అని సంభావించు. ఏదీ వాంఛించవద్దు. నిష్కామహృదయుడవుగా! నేనే ఆరోగ్యమును అని సంభావించు. నీవు ఆరోగ్యశాలివి కాగలవు.

తరువాతభావం "నేనే సర్వశక్తిని." ఈ భావమును మనస్సులో పెట్టుకొని ఓంకార సంస్మరణం చెయ్యి. ఓమ్! ఓమ్! ఓమ్! అని ఉచ్చరిస్తూ 'సర్వశక్తి స్వరూపుడను నేను" అని సంభావించు.

తరువాతభావం – "సమస్తజగత్తూ నా భావం మాత్రమే.' ఈ మహావాక్యమును విశ్వసించు. ఈ వాక్యమును పఠించేటప్పుడు ఈ విషయమును నిరూపించే వేదాంతవాదములను స్మృతికితెచ్చుకో ఈ విషయమును నిరూపించడానికి నీకు తెలిసినదంతా స్మృతికి తెచ్చుకో "ఈ సమస్త ప్రపంచం నా భావనామాత్రమే" అనే విషయమును నిరూపించే వేదాంతసిద్ధాంతాలు నీకు తెలియకపోతే పోనీ. విశ్వసించు చాలు ఈ ప్రపంచమంతా నీ భావనామాత్రమే అని నీవు తెలుసుకో గలవు. ఈ ప్రపంచం నా భావన అని సంభావిస్తూ ఓంకార సంస్మరణ చెయ్యి. ఏతద్దివ్యానుభూతి పొందు. మిగతావాక్యాలన్నీ ఈ ప్రకారమే సంభావించు.

నేను సంపూర్ణానంద స్వరూపుడను. ఓం! ఓం!! ఓం!!!
నేను పరిపూర్ణ జ్ఞానస్వరూపుడను. ఓం! ఓం!! ఓం!!!
నేను పరిపూర్ణ సత్యస్వరూపుడను. ఓం! ఓం!! ఓం!!!
నేను పరిపూర్ణ తేజస్వరూపుడను. ఓం! ఓం!! ఓం!!!
నేను నిర్భయుడను! అభయుడను! ఓం! ఓం!! ఓం!!!
నాకు రాగము లేదు — విరోధము లేదు.
నేను సమస్త వాంఛా సఫలత్వమును! ఓం! ఓం!! ఓం!!!
నేను పరమాత్మను. ఓం! ఓం!! ఓం!!!
నేను సమస్త కర్ణములద్వారా !
వినుచున్నాను. ఓం! ఓం!! ఓం!!!
నేను సమస్త నేత్రములద్వారా
కనుచున్నాను— ఓం! ఓం!! ఓం!!!
సమస్త మనస్సులద్వారా నేను
ఆలోచించుచున్నాను— ఓం! ఓం!! ఓం!!!
నా స్వరూపమైన సత్యమును
సందర్శించుటకే సమస్త
మహర్షులు ఆశించుచున్నారు— ఓం! ఓం!! ఓం!!!
సూర్యచంద్ర తారాదులలోని
జీవ తేజములు నేనే, నేనే! ఓం! ఓం !!ఓం!!!
దీనితో ఈ కరపత్రం సంపూర్తి.

ఈ విషయమునుగూర్చి ఇంకకొన్ని మాటలు చెప్పవలసి యున్నది. హైందవ జానపద సాహిత్యంలో ఒక చక్కని కథ ఉన్నది. పూర్వకాలంలో ఒక గ్రామంలో ఒక పండితుడున్నాడు. అతడు నిత్యము కొంతమంది జనమునుగూర్చి ఆధ్యాత్మిక గ్రంథములు చదివి బోధిస్తుండేవాడు. అతడు పురాణం చెప్పేచోటికి ఒకనాడు కొందరు గొల్లపడుచులు రావడం తటస్థించింది. పండితుడు పురాణం ప్రబోధిస్తున్నాడు. "పరమపావనమైన భగవన్నామం మనలను సముద్రమును దాటించే మహానావ. భగవన్నామంచేత, సముద్రమును మనం పిల్ల కాలువలాగా దాటగలం" అని చెప్పుతున్న పండితుని వాక్యాలు ఒక

గొల్లపడుచు విన్నది. ఇలాంటి విషయం వాండ్లెప్పుడూ వినలేదు. పండితుడు చెప్పిన ఈ విషయమును ఉన్నదున్నట్లు గ్రహించారు. పండితుని వాక్యమునందు సంపూర్ణ విశ్వాస ముంచారు. ప్రతినిత్యం, ఈ గొల్లపడుచులు ఆ గ్రామములోని ఒక నదిదాటి అవతల తీరమున గల గ్రామంలో పాలూ, పెరుగూ అమ్ముకుంటుంటారు. కల్లాకపట మెరుగని గొల్లపడుచులకు పండితుని వాక్యాలు బాగా మనస్సుకు పట్టినవి. చదువుతున్న గ్రంథం సామాన్యమైనదికాదు. చాల పవిత్ర మైంది. ఈ విషయం ఎప్పుడూ¹ అబద్ధంకాదు అని వాండ్లు తలచారు. వాండ్లవాండ్లు అనుకున్నారు. "ప్రతిదినం, పడవకు ఎందుకు మనం నాలుగణాలు ఖర్చు పెట్టడం? పరమపావనమైన భగవన్నామమును స్వీకరించి, ఓంకార సంకీర్తనంచేసుకొంటూ మనం నదిని హాయిగా దమ్మిడీ ఖర్చులేకుండా దాటిపోగూడదా? ఎందుకు మనకీ అనవసర వ్యయం?" వజ్రమువలె వాండ్ల విశ్వాసం ప్రబలమైంది. మరునాడు ఆ గొల్లపడుచులు పడవ ఎక్కలేదు. పండితుడు చెప్పినప్రకారం ఓంకారసంస్మరణంచేస్తూ నది దాటడం మొదలు పెట్టారు. నిరపాయంగా ఆవలి తీరం చేరారు. ప్రతినిత్యం ఇంతే. భగవన్నామం చేసు కుంటూ నదిని నిరపాయంగా దాటి వచ్చేవాండ్లు. పడవతో పనే లేకుండపోయింది. ఒక మాసం గడిచింది. ఆ గొల్లపడుచులు ఇలా అనుకున్నారు : ఆ మహానుభావుడు దయవల్లకదా మనకీ రహస్యం తెలిసింది. లేకపోతే అట్టి పుణ్యగ్రంథాలలోని విషయం మనకెలా తెలుస్తుంది. ఆయన దయవల్లే మనకు నెలకింత డబ్బు ఖర్చుతగ్గింది. పది డబ్బులు కూడబెట్టగలిగాము. ఆయన ఋణం మనం తీర్చుకో వాలి" అని అనుకొని వాండ్లందఱు కలిసి తమ గృహానికి విందుకు బిలిచారు. ఫలానా దినం పండితుని రావలసినదిగా ప్రార్థించారు. సరే ఆనాడు పండితునికొరకు ఒక అమ్మాయి వచ్చింది. ఆమెవెంట పండి తుడు బయలుదేరాడు. నదిదగ్గరకు వచ్చారు. మామూలుప్రకారం భగవన్నామసంస్మరణతో ఆ గొల్లపడుచు నదిని పది నిముషములలో దాటి అవతలి ఒడ్డుకు చేరింది. పండితుడు యింకా అవతలి ఒడ్డునే యున్నాడు. ఆమె మళ్ళీ నీళ్ళచెల్లాటంగా పండితునికొరకు ఈవలి యొడ్డుకు అవలీలగా రెండు నిమిషములలో వచ్చింది. "ఏమండీ రారే

ఓటని అడిగింది. "పడవవానికోసం చూస్తున్నా నమ్మాయి" అన్నాడు పండితుడు. ఆ పండితునికి పడవ కావలసివచ్చింది. ఆ అమ్మాయి అన్నది : "అయ్యా! మేము మీకు కృతజ్ఞులం. మీ దయవల్ల యీ నెలకు మాకు మనిషికి పదిహేను రూపాయలు మిగిలినవి. ఈ నెలకే కాదు; మా జీవితపర్యంతం పడవమనిషికి మేము డబ్బు చెల్లించ నవసరములేదు. అయ్యా! మీకు మాత్రం ఎందుకు వృథాఖర్చు? మాతోపాటు రాండి. నిమిషంలో అవతల యొడ్డుకు పోదాము. మీ ఉపదేశంచేతనే మేము హాయిగా నిరపాయంగా నిత్యం అవతలి యొడ్డుకు పడవతో పనిలేకుండా పోతున్నాము. మీరుకూడా మాలాగే రాగలరుగదా - రాండి పోదాము." ఆ పండితుడు ఆశ్చర్యపడ్డాడు. "నేను చెప్పిన ఏ బోధవల్ల మీరు ఈరకంగా చేయగలిగారు?" అని అడిగాడు. అతను ఆనాడు చదివిచెప్పినమాట ఆ అమ్మాయి పండితునకు గుర్తు దెచ్చింది ఈ ప్రపంచ సముద్రమును దాటడానికి భగవన్నామం నావ." అలాగా - మంచిది, మంచిది నేనుకూడా చూస్తాను - అన్నాడు పండితుడు. ఆయనవెంట అనుచరు లున్నారు కదా! ఒక పెద్ద త్రాడు తీసుకవచ్చారు. ఆ త్రాడు తన నడుముకు గట్టిగా కట్టుకున్నాడు. రెండోకొనను అనుచరులను పట్టుకోమని ఈరకంగా చెప్పాడు. "నేను నదిలో దిగుతున్నాను. భగవన్నామమును ఉచ్చరిస్తూ నదిదాటడానికి సాహసిస్తాను. భగవన్నామం రక్షించవచ్చు కాక నేను నీళ్ళలో మునుగుతున్నట్లు కనపడుతుందా ఆలస్యంచేయకుండా ఒడ్డుకు గుంజాలిమీరు" అని చెప్పి పండితుడు నదిలో దిగాడు. నాలుగడుగులు వేశాడో, లేదో కాళ్ళు ఆనక ప్రవాహంలో మునిగి పోతున్నాడు. ఉద్దు గుడిచి నీళ్ళుద్రాగి కేకలు వేయడం మొదలు పెట్టాడు. అనుచరులు త్రాడుబట్టి గుంజి అతనిని ఒడ్డున చేర్చారు. అందుచేత గుర్తించండి - ఈ పండితుని విశ్వాసంవంటి విశ్వాసం మిమ్ములను రక్షించలేదు. ఇట్టి విశ్వాసం మీ హృదయంలోని కుటిలత్వమే. నీవు ఓంకారోచ్చారణచేస్తూ భగవన్నామసంస్మరణంచేస్తూ "నేను సంపూర్ణారోగ్యమును నేనే సంపూర్ణారోగ్యమును" అని అనుకుంటావు. కానీ నీ అంతరాంతరంలో అపవిశ్వాసం ఉన్నది. సంశయం మిణుకు మిణుకు మంటునే యున్నది. నేను మునిగిపోయినట్లైతే నన్ను

వెలికిలాగండి. 'అయితే' అనేదే నీలో దోషమును కల్పిస్తున్నది; నీ మనస్సులో విశ్వాసం లేదు. అవిశ్వాసం లేశంకూడా పనికిరాదు. ఈ ప్రపంచంలోని సమస్తవైరుధ్యములు, సమస్తపరిస్థితులు నా స్వయంసృష్టే. ఇది నిజం. నీవు పరబ్రహ్మావు. విశ్వనాథుడవు. రాజాధిరాజవు! ఇట్టి దివ్యభావనిమగ్నుడవుకా. ఈ క్షణమందే ఈ సత్యమును. సందర్శించు. అచంచల విశ్వాసపూర్ణుడవుకా! అనుభవజ్ఞానసాక్షాత్కారం పొందు. ఈ రాత్రి చెప్పిన విధానంలో మీ రీపత్రమును నిత్యము పఠించండి. మిమ్ములను బంధించే యీ క్షుద్రసంశయాలు పలాయనమవుతవి. నిరంతరం నీ బ్రహ్మత్వమునందు శృతిగలిపి జీవించు. నీ సర్వసంశయములు నివృత్తి కాగలవు. ప్రతిదినం కనీసం రెండుసారు లీ పత్రమునుపఠించు. లేదా అయిదుసార్లు పఠించు. మీ సర్వ అపవిశ్వాసాలు పటాపంచలై పారి పోగలవు.

రాముడింక ప్రసంగమును ఆపనున్నాడు. ఎవరైనా రామునితో కొలదిగా యిష్టాగోష్ఠిగా మాట్లాడదలచినవారు ఉపన్యాసవేదికను వదలినపిమ్మట మాట్లాడవచ్చు. ఓంకారోచ్చారణచేసి రాముడు నేటికీ ప్రసంగమును ఆపుతున్నాడు. ఓం! ఓం!! ఓం!!!

ఇంకొక్కమాట. ఈ ఉపన్యాసములను విననివారు, రాముని ఉపన్యాసమును అవగాహన చేసుకోలేరు. ఈ సమస్తవేదాన్తదర్శనమును, మహోన్నతమయిన తాత్త్వికపథంలో గ్రంథరూపేణ మీరు చూడగలరు. సమస్తమయిన వేదాంతతత్త్వము ఆ గ్రంథరూపేణ మీరు చూడగలరు. ఇంకొక్కమాట – వేదాంతతత్త్వమునందు మీకున్న సర్వసంశయములు సర్వ అపార్థాలు, ఒకప్పుడు రాముడు కూడ కలిగియున్నాడు. మీ అనుభవములన్నీ, మీ సంశయములన్నీ ఒకప్పుడు రాముడుకూడ రుచిచూచియున్నాడు. రాము డీ సంశయాలను అతిక్రమించి, తనపథమును తెలుసుకొన్నాడు. మన సంశయములన్నీ అజ్ఞానముయొక్క ఇంకొకరూపాలే. ఈ సంశయాలన్నీ మంచుతెరల్లాంటివి. క్షణికాలు. ఒక్కక్షణంలో అవి అదృశ్యంకాగలవు. ఏమయినా సంశయాలుండి, రామునితో ప్రత్యేకంగా మాట్లాడదలచిన

వారు వచ్చి మాట్లాడవచ్చు. అంత తొందరలో రాము డీ ప్రదేశ మును విడిచిపోడు.

తిరిగి ఇంకొకసారి వినండి: మీరు దుఃఖరాహిత్యంపొందాలంటే పరిపూర్ణమైన ఆనందం పొందాలనుకుంటే, మోక్షప్రాప్తి కావాలంటే, భగవత్సాక్షాత్కారం పొందాలంటే, మీరు వేదాంతమును తెలుసు కోవలసియున్నది. వేరే ఇంకొకమార్గంలేదు. మీ సర్వమతములు, మీ సర్వవిశ్వాసములు మీ మతదర్శనాలన్నీ వేదాంతమునకు దారి తీస్తున్నవిమాత్రమే. పరిపూర్ణసత్యమునకివన్నీ దారితీస్తున్నవిమాత్రమే. కొన్ని ఆశాసూచనలు, శుభసూచనలు కనపడుతున్నవి. అమెరికాలో నవ్యంగా ఉదయమయిన కొన్ని మతసంస్థలు వేదాంతదృష్టిని అందు కొంటున్నవి. వేదాంతమును జీర్ణించుకొంటున్నవి అయితే వేదాంత మునకవి కృతజ్ఞత చూపనవసరంలేదు. క్రైస్తవ విజ్ఞానం, [Christian Science] నవ్యదృష్టి [New Thought] ఆధ్యాత్మికత, లేక దివ్య విజ్ఞానము [Spiritualism or Divine Science] మొదలైన వాటికి చెందిన ప్రజలు మమ్ములను గ్రహిస్తున్నారు. ఈ జనులు దైవజ్ఞాన యుక్తులు. అమెరికా దేశమున కిది మహాశాతార! కానీ సత్యమును పరిపూర్ణ స్వరూపంతో, సమగ్రప్రభాసౌందర్యములతో తెలుసుకోవా లనుకుంటే మార్గం వేదాంతమని రామునిసందేశం. ఈ వేదాంతము నకు మీ రే పేరైనా పెట్టండి. కానీ హైందవజ్ఞాన నిధులైన వేదము లందు సత్యము మహాగంభీరమయిన అత్యంత పరిస్ఫుటమయినభాషలో నిర్వచితమై యున్నది. నీవు పరబ్రహ్మావు. రాజరాజేశ్వరుడవు. ఇదే మహోన్నతసత్యం. దీన్ని ధ్యానించు. ఈ సత్యమును సందర్శించు. నిన్ను ఏ అపాయం అంటలేదు. నీవు జగన్నాథుడవు. ప్రపంచం నా భావనమాత్రమే. నేను జగన్నాథుడను — ఈ సంభావన సత్యం. ఇట్టి ప్రబోధం నీ వెప్పుడూ వినియుండలేదా? భయపడవాకు. ఈ సత్య మును నీ తలిదండ్రులు నమ్మకపోతే నీకేం? నీ తలిదండ్రులు వారిశక్తి కొలది వారు మంచిచేశారు. నీ శక్తికొలది నీవు మంచిచెయ్యి. నీ మోక్షం నీకు సంబంధించింది. నీ తలిదండ్రులపని కాదది. నీ మోక్షం నీ విముక్తి, నీవుచేయవలసినపని వేదాంతమును ఏదేశందో అని

పరాయిగా చూడవాకు. వేదాంతం నీ సహజతత్వం. నీ ఆత్మ నీకు పరాయిదా? వేదాంతం నీ ఆత్మనుగురించి నీలోని పరమాత్మనుగురించి మాత్రమే చెపుతున్నది. అంతేకదా! నీ ఆత్మ నీకు పరాయి అయితే, వేదాంతంకూడా నీకు పరాయిదే. వేదాంతదర్శనంచేత, వేదాంత సాక్షాత్కారంచేత శారీరకమయిన, మానసికమయిన, నైతికమయిన, ఆధ్యాత్మికమయిన సమస్తబాధలూ, తత్క్షణమే శకావికలై, పటాపంచలై అదృశ్యంకాగలవు! ఆత్మసాక్షాత్కారం, దుర్ఘటమని భయమా? ఏమంత కష్టమయినది! నీవు చేయగల పనే! ఓమ్! ఓమ్!! ఓమ్!!!

ఓం.

# సోఽహం

(1903 జనవరి 10వ తేదీ ఇచ్చిన ఉపన్యాసము)

ప్రతిమానవుడూ అనుష్ఠింపదగిన ఒక మహోపయోగకరమైన మహామంత్రమున్నది. ఆ మహామంత్రం సోహం. ఇంగ్లీషులో so (సో) అన్న పదానికి అర్థం 'అట్టి' అని. కానీ సంస్కృతభాషలో 'సః' అంటే 'ఆయన' అని. ఆయన అంటే భగవంతుడు అని నిత్యార్థం. 'సః' అంటే పరబ్రహ్మ అని అర్థం. భారతదేశంలో భార్య ఎప్పుడైనాసరే భర్తను పేరున పిలువదు. భారతవర్ష సతీమణికి యావత్ప్రపంచమునందు ఆమె దృష్టిలో ఏకైకపురుషునుగా కనపడేది తన భర్తమాత్రమే. ఆమె సర్వస్వము పతే. ఆమె ఏకైకలక్ష్య మతడే. భర్త నామె "ఆయన" అని సంబోధిస్తుంది. ఆ సంబోధనలో ఇంకెవరూ సమస్తప్రపంచంలో ఆమెకు కనబడనట్లు ద్యోతకమవుతుంది. అందుచేత ఆమెకు పతి సర్వ కాల సర్వావస్థలలో భగవంతుడే. ఈరకంగా సతీమణి తనపతిని నిరంతరం బ్రహ్మభావనతో ఉపాసిస్తుంది. అదేమాదిరి వేదాంతికి ఈ "సః" అనేపదం నిరంతరం పరబ్రహ్మ అనే అర్థం. ఏకైక సత్యం నా ఆత్మే. ఈ భావన నిరంతరం మనస్సులో సుస్థిరంగా ప్రకాశించాలి. సోహం అంటే, అది నేను; అహం బ్రహ్మాఽస్మి, పరబ్రహ్మను నేను అని అర్థం. ఈ సోహంలో ఓంకారనిక్షిప్తమై యున్నది. సకారమునూ, హాకారమును తీసివెయ్యి. ఓం అని మిగులుతుంది. మన ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో ధ్వనించే సహజశబ్దం సోహం. మనస్సులో నిరంతరం సోహంశబ్దంయొక్క పూర్ణార్థమును సంభావించాలె. ఉచ్ఛ్వాసనిశ్వాసములను 'సోహం' మంత్రోచ్చారణతో నియతమయిన సమశృతిలో నడుపు. ఈ సాధన మానసికమయిన, దైహికమయిన, ఆధ్యాత్మికమయిన సాధనాశ్రయముతో మిళితమై యున్నది. ప్రాణసంచారక క్రియలో రెండుపనులు మిళితమై యున్నవి. ఉచ్ఛ్వాసనిశ్వాసవాయువు పీల్చేటప్పుడు "సో" అని ధ్వనిస్తుంది. గాలి వదిలేటప్పుడు "హం" అని ధ్వనిస్తుంది. ప్రారంభసాధకునికి ఒక్కొక్కప్పుడు ఓంకారంకంటే

సోహం ఉచ్చారణే ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. సోహం మంత్రంలో ఓంకృతికూడా ఉన్నది. పైకి మంత్రమును ఉచ్చరించ నప్పుడు మంత్రార్థధ్యానము చెయ్యి. నెమ్మదిగా సహజంగా ఉచ్ఛ్వాస నిశ్వాస క్రియలచేస్తూ హృద్గతంగా, మానసికంగా సోహంధ్యానం చెయ్యి. ఇంద్రియవ్యామోహంనుంచి దూరము చేసి బ్రహ్మత్వప్రాప్తిని కలిగించడానికి నిజమయిన స్వయంసాధనామార్గ మిదే. సోహం ఆ పరబ్రహ్మను నేను. నిరంతరం ఒక సమశ్రుతిలోకూడిన గతితో జగత్తు నడుస్తూ వున్నది. 'సః' అనేపదానికి సంస్కృతంలో సూర్యుడనికూడా అర్థమున్నది. సోహం – సూర్యుడను నేను. నేను తేజఃప్రదాతను. నేను సర్వపరిత్యాగిని. నాకే వాంఛలు లేవు. నేను త్యాగిని, రాగిని కాదు. మనలను ఇతరులు అసూయాపరులై నిందించవచ్చు. విమర్శించ వచ్చు. అప్పుడు మనం వికలతపొంది, విచారపడకూడదు. నీబ్రహ్మ త్వమునందు నిర్వికల్పప్రశాంతి వహించు. నీ కపాయము కలిగిద్దామని ప్రయత్నిస్తున్నవారిని దయాప్రేమలతో సంభావించు. ఆ శత్రువులు నీ ఆత్మస్వరూపులే. నీ ఆత్మనుగురించి నీకు చెడుతలంపులు ఉంటాయా? నీ ఆత్మే అయిన శత్రువులను ప్రేమించు. నేను సూర్యసూర్యుడను. నేను పరంజ్యోతిని. సర్వశక్తిస్వరూపుడను. నా కపకారం చేయ గలిగిందెవరు? నా ఆత్మ నా ఆత్మకు అపాయంచేయలేదు. ఇది అసాధ్యం. ఇట్టి సంభావనతో పరులక్షుద్ర మిథ్యాభిప్రాయాలకు అతీతు డవుగా. నీలో అహంకృతికి చోటివ్వవాకు. నీద్వారా భగవంతుని మాట్లాడనివ్వు. నీద్వారా భగవంతుని ఆలోచించనివ్వు. నిరంతరం నీ ద్వారా భగవంతుని పనిచెయ్యనివ్వు. నీ బ్రహ్మత్వంలో ప్రశాంతి వహించు. నేను సూర్యుడను, సర్వప్రపంచ తేజోదాతను అని సంభావించు.

పరిపూర్ణశక్తిని నేనని దివ్యానుభూతిపొందు. పరిమితి (స్థల) బద్ధమైన అహంకృతిచేతనే సమస్తదుఃఖాలు కలుగుతున్నాయి. ఈ దేహభావనే మానవులను బలహీనపరచి హింసించి చంపుతున్నది. ఈ రోగనివారణ చేసికోవడానికి ప్రతివ్యక్తీ ఒక ఏకాంతమయినగదిలో కూర్చుండి, "ఓ అహంకారభూతమా! వెళ్లు! నాలోనుంచి వెళ్లు!"–

అని పరితపించవలసియున్నది. నీకు శరీరమనేది పుట్టనే పుట్టియుండలే దనిన్నీ, నీవు పరబ్రహ్మావనీ ఈ దేహానివి కావనీ గాఢవిశ్వాససితిలో ఉండు. స్థలకాలబద్ధమయిన దేహమును నేను అనేదృష్టి నీకున్నప్పుడు ఇతర ప్రజలయొక్క భావాలు, అభిప్రాయాలు నిన్ను హింసించగలవు. ఈ శరీరం కేవలం భ్రాంతిమాత్రమే. నేను పరబ్రహ్మాను అనే ఈ సత్యమును గ్రహించు. అసత్యాభిప్రాయములలోకంటే సత్యములోనే విశ్వసించు, పరబ్రహ్మావు నీవు. దుష్టభావాలకు, విషయవ్యామోహాలకు నీ పవిత్రసాన్నిధ్యమందు అడుగుపెట్టడానికి అవకాశంలేదు. నీ సన్నిధిలో ముఖంచూపడానికి వ్యామోహాలకు ఏం అధికారమున్నది? నీవు పరమపావనుడవుసుమా! ఇట్టి సంభావనచెయ్యి. ఇంక రోగం ఎక్కడ ఉంటుంది? దేన్నీ ఆశించవాకు. దేనికీ భయపడవాకు. బాధ్యతా భారములను సృష్టించుకొని నీ గుండెమీద మోయవాకు. విధిబద్ధుడను... ... అనే దృష్టితో కర్మ చెయ్యవాకు. విధి అంటే ఏమిటి ? విధి నీ స్వయంసృష్టి. ఒక రాజకుమారునివలె వినోదలీలగా నీపని చెయ్యి. ప్రతిపనీ నీ కొక వినోదక్రీడగా మారిపోతుంది. ఆనందోత్సాహాలతో స్వేచ్ఛాలీల నీకర్మ చెయ్యి.

వ్యాధులు రెండువిధాలు. భారతపరిభాషలో ఆధ్యాత్మిక వ్యాధి (ఆంతర్యమైన), ఆధిభౌతికమైన వ్యాధి (బాహ్యమైన) అని ఈ వ్యాధుల పేర్లు. వీని అర్థం పురుషపిశాచవ్యాధి, స్త్రీ పిశాచవ్యాధి అని. అంటే ఏమిటి ? స్త్రీ పిశాచవ్యాధి అంటే మానవునిలోనుంచే పుట్టేవ్యాధి. మన లోపలివాంఛలు మన కామవాసనలు, మన వ్యామోహాలు, మన ఆశాతృష్ణలు ఇవన్నీ స్త్రీ పిశాచవ్యాధులు. పురుష పిశాచవ్యాధు లంటే పరుల సంపర్కంచేత మనకు సంక్రమించే వ్యాధులు. అంటే ఇతరులవలన కలిగే వికారాలన్నమాట. పురుషపిశాచ వ్యాధినిగూర్చి అంటే ఆది భౌతిక వ్యాధినిగూర్చి, బాహ్యా వ్యాధిని గూర్చి నీవు బాధపడ నవసరంలేదు. నిన్ను బలహీన పరిచే నీ ఆంతరంగిక వాంఛారోగమును (స్త్రీ పిశాచవ్యాధని) మొదట నయం చేసుకో. తత్క్షణమందే బాహ్యారోగాలు వాంటంత టవే నివృత్తి కాగలవు. కానీ యీ ప్రాపంచిక మానవులు ఏంచేస్తున్నారు ? తల

క్రిందులు పనిచేస్తున్నారు. స్వంతపని చూచుకోరు. తమ వాంఛలచే సృజితమైన బాధాభాగమును నివృత్తిచేసుకోను ప్రయత్నించరు. మొదట బాహ్య బాధానివృత్తికే దిగుతారు. మొదటనే బాహ్య పరిస్థితులతో సమరం సాగిస్తారు. అపమార్గం ప్రారంభంచేస్తారు. పరుల వలన కలిగే ఈ పురుషపిశాచవ్యాధిని నివృత్తి చేసుకోవాలనుకుంటారు. నీ వాంఛలన్నీ, నీ కామవాసనలన్నీ నీ దౌర్బల్యతలే. అన్నిటికీ నీవే కారణ మని వేదాంతం ఉద్ఘోషిస్తున్నది. నీలో కొంత స్త్రీ ప్రకృతి భాగం ఉన్నది, ఇదే బాహ్యశక్తులను ఆకర్షిస్తున్నది. చూడండి- ఒక కుక్క ఒక మాంసపు ముక్కను నోటగఱచుకొనియుంటే, ఇతర కుక్కలు దానికోసం కొట్లాటకు వస్తాయి. ఎప్పుడైతే నీలోని స్త్రీ పిశాచరోగాన్ని, నీలోని దౌర్బల్యమును నివృత్తి చేసుకుంటావో అప్పుడే పురుషపిశాచరోగం దానంతట అదే నివృత్తి అవుతుంది. ఈ స్త్రీ పిశాచరోగప్రకృతినిగూర్చి ఇంకా విశదీకరిస్తాను. ఒక మానవుడున్నాడనుకోండి. అతడు ఎప్పుడైతే పరిపూర్ణపరిశుద్ధు డౌతాడో ఎప్పుడతడు సమస్తవ్యామోహాలకు అతీతుడై తనలోనిబ్రహ్మత్వాము తెలుసుకోగలుగుతాడో ఎప్పుడతడు "ఓ సైతానా (కలి) నీ ముఖం నాకు చూపవద్దు. పో! వెనుకకు పో! నీముఖం చూడను" అని గర్జించ గలుగుతాడో! అప్పుడతనికి ఈ ప్రపంచములోని ఎవరి వాంఛలైనా, ఎవరిదుష్టభావాలైనా ఎవరి వ్యామోహాలైనా సరే అపాయంచేయలేవు, ఏశక్తి అట్టి మానవుని జయించలేదు. కారణం? అతడు తనలోని బలహీనప్రకృతిని నిర్జించాడు గనుక. మనలో బలహీనతకు తావిచ్చి విషయభోగాలకు ఆశపడిన నిమిషమందు ఏమి జరుగుతుంది? సమస్త దుష్టభావ విరోధులు ఈ వ్యామోహ రూపం ధరించి మనలను చీల్చివేస్తాయి. శాంతి పరమానందము నీకు కావాలనుకుంటే, నీ బ్రహ్మత్వాము తెలుసుకోవాలనుకుంటే నీలోని నీచప్రకృతి మరణించాలె. ఈ మరణంలో జీవం ఉన్నది. ఈ చావులో నిజమైన బ్రతుకున్నది. ఇప్పుడే, ఇక్కడే నీ బ్రహ్మత్వాము సంభావించు. నీవు భగవంతుడని గ్రహించు. నిన్ను నీవు విముక్తి చేసుకో. ప్రశాంత చిత్తంతో, స్వస్థ బుద్ధితో, నిశ్చలవిశ్వాసంతో ఈ సాధన చెయ్యి.

నాకే వాంఛలేదు. నాకే కోరికాలేదు, నాకే భయమూ లేదు. నాకే ఆశాలేదు. నాకే బాధ్యతాభారంలేదు. నాకే కర్తృత్వంలేదు.




ఈ 'ఏ' అనే వృత్తం ఒక కప్పీ (pulley). ఈ కప్పీపైన ఒక సన్నని పట్టుదారం వ్రేళ్లాడుతున్నది. ఈ దారవు రెండు కొనలకు రెండు బరువులు ఒకటి 10 ఔ. రెండు 6 ఔ. కట్టబడియున్నవి. ఈ రెండుబరువులలో 6 ఔ. చిన్నది. ఈ 6 అనే చిన్నబరువును ఇంకొక 4 ఔ బరువు చేరుద్దాము. 6+4 పది అవుతుంది. ఇప్పుడు ఒకవైపు 10 యింకొకవైపుకూడా 10 అవుతున్నది. రెండువైపులతూకం సరిగా వున్నది. ఇంక ఈ దారం ఎటూ చలింపదు, అయితే ఒకవైపునగల 4 బరువును తీసివేస్తామనుకోండి. అప్పుడు ఒకవైవు 10, రెండోవైపున 6 మిగులుతున్నవి. బరువులు సమస్థితిలోలేవు. అప్పుడేమి జరుగుతుంది? 10 క్రిందికిపోయి, 6 పైకిలేస్తుంది, ఒక సెకండయిన తర్వాత, 6 బరువుకు ఈ 4 కలువుతాము. ఇప్పుడు తిరిగి రెండువైపుల బరువులు సమానపరిచాము. అప్పుడు ఏమి జరుగుతుంది? అప్పుడు రెండుబరువులు సమానస్థితిలో నిశ్చలంగా ఉంటాయని మీరందరూ అంటారు. కానీ, నిశ్చంచలంగా ఉండదు. త్రాడు అటూ, యిటూ కదులుటుంటుంది. మొదట చూడగానే బరువులు సమానపరిచిన ఒక సెకండు పిదప చలనంకూడా సమత్వస్థితిలో నిలిచిపోతుందని మనము తలుస్తాము రాముడు విశ్వవిద్యాలయంలో ఈ విషయమునుగూర్చి ఉపన్యసించినప్పుడు విద్యార్థులందరూ చలనం ఆగుతుందని చెప్పారు. ప్రయోగము చేసి చూపినతరాంత వాండ్లకు తెలిసింది, బరువులు సమానపరిచి నప్పు

టికీ, త్రాడు చలించడం మొదలుపెట్టిందిగాని ఆగలేదు. ప్రథమంలో బరువులు సమపరిచినట్లయితే, దారం నిలుకడ వహిస్తుంది. అది సహజ నిశ్చలతలో ఉంటుంది, చలనం ఒకసారి ప్రారంభమైన తరువాత రెండు వైపుల బరువులూ మనం సమాన పరచినప్పటికీ, వెంటనే చలనం ఆగదు. రెండువైపుల గల 6, 10 బరువులను రెండు సెకండ్లకాలం కదల నిచ్చి ఆ రెండు శెకండ్లు అయిన తరువాత 6 బరువుకు 4 కలిపితే, రెండువైపుల బరువులూ సమతవహిస్తాయి. కానీ చలనం నిలకడ వహించదు. అదేప్రకారం మూడు శెకండ్ల తరువాత బరువులు సమానపరు స్తాము. అప్పటికీ చలనం నిలుకడ వహించదు, రెండవ సెంకండులో మన మొకభేదమును గుర్తించగలం. బరువులయొక్క చలనవేగం శెకండుకు 4 అడుగులు ఉంటుంది. ఆ సమభారములు ఒక సెకండు చలించినప్పుడు ఫలితవేగం 4 అడుగులుంటుంది, ఆ అసమత్వం రెండు శెకండ్లుఉంటే, ఫలితవేగం 8 అడుగు లవుతుంది. ఈ అసమభారము లను 3 సెకండ్లు చలింపనిచ్చినట్లయితే, ఫలితవేగం 12 అవుతుంది. 4 సెకండ్లయితే, ఫలితవేగం 16 అవుతుంది. ఇదీ క్రమం. మనం కను గొన్న దేమిటి ? ఉభయభారములను, అసమంగా ఉంచితే, ప్రతి శెకండుకు వేగం భేదిస్తుంటుంది. అంతకు ముందున్న వేగమూ +4గా క్రమగతి సాగుతుంటుంది. అంతకుముందున్న వేగం మారదు. ప్రప్రథ మంలో చలనం పుట్టకముందు బరువులు సమానపరిస్తే బరువులు సమత వహించి నిలకడ వహిస్తున్న విషయం మనం కనుగొన్నాము. వేగము 4ను పొందినతర్వాత, బరువులను సమానపరిస్తే భారముల సమత్వము ఇంక తరువాత ఏమాత్రము వేగాభివృద్ధిని పొందనివ్వదు. రెండవ శెకండుయొక్క అంత్యంలో భారములను సమానపరిస్తే, అప్పుడు పొందబడిన వేగం 8 అవుతుంది. కానీ యీ వేగము మరేమాత్రము అభివృద్ధి పొందదు. మూడవ శెకండుయొక్క అంత్యంలో పొందబడిన వేగం 12 అవుతుంది. ఈ వేగమునకు యింక ఎక్కువ అభివృద్ధి ఉండదు. ప్రథమక్షణాంత్యంలోని వేగాభివృద్ధిని వేగతీవ్రత (Acceler-ation) అంటారు. ఇక్కడ మనం ఇంకొక విషయం చూస్తాము. రెండు వైపులనున్న బరువులను సమానం చేసినప్పుడు బరువులను చలింపచేసే శక్తి ఉదయించలేదు. బరువులను చలింపచేసేశక్తి లేనప్పుడు నిశ్చల

స్థితిలోగానీ, చలన స్థితిలోగానీ ఎట్టి మార్పు కలుగదు.సహజ నిశ్చల స్థితిలో రెండువైపుల 10 శక్తులను ఉంచినప్పుడూ, చలన ప్రారంభమయిన ఒక సెకండు తర్వాత బరువులను సమపరిచినప్పుడూ ఈ సిద్ధాంతానుసారం మొదట పొందబడిన చలనం పోదు. అది సహజ నిశ్చలతనుగానీ మొదట పొందబడిన వేగమునుగానీ భంగపరచదు. కానీ భారములలోని సమత వేగములో తరువాత వచ్చే మార్పును ఆటంకపరచదు. అదేప్రకారం రెండవ సెకండుయొక్క అంత్యంలో మనం బరువులను సమపరిచినట్లయితే మొదట పొందబడిన వేగం ఉంటుంది. అదే ప్రకా... ...డవ సెకండుయొక్క అంత్యంలో మొదట పొందబడిన వేగం 12 అవుతుంది. భారముల సమత ఇక తరువాతవచ్చే వేగాభివృద్ధిని అటంకపరుస్తుంది.

అలాగే, మన మొక బ్రహ్మవేత్త విషయం తీసుకుందాము. బ్రహ్మసాక్షాత్కారమంటే ఉభయపార్శ్వ భారాలను సమాన పరచడమే. బ్రహ్మజ్ఞానమంటే భారములను సమపరచడం, నీలోని అసమత్వము తీసివేయడం, బాహ్య పరిస్థితులనుంచి నిన్ను విముక్తిపొందించుకోవడం. ఈ ప్రాపంచక బాధాదాస్యమునుండి నిన్నురక్షించుకోవడం. ఆత్మసాక్షాత్కారము నిన్ను బాహ్యవ్యామోహ పాశాలనుంచి విముక్తుని చేస్తుంది. నీ మీద నీవు ఆధారపడేటట్లు చేస్తుంది. నీకు నీవుగా నిలబడజేస్తుంది. ఇట్టి సా...త్కారానంతరం, ఇక ముందు రాగల వేగాభివృద్ధి అనేదంతా ఆగిపోతుంది. మొదట పొందబడిన వేగం మాత్రం ఉంటుంది. మొదట పొందబడిన వేగం అంటే, పూర్వ అధ్యాస అన్నమాట. ఈ పూర్వ అధ్యాస మాత్రం ఉంటుంది. దాని పని అదిచేసుకుంటుంది, ఆత్మసాక్షాత్కారం పొందినకొందరుమహనీయులున్నారు. మొదట పొందబడిన వేగం (పూర్వ అధ్యాస) వారికి చాలా తక్కువ. అందుచేత వారి దేహాలద్వారా మహత్కార్యాలు జరుగలేదు. కొందరున్నారు, వారూ ఆత్మసాక్షాత్కారం పొందినవారే. వారి మొదట పొందబడిన వేగం (పూర్వ అధ్యాస) మహాద్భుతమైంది. అసమానమైంది. వారు ముక్తపురుషులే. అయినా వారి దేహాలు నిరంతర కర్మోద్వేగంతో (సంచలనంలో) ప్రకాశిస్తాయి.

ఇట్టి ముక్త పురుషుల శరీరాలు మహాద్భుత కార్యాలు చేస్తాయి. అట్టి మహాకర్మ బ్రహ్మ సాక్షాత్కారమునకు ఇంకొక పేరు.

"ఆనందం విహితకర్మాచరణ మనే వేషంవేసుకొన్నది." అని డాక్టర్ ఆంథానీ వచనం.

నీ బ్రహ్మాత్వమును సందర్శించు. సమస్తం సఫల మవుతుంది.

ఓమ్ ! ఓమ్ ! ఓమ్ !

# తప్పొప్పుల పట్టిక

## ప్రథమ సంపుటం — "ఆత్మజ్యోతి"

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 19 | వశే | వశ |
| 10 | 16 | అర్ణవమై | అగ్ణవమై |
| 13 | 24 | "మనశ క్తులు" | "మనశ్శక్తులు" |
| 21 | 12 | అక్కడికూడా | అక్కడికికూడా |
| 30 | 5 | ఏమిటీ? | ఏమిటి? |
| 38 | 19 | కులమును | సంకులమును |
| 39 | 28 | ఆవికాసదశ, | అవికాసదశ |
| 40 | 20 | సంస్కృతి | సంస్మృతి |
| 41 | 25 | రాజాశ్చరపడి | రాజాశ్చర్యపడి |
| 42 | 17 | చేసారుతున్నా | చేసారుతున్న |
| 43 | 1 | ఆత్మానందం | ఆత్మవికాసం |
| 46 | 7 | స్వతంత | స్వతంత్ర |
| 54 | 14 | ఈ సత్యమున | ఈ సత్యమైన |
| 59 | 9 | మనిషి | మనిషివి |
| 60 | 9 | అది ఉన్నది. | అయి ఉన్నది. |
| 64 | 16 | కాబడినవని | కాబడినవని. |
| 73 | 30 | విషయులను | విషయములను |
| 76 | 13 | మాత్ర | మాత్రమే |
| 78 | 24 | ధరిసున్నవి. | ధరిస్తున్నవి. |
| 80 | 14 | స్వప్నావస్థలో | స్వప్నావస్థ |
| 102 | 7 | అభిన్నత్వమును | అభిన్నత్వమును |
| ,, | 9 | దీకిస్తుంది. | దీపిస్తుంది. |
| 105 | 6 | నిండగా | నిండగా |
| 109 | 30 | అశ్వమువి | అశ్వమును |
| 111 | 4 | నఖశిఖా | నఖశిఖ |
| ,, | 18 | మరణించేలాగా, | మరణించనిలాగా, |
| 114 | 6 | చెవుతుంటారు. | చెపుతుంటారు. |
| 115 | 3 | స్వాతంత్ర | స్వాతంత్ర్య |
| ,, | 21 | చేశా" | చేశా"మని |



| | | | |
|---|---|---|---|
| 119 | 23 | మన్నించాలె. భారత వర్షానికి పోతున్నారు. | భారతవర్షానికి పోతున్నారు |
| ,, | ,, | మీరు | మీరు మన్నించాలె. |
| 120 | 8 | ఏరాజ్యలు | ఏరాజ్యాలు |
| 130 | 22 | వికస్తాయి | వికసిస్తాయి |
| ,, | 27 | ఆకాప | ఆకాశ |

## ద్వితీయ సంపుటం — "శక్తిస్రవంతి"

| | | | |
|---|---|---|---|
| 7 | 11 | సమున్నతిక | సమున్నతికి |
| 46 | 26 | అతని | అతనిని |
| 48 | 19 | దహిస్తే, | వహిస్తే, |
| 51 | 15 | ఈప్రపంచమెంత | ఈప్రపంచమం తెంత |
| 56 | 15 | మాటలువిని | చిలుకమాటలువిని |
| 79 | 17 | నీకొక | నీవొక |
| 88 | 17 | పరచ్ఛిన్నని | పరిచ్ఛిన్నని |
| 93 | 11 | బాహ్యం | బాహ్య |
| 93 | 4 | శవలేరాదు. | శవంలో జీవం రాదు. |
| 97 | 20 | అమహా సాధరాలు | ఆమహా సాధరాలు |
| 110 | 17 | నటెయితే | నట్లయితే |
| 124 | 10 | జ్ఞానం | జ్ఞాతం |
| 128 | 30 | పరిశుద | పరిశుద్ధ |
| 133 | 24 | దైవముచేత | దైన్యముచేత |
| 140 | 3 | దైవమువల్ల | దైన్యమువల్ల |

## తృతీయ సంపుటం — "ఆత్మానుభవము"

| | | | |
|---|---|---|---|
| 4 | 10 | శుక్ర | శుక |
| ,, | 14 | పాశ్చాత్యతాత్త్విక | తాత్త్విక |
| 12 | 22 | గురువులము | గురువులను |
| 25 | 7 | అసామ | ఆ సామ |
| 89 | 21 | కారు | పట్టకారు |
| 99 | 17 | సక్రమంకా | సక్రమంగా |
| 105 | 16 | నిగ్రహ | విగ్రహ |



| | | | |
|---|---|---|---|
| 106 | 7 | కండా | కండ్లా |
| 112 | 28 | నినందించే | నినదించే |
| 114 | 11 | స్వాతంత్రస్వేచ్ఛ | స్వాతంత్ర్యం! స్వేచ్ఛ!! |
| 119 | 4 | సత్యసూత్రమూలై | సత్యసూత్రములై |
| 120 | 1 | గృహస్థజీవన– | గృహస్థజీవనం– |
| 126 | 3,4 | తనతనశరీరంగా | తనశరీరంగా |
| ,, | 20 | మమాత్మా | మదాత్మా |
| 128 | 4 | అనుభములో | అనుభవములో |
| ,, | 30 | ప్రేమకేంద్ర | ప్రేమకేంద్రం |
| 138 | 14 | ధృవ | ధ్రువ |
| ,, | 14 | ధృవ | ధ్రువ |
| ,, | 20 | మూందరగానే | ముదరగానే |
| 139 | 25 | నశించి | నశించిన |
| 149 | 6,7 | సోదరలను | సోదరులు |
| 159 | 21,22 | ఆ యా ఖండంలో | ఆ ఆఖండంలో |
| ,, | 24 | జనులంటారు. | అని జనులంటారు. |
| 160 | 5 | దాన్ని | దాన్ని |
| 174 | 9 | ఉత్కృపలు, | ఉత్కృష్ట |
| 177 | 6 | వెలుగులు | వెలుగును |
| 179 | 26 | కాలపరీక్ష | కాలపరీక్షకు |
| 180 | 29 | దివ్యశక్తిని | దివ్యశక్తివి |
| 185 | 15 | భావవంతంగా | భారవంతంగా |



# శ్రీ రామతీర్థ సేవాశ్రమం

## పిడుగురాళ (P.O.) - గుంటూరు జిల్లా

### ప్రస్తుతము లభించు శ్రీరామతీర్థ సేవాశ్రమ ప్రచురణలు

1. శ్రీరామతీర్థ వేదాంతభాష్యము (శ్రీరామతీర్థ సంపూర్ణ సారస్వతము) 9 సంపుటములు సంహితులుగా - శ్రీ స్వామి వారి పదిరకముల ఛాయా చిత్రములతో ఫుల్ కాషాయాంబరపు బైండుతో-రమ్యమైన ముద్రణ — రూ 30-00
2. శ్రీరామతీర్థ జీవితోపదేశములు (శ్రీ కేశవతీర్థస్వామి వారి రచన 500 పేజీలు ఫుల్ క్యాలికో బైండు) — 5-00
3. వేదాంతదర్శనము (శ్రీరామతీర్థస్వామివారు అమెరికా దేశమున ప్రసాదించిన మహోపన్యాసములు) — 2-50
4. మతము (శ్రీరామతీర్థస్వామివారు ప్రాచ్యపాశ్చాత్య ఖండములం దిచ్చిన మహోపన్యాసములు) — 2-00
5. భక్తియోగము (శ్రీరామతీర్థస్వామికృతము) — 1-50
6. తులసీదాసకృత శ్రీరామచరితమానసము (బాలకాండ-ద్విపద కావ్యము) — 5-00
7. భక్త నరసింహమెహతా జీవితకథ — 1-50
8. భక్తపోతనామాత్య (హరికథ) — 0-50
9. భక్త కన్నప్ప (హరికథ) — 0-50
10. భక్త ప్రహ్లాదవిజయము (బుఱ్ఱకథ) — 0-50
11. హరిజనజ్యోతి భక్త నందనార్ (బుఱ్ఱకథ) — 0-50
12. ధ్రువవిజయము (బుఱ్ఱకథ) — 0-50
13. శ్రీవిష్ణుసహస్రనామస్తోత్రము (శ్రీ శంకరభాష్యానువాదసహితము) — 2-00
14. నారదభక్తిసూత్రములు (ప్రేమదర్శనము) శ్రీహనుమాన్ ప్రసాద్ పోద్దార్ గారి హిందీ వ్యాఖ్యానమునకు చక్కని ఆంధ్రానువాదం — 2-50
15. భగవన్నామ సంకీర్తనము — 1-00
16. శ్రీ శంకరాచార్య సదుపదేశాలు (పాకెట్ సైజు) — 0-50
17. శ్రీమద్రామాయణోపదేశాలు ,, — 0-25
18. రామగీత (రామతీర్థ పరవశగీతాలు) ,, — 1-25
19. శ్రీ నృసింహోపాసనస్తోత్రం ,, — 0-25

| | | | |
|---|---|---|---|
| 20. | భోగలింగశతకం | (పాకెట్ సైజు) | 0-25 |
| 21. | రామానుజ దర్శనం | ,, | 0-75 |
| 22. | మహాత్ముని మాటలు | ,, | 0-75 |
| 23. | Thus Spake Rama Tirtha | ,, | 0-87 |
| 24. | శ్రీ హనుమ స్తవమండలమ్ | ,, | 0-20 |
| 25. | శ్రీ లక్ష్మీ అష్టోత్తరశతనామస్తోత్రమ్ | ,, | 0-15 |
| 26. | మనస్సును జయించు మార్గములు | | 0-50 |
| 27. | గోమాహాత్మ్యము | | 0-25 |
| 28. | శ్రీకృష్ణకాశీ కృష్ణాంగం | | 1-50 |
| 29 | శ్రీరామచరితమానసము (శ్రీమదాంధ్ర తులసీ రామాయణము 7 కాండలు మంజరీ ద్విపద కావ్యము) | | 20-00 |
| 30. | శ్రీ లక్ష్మీనృసింహ సహస్రనామ కవచాదులు | | 1-00 |

☞ శ్రీరామతీర్థస్వామివారి ఆంగ్ల,హిందీగ్రంథములుకూడ ఆశ్రమమున లభించును.

## చిత్రపటములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ రామతీర్థస్వామివారి చిన్నసైజు సాదా ఫొటోలు (8 రకాలు సెట్టు) | 1-00 |
| 2. | శ్రీ రామతీర్థస్వామివారి త్రివర్ణచిత్రము (చిన్నది) | 0-25 |
| 3. | శ్రీ రామతీర్థస్వామివారి త్రివర్ణచిత్రము 7′×10′ (పెద్దది) | 0-50 |
| 4. | శ్రీ మట్టుపల్లి నరసింహస్వామి సాదా ఫొటో | 0-06 |
| 5. | శ్రీ కేశవతీర్థస్వామివారి ఫొటో | 0-13 |

## "రామదర్శనం" ఆధ్యాత్మిక మాసపత్రిక

ఇది శ్రీరామతీర్థ సేవాశ్రమాధిపతులగు పూజ్య శ్రీ కేశవతీర్థస్వామివారి సంపాదకత్వమున 1947వ సంవత్సరమునుండి, అనుష్ఠాన వేదాంతసందేశ ప్రచారార్థము నడుపబడుచున్న ఆధ్యాత్మిక మాసపత్రిక. సంవత్సరచందా రూ. 3-00 మాత్రమే. ప్రతి సం॥రము జనవరి నెల పత్రిక ప్రారంభము. సంవత్సరములో ఎప్పుడు చందాదారులుగా చేరినా ఆ సంవత్సరము జనవరినుంచి సంచికలు పంపబడును. తరువాతైన సంచికలకు సంచిక 1కి 0-25 పైసలు తగ్గింపబడును. అట్లు కోరనివారికి చందాదారులుగా చేరిన నెలనుండియే పత్రిక పంపబడును. యం. ఓ. ఫారములో పత్రిక ఎప్పటినుండి పంపవలెనో తెలుపుచు, తమ అడ్రసు వివరముగా తెలుపవలెను. ప్రతినెల 1 వ తేది ఈపత్రిక వెలువడును. చందా ముందుగా పంపవలెను. విడిసంచికకు 0-35 పైసల చీట్లు పంపవలెను.

కార్యదర్శి-శ్రీరామతీర్థ సేవాశ్రమం, పిడుగురాళ్ల (పోష్టు), గుంటూరుజిల్లా, (ఆంధ్ర)

జూపిటర్, గుంటూరు-2

“శ్రీరామతీర్థస్వామివారి ప్రబోధాలను పరివ్యాపింప జెయ్యాలి. భారతదేశ మహాత్ములలోనేగాక యావత్ప్రపంచమహాత్ములలో - పరమోన్నతశ్రేణికి జెందిన మహాత్ముడు శ్రీరామతీర్థస్వామివారు. నేను వారి ఆశయాలను ఆరాధిస్తాను.”

—మహాత్మాగాంధి.